# విరాజ్ బహూ

[శరత్ బాబు]

అనువాదం :

నీలకంఠం

శరత్ గ్రంథమాల, విజయవాడ

# విరాజ్ బహూ

ఈ కథ చదివేముందు సప్తగ్రామాన్ని గురించి మీకు కొద్దిగా పరిచయంచేయటం అవసరం. బెంగాలుదేశంలో హుగ్లీజిల్లాలో వుంది సప్తగ్రామము. అక్కడ నీలాంబర్, పీతాంబర్ అనే యిద్దరన్నదమ్ములు వుంటున్నారు. నీలాంబరునిలో విశేషమైన గుణాలు యెన్నో వున్నాయి! యెక్కడైనా యెవరైనా చనిపోయారనే సంగతి తెలిస్తేచాలు. దహనసంస్కారాలకుగాను, వాళ్ళకు సహాయంజేయడానికి నడుముకట్టి నిలుచుండేవాడు. అతను బాగా భజనకీర్తనలు పాడేవాడు. మృదంగం వాయించేవాడు. దమ్ముకూడా లాగేవాడు! దిక్కులేనివాళ్ళకు సాయం చేయడానికిగాని, దేవుడి భజన చేయడానికిగాని ఆ యిరుగు పొరుగువాళ్ల పట్టించుకునేవాళ్ళుకాదు. నీలాంబరుడు యెర్రని శరీరంతోపాటు బలంగల యెత్తు అయిన విగ్రహం! ఆ వూరిలో అతనొక్కడే పరోపకారబుద్ధి గలవాడని ప్రతీతి!

నీలాంబరుని తమ్ముడు పీతాంబరుడు దీనికి భిన్నప్రకృతిగల మనిషి! అతను నీలాంబరునిలా బలంగలవాడు కాదు. సన్నగా పొట్టిగా వుండేవాడు! ఫలానావాళ్లు చనిపోయారనే సంగతి తెలిస్తే కాళ్ళూ చేతులూ ముడుచుకు కూర్చునేవాడు! 'మూర్ఖుడని పిలిపించుకునే పని పొరపాటున కూడా అతనెప్పుడూ చేయడు.

ఉదయాన్నే భోజనంచేసి పీతాంబరుడు చేతనున్న దస్త్రం పట్టుకొని వెళ్ళి, హుగ్లీకచేరీదగ్గర ఓ మర్రిచెట్టుక్రింద మకాంవేసి రోజంతా అందరికీ అర్జీలు వ్రాసిపెట్టి డబ్బులు గడించి సాయంకాలానికి ఇంటికివచ్చి పగలంతా తాను కష్టపడి సంపాదించిన సంపాదన భద్రంగా పెట్టెలో పెట్టుకు దాచుకునేవాడు.

ఓనాడు ఉదయాన్నే నీలాంబరుడు దేవీపూజా మండపంలో ఒక మూల కూచుని హుక్కాలో పొగాకును మస్తాచేస్తున్నాడు. ఇంతలో అతని

పెళ్ళికాని చెల్లెలయిన హరిమతివచ్చి అన్నగారి వెనుక కూచుని యేడుస్తూ వుంది. నీలాంబరుడు హుక్కాను గోడకు ఆనించి, ఆమెను ప్రేమపూర్వకంగా దగ్గరకుతీసుకుని, "ప్రొద్దున్నే యెందుకమ్మా – యేడుస్తున్నావ్?" అని అడిగాడు.

హరిమతి యేడుస్తూనే "వదిన చెంపమీద కొట్టి–మెల్లకన్నుదానా అని తిట్టిం దన్నా" అన్నది.

"మెల్లకన్నుదానా అని తిట్టిందా? యింత స్వచ్ఛమైన కన్నులున్నా మెల్లకన్నుదానా అన్నదా?—నువ్వు కాదమ్మా—అదే మెల్లకన్నుది! ఐనా నిన్ను చెంపదెబ్బ ఎందుకు కొట్టింది?"

హరిమతి యేడుస్తూనే "పూరికెనే కొట్టిందన్నాయ్!" అని అన్నది.

"వూరికేనా?—సరే, అడుగుదాం పద!" అని నీలాంబరుడు చెల్లెలి చేయి పట్టుకుని యింట్లోకివచ్చి "విరాజ్!" అని కేకేశాడు.

విరాజ్ ఆ యింటికోడలు. తొమ్మిదేండ్ల వయసులోనే ఆమెకు పెళ్ళయింది. అందువల్ల యిక్కడికి వచ్చినప్పట్నుంచీ, ఆ పేరే అందరికీ వాడుక అయింది. ఇది జరిగేప్పటికి, విరాజ్‌కు పందొమ్మిది–ఇరవై సంవత్సరాల వయసు వుంటుంది. అత్తగారు పరమపదించాక ఆమె యీ యింటికి పెత్తనదారైంది.

విరాజ్‌లాంటి అందమయిన స్త్రీ "సప్తగ్రామము" లోనే కాక— దగ్గరున్న పరిసరగ్రామాల్లో యెక్కడా లేదు. నాలుగైదు సంవత్సరాల క్రితం ఆమెకొక కొడుకు పుట్టాడు. కాని సూతికాగృహంలోనే ఆమె ఆశలను నిరాశచేసి ఆ పిల్లవాడు వెళ్ళిపోయాడు. అప్పటినుంచీ మళ్ళీ ఆమెకు సంతానంలేదు,

నీలాంబరుడు ఇంట్లోకివెళ్ళి పిల్చేటప్పటికి వంటప్రయత్నంలో వున్నదల్లా విరాజ్, భర్తగారిపిలుపు విని అక్కడకు వచ్చింది. కాని ఆమె అన్నా—చెల్లెలిని చూడగానే మండిపడుతూ, "యేం, మాడుముఖం దానా! మీ అన్నగారితో ఫిర్యాదుచేయడానికి పరుగెత్తావన్నమాట?" అని అన్నది.

"ఎందుకు ఫిర్యాదుచేయదు? మెల్లకన్నుదానా — అని తిట్టినంత మాత్రాన ఆమెకేమీ పోయిందిలేదు. హరికన్నులు చాలా మంచివి! యీ వంకపెట్టినందుకు నీకే పాపం చుట్టుకొంటుంది. అయితే దీన్నెందుకని కొట్టారండి—" అని నీలాంబరు డడిగాడు.

"ఇంత పెద్దదైనా జ్ఞానమేమీ లేదు. నిద్రలేవగానే కాళ్ళు ముఖం కడుక్కోవాలా? గుడ్డలు మార్చుకోవాలా? యివేమీలేవు. లేవడంతోనే తిన్నగా గోశాలలోకి వెళ్ళి అక్కడ కట్టివుంచిన దూడనువిప్పి, ముఖం చేటంతచేసుకొని చూస్తూవుంది. ఇవ్వాళ ఒక చుక్కయినా పాలులేవు కదా—దీన్నా, దీన్ని ఇంకాకొట్టాలి."

"బాగానేవుంది! నువ్వు రోజూ పనిమనిషిని పంపేదానివిగా? ఐనా, యేం అమ్మాయ్! ఆవుదూడను విప్పటానికి యెందుకు వెళ్ళావు? యీ పని నీదికాదుగా?"

అన్నగారివెనుక నిలుచుని హరిమతి మెల్లగా "పాలు పితికారను కున్నాను—" అని అన్నది.

"ఇంకెప్పుడూ అలా చేయకమ్మాయ్?" అనిచెప్పి విరాజ్ తిరిగి వంటింటిలోకి వెళ్ళిపోతూంటే, నీలాంబరుడు నవ్వుతూ, "నువ్వు దీని వయసులో తల్లిలేని పక్షిపిల్లలను పంజరంతలుపు తెరచి వదిలేశావుకదా!- నీ కాసంగతి గుర్తుందా?" అని అడిగాడు.

విరాజ్ నవ్వుతూ, "గుర్తుంది! అయినా నే నప్పుడు దీనికంటె చాలా చిన్నదాన్ని?" అని ఆమె తనపనిలో లగ్నమైంది.

"అన్నయ్యా! తోటలో కెళ్ళి మామిడిపళ్ళు పండినయ్యో లేదో చూద్దాం పద!" అని హరిమతి అన్నది.

"సరే, పదమ్మా పద."

యమునే నౌకరువచ్చి "నారాయణబాబు బైటకూచునివున్నారండి" అని చెప్పాడు. ఆమాట విరాజ్ విని, పెద్దపెద్ద అంగలువేసుకుంటూ వచ్చి భర్తవేపు చూస్తూ-"ప్రొద్దున్నే పీకలంతా యిలా తినడానికివస్తే, మన మెక్కణ్ణుంచి తెచ్చిపెడ్తాము. ఇలాఅయితే నేను తలపగులగొట్టుకొని ఛస్తాను. ఈ కరువురోజుల్లో యిదంతా యేమిటి?" అని అడిగింది.

నీలాంబరుడు జవాబేమీ చెప్పకుండా, చెల్లెలి చెయ్యిపట్టుకొని తోటకేసి వెళ్ళిపోయాడు.

ఈ తోటప్రక్కగా "సరస్వతి" అనే ఒక చిన్ననది ప్రవహిస్తూ వుంది. నదిలోని క్షీణ ధార, పరలోక యాత్రికునిలాగ ప్రవహిస్తూ వుంటుంది. నదిలోని బండలన్నీ పాకుడుపట్టి వున్నాయి. ఆ గ్రామప్రజ లంతా నీటికోసం నదిలోకి కుంటలవద్దకు వస్తుంటారు. ఆ కుంటలకు దగ్గరగా నాచువేసి చిన్న చిన్న కాలువలు ప్రవహిస్తూ వుండేవి. వాటి లోతు చాలా తక్కువ. అందువల్ల కాలవ అడుగునవున్న ముత్యపు చిప్పలు, సూర్యకిరణాల వెలుతురులో స్వచ్ఛమైన నీట్లోంచే, తళుక్కున మెరుస్తూ,నీటిఅడుగున మణులున్నట్లు శోభింపచేస్తున్నాయి। నదివొడ్డున ఒక నల్లని పెద్దబండ వుంది. దగ్గరలోనే ఒక సమాధి స్తూపంకూడా వుంది. ఆ బండ యీ సమాధిగోడలదే। యెప్పుడోకురిసిన అతివర్షాల ప్రవాహ వేగానికి అది గోడలోంచి జరిగి యిక్కడకివచ్చి చేరింది.

నీలాంబరుని యింటి ఆడవారు ప్రతిరోజూ సాయంకాలం దీపం వెలిగించి, చచ్చిపోయినవారి ఆత్మలనిమిత్తం ఒకప్రక్కన పెట్టేవాళ్లు. నీలాంబరుడు చెల్లెలి చేయిపట్టుకొని, అక్కడికివచ్చి కూచున్నాడు. నది కిరుప్రక్కల పెద్దపెద్ద మామిడితోటలూ, వెదురుపొదలూ వున్నాయ్. ఏ కాలానివో పూతలు దాచుకొని శాఖలుపారిన ఒకటి రెండు రావిచెట్లూ, మర్రిచెట్లూ వున్నాయ్. నదిమీదకు వంగిపోయిన వాటి కొమ్మలమీద ఎన్నాళ్ళనుంచో పక్షులు గూళ్లుకట్టుకొని వున్నాయి. ఎన్నో పిల్లల్నిచేసి, పెంచి, పెద్దవిగా తయారుచేసి, యెన్ని పళ్ళు తిని యెంతెంత కలవరం చేశాయో చెప్పలేము. అటువంటి చల్లని చెట్లనీడల్లో అన్నా చెల్లెళ్ళు కూచున్నారు.

గబుక్కున హరిమతి అన్నగారివద్దకు జరిగి, "సరే అన్నయ్యా, వదినె నిన్నెందుకని సాధువని పిలుస్తుంటుంది?" అని అడిగింది.

నీలాంబరుడు మెడలోవున్న తులసిదండలు చెల్లెలికి చూపిస్తూ — "నేను సాధువును గనుక" అని అన్నాడు.

"నువ్వు సాధువెందుకు అవుతా వన్నయ్యా? సాధువులనేవాళ్లు బిక్షం ఎత్తుకుంటూ తిరుగుతుంటారు! సరేగా నన్నయ్యా, వాళ్లు అలా బిక్ష మెందుకు ఎత్తుతుంటారు?"

"వాళ్ళదగ్గర యేమీ వుండదుగనుక, బిక్షం ఎత్తుకుంటారమ్మా!"

వాళ్ళదగ్గర యేమీ వుండదూ? చెరువులూ, తోటలూ, ధాన్యమూ, గాదెలూ ఇవేమీ వుండవూ?"

ప్రేమపూర్వకంగా చెల్లెలి తల నిమురుతూ, "ఏమీ వుండవమ్మా! వాళ్ళకేమీ వుండవు. సాధువులు తమదగ్గర ఏ వస్తువూకూడా వుంచుకోరు" అని నీలాంబరుడు అన్నాడు.

"అయితే, అందరూ వాళ్ళకు తలాకాస్తా యెందుకు యివ్వరు?"

"పిచ్చిదానా! మీ అన్న సాధువుల కెప్పుడైనా, యేమయినా యిచ్చాడా?"

"ఎందుకివ్వలే దన్నాయ్! మనవద్ద బోలెడు వున్నాయిగా?"

నీలాంబరుడు నవ్వుతూ, "వున్నా యేమీ యివ్వలేకపోయాడు మీ అన్న! యే మహారాజునన్నా పెళ్ళిచేసుకున్నప్పుడు, సాధువులకు యింత అన్న వస్త్రాలు దానంచెయ్యమ్మా!" అన్నాడు.

హరిమతి ఏమీతెలియని చిన్నపిల్ల. అయినా యీమాటకు సిగ్గుపడి, అన్నగారి వొడిలో ముఖం దాచుకొని, సిగ్గుపడుతూ "ఫో....!" అన్నది.

నీలాంబరుడు రెండుచేతులతో చెల్లెలి తల పట్టుకొని నొసలు ముద్దు పెట్టుకున్నాడు. తలిదండ్రులకు దూరమైన యీ చెల్లెలిని యెంత యిదిగా ప్రేమించాడో అతనికే తెలుసు. ఇప్పటికి ఏడేండ్లక్రితం తల్లి చనిపోతూ, తనకూ, తనభార్యకూ హరిమతిని అప్పగించింది. అప్పుడు ఆమెకు మూడేండ్ల వయసు! అతను యే పనిజేసినా, ఎన్ని యాతనలుపడినా, మాతృదేవత చివరి ఆదేశాన్ని ఎప్పుడూ క్షణమైనా త్రోసిపేయలేదు. హరిమతి అన్నగారి వొడిలోతలపెట్టి నిస్సందేహంగా వుండడాని కిదే కారణము!

చాటునుంచి పనిక త్తె "హరీ! నిన్ను వదినగారు పిలుస్తూవుంది. రా, పాలుత్రాగి వెళ్ళు!" అని పిలిచింది.

హరిమతి ముఖమెత్తి అన్నగారితో "అన్నాయ్, యిప్పుడు నేను పాలుతాగనని నువ్వు చెప్పు!" అని మారాంచేసింది.

"ఎందుకు తాగవమ్మా?"

"ఆకలిగా లేదన్నాయ్!"

ఆకలిగా లేదంటే నేను నమ్ముతాను కాని, చెంపదెబ్బ కొట్టినవాళ్లు నమ్ముతారా?"

మళ్ళీ చాటునుంచి పనికత్తె 'హరీ!' అని పిలిచింది.

నీలాంబరుడు తొందరగా లేచి హరిమతిని లేవదీసి, "అమ్మాయ్! పద. నువ్వెళ్ళి గుడ్డలు మార్చుకొని పాలుతాగి రామ్మా! అంతవరకూ నే నిక్కడే కూచుంటాను" అన్నాడు.

హరిమతి యిష్టంలేనట్లుగానే వెళ్ళిపోయింది.

ఇది జరిగిన ఆనాటి మధ్యాహ్నం విరాజ్ భర్తకు భోజనము వడ్డించి పళ్ళెందగ్గర కూచుని, "సరేగానండీ! ప్రతిరోజూ మీకు అన్నంతో పాటు ఏఏ వస్తువులు వడ్డించాలో కొంచెం ముందుగా చెప్పండి. తీరా భోజనానికి కూచున్నప్పుడు 'నే నది తినను—యిది తినను' అని అంటారాయె! ప్రతి వస్తువుమీదా ఇష్టంలేకుండా పోతున్నది. ఆఖరికి చేపలుకూడా తినడం మానేశారు" అని అన్నది.

నీలాంబరుడు పళ్ళెంముందు కూచుని "నువ్వేటువంటి కూరలు వండావో చూడరాదూ?" అని అన్నాడు.

"మంచికూర లేం చేశాను? ఈ యెండిపోయిన కూరగాయలతో మగవా శ్శెక్కడన్నా భోజనం చేస్తారా? ఏ వస్తువు కావాలంటే ఆ వస్తువు లను కొనడాని కిది బస్తీకాదాయె! ఈ పల్లెటూళ్ళో మనకు చెరువులోని చేపలే ఆధారమాయె! మీరా చేపలుకూడా తినడం మానేశారు .... హరీ! ఎక్కడికెళ్ళావ్? రా, కొంచెంసేపు యీ విసనకర్రతో మీ అన్నగారికి విసురు. కాదు, అలాకాదు....ఇవ్వాళ పళ్ళెంలోని అన్నమంతా తినకుంటే మీ కాళ్ళముందు నా తల బద్దలుకొట్టుకు ఛస్తాను."

నీలాంబరుడు మాట్లాడకుండా నవ్వుతూ, నవ్వుతూ భోజనం చేస్తున్నాడు.

"మీరు నవ్వుతున్నారా? మిమ్మల్ని చూస్తుంటే నావొళ్లు నిప్పులా మండుతూ వుంది. రోజురోజుకూ తిండి తగ్గిపోతూవుంది. ఆ సంగతైనా మీకు తెలుసా? వంట్లో యెముకలన్నీ బైటికి తొంగిచూస్తున్నాయ్। ఇకనైనా మీ ఆరోగ్యాన్నిగురించి కొంచెం కొంచెం శ్రద్ధతీసుకోండి" అని విరాజ్ కోపంతో అన్నది.

"అవును—తెలుసు। ఇదంతా నీ భ్రమ."

"నాకు మతిభ్రమ కలిగిందా? బాగానేవుంది. ఎందుకనా తినడం తగ్గించారని. నే నెప్పటికప్పుడు మీకు చెపుతూనే వున్నాను. పైగా మీ శరీరంలో దుర్బలత్వ మెక్కడుందో, ఆ ప్రదేశాన్ని వ్రేలితో చూపెట్టాను. నేనెంత జాగ్రత్తగా ప్రతివిషయాన్ని చూస్తున్నానో మీకు తెలుసా? హరీ। విసరడం ఆపి, మీ అన్నకు వంటింట్లోంచి పాలు తీసుకరామ్మా।"

ఒకప్రక్కగా నిలుచుని విసురుతున్న హరిమతి విసనకర్రను వదిలిపెట్టి, పాలు తెచ్చేందుకు వెళ్ళింది.

"ధర్మ-కర్మలు చేయడాని కింకా చాలారోజు లున్నాయ్, ఇవ్వాళ పక్కింటివారి అత్తగారు వచ్చి, ఆమె మీ సంగతంతా విని, 'ఇంత చిన్న వయసులోనే చేపలకూర తినకుండా వున్నట్లయితే, పుష్టి తగ్గిపోతుందనీ, దుర్బలత్వం ప్రాప్తిస్తుందనీ చెప్పింది, ఇక అలాపీలులేదు. ఏమైనాసరే, ఇక మీరు చేపలు తినాలి."

నీలాంబరుడు నవ్వుతూ, "నాబదులు నువ్వే చేపలు తిను, నువ్వు తింటే—నావొంటికి పుష్టి కలుగుతుంది" అని అన్నాడు.

విరాజ్ కోపంతో "నీచపుజాతివాళ్లు మాట్లాడేటట్లు మాట్లాడటం ప్రారంభించారేం?" అని అన్నది.

కొంచెం సిగ్గుతో "గుర్తుండదు। చిన్నప్పటి అలవాట్లు ఇంకా నన్ను వదిలిపెట్టలేదు. నే నెన్నిసార్లు నీ చెవులు సాగదీశానో నీకు గుర్తుందా?" అని అడిగాడు.

"ఎందుకు వుండదు? నన్ను చిన్నదాన్ని జేసి, మీ రెన్ని అత్యా చారాలు చేశారు? తల్లిచాటునా, తండ్రిచాటునా నన్నెంత అల్లరిపెట్టారు? ఇవన్నీ నేను మరచిపోయా ననుకున్నారా?"

నీలాంబరుడు గట్టిగా నవ్వి, "అయితే ఇప్పటికీ నీకు గుర్తువున్న దన్నమాట! ప్రేమతో అలా చేశాను...." అని అన్నాడు.

"ఆ సంగతి నాకు తెలుసు. ఇక ఆ మాటలు కట్టిపెట్టండి. హరి వస్తుంది."

హరిమతి పాలగ్లాసు అన్నగారి పళ్ళెంముందు పెట్టి, విసనకర్ర తీసుకొని విసురుతూంది. విరాజ్ లేచివెళ్ళి, చేయి కడుక్కొని వచ్చి భర్త దగ్గరగా కూచుని, "విసనకర్ర యిటిచ్చి. నువ్వెళ్ళి ఆడుకో హరీ!" అని అన్నది.

హరి వెళ్ళిపోయాక విరాజ్, "ఇంత చిన్నవయసులోనే పెళ్ళి చేయడం మంచిదికాదు" అని అన్నది.

"మంచి దెందుకాదు? ఆడపిల్లలకు పెళ్ళిళ్లు చిన్నతనంలో చేయ డమే మంచిదని నా అభిప్రాయం!"

విరాజ్ తలూపుతూ, "కాదు, మంచిదనెప్పటికీ కాదు, నా సంగతి వేరు. నేను మీచేతుల్లో పడ్డాను. అదీగాక అత్యాచారులైన తోడికోడళ్లూ, ఆడబిడ్డలూ లేరు. పది సంవత్సరాల వయస్సులో గృహస్వామిని నయ్యాను. పదిమంది ఇళ్ళల్లోని సంగతులూ చూస్తున్నాను. అందువల్లే నే నీ హరిమతి ప్రస్తావన ఇంకా తేలేదు. లేకపోతే యీపాటి కెక్కడైనా మాటలు జరుగుతూ వుండేవి. మొన్న రాజేశ్వరిపురంలోని ఘోషాలు పరి వారంలో పురోహితుడు వచ్చి, దీని పెళ్ళిప్రస్తావన యెత్తాడు. హరిమతిని తనకు కోడలుగా చేసుకునేందుకు ఘోషాలుకు చాలా యిష్టమట! ఈ పెళ్ళికి వారు చాలా డబ్బు ఖర్చుపెట్టడమే కాకుండా, మన అలుమగలకు వేయి రూపాయల రొక్కం యిస్తామన్నారని చెప్పాడు కాని, నే వింకా రెండు సంవత్సరాలవరకు హరికి పెళ్ళిచేయనని చెప్పాను" అని అన్నది.

ఆశ్చర్యంతో నీలాంబరుడు తలెత్తి. "అయితే నువ్వు డబ్బుతీసుకొని హరికి పెళ్ళిచేయా లనుకున్నావా? పిల్లను అమ్మడం నీ కిష్టమేనా?" అని అడిగాడు.

"డబ్బెందుకు తీసుకోకూడదూ? మనకే ఒక పిల్లవాడుంటే. వాడి కోసం డబ్బిచ్చి, యెక్కణ్ణుంచైనా పిల్లను తేవద్దా? మీరు నాకోసం మూడు వందలు మావాళ్ళకిచ్చి తెచ్చుకోలేదు? మీ తమ్ముడుపెళ్ళికోసం అయిదు వంద లిచ్చి పిల్లను తీసుకురాలేదూ? అటువంటప్పుడు హరిపెళ్ళికి నే నెందుకని డబ్బుతీసుకోను? దీనికి మీరేమీ అడ్డుచెప్పకండి. మన కిక్కడ నియమమేదో. ఆ నియమానుసారంగానే నడుస్తాము."

భార్య యిలా మాట్లాడుతుంటే, నీలాంబరుడు ఇంకా ఆశ్చర్యపడి, "మనకు కన్యను అమ్ముకోవడమే నియమమని నీ కెవరు చెప్పారూ? మన పరివారంలో వివాళ్ళంతా పెళ్ళికొడుకు తరపువాళ్ళకు కొంత డబ్బి స్తారుకాని, ఆడపిల్లలకు పెళ్ళి చేసేప్పుడు, పెళ్ళికొడుకువాళ్ళవద్ద, మనం ఒక్క దమ్మిడీకూడా తీసుకోకూడదు. ఇంట్లోని పదిరూపాయలు పెట్టయినా, నేను హరికి పెళ్ళి చేస్తాను...." అని అన్నాడు.

భర్తగారి ముఖభంగిమలు చూసి, విరాజ్ నవ్వుతూ-"సరే! అలానే చేయండి!—ఈ మాటలమీది కోపంతో మీరు అన్నంవద్దనుంచి లేవకండి!" అని అన్నది.

"అయితే నే నెప్పుడైనా, ఆకలితో కంచందగ్గరనుంచి లేచి పోయానా?"

"లేదు. ఒక్కనాడుకూడా లేచి వెళ్ళలేదు. ఈ దోషాన్నిమాత్రం మీ మీద మీ శత్రువుకూడా మోపలేదు. అందుకోసమే యిన్నిరోజుల్నుంచి నేను వుపవాసాలు చేయాల్సివచ్చింది. ఈ సంగతి చిన్న కోడలికికూడా తెలుసు! ఇదేమిటి....అప్పుడే మీ భోజనమైందా?" అని విరాజ్ పంకాను అవతలపెట్టి పాలగ్లాసు పట్టుకొని "నాతోడు. మీరు లేవకండి. ఓ హరీ! పరుగెత్తుకుని వెళ్ళి, చిన్న కోడలినడిగి నాలుగు పకోడీలు పట్టుకురా! కాదు....కాదు....అలా పలూపకండి. మీపొట్ట ఎప్పుడూ నిండదు. మీ పలా

అంటేకాదు. రాత్రి ఒంటిగంటవరకూ మేలుకొని, యీ పకోడీలు వండాను" అని అన్నది.

ఒక చిన్న పళ్ళెంనిండా పకోడీలు పట్టుకొని, హరిమతివచ్చి పెద్దన్న కంచంవద్ద పెట్టింది.

నీలాంబరుడు నవ్వి "పరేగాని, యీ పకోడీలన్నీ నేను తినగల ననేనా?" అని అడిగాడు.

పళ్ళెంలో ఎంత మిఠాయి వుందో, విరాజ్ చూసికూడా ముఖం క్రిందకుదించి —"మిఠాయికేసి చూడకుండా, మాట్లాడుతూ—మాట్లాడుతూ తింటూంటే అంతా ఊరికినే తినొచ్చు" అని అన్నది.

"అలా అయినా నేను తినగలనా?"

"ఆ! మాట్లాడుతూ ఒక్కొక్కటే తినవచ్చు"

నీలాంబరుడు పళ్ళెం లాక్కొని "తినిపించడంలో యిలా, భయ పెడుతూవుంటే ఆఖరికి అడవుల్లోకి పోయి నేను దాక్కోవాల్సివస్తుంది" అని అన్నాడు.

ఆ మాటవిని హరిమతి "అన్నయ్యా? నీతో నన్నుకూడా...."

"నోరుముయ్యి, పాడుముఖందానా! తినకపోతే అంతదూరం యెలావెళ్తావు? మాటిమాటికి నువ్వు ఫిర్యాదుచేస్తున్నావ్? అత్తగారింటికి వెళ్ళాక నీకు తెలుస్తుందిలే తొందరపడకు!"

## 2

ఇది జరిగి నెలా పదిహేనురోజులైంది, అప్పటికి అయిదు రోజు ల్నుంచీ నీలాంబరుని ఆరోగ్యం ఏమీ బాగాలేదు. వళ్ళు తెలియకుండా ప్రతిరోజూ జ్వరం వస్తూవుంది. అయినా, యీనాడు కొంచెం నెమ్మదిగా వుంది. విరాజ్ తన చేతులతో భర్త కట్టుకొన్న పంచెను మార్చి వుతికిన తోవతిని కట్టింది. తరువాత నీలాంబరుని పరుపును యెండలో వడవేసి, ఇంటిపనుల్లోకి వెళ్ళింది.

నీలాంబరుడు బైటవున్న కొబ్బరిచెట్టును కిటికీలోంచి చూస్తూ పడుకున్నాడు. హరిమతి దగ్గరగా కూచుని మెల్లమెల్లగా విసనకర్రతో విసురుతూవుంది. కొంచెంసేపయాక స్నానంచేసి విరాజ్, ఒక స్వదేశీ సిల్కుచీర కట్టుకొని, తడిసిన వెంట్రుకలు వీపుమీద చిందరవందరగా ఆరపెట్టుకొని వచ్చింది. ఆమె ఆ అందానికి గదంతా మెరిసిపోయింది. భార్యవేపుచూసి నీలాంబరుడు "యేమిటి సంగతి?" అని అడిగాడు.

"పంచానందస్వామి పూజకు సామాగ్రి పంపనా? నేనే వెళ్ళనా?" అని అంటూ భర్తవంటిమీద చెయ్యివేసి "లేదు....ఇవ్వాళకూడా జ్వరం రాలేదు. ఈ సంవత్సరం మహాతల్లి కోర్కె ఏమిటో తెలియడంలేదు. ప్రస్తుతం ఇంటింటా యిలానేవుంది. మన మెహతా మొహతర్ కొడుకు వంట్లో అమ్మవారు చూపిందట!" అని అన్నది.

"మెహతా పెద్ద కొడుక్కా, చిన్నకొడుక్కా? స్ఫోటకం బైటికి కనిపిస్తోందా?"

"పెద్దవాడికే మహాచితల్లి! పాపం వాడే ఆ యింటి బరువంతా మోస్తున్నాడు! క్రిందటి శనివారంనాటి రాత్రి నిద్ర మెలుకువవచ్చి చూస్తే మీ శరీరం యెంతో యుదిగా మండిపోతూవుంది. భయంతో నా ఒళ్ళంతా చల్లబడింది. లేచి కూర్చుని చాలాసేపు ఏడ్చాను. వీరికి బాగుచేయి మహాతల్లీ! నీవల్ల బాగునాకపోతే, పూజా పునస్కారాలుచేస్తూ నిరాహారంతో ప్రాణాలు వదులుతానని ప్రతిజ్ఞచేశాను" అని అంటుంటే ఆమె కళ్లల్లోంచి నీళ్ళు చెక్కిళ్ళమీదకు జారినై.

"అయితే యిన్ని రోజుల్నుంచీ నువ్వు ఉపవాసం చేస్తున్నావన్న మాట" అని అడిగాడు.

"అవునన్నయ్యా! వదిన యేమీ తినడంలేదు. ప్రతిరోజూ సాయంకాలంపూట ఒక పిడికెడు పప్పు నమిలి ఒక గ్లాసెడు మంచినీళ్లు త్రాగుతూవుంది. అప్పటినుంచీ ఇలానే వుంటూవుంది. ఎవ రెన్ని చెప్పినా వినదు తినదూ" అని హరిమతి అన్నది.

హరి చెప్పినమాటలు విని నీలాంబరుడు అసంతుష్టుడై "ఇదంతా నీకు పిచ్చా యేమిటి?" అని అడిగాడు.

పైటచెంగుతో కన్నీళ్ళు తుడుచుకుని "పిచ్చికాదు.... అసలైనపిచ్చి ఆదేగనుక నాలా మీరు ఆడవాళ్ళై పుట్టివుంటే భర్తంటే ఆడదానికి యెటు వంటి ప్రేమపాత్రమైన వస్తువో తెలుసుకునేవారు" అని విరాజ్ వెళ్ళ బోతూ మళ్ళీ తిరిగి "హరీ! పనికత్తె పూజా సామాగ్రిని తీసుకొని వెళ్తా వుంది. తొందరగా స్నానంచేసి దానివెంట నువ్వూ వెళ్లు" అని అన్నది.

"వెళ్తున్నాను వదినా!" అని హరిమతి లేచింది.

"ఆలస్యంచేయకు. తొందరగా తయారవు. మీ అన్నగారికి వంట్లో తొందరగా ఆరోగ్యం కలిగేటట్లు పంచనందుని వరమడుగు"

హరి స్నానంచేయడానికి పరుగుతీసింది. నీలాంబరుడు "యీ పనిమాత్రం నీకంటే, హరి యెన్నోరెట్లు బాగాచేస్తుంది" అన్నాడు.

విరాజ్ మెల్లగా నవ్వుతూ—"అలా అనకండి. తల్లికాని, తండ్రి కాని, అన్నదమ్ములుకాని, స్త్రీకి భర్తకంటే ఎక్కువ ఎవరూ లేరు. తల్లీ దండ్రీ, అన్నదమ్ములు అందరూ చనిపోయినా స్త్రీకి ఎక్కువగా పోయింది ఏమీ లేదు. కాని భర్త చనిపోతేమాత్రం స్త్రీకి సర్వస్వమూ పోతుంది నా విషయమే చూడండి, ఐదు రోజుల్నుంచీ యేమీ తినకుండా వున్నాను. హృదయంలోని పట్టుదలక్రింద ఆకలిదప్పులు అణగిపోయినై! నేను ఉపవాసమున్నానని నాకే తెలియదు. మీకుకూడా అలాంటి చెల్లెలే వుంది. కొంచెం పిలవండి, యెలా ఆమె........" అని అంటుంటే నీలాంబరుడు ఆమె మాటను ఖండిస్తూ "తరువాత" అని అడిగాడు.

"అయితే ఇలా ఎందుకని అంటారు? నేను పిచ్చిపని చేశానో లేక పోతే ఇంకేమయినా చేశానో ఆ సంగతి నాకూ, ప్రపంచానికి ముఖం చూపించే యోగ్యత కలిగించిన ఆ భగవంతునికీ తెలుసు. నే నా అవస్థతో ఒక్కరోజుకాదు ఆఖరికి ఒక్కగంటకూడా బ్రతకను. నొసటిమీదున్న బొట్టు తుడిచివేయకముందే నొసటను రాతితో గీకి గీకి తుడిచివేసేదాన్ని. పూర్వకాలంలా విధవయినా ఆడదాన్ని కాల్చి చంపడమే మంచిపద్ధతి? అప్పటి మగవాళ్ళకు స్త్రీలు పడే దుఃఖవిచారాలు, మనోవేదనలు బాగా తెలుసు! కాని ఇప్పటి మగవాళ్ళకు ఇవేమీ తెలియవు"

"కాదు....కాదు ...ఇప్పుడు యీ సంగతిని నువ్వే మగవాళ్ళకు చెప్పు."

"అవును చెపుతాను. కేవలం నేనే కాదు. మిమ్మల్ని చేసుకున్న యే ఆడదానికైనా అలా చెప్పేశక్తి వుంటుంది! పోనీయండి! యేమేమో వాగుతున్నాను" అని నవ్వుతూ, విరాజ్ భర్తజ్వరాన్ని పరీక్షించింది. ఆమె భర్త తలమీదా, వంటిమీదా చేయివేసిచూసి జ్వరంలేదని తెలుసుకొని "వంట్లో ఏమీ బాధలేదుగదా?" అని అడిగింది,

"లేదు"

"అయితే విచారించవలసిన పనేమీలేదు. నాకు కొద్దిగా ఆకలవుతూ వుంది. వంట ప్రయత్నం ఏమయినా చేయమంటారా?"

నౌకరు యదు బయటినుంచే "అమ్మగారూ! వైద్యుణ్ణి పిలుచుక రమ్మంటారా?" అని అడిగాడు.

"వద్దు—వద్దు, ఇక వైద్యుణ్ణి పిలవవలసిన పనిలేదు" అని నీలాంబరుడు చెప్పాడు.

నీలాంబరుడు ఇలా చెప్పినా, నౌకరుమాటలు నమ్మకుండా విరాజ్ మాటకు యెదురు చూస్తూ నిలుచున్నాడు. విరాజ్ అది గ్రహించి "కాదు, వెళ్ళి ఒకసారి వారిని పిలుచుకురా! వారైతే బాగా పరీక్షించి చెప్తారు"అని అన్నది.

మూడురోజులకు నీలాంబరునికి బాగా స్వస్థత చిక్కింది. బైట దేవి గదిలో కూచుని ఏదో ఆలోచిస్తుంటే అప్పుడే మోతీ మెహతా ఆయనదగ్గకు ఏడుస్తూనేవచ్చి "అన్నయ్యగారూ! మీరొకసారి వచ్చి చూడకపోతే నా శ్రీమంతు డిక బ్రతకడు. ఒకసారి మీ పాదధూళి ప్రాప్తించేటట్లు చేయండి. మీ పాదధూళి సోకితేనే వాడిప్రాణాలకు రక్షణ కలుగుతుంది" అని అన్నాడు.

ఇంకా యేమేమో చెప్పబోతుంటే అతని కంఠం పెగిలిరాలేదు.

"ఏం మోతీ, పిల్లవాడి వంటిమీద అమ్మవారు ఎక్కువగా కనిపిస్తోందా?"

"అదిమాత్రం అడుగవద్దు బాబూ! బొట్టు పెట్టడానికైనా చోటు లేకుండా పోసింది. ఏంచేయాలో మాకేం బోధపడటంలేదు. ఒకసారి దయచూడు నాయనా!" అని మోతీ యేడుస్తూ నీలాంబరుని రెండుకాళ్లూ పట్టుకున్నాడు.

మెల్లగా పాదాలు విడిపించుకొని "మోతీ—మోతీ, భయపడాల్సిన పనేమీలేదు. నువ్వు పద నేను తరువాత వస్తాను...." అని తన ఒంట్లో జబ్బుసంగతిని చెప్పలేకపోయాడు.

నీలాంబరునితో తమ పిల్లవాణ్ణి చూడమని అడగడంలో ఒక విశేషమైన కారణముంది. నీలాంబరుడు రోగిష్టులను చూసి చూసి మంచి అనుభవాన్ని సంపాయించాడు. అందువల్ల చుట్టుప్రక్కల గ్రామాల్లోకాని, ఆ వూళ్ళోకాని. యెవరింట్లోనన్నా జబ్బుచేస్తే అది నీలాంబరునికి అధమం ఒకసారన్నా చూపకుండా వుండేవాళ్లు కారు.

నీలాంబరుడు ఒకసారివెళ్ళి రోగిని చూసి వాళ్ళకు ధైర్యం చెప్పనంతవరకూ రోగి ఇంట్లోవాళ్ళకు మనశ్శాంతి వుండదు! ఈ విషయం నీలాంబరునికికూడా తెలుసు! తనమీద వాళ్ళకు అంత శ్రద్ధాభక్తు లున్నప్పుడు తను వెళ్ళకుండా వుండలేకపోయాడు.

వెళ్ళేప్పుడు మోతీ మళ్ళీ ఏడ్చాడు. నీలాంబరుడు ధైర్యంచెపుతూ అతన్ని పంపించిన తర్వాత మనసులో "నా వంట్లో ఇంకా యేమీ బావుండలేదు. నిస్సత్తువగానేవుంది....అయినా మోతీ ఇంటికి తప్పకుండా వెళ్ళాలి" అని అనుకున్నాడు. ఇంతకూ అతనికున్న విచారమల్లా ఇంట్లోంచి బైటకు ఏవిధంగా వెళ్ళాలా? అనేది ఒకటీ-విరాజ్‌తో మోతి ఇంటికి వెళుతున్నానని చెప్పడమెలాగా? అనేది మరొకటి.

ఆయన విరాజ్‌కు భయపడలాడు. ఆమెతో మోతి ఇంటికి వెళ్తున్నానని చెప్పలేడు.

ఆ సమయంలోనే వసారాలోంచి హరిమతి "అన్నయ్యా, లోపలికి వచ్చి పడుకోమని వదిన చెప్పమంది. రా!" అన్నది.

నీలాంబరుడు జవాబేమీ చెప్పలేదు, నిమిషంలో హరిమతి వచ్చి "ఏమన్నయ్యా! నీకు వినబడలేదా?" అని అన్నది.

"లేదమ్మా."

"కొద్దిగా అన్నం తిన్నావాయె! అప్పట్నుంచీ అలానే కూచున్నావు. ఇక కూర్చోవద్దనీ, లోపలకు వచ్చి పడుకోమనీ వదిన చెప్పి రమ్మంది."

"ఇప్పు డది యేంచేస్తోంది హరీ?"

"ఇప్పుడే భోజనంముందు కూర్చుంది."

"నువ్వు చాలా మంచిదానివమ్మా! నిజంగా లక్ష్మి సమానురాలవు. నేను చెప్పిందల్లా చేస్తుంటావు. నాకోపని చేసిపెడతావమ్మా?"

"ఆ, చేస్తాను."

"మరి మెదలకుండావెళ్ళి, చప్పుడు చేయకుండా నా చెప్పులూ గొడుగూ తీసుకురా!"

"చెప్పులూ—గొడుగూనా?"

"ఆ!"

కనుబొమ్మలు పెద్దవిజేసి "బాబోయ్! వదిన ఇటువేపే ముఖంపెట్టి భోజనంచేస్తూవుంది" అని హరిమతి అన్నది.

"అయితే నువ్వు తీసుకురావా?"

"లేదన్నయ్యా! వదిన ఇటువేపే చూస్తూవుంది. నువ్వు వెళ్ళి పడుకో."

అప్పటికి షుమారు రెండుగంటలై ఉంటుంది. బైట, సూర్యకిరణాలు ప్రచండరూపంతో నిప్పులు కురిపిస్తున్నాయ్! అటువేపు చూసి, నెత్తిపైన నీడ లేకుండా వెళ్ళడం కష్టమనుకుని, హతాశుడై చెల్లెలి చెయ్యి పట్టుకొని లోపలికి వెళ్ళి పడుకున్నాడు. హరి, కొంచెంసేపు ఆ మాట, యీ మాట చెప్పి నిద్రపోయింది. నీలాంబరుడు "మోతీకొడుకు జబ్బు సంగతి విరాజ్‌కు యేవిధంగా చెప్పి, ఆమెకు జాలి కలిగించేట్టు చేయాలి?" అని ఆలోచిస్తున్నాడు.

ప్రొద్దు ఏటవాలుతూవుంది. విరాజ్ తన గదిలో బోర్లాపడుకొని, మేనమామకు ఉత్తరం వ్రాస్తూవుంది. రెండోవేపు ధ్యానంలేకుండా తన్మయత్వంతో ఉత్తరాన్ని వ్రాస్తూవుంది. నాలుగు పేజీలు మించినా ఆ ఉత్తరమింకా పూర్తికాలేదు. ఆ వూళ్ళో మహాతల్లి ఇంటింటా స్ఫోటకముతో ఎలా తాండవమాడుతూ వుందో, గ్రామానికంతటికీ తలమానికంగా యీ ఇంటిని యెలా వదిలిపెట్టిందో — యేవిధంగా తన నొసటిబొట్టూ చేతుల గాజులూ రక్షింపబడినవో! ఇవన్నీ విరాజ్ వ్రాస్తూవుంది. ఇంతలో పక్క మీదనుంచి నీలాంబరుడు "ఏం విరాజ్! నే నో సంగతి చెపుతాను వింటావా?" అని అడిగాడు.

విరాజ్ సిరాలోముంచిన కలాన్ని అలానే వదిలి, ముఖమెత్తి "ఏమి టా సంగతి?" అని అడిగింది.

"ఒప్పుకుంటానంటే చెపుతాను."

"ఒప్పుకోవటానికి వీలుగావుంటే, తప్పకుండా ఒప్పుకుంటాను; చెప్పండి యేమి టా సంగతి?"

కొంచెంసేపు ఆలోచించి "చెప్పినందువల్ల లాభంలేదు విరాజ్! నువ్వు ఒప్పుకోవు" అని అన్నాడు.

విరాజ్ ఏమీ మాట్లాడకుండా, వ్రాసుకునేందుకు తల వంచుకుంది. అయినా ఆ సంగతిని తెలుసుకోకుండా ఉత్తరం వ్రాయడానికి ఆమె మనసు అంగీకరించలేదు. లోలోపల్నే ఆమెకు కుతూహలము ఎక్కువైంది. లేచి కూచుని "సరే, ఆ మాట యేమిటో చెప్పండి. తప్పకుండా ఒప్పుకుంటాను" అని అన్నది.

నీలాంబరుడు నవ్వి, అటూ ఇటూ చూసి "ఇదిగో, మధ్యాహ్నం మోతీ మెహాతా వచ్చి నా రెండుకాళ్ళూ పట్టుకున్నాడు. ఎన్ని మాటలు చెప్పినా, యేమన్నా వదలలేదు, నేనొకసారి వాళ్ళింటికి వెళ్ళందే, అతని కొడుకుప్రాణాలు రక్షింపబడవని వాళ్ళందరి నమ్మకమట! అందు వల్ల కొంచెంసేపు వాళ్ళింటికి వెళ్ళిరావాలి ..." అని అన్నాడు.

విరాజ్ కొంచెం సేపటివరకూ నిశ్శబ్దంగా భర్తగారి ముఖంలోకి చూసి "ఈ దుర్బల శరీరంతో మీరు అంతదూరం వెళ్ళగలరా?" అని అడిగింది.

"ఏంచేయను విరాజ్? వస్తానని వాడికి మాట యిచ్చాను, నే నక్కడికి వెళ్ళితీరాలి."

"అంత తొందరపడి మాటెందుకు యిచ్చారు?"

నీలాంబరుడు ఏమీ మాట్లాడలేదు. అయోమయంగా ఆమెవేపు చూశాడు. విరాజ్ కఠోరంగా "ప్రాణం మీ ఒక్కరిదేనని మీ ఉద్దేశం కాబోలు? ఇక మీ శరీర విషయంలో యెవరికి యేమీ అధికారం లేదన్న మాట! ఇంత ముందు వెనుకలు చూడకుండా మీ మనసుకు తోచినట్లు మీరు చేస్తూన్నమాట? బాగానేవుంది" అని అన్నది.

ఈ సంగతి మరిపింపజేయాలని, నీలాంబరుడు నవ్వేందుకు ప్రయత్నించాడు. కాని, భార్యముఖం చూడడంతోనే ఆ నవ్వు ఆగిపోయింది. ఏదో ఒకవిధంగా "అతని యేడుపు చూచి, మనము...." అని అంటూంటే మధ్యలోనే ఆయనగారి మాటను త్రోసి, విరాజ్ "మరీ బాగానేవుంది! అతని యేడుపును మీరు విన్నారుకాని, ప్రపంచములో నా యేడుపును వినే వాళ్ళున్నారా? అని. వ్రాసిన నాలుగుపేజీల వుత్తరాన్ని చించి, "పురుషులకు యెటువంటి మనస్తత్వము అలవాటైంది? .... నాలుగు రోజులూ, నాలుగు రాత్రులూ, నే నేమీ తినకుండా గడిపాను. దాని కీనాడు మీ చేతుల్తో మీరే స్వయంగా ప్రతిఫలం తెచ్చుకోబోతున్నారు. ఇంటింటా జ్వరమూ, ఇంటింటా స్ఫోటకమూ బాగా తాండవమాడుతూ వున్నాయ్. మీరేమో, యివేమీ గుర్తుకు తెచ్చుకోకుండా యీ దుర్బల శరీరంతో రోగిని చూసివద్దామని ప్రయత్నిస్తున్నారు .... సరే. వెళ్ళండి. నాకు భగవంతుడే వున్నాడు?" అని ఆమె పడుకుంది.

నీలాంబరుడు తన పెదిమలమీద సూక్ష్మమైన నవ్వు రేఖను కనపరుస్తూ మెల్ల మెల్లగా "ఏం విరాజ్? మీ రందరూ మాటి మాటికీ భగవంతుని పేరు చెపుతుంటారే! ఆ భగవంతునిమీద మీకు నమ్మకమన్నా వుందా?" అని అడిగాడు.

విరాజ్ గబుక్కున లేచికూచుని కోపంతో "లేదు. ఎందు కుంటుంది? భగవంతునిమీద నమ్మకమనేది మాకేముంటుంది? మేము మీలా మనుష్యులము కాముగా? మా కెందుకవి వుంటుంది? మా కుండదు. భగవంతుణ్ణి గురించి మేము భజనచేయలేము. తులసిదండల్ని మెడలో వేసుకోలేము — ఆఖరికి చచ్చిన శవాన్నైనా తగలబెడుతూ తిరగలేము.... అందుకనే మేము మీలా నమ్మలేము భగవంతుణ్ణి. భగవంతుణ్ణి నమ్మే దల్లా మీరే!" అని అన్నది.

భార్య ఇలా కోపంగా మాట్లాడడము చూసి నీలాంబరుడు నవ్వుతూ "కోప మెందుకు విరాజ్? సంగతి సందర్భాలు అటువంటివి. ఇది నీ ఒక్కదాని విషయం కాదు. మీ అందరికీ అంటే మీ స్త్రీజాతి కంతటికీ అన్నమాట. ఇంతకూ భగవంతునిమీద నమ్మకముంచి పడివుండడానికి యెంత బల మవసరమో అంత బలమూ మీ ఆడవాళ్ళ వంట్లో లేదు.... ఇటువంటి పరిస్థితిలో నీ తప్పేముంది?" అని అన్నాడు.

ఈ మాటలతో విరాజ్‌కి, కోప మింకా యెక్కువై, "కాదు, తప్పెందు కవుతుంది? ఇంతకూ ఆడజాతి గుణమే అంత! కాని భగవంతుని మీద నమ్మక ముంచడానికి వంట్లో బలమే అవసరమైతే, అడివిలో వుండే పులులకూ, యెలుగ్గొడ్డుకూ యింకా యెక్కువబలమే వుంటుంది. పోనీయండి. బలమున్నా మంచిదే! లేకపోయినా మంచిదే. కాని, బలము లేని యీ నిస్సత్తువ శరీరముతో మిమ్మల్ని మాత్రం యెక్కడికీ పోనీ యను. మీరెంత యుక్తిచేసి, మీ వశంగా యెంత సమర్థించుకుందా మను కున్నా, యీ పనిమాత్రం నేను చేయనీయను" అని అన్నది.

నీలాంబరుడు ఏమీ మాట్లాడలేదు. మెదలకుండా పడుకున్నాడు. కొన్ని క్షణాలపాటు విరాజ్‌కూడా మెదలకుండా కూర్చుని, తర్వాత "సాయంకాలము కావస్తూవుంది. వెళ్ళి పని చేసుకోవాలి" అని వెళ్ళి పోయింది.

ఒక గంటసేపైన తర్వాత దీపం వెలిగించుకొని గదిలో పెడదామని వచ్చేసరికి, భర్త పక్కమీద లేడు. పెద్ద పెద్ద అడుగులు వేసుకుంటూ,

బైటకువచ్చి "హారీ! ఓ హారీ! మీ అన్నాయ్ ఎక్కడికి వెళ్ళారే? వెళ్లు. బైట ఎక్కడున్నారో చూసిరా?" అని అన్నది.

హరి పరుగెత్తుకుంటూ వెళ్ళి అయిదు నిమిషాలకు తిరిగివచ్చి. "ఎక్కడాలేదు వదినా! నది వొడ్డుకుకూడా వెళ్ళొచ్చాను" అని చెప్పింది.

విరాజ్ తలూపుతూ, "హూఁ" అని వంటింటిలోకివెళ్ళి శాంతంగా కూచుంది.

# 3

మూడు సంవత్సరాల తర్వాత సంగతి :—

హరిమతి అత్తగారింటికి వెళ్ళింది. తమ్ముడు వేరుపడి, తన వంతువచ్చిన ఆస్తిని పంచుకుని, ఆ ఇంటికి రెండో వాకిలి పెట్టించు కున్నాడు. బైటవున్న దేవీమందిరంలో సంధ్యాకాలపునీడలో నీలాంబ రుడు చినిగిపోయిన చాపమీద కూచుని ఉన్నాడు. విరాజ్ మెదలకుండా వచ్చి ఆయనదగ్గర నిలుచుంది. నీలాంబరుడు ఆమెవేపు చూసి, "ఇలా వచ్చావేం?" అని అడిగాడు.

విరాజ్ ఒకపక్కగా కూచుని "ఒక సంగతి అడగాలని వచ్చాను" అని అన్నది.

"ఏమి టా సంగతి?"

"ఏమీలేదు. ఏమి తింటే, మనిషి తొందరగా చస్తాడో మీకు తెలుసా?"

నీలాంబరుడు మాట్లాడలేదు.

"నేను చచ్చే వుపాయమైనా చెప్పండి. లేకపోతే మీరు నానాటికీ ఇలా అయిపోతున్నా రెందుకో చెప్పండి?"

"నేను తగ్గిపోతున్నానని నీతో యెవరు చెప్పారు?"

"ఎవరు చెప్పాలి?....మీరే చెప్పారు. ఎవరో చెప్పితే తెలుసు కున్నానని అనుకుంటున్నారా?"

"అదికాదు. నే ననేది అదికాదు. నీకెవరైనా చెప్పారా? లేక పోతే నువ్వే తెలుసుకున్నావా అని అంటున్నాను."

హరిమతిని వారికిచ్చి పెళ్ళి చెయ్యవద్దని మీకెంత ఇదిగా చెప్పాను. కాని, మీరు నా మాటను విన్నారా? దగ్గిరున్న నగదంతా పోయింది. నా వంటిమీది నగలూ పోయినై; యదు మెహతామూలంగా నదివొడ్డున ఉన్న పల్లపుభూమి తాకట్టుపాలయింది, పైగా వర్షాలేమీ లేవు; మరి మీరే విధంగా పెండ్లికొడుక్కి చదువుఖర్చు నెల నెలా పంపిస్తారో చెప్పండి. హరి బంధువులు మంచివాళ్ళు కాదు. వంక దొరికితే చాలు హరిని బాధ పెడుతుంటారు. మాటపడే సహనం ఆ పిల్లకులేదు. ఎవరైనా మిమ్మల్ని మాటంటే చాలు, ఆ పిల్ల ఊరుకోదు. అటువంటప్పుడు యేమవుతుందో ఏమో తెలవదు....భగవంతుడు బాగా చూడాలి! .... అయినా, మీ రలా యెందుకని తొందరపడ్డారు?"

నీలాంబరుడు ఏమీ మాట్లాడలేదు.

"అదీగాక. హరిమతి బాగోగులు చేతులారా మీఅంతట మీరే తెచ్చి నెత్తిన పెట్టుకున్నారు. దానిమూలంగా రాత్రింబగళ్లు ఇలా విచారంతో ఉంటున్నారు.... ఈ విధంగా మీరు నన్ను సర్వనాశనం చేస్తారా?....నేనలా కానీయను. ఈ విధంగా యెప్పుడూ విచారంగా కూచునేదానికన్నా. నాలు గైదు సెంట్ల భూమి అమ్మి, ఆ వచ్చిన అయిదువందల రూపాయలు తీసుకొని, హరి మామగారింటికి వెళ్ళి, ఆ డబ్బును ఆయనగారికి సమ ర్పించి, ఒక నమస్కారంపెట్టి. "మహారాజా! ఈ డబ్బును తీసికొని, నన్నిక వదలండి. నేను బీదవాణ్ణి! యింక ఇచ్చేశక్తి నాకులేదు" అని చెప్పి, మీ బరువును కొంత తగ్గించుకోండి.........ముందు ముందు హరి భాగ్యం యెలావుంటుందో, అలానే జరుగుతుంది. హరికోసం మీరు పొడవడం బాగాలేదు."

దీనికూడా నీలాంబరుడు జవాబు చెప్పలేదు. విరాజ్ అలానే కొంచెంసేపు భర్తముఖంకేసి చూసి "మీ రలా చెపుతారా లేదా?" అని అడిగింది.

"ఎందుకు చెప్పను? ఉన్నదంతా అమ్మితే, ముందు ముందు మన కెలా నడుస్తుంది?"

"ఎలా గడుస్తుందేమిటి? బాగానేవుంది.ఏదో ఒకవిధంగా గడుపుకో వచ్చు. ఆ స్తిమీద అప్పుచేస్తే, రెండు విధాలుగా మనం పాడైపోతాము. ఒకటి, తెచ్చిన డబ్బుమీద వడ్డీ పెరిగిపోతుంది. రెండోది, అప్పు యిచ్చిన వాళ్ళ బెదరింపులకు. వాళ్ళమాటలకూ మనం తలవంచాల్సొస్తుంది.... ఇలా తాకట్టుపెట్టి తెచ్చేబదులు, దాన్ని అమ్మి యీ చిక్కులన్నీ పోగొట్టుకోవ డం చాలా మంచిది! పిల్లా, జెల్లా యేవిధంగా బ్రతుకుతారనే విచారం మనకులేదు. మనవి రెండు ప్రాణాలు. యేదో ఒకవిధంగా తిని, కాలం గడపవచ్చు—యేమీ ఆధారం లేనప్పుడు, మీరు సాధువేషంతో బయలు దేరండి! నేను సాధుగారి భార్యనవుతాను. మనమిద్దరం కాశీ, బృందా వనం మొదలైన తీర్థయాత్రలు సేవించుతూ ఉండవచ్చు"

"అయితే నువ్వు కంజరి వాయిస్తావా?"

"ఆ....వాయిస్తాను. కంజరి వాయించలేనప్పుడు, మీ జోలి భుజా నికి తగిలించుకొని మోస్తుంటాను. మీరు భావావేశంలో పాటలుపాడుతూ వుంటే పశుపక్షులన్నీ తన్మయత్వంతో వింటూంటాయ్! అటువంటప్పుడు మన రెండు ప్రాణుల కడుపు నిండదూ? పదండి! యింట్లోకి పదండి! చీకట్లో మీ ముఖం కనుపించడంలేదు."

ఇంట్లోకి వచ్చాక, విరాజ్ భర్తమొహందగ్గర దీపంపెట్టి ఆయన ముఖాన్ని క్షణంసేపు చూసి "లేదు, సాహసం కలగడంలేదు. ఇటువంటి అమాయక సాధువును, పదిమంది సాధువుల భార్యలముందు తిరగ నీయను....అంతకంటె నే నిక్కడ తిండి లేక చచ్చిపోవడమే మంచిది!" అని అన్నది.

నీలాంబరుడు నవ్వి "అక్కడ సాధువుల భార్యలేకాదు. సాధువులు కూడా ఉంటారు" అని అన్నాడు.

"సాధువులు ఉంటేవుండవచ్చు. ఉంటేనాకేం?" అని విరాజ్ దీపం తిరిగి మామూలుచోట పెట్టి, భర్తకాళ్ళదగ్గిర కూచుని. గంభీరభావంతో

"సరే!'సతి'కి అసతికి భేదమేమిటో చెప్పండి! ఈ ప్రపంచంలో పతివ్రత లున్నారు. కులటలున్నారు కాని, నే నెప్పుడూ అసతిని కాని, కులటను కాని చూడలేదు. ఒకసారి కులటను చూడాలని వుంది. కులట ఎలా వుంటుందో తెలుసుకోవాలి. కులటకూడా సరిగా మనలానే ఉంటుందా? లేకుంటే భిన్నంగా ఉంటుందా? వాళ్లు యేం చేస్తుంటారో ఏమాలోచిస్తుంటారో, ఏమితింటారో....ఇవన్నీ చూడాలని నా కో పెద్ద కోరికవుంది! అయితే మీ రెప్పుడన్నా అసతి అయిన ఆడదాన్ని చూశారా?" అని అడిగింది.

"ఆ....చూశాను!"

"చూశారా? సరే! నేను మీదగ్గర కూచుని మాట్లాడినట్లుగా యెవరితోనైనా అలా మాట్లాడగలరా?"

"ఆ సంగతి నేను చెప్పలేను....అంత పరీక్షగా నేను చూడలేదు."

విరాజ్ క్షణంసేపు భర్త ముఖంకేసి చూసి, తరువాత ఏ మాలోచించిందో యేమో ఆమెశరీరం వణకడం మొదలుపెట్టింది. అదిచూసి "అలా వణకుతున్నావేం?" అని నీలాంబరుడు అడిగాడు.

"రామరామ! చీకటిపడింతర్వాత ఇవేం మాటలు........ఏమండీ! మీరు సంధ్యావందనం చేశారా?"

"లేదు....ఇప్పుడే చేయాలని వెళుతున్నాను"

"ఆ...., వెళ్ళండి! కాళ్ళూచేతులూ కడుక్కొని రాండి! మీరు వచ్చేటప్పటికి ఈ గదిలో పీటవేసి సిద్ధంగా ఉంచుతాను"

తరువాత అయిదురోజులనాటి సంగతి.

రాత్రి షుమారు పదిగంటలై ఉంటుంది. నీలాంబరుడు పక్క మీద పడుకొని కళ్ళు మూసుకుని హుక్కా త్రాగుతున్నాడు. విరాజ్ ఇంటిపనులన్నీ చేసుకుని పడుకోబోతూ ఆకులు వేసుకునేందుకు క్రింద కూర్చుని ఆకులుచుట్టుకుంటూ "ఏమండీ! శాస్త్రాల్లోని సంగతులన్నీ నిజమే నంటారా?" అని అడిగింది.

నీలాంబరుడు హుక్కా గొట్టాన్ని ఒక ప్రక్కనపెట్టి, భార్య మొహంకేసి చూస్తూ "శాస్త్రాల్లోని సంగతులు నిజం కాకపోతే, అబద్ధ మవుతాయా?" అన్నాడు.

"కాదు....అబద్ధమని నే ననడంలేదు. అయినా పూర్వకాలంలా ఈ కాలంలోకూడా ఫలిస్తాయా?"

ఒక్క క్షణంసేపు ఆలోచించి నీలాంబరుడు "ఇవన్నీ తెలుసు కొని చెప్పడానికి నే నేమీ పండితుణ్ణికాను విరాజ్! యివేమీ నాకు తెలి యవు. నాకు తెలిసినంతవరకూ, నిజమనేది యేదైతేవుందో, అది పూర్వ కాలంలో గాని, వర్తమానకాలంలో గాని, ఆఖరికి ఈ కలికాలంలో కూడా నిజమనేది నిజమే!" అని అన్నాడు.

"సావిత్రీ సత్యవంతుల సంగతే తీసుకోండి! చనిపోయిన భర్తను సావిత్రి యముని దగ్గర్నుంచి తెచ్చుకున్నది. మరి ఈ యుగంలో యే ఆడదైనా అలా, చేయడానికి వీలుందా?"

"ఎందుకులేదు? సావిత్రిలా యే ఆడది పతివ్రతగా ఉంటుందో, ఆమె తప్పకుండా చేస్తుంది?"

"అయితే నే నలా చేయగలనా?"

"అయితే నువ్వు సావిత్రిలాంటి పతివ్రతవా?....సావిత్రి దేవత!"

ఆకులు నమిలి ఒక ప్రక్కకు వెడుతూ, విరాజ్ "ఆమె దేవతయితే కావొచ్చు! సతీత్వంలో నేను వారికంటే తక్కువదాన్నా? నాలా సతీత్వపు మర్యాదను పాటించే స్త్రీలు ప్రపంచంలో ఉంటే వుండవచ్చు కాని-సతీ త్వపు మహిమను నాలా తెలుసుకునే వ్యక్తి ఉంటుందంటే నే నొప్పుకోను. ఈ విషయంలో మటుకు నేను సావిత్రికి కాని, యింకెవరికైనా ఒక్క నువ్వుగింజయినా తగ్గను" అని అన్నది.

ఈ మాటకు నీలాంబరుడేమీ జవాబు చెప్పలేదు. అతను భార్య ముఖంలోకి మెదలకుండా చూస్తూ ఊరుకున్నాడు. విరాజ్ ఆకులు వేసు కునేందుకు తూచున్నప్పుడు దీపం తెచ్చుకొని దగ్గరగా ఉంచుకున్నది. ఆ వెలుతురంతా ఆమె ముఖంమీద పడుతూవుంది. ఒక అద్భుతజ్యోతి

విరాజ్ కళ్ళలోంచి బైటకువచ్చి లీనమవడం నీలాంబరుడు ఆ వెలుతురులో స్పష్టంగా చూశాడు. భయపడుతూ భయపడుతూ అతను "అయితే అలా చేయడంలో నువ్వూ సమర్థురాలివే; నాకు తెలుసు!" అని అన్నాడు.

విరాజ్ లేచివచ్చి భర్తగారి కాళ్ళకు తల అనించి దగ్గరగా కూచుని "నాకు జ్ఞానము వచ్చినప్పటినుండీ ప్రపంచములో యీ రెండు పాదాలు తప్ప యింకేమీ తెలియవు. నేను యదార్థమైన పతివ్రతనైతే, సావిత్రిలానే మిమ్మల్నికూడా తిరిగి బ్రతికించుకునేట్లు ఆశీర్వదించండి! అంత్యకాలానికైనా, యీ పాదాలమీద తలవుంచి, మీతోపాటే, నా బొట్టూ, గాజులతో శరీరం — చితియెక్కేట్లు ఆశీర్వదించండి!" అని అన్నది.

"ఏం విరాజ్? ఇవాళ ఇలా మాట్లాడుతున్నావేం?"

విరాజ్ కళ్లు రెండూ చెమ్మగిల్లాయి; అయినప్పటికీ ఆమె పెదవుల మీద ఓ చిన్న మధురమైన నవ్వు బైటికి తొంగిచూసింది. "ఇవాళ కాదు. ఇంకోనాడు చెపుతాను. చివరిఘడియల్లో నేను యీ పాదాలధూళిని పొందేటట్లూ, మీ ఒడిలో తలపెట్టి మీ ముఖం చూస్తూ చూస్తూ చచ్చిపోయేటట్లు ఆశీర్వదించండి!" అని అంటుంటే విరాజ్ గొంతు గద్గదమైంది.

భార్యస్థితి చూసి నీలాంబరునికి భయంకలిగింది. ఆమెను మెల్లగా తన ఒడిలోకి లాక్కుని, "ఇవాళ ఇలా ఉన్నావేం విరాజ్? ఎవరైనా యేమన్నా అన్నారా?" అని అడిగాడు.

భర్త ఒడిలో ముఖం దాచుకుంటూ, విరాజేమీ చెప్పకుండా ఏడుస్తూ వుంది.

"విరాజ్ నువ్వెప్పుడూ ఇలా వుండేదానివికాదు. ఎవరన్నా, యేమన్నా అన్నారా?"

భర్తఒడిలో ముఖందాచుకున్నే కళ్లు తుడుచుకుని "ఇంకొకనాడు చెపుతానులెండి!" అని అన్నది.

నీలాంబరుడు తిరిగి ఏమీ అడగకుండా భార్యతల నిమురుతూ, [illegible]రించాడు. చెల్లెలిపెళ్ళికి శక్తికిమించి ఖర్చుపెట్టాడు. అందువల్ల [illegible] ఎక్కువైనాయి. ఇంటిఖర్చు లిప్పుడు పూర్వంలా జరగడంలేదు.

ఒకవేపు రెండు సంవత్సరాలనుంచీ పొలంలో సరిగ్గా పంటలు పండడంలేదు. వర్షం సరిగ్గా లేనందున పంటలు యెండిపోయినై! అందు వల్ల గాదెల్లో ధాన్యంలేదు, చెరువులో నీళ్ళూ, చేపలూ లేవు. అరటితోట యెండిపోతూవుంది. నిమ్మతోటలో పచ్చి పిందెలు రాలిపోతున్నాయ్! ఆపైన అప్పులవాళ్ళ బాధ! అవన్నీ కాక, హరి మామగారు మహా విసిగిస్తున్నారు. పిల్లవాని చదువు ఖర్చుకు ఒక్కొక్కప్పుడు మహోకటువుగా ఉత్తరం వ్రాస్తూవున్నాడు. ఇవన్నీ విరాజ్‌కు తెలియవు. ఇటువంటి బాధాకరమైన విషయాలు విరాజ్‌కు చెప్పకుండా దాచి ఉంచినా, ఆమె కివన్నీ తెలిసినవా?" అని ఆలోచిస్తున్నాడు.

విరాజ్ తలెత్తి "మిమ్మల్ని ఒక సంగతి అడుగుతాను నిజం చెపుతారా?" అని అడిగింది.

"ఏమిటా సంగతి?"

అసలు విరాజ్ యెంతో అందంగా ఉంటుంది. ప్రేమ పూర్వకమైన మందహాసంతో భర్తను చూస్తూ "నే నేమైనా నల్లటిదాన్నా?" అని అడిగింది.

"కాదు"

"ఒకవేళ నేను నల్లగా మారిపోయినా మీ రిలానే నన్ను ప్రేమిస్తారా?"

ఈ వింతప్రశ్న నీలాంబరుని, విస్మయంలో ముంచింది. మెల్లగా నవ్వుతూ "నేను చిన్నప్పటినుంచీ ఒక అనుపమ సౌందర్యవతిని ప్రేమిస్తూ వచ్చాను. ఏ అందకత్తెను నేను ప్రేమిస్తూ వచ్చానో ఆమె నల్లదైనంత మాత్రాన నేనేం చేస్తాను?" అని అన్నాడు.

రెండుచేతులతోనూ నీలాంబరుని మెడను దగ్గరకు లాక్కొని "నే నేమని చెప్పను? అయినా మీ రీవిధంగానే యెప్పుడూ నన్ను ప్రేమిస్తారా?" అని అడిగింది.

నీలాంబరుడు మాట్లాడలేదు.

"నే నీ సంగతి యెలా తెలుసుకున్నానని ఆలోచిస్తున్నారా? వినాలంటే?"

"ఆ....! అదే. యీ సంగతి యెలా తెలుసుకున్నావ్?"

విరాజ్ భర్తమెడను వదలి ఆయన వొడిప్రక్క తలవుంచి పడుకుని ఆయనముఖంవేపు చూస్తూ "నా మనసు నా కలా చెపుతూవుంది. నేను మిమ్మల్నెంతయిదిగా గుర్తిస్తున్నానో అంత యిదిగా మిమ్మల్ని మీరే గుర్తించుకోలేకుండా ఉన్నారు. అందువల్లనే నేను నల్లదాన్నైనా మీరు నన్నీవిధంగానే ప్రేమిస్తుంటారు. ధర్మంకాని పనిని మీ రెప్పటికీ చేయరని నాకు తెలుసు!" అన్నది.

నీలాంబరుడు ఈ మాటకు జవాబు చెప్పలేదు. క్షణంసేపు విరాజ్ భర్తఒడిలో తల దాచుకొని అప్రయత్నంగా తనచేతిని భర్త కనుకొలకుల మీదకు పోనిచ్చి చకితురాలయి "మీ కళ్ళల్లోంచి నీళ్లు వస్తున్నాయేం?" అన్నది.

ప్రేమతో ఆమె చేతిని తొలగిస్తూ బొంగురుపోయిన గొంతుతో "నీ కెలా తెలుసు?" అన్నాడు.

"తొమ్మిదేళ్ళ వయసులో నా పెళ్ళయిందని మీరు మరిచిపోతారేం? మీ వంటిమీద చేయిపెట్టి కూడా నేను మీ హృదయంలోని సంగతి తెలుసుకుంటానని మీకు తెలియదా?"

నీలాంబరుడు ఏమీ మాట్లాడకుండా, కూచుని కళ్ళంట నీళ్లు కాలవ కట్టిస్తున్నాడు.

విరాజ్ లేచి కూచుని పైటచెంగుతో కళ్లుతుడిచి, "విచారించకండి. అమ్మ యీ భూమిమీదనుంచి వెళ్ళిపోయేప్పుడు హరిని మీకు అప్పగించింది. ఆమె బరువంతా మీ మీదపెట్టి వెళ్ళిపోయింది. హరి పెళ్ళికోసం మీకు తోచినవిధంగా చేశారు. మీరు చేసిన పనిచూసి స్వర్గంలో వున్న వాళ్లు మనల్ని దీవిస్తారు! విచారించకండి! ఋణవిముక్తి పొందేమార్గం చూడండి! దీనికోసం మనదంతా పోయినా పోనీయండి! మీ రేమీ విచారించవద్దు" అన్నది.

నీలాంబరుడు కళ్లు తుడుచుకొని గద్గదస్వరంతో "విరాజ్! నా బాధ నీకు తెలియదు. నేను నీకు...." అని అనబోయాడు.

విరాజ్ భర్త నేమీ చెప్పనీయకుండా, ఆయన నోటికి చేయి అడ్డు పెట్టి "నా కంతా తెలుసు! అదిగాక యింకా యేమన్నా తెలిసినా తెలియక పోయినా రాత్రింబవళ్లు యిలా విచారిస్తూ కూచుని మీ శరీరాన్ని శుష్కించి పోయేట్లు మాత్రం చేయనీయను. కాదు, అలాకాదు—యెవరి కెంత బాకీ వున్నారో, వాళ్ళందరికీ దమ్మిడీలతోసహా లెక్కకట్టి యిచ్చేయండి! ఆ తరువాత పైన భగవంతుడూ, క్రింద భూదేవీ వున్నారు" అన్నది.

దీర్ఘమైన నిట్టూర్పు వదిలి నీలాంబరుడు ఊరుకున్నాడు.

# 4

ఆరుమాసాలు గడిచిపోయినయ్! నీలాంబరుని తమ్ముడు పీతాంబరుడు హరిమతిపెండ్లికాకముందే ఆస్తిని పంచుకొని వేరే వుంటున్నాడు. అసలతను చెల్లెలిపెండ్లినుంచి తప్పుకునేందుకే ఆస్తి పంచుకుంది! ఇటువంటి స్థితిలో తనకు సంక్రమించిన పిత్రార్జితంలో కొంతభాగం తనఖా పెట్టి నీలాంబరుడు చెల్లెలిపెళ్ళి చేశాడు. పీతాంబరుడు ఒక్క దమ్మిడీ కూడా సాయంచేయలేదు. వివాహంలో పెళ్ళికొడుకు చదువుకయే ఖర్చు నీలాంబరుడే, నెల నెలకూ పంపాలని కూడా నిశ్చయించుకున్నారు. ఆదాయం లేకపోవడంవల్ల, యింటి ఖర్చుకీ, పెండ్లికొడుకు చదువుకూ వాయిదాలమీద భూమిని తనఖాపెట్టి, నీలాంబరుడు కొంతడబ్బు తెచ్చుకుంటున్నాడు. ఈ విధంగా అతని ఆస్తిమీద అప్పు పెరుగుతూవుందికాని, భూమిమాత్రం అతను అమ్మలేదు.

సాయంకాలం కాగానే భూలానాథ్ముఖర్జీ అనే మహాశయుడు వచ్చి, తన కివ్వవలసిన డబ్బునుగురించి నీలాంబరుని మహాధూర్తత్వంతో అడిగాడు. చాటుగావుండి విరాజ్ యీ మాటలన్నీ వింది, నీలాంబరుడు లోపలికి రాగానే ఏమీ తెలియనట్లుగా విరాజ్ వంటింటిలోంచి ఆయనకు యెదురుగావచ్చి నిలుచుంది. భార్య ఈవిధంగా నిలుచోవడం చూసి ఆమె సంగతంతా విన్నదనుకున్నాడు. క్షోభతో, అవమానంతో,ఆమెహృదయం మండిపోతూవుంది. కాని.ఆ భావం ఆమెలో కనపడలేదు. |వేలిలో మంచం వేపు చూపుతూ, విరాట్ ప్రశాంతంగా "అక్కడ కూర్చోండి" అన్నది.

భార్య సంకేతానుసారంగా నీలాంబరుడు మంచంమీద కూర్చున్నాడు. ఆయన కాళ్లవద్ద విరాట్ కూచుని, "మీరు అప్పు వదిలించుకొని

దూరంగా ఉంటారా? లేకపోతే న న్నే నుయ్యో గొయ్యో చూచుకో ,మంటారా?" అన్నది.

విరాజ్ అంతా విన్నదని నీలాంబరుడు భయపడ్డాడు. వెంటనే ఆమెను మంచంమీద తన ప్రక్కగా కూచోపెడుతూ, ఛీ! విరాట్! ఒక సామాన్య విషయానికి యింతయిదిగా భయపడాలా?" అని అన్నాడు.

"అప్పుకు భయపడకపోతే, మానవులు యిక దేనికి భయపడలారో కొంచెం చెప్పండి?"

దీని కేమని జవాబు చెప్పాలో నీలాంబరునికే స్ఫురించలేదు. కొంచెంసేపు మాట్లాడకుండా కూచున్నాడు.

"మెదలకుండా ఊరుకున్నారేం? జవాబు చెప్పండి?"

"జవాబుచెప్పడాని కేముంది? కాని, విరాజ్...."

"కానీ గీనీ మాటలతో పనికాదండి? నా యింటిముందుకు వచ్చి యితరులు మిమ్మల్ని నిందిస్తుంటే నేను వింటూ ఊరుకుంటానని మీరు అనుకోకండి! అప్పు తీరడానికి యేమన్నా ప్రయత్నంచేస్తారా? లేకపోతే నేను ఆత్మహత్య చేసుకోనా?"

నీలాంబరుడు భయపడుతూ, భయపడుతూనే "ఒక్కసారిగా యే ఉపాయం ఆలోచించమంటావు విరాజ్?" అని అడిగాడు.

"బాగానేవుంది సరే, ఒక్కనాడే కాకపోతే రెండుమూడు రోజుల పాటు ఆలోచించి యేం చేయదలచుకున్నారో కొంచెం చెప్పండి."

నీలాంబరుడు మళ్ళీ మౌనంవహించాడు.

"ఏదో ఆశవుందని, మరచిపోయికూడా మీరు నన్ను సర్వనాశనం చేయకండి. కాలం గడిచేకొద్దీ అప్పు పెరుగుతూ ఉంటుంది.....రెండింతలు కూడా అవుతుంది. నేను మిమ్మల్ని యాచిస్తున్నాను. మీ కాళ్ళు పట్టుకుంటాను. యికనైనా యేదో ఒకదారి చూడండి.'' అని అంటుంటే ఆమెకళ్ళల్లో నీరు తిరిగి కంఠం గద్గదికమైంది. భోలానాథ్ ముఖర్జీ తన భర్త ననివెళ్ళినమాటలు యింకా ఆమె హృదయంలో శూలాల్లా

గ్రుచ్చుకుంటున్నాయ్. నీలాంబరుడు చేత్తో ఆమెకన్నీళ్ళు తుడుస్తూ "భయపడితే లాభమేమిటి విరాజ్? ఈ సంవత్సరము భగవంతుడు సరిగ్గా చూసి, పంటకనుక సరిగ్గా పండితే కొంతలో కొంత పన్నెండణాల వంతైనా యీ అప్పు వదిలించుకుంటాను. అయినా నువ్వు చెప్పినట్టుగా భయపడి భూమిని అమ్ముకుంటే, మళ్ళీ దాన్ని తిరిగి సంపాదించుకునే దెలాగో చెప్పు?" అని అడిగాడు.

"నేను బాగా ఆలోచించే యీ మాటలంటున్నాను. యింతకూ బిల్లు గ్రుద్దినట్లు వచ్చేసంవత్సరం పంట పదహారణాలవంతు పండుతుందని నమ్మక మేమిటి? ఒకవైపున వడ్డీ పెరుగుతూవుంది. దాంతోపాటు మరో వైపున అప్పులవాళ్ళతో మాటలు పడాల్సివస్తోంది.....! నేను ఎంత కష్టాన్నైనా, యెన్ని బాధలనైనా సహిస్తాను. కాని, మిమల్ని అవమానం చేస్తుంటేమాత్రం చూస్తూ ఊరుకోలేను."

ఆసంగతి నీలాంబరునికి కూడా తెలుసు. కాని, అత నేమీ మాట్లాడలేకపోయాడు.

విరాజ్ మళ్ళీ "నా కదే విచార మనుకున్నారా? రాత్రింబగళ్లు మీ రీవిచారంతోనే కృంగి కృశిస్తున్నారు. మీ శరీరం ఆనాటి కానాటికి యెండిపోతూవుంది. బంగారపు బొమ్మలావున్న మీరు చూస్తూచూస్తుండ గానే నల్లబడిపోయారు. ఈ విచారాన్ని సహించే శక్తి నాలో వుందేమో నన్ను ముట్టుకుని చెప్పండి! ఇంకెంతకాలం మన మిలా యోగీంద్రునికి చదువుఖర్చు యిచ్చుకోవాలి?" అని అడిగింది.

"ఇంకా ఒక సంవత్సరం మాత్రమే! ఈ సంవత్సరం గడిస్తే చాలు. డాక్టరవుతాడు."

ఒక్కక్షణంసేపు మెదలకుండా కూచుని విరాజ్ "హరిని, ఇంత కాలం పోషించి పెద్దదాన్ని జేశాము. ఆమె సుఖంగావుంటూ, రాణి అయితే మంచిదే! హరిమతివల్ల మన మింత కష్టాలు పడవలసివస్తుందని ముందే తెలిసుంటే, దాన్ని నదిలో పారవేసేదాన్ని? ఈ విధంగా నామీద వజ్రాఘాతం పడనిచ్చేదాన్నికాదు. అయ్యో భగవంతుడా! వాళ్ళు గొప్ప వాళ్ళు, వాళ్ళకేవిధమయిన కష్టమూలేదు. వాళ్ళకేవస్తువుకూ లోటులేదు...

అటువంటప్పుడు జలగల్లా వాళ్ళు నా హృదయంలోని రక్తాన్ని పీలుస్తు న్నారు. యేకోశంలోకూడా వాళ్ళకు జాలీ, దయా లేదు. వాళ్ళ హృద యంలో కరుణ అనే గాలికూడా లేనట్లుంది" అని ఒక నిమిషం ఆగి "నాలుగువేపులా దారిద్ర్యం అనే పెనుభూతం వ్యాపించి వుంది. నిర్ధను లకు తిండి దొరకడమే మహాకష్టంగావుంది. కొంతమంది పస్తులుంటు న్నారు. మరికొంతమంది యెండినమాడు తిని తమ ప్రాణాల్ని రక్షించు కుంటున్నారు. ఇటువంటి కష్టకాలంలో మన బ్రతుకే మనకు కష్టమై నప్పుడు. యితరుల పిల్లవాడి భవిష్యద్భారాన్ని మన మెందుకు మోయాలి? హరి మామగారికి దేనిక్కీ కొరతలేదు. ఆయనగారు చాల గొప్పవాడు. యెంతో వలుకుబడి, గొప్ప ఆస్తివున్న ఆయనగారే, తన కొడుక్కు చదువు చెప్పించలేకపోయినప్పుడు మన మెందుకు చెప్పించాలి?.... యింతకూ అయిందేదో అయింది. ఇక మీ రెవరివద్దా అప్పుమాత్రం చేయకండి" అన్నది.

అతికష్టంమీద ఓ శుష్కహాసం పెదిమలమీదకు తెచ్చుకుని, "అదంతా నాకు తెలుసు విరాజ్? కానీ, "సాలిగ్రామం" యెదుట నేను చేసిన ఆ శపథ మేమవుతుంది?" అని అడిగాడు.

""ఏమవుతుంది? యేమీకాదు. "సాలిగ్రామ"మే నిజమైన దేవు డైతే, మన కష్టాల్నికూడా తెలుసుకునేవాడు. నేనుకూడా మీ శరీరంలో సగం భాగాన్ని గనుక, యీ విషయంలో యేమైనా పాపము చుట్టు కున్నట్లయితే, ఆ భారం నెత్తిన పెట్టుకుని, జన్మజన్మాంతరాలదాకా నేను నరకంలో మునిగిపోతాను, మీ రింకేమీ అనుమానం పెట్టుకోకండి! యెవరివద్దా యికనుంచి మీరు అప్పు తీసుకరావద్దు"

ధర్మావతారుడైన భర్త హృదయంలోని అగాధవ్యధ విరాజ్‌కి తెలియకపోలేదు. కాని, తమ కష్టకాలమందు ఆమె యివన్నీ సహించ లేక పోయింది. స్వాప్నిక జగత్తులోకూడా యదార్థంగా భర్త ఆమెకు సర్వస్వము. అటువంటి పరిస్థితుల్లో ఇప్పుడు భర్తముఖం రాత్రింబగళ్ల విషణ్ణమవుతూవుంది. ఆ వివర్ణవదనాన్ని చూస్తున్నకొద్దీ ఆమె హృద యం చలించిపోతూ వుంది. ఇంతసేపటివరకూ ఆమె కనను బాను నంబా

శించుకోలేకపోయింది. కాని, యిప్పు డామె నోరుమూసుకొని, భర్తవడిలో ముఖాన్ని దాచుకుని, వెక్కి వెక్కి యేడుస్తూవుంది.

నీలాంబరుడు తన కుడిచేయి విరాట్ నెత్తినవుంచి మెదలకుండా చూచున్నాడు. చాలాసేపు యేడ్చాక, ఆమె "నాకు జ్ఞానము వచ్చినప్పటి నుంచీ మీముఖం చూస్తూనే వున్నాను. ఇంతవరకూ యేవిధమైన విషాద రేఖలూ మీ ముఖంలో చూడలేదు. ఇప్పుడు ముఖాన్ని చూస్తున్నకొద్దీ రావణుడిచితి మండినట్లు, నా హృదయంకూడా మండుతూవుంది. మీరు మీ భావిజీవితం కేసి చూడకపోయినా ఫర్వాలేదుకాని నా భావిజీవితం వేపు ఒకసారన్నా చూడాలి. చివరికు మీరు నన్ను బజార్లవెంట అడుక్కునేదానిలా చేస్తారా? అప్పటి నా అవస్థా, శ్రమా చూసి మీరు సహిస్తారా?" అని అడిగింది.

విరాజ్ మాట్లాడిన యీ మాటలకు నీలాంబరుడు యేమీ జవాబు చెప్పలేదు. అప్పటి ఆయన ఆకృతిని చూస్తుంటే, యీ మాటలు ఆయన విన్నాడో లేదో అనిపిస్తుంది. యింతలో బైటినుండి పనిమనిషి సుందరి "అమ్మగారూ పొయ్యి రాజేయనా?" అని అడిగింది.

విరాజ్ గబుక్కునలేచి పైటకొంగుతో ముఖం, కాళ్ళూ తుడుచుకొని గదిబైటకు వచ్చింది.

సుందరి మళ్ళీ "పొయ్యి రాజేయమంటారా?" అని అడిగింది.

"ఆ....! మీ కేమయినా చేయిస్తాను. కాని నేనీపూట ఏమీతినను"

ఈ సంగతి నీలాంబరుడుకూడా వినాలనే వుద్దేశంతో సుందరి "అమ్మయ్యో! అయితే, మీరు రాత్రిపూట భోజనంచేయడం హఠాత్తుగా మానివేశారే? వుపవాసాలుచేస్తూ ప్రాణాలు త్యజిస్తారా ఏమిటి?" అన్నది.

పనికత్తె చేయిపట్టుకొని విరాజ్ వంటింటిలోకి లాక్కెళ్ళింది.

పొయ్యిలోని మంటవెలుగు విరాజ్‌ముఖంమీద పడుతూవుంది. దగ్గరగా చూచుని సుందరి ఆమెముఖంలోకిచూస్తూ "నేను నిజం చెప్తున్నాను అమ్మగారూ! మీలాంటి అందంగల ఆడదాన్ని నే నింకెక్కడా చూడలేదు. నీలాంటి రూపవతులు రాజుల యిళ్ళల్లో, జమీందారుల యిళ్ళల్లోకూడా కనుపించరు" అన్నది.

బాధపడుతున్నట్లుగా విరాజ్ "అయితే నీకు రాజుల ఇళ్లల్లోని, జమీందారుల యిళ్లల్లోని సంగతులు తెలుసా?" అని అడిగింది.

సుందరి వయసు షుమారు 35 సంవత్సరాలుంటుంది. ఆమె సౌందర్యంకోసం ఒకప్పుడు మహా గర్వించింది. ఆనాటి ఖ్యాతి ఇంకా మరిచిపోలేదు.

సుందరికి పెళ్ళెప్పుడయిందీ, తనకు వైధవ్యం ఎప్పుడు ప్రాప్తించిందీ కూడా తెలియదు. తనకు సర్వసౌభాగ్యాలూ కలిగిన కృష్ణపురంలో ఆమె కీర్తి మిన్ను ముట్టింది. సుందరి నవ్వుతూ "రాజులవి, జమీందార్లవి, వాళ్ల కీర్తులూ అపకీర్తులూ ఇవన్నీ నాకు కొంచెమే తెలుసును అమ్మగారూ! లేకపోతే ఆనాడతన్ని ఒకతాపు తన్నేదాన్నే!" అన్నది.

విరాజ్ కోపంతో "నీ మనసులో మెదిలినప్పుడల్లా, యీ మాపే నీనోటికి వస్తుందేం సుందరీ? వాళ్లకు యిష్టంకలిగి, నీతో అన్నారు. అతన్ని తన్నడానికి నువ్వెవ్వరివి? అనవసరంగా ఆ ప్రసంగాన్ని నాముందు పదేపదే తెస్తావెందుకు? వీరి స్వభావము నీకు తెలుసు. కోపపుమనిషి. వింటే ఏమంటారో తెలుసా?" అని అన్నది.

"ఈ మాటలు యజమానిగా రెందుకు వింటారమ్మా? ఇదీ ఒక సంగతేనా?"

"సంగతేనా, అని నాకు యెదురు చెప్పుతున్నావా? యే సంగతి గడిచిపోయిందో, యెందులో యిప్పుడు మార్దవం లేదో, దాన్నిగురించి తర్కించడం అనవసరంకాదూ?"

"ఇంతలోనే పాతపడిపోయిందమ్మా? అతన్ని మీరు తత్వహీనుడని అనుకున్నారు....? అయినా ఆయన నిన్న నన్ను పిలిచి....

"నువ్వెందుకు అక్కడికి వెళ్ళావు? ఇక్కడ నువ్వు నౌకరీ చేస్తావా- లేకుంటే పిలిచినవాళ్ళవెంట పరుగెత్తుతావా? ఆనాడే వాళ్ళంతా కలకత్తా వెళ్ళిపోయారని నాతో చెప్పలేదూ?"

"నేనేమీ అబద్ధము చెప్పలేదమ్మా? వాళ్లంతా వెళ్ళి రెండు నెలలయింది. మళ్ళీ ఇప్పుడు వచ్చినట్లున్నారు. ఇక నే నెందుకు వెళ్ళానంటారా

పోలీసుతో పిలవనంపితే, వెళ్ళకుండా యెలా వుండను చెప్పండి? వారీ వూరికి జమీందారులాయె! మనమేమో దరిద్రులమైతిమి. అటువంటప్పుడు ఎంత గుండెతో వుండమంటారు?"

క్షణంసేపు సుందరిముఖంలోకి చూసి విరాజ్ "వా రీ వూరికి జమీందారా?" అని అడిగింది.

"అవునమ్మా! ఈ వూరును వారు కొన్నారట! డేరాలేసుకుని వారు ఇక్కడే వుంటున్నారు. ఆయన అటువంటివాడు కాదమ్మా! ఇది ముమ్మాటికీ నిజం. పూర్తిగా రాజకుమారుడు....రాజకుమారుడు ...ముఖం కళ్లా"

"ఉండనియ్! వుండనీయ్‌లే! నోరుముయ్, యీ సంగతు లేమీ విన్నదగదంలేదు. నీతో అత దేమన్నాడో ఆ సంగతి మాత్రం చెప్పు?"

"ఏమంటాడమ్మా! ఆయనగారు నీ సంగతే అడిగారు."

"హుఁ"

అసలు ఈ సంగతి విపులంగా యిక్కడ పాఠకులకు చెప్పడం అవసరం!

రెండు సంవత్సరాలక్రితం, ఈ ఊరంతా కలకత్తాలోని ఒక జమీందారుగారిచేతిలోకి పోయింది. ఆ జమీందారు చిన్నకొడుకు చాలా పొగరబోతు, మూర్ఖుడు! వాణ్ణి బాగుచేయాలనే తలంపుతో తండ్రి కలకత్తా వాతావరణంలోంచి దగ్గరున్న యేదైనా తమ ఇలాకాలోకి పంపి ఆ ఇలాకాలోని బాదరబందంతా వాడి నెత్తినపెడితే, యేదో కొంచెమన్నా బాగుపడతాడని, పోయిన సంవత్సరము జమీందారు తన చిన్నకొడుకు రాజేంద్రకుమారుని ఇక్కడకు పంపాడు. సప్తగ్రామంలో జమీందారు ఉండటానికి పాపం యోగ్యమైన బంగళా కాని, ఇల్లు కాని కనబడలేదు. అందుకని ఊరికి బైటవున్న గ్రాండుట్రంకు రోడ్డుదగ్గర ఒక మామిడి తోటలో డేరావేసుకుని ఉంటున్నాడు.

సప్తగ్రామము వచ్చిన తరువాత పనిపాటలు చూద్దామని రాజేంద్రుని కెప్పుడూ లేదు. పక్షులను వేటాడటం అతనికి మహాసరదా! కన్నుల పండువుగా కనబడుతున్న యీ పల్లెటూరి చెట్లమీది పిట్టలను చూసి, వాటి

గైదు వేటకుక్కలను వెంటబెట్టుకుని, నదిఒడ్డున ధన్‌—ధన్ మంటూ పక్షులను వేటాడేవాడు.

షికారుచేస్తూ, చేస్తూ సరదాగా ఆరునెలలు గడిచేప్పటికి అతనికి ఒకనాడు విరాజ్ కనబడింది. చూసింది తడవుగా ముగ్ధుడయ్యాడు.

విరాజ్ ఏ తీరాన్ని స్నానంచేస్తూంటుందో, ఆ పరిసర ప్రాంత మంతా, పెద్ద పెద్ద వృక్షాలతో, గుబురుగా ఉంటుంది. అక్కడ స్నానం చేస్తుంటే ఇతరుల దృష్టి పడదని ఆమెకు తెలుసు. ఈ కారణంతో విరాజ్, నిర్భయంగా సంకోచము లేకుండా స్నానంచేస్తూవుంది.

రోజూలాగా ఒకనాడు స్నానంచేసి, బిందెలో నీరు నింపుకుని తడిసిన బట్టలతో ఇంటికి బైలుదేరింది. ఇంకా చీకటిపడటానికి కొంచెం ఆలస్యముంది. అస్తాద్రి శిఖరాన విరాజమానంగా ప్రకాశిస్తున్న సూర్యుని బంగారు కిరణాలు విరాజ్ సౌందర్యాన్ని ఇంకా ద్విగుణీకృతం చేస్తున్నాయి! సరిగ్గా ఆ సమయాన్నే పక్షులను వెదుకుతూ—వెదుకుతూ రాజేంద్రుడు అక్కడికి వచ్చి నదివొడ్డున వున్న స్తూపంమీద నిలుచుని విరాజ్‌ను చూస్తున్నాడు. మనుష్యులకు ఇంత సౌందర్య ముంటుందనీ, యింత మార్దవ ముంటుందనీ అత నెప్పుడూ విశ్వసించలేదు. రాతిబొమ్మలా నిలుచుని, అనిమేష దృష్టులతో ఆమెను చూస్తున్నాడు. విరాజ్ అటు చూడగానే, యెవరో అపరిచిత వ్యక్తి తనను చూస్తున్నాడనీ, త నిక అక్కడ వుండటం బాగుండదనీ, తడివస్త్రంతో వొళ్ళు కప్పుకుని, త్వరత్వరగా వెళ్ళిపోయింది. రాజేంద్రకుమారుడు కూడా, ఆమె కనిపించినంత దూరం రాతిశిలవలె ఆ సౌందర్యాన్ని చూస్తూ, స్వర్గసుఖం అనుభవిస్తున్నాడు. చివరకు తెలివి తెచ్చుకుని, కొంచెంసేపు నిలుచుని, 'ఇంతటి అందగత్తె ఇక్కడికి యెలా వచ్చింది?' అని దారివెంట ఆలోచిస్తూ వెళ్ళాడు. నాలుగువైపుల అడవి—పట్టి అడివి; సప్తగ్రామ మేమో చాలా చిన్నది, ధనవంతుల కుటుంబ మనేది ఆ ఊళ్ళో లేదు. రాజమహాలులో ఉండవలసిన యీ సౌందర్యరాశి యీ మొరటు పల్లెటూరిలోకి యెలా వచ్చింది? ఇటువంటి అందగత్తెను జన్మలో చూడలేదు. ఏమిటేమిటో అనుకుంటూ, ఆఖరికి ఆ రాత్రి యెంతో ప్రయత్నించి ఆమెను గురించి

తెలుసుకున్నాడు. అప్పటినుంచీ ఆమె అతనికి ఆలోచనా విషయమైంది. రాజేంద్రకుమారుని మస్తిష్కములో రెండో విషయాన్ని గురించి ఆలోచించే శక్తి లేకపోయింది. ఇంకా రెండుమూడు పర్యాయములు ఆమెను చూడటం తటస్థించింది.

విరాజ్ యింటికివచ్చి సుందరిని పిలిచి "సుందరీ తీరంలో ఆడవాళ్లు స్నానంచేసే స్థలంలో యెవరో ఒక మనిషి నిలుచుని ఉన్నాడు. నువ్వెళ్ళి నా తోటలోకి యింకెప్పుడూ రావద్దనీ వెళ్ళిపొమ్మనీ చెప్పిరా" అని చెప్పింది.

విరాజ్ చెప్పినవిధంగా అతణ్ణి ఇకముందు అటుప్రక్కకు రాకుండా చేదామనే తలంపుతో సుందరి నదిఒడ్డుకు వెళ్ళింది. అక్కడకు వెళ్ళి ఆమె ఆశ్చర్యంతో—"బాబుగారూ తమరా?" అన్నది.

"నే నెవర్నో నువ్వెరుగుదువా?"

"తెలుసు ప్రభూ! తమర్నెరుగనివా ళ్ళెవరు?"

"అయితే, నువ్వటుప్రక్కకు కొంచెంసేపు రాగలవా?"

సుందరి మెల్లగా నవ్వి ముఖం దించుకుని "నాతో పనేమిటి ప్రభూ?" అని అడిగింది.

"నీతో కొంచెం పనివుంది. రావాలి తెలుసా?" అని తుపాకి భుజంమీద పెట్టుకుని రాజేంద్రకుమార్ అక్కణ్ణుంచి వెళ్ళాడు.

సుందరి ఆనాడు యితరుల కళ్ళబడకుండా రాజేంద్రకుమారుని డేరాకి వెళ్ళింది. ఆమెతో అతను ఎన్నో సంగతులు చెప్పాడు. కాని అక్కణ్ణుంచి వచ్చాక, రెండు మూడుసార్లు యేదో పైగచేయడం తప్ప సుందరి విరాజ్ ముందు యింకేమీ అనలేకపోయింది. సుందరి తెలివి తక్కువదికాదు. విరాజ్ సంగతి ఆమెకు తెలుసు. బయటి కెంత మధురంగా, కోమలంగా వున్నా లోపల మాత్రం అగ్నిజ్వాలతో, రాయిలా ఆమె హృదయం కఠినంగా ఉంటుందని సుందరికి బాగా అనుభవమే. విరాజ్ సాహసురాలనీ, తనలాంటి మనిషయినా, తేళ్లనూ, భూతప్రేతాదులను చూసి కూడా భయమంటే యేమిటో యెరుగదని ఆమెకు తెలుసు.

పొయ్యిలో పుల్లలు ఎగదోసి, విరాజ్ సుందరి ముఖంకేసి చూసి. "అయితే సుందరీ! నువ్వు అనేక సార్లటు వెళ్ళివచ్చావు. నువ్వూ, అతనూ ఎన్నో సంగతులు మాట్లాడుతున్నారు. ఆ విషయం నాతో నువ్వెప్పుడూ చెప్పలేదేం?" అని అడిగింది.

ఈ మాట అనటంతోనే సుందరి చకితురాలైంది. యజమానురాలడిగిన యీ మాటకు సమాధాన మేమిచెప్పాలో సుందరికి తోచలేదు. అయినా, ఒక్క-క్షణంలో తనను తాను సంబాళించుకుని....

"నే నక్కడికి వెళ్ళి మాట్లాడివచ్చానని, నీతో యెవరన్నారమ్మా?" అని అడిగింది.

"నాతో ఎవరూ చెప్పకపోయినా, నే నెరుగుదును. నాకు ఇంకా కళ్ళూ, చెవులున్నాయ్. ని న్నెంత బహుమానం దొరికింది? పది రూపాయలు కదూ?"

సుందరి విస్మయంతో కొయ్యబారిపోయింది. పొయ్యిలోని మంట వెలుగులో—సుందరి ముఖంమీద విషాదఛాయలు విరాజ్ చూడగలిగింది.

చిరునవ్వు తెచ్చిపెట్టుకుని విరాజ్ "సుందరీ! నువ్వు నా ముందు నోరువిప్పేందుకు భయపడుతున్నావు. కాని, అనవసరంగా ను వ్వక్కడి కెందుకు వెళుతూ వస్తున్నావో నాకు తెలియడంలేదు. నీకిప్పుడు డబ్బు దొరుకుతుందని సంతోషంగా వుండవచ్చు. కాని ఈ డబ్బువల్లనే చివరి కొక పెద్దమనిషి కోపానికి గురికావాల్సివస్తుంది. ను వ్వింక రేపటినుంచీ, యీ ఇంట్లో కాలుపెట్టవద్దు. ఆఖరికి నువ్వు ముట్టుకున్న నీళ్ళతో కాళ్లు కడుక్కున్నా పాపాలు చుట్టుకుంటాయి. మొట్టమొదట నీ విషయం తెలుసుకోలేకపోయాను. రెండు రోజుల క్రితం అంతా విన్నాను....పైట వెంగున కట్టుకున్న ఆ పదిరూపాయలనోటు తిరిగి ఇచ్చిరా! ఆ నోటు ఇచ్చి వచ్చి ఒక బీదవాడి బిడ్డలాగ కష్టపడుతూ వొళ్లువంచి పనిచేసుకుని, మిగిలిన జీవితమంతా గడుపు. వయసులో బాగా వున్నప్పుడు చేయవలసినవన్నీ, చేశాక యిక ఆ వయసు తిరిగిరాదు. అయినా నీలానే యితరుల జీవితంకూడా నాశనంచేయవద్దు" అని చెప్పింది.

సుందరి ఏదో చెపుదామనుకుంది. కాని మాట పెగలలేదు.

విరాట్ ఇదికూడా చూసి "అబద్ధము చెప్పినంతమాత్రంలో ప్రయోజన మేమీలేదు. ఈ సంగతులన్నీ నే నెవరితోనూ చెప్పను. నీకొంగున కట్టుకున్న ఆ పదిరూపాయలనోటు యెక్కడిదో ముందు గ్రహించలేక పోయాను. వెళ్లు. రేపటినుంచి. నువ్వు యీ యింట్లో కాలు పెట్టవద్దు" అన్నది.

విస్మయంతో సుందరి అలానే కూర్చుండిపోయింది. ఈ యింట్లో తన నౌక రిలా వూడిపోతుందని ఆమె యెప్పుడూ అనుకోలేదు. సుందరి యీ ఇంట్లో ఎంతోకాలంనుంచి పనిచేస్తూవుంది. ఆమె యీ యింట్లో నౌకరీ చేస్తున్నప్పుడే విరాట్‌కు వివాహమైంది. హరిమతి పుట్టింది. నీలాంబరుడి తల్లి తనతోపాటు తీర్థయాత్రలకు యీమెనుకూడా వెంట తీసుకొని వెళ్ళేది. ఈ విధంగా యీ కుటుంబములో మనిషిగా ఆయి సుందరి జీవితం స్థిమితపడుతుంది. అటువంటి సుందరిని యీనాడు విరాట్ యింట్లో అడుగుపెట్టేందుకే నిరాకరించినప్పుడు క్షోభావమానములు గొంతువరకు త్రోసుకువచ్చినయ్. ఆమె అంతరాత్మలో న న్నీవిధంగా వెళ్ళగొట్టడం నీ మంచికి కాదని చెప్పేవరకూ వచ్చింది. కాని చెప్పలేక ఊరుకుంది. విహ్వాలదృష్టితో ఆమె విరాట్‌ముఖంలోకి చూస్తూ ఊరుకుంది.

విరాట్ కూడా అన్ని విషయాలు మనసులోనే ధృవపర్చుకుంది. కాని యేమీ మాట్లాడలేదు. ముఖం త్రిప్పి చూసేసరికి, పాత్రలోని నీరు యిగిరి ఊరుకున్నాయి! దగ్గరలోని ఇత్తడి బిందెనిండా నీళ్ళున్నాయ్. గ్లాసు తీసుకుని దానిదగ్గరకు వెళ్ళి వంచబోతూ యేదో ఆలోచించి, ఆ గ్లాసు క్రిందపెట్టి, "కాదు, నీచేత్తో ముట్టుకున్న నీళ్ళుకూడా ఆయనకు అశుభాన్ని కలుగచేస్తాయ్. యే చేత్తో నీళ్ళు తెచ్చావో ఆ చేత్తోనే నువ్వా డబ్బు తీసుకున్నావు" అంది.

తిరస్కార పూరితమైన యీ మాటలకు సుందరి జవాబేమీ చెప్పలేదు.

విరాట్ ఇంకొక లైటు వెలిగించి, ఒక చేత్తో అదీ, రెండోచేత్తో బిందె పుచ్చుకుని, గాఢాంధకారంలో, ఆ మామిడితోటమధ్యనుంచి నీళ్ల

తెచ్చేందుకు నదికివెళ్ళింది. విరాజ్ వెళ్ళాక తనుకూడా వెనుక వెనకాలే వెళ్దామని సుందరి అనుకుంది. కాని, నది వొడ్డున వుండే భయంకర దృశ్యాలు గుర్తుకు వచ్చేసరికి ఆమెకు భయం కలిగింది. ఆప్రదేశమంతా కన్ను పొడుచుకున్నా కనిపించక, కటికచీకటి తాండవమాడుతూ వుంటుంది. రెండవది ముళ్ళపొదల మధ్యనుంచి వెళ్ళాలి, నాల్గువేపులా ప్రహరీగోడలతో తెలిసీ తెలియని మనుష్యుల సమాధులెన్నో ఆ పెద్ద మర్రివృక్షముక్రింద తెల్లగా కనుపిస్తుంటయ్. నఖశిఖపర్యంతము. భయముతో వణికి "బాబోయ్" అని అక్కడే కూర్చుంది.

# 5

రెండు రోజులు గడిచాక నీలాంబరుడు "యేం విరాజ్! సుందరి కనుపించడంలే దెందుకని?" అని అడిగాడు.

"నేనే దాన్ని వద్దన్నాను"

భార్య అన్న యీ మాటలను నీలాంబరుడు నమ్మలేక, నవ్వు లాటకు అన్నదేమో ననుకుని "నువ్వు మంచిపని చేశావు. ఇంతకూ దానికి వచ్చిందేమిటి?" అని అడిగాడు.

"దాని కేమొస్తుంది! నిజంగానే దాన్ని మాన్పించాను"

యీ మాటల్నికూడా నమ్మలేక విస్మయంతో—"దాన్ని, నువ్వెం దుకు మాన్పించావు?—ఒకవేళ యేదైనా తప్పుపని చేసినా, దాన్ని మాన్పించకూడదు. అది మన యింట్లో ఎంతకాలమునుంచి పనిచేస్తూందో నీకు తెలియదు! మన ఇంట్లోంచి వెళ్ళగొట్టవలసినంత తప్పేం జేసింది?" అని అడిగాడు.

"నే నవన్నీ ఆలోచించే మాన్పించాను. అలా మాన్పించడమే నాకు మంచిదనిపించింది."

"ఆ మంచేమిటో కొంచెం నాకు చెప్పు?"

విరాజ్ భర్త మనసుని కనిపెట్టి క్షణంసేపు ఆయన ముఖంలోకి చూసి "మాన్పిస్తే మంచిదనిపించింది. అందుకనే మాన్పించాను. ఒకవేళ దాన్ని మన యింట్లోనే ఉంచుకోవడం మంచిదని మీకుంటే దాన్ని

తిరిగి మీరే పనిలోపెట్టండి" అని ఆమె జవాబుకోసం ఎదురు చూడ కుండానే వంటింటిలో కెళ్ళింది.

విరాజ్ కోపంతో ఉందని గ్రహించి నీలాంబరుడు ఇంకేమీ మాట్లాడలేదు.

ఒక గంట గడిచాక బయటినుంచి, వంటింటి తలుపునానుకుని, నీలాంబరుడు "సుందరిసేమో నీవు పనిలోంచి మాన్పించావు. మరి యీ యింటి పనంతా యెవరు చేస్తారు?" అని అడిగాడు.

భర్త మాటలు విని, విరాజ్ నవ్వుతూ "మీరు" అన్నది. నీలాం బరుడు కూడా నవ్వుతూ "అయితే ఆ మసిపట్టిన పాత్రలు తోమి కడుగు తాను. ఇటు తీసుకురా" అన్నాడు.

విరాజ్ తన చేతిలో పట్కారును అవతలవుంచి, చేతులు కడు క్కునివచ్చి, భర్త కాళ్ళు స్పృశించి "మీ రిక్కడనుంచి వెళ్ళండి. మీతో పరిహాసంచేయడంకూడా కష్టమే. వింటేనే పాపంచుట్టుకునేమాటలు" అని అంది.

"ఈ మాటలు వింటేనే పాపం చుట్టుకుంటుందా? మరిం కేమిటంటే పాపం చుట్టుకోదో, అది నాకు తెలియదు విరాజ్?"

"మీ కన్నీ తెలుసు! ఒకవేళ తెలియకుండావుంటే చేయవలసిన పనులెన్నో వున్నా — యీ పాత్రలు తోముతానని మీరంటారా? ఆలస్యము చేయకుండా యికనైనా స్నానముచేసి రాండి, వంటకూడా తయారైంది"

నీలాంబరుడు గడపలోకూర్చుని "నిజంగా యీయింటి పనులన్నీ యెవరు చేస్తారో చెప్పు విరాజ్?" అని అడిగాడు.

"యిప్పుడు చేసేందుకు పనేముంది? హరిలేదు. మరిదికూడా వేరే వుంటున్నాడు. పనెక్కువ కావడానికి యిప్పుడు యింట్లో యెవరున్నారు? పని పాటలు ఏమీలేక నేను పగలంతా వ్యర్థంగా గడుపుతున్నాను. మీ రేమీ విచారించవద్దు. నాపనులేమైనా ఆగిపోయినప్పుడు మీతో తప్ప కుండా చెబుతాను."

"కాదు విరాజ్! యీ పనిని నేను నీలో చేయనీయను, యిసంతా పనివాళ్లు చేయవలసినపని. సుందరి తప్పేమీచేయలేదు. కేవలం కొంత ఖర్చు తగ్గుతుందని నువ్వు దాన్ని పనిలోనుంచి తీసివేశావు, నిజమే కదూ?"

"కాదు........మీ రనుకునేది నిజంకాదు? ఆమె తప్పుచేసింది"

"ఆమె యేంతప్పు చేసింది?"

"ఆ సంగతి నేను చెప్పను, కూర్చోకండి.... మీరు వెళ్ళి స్నానం చేసి రాండి" అని ఆమె వంటింటిలోకివెళ్ళి కొంచెంసేపు ఆగి మళ్ళీ వచ్చేసరికి నీలాంబరుడు అలానే కూర్చునివుండడం చూచి "మీరు వెళ్ళనేలేదా? యింకా కూర్చునేఉన్నారేం!" అని అడిగింది.

"వెళుతున్నాను. కాని, విరాజ్! ఇది నేను సహించలేను, నిన్ను ఊడిగం చేయనీయను"

"అయితే యేంచేస్తారో చెప్పండి?"

"నువు సుందరిని పనిలో వుంచకుంటే, ఇంకొక మనిషినివుంచు. వొంటరిగా ఎలా వుంటావు?"

"నేనెలావున్నా, యికనుంచి పనిమనిషినిపెట్టుకోను."

"కాదు—అలా వీలులేదు. నేను బ్రతికున్నంతకాలమైనా మానాభి మానాలు చూస్తుండాలి! పనిమనిషిని తీసివేసినసంగతి ఈ ఊళ్ళో ప్రజ లకు తెలిసినట్లయితే యేమంటారు?"

"ఊళ్ళోవాళ్ళు వింటే యేమంటారోననే భయం మీకుంది. నేను యింట్లో వంటరిదాన్ననీ, పనిపాటలు చేసుకోలేననీ, అంటున్నారే అది అబద్ధం తప్ప యింకేమీలేదు."

సంభ్రమాశ్చర్యములతో నీలాంబరుడు— "ఇది అబద్ధమేనా?" అని అడిగాడు.

"అవును అబద్ధమే! ఇప్పుడు నా కన్నిపనులూ తెలుసు. ఒకవేళ మీరు నాముఖం చూచి, నా సుఖదుఃఖాలను విచారించి నామాటలే విన్నట్ల యితే యీనా కింత కష్టముండేదికాదు."

"అయితే నేను నువ్వుచెప్పే యేమాటకూడా వినడంలేదా?"

"లేదు మీరు నామాట ఏమీ వినటంలేదు. నే నెప్పుడన్నా యేదైనా చెప్పినట్లయితే దాన్ని త్రోసివేస్తున్నారు. మీ రెప్పుడూ ఫలాని పని చేసినట్లయితే, సంఘంలో అపకీర్తి పాలవుతాననీ, పాపం సంక్ర మిస్తుందనీ ఆలోచిస్తారు. కాని, ఈ పని చేసేముందు, నా భార్యగతేమి టని మీరెప్పుడైనా ఆలోచించారా?"

'అయితే, నా పాపమూ, నీపాపమూ, ఒకటికాదా? నాకు అపకీర్తి వస్తే నీ కపకీర్తి కాదా?"

"చూడండీ! ఇవన్నీ పసిపిల్లలను మరపింపచూపే మాటలు. ఇటువంటి మాటలవల్ల సుఖదుఃఖాలు మరిచిపోయే అవస్థ ఇప్పుడు నాకు దాటిపోయింది" అని విరాజ్ ఓ క్షణం వూరుకుని, మళ్ళీ "మీ బుద్ధికి కేవలము మీ విషయమేకాని ఇతరుల విషయం ఆలోచించరు. ఈ నాడు నేనెంతో కష్టంమీద యీ సంగతి మీ ముందు చెప్పాల్సివచ్చింది. పని మనిషి చేయవలసినపని నా చేతులతో నేను చేస్తున్నానని మీకు అవ మానంగా వుంది. అయినా నా అదృష్టం బాగుండక రేపు మీకేమయినా ఒకవేళ అలా జరిగినట్లయితే పిడికెడు మెతుకులకోసరము నేను యిత రుల యింట్లో దాసీవృత్తి అవలంబించాలి."

"అటువంటప్పుడు, నా అవస్థ మీరు కంటితో చూడనూలేరు, చెవులతో విననూలేరు. అందువల్ల మీ కేవిధమైన సిగ్గుకూడా వుండదు. ఏవిధమైన విచారముకూడా వుండదు, అంతేనా?" అని అడిగింది.

నీలాంబరుడు దీనికికూడా జవాబు చెప్పకుండా కొంచెంసేపు తలొంచుకుని క్రిందకు చూస్తూ "నీమనసులో ఇలా నువ్వెప్పుడూ వూహించకూడదు; విచారక్లేశాలవల్ల నువ్వలా అంటున్నావు" అని అన్నాడు.

"నిజంగా ముందు నే నలానే ఊహించాను. కష్టాలు అనుభ వించందే కష్టమంటే ఏమిటో తెలియనట్లుగానే, కాలము గడచిపోయినట్ల యితే, పురుషుల మోహ మమత లేపీ పరిచయముకావు, అయినా భోజ

నాలు తయారై వున్నప్పుడు నే నిటువంటి పోట్లాటలు పెట్టుకోను. నేను చెప్పినట్లు చేయండి. వెళ్ళి స్నానంచేసి రాండి."

"వెళుతున్నాను" అని నీలాంబరుడు అలాగే కూర్చున్నాడు.

"మన హరికి పెళ్ళయి ఇప్పటికి రెండుసంవత్సరములు దాటింది. అంతకు ముందునుంచి ఇప్పటివరకూ జరిగిన సంగతులన్నీ నే నొక్క-టొక్క-టే గ్రహించాను. ఈ మధ్య మీరు నామాట వినడమేలేదు. నే నెప్పుడన్నా యేమైనా చెప్పినా, దాన్ని త్రోసి, మీ ఇష్టానుసారంగా చేస్తున్నారు. యజమానులు ఇంట్లో పనివాళ్ళు చెప్పిన ఒకమాటైనా వింటారు. కానీ, మీరు నా మాటే వినరు" అని విరాజ్ అన్నది.

నీలాంబరుడు ఏదో అనబోతూవుంటే ఆయనమాటలు వినకుండా విరాజ్ "వద్దు....వద్దు....నేను మీతో తర్కించను, మీతో వాగ్వివాదముచేయడం నాకు సిగ్గుగా వుంది. ఇకనుంచి నేను ఒక్క-మాటకూడా మీతో చెప్పనని నా ఇష్టదేవతమీద ఒట్టుపెట్టుకొని చెపుతున్నాను. మాటలు పెరగడంవల్ల ఈ మాటన్నా అనవలసివచ్చింది. లేకుంటే ఇటువంటి మాటలు మీకు వినిపించవలసినదాన్నికాదు. చిన్నప్పటి సంగతి ఒకటి జ్ఞాపకముందా? అవును, మీ కిప్పుడు గుర్తుండదు. తలనొప్పిగా వుండటంవల్ల నేను లోపల గడియవేసుకుని పడుకున్నాను. తలుపులు తెరవమని మీరు బయటనుంచి కేకవేశారు. చివరకు కొంచెంసేపయాక తలుపు తెరచాను. మీరు నన్ను కొట్టబోయారు. నాకు తలనొప్పిగా వుందన్నా మీరు నమ్మలేదు. అప్పుడుకూడా ఇలానే నావొంట్లో ఆరోగ్యము చెడిపోయినా, మీతో చెప్పనని ఒట్టువేసుకున్నాను. అప్పటినుంచీ ఇప్పటివరకూ, నావొట్టుకేమీ భంగమురాలేదు!" అని అన్నది.

నీలాంబరుడు ముఖం పైకెత్తడముతోనే ఇద్దరి చూపులు కలుసుకున్నాయ్; అతను, లేచివచ్చి విరాజ్ చేతులుపట్టుకుని ఉద్విగ్నుడై "కాదు విరాజ్! నీవంట్లో ఏమీ బావుండడములేదు. నీకష్టమేమిటో చెప్పు. ఇప్పుడైనా అనుమానమేమీ లేకుండా జబ్బేమిటో చెప్పు విరాజ్!" అని అడిగాడు.

మెల్లమెల్లగా చేతిని వదిలించుకునేందుకు ప్రయత్నిస్తూ..."వదలండి నొప్పిపుడుతుంది" అని అన్నది.

"నొప్పిగావుంటే వుండవచ్చు; ముందు నీ వొంట్లో ఎలావుందో చెప్పు"

"నావొంట్లో బాగానేవుంది. నాకేమీ వర్యాలేదు. నేను బాగానే వున్నాను"

"కాదు....నువ్వుచెప్పింది అబద్ధం; నీశరీరంలో యేదో జబ్బు ప్రవేశించి నిన్ను కృంగదీస్తోంది. నీ శరీరంలో యేజబ్బూ లేకుంటే ఇటు వంటి మాటలు అనవు; ఇటువంటి పరిస్థితుల్లోనే నిన్నెన్నిసార్లో క్షమాపణ కోరుకున్నాను"

"సరే. ఆవిషయం ఇంకొకనాడు మాట్లాడుకుందాం" అని విరాజ్ తన్నుతాను వదలించుకుని కొంతదూరంలో నిల్చుంది.

నీలాంబరుడు విరాజ్ మాటలోని అర్థాన్ని గ్రహించి ఇంకేమీ మాట్లాడకుండా రెండుమూడు నిముషాలుండి లేచి వెళ్ళిపోయాడు.

రాత్రి లైటువెలుతురులో కూచుని విరాజ్ వుత్తరం వ్రాస్తూంది. నీలాంబరుడు మంచంమీద పడుకుని, భార్యవేపు చూస్తూ "ఈజన్మలో నువ్వు తప్పుచేశావని, నీ శత్రువుకూడా అనలేడు. ఎందుకంటే నీచిన్న తనంనుంచీ. ఇప్పటివరకూ నీలో ఏతప్పూ కనిపించలేదు. అయినా పూర్వజన్మలో నువు యేదో తప్పు చేసివుంటావు. లేకుంటే ఇలా జరిగేది కాదు" అని అన్నాడు.

విరాజ్ ముఖమెత్తి "ఎలా జరిగేదికాదు?" అని అడిగింది—

"భగవంతుడు నీకు ఇంత అందమిచ్చి ఏ రాజాంతఃపురములోనో వుండే యోగ్యత కలిగించి, రాణీ హృదయంలాంటి హృదయ మిచ్చాడు" కాని—

"కాని యేమిటి?"

నీలాంబరుడు మాట్లాడలేదు. ఒక్కక్షణంసేపు చూచి విరాజ్ కొంచెం కోపంతో" భగవంతుడు మీ కి జ్ఞాన మెప్పుడు కలుగజేశాడు?" అని అడిగింది.

"కళ్ళూ—చెవులూ వున్న ప్రతి మానవునికి భగవంతుడు యెల్లప్పుడూ ఈ సంగతులు తెలుసుకునే జ్ఞానాన్ని ఇస్తూనే వుంటాడు."

"ఊ," అని విరాజ్ వుత్తరం రాయడంలో నిమగ్నురాలైంది. కొన్ని క్షణాలు గడిచాక నీలాంబరుడు "నీమాటలు నేనేమీ వినడంలేదని, నువ్వన్నావు. ఇది నిజమేనని అనుకుందాం. అయితే యిందులోని దోష మంతా నాదేనా?" అని అడిగాడు.

ముఖమెత్తి విరాజ్ "సరే! నా తప్పేదైనావుంటే చూపండి"

"నేను నీవల్ల తప్పుందని అనలేను. కాని యివాళ నేను నీకొక యదార్థమైన సంగతి చెపుతాను. నువ్వు నీతో యితరులనుకూడా సరి పోల్చుకోగలవు. నీలాంటి ఆడవాళ్ళెంతమంది నాబోటి మూర్ఖుల చేతుల్లో పడివున్నారో నువ్వాలోచించనేలేదు. నాబోటివాని చేతిలో పడడం నీ పూర్వజన్మలో చేసిన పాపమంటాను. లేనట్లయితే నీ జీవితము ఇటు వంటి కష్టాన్ని సహించవలసిందికాదు" అని అన్నాడు.

విరాజ్ మెదలకుండా వుత్తరం రాస్తూంది. ఈమాటకు జవాబు చెప్పకూడదని అనుకుంది. కాని, మనసుండబట్టలేక ముఖమెత్తి "అయితే, మీమాటలు విని నేను సంతోషిస్తానని మీరనుకుంటున్నారా?" అని అన్నది.

"ఏ మాటలు?"

"అదే, నేను రాజాగారి రాణికావలసిందనీ, పాపఫలమువల్ల మీచేతుల్లో పడ్డాననే మాటలువింటే నేను సంతోషిస్తాననుకున్నారు. అసలు అటువంటి మాటలనేవాళ్ళ ముఖము చూసేందుకు నా కిష్ట ముంటుందా?"

విరాజ్ కోపంతోవుందని, నీలాంబరుడు గ్రహించాడు. అస లామెకు కోపము వస్తుందని అనుకోలేదు. ఇప్పు డేమి చెప్పి ఆమెను శాంతింపచేయాలో అతనికి తోచలేదు,

"అందము-అందము—అందము అని వింటుంటే నా చెవులు గింగిర్లెత్తిపోతున్నయ్. నా అందాన్ని గురించి మాటాడుకునేవాళ్ళకు నా అందమే కనుపిస్తుంది కాబోలు. అయినా మీరు నాకు భర్త. మీతో వుంటూ యీ యింట్లోనే తిరుగుతూ నే వింత పెద్దదాన్నయాను. అటువం టప్పుడు మీరు నాలోని అందాన్నే చూస్తున్నారా కేవలం అందంగా వుండ

దమే నాలోని మహాత్మ్యమాయేమిటి? ఎందుకని మీ రిటువంటి మాట లంటున్నారు? నేను అందాన్ని ఆధారంగా చేసుకొని వ్యాపారము చేస్తున్నానా? లేకుంటే దానితో మిమ్మల్ని మోసం చేయాలని చూస్తు న్నానా?" అని అడిగింది.

భార్య ఉదంతాన్ని చూచి నీలాంబరుడు భయపడి, "లేదు—కాదు. అదికాదు" అని అన్నాడు.

భర్తను ఎక్కువ మాట్లాడనీయకుండా విరాజ్ "అదే నిజము. అందుకనే, నేను ఆనాడు నల్లటి మసిబొగ్గునైతే నన్నిలానే ప్రేమిస్తారా? అని అడిగాను. మీకు గుర్తుందా?" అని అడిగింది.

తలూపుతూ నీలాంబరుడు "ఉంది కాని అప్పుడు నువ్వు...." అని అంటూంటే భర్తమాట కద్దువడి విరాజ్ "అవును. నల్లటి దాన్నైనా, మీరు నన్ను పెళ్ళిచేసుకున్నారు. కనుక ప్రేమిస్తారని చెప్పాను. మంచి గృహస్థుల ఇంట్లో జన్మించి, మంచి గృహస్థుల యింటి కొచ్చాను. ఇటు వంటి మాటలు వింటే మీకు సిగ్గుకలగడంలేదూ? ఇదివర కెప్పుడన్నా ఇటువంటి మాటలన్నారా?" అని అన్నది.

ఈ మాట లంటుంటే విరాజ్ముఖం కోపముతో జేవురించింది. అది చూచి నీలాంబరుడు వచ్చి భార్యచేతులు పట్టుకున్నాడు.

ఒకానొకప్పుడు విరాజ్ "మీరు వచ్చి నా చేతులు స్పృశిస్తే నా కోపమంతా మాయమవుతుంది" అని చెప్పింది. ఇప్పు డా మాటలు గుర్తుకురావడంతో నీలాంబరుడు ఆ పనే చేశాడు.

విరాజ్ ఎడమచేత్తో కన్నీళ్లు తుడుచుకుంది. ఆ రాత్రి యిద్దరూ యెంతోసేపు మేలుకుని కూర్చున్నారు. ఇద్దరిమధ్యా యేవిధమైన సంభా షణలూ జరగలేదు. చప్పున భార్యవేపు ముఖం తిప్పి నీలాంబరుడు "ఇవా ళింత కోపంతో వున్నావేం విరాజ్?" అని అడిగాడు.

"ఈ మాటలన్నీ మీ రెందుకన్నారు?"

"నేను విన్నేమీ చెడ్డగా అనలేదే?"

"ఇంకా చెడ్డగా అనలే దంటున్నారా? ఇప్పు డన్నవన్నీ చెడ్డవి కావా? అందుకనే నేను సుందరిని...." అని అంటూ అంటూ విరాజ్ ఆగిపోయింది.

"ఈ అపరాధానికే నువ్వు సుందరిని వెళ్ళగొట్టావా?"

'ఊ' అని "చూడండి మీరు నన్ను పదేపదే అడుగకండి. నేను పాలుతాగే పిల్లనుకాను. మంచి—చెడ్డలు తెలుసుకునే జ్ఞానం నాకుంది. సుందరి మనం మాన్పించతగిన నేరమే చేసింది. అందుకనే నేను దాన్ని మాన్పించాను. ఎందుకని వెళ్ళగొట్టానో, దాని వృత్తాంత మేమిటో మగ వారైన మీరు వినకుండావుంటేనే చాలా మంచిది" అన్నది.

"లేదు, అవన్నీ యిప్పుడు వినాలనిలేదు" అని నీలాంబరుడు ఒక ప్రక్కకు తిరిగి పడుకున్నాడు.

తమ్ముడైన పీతాంబరుడు వేరుపడిన నాలుగైదు రోజుల తరువాత యింటి మధ్యలో కొన్ని కర్రలు పాతి....వాటికి తడికలు అడ్డంగా కట్టి తన వాటాను వేరుచేసుకున్నాడు. అంతే కాకుండా దక్షిణవుపైపున తలుపు పెట్టించుకుని ఓ గదిలా ఏర్పాటుచేసుకుని వెల్ల వేయించుకున్నాడు.

ఈ విధంగా అతను తన కాలాన్ని సద్వినియోగం చేసుకున్నాడు. పీతాంబరుడు అన్నగారితో అసలే తక్కువగా మాట్లాడేవాడు. ప్రస్తుతము అన్నగారితో ఆ సంబంధముకూడా లేదు. ఇటు విరాజ్ పగలంతా ఒంటరిగా గడిపేది. సుందరిని మాన్పించినప్పటినుంచీ యింటిపనులన్నీ స్వయంగా తనే చేసుకుంటోంది. పనిమనిషి చేయవలసిన పనులన్నీ, సిగ్గుతో యితరుల కంటికి కనుపించకుండా, రాత్రి చాలా ప్రొద్దుపోయే వరకూ చేస్తూ మేలుకుని వుండేది.

ఒకనాటి సంగతి; విరాజ్ రాత్రిపూట ఇంటిపనులన్నీ చేసుకుంటూ వుంది. అకస్మాత్తుగా అవతలిభాగంలోంచి "అక్కయ్యా! చాలా ప్రొద్దు పోయింది" అనే కరుణపూరితమైన స్వరం వినిపించింది.

త్రుళ్ళిపడి విరాజ్ ముఖం పైకెత్తింది.

మళ్ళీ "అక్కయ్యా! నేనే మోహినిని" అని వినిపించింది.

ఆశ్చర్యంగా విరాజ్ "ఎవరూ? చిన్నకోడలా? ఇంత రాత్రప్పుడా?" అని అడిగింది.

"అవు నక్కయ్యా, నేనే! కొంచెం దగ్గరకు రా!"

విరాజ్ తడికదగ్గరకు వెళ్ళింది—

"అక్కయ్యా! బావగారు నిద్రపోతున్నారా?" అని చిన్నకోడలు అడిగింది.

"ఊఁ!"

"నీతో ఒకమాట చెపుదామనుకుంటున్నాను అక్కాయ్! కాని చెప్ప లేకపోతున్నాను" అని మోహిని వూరుకుంది.

ఆ కంఠస్వరాన్నిబట్టి ఏడుస్తోందని విరాజ్ గ్రహించి "ఏం జరిగింది చెల్లీ?" అని అడిగింది.

మోహిని జవాబు చెప్పలేకపోయింది. కొంగుతో కన్నీళ్లు తుడుచుకుంటున్నట్లుంది.

"ఏం జరిగింది చెల్లీ?"

"బావగారిమీద దావా వేశారట. రేపే సమను జారీచేస్తారని విన్నాను. ఏం చేయా లక్కాయ్?"

విరాజ్ భయపడికూడా తనను తాను సంబాళించుకుని "సమను జారీఅయినంతమాత్రాన భయమెందుకు?" అని అడిగింది.

"భయము లేదా అక్కాయ్?"

"భయమేముంది? అయినా దావా ఎవరువేశారు?"

"బోలా ముఖర్జీ!"

విరాజ్ క్షణంసేపు మౌనంగా వుండి ఆతరువాత—"ఇప్పుడు సంగతంతా తెలిసింది. ఏమీ లేదులే! యీయనగారు ముఖర్జీకి కొంత దాకీ వున్నారు. దానికి దావా వేశాడు కాబోలు. ఇందులో భయమేమీ లేదు చెల్లీ" అని అంది.

ఆ తరువాత తోడికోడండ్రు ఇద్దరూ మౌనంగా వున్నారు. కొంచెం సేపయాక చిన్నకోడలు —"అక్కయ్యా! నీతో, నే నెప్పుడూ యెక్కువగా మాట్లాడియెరుగను. మాట్లాడేందుకు అర్హురాల్నికూడా కాదు. కాని ఇవాళ చెల్లిమాటొకటి వుంది, విని మన్నిస్తావా?" అన్నది.

"ఎందుకు మన్నించనమ్మా?"

"అయితే నీ చేయి యిటు చాపు"

విరాజ్ చేయిచాపింది. ఆ చేయి చాపడంతోనే, ఓ చిన్న హస్తము తడికెలోంచి బయటికొచ్చి, విరాజ్ చేతిలో ఓ బంగారుగొలుసు పెట్టింది.

ఆశ్చర్యముతో "ఇదేమిటి చెల్లీ! దీన్ని నే నేమిచేసుకోను?" అన్నది విరాజ్.

"దీన్ని తాకట్టుపెట్టిగాని, లేకుంటే అమ్మిగాని — ఆ ఋణము తీర్చండి."

మరిదిభార్య ఇంత ఉపకారము చేస్తుందని విరాజ్ కలలోకూడా అనుకోలేదు. ఆమె కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా విలుచుంది—

"అక్కాయ్! ఇక నేను వెళుతున్నాను." అని మోహిని అక్కణ్నుంచి వెళ్ళబోతుంటే, విరాజ్ "అప్పుడే వెళ్ళకు మోహినీ, ఒక్కమాట విను" అని పిల్చింది.

చిన్నకోడలు తిరిగివచ్చి "యేమి టక్కాయ్?" అని అడిగింది.

విరాజ్ తడికెలోంచి ఆ గొలుసును విసిరివేసి "ఛీ! యిటువంటి పని ఎప్పుడూ చేయకు" అని అన్నది.

దాన్ని మోహిని తీసుకొని "ఎందుకనక్కాయ్?" అని అడిగింది.

"ఈ సంగతి మీ ఆయనకు తెలిస్తే యేమవుతుంది?"

"ఈ సంగ తాయనకు తెలియదు"

"ఇప్పుడు కాకపోతే యింకో రెండు రోజులకు తెలుస్తుంది. అప్పుడేంగాను?"

ఈ సంగ తాయనకు ఏలా తెలుస్తుంది? పోయిన సంవత్సరము అమ్మ చనిపోతూ యీ గొలుసును చాటుగా నా కిచ్చింది. ఇంతవరకూ దాన్ని ఇతరుల కంటబడకుండా దాచిపుంచాను. ఇంతవరకూ నేను దాన్ని మెడలోకూడా వేసుకోలేదు. నీ కాళ్లు పట్టుకుంటాను. దీన్ని తీసుకో అక్కాయ్?"

ఆ దయార్ద్రికంఠాన్ని వినడంతోనే ఆమె కళ్ళవెంట నీళ్ళు జల జల రాలినయ్. నిశ్శబ్దంగా, ఆలోచిస్తూ ఊరుకుంది. "మా ఇద్దరి వివాహాలు ఒకఇంట్లోనే జరిగినయ్. ఇది మీ ఆత్మీయత. ఇంకా యే విధమైన

సంస్కారమూలేదు. అయినప్పటికీ మేమిద్దరమూ సానుభూతితో ఆత్మ త్యాగము చేయగలము. ఈ ఇంట్లో ఇద్దరు మగవాళ్లున్నారు. వాళ్ళిద్దరూ ఒక తల్లి కడుపునే పుట్టారు. కాని, వాళ్ళలో ఒకరికొకరు యెంత సాను భూతి చూపుకుంటున్నారు!" అనుకుని చివరకు చేత్తో కన్నీళ్లు తుడుచు కుంటూ "ఈ సంగతి నాకు చచ్చిపోయేంతవరకు గుర్తుంటుంది చెల్లీ! కాని ఇది నేను తీసుకోలేను. ఆడదానికి భర్తకు తెలియకుండా యే పనీ చేసే సాహసము వుండకూడదు చెల్లీ! ఈ విధంగా నీ గొలుసు నేను తీసుకుంటే మాకు పాపం చుట్టుకుంటుంది" అన్నది.

"నీ కసలు సంగతంతా తెలియదుకనుకనే నువ్విలా మాట్లాడు తున్నావు అక్కాయ్! నాకూ నీలానే కొన్ని ధర్మములున్నాయ్. ఈ లోకము నుంచి వెళ్ళిపోయిన తరువాత యమునిదగ్గర పాపపుణ్యాల పట్టికకు నే నేమని జవాబియ్యగలను?"

ఇంకొకసారి కన్నీళ్ళు తుడుచుకుని విరాజ్ తనను తాను సంబా ళించుకుని "చెల్లీ! నే నందరి హృదయాలూ గుర్తించాను. కాని ఇంత వరకు నిన్నే గుర్తించలేకపోయాను. అయినా మృత్యుకాలంలో నీవేమీ జవాబుదారీ కాలేవు; నీవు చెప్పదగినదేదో దాన్ని ఆ అంతర్యామే వ్రాసు కున్నాడు. వెళ్ళు చాలా ప్రొద్దుపోయింది. వెళ్ళి నిద్రపో" అని చెప్పింది.

ఈ మాటకు జవాబు చెప్పకముందే విరాజ్ గబగబా అక్కణ్ణుంచి బయలుదేరి ఆమె తన గదిలోకి వెళ్ళలేకపోయి, అంధకారముగావున్న వరండాలో, ఒకమూల పైటకొంగు పరుచుకుని పడుకుంది. బోలా ముఖర్జీవేసిన దావా విషయంలో ఆమెకు విచారమేమీ లేదు. కాని, మిత భాషిణి అయిన మరిదిభార్య మాటలకు ఆమె కళ్ళనీళ్లు కార్చింది. ఇంత కాలంనుంచి తనలాంటిహృదయంగల తోడికోడల్ని దగ్గిరనుంచుకునికూడా గుర్తించలేకపోయానే, అని ఆమె మనసు మధనపడుతూంది. ఈమెను గుర్తించేందుకు తనెప్పుడూ యెటువంటి ప్రయత్నముకూడా చేయలేదు. పరోక్షంగా, ఆమెను ఎప్పుడూ నిందించలేదు, కాని ఎప్పుడూ ప్రశంసించి కూడా యెరుగదు. మెరుపు చీకటిని నిమిషములో చీల్చి ఏవ ప్రకాశా న్నెంత తొందరగా భూమిమీద వ్యాపింపచేస్తుందో, విరాజ్ హృదయాని

చిన్నకోడలు చీల్చి ఆమె హృదయంలో తన నిర్మల ప్రకాశాన్ని బరపించి. ఆలోచించి, ఆలోచించి యేడ్చి యేడ్చి, విరాజ్ యెప్పుడు కళ్లు మూసు కుందో తెలియదు. గబుక్కున ఎవరిదో స్పర్శ తగలడంవల్ల లేచి కూర్చుంది. ఆమె తలదగ్గర నీలాంబరుడు కూర్చుని వున్నాడు.

"లోపలికి పద; చాలా ప్రొద్దుపోయింది" అని నీలాంబరుడు అన్నాడు.

విరాజ్ ఆశ్చర్యపడింది భర్తసాయంతో లోపలికి వచ్చి నిర్జీవంగా పడుకుంది.

# 6

ఒకసంవత్సరము గడిచింది.ఈ యేడు సాగుచేసిన పొలములో ధాన్యం రూపాయకు రెండణాలవంతుకూడా పండలేదు. ఏ పొలముసాయంలోనీలాం బరుని సంసారము సంవత్సరం పొడుగునా గడుస్తూందో, ఆ పొలము బోలాముఖర్జీ కొన్నాడు. ఉన్న ఇల్లునహా తాకట్టయింది. ఆ తాకట్టు పత్రము పీతాంబరుడు తన పేరుతో మార్పించుకున్నట్టుగా వెల్లడైంది.

దుక్కిటెద్దొకటి చనిపోయింది. చెరువు ఎండిపోయింది. ఎటు చూచినా, విరాజ్‌కు శూన్యం కన్పిస్తోంది. శరీరంలోని ఏదో శక్తి హీన మైన ఒక అవయవాన్ని గట్టిగా బిగించి కట్టినప్పుడు యేవిధంగా తిమ్మి రెక్కిపోతుందో, ఆవిధంగానే విరాజ్ సంసారము మెల్లిమెల్లిగా శిధిల మవుతూంది. అంతకుముం దామె యెప్పుడన్నా నవ్వుతుండేది. మాటల సందర్భంలో తన బుద్ధి నుపయోగించి ఇతరులను నవ్వించేది, కాని, ప్రస్తుతం మాట్లాడుదామన్నా ఇంట్లో యెవరూలేరు. దానితోపాటు తన ఇంటిసంగతు లెవరన్నా తెలుసుకోవాలని వచ్చినట్లయితే ఆమె సిగ్గుతో విసుక్కునేది.

ఈనాడుదయమే నీలాంబరుడు పోస్టాఫీసుకు వెళ్ళాడు. అక్కి ణ్ణుంచే తిరిగివచ్చి ఖిన్నభావంతో "హరి మామగారు ఉత్తరానికి జవాబు కూడా రాయలేదు. ఈసారికూడా నేను పూజాకాలంలో, చెల్లెల్ని చూడ లేకట్లుంది" అని అన్నాడు.

విరాజ్ ఈ సమయంలో ఏదో పనిలో నిమగ్నురాలై వుంది. పని చేస్తూనే ఒక్కసారి ముఖమెత్తి చూసి యేదో చెపుదామనుకుంది. కాని చెప్పలేక లేచి వెళ్ళింది.

ఆనాడు మధ్యాహ్నము భోజనముచేస్తూ చేస్తూ నీలాంబరుడు "నువ్వు హరిపేరు వింటేనే మండిపడుతున్నావు. అదేమన్నా నేరము చేసిందా?" అని అడిగాడు.

దగ్గరగానే కూచున్న విరాజ్ "నేను మండిపడుతున్నానని యెవరన్నారు?" అని అడిగింది.

"ఎవరు చెప్పాలి? నిన్ను చూస్తూంటేనే తెలుస్తూవుంది." క్షణం సేపు భర్తగారి ముఖంలోకి చూచి—

"అవును అలా చూసి తెలుసుకోవడమే మంచిది" అని వెళ్ళిపోతూంటే నీలాంబరుడు ఆమెను పిల్చి "సరేగాని, నువ్విలా దిగులుగా వుంటున్నావేం? చాలా ఇదిగా మారిపోయావ్?" అని అడిగాడు.

విరాజ్ గబుక్కునతిరిగి నిలుచుంది. భర్తఅన్నమాట ధ్యానపూర్వకంగా విని "మార్పువస్తే, మారక యేం చేస్తాము?" అని వంటింటిలోంచి వెళ్ళిపోయింది.

ఆ తరువాత మూడురోజులకు మూడోఝామున నీలాంబరుడు బయటవున్న హాలుదగ్గర కూర్చుని యేదో పాడుకుంటున్నాడు విరాజ్ వచ్చి ఆయన వెనకాల కొంచెంసేపు నిలుచుని, ఆ తరువాత ఎదుటికి వచ్చింది.

"ఏమిటి?" అని నీలాంబరుడు అడిగాడు. క్షణం చూడ్డంతప్ప ఆమె ఇంకేమీ జవాబు చెప్పలేదు.

నీలాంబరుడు ముఖం క్రిందకు దించుకున్నాడు. విరాజ్ "మళ్ళీ ఒక్కసారి మీరు ముఖమెత్తి చూడండి?" అన్నది.

నీలాంబరు డేమీ అనలేదు. భయంతో కొయ్యబొమ్మలా కూర్చున్నాడు. చిన్నతనమునుంచీ విరాజ్ అంటేనే నీలాంబరుడు భయపడేవాడు. దానిమీద ప్రస్తుతం వేడి తుపాకిమందు కుప్పకుప్పలుగా వుంది. అదెప్పుడు అంటుకుంటుందో?

కొన్ని క్షణాలు గడిచాక "ఇదే మంచిది. భంగు నలిపి, దమ్ము లాగి కూనిరాగాలుతీయడాని కిదే సమయం" అని విరాజ్ ఇంట్లోకి వెళ్ళింది. ఆనాడుకూడా గడిచింది.

ఆ మరునాడు నీలాంబరుడు వుండలేకపోయాడు. సిగ్గు విడిచి పీతాంబరుని బయటికి పిలిచి "హరి మామగారు నా ఉత్తరానికి జవాబు వ్రాయలేదు. నువ్వైనా ప్రయత్నించి చూడు; పూజాకాలములో రెండు రోజులపాటు చెల్లెల్ని ఇక్కడుంచుకొనటం మనకు చాలా మంచిది" అని చెప్పాడు.

అన్నగారి ముఖంలోకి చూస్తూ పీతాంబరుడు "నువ్వుండగా నేనెలా ప్రయత్నించను?" అని అన్నాడు.

ఈ మాటలు వినగానే నీలాంబరుని వళ్ళు మండింది. అయినా ఆ భావాన్ని కప్పిపుచ్చి—

"ఇదేమంత పెద్దసంగతి? హరి నా కెలా చెల్లెలో, నీకూ అంతే. నేను చచ్చిపోయాననుకో; అప్పుడు నువ్వు వంటరిగాడివేగా" అని అన్నాడు.

"నిజంకాని విషయాన్ని, నీలా నేను మనసులోనైనా వూహించను. పైగా వాళ్ళు నీ ఉత్తరానికి జవాబు వ్రాయనప్పుడు నాకు మాత్రం జవాబు వ్రాస్తారని యెలా నమ్మకము"

"అయితే నేను మాత్రము నిజముగాని సంగతులకే నా మనసులో స్థానమిస్తున్నా నన్నమాట? సరే అలాగే అనుకుందాం. ఈ విషయంలో యిక నేను నీతో వాదించను. హరి పెళ్ళిసమయంలో, నేను చెప్పిన షరతులను జరుపలేదని వాళ్ళు నా ఉత్తరానికి జవాబు వ్రాయలేదు. వాటి విషయంలో మాట్లాడేందుకు గాని, వాటిని పూర్తిచేయమని అర్థించేందుకు గాని నేను నిన్ను పిలువలేదు. నే నడిగేది చేస్తావా—లేదా? అనే నేను అడుగుతూంది?"

"లేదు. పెళ్ళి చేయకముందు ఈ విషయంలో నాతో ఏమన్నా ముందు మాట్లాడావా యేమిటి?"

"ఒకవేళ మాట్లాడివున్నట్లయితే ను వ్వేమి చేసేవాడివి?"

"ఏంచేస్తాను? మంచి సలహా యిచ్చేవాణ్ణి"

నీలాంబరుని హృదయం మండుతూంది. రెండు పెదిమలూ వణుకుతోన్నయ్। అయినప్పటికీ కూడా ఎలాగో సంబాళించుకుని —

"అయితే యిప్పు డీ విషయంలో మవ్వేమీ చేయలేవన్నమాట?" అని అన్నాడు.

"చేయకేమి. అదిగాక, ఆయన హరికి యెలాంటి మామగారో, నాకూ అలాంటి మామగారే! పైగా నాకంటే పెద్దవారు. హరిని పంపేందుకు వాళ్ళకిష్టము లేనప్పుడు, నేను వాళ్ళమాట కేమీ ప్రతికూలము చేయలేను."

పీతాంబరుని మాటలకు, నీలాంబరునికి చంపేద్దామన్నంత కోపం వచ్చింది. అయినా తనను తాను సంబాళించుకుని "నీవల్లేమీకాదు. లేచి వెళ్లు. నా ఎదుటనుంచి పో!" అని అన్నాడు.

"అనవసరంగా ఇంత కోపమెందు కన్నాయ్? ఒకవేళ నే నిక్కడ నుంచి కదలనంటే బలవంతంగా కదిలించగలవా?"

తలుపువేపు చూపుతూ పిచ్చికోపంతో "దెబ్బలు తిని చచ్చిపోవాలని లేకుంటే నా యెదుటనుంచి వెళ్లు" అన్నాడు నీలాంబరుడు.

పీతాంబరు డేదో అందామని అనుకుంటూ వుండగనే, నీలాంబరుడు "జాగ్రత్త! ఒక్కమాటకూడా బయటకు రానీయవద్దు. నా యెదుటనుంచి వెళ్ళిపో" అన్నాడు.

పల్లెటూరి వాతావరణంలో ఉంటున్నా నీలాంబరుని శరీరం శక్తివంతమైనదే! అందుకని పీతాంబరుడు యింకేమీ మాట్లాడకుండా బయటకు వెళ్ళాడు.

విరాజ్ ఇదంతా చూచి అన్నదమ్ము లిద్దరిమధ్యా పోట్లాట తప్పదని లోపల్నుంచి బయటకొచ్చి భర్తను లోపలికి లాక్కువెళ్ళి "ఛీ! ఛీ! అన్నీ తెలిసివుండికూడా మీరు తమ్మునితో పోట్లాడుతున్నారా?" అన్నది.

"తెలుసు కనుక కాళ్లూ చేతులూ ముడుచుకుని, కూచోమంటావా? నే నన్నీ సహించగలను. కాని లోభితనాన్ని సహించలేను విరాజ్!"

"కాని మీ రొక్కరే పరవాలేదుగాని, ఒకవేళ చేయిపట్టుకుని ఆయన మనల్ని యీ ఇంట్లోనుంచి బయటకు వెళ్లకొడితే అప్పుడెక్కడ వుంటారో చెప్పండి! మీ రా విషయం ఒక్కసారన్నా ఆలోచించారా?"

"లేదు. ఈ విషయంలో ఆలోచించవలసిన అవసరమున్నవారు ఆలోచిస్తారు. అనవసరంగా ఆలోచించి, నా మనసును కష్టపెట్టుకోను."

"మీ మాటలు నిజమే. ప్రపంచంలో పనులలోకల్లా, కేవలం మద్దెల వాయిస్తూ, మహాభారతము చదవడమే పనిగలవాళ్ళకు నిజంగా యీ విషయాన్ని గురించి ఆలోచించడం అనవసరమే!"

విరాజ్ అన్న యీ మాటలు నీలాంబరుని చెవుల్లో అమృతములా పర్షించలేదు. అయినా, స్వాభావికముగానే "ఈ పను లన్నిటికంటే అదే గొప్పదని నేను నిస్సందేహంగా ఒప్పుకుంటాను. అదీగాక నిరంతరము ఈ సంగతిని గురించి ఆలోచిస్తూ కూర్చుంటే మన నుదుటవ్రాసిన వ్రాత తప్పుతుందా?" అని నొసలుచూపి కొంచె మాలోచించి 'చూడు విరాజ్! ఇక్కడే బ్రహ్మ మన సుఖ దుఃఖాల్ని మంచి చెడ్డల్ని ముందే వ్రాసి వుంచుతాడు. ఈ కారణంతోనే ఎంతోమంది రాజులూ, మహారాజులూ, చెట్లక్రింద భిక్షుకుల్లాగ గడపవలసివచ్చింది. ఇక నే నంటావా ఒక తుచ్ఛమైన వ్యక్తిని!" అన్నాడు.

విరాజ్ కోపంతో మండిపోతూ "ఇవన్నీ చెప్పినంత తేలిగా సమయమొచ్చినప్పుడు ఆచరించడ మంత తేలికకాదు. అదీగాక, మీరు చెట్లక్రింద వుంటే వుండవచ్చు. కాని నేనుమాత్రం వుండలేను. నేను ఆడదాన్ని. నాకు సిగ్గెగ్గులనేవి వుంటాయి. సంతోషంగావున్నా, దుఃఖంలో వున్నా, నాకు కొంప అనేది ఒకటి వుండాలి. మీరు మీ తమ్ముణ్ణి ముఖ స్తుతి చేయకపోయినా భయములేదు. కాని, మీరు ఆయనతో చేయి చేయి కలిపి బజారుకు యెక్కకుండావుండేట్లు సంబాళించుకోవాలి. ఇటువంటి పొరపాట్లుచేసి మీరు అన్నివిధాల మిమ్మల్ని సర్వనాశనం చేసుకోకండి" అని విరాజ్ కళ్ళనీళ్లు తుడుచుకుని యింట్లోకి వెళ్ళిపోయింది.

ఇంతకు ముందు నీలాంబరుడూ, విరాజ్ యెన్నో మాటలు అను కునేవారు. భార్యాభర్తలు ఎన్నో విషయాలను గురించి వాదించుకునేవాళ్లు.

నీలాంబరుడు ఆ దృశ్యాలన్నీ మర్చిపోలేదు. అయినా, యీనాడు జరిగింది మాత్రం వాదము, కలహము కాదు. విరాజ్ ఈనాడు నీలాంబరునికి క్రొత్తగా కనిపించింది. ఇంతకు ముందెప్పుడూ ఇటువంటి మూర్తిని అతను చూడలేదు. అందువల్ల ఆశ్చర్యంతో నుంచుని వుండిపోయాడు.

కొన్ని నిముషాలు గడిచాక, విరాజ్, మళ్ళీ ఆ గదిలో ప్రవేశించి "యింకా అలానే నిలుచున్నారేం? మధ్యాహ్నమైంది. వెళ్ళి స్నానమూ, సంధ్యావందనముచేసి భోజనముచేయండి. తిండి దొరుకుతున్నంత కాలము దాగానే వుంటుంది" అని భర్త హృదయంలో మరింత చిచ్చుపెట్టి వెళ్ళింది.

గదిలో గోడమీద రాధాకృష్ణుల పటము వ్రేలాడుతూంది. ఆ పటముకేసి చూస్తూ విరాజ్ యేడ్చింది. ఈ యేడ్పు యెవరైనా చూస్తారేమోననే భయంతో కళ్ళు తుడుచుకుని గదిలోంచి బయటికెళ్ళింది.

ఆనాడంతా విరాజ్ యేడుపుతోనే గడిపింది. ఆమె కళ్ళవెంట నీళ్ళు కాలవలుకడుతున్నాయ్. తను కొంచెం కష్టపడితే చాలు, వ్యాకుల పడే భర్తని తెలియని కోపంతో అనిన ఆ మాటలకు ఆమె హృదయం దుఃఖంతో పొంగిపొరింది, ఆనాడంతా ఆమె, నోట వచ్చి నీళ్లుకూడా తాగలేదు. ఏడుస్తూ ఆ గదిలోంచి యీ గదిలోకి ఈగదిలోంచి ఆ గదిలోకి వ్యర్థంగా మతిలేనిదానిలా తిరుగుతూవుంది. చివరకు చీకటిపడుతుండగా, తులసిచెట్టుకు దీపారాధనచేసి, మెడలో పైటకొంగువేసుకుని భూమిమీద పడుకుని. నమస్కరిస్తూ వెక్కి వెక్కి యేడ్చింది.

ఆ సమయంలో యింట్లో యెవరూలేరు. చుట్టూ ఎంతో యిదిగా నిశ్శబ్దము తాండవిస్తూంది. నీలాంబరుడు ఇంట్లో లేడు. మధ్యాహ్నము పన్నెండగ్గర లూర్చుని లేచివెళ్ళాడు. అప్పుడు వెళ్ళిన వెళ్ళడం ఇంతవరకూ ఇంటికి తిరిగిరాలేదు,

ఈనాడు విరాజ్ మనసు యే పనీ చేయసాహసించడంలేదు. ఏం చేయాలో, యెక్కడికి వెళ్ళాలో, యెవరితో యేమి చెప్పుకోవాలో కూడా తెలియడంలేదు. చివరి కేఉపాయమూతోచక చీకటిగావున్న పెరట్లో బోర్ల పడుకుని, వెక్కి-వెక్కి యేడుస్తూనే "అయ్యో భగవంతుడా! ఒక్కసారి

కన్నెత్తి చూడు—ఇంతవరకూ యే అపరాధమూ పాపమూ యెరుగని వ్యక్తినింత కష్టపెట్టడం నేను చూచి సహించలేను" అంది.

అప్పటికి రాత్రి తొమ్మిదిగంటలైంది. నీలాంబరుడు తిరిగి ఇంటికి వచ్చి మెదలకుండా మంచంమీద పడుకున్నాడు. భర్త ఇంటికి వచ్చాక విరాజ్ లేచి, గదిలోకివెళ్ళి ఆయనపాదాలవద్ద కూర్చుంది. నీలాంబరు డామెవేపు చూడలేదు. ఏమీ మాట్లాడలేదు.

కొంచెంసేపయాక విరాజ్ ఒకచేతితో భర్తపాదము ముట్టుకుంది. నీలాంబరుడు కాళ్లు ముడుచుకున్నాడు. పోయిన అభిమానం మళ్ళీ గుర్తు వచ్చినట్లు యేకమైంది. అయినప్పటికి "అన్నం తిందురుగాని పదండి" అని అన్నది;

నీలాంబరుడు మాట్లాడలేదు.

"ప్రొద్దుటినుంచి ఏమీ తినలేదు. ఎవరిమీద కోపంతో మీరు అన్నం తినకుండావుంటారో చెప్పండి."

ఆ మాటకుకూడా నీలాంబరు డేమీ జవాబు చెప్పలేదు.

"మాట్లాడరేం? ఏమైనావుంటే చెప్పండి తెలుసుకుంటాను."

"తెలుసుకున్నంత మాత్రాన ఏమవుతుంది?"

"అయినా తెలుసుకోవాలి"

అకస్మాత్తుగా నీలాంబరుడు లేచి కూర్చుని తన రెండు కళ్ళూ పెద్దవిచేసి, "నేను నీకు పూజ్యుడను విరాజ్! ఆటబొమ్మనికాను. ఈ సంగతైనా తెలుసా?" అని అన్నాడు.

ఆ కళ్ళకు, కంఠధ్వనికి విరాజ్ భయపడి చకితురాలై, నిశ్శబ్దంగా కూర్చుంది. ఇంత గంభీరమైన కంఠస్వర మామె యెప్పుడూ వినలేదు.

# 7

"మగరార్‌గంటి"లో ఇత్తడిబిందెలు చేసే కార్ఖానాలున్నాయి. సప్తగ్రామములోని తక్కువజాతివాళ్లంతా మట్టితో మూసలుచేసి, అవి అక్కడ అమ్ముకొని వస్తుంటారు. ఇంటి ఖర్చులు గడవటంలేదని విరాజ్ తెలుసుకుని వేరే గత్యంతరములేక ఆ కార్ఖానా స్త్రీ నొకదాన్ని పిల్చి

మూసలుచేయడం నేర్చుకుంది. విరాజ్ బుద్ధి మహాతీక్షణంగలది. ప్రతి పనిలోనూ మంచి తెలివితేట లున్నందువల్ల మూసలుచేయడం రెండు రోజుల్లోనే నేర్చుకుని, యితరులకంటె మేలైన రకాలు తయారుచేయడం ప్రారంభించింది. వ్యాపారస్థులంతా ఆ మేలు రకాలే కొనుక్కొని వెళ్ళే వాళ్లు. ఈ విధంగా ప్రతిరోజూ యెనిమిది పదణాలు కష్టపడి సంపాదించేది. కాని సిగ్గుతో భర్తకు తెలియనిచ్చేదికాదు. రాత్రి పొద్దుపోయిన తర్వాత, భర్త నిద్రపోయాక లేచివెళ్ళి మూసలు చేస్తుండేది. ఈనాడు కూడా ఆవిధంగానే లేచి వచ్చి మూసలుచేసేందుకు కూర్చుంది. ఒంట్లో నీరసంగా వున్నందువల్ల మూసలుచేస్తుంటేనే నిద్రవచ్చింది. సంయోగ వశాత్తు నీలాంబరునికి నిద్ర మెలకువరావడంతోనే మంచంమీద విరాజ్ లేకపోవడం చూచి, బయటికి వచ్చాడు.

విరాజ్ నేలమీద పడుకుని, నిద్రపోతూవుంది. ఆమె రెండు చేతులకు తడి మట్టి అంటుకునివుంది. ఆమెకు చుట్టుప్రక్కల మరబొమ్మలు చేసే మూసలు వున్నయ్. మంచుతో ఆమె శరీరం తడిసిపోయి వుంది.

అప్పటికి మూడురోజులనుంచి, భార్యాభర్తలమధ్య మాటలులేవు. అయినా భార్యస్థితి చూచి, నీలాంబరుడు వుండలేకపోయాడు. కన్నీళ్ళతో అతని కళ్లు నిండినయ్. అతను వెంటనే కూచుని నిద్రపోతూన్న భార్య తలను ఒడిలోకి తీసుకున్నాడు. విరాజ్ కిది తెలియదు. ఒకసారిమాత్రం అటుయిటు కదిలి కాళ్లు చాపుకుని పడుకుంది. నీలాంబరుడు యెడమచేత్తో తనకళ్లు తుడుచుకుని కుడిచేతితో దీపంవత్తి పెద్దదిచేశాడు. "ఇలా అయిపోయిందేమిటి? ఇన్ని రోజుల్నుంచీ నా దృష్టికి యీ సంగతి రానేలేదు. విరాజ్ కనుకొలకుల్లో నల్లదనం యేర్పడింది. అందమైన లలాటంమీద అనేక చింతలుగల రేఖలు స్పష్టంగా కనుపిస్తున్నయ్. భార్యస్థితి చూడగానే, నీలాంబరుని హృదయంలో ఒకవిధమైన ఆవేదన అలముకుంది. తనను తాను వూరడించుకునే బల మిప్పుడు అతనిలో లేదు. ఓ పెద్ద కన్నీటి చుక్క అతని కళ్ళల్లోంచి జారి విరాజ్‌ముఖంమీద పడింది. విరాజ్ కళ్లు తెరచింది. కొన్ని క్షణాలు నీరసంగా భర్త వేపు చూసి, ఆతరువాత రెండు చేతులూ భర్త మెడకు పెనవేసి, మెల్లిగా ఆయన

ఒడిలో ముఖం దాచుకుంది. నీలాంబరుడు కూచుని అలాగే యేడు
స్తున్నాడు.

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడిచిపోయినయ్. భార్యా భర్తల
మధ్య యేవిధమైన సంభాషణా రాలేదు. రాత్రి గడిచి, తూర్పున ఆకాశము
స్వచ్ఛము కాబోతున్నప్పుడు నీలాంబరుడు తనను తాను సంభాళించుకుని_
"ఆ మంచులో పడుకోకు విరాజ్. లోపలికి పద" అన్నాడు.

"పదండి"

విరాజ్ లేచి భర్తసాయముతో లోపలికి వచ్చి పడుకుంది.

ఉదయాన నీలాంబరుడు "విరాజ్, నువ్వొకసారి, మీ మామగారిం
టికి వెళ్ళిరా. నేను కొంతకాలము కలకత్తాలో వుండాలనుకుంటున్నాను"
అన్నాడు.

"కలకత్తాలో అనేకవిధాలయిన వ్యాపారా లుంటాయ్. నేనక్కడ
యేదో ఒక వ్యాపారంచేస్తాను. అందువల్ల నా మాటవిని కొన్నాళ్ళపాటు
మీ మామగారింటికి వెళ్ళి వుండిరా."

"నన్నిక్కడికి తిరిగి యెన్నిరోజులకు పిలవనంపుతారు?"

"ఆర్నెల్లకు తప్పకుండా పిలిపిస్తాను"

"సరే" అని విరాజ్ ఒప్పుకుంది.

నాలుగైదురోజులయాక ఒంటెద్దుబండి వచ్చింది. విరాజ్ మామ
గారిల్లు 'సప్తగ్రామానికి' పదిక్రోసులదూరం వుంటుంది. అక్కడికి
వెళ్ళేందుకు వొంటెద్దుబండితప్ప మరొక ఆధారం లేదు. బండేమో
వచ్చింది, కాని, విరాజ్ పద్ధతిమాత్రము ప్రయాణానికి సంసిద్ధమైనట్లు
లేదు.

నీలాంబరుడు ఆరాటపడుతున్నాడు. ఆలస్యము చేయడం మంచిది
కాదని విరాజ్‌కు నచ్చచెప్పుతున్నాడు.

విరాజ్ తన ఇంటిపనులు చేసుకుంటూ "ఇవ్వాళ మాత్రం నేను
వెళ్ళలేను. నా వొంట్లో ఏమీ బావుండలేదు" అన్నది.

నీలాంబరుడు ఆశ్చర్యంతో "ఏమిటి? వంట్లో ఏమీ బాగాలేదా?"
అని అడిగాడు.

"అవును ఒంట్లో ఏమీ బాగుండలేదు" అని యిత్తడిబిందె పట్టుకుని నీళ్ళకోసము నదిచేపు వెళ్ళింది.

ఆరోజు బండి వెళ్ళిపోయింది. రాత్రి చాలాసేపు బ్రతిమిలాడి మళ్ళీ ఒప్పించాడు. మళ్ళీ మూడోనాడు బండి సిద్ధమైంది.

నీలాంబరుడు ప్రయాణానికి తగిన సరంజామా యేర్పాటుచేయమని చెప్పాడు. ఆమాట వినడంతోనే ఆమె "కాదు, నే నక్కడికి వెళ్ళను" అన్నది.

"ఏం? ఎందుకని వెళ్ళవు?"

విరాజ్ యేడుస్తూ "కాదు. నేను వెళ్ళను. నావద్ద నగ లెక్కడున్నయ్. గుడ్డ లెక్కడ వున్నయ్? నే నొక దిక్కులేని నిర్ధనురాలిగా, దుఃఖితురాలిగా వెళ్ళలేను" అని అన్నది.

నీలాంబరుడు కోపముతో "ఇప్పుడు నీదగ్గర నగలు లేవన్నమాట నిజమే. అవి వున్నప్పుడు మాత్రం దృష్టి మరల్చి, నువ్వెప్పుడన్నా అటు ప్రక్కకు చూశావా?" అని అడిగాడు.

విరాజ్ మెదలకుండా కన్నీళ్ళు తుడుచుకుంది. నీలాంబరుడు "నువ్వు ఈ నెపాన్నెందుకని ఆరోపిస్తున్నావో నాకు తెలుసు. మనసులో నాకు సందేహంగానే వుంది. ఇంత దుఃఖ మనుభవించాక, నీబుద్ధి సరైన త్రోవకు వచ్చిందనుకున్నాను. కాని యిప్పు డలా కనిపించడంలేదు. మంచిదే, నువ్వుకూడా శుష్కించి ప్రాణాలు వదలు. నేనూ అలానే చస్తాను" అని నీలాంబరుడు వచ్చినబండిని పంపించాడు.

మధ్యాహ్నము నీలాంబరుడు పడుకున్నాడు. పీతాంబరుడు పని మీద బయటి కెళ్ళాడు. చిన్నకోడలు తడిక దగ్గర్నుంచి విరాజ్‌ను పిల్చి "అక్కాయ్, క్షమించాలి. నీకు చెప్పేంత యోగ్యత నాకులేదు అయినా, రెండురోజులు అక్కడి కెందుకు వెళ్ళగూడదు?" అని అన్నది.

విరాజ్ మౌనంగా ఊరుకుంది. "బావగార్ని యింట్లో వుంచవద్దు అక్కాయ్? ఇవి కష్టపురోజులు. ఒక్కసారి మనసు నిలబెట్టుకో; రెండు రోజులు పోయాక భగవంతుడే చూస్తాడు" అని అంది.

"నేను మనసు నిలబెట్టుకునే వున్నాను చెల్లీ"

"అయితే మీ మామగారింటికి వెళ్ళక్కాయ్. ఆయననుకూడా మగవానిగా నాలుగు డబ్బులు గడించుకోనియ్. కొద్ది రోజుల్లోనే భగవంతుడు మిమ్మల్ని చల్లగా చూస్తాడని నాకు నమ్మకంగావుంది."

విరాజ్ ముఖమెత్తి యేదో చెపుదామనుకుంది. కాని చెప్పలేక తల క్రిందకు దించుకుంది.

"వెళ్తావుకదూ?"

ఇక సమాధానం చెప్పకుండా వుండలేక విరాజ్ తలూపుతూ "వెళ్ళలేను ప్రొద్దున్నే నిద్ర మెలుకువరాగానే వారిముఖం చూడందే వుండలేను. అందుకనే చేతకాని పని చేయమని నన్ను బలవంతం చేయకమ్మా" అని చెప్పి వెళ్ళబోతూంటే....చిన్నకోడలు కోపంతో "వెళ్ళకు అక్కాయ్.... ఇక్కడ్నుంచి నువ్వు కొన్ని రోజులపాటు అక్కడకు వెళ్ళడమే మంచిది. నువ్వెళ్ళనంతకాలం నాకు శాంతి వుండదు" అని అన్నది.

విరాజ్ తిరిగి నిలుచుని "ఓహో! నీమాట లిప్పు డర్థమౌతున్నాయి! సుందరి వచ్చిందాయేం?" అని అడిగింది.

"అవును! వచ్చింది"

"అందుకనేనా, నన్నిక్కడనుంచి వెళ్ళమంటున్నావు?"

"అవు నక్కాయ్! అందుకనే!"—

"ఒక కుక్కకు భయపడి నేను యిల్లు వదలి వెళ్ళాలా యేమిటి!"

"అవును అక్కాయ్! కుక్కకు పిచ్చిపట్టినప్పుడు మనం తప్పకుండా భయపడాలి. అదీగాక నీ ఒక్కదానికే భయంకాదు. యీ విషయాన్ని నువ్వు కొంచెం ఆలోచించి చూసినట్లయితే, యెన్ని అరిష్టాలు జరుగుతాయో నీకే అర్థమవుతుంది—"

"కాదు....నేను మాత్రం యిక్కణ్నుంచి కదలను" అని విరాజ్ తోడికోడలి జవాబు కెదురుచూడకుండా వెళ్ళింది.

అయినా, ఆమె కెందుకో భయంగానే వుంది. వాళ్ళంతా నీళ్ళు నింపుకుని తీసుకొనివచ్చే నదిఒడ్డు కెదురుగా, నది అవతలి భాగంలో ఓ మంచి రేవు కడుతున్నారు. నీళ్లు తక్కువున్నా, చేపలు పట్టేందు కొక

మంచెకూడా కడుతున్నారు. ఈపనులయొక్క అంతరార్థమేమిటో విరాజ్ మనసులోనే వూహించుకొని భయపడింది.

ఒకనాడు స్నానంచేసి వచ్చాక నీలాంబరుడు "అవతలవొడ్డున యెవరు రేవు కడుతున్నారు విరాజ్!" అని అడిగాడు.

"నాకేంతెలుసు" అని విరాజ్ తొందరగా లోపలకు వెళ్ళిపోయింది.

నీలాంబరుడు ఆశ్చర్యపడ్డాడు. అయినా. విరాజ్ ఆనాటినుంచి సమయా సమయాలు గమనించి నీళ్ళు తెచ్చేందుకు బయలుదేరింది.

ఇప్పుడు నది వొడ్డున చీకటిగా వున్నప్పుడో లేక చీకటిపడిన తరువాతో నీళ్లు తేవడానికి బయలుదేరేది.

ఇక ఎన్నివేల పనులు ఆగినా అటు వెళ్ళేది కాదు. కాని ఆమె మనసులో ఆందోళనగానే వుంది.

నాలుగు రోజులయాక ఒకనాడు నీలాంబరుడు స్నానంచేసి వచ్చి- "ఏం విరాజ్! నువ్వు మన క్రొత్త జమీందారు శృంగారాన్ని యెప్పుడన్నా చూశావా?" అని అడిగాడు.

భర్త మనోభావాన్నిగమనించి. అన్యమనస్కురాలై "చూస్తూనే వున్నాను." అని చెప్పింది.

"ఇతను వట్టి పిచ్చివాడిలా వున్నాడు. యిప్పుడు నదిలో యెంతో లోతు నీళ్లు లేకపోయినా. ఒక డింగీకి తెరచాపకట్టి చేపలు పట్టేందుకు కుతూహలపడుతున్నాడు"

విరాజ్ మాట్లాడలేదు. జమీందారుని ఆటలవిషయంలో ఆమె భర్త ననుసరించలేదు.

"అయినా యితని పద్ధతి మంచిదికాదు. గౌరవమర్యాదలుగల ఓ గృహస్థుని యింటి కిటికీకి యెదురుగ్గా నదివొడ్డున, ఒక వ్యక్తి రోజంతా పీఠంవేసి కూర్చుంటే యింట్లోని ఆడవాళ్ళెలా బయటికివచ్చి పోతుంటారు? సరే! నీకు చాలాకష్టంగా వుందనుకుంటాను. ఏం!"

"వుందనుకుందాం? ఆ సంగతి మీకెందుకు?"

"నాకెందుకా? అతను నావమీద కూర్చుని. పిచ్చిచేష్టలు చేసేందుకు నదిలో యింకెక్కడా స్థలమేలేదా? నేను రేపు ఉదయమే అతని

దేవాదక్క వెళ్ళి మీరు నావమీద కూర్చోదలచుకున్నట్లయితే, యిం కొక స్థానంలో కూర్చోండి. నాయింటికెదురుగా పగలంతా మీ రిలా కూర్చోవద్దు అని చెప్పవస్తాను.''

భర్త అన్న యీ మాటలు విరాజ్‌ను భయపెట్టినయ్, భయపడుతూ 'వద్దు అక్కడికివెళ్ళి మీరు చెప్పవలసిన అవసరములేదు. మీరు వెళ్ళి అత న్నక్కడ కూర్చోవద్దని చెప్పడానికి నది మనది కాదు'' అని అన్నది.

భార్య మాటలకు నీలాంబరుడు ఆశ్చర్యపడుతూ ''నువ్వనేదేమిటి విరాజ్! నది మనదికానిమాట వాస్తవమే. అయితే, వుచితానుచితాలు ఆలోచించకుండా, ఇష్టమొచ్చినట్లు సంచరించవలసిందేనా? నేను రేపే వెళ్ళి అక్కడ కూర్చోవద్దని చెప్తాను. వింటారా వింటారు. మంచే గించే ఊడలాగి పారవేస్తాను. ఆ తరువాత అత దేమిచేసినాసరే?'' అని అన్నాడు.

విరాజ్ ఆశ్చర్యపడి—''అయితే యింతకూ— జమీందారుతో తగువుపెట్టుకుంటారన్నమాట?'' అని అన్నది.

"యెందుకు పెట్టుకోను? అతను గొప్పవాడైనంతమాత్రాన అత్యాచారము చేస్తుంటే, వానికి మనం తలలువొంచి నడవవలసిందేనా?''

అతను అత్యాచారము చేస్తున్నాడని మీరు రుజువుచేయగలరా?

''ఈ ఆర్గుమెంట్లకోసం బాధపడే వ్యక్తినికాను నేను. అత నన్యాయముచేస్తున్నాడని నాకు తోస్తూంది. అయినా, నువ్వు అతని అన్యాయాన్ని రుజూవచ్చమని అడుగుతున్నావు? ఋజువుచేయగలనో, లేదో అది నాకు తెలుసు.''

విరాజ్ కొన్ని క్షణాలు భర్త ముఖంలోకి చూసి- ''చూడండి! మనసును కొంచెం శాంతపర్చుకోండి! రెండుపూటలూ సరిగా అన్నం దొరకనివాళ్ళనోటివెంట యిటువంటి మాటలు రావటం యెవరన్నా వింటే నవ్వుతారు" అన్నది.

"ఎలా...."?

"ఎలా యేమిటి? మీ రనేది జమీందారుకొడుకుతో తగువులాడతా నంటారు?"

రః మాట వినడంతోనే నీలాంబరుడు మండిపడుతూ—"మాటి మాటికి తిండి విషయం ఎత్తడంలో, నేను కుక్కనో, పిల్లినో సను కున్నావా? నీ నోటికివచ్చినప్పుడల్లా అన్నమే దొరకడం లేదంటున్నావు. ఎప్పుడన్నా నీకు రెండుపూటలూ తిండిలేకపోయిందా?" అని అరిచాడు.

దుఃఖక్లేశాలెన్నో అనుభవించడం మూలాన్ని విరాజ్‌లోని సహన శక్తి దిగజారిపోయింది. అందువల్ల ఆమె కోపంతో—"అనవసరంగా అరవకండి! రెండుపూటలు తిండి యెలా దొరుకుతుందో మీకు తెలియక పోయినా నాకు తెలుసు. ఇంకెవరికన్నా యీ సంగతి తెలుసా అంటే అది ఒక్క భగవంతునికే తెలియాలి! ఈ విషయంలో మీరేమన్నా అంటే నేను విషంతాగి చస్తాను" అని అన్నది.

నీలాంబరుని కళ్లు నీళ్ళతో నిండినయ్! అతను కర్తవ్యతా మూఢు నిలా కన్పించాడు. భర్త స్థితి చూచి విరాజ్ అప్పటికప్పుడు చిన్నపుచ్చు కుని అక్కణ్ణుంచి వెళ్ళిపోయింది.

విరాజ్ వెళ్ళాక నీలాంబరుడు అలాగే నిల్చుని వుండిపోయాడు. ఆ తరువాత ఒక నిట్టూర్పువిడిచి బయటవున్న దేవీమండపంలో ఒకమూల ఖిన్నభావంతో కూర్చున్నాడు. విరాజ్ చివరికి "రెండు పూటలూ తిండి యెలా దొరుకుతుందో మీకు తెలియకపోయినా" అన్న మాటలు మాటి మాటికి అతన్ని వేధిస్తున్నయ్. నిజమే! ప్రస్తుతము రోజు లెలా గడిచేది, ఆమె యింటిఖర్చు యెలాగడిపేదీ నీలాంబరునికి తెలియకపోలేదు. ఇప్పు డిప్పుడే అన్న ఆమె మాటలు బాణాల్లా అతని హృదయానికి గుచ్చు కున్నయ్. ఈ పరిస్థితులన్నీ కూర్చుని ఆలోచిస్తున్నకొద్దీ అతని హృద యములోని గాయము మాత్రం మానలేదు. శాంతించలేదు. అయినా, ఆమె మీద తనకున్న ప్రేమా, శ్రద్ధలు విపరీతమార్గాల్లో దొర్లుతున్నట్లు కనుపిం చింది. తన విరాజ్ యీనాటి విరాజ్ కాదు. యెంతోకాలము క్రిందట యుగయుగాంతరముల స్త్రీలా, తన సుఖమే ఆమె సుఖంలా భావిస్తున్న సావిత్రిలాంటిది. రెండురోజులు వ్యవహారాన్ని మనసులో వుంచుకుని, యీ పోట్లాటలో కోపంతో, బాధతో అనిన రెండుమాటలను పట్టుకుని, తను ఆమె విషయాన్ని ఎక్కువ యిదిగా ఆలోచించడం ఏమాత్రం

దావుండలేదు. విరాజ్ హృదయం దేనితో నిండిపోయివుంటుందో నీలాం బరునికి తెలుసు.

భార్యసంగతి ఆలోచిస్తున్నకొద్దీ అతనికళ్ళవెంట నీళ్లు జల జల పొంగి వస్తున్నయ్. అకస్మాత్తుగా రెండుచేతులూ ఎత్తి, పైకిచూస్తూ "అయ్యో భగవంతుడా! నాదగ్గరవున్నదంతా తీసుకున్నా, నా విరాజ్‌ను మాత్రం తీసుకోకు" అని ప్రార్థించాడు. తన హృదయంలో ప్రచంత ఆవేశము, తన ప్రియపత్నిని దగ్గరకు తీసుకొమ్మన్నట్లుగా చెప్పింది. నీలాంబరుడు పరుగెత్తుకుంటూ విరాజ్‌దగ్గరకు వచ్చాడు. లోపల గొళ్ళెము పెట్టి వున్నందుకు బయటే ఆగవలసివచ్చింది. అక్కడ నిలుచుని తలుపు తడుతూ— "విరాజ్" అని పిల్చాడు.

విరాజ్ నేలమీద బోర్లపడుకుని యేడుస్తూవున్నదల్లా భర్త పిలుపు వినడంతోనే లేచి కూర్చుంది.

"ఏంచేస్తున్నావ్ విరాజ్? తలుపు తెరువు"

విరాజ్ భయపడుతూ వచ్చి తలుపుదగ్గర నిలుచుంది.

"తియ్యవేం విరాజ్?"

రుద్ధకంఠంతో విరాజ్ "కొట్టరుగదా?" అని అన్నది.

"కొట్టడమా?"

పదునైన కత్తిలా యీ మాట నీలాంబరుని హృత్పిండంలో గుచ్చుకుంది. వేదనా, సిగ్గు అభిమానంతో ఆయనకు కంఠావరోధము కలిగింది. ఈ సంగతేమీ విరాజ్‌కు తెలియదు. అందుకని . "ఇక యెప్పుడూ మిమ్మల్ని ఇటువంటి మాట లనను. కొట్టరుకదూ?" అని అన్నది.

"లేదు" అని ఎలాగో నీలాంబరుడు అనగలిగాడు. విరాజ్ ఏడుస్తూ-భయపడుతూ, గొళ్ళెముతీసింది. నీలాంబరుడు త్రొక్కుపాటుతో లోపలికి వెళ్ళి మంచంమీద పడుకుని రెండుకళ్ళూ మూసుకున్నా, కళ్ళ కొనలనుంచి నీళ్లు జారుతున్నాయ్. భర్త ముఖం యీ విధంగా వుండడం విరాజ్ ఎప్పుడూ చూచివుండలేదు. ఇప్పుడామెకు అన్నీ తెలిసినయ్. ఆమె లేచివచ్చి, తలదగ్గర కూచుని భర్త తలను ఒడిలోకి తీసుకుని పైట

చెంగుతో, కన్నీళ్లు తుడుస్తూంది. క్రమక్రమంగా గదిలో చీకటి యెక్కువగా అలముకుంటోంది. అయినప్పటికీ ఆ భార్యాభర్తలనడుమ ఏవిధమైన మాటలు కూడా జరుగలేదు. చీకటిలో పరిచివున్న పక్కమీద యిద్దరూ నిశ్శబ్దంగా మౌనంగా కూర్చుని వున్నారు. వాళ్ళిద్దరూ మనసులో యేమాలోచిస్తున్నారో అది భగవంతునికే తెలియాలి. అయినప్పటికి, విరాట్ యీ మాటలు యెలా అనగలిగిందా అని నీలాంబరుడు ఆలోచిస్తున్నాడు.

నే నామెను కొడతానని యెలా వూహించింది? నే నంత నీచుణ్ణని యెలా అనుకుంది? ఇంట్లో వూరికే విచారముతో యెప్పుడూ కూర్చునే వుంటుంది. ఏదో ఒక విషయానికి ప్రతిరోజూ విచారిస్తూనే వుంటుంది

రెండు రోజులు హాయిగా గడవకముందే యేదో ఒక విషయాన్ని గురించి తెలియకుండానే పోట్లాడుకుంటున్నాము. మాటలసందర్భంలోనే అనవసరంగా మే మిద్దరమూ మూతిముడుచుకుని. ఒక ర్నొకరు చూసుకోవడంతోనే పోట్లాడుకునేందుకు తయారవుతున్నాము. అడుగడుక్కూ అభిప్రాయభేదాలు కలుగుతున్నాయ్. అసలు విరాజ్ యీవిధంగా మారిపోతోంచెందుకు? అనే ప్రశ్న నీలాంబరుని వేధిస్తూంది. ప్రస్తుతం ఆమె ఆరోగ్యమూ అందమూ క్షీణించిపోతున్నయ్. అందుకుతోడు, ఆమెలోని స్వభావము కఠినరూపముదాల్చి మాధుర్యాన్ని చెడగొడుతూంది. ఇవన్నీ ఆలోచిస్తున్నకొద్దీ, అతని దుఃఖానికి దరీదాపు కనిపించలేదు.

భగవంతుడంటే నీలాంబరునికి విశ్వాస మెక్కువ! విధాత సృష్టించే విధానముపట్ల అతనికి శ్రద్ధెక్కువ. అందుకని అతను నుదుట వ్రాతను గురించి పశ్చాత్తాపపడుతుంటాడు. తన మనసులోకూడ యితరులను దూషించడు. ఎవరినీ యింతవరకూ అనవసరంగా నిందించలేదు. దేవీమందిరంలో రాధాకృష్ణుల పటము వ్రేలాడుతూవుండటము చూసి దానిముందు నిలుచుని, నీలాంబరుడు ఏడుస్తూ— "హే భగవాన్! నీకొక వేళ న న్నింత విచారములో ముంచాలని వుంటే న న్నెందు కింత వుత్సాహహీనుణ్ణిగాచేసి యిక్కడికి పంపావు? నే నెంత వుత్సాహహీనుణ్ణో అంత అసమర్థుణ్ణనే సంగతి నా కంటె యింకెవరికీ తెలియదు" అన్నాడు.

నీలాంబరుడు యెక్కువగా చదవలేదు. దానికితోడు పని పాట లేమీ అతనికి తెలియవు. అతనికి తెలిసిందల్లా ఒక్క బీదలకు సేవచేయు డమే. అతను చిన్నతనంలో భగవంతునిపేరు స్మరించడమే నేర్చు కున్నాడు. అందువల్ల యితర విచారాలు దూరమవుతాయి. కాని, ప్రస్తుతం అతని హృదయంలోని తీరని విచార మెలా దూరమవుతుంది? అతని వద్ద యింకేమీలేదు. ఉన్న దంతా అయిపోయింది. అందుకని దుఃఖ క్లేశాలు సహించడంలో అసమర్థుడయి అత నెన్నోసార్లు మనసులో ఎంతో యిదిగా ఆలోచించాడు. ఇక తనిక్కడ వుండకూడదు. విరాజ్‌ను తీసుకుని కాళ్ళు తీసుకుపోతాయో అటు వెళ్ళాలి. ఈ చిన్న నది, యిక్కడ చెట్లపొదలతో కప్పబడిన యీ ఇల్లు, యీ వూళ్ళో పరిచ యస్తులైనమనుష్యుల ముఖాల్ని వదిలి తెలియని ప్రదేశానికి వెళ్ళి బతికే లేడు. ఈ ఇంట్లోనే తనతల్లి చచ్చిపోయింది. దేవీమందిరంలో మృత్యు శయ్యయందున్న తన తండ్రికి ఎన్నో విధాల సేవలుచేశాడు. తండ్రి చనిపోయాక అంత్యక్రియలు యీ నదిలోనే చేశాడు. ఈ ఇంట్లోనే హరి మతిని ఎంతో ప్రేమగా పెంచి పెళ్ళిచేశాడు. ఈనాడు యిన్నిటిని ఎలా పొదలగలడు? త నెలా యీ యింటి వ్యామోహాన్ని వదిలిపెట్టగలడు?

నీలాంబరుడు అక్కడే కూర్చుని, చేతులతోముఖాన్ని కప్పుకుని యేడ్చాడు. హరిమతికి పెళ్ళయాక మళ్ళీ అమెసంగతేమీ తెలియలేదు. ఆమెముఖం చూచి యెన్నోరోజులైంది. "అన్నయ్యా! అన్నయ్యా!" అని ఆమె పిలిచే మాటలు విని యెన్నోరోజులైంది.

ఉన్నట్టుండి నీలాంబరునికి చెల్లెలిమీద ధ్యాసమళ్ళింది. అత్తవా రింట్లో తన చెల్లెలు ఎంత దుఃఖమనుభవిస్తూందో! అక్క డెంతగా ఏడు స్తూందో! ఇదంతా అతని వూహామాత్రము. హరి విషయంలో అతనికి సంగతులేమీ తెలియవు విరాజ్‌ముందు హరిపేరు స్మరించలేకపోవడమే అతనికి యెక్కువ విచారముగావుంది. హరిమతి విషయంలో తనకంటే యెక్కువ ఇదిగా విరాజ్ చేసినమాట వాస్తవమే! అయినప్పటికీ ఆమె హరిని మర్చిపోయింది. కాని తనెలా మర్చిపోగలడు ఇద్దరూ ఒక తల్లి గర్భాన జన్మించారు. హరిమతి బాల్యావస్థలో ఉన్నప్పుడు. ఒడిలోమీద

యెక్కించుకుని తిప్పేవాడు. ఎక్కడికి వెళ్ళినా హరిమతిని వెంటతీసుకు వెళ్ళేవాడు. అందువల్ల యెంతమంది, యెన్ని మాటలన్నా నీలాంబరుడు సహించాడు. అత నెప్పుడూ హరిని ఏడ్వనీయలేదు. ఇంట్లో ఆమె ఏడుస్తుంటే, అతను బయటికి కాలన్నా పెట్టలేదు. ఈ సంగతులన్నీ అతనికీ హరికి మాత్రమే తెలుసు.

విరాట్ తెలిసివుండికూడా, తెలియనట్టే వుంటుంది. హరిమతి విషయంలో ఆమె ఒక్కమాటకూడా మాటాడటంలేదు. హరిమతి విషయం వచ్చినప్పుడల్లా ఆమె రాతిప్రతిమలా నిశ్చలంగా వుంటుంది. తన భర్త ఇలా మారిపోవడానికి నిరపరాధిని ఆ చెల్లెలే కారణమని విరాట్ అభిప్రాయము. ఆ విచారమే నీలాంబరు నెప్పుడూ వేధిస్తూవుంది.

దుర్గాపూజాసమయమున దగ్గరకొస్తున్నకొద్దీ నీలాంబరుడు వుండలేకపోయాడు. భార్యకు తెలియకుండా ఆయ నెక్కడో పది రూపాయలు సంపాయించి, దానితో చాకపాటి చీర, దానితోపాటు కొంచెం మిఠాయి కొని, సుందరి యింటికి తీసుకుని వెళ్లాడు.

సుందరి పీటవేసి, చిలుము తెచ్చి ఇచ్చింది. పీటమీద కూర్చున్నాక నీలాంబరుడు చుట్టిన తన కండువాలోంచి రెండు వస్తువులు సుందరిముందుంచి —

"నువ్వు హరిని పెంచి పెద్దదాన్నిగా చేశావు. వెళ్ళి ఒక్కసారి చూసిరావాలి" అని యింకేమీ మాట్లాడలేక ముఖము ఒకప్రక్కకు తిప్పుకుని కన్నీళ్ళు తుడుచుకున్నాడు.

నీలాంబరుని కుటుంబము యింత కష్టములోవుందని సుందరికి తెలుసు. ఒక్క సుందరికేకాదు, వూళ్లోవాళ్ళందరికి తెలుసు. చివరకి "ఇప్పు డామె ఎలావుంది బాబూ?" అని అడిగింది.

"తెలియదు"

సుందరి వివేకహీనురాలు కాదు. పరిస్థితులను విచారించగల బుద్ధి ఆమెకుంది. అందువల్ల ఆమె యింకేమీ ప్రశ్నించకుండానే "సరే బాబూ, నేను రేపుదయమే వెళతాను" అని అంటుంటే మార్గమధ్యంలో ఆమె తిండీ తిప్పలకోసం నీలాంబరుడు డబ్బు యివ్వబోయాడు. సుందరి

ఆవేమీ తీసుకోకుండా "వద్దు బాబూ! నేను తీసుకోను. మీరు చీర కొనిపెట్టారు. లేకుంటే నే నదికూడా తీసుకోను. మీలానే నేనూ ఆమెను పెంచి పెద్దదాన్నిచేశాను" అని అన్నది.

నీలాంబరుని కళ్ళంట మళ్ళీ నీళ్లువచ్చినయ్. వాటిని తుడుచు కున్నాడు. ఇటువంటి వ్యధితహృదయావేదనతో కూడుకున్న మాటలు ఎవరినోటంటా అతను వినలేదు. హరిమతి కారణంగా, అతనూ, విరాజ్ కూడా కష్టాలపాలయారని చాలామంది అన్నారు.

నీలాంబరుడు అక్కణ్ణుంచి బయలుదేరి వెళ్ళాడు. సుందరి కన్నీళ్లు తుడుచుకుంది. అసలు నీలాంబరుని అందరూ ప్రేమిస్తారు. అతనంటే అందరికీ శ్రద్ధ.

విజయదశమినాటి రెండోఝాముస విరాజ్ గదిలోకి వెళ్ళి లోపల వేపు తలుపుకు గొళ్ళెమువేసుకుంది. సాయంకాలమవుతుండగా యెంతో మంది ఆమె తలుపుదగ్గరకు వచ్చి "నీలు తాతా" అని కొంతమంది నీలయ్యా, అని మరికొంతమందీ పిల్చి లోపలికి వెళ్ళారు. కొంతమంది బయటినుంచే పిలిచారు.

దేవీ మందిరంలో కూర్చున్న నీలాంబరుడు బయటికి వచ్చాడు. యథావిధిగా ఆయనకు నమస్కరించి, కౌగలించుకుని, విరాజ్‌చేత ఆశీర్వాదాన్ని పొందేందుకు లోపలికి వెళ్లారు. వాళ్ళవెంటే నీలాంబరుడు కూడా వెళ్ళిచూస్తే, విరాజ్ వంటింట్లో లేదు. అప్పుడే పడకగదికి గొళ్ళెముపేసి వుంది. అందువల్ల తలుపుకొడుతూ నీలాంబరుడు "విరాజ్! పిల్లలు నిన్ను చూడటానికి వచ్చారు" అని పిల్చాడు.

విరాజ్ లోపల్నుంచే "నాకు జ్వరంగావుంది. లేవలేను" అని అన్నది.

అంతా వెళ్ళిపోయిన తర్వాత కొంచెంసేపటికి, తలుపుమీద కొద్దిగా చప్పుడు వినిపించింది. విరాజ్ జవాబు చెప్పలేదు. తలుపు బయటనుంచే "అక్కయ్యా! నేను మోహినిని, తలుపు తెరువు" అన్నది.

ఈ పిలుపుకు కూడా విరాజ్ జవాబివ్వలేదు.

"నువ్వు తలుపు తియ్యనంతవరకూ తలుపుగుమ్మంవద్ద రాత్రంతా కూర్చుని, నీ ఆశీర్వాదాన్ని పొందిగాని నే నిక్కడనుంచి కదలను. నీ ఆశీర్వాదం తీసుకొని మరీ కదులుతాను."

విరాజ్ లేచి తలుపు తెరచి, ఎదురుగా నిలుచుంది. ఒక చేతిలో వి_స్తరినిండా గింజలూ, మరొక చేతిలో భంగూ విరాజ్ పాదాలముందు పెట్టి, మోహిని తలను ఆమెపాదాలమీద ఆనించి, "అక్కయ్యా! నేనూ నీలా వుండేట్లు ఆశీర్వదించు నీ నోటంట. నా కింకే కోరికలూ వద్దు" అని అంది.

విరాజ్ కళ్ళు తుడుచుకుని చేతితో ప్రేమగా మోహిని తలను తాకింది.

చిన్నకోడలు లేచి నిల్చుని, "ఇవ్వాళ కన్నీళ్ళుపెట్టకూడదు: ఈ సంగతి నేను నీకు చెప్పవలసినదాన్ని కాను. కాని —నీ గాలి నాకు సోకినందువల్ల వచ్చిన బలంవల్ల అంటున్నాను....ఆ సంగతి వచ్చే సంవత్సరము యిటువంటిరోజుల్లోనే చెప్పుతాను" అని చెప్పింది.

మోహిని వెళ్లాక, ఆమె యిచ్చిన సామానులు తీసి గదిలో పెట్టింది.

రెండోనాడు విచారముగా మెట్లమీద విరాజ్ కూర్చుంది. సుందరి వచ్చి నమస్కరించింది. విరాజ్ ఆమెను ఆశీర్వదించింది.

నేలమీద కూర్చున్నాక సుందరి "రాత్రి చాలా ప్రొద్దుపోవడంచేత రాలేక యిప్పుడు చెప్పడానికి వచ్చాను. నువ్వేమన్నా అనమ్మా! ఇలా అని అనుకుంటే నే నసలు అక్కడికి వెళ్లేదాన్నే కాదు" అని చెప్పింది.

సుందరి చెప్పేదేమిటో విరాజ్ గ్రహించలేక ఆమె ముఖంలోకి చూసింది.

"ఇంట్లో యెవరూలేరు. అంతా పడఘటిదేశాని కెళ్లారట. ఒక్క మేన_త్తమాత్రం ఇంట్లోవుంది. ఆమె అంటున్నమాటలు నన్నే ఆశ్చర్యంలో ముంచినయ్! ఆమె 'ఈ చీరెవరిక్కావాలి? తీసుకువెళ్ళు. అల్లుడికి ఒక్క ధోవతన్నా పంపలేదుగాని, హరిమతికి పాపం ఒక్క నూలుగుడ్డ పండక్కు బహుమానమని పట్టుకొచ్చావా?" అని యిష్టమొచ్చినట్లు యింకా యెన్నో అనరాని మాటలంది. అవన్నీ నేను మీకు చెప్పలేను."

ఆశ్చర్యంగా విరాజ్ "ఈ మాటలన్నీ యెవర్ని యెవరన్నారు సుందరీ?" అని అడిగింది.

"ఏం? మా బాబుగార్నే అంది. ఇంకెవర్నంటుంది?"

"మన బాబుగార్ని ఎవరన్నారు?"

"అదే నేను మొత్తుకునేది! హరిమతి అత్తగా రుండే ఆమె కెంత పొగరనుకున్నారు? ఆమె యెంత సూక్ష్మబుద్ధిగల దనుకున్నారు? ఆమె చీర పుచ్చుకోకుండానే తిరిగి పంపించింది" అని పైటచెంగున వున్న మూట విప్పి విరాజ్ముందు పెట్టింది.

ఇప్పుడు విరాజ్ కన్ని సంగతులు తెలిసినయ్. ఆమె ఏదేకంగా చీరవేపు చూస్తూ వూరుకుంది. ఆమె హృదయంలోనూ బయటా అగ్ని వ్యాపించినట్లు బాధపడింది.

నీలాంబరు డెక్కడికో వెళ్లాడు. ఆయన ఎప్పుడు తిరిగివస్తాడో ఎవరికీ తెలియదు. అందుకని సుందరి ఆయనకోసం ఎదురుచూడకుండా లోపలికి వెళ్ళిపోయింది.

మధ్యాహ్నము నీలాంబరుడు భోజనంచేస్తున్నప్పుడు, విరాజ్ గదిలోంచి చీరతెచ్చి ఆయనముందుంచి, "దీన్ని సుందరి మీ కిమ్మని ఇచ్చి వెళ్ళింది" అని చెప్పింది.

నీలాంబరుడు ముఖమెత్తి చూసి ఒక్కసారి భయపడ్డాడు. ఈ సంగతి విరాజ్ముందు ఇలా పరిణమిస్తుందని అత ననుకోలేదు. అత నింకేమీ మాట్లాడకుండా తలవంచుకుని కూర్చున్నాడు.

"ఈ చీర వాళ్ళెందుకు తీసుకోలేదో, ఎందుకు తిరిగి పంపారో యేమన్నారోకూడా చెప్పింది. మీరు సుందరి దగ్గరికి వెళితే తెలుస్తుంది!" అని అన్నది విరాజ్.

ఈ మాటలన్నతరువాతకూడా నీలాంబరుడు తలఎత్తలేదు, ఆ విషయంలో ఒక్క మాటకూడా వినదల్చుకోని భావము చూపించాడు. విరాజ్ కూడా మాట్లాడలేదు.

నీలాంబరుని ఆకలిదప్పులు ఒక్కసారిగా పోయినయ్! విరాజ్ తన వేపు తీక్షణంగా చూస్తూంటుందని అతను తలవంచుకుని మనసులో అనుకున్నాడు.

చీకటిపడబోతుండగా నీలాంబరుడు సుందరి యింటికివెళ్ళి సంగతు లన్నీ తెలుసుకున్నాడు. చివరకు నీలాంబరుడు వాళ్ళంతా పడమటిదేశపు యాత్ర కెళ్ళివుంటే అంతా బాగానే వుంటారనుకుంటాను. ఏమంటావు సుందరీ?" అని అడిగాడు.

"అవును బాబూ! వాళ్లు బాగానే వున్నారనుకుంటాను."

నీలాంబరుడు సంతోషం ప్రకటిస్తూ "హరి ఎంత పెద్దయివుంటుంది సుందరీ? నువ్వు దాన్ని చూశావా?" అని అడిగాడు.

"లేదు బాబూ! ఆమెను కలుసుకోలేదు."

"అవును. అయినా, ఆమె సంగతి పనివాళ్ళనన్నా అడగలేదూ?"

"లేదు బాబూ! ఆ ముసలిది అలా అంటుంటే అక్కడెవరినన్నా అడిగేందుకు నాకు ధ్యాసే లేకపోయింది. అప్పుడు నాకు పరిగెత్తేందుకు దారే కనుపించలేదు."

నీలాంబరుని ముఖం క్షోభతో ముడుచుకుంది. కొన్ని క్షణాలు స్థిమితంగా వున్నాక "ఏం సుందరీ? మా హరి సన్నమైవుంటుందా లేక లావైవుంటుందా? నీ అభిప్రాయమేమిటి?" అని అడిగాడు.

"కొంచెం లావెక్కి వుంటుంది?"

"నువ్వు విని వచ్చావనుకుంటాను. అంతేనా?"

"లేదు బాబూ! నే నక్కడసలు విననేలేదు."

"మరి నీ కెలా తెలిసింది?"

"నే నక్కడ వినలేదు. నా అభిప్రాయం అడిగారు గనక, కొంచెం వూహించి చెప్పాను."

"అదా సంగతి" అని ఆయన సుందరిముఖంలోకి చూస్తూ, కొంచెంసేపుండి "సరే ఇక వెళతాను సుందరీ! మళ్ళీ కలుసుకుంటాను" అని అన్నాడు.

"అవును బాబూ! ఇప్పుడు చీకటిపడింది. ఇంకోసారెప్పుడు వెంటవెంపలాడే రాండి."

"సరే వెళుతున్నాను" అని బయటికి వెళ్ళాడు.

సుందరి అలా తొందరపడి నీలాంబరుని పంపేందు కొక పెద్ద కారణముంది, నీలాంబరుడు సుందరి మాట్లాడుతున్నసమయంలో

నితాయిగంగూలీ రావడం పండ్లు ఇచ్చి వెళ్ళటం చూసింది. గంగూలీ దగ్గరలోవున్న ఒక వీధిలో నివసిస్తుంటాడు. సుందరి పరిస్థితులు కనుక్కునేందుకూ, పాదధూళి ఇచ్చేందుకు చీకటిపడుతుండగా ప్రతిరోజూ వచ్చేవాడు. ఆయన యజమాని వుండగా వస్తాడేమోనని సుందరి భయపడింది. అదీగాక ప్రస్తుతం సుందరిమనస్సు జమీందారు ప్రాపకంవల్ల కొంత గర్వమెక్కింది. అదీగాక నిష్కపట బ్రాహ్మణుని యెదుట తన పాపపునులు కనపర్చేందుకు మనసొప్పలేదు. అందువల్ల ఆమె సిగ్గుతో చచ్చిపోతూంది.

నీలాంబరుడు వెళ్లాక సుందరి ఒక్క నిట్టూర్పువిడిచి తలుపు వేయబోతూ నీలాంబరుడు తిరిగి వస్తూండడం చూచింది. అందువల్ల గుమ్మానికి చేయి ఆనించుకొని ఆయనకోసం యెదురుచూస్తూ నిలుచుంది.

నీలాంబరుడు దగ్గరకొచ్చి ఒకసారి యిటూఅటూ పరికించి—కండువా కొంగున ముడివేసివున్న ఒక కాని తీసి "సుందరీ! నీవు ఏదైనా చెప్పేందుకు నాకు సిగ్గుపడనవసరంలేదు ఎందుకంటే నీకు సంగతంతా తెలుసు. నావద్ద ఉండల్లా యీ ఒక్కకాని మాత్రమే. దీన్ని నువ్వు తీసుకో" అని తనచేతిని సుందరివేపు చాపాడు. సుందరి పెదిమలను పళ్ళతో నొక్కుకుంటూ వెనక్కి తగ్గింది.

"సుందరీ! నేను నిన్నెంతో కష్టపెట్టాను. రానుపోను ఖర్చులు కూడా యివ్వలేకపోయాను."

"సరేలెండి! మీ రే స్థితిలోవున్నా నా యజమానులే మీ ఎదుట కాదనేందుకు నాకు బావుండదు" అని ఆమె కాని తీసుకొని, "అయితే ఒకసారి లోపలికి రాండి" అని లోపలికి వెళ్ళింది. నీలాంబరుడుకూడా ఆమె వెనకాలే వెళ్ళాడు.

సుందరి గదిలోకివెళ్ళి ఒక నిమిషమయాక, పిడికెడు రూపాయిలు తెచ్చి నీలాంబరుని పాదాలముందుంచి సాష్టాంగపడి, పాదాలు ముట్టుకుని లేచి నిల్చుంది.

నీలాంబరుడు విభ్రాంతుడయ్యాడు. సుందరి నవ్వుతూ "బాబుగారూ ఈవిధంగా చూస్తూ నిలుచుంటే పనిజరగదు. నేను తమ దాసురాల్ని.

అభిమానంతో యిలా చేయగల హక్కు నాకు వుంది" అని అంటూ రూపాయలు తీసి, నీలాంబరుని పైపంచెకొంగున కడుతూ "ఈ డబ్బు మీ రిచ్చిందే. నేను తీర్థయాత్ర చేద్దామనుకున్నాను. వీటిని భగవంతునికి అర్పిద్దామనే వుద్దేశముతో అలా వుంచాను. కాని నేను వెళ్లలేకపోయాను భగవంతుడు స్వయంగా ఇంటికేతెంచాడు. ఇప్పు డాయనకు ఖర్చుపెడదా మనుకున్న యీ ద్రవ్యము ఆయనకే సమర్పించాను" అని అంది.

సుందరి యిలా అంటున్నా, నీలాంబరుడు ఒక్కమాటన్నా అన లేదు. సుందరి డబ్బు గట్టిగా ముడివైచి, "అమ్మగారు ఒకర్తే యింట్లో వుంది. ఇక ఇక్కడ ఆగకుండా వెళ్లండి. కానీ ఈ సంగతిమాత్రము ఆమెకు చెప్పవద్దు" అని అంది.

"నీలాంబరు డేదో అనబోయాడు. ఇంతలో సుందరి "బాబుగారూ! మీరు వెయ్యిచెప్పండి. నేను వినేదాన్ని మాత్రం కాదు. ఒకవేళ యీనాకు నా గౌరవము నిలబెట్టకుంటే తల బద్దలుకొట్టుకుని చస్తాను" అని అంది.

నీలాంబరుని పంచెకొంగు సుందరి చేతిలోనే వుంది. ఇంతలో "ఏం చేస్తున్నావు సుందరీ?" అని అంటూ గంగూలీ తిన్నగా లోని కొచ్చాడు.

నీలాంబరుని చెంగు సుందరి వదిలింది. నీలాంబరుడుకూడా అక్క ణ్ణుంచి వెళ్ళిపోయాడు.

నితాయి ఆశ్చర్యంగా ఒక్క నిముషమున్నాక "అతను నీలు బాబేనా?" అని అడిగాడు.

సుందరికి మనసులో కోపము రేకెత్తినా స్వాభావికంగానే "అవును నా యజమానులు" అంది,

"ప్రస్తుతము అతనికి తినేందుకు అన్నముకూడా దొరకడంలేదని విన్నాను. అయినా యింత రాత్రప్పుడు అతను నీదగ్గర కెందు కొచ్చాడు?"

"కొంచెం పనివుండి వచ్చాడు"

"ఓహో! పని వుందా?" అని నవ్వాడు.

నితాయి ఎందుకు నవ్వాడో అది సుందరి గ్రహించింది. అతని తలమీదున్న వెంట్రుకలు పన్నెండణాల పండుబారినయి. అతను మీసాలు

గడ్డం గొరిగించుకున్నాడు. తలమీద శిఖ వుంది. నొసట ఉపయం పెట్టు కున్న బొట్టు యింకావుంది. సుందరి తదేకంగా అతన్ని చూస్తూవుంది. అప్పు డామెస్థితిని గమనించేందుకు నితాయికి చేతకాలేదు. అందువల్ల "ఎందు కలా చూస్తావు?" అని అడిగాడు.

"ఊరికే చూస్తున్నాను"

"ఏమి చూస్తున్నావు?"

"నువ్వూ బ్రాహ్మణుడవే! కాని, నీలో, ఆయనలో ఆకాశానికీ పాతాళానికీ వున్నంత భేదము వుంది."

ఈ మాటలోని అభిప్రాయం తెలుసుకోలేక నితాయి "దేనిలోని భేదాన్ని చూస్తున్నావు?" అని అడిగాడు.

"ముసలివాడివి, మంచులో నిలుచోవద్దులే; యీ మెట్లమీదను సచ్చి కూర్చో. గంగూలీబాబూ, నువ్విప్పుడు భేదము అని అంటున్నావే, నా యజమాని పాదధూళి ఒక్కక్షణం నీకు దొరికినట్లయితే, నీ లాటి గంగూ లీయు లెంతోమందికి జన్మసార్థకమయ్యేదే అని ఆలోచిస్తున్నాను."

సుందరిమాటలు విని గంగూలీ విస్మయానికి అంతులేదు. ఆయన ఆశ్చర్యంతో సుందరిముఖంలోకి చూస్తూ వూరుకున్నాడు. సుందరి చిలు ములో పొగాకు వేస్తూ, స్వాభావికంగా "యింకోవిధంగా అనుకోవద్దు, నే నన్నది నిజమే! మా యజమానుని జందెంవేపు చూస్తేనే కళ్లు మిరు మిట్లు గొల్పుతాయ్. ఆయనమెడలో మెరుపువున్నట్లుంది. మీకు ఆ తేజ మెక్కడుందో మీవేపు చూస్తుంటే నాకు నవ్వు వస్తుంది" అని సుందరి కిలకిల నవ్వింది. ఒకటి గంగూలి యీర్ష్యతో మండుతున్నాడు. రెండోది కోపముతో ఉన్మత్తత చెందాడు. నిప్పుకణాల్లా కళ్లనుచేస్తూ "యింత పొగరుమోతుతనం పనికిరాదు సుందరీ! నీ ఆ బుగ్గలు సొట్టలుపడుతాయ్" అని అన్నాడు.

చిలుమును ఊదుతూ సుందరి నవ్వింది.

"ఏమీ జరగదు. యిదుగో యీ పొగాకు త్రాగండి, నీ ముఖం మాడినట్లుంది. నా యజమాని కష్టపడుతుంటే నవ్వుతూన్న నీ నోటు పడి పోకుండా వుండదు" అంది.

గంగూలి ఒక్క గుక్కలాగి చిలుము అవతలపారేసి, నిలుచున్నాడు. సుందరి ఆయన వల్లెవాటుఅంచుపట్టుకుని నవ్వుతూ "కూర్చో, కూర్చో, వెళ్లకు. నీమీద వట్టు" అని అంది.

నిశాయి కోపముతో వల్లెవాటు లాక్కుని, "నరకానికి పోతావు, నరకానికిపోతావు. నాశనమవుతావు" అని శపిస్తూ బయటికివెళ్ళిపోయాడు.

సుందరి అక్కడే కూచుని కొంచెంసేపటివరకూ నవ్వుతూ ఆ తరువాత తలుపు బంధించుకుని "ఇతను తేడా యేమిటని అడుగుతున్నాడే! బ్రాహ్మణు డంటే ఆయనే. అంత కష్టకాలంలోకూడా నవ్వు ముఖంమీద చిందులాడుతూంటుంది. ఆయన శరీర మేమిటాని ముఖమెత్తి చూస్తే నిప్పుతునకగా కనిపిస్తుంది" అని అనుకుంది.

# 9

ఆనాడు జరిగిన సంగతి యెవరి దయవల్లనో, ఒకరి దయవల్ల విరాజ్ వినకుండా వుండలేదు. ఆ సంగతి విరాజ్‌కు చెప్పిం దసలు ఆ వీధిలోని పొరిగింటి ముసలమ్మ.

భర్తను పిల్చి, విరాజ్ "మళ్ళీ సుందరిదగ్గర కెప్పుడు వెళ్ళారు?" అని అడిగింది.

భయముతో, సంకోచముతో "కొన్ని రోజులక్రిందట హరి సంగతి కనుక్కుందామని వెళ్ళాను" అని చెప్పాడు.

"ఇక దానిదగ్గర కెప్పుడూ వెళ్లవద్దు. ప్రస్తుతం ఆమె స్వభావము బాగా చెడిపోయింది" అని విరాజ్ తన పనిలో నిమగ్నురాలైంది. ఆ తరువాత ఎన్నోరోజులు గడిచిపోయినాయ్.

ప్రతిరోజూ సూర్యుడు ఉదయిస్తూ అస్తమిస్తున్నాడు. భగవంతుని నియమిత కాలాన్ని వ్యర్థపరిచేందు కే వుపాయమూ లేదు. ఈవిధంగా ఒకొక్కటే కలిసి శీతాకాలము గడిచింది. వేసవికాలముకూడా గడుస్తూంది. విరాజ్‌ముఖంమీద ఒకవిధమయిన, గొప్పమార్పు కలిగింది, అది అంతకంతకూ వృద్ధిపొందుతూంది. ఇప్పుడు విరాజ్ అంటే అందరకూ భయమే. నీలాంబరుడు దొంగలా ఇంట్లోకి వచ్చి, మళ్ళీ దొంగ

లాగే బయటికి వెళ్ళేవాడు. అసలు ఆయన రాకపోకల విషయములో విరాజ్ దృష్టిసారించలేదు.

ఒక్క చిన్నకోడలే విరాజ్‌కు భయపడలేదు. అవసరము వచ్చినప్పుడు వచ్చి యేదో ఒక ఉపద్రవము తెచ్చిపెట్టేది. ఆమెను వదిలించుకుందామని విరాజ్ ప్రయత్నించేది. కాని ప్రయత్నము ఫలించేదికాదు. విరాజ్‌కు కోపము వచ్చినప్పుడు చిన్నకోడలు గబుక్కున కాళ్ళుపట్టుకునేది. మెడ కౌగలించుకునేది!

ఒకనాడు వేకువజామున చిన్నకోడలు లేచి విరాజ్‌ను మెల్లిగా లేపి "ఇంకా యెవరూ నిద్రలేవలేదు అక్కయ్యా! నదిలో స్నానంచేసి వద్దాం పద" అని అంది.

అటుప్రక్క జమీందారు రేవు కడుతున్నప్పటినుంచీ, విరాజ్ నదిలో స్నానంచేయడం మానేసింది.

ఈనాడు తోడికోడలూ, తనూ యిద్దరూ కలిసి నది కెళ్లారు. స్నానమయాక, నదిలోంచి గట్టెక్కగానే, వాళ్ళదృష్టి రాజేంద్రకుమారునిమీద పడింది. అత నొక చెట్టుక్రిందున్నాడు. అప్పటికింకా తెల్లవారలేదు. అయినా ఇద్దరూ అతణ్ణి గుర్తించారు. చిన్నకోడలు భయంతో విరాజ్ వెనుక కొచ్చి నిలుచుంది. విరాజ్ ఆశ్చర్యపడింది. ఆమె మనసులోనే 'ఇతి నింత ప్రొద్దున్నే యిక్కడి కెందు కొచ్చాడు' అని అనుకొని క్షణంలో సంగతి గ్రహించింది. ప్రతిరోజూ వేకువన వచ్చి పహరాకాస్తున్నాడని గ్రహించి—చిన్నకోడలుచేయి పట్టుకుని, "నిలుచోకు మోహినీ, పద" అని తోడికోడలును పక్కన వుంచుకుని విరాజ్, యింటిదగ్గర విడిచి, యేమాలోచించిందో ఏమో, గబుక్కున వెనక్కి తిరిగి రాజేంద్రకుమారుని దగ్గరకొచ్చి నిలుచుంది. ఆమెకళ్లల్లో నిప్పు కనుపిస్తుండడము రాజేంద్రకుమారుడు చీకటిలో వున్నా కనుక్కున్నాడు. ముఖం క్రిందకు వంచుకుని, నిలుచున్నాడు.

"మీరు గొప్పవంశంలో జన్మించారు. మీరు గొప్పవారు అయినా మీకు ఇదేమిపని?" అని అడిగింది విరాజ్.

రాజేంద్రుడు దారి తెన్ను కానక నిలుచున్నాడు.

"తమ జమీందారు ఎంత గొప్పవాడైనా. మీ రిప్పుడు నిలుచున్న భూమి నాది ..."

అటుప్రక్కన తయారైన రేవును చూపిస్తూ—

"మీ రెంత సీమలో ఆ తీరంలో కట్టిన ఒక్కొక్క యిటుకకు తెలుసు. మీకు అన్న చెల్లెండ్రు లేరా? చాలాకాలం క్రిందటే మీ రిటు రావద్దని పనికత్తెద్వారా కబురుచేశాను. కాని మీరు వినలేదు" అని అంది.

ఇందుకుకూడా రాజేంద్రుడు జవాబు చెప్పలేదు.

"మీరు నా భర్తను యెరుగరు. ఎరిగివున్నట్లయితే యిటు రారు. అందుకని మీరు వారిని తెలుసుకుని యిటు వచ్చేందుకు ప్రయత్నించండి" అని విరాజ్ వెళ్ళింది. మెల్లమెల్లగా ఇంట్లోకి వెళ్ళబోతున్నప్పుడు పీతాంబరుడు ఒక లోటా తీసుకుని యెదురుపడ్డాడు.

చాలాకాలంనుంచి, వదినా-–మరదులమధ్య మాటలు లేవు. అయి నప్పటికి పీతాంబరుడు "వదినా, నువ్వింతసేపు మాట్లాడుతున్నది జమీం దార్‌తోనా?" అని అడిగాడు.

ఒక్క నిమిషంలో విరాజ్‌ముఖం వివర్ణమైంది. 'అవును' అని లోపలికి వెళ్ళింది.

ఇంట్లోకి వెళ్ళాక విరాజ్ తనమాట మర్చిపోయింది. కాని చిన్న కోడలి విషయం ఆలోచిస్తూంది. అయినా, ఆమె యెక్కువసేపు ఆలో చించకుండానే పదినిమిషాలు కాకముందే పీతాంబరుడు చిన్నకోడలిని కొట్టడం జరిగింది. వంతో నెమ్మదిగా చిన్నకోడలు ఏడుస్తూన్న శబ్దము కూడా వినిపించింది.

విరాజ్ పరుగెత్తుకుని పడకటింట్లోకి వెళ్ళింది. చాపుకూడా దగ్గర లోనే వుంచనుకుంది.

ఇప్పుడిప్పుడే నిద్రనుంచి మేలుకుని నీలాంబరుడు ముఖం కడు క్కుంటున్నాడు. పీతాంబరుడు భార్యను గదమాయిస్తూ, దబ దబమని దెబ్బలు కొడుతూండడం వినిపించింది. ఒక్క క్షణం చెవియొగ్గి నీలాంబ రుడు విని తడికదగ్గరకొచ్చాడు. ఒక్కదెబ్బతో తడికెలు విరగ్గొట్టి పీతాంబ రుని యింట్లోకి వెళ్ళి నిల్చున్నాడు.

పీతాంబరుడు తడికెవిరిగిన శబ్దము విని వెనక్కు తిరిగి చూశాడు' అన్నగారు తన యెదుట యమునిలా నిలుచుని వున్నందువల్ల ఆగాడు.

నేలమీదపడివున్న చిన్నకోడలును చూచి నీలాంబరుడు "లే అమ్మా, లేచి లోపలికెళ్లు. నీ కింకేమీ భయములేదు" అని అన్నాడు.

మోహిని లేచి వెళ్ళాక నీలాంబరుడు "ఆమె యెదుట నిన్నవ మానించలేను. నేను యీ యింట్లో వున్నంతకాలము, ఇవన్నీ జరుగ కూడదు. నువ్వు మోహినిని కొట్టినచేతిని విరగ్గొడతాను. ఈ సంగతి నువ్వు మర్చిపోవద్దు" అని వెళ్ళిపోయాడు.

పీతాంబరుడు లేనిధైర్యంతెచ్చుకొని,

"నన్ను కొట్టేందు కింట్లోదూరి వచ్చావు. కాని, నేనెందుకు కొడు తున్నానో నీకు తెలుసా?" అని అడిగాడు.

నీలాంబరుడు ముఖంత్రిప్పి నిలుచుని, "లేదు. అయినా తెలుసు కునే అవసరము లేదు" అని అన్నాడు.

"నీకు తెలుసుకోవాల్సిన పనేముంది? కాని, ఈ యిల్లువదిలి, ఇం కెక్కడన్నా వుండేందుకు మంచియిల్లు చూసుకోవలసివుంది."

"ఇల్లువదిలి యెవరు వెళ్ళాలో అది నాకు తెలుసు. నువ్వు జ్ఞాప కంచేయనవసరములేదు. కాని ఏదో ఒక ప్రయత్నము చేసేవరకూ ధైర్యము చిక్కబట్టి వుండు" అని నీలాంబరుడు వెళ్ళబోయాడు. పీతాంబ రుడు ఆయన దారిని అడ్డగించి "నీతో ఒక సంగతి చెపుతున్నా నన్నయ్యా! ఇతరుల మీద పలుకుబడి వ్యాపింపచేసుకునే ముందు, తన ఇంటిని అదుపాజ్ఞల్లో వుంచితే చాలా మంచిది" అని అన్నాడు.

నీలాంబరుడు తమ్ముని ముఖంలోకి చూస్తూ నిలుచున్నాడు. పీతాం బరుడు "నదికావల కడుతున్న తీరమెవరిదో నీకు తెలుసో లేదో? సరే! ఆ రేవు కడుతున్నప్పుడే, ఇక నదికెళ్ళవద్దని చిన్నకోడలితో చెప్పాను. కాని ఈరోజున కొంచెం చీకటిగా నున్నప్పుడే వదినెతో స్నానానికి వెళ్ళింది. వీళ్ల ప్రతిరోజూ వెళుతున్నారేమో! వీళ్ళను కనిపెట్టుకుని వుండేదెవరు?" అని అడిగాడు.

"ఇందుకే నువ్వు చెయ్యిచేసుకున్నావా?"

"అసలు సంగతంతా విను! అతనేమో జమీందారు కొడుకు. పేరు రాజన్‌బాబో యింకేమో అంటారు. ప్రస్తుతం అతని కీర్తి దేశదేశాల్లో ఎలా వ్యాపించిందో! ఈ రోజు వదిన వానితో మాట్లాడుతూంది. అసలు వదినె వాడితో ఎందుకు మాట్లాడవలసివచ్చింది?"

పీతాంబరుడు అంటున్న మాటలు సరిగ్గా అర్థంకాక నీలాంబరుడు "ఎవరు మాట్లాడింది? విరాజేనా?" అని అడిగాడు.

"అవును ఆమే!"

"నువ్వు. నీ కళ్ళతో చూశావా?"

"నువ్వు అనుమానపడతావని నాకు తెలుసు! కాని నాకూ. మీకూ న్యాయంచేయాలంటే ఆ భగవంతుడే చేస్తాడు. కాని—"

"భగవంతుడని పళ్ళీ అంటున్నావా? నువ్వు చెప్పేదేమిటో చెప్పు."

నా కళ్ళతో చూడంచే యేకీ చెప్పను. నువ్వు, నీ యిల్లు చక్కపెట్టుకోవు. పైగా యితరులను వుద్ధరిస్తానని వస్తావు. ఇదీ ఒక గొప్ప సంగతేనా?"

నీలాంబరుని నెత్తిమీద పిడుగుపడ్డట్టయింది. క్షణంసేపు పిచ్చివానిలా చూసి, "అరగంటవరకూ మాట్లాడిందా? ఎవరు? విరాజే! నీ కండ్లతో చూశావా?" అని మళ్ళీ రెట్టించాడు.

పీతాంబరుడు ఒకటి రెండడుగులు వెనక్కివేసి "అరగంటకు పైగా మాట్లాడం చూశాను" అని అన్నాడు.

"సరేనయ్యా, మాట్లాడిందే అని అనుకున్నాము. అలా మాట్లాడుతుందని నువ్వెలా అనుకున్నావు?"

"అది నాకు తెలియదు. అయినా ఇలా కొట్టడం నాకూ ఉచితం కాదు. అసలు ఆ రేవు మోహినికోసం కట్టలేదుగా?"

క్షణంలో నీలాంబరుడు ఉత్తేజితుడయ్యాడు. రెండుచేతులూ ఎత్తి పీతాంబరుని కొట్టబోయి మళ్ళీ ఆగి, "ఒకటి, నువ్వు జంతువువు. రెండోది, నాకు తమ్ముడివి. అన్ననైవుండి నేను నిన్ను శపించను; క్షమిచాను. గాని నువ్వు నీ పూజనీయులనన్నావు గనుక. భగవంతుడు విను

క్షమించడు" అని నీలాంబరుడు తన యింట్లోకివెళ్ళి, పడిపోయిన తడికెను తిరిగి కట్టాడు.

విరాజ్ చెవియొగ్గి అంతా విన్నది. సిగ్గూ. తిరస్కారములతో ఆపాదమస్తకం కంపించింది. అసలు జరిగిన సంగతంతా చెప్పుదామను కుంది. కాని కాళ్ళాడలేదు. తన అందముమీద పరపురుషునికి ఆసక్తి కలిగిన సంగతి ఆమె ఎలా చెప్పగలదు?

తడికె కట్టి నీలాంబరుడు బయటికెళ్లాడు. మధ్యాహ్నం భోజనం వడ్డించి, విరాజ్ చాటుగా నిలుచుంది. రాత్రి భర్త నిద్రపోయాక గది లోకి వెళ్ళి మళ్ళీ ఆయన లేవకముందే లేచి వెళ్ళిపోయింది.

ఈ విధంగా దూరంగా వుండి, వుండి రెండురోజులు గడపింది. ఈ మధ్యలో నీలాంబరుడు ఆమెను యేమీ అడగలేదు. ఇక విరాజ్ హృదయంలో సంశయం కలిగింది.

భర్త ఈ సంగతిఏది నమ్మలేదని ఆమెకు బాగా దృఢమైంది. కాని తను యిలా దాగుడుమూతలాడుతూ తిరుగుతున్నా భర్త యెడమొహంతో యెందుకున్నాడు?

కాని జరిగిన సంగతంతా చెప్పితేనో? పనికిరాదు. ఇన్ని రోజుల్నుంచి చెప్పకుండా ఇప్పుడు తనంతట తా నెందుకు చెప్పాలి?

ఆ రోజునకూడా అలానే జరిగింది. ఆ మరునాడు భయంతో విరాజ్ యింటిపనులు చేసుకుంటూంది. గబుక్కున విరాజ్‌కు ఒక భయము కలి గింది. పీతాంబరుని మాటలే నమ్మినట్లయితే! వుండలేక గబగబా పరుగెత్తు కుంటూ వచ్చి నీలాంబరునిముందు నిలుచుంది. అప్పుడే నీలాంబరుడు సంధ్యోపాసనచేసి లేవబోతున్నాడు,

నీలాంబరుడు విస్మయంతో తలెత్తిచూశాడు. విరాజ్ పెదిమ లను అణచుకుంటూ, "మీరు నాతో మాట్లాడ్డంలేదెందుకు ?" అని అడిగింది

నీలాంబరుడు నవ్వి, "నువ్వు తప్పించు తిరుగుతూంటే. నే నెవరితో మాట్లాడను?" అని అన్నాడు.

"నేను తప్పుకు తిరుగుతున్నానా? అయితే మీరు కొంచెం పిలవ కూడదా?"

"తప్పించుకు తిరిగేవాళ్ళను పిలిస్తే పాపము."

"పాపమా? అయితే మీరు పీతాంబరుని మాటలు నమ్మారన్న మాట, అంతేనా?"

"నిజమైతే యెందుకు నమ్మకూడదు?"

కోపముతో, విచారముతో విరాజ్ యేడ్చి, "ఆ సంగతి నిజం కాదు, వట్టి అబద్ధము. పదహారణాల అబద్ధము. మీ రెందుకు నమ్మారు?"

"అయితే అతనిలో నువ్వు మాట్లాడలేదా?"

"అవును, మాట్లాడాను."

"నేనూ అదే నమ్మాను."

కన్నీళ్ళు తుడ్చుకుని, "నమ్మితే, యీ నీచప్రకృతిమనిషిని దూరంగా ఎందుకు వుంచలేదు?" అని అడిగింది.

నీలాంబరుడు నవ్వాడు. అప్పుడప్పుడే వికసించిన పువ్వులా అతని ముఖం పులకితమైంది. కుడిచేయి ఎత్తి, "అయితే నా దగ్గరకురా! చిన్న తనంలో నీ చెవి మెలివేసినట్లు యింకొకసారి మెలివేస్తాను" అని అన్నాడు.

విరాజ్ నిమిషంలో భర్త దగ్గరకొచ్చి మోకాళ్ళమీద కూచుని, మళ్ళీ ఆయనవడిలో తలదాచుకుని వెక్కి వెక్కి యేడ్చింది.

నీలాంబరుడు భార్యను వారించలేదు. అతనుకూడా కళ్ళవెంట నీళ్లుపెట్టాడు. భార్యతలమీద కుడిచేయిపెట్టి మనసులో దీవించాడు.

ఏడుపుకొంత ఉపశమించాక, ఆమె—

"నే నతనితో యేమేమి మాట్లాడానో తెలుసా?" అని అడిగింది.

"తెలుసు. యింకెప్పుడూ యిటు ముఖం చూపవద్దని చెప్పావు"

"మీ కీ సంగతి ఎవరు చెప్పారు?"

"నా కెవరూ చెప్పలేదు. నీ కపరిచితులైన పురుషులు కంటబడితే నువ్వేమి సమాధానము చెప్పగలవో అది నే నూహించాను" అని మళ్ళీ

"కాని, నువ్వు చేసిం దంత మంచిపని కాదు. కొంచెం నా చెవినివేసినట్లయితే నే వెళ్ళి మాట్లాడేవాణ్ణి, అతని మనోభావము నా కిదివరకే తెలిసింది. నేను అనేకసార్లు వేకువ జామున యిక్కడ చూశాను. కాని, నువ్వు న న్నాపావు. జమీందారుతో తగువులాట్టం మంచిది కాదన్నావు" అని అన్నాడు.

ఆనాడు ఆకాశము మేఘాలతో నిండింది. ఉండి వుండి వర్షము కురుస్తోంది. చీకటిపడినాక పక్కమీద భార్యాభర్త లిద్దరూ ఆ విషయం గురించే మాట్లాడుకుంటున్నారు.

నీలాంబరుడు "ఈ రోజంతా అతనికోసమే చూశాను" అని అన్నాడు.

"ఎందుకు?"

"అతనితో రెండు సంగతులు చెప్పకుంటే భగవంతుని దృష్టిలో దోషి నవుతానని"

"వద్దు. అలా చేయవద్దు. యీ విషయంలో ఒక్క మాటకూడా అనవద్దు."

"నేను భర్తను. నా కేమీ బాధ్యత, అధికారం లేదా?"

భర్తకున్న రెండో బాధ్యత నిర్వర్తించండి, ఈ కర్తవ్యాన్ని ఆ తరువాత పాలించండి"

"ఏమిటి?" అని నీలాంబరుడు కొంచెంసేపు మెదలకుండా వుండి ఆ తరువాత "సరే" అని ఒక ప్రక్కకు తిరిగి పడుకున్నాడు,

విరాజ్ పడుకుని "ఈనాడు ఇలా వచ్చిందేమిటి?" అని ఆలోచిస్తోంది.

వర్షము కురియడం ఇదే మొదలు. బయట టప టపలాడుతూ వర్షము కురుస్తోంది. ఆ కారణంగా, యెండి బీటలువారిన మట్టిలోంచి వచ్చే సుగంధ వాసన, తెరిచివుంచిన కిటికీగుండా లోపలికి వస్తోంది. ఇటు లోపల భార్యాభర్త లిద్దరూ మూతి ముడుచుకొని పడుకునివున్నారు.

చాలాసేపయాక నీలాంబరుడు నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ, పిరాంతో నిండిన కంఠంతో, "విరాజ్! నే నెంత పనిపాటలేని మనిషినో

అది నీ వద్ద నేర్చుకుంటున్నంతగా యింకెవరివద్దా నేర్చుకోలేదు" అని అన్నాడు,

విరాజ్ ఏదో అందామనుకుంది. కాని నోరు పెకిలిరాలేదు. అసహ్యమైన దుఃఖముతో, దరిద్రముతో పీడింపబడుతున్న యీ భార్యాభర్తలకు చాలారోజుల తరువాత సంధి జరగబోతూవుంది. అయినా దాని కెలా సూత్రప్రాయమైందో, అలానే మళ్ళీ చిన్నాభిన్నమై ఊరుకుంది.

# 10

మధ్యాహ్న సమయము. ఇంట్లో నీలాంబరుడూ, పీతాంబరుడూ యెవరూ లేరు. అక్కడింకే మనిషీ కనుపించలేదు. అటువంటి నిర్మానుష్యమైన సమయముచూసి మోహిని యేడుస్తూ విరాజ్‌కాళ్ళ వద్ద కూచుంది. తన భర్త విరాజ్‌కు చేసినతప్పు క్షమించతగినది కాదని ఆమెకు తెలుసు. అందుకని యీ రెండురోజులనుంచీ, యిటువంటి సమయంకోసమే చూస్తోంది. ఆమె యేడుస్తూ, "అక్కయ్యా! వారిని మాత్రం శపించవద్దు. అదీగాక, నా ముఖమన్నా చూచి వారిని క్షమించు! వారి కేమన్నా అపకారము జరిగితే, నేను జీవించలేను" అని అంది.

విరాజ్, మోహినిని లేవదీసి "నేను శపించను చెల్లీ! నాకు అరిష్టము కలుగచేసే శక్తి అతనిలో లేదు. కాని, అతను సాధ్వీలాంటి నిన్ను కొట్టినందుకు, భగవంతుడు సహించడు" అని అంది.

మోహిని కంపించి—కళ్లు తుడ్చుకుని "ఏం చేయను ...అది వారి స్వభావము. ఆయన యింతకోపాన్ని సృష్టించిన భగవంతుడే ఆయన్ని క్షమిస్తాడు. ఈయన అవినీతిని క్షమించమని నేను ప్రార్థించని దేవుడు లేడు. నేను మహా పాతకురాలిని. అందులో ఏ దేవుడూకూడా నా మొరాలకించినట్లు లేదు" అని అన్నది.

చిన్నకోడలు పాలభాగంమీద కుడిప్రక్కనున్న నల్లని మచ్చను ఇంతవరకూ విరాజ్ చూడలేదు. ఆ మచ్చ చూడగానే "నీకు యీ మచ్చేమిటి? ఇది కొట్టినప్పుడు తగిలిందేనా?" అని అడిగింది.

చిన్నకోడలు సిగ్గుతో తలూపింది.

"దేనితో కొట్టాడు?"

తన భర్తచేసిన ఈ సిగ్గుమాలిన పనికి తలెత్తలేక, మెల్లమెల్లగా- "ఆయనకు కోపమువస్తే యుక్తాయుక్త జ్ఞానము నశిస్తుంది" అని చెప్పింది.

"ఆ సంగతి నాకు తెలుసు! దేనితో కొట్టాడు?"

"వారి పాదాల స్లిప్పరుతో...."

విరాజ్ కళ్ళలో నిప్పుకణాలు వున్నట్లుంది. కొంచెం సేపయాక "ను వ్వెలా సహించావు మోహినీ" అని అడిగింది.

"ఏంచేయ నక్కయ్యా, దెబ్బలు తినీ తినీ అలవాటైపోయింది."

"దీనికి నువ్వు క్షమాపణ కోరుకునేందుకు వచ్చావా?"

"అవు నక్కయ్యా, నువ్వు సంతోషించకపోయినట్లయితే, వారికి శుభము చేకూరదు....అదీగాక 'నువ్వెలా సహించా'వని అడిగావే, అది నిన్ను చూచే నేర్చుకున్నాను. నాకు తెలిసివున్న కొద్ది విషయాలు నీ పాద...."

మధ్యలోనే మాటను ఖండించి "కాదు....మోహినీ కాదు. నువ్వు అబద్ధమాడవద్దు. ఇటువంటి అవమానము నేను సహించలేను"అని అంది.

మోహిని కొంచెం నవ్వి, "నేను అవమానం సహించడమే గొప్ప పనా అక్కయ్యా? భర్తలాంటి పురుషుడు ప్రపంచంలో యెంతమందికి దొరుకుతారు? అయినప్పటికీ నువ్వు సహించినన్ని కష్టాలు మేము సహించాలంటే ప్రాణమేపోతుంది. ఆయన ముఖంలో సంతోషచిహ్నాలు లేవు. అది నువ్వు రాత్రింబగళ్లు చూడవలసివచ్చింది. భర్త అటువంటి సంకటావస్థలో వున్నప్పుడు నీకంటే యింకే ఆడది చూచి సహిస్తుంది?" అని అన్నది.

విరాజ్ మాట్లాడలేదు.

మోహిని గబుక్కున విరాజ్‌కాళ్లుపట్టుకుని "నువ్వు వారిని క్షమించావో లేదో చెప్పు? నువ్వు 'అవును' అని అననంతకాలమూ నే నీ కాళ్ల వదలను అక్కయ్యా! నువ్వు క్షమించనంటే ఆయన్ని రక్షించేవాళ్ళెవరూ లేరు" అని అన్నది.

విరాజ్ తన కాళ్ళు వదిలించుకుని, ఆమె గడ్డాన్ని పట్టుకుని "క్షమించాను" అని అంది.

మోహిని, మళ్ళీ ఒక్కసారి విరాజ్‌కాళ్ళు ముట్టుకుని సంతోషంగా వెళ్ళింది. విరాజ్ సంభ్రమాశ్చర్యంతో అక్కడే కూర్చుంది. ఆమె హృదయంలోంచి యెవరో పిల్చి "ఇదిచూచి నేర్చుకో విరాజ్." అని చెప్పినట్లుంది.

ఆ నాటినుంచి మోహిని విరాజ్‌ఇంటికి రాకపోయినా, ఒక కన్ను ఒక చెవి అటువైపునే వుంచింది. ఒకనాడు ఒంటిగంట కొడుతుండగా, ఇటూ, అటూ చూస్తూ మోహిని విరాజ్ యింట్లోకి వచ్చింది.

విరాజ్‌చేతిని చెంపల కానించుకుని వంటింటి మెట్లమీద కూచుని వుంది. మోహిని రావడం గమనించకుండా, అల్లాగే కూచుంది.

మోహిని ఆమెకు సమీపంలో కూచుని, పాదాలు స్పర్శించి—"అక్కయ్యా! నువ్వు పిచ్చిదాని వైపోతున్నావే?" అని అడిగింది.

విరాజ్ ముఖంతిప్పి కొంచెం కఠినంగానే, "నువ్వేమీ పిచ్చిదానివవకుంటేను కదూ?" అని అంది.

"అక్కయ్యా! నన్ను నీతో సరిపోల్చి, న న్నవమానంపాలు చేయకు. నీ కాలిమట్టితో కూడా నేను సరిపోలను. కాని, నువ్విలా అయ్యేందుకు, కారణమేమిటో తెలుసుకోవాలని వుంది. ఈరోజు నువ్వు బావగారికి తిండి పెట్టలేదా?"

"నే నాయన్ని తిండి తినవద్దనలేదు."

"నువ్వు వద్దనలేదన్న సంగతి నిజమే! కాని నువ్వు గుమ్మం బయటి కెందు కెళ్ళావు? ఆయన కంచం ముందుపెట్టుకుని, ని న్నెన్ని మార్లు పిలిచినా, పలకనూలేదు, వులకనూలేదు. సరే, అందువల్ల విచారము కలుగదా ఏమిటి నువ్వే చెప్పు. ఆయన పిల్వగానే దగ్గర కెళ్ళినట్లయితే కంచం వదిలిపెట్టి లేచి వెళ్ళివుండకపోను."

విరాజ్ మౌనంగా వుంది.

"చేతిలో పని వుండని నువ్వు అంటావేమో! నువ్వెప్పుడూ ఆయన కెదురుగా కూచుని భోజనం వడ్డిస్తుంటావు. నీ దృష్టిలో ఇంతకంటే మంచి కార్యమూ యింకొకటి లేదు. కాని ఈరోజు...."

ఈ మాట పూర్తికాకముందే విరాజ్ మోహిని చెయ్యిపట్టుకుని పిచ్చిదానిలా లాగుతూ—"నువ్వు చూడగలవా? రా" అని వంటింటిలోకి లాక్కుని వెళ్ళింది.

వంటింట్లో ఎర్రబియ్యపు అన్నం ఆకుకూర తప్ప యింకేమీ ఆ పళ్ళెంలో లేవు.

ఈ అన్నానికి తగినకూర కనబడనందున విరాజ్ నదీతీరాన ఆకు కోసుకొచ్చి వండింది.

ఇదంతా చూడగానే మోహినికళ్ళవెంట నీళ్లు కారినయ్. కాని విరాజ్‌కు కంట నీరులేదు. ఆ ఇద్దరి తోడికోడండ్రు ఒకరిముఖాలు ఒకరు చూచుకుంటూ నిలుచున్నారు.

విరాజ్ "నువ్వూ ఒక ఆడదానివే! నువ్వుకూడా వంటచేసి భర్తకు పడ్డిస్తుంటావు. భర్త ఇటువంటి పదార్థాలు తింటుంటే ఎదురుగ్గా కూచుని చూచే స్త్రీ యెవరైనా వుంటుందేమో నువ్వు చెప్పు?" అని అడిగింది.

చిన్నకోడలు నోరెత్తలేకపోయింది. ఆమె కళ్ళల్లోంచి అదేవిధంగా కన్నీటిధారలు ప్రవహిస్తున్నాయ్.

విరాజ్...."సంయోగవశాత్తు, ఎప్పుడన్నా, వంట చేసేందు కాలస్య మైనా వారికి రుచించని వస్తువును వండినప్పుడు, ఒకమెతుకు వారు తక్కువ తిన్నట్లయితే, నా హృదయంలో విచారము యెంతకాలము వేధిస్తుందో యెవరిక్కి తెలియకపోయినా, నీకు బాగా తెలుసు, కాని. ఈనాడు వారి ఆకలి చూచికూడా యీ వస్తువులే ముందు పెట్టవలసివచ్చింది. ఇక ముందు యివికూడా దొరకవు" అని అంది.

విరాజ్ ఆవేదనతో, తోడికోడలివక్షస్థలాని కానుకుని వెక్కి-వెక్కి యేడ్చింది. ఆ యిద్దరు స్త్రీలు, స్వంత అప్పచెల్లెండ్రలా చాలాసేపు అలానే వున్నారు. చివరకు విరాజ్ తలెత్తి "కాదు. ఇక నేను దాచను. నా దుఃఖం కనుక్కునేవాళ్లు నీకంటే యెవరూలేరు. నే నిక్కడనుంచి తప్పుకోనున్నట్లయితే యీ సంకటావస్థ గట్టెక్కదని అనుకున్నా. కాని నే నిక్కడ ఉన్నంతకాలమూ ఆయనముఖం చూడందే వుండలేను. అంచు కని నేను వెళ్ళిపోతాను. నే వెళ్లాక వారిని, నీ వన్నా చూస్తావా?" అని అడిగింది.

"ను వ్వెక్కడి కెళతావు?"

ఆరిన పెదవులమీదకు లేనినవ్వు తెచ్చుకుని విరాజ్ "నే నెక్కడి కెళతానో అది నే నెలా నిర్ణయించగలను చెల్లీ? వినేవాళ్ళంతా యింత కంటే పాప మింకొకటి లేదంటారు. ఏది యెలావున్నా, యీ జ్వాల నుంచి తప్పించుకోవాలి" అని అంది—

మోహిని ఇప్పటికి విరాజ్‌హృదయాన్ని గ్రహించగల సమర్థురాలైంది. ఆమె కంపించింది. వ్యాకులపాటుతో "అక్కయ్యా! ఈమాటలు అనకూడదు. ఒకవ్యక్తి ఆత్మహత్యచేసుకుంటే మహాపాపం వస్తుంది. దానితోపాటు వినేవాళ్లకుకూడా పాపముసంక్రమిస్తుంది. ఛీ ఛీ, అక్కయ్యా ప్రస్తుతం నీ విలా మారిపోయావేమిటి?" అని అడిగింది.

"అది తెలియదు. ఇక నే నాయన తిండికి కావలసిన యేర్పాటు చేయలేనని మాత్రం తెలుసు"

"అయితే నేను మాటయిస్తున్నాను" అని మోహిని కూచుని విరాజ్ కాళ్లు పట్టుకుని "అక్కయ్యా! నా కిప్పుడు ఒక్క భిక్షపెట్టగలవా?" అని అడిగింది.

"అదేవిధమైన భిక్ష?"

"అయితే ఒక్క నిముషము ధైర్యంగా వుండు" అని మోహిని వెళ్ళబోయింతే, విరాజ్ ఆమె పైటకొంగును పట్టుకుని "వద్దు, వెళ్ళ వద్దు. నేను ఒక్క పూచికపుల్లేనా, ఒకరివద్దనుంచి పుచ్చుకోను" అని అంది.

"ఎందుకని తీసుకోవు?"

"వద్దు, అలావద్దు. ఒకరిసొమ్ము దమ్మిడీకూడా పుచ్చుకోను."

మోహిని క్షణంసేపుండి అక్కడేకూచుని విరాజ్‌నుకూడా తనదగ్గర కూచోపెట్టుకుని "అక్కయ్యా! నా మాట విను, నువ్వు ఒకానొకప్పుడు నన్ను ప్రేమించలేదు. నాతో సరిగా మాట్లాడేదానివికావు. ఈ కారణంతో నే నెంత యేడ్చి యెన్ని దేవుళ్ళకు మొక్కానో, వాటికి పరిమితిలేదు. ఈనాడవన్నీ సార్థకమైనాయ్. నువ్వు నన్ను చెల్లీ అని పిల్చావు. ఇప్పుడు కొంచెం ఆలోచించి చూడు! యీ అవస్థలో నన్ను చూస్తూ, నా కోసం నువ్వు కొంచెమైనా చేయకుంటే నీ హృదయము యెలా వుంటుంది" అని అంది.

విరాజ్ దీనికేమీ జవాబుచెప్పలేక తల వంచుకునే వుంది.

మోహిని లేచివెళ్ళి ఒక పళ్ళెంనిండా అన్నింకాలైన తినుబండా రాలు వుంచి, విరాజ్ పాదాలముందు పెట్టింది.

విరాజ్ చూస్తూనేవుంది. మోహిని ఆమె పైటకొంగున ఒక మొహరీ కడుతుండగా చూచి సహించలేక. మరిదిభార్యను త్రోసి—

"వద్దు, ప్రాణంపోయినా దీన్ని తీసుకోను" అని అంది.

మోహిని ఆ తాకిడిని తట్టుకొని—

"ఎందుకు తీసుకోవు? తీసుకోవాలి, యీ మొహరు బావగారిదే. అది ఆయన నాకు పెళ్ళప్పుడు యిచ్చారు" అని మోహిని మొహరీని, విరాజ్ పైటకొంగునకట్టి వంగి నమస్కరించి తన యింట్లోకి వెళ్ళింది.

## 11

ఎంతో కాలంనుంచీ సాగుతూన్న ఇత్తడి ఖార్కానా ఒక్కసారి ఆగి వూరుకుంది. విరాజ్ చేసిన మూసలు అమ్మిపెట్టే మాదిగది వచ్చి చెప్పింది. ఈ ఒక్క సంగతేకాదు. ఈ ఖార్కానా ఆగిపోవడం మూలాన్ని తమ నౌకరీకూడా పోయిందని చెప్పింది. ఇదంతా విని ఒక్క నిట్టూర్పు మాత్రం విడిచి విరాజ్ మెదలకుండా వూరుకుంది.

నీలాంబరుడు వచ్చి "నాకు నౌకరీ దొరికింది. ఈ రాబోవు నవ రాత్రులకు కలకత్తాలోని ఓ భజనమండలిలో మద్దెల వాయించేందుకు కుదిరాను" అన్నాడు.

ఈ సంగతి విన్నాక విరాజ్‌ముఖం మృత్యుముఖంలా మారింది. తన భర్త ఒకవేశ్యఆధీనంలో వుంటాడా? ఒక వేశ్య ఆశ్రయంలోవుండి గొప్పగొప్పవాళ్ళయెదుట ఆడుతూ—పాడుతూ తిరుగుతుంటాడా? అప్పుడు మా ఉదరాలు నిండుతాయా! సిగ్గుబిడియంతో ఆమె భూమిలో పాతుకు పోతున్నట్లుంది. కాని, నోరువిప్పి ఆయన పనిని వద్దనలేదు. జీవిత నిర్వ హణకు మరో వుపాయమూలేదు. ఆ సమయంలో విరాజ్‌ను నీలాంబరుడు చూడలేదు. అతను అట్లు చూడకపోవడమే మంచిదయింది. అట్లు

వచ్చాక నీరు నిముష నిముషానికీ తగ్గేవిధంగా, విరాజ్‌ముఖంలో నానా టికీ కళలు మారుతున్నాయ్! ఆమె యవ్వనమంతా యెటుపోయిందో తెలి యదు. ఆమె శరీరము శుష్కించింది, ముఖము మలినమైంది. దృష్టి అస్వాభికమైంది. ఏదో భయము, ఆమెకు ప్రతిక్షణం ప్రత్యక్షమవుతూంది కాని అది చూచేవా శ్చెవ్వరూ లేరు.

ఆమె స్థితి విచారించేది ఒక్క మోహినే. ఆమెకూడా నెల రోజు ల్నుంచి యింట్లోలేదు. ఆమెఅన్నగారికి శరీరారోగ్యము బావుండకపోతే తల్లిగారింటికి వెళ్ళింది. నీలాంబరుడు పగటిపూట ఇంట్లోనే వుండటం లేదు. అప్పుడప్పుడు రాత్రులు మాత్రము వచ్చేవాడు. అతని రెండుకళ్ళూ ఎర్రగా వుండేవి. ముక్కువెంట వేడివేడి నిట్టూర్పులు వచ్చేవి! విరాజ్ అంతా చూచి గ్రహించింది. కాని, ఏమీ అనేదికాదు. అసలు యేమీ మాట్లాడేందుకు ఇష్టంలేదు. ప్రస్తుతము కొంచెంసేపు మాట్లాడితేనే ఆమెకు ఆయాసం వచ్చేది.

కొన్ని రోజులనుంచి, విరాజ్‌కి సాయంకాలం చలిగా, తలనొప్పిగా వుంటోంది. ఈ స్థితిలో శరీరముండగా, చీకటి పడుతుండగా చిమచిమ లాడుతూన్న దీపాన్ని తీసుకుని, వంటింటిలోకి వెళ్ళవలసివచ్చేది. భర్త పగలు ఇంట్లోవుండని కారణముచే, వంటచేసేది కాదు? రాత్రిపూట మాత్రం వంటచేసి, భర్తగారు తిన్నాక తను అవన్నీ చక్కపెట్టి జ్వర ముతో తిండి తినకుండానే పడుకునేది. కాలం గడుస్తోంది. ఇప్పు డిక దేవు డని-- భర్తయని విరాజ్‌కు శ్రద్ధలేదు. ప్రస్తుతం ఆమె యిదివరకుమల్లే ప్రార్థనకూడా చేయడం మానేసింది. ప్రాతఃకాలము మాత్రం పూజాపున స్నానములు అయాక, పైటకొంగు మెడకు చుట్టుకుని "నారాయణా--- నేను నడుస్తున్న త్రోవ తొందరగా సమాప్తిఅయేటట్లు ప్రసాదించు. తొందరలో నేను గమ్యస్థానం పొందేటట్లు ఏర్పాటుచేయి" అని ప్రార్థించేది.

ఆనాడు శ్రావణ సంక్రాంతి. ఉదయంనుండి జోరుగా వర్షము కురుస్తోంది. ఒక్క క్షణంకూడా తెరిపిలేదు. మూడురోజులనుంచి, అన్న పానాదులు లేకపోవడంచేత, విరాజ్‌కు ఆకలి, దాహమూ యెక్కువైనయ్! అందువల్ల ఆమె మంచంమీదనుంచి లేచి కూచుంది. నీలాంబరుడు ఇంట్లో

లేదు. భార్య జబ్బుగావుండడము చూచికూడా, ఆయన గావూపురం వెళ్లాడు. అక్కడ తనకొక ధనవంతుల శిష్యుడున్నాడు. అక్కడికెళితే యేమన్నా దొరుకుతుందని అతని ఆశ. విరాజ్‌తో తను రాత్రికే తిరిగి వస్తాననీ, అక్కడసలు ఆగననీ, చెప్పి వెళ్లాడు. కాని ఇప్పటికి మూడురోజులైనా ఆయన రాలేదు. ఈ రోజుకూడా ఆయన వచ్చే జాడలేదు.

ఇప్పటికి విరాట్ కళ్ళవెంట నీళ్లు కార్చి చాలాకాలమైంది. మళ్ళీ ఇప్పు డామెకళ్ళల్లో నీళ్ళు కనుపించినయ్। అనాడు యెంతో యేడ్చింది. ఇంకెంత మాత్రమూ వుండలేకపోయింది. చీకటిపడుతుండగా నెత్తిమీద ఓ గుడ్డవేసుకుని, కంపిస్తూ బయటికివచ్చి దారిప్రక్కన నిలబడింది. వర్షా కాలమునాటి ఆ చీకటిరాత్రిలో తను చూడగలిగినంత దూరం చూచింది. కాని. ఆమె కెక్కడా యేమీ కనిపించలేదు. తిరిగి వచ్చింది. తడిసిన వస్త్రముతో, జుట్టుతో, దేవీమందిరపు స్తంభాన్ని అనుకుని యేడుస్తోంది. విచారముతో ఆమె మనసులో "వారి క్షేమి అనిష్టం జరిగిందో తెలియదు. దుఃఖం, కష్టం సహించి ఆయన శరీరం దుర్బలమైంది. దానిమీద అంత దూరం నడవాల్సివుంది. కొంపతీసి ఆయన ఆరోగ్యము చెడిపోలేదుగదా? లేకుంచే ఏదైనా బండిక్రింద పడలేదుకదా? ఆయన కే విధమైన అశుభము కలుగలేదుకదా? నే నీ యింట్లో కూచుని ఆయనస్థితి నెలా కనుక్కోను."

ఇంకొక విషమపరస్థితివుంది. ఇంట్లో పీతాంబరుడు లేడు. నిన్న రెండోజామునే మోహినిని తీసుకొచ్చేందుకు వెళ్ళాడు. ఇంత పెద్దఇంట్లో ఒంటరిగా విరాజ్ ఒక్కర్తెవుంది. మధ్యాహ్నమునుంచి ఆమెకు జ్వరము తగ్గింది. కాని నోట్లో వేసుకునేందుకు తగిన పదార్థమేమీ యింట్లోలేదు. ఇప్పటికి రెండు రోజులనుంచి ఆమె నీళ్ళుత్రాగి వుంంది.

వర్షములో తడిసినందున విరాట్‌కు చలి అనిపించింది. ఆమెకు విచారంతో తల తిరిగింది. చేతులబలంతో లేచి దేవీమందిరంలోకి వెళ్ళి నేలమేద పడుకుని, తలను నేలకేసి కొట్టుకుంది.

బయట తలుపెవరో కొట్టారు. విరాట్ చెవియొగ్గి విన్నది. తలుపును రెండోమారు కొట్టడం విన్నది. ఈ అలికిడి వినడంతోనే యింతకు ముందు లేచేందుకు శక్తిలేని విరాట్ గబగబా లేచి వెళ్ళి తలుపుతీసింది.

ఆ తలుపు కొట్టింది. ఒకరైతు పిల్లవాడు. వాడు "అమ్మా! బాబు గారు ఒక పొడిగోవతి తెమ్మన్నారు" అని చెప్పాడు.

ఆ పిల్లవాని మాటలు సరిగ్గా అర్థంచేసుకోలేక, తలుపును ఆధారంగా చేసుకుని "గోపతి తెమ్మన్నారా? ఆయ నెక్కడ వున్నారు?" అని అడిగింది.

"గోపాల్ మహారాజుగారి తండ్రిని శ్మశానానికి చేర్చి యిప్పుడే తిరిగి వచ్చారు."

"శ్మశానానికి పంపించా?" అని ఆమె నిశ్చేష్టురాలైంది. "గోపాల చక్రవర్తి దూరపు బంధువు. అతని తండ్రి కొన్ని రోజులనుంచి జ్వరంతో బాధపడుతుంటే రెండురోజులక్రితమే నదీతీరానికి తీసుకొనివెళ్లారు. ఆయ నిప్పుడు మధ్యాహ్నం పోవడంతో దహనసంస్కారములు చేసి వాళ్ళిప్పుడే తిరిగి వచ్చారు" అని చెప్పి ఆ పిల్లవాడు "అమ్మా! యీ జ్వరానికి బాబు గారికంటే నాటీజ్ఞానము తెలిసినవా శ్ళెవరూ లేరు. అందువల్ల ఆయన కూడా ఈ రెండురోజుల్నుంచి అక్కడే వున్నారు" అని చెప్పాడు.

తొట్రుపడుతూ విరాజ్ లోపలికివెళ్ళి, ఒక పొడివస్త్రము తెచ్చి మంచానికడ్డంగా పడింది.

ఒక్క మనిషికూడా అండలేకుండా అంత పెద్దయింట్లో జబ్బులో వుండికూడా, ఒక్కతే గడుపుతున్నప్పుడు, భర్తకు యీ సంగతి తెలిసి, ఇతరులకు సహాయపడుతుండడము చూస్తే, విరాజ్‌కు యెక్కడలేని దుఃఖము పొర్లుకొచ్చింది. ఈనాడామెకున్న అతిశయమే శిథిలమైంది. దానితోపాటు, వికలమైన ఆమె మనస్సు విరాజ్! ప్రపంచంలో నీ కెవరూ లేరు. నీకు తల్లీ, తండ్రీ, అన్నదమ్ములూ, అప్పచెల్లెండ్రు ఎవరూ లేరు. చివరకు భర్తకూడా లేడు. ఒక్క యముడుమాత్రమే వున్నాడు. యముని దగ్గరతప్ప నీ కింకెక్కడా శాంతి దొరకదు" అని చెప్పినట్లనిపించింది.

బయట జోరున వర్షము కురుస్తూంది. కీచురాళ్ళు 'కీయ్' మంటూ న్నయ్. జోరుగా గాలి వీస్తోంది. అలా ధ్వనులన్నీ ఆమె చెవులకు 'కాదు కాదు' అని అన్నట్లుంది. గదిలో బియ్యములేవు. తోటలో పండ్లులేవు. చెరువులో చేపలులేవు. సుఖములేదు. శాంతిలేదు. ఆరోగ్యము సరిగా లేదు. ఇంట్లో మోహినిలేదు. వీటన్నిటితోపాటు తన భర్తకూడా లేడు.

అయినప్పటికీ ఆమె హృదయంలో. యీ విషయాలకు విరుద్ధముగా ఏ ఆక్షేపణా కలుగలేదు. ఈనాడు తనభర్త హృదయంలేనివాడని యిప్పుడు గోచరించినట్లు ఒక్కయేడాదికి ముందే కనుపించినట్లయితే, కోపముతో పిచ్చిదయేది.

ఈ భావాలన్నీ ఆమెను వేధిస్తున్నా, వాటన్నిటిని త్రోసిపుచ్చి 'ఈనా డాయన భోజనము చేయలేదు' అనే భావము పుటుకుతోంది.

ఇక విరాజ్ పడుకోలేకపోయింది. ఆమె గబుక్కున లేచి, చేట తీసుకుని సరంజామాగదిలోకెళ్ళింది. ఆగదిలో ఇంకా గింజలేమన్నా మిగిలివుంటాయేమోనని ఆమె ఆశ! యెంత వెదికినా పిడికెడు గింజలన్నా దొరకలేదు. బియ్యమూ, పప్పూ, యింకేవిధమైన తినుబడి పదార్థాలులేవు. ఇక నామె ఇంట్లోంచిబయటికివచ్చి, గుమ్మాన్నానుకుని కొంచెంఆలోచించి, దీపమార్పి తలుపుతీసి బయటికివచ్చింది. భయంకరమైన చీకటి. భయం పుట్టించే నిశ్శబ్దము. దారివెంట అక్కడక్కడ నాచుపట్టివుంది. అక్కడక్కడ పొదలూ, ముళ్ళూ వున్నాయ్! యీనాడు అవి విరాజ్ శక్తిని అడ్డుపెట్టలేకపోయినయ్. ఆ తోటకు రెండోవైపున కొన్ని చిన్నచిన్న పూరిగుడిసెలు వున్నయ్. ఆవేపు ఆమె వస్తూంది. విరాజ్ ఒక పూరి గుడిసె దగ్గర నిలుచుని "తులసీ' అని పిల్చింది. తులసి దీపాన్ని తీసుకుని బయటికివచ్చి విరాజ్‌ను చూట్టంతో, సంభ్రమాశ్చర్యంతో—"

"ఇంత చీకట్లో యిట్లా వచ్చారేమమ్మగారూ?" అని అడిగింది.

"కాసిని బియ్యముంటే యివ్వు"

"బియ్యం కావాలా?" అని ఆశ్చర్యపడింది, అంతగొప్పవారి పడుచు తన యింటికివచ్చి బియ్యం అడుగుతున్నదంటే, యిందులో యేదో పర మార్థముండితీరాలి.

ఆమెముఖంవేపు విరాజ్ చూచి "నిలుచోకు తులసీ! కొంచెం తొందరగా ఇవ్వు" అని అన్నది.

రెండుమూడు పర్యాయములు అడిగాక తులసి లోపలికి వెళ్ళి కొంచెం బియ్యం తెచ్చి, విరాజ్ కొంగున కడుతూ.... "అయినా, యీ ముడి బియ్యాన్ని నువ్వేమిచేస్తావమ్మగారూ? యీ బియ్యము మీ బోటివాళ్ళు తినలేరు" అని చెప్పింది,

"ఈనాడు ఇవే తినాలి."

తులసి దీపముతో సహా వచ్చి, విరాజ్‌ను యింటిదాకా పంపుదా మనుకుంది. అందుకు విరాజ్ ఒప్పుకోక, "అవసరములేదులే! నువ్వు మళ్ళీ ఒంటరిగా తిరిగి రాలేవు" అని చెప్పి నిముషంలో ఆ చీకటిలో అదృశ్యురాలైంది.

ఈనాడు తను ఒక అంటరానియింటికి భిక్షానికొచ్చింది. వాళ్ళభిక్షన్ని తీసుకుని ఇంటికి వచ్చింది. ఇంతగొప్ప అవమానము కూడా యీనాడు విరాజ్‌ను కష్టపెట్టలేదు. శోకము, విచారము, అభిమానమూ, అవమానమూ వీటి తీవ్రతను గ్రహించే శక్తి ఇప్పుడు విరాజ్‌లో లేదు.

ఇంటికిరాగానే నీలాంబరుడొచ్చినట్లు తెలుసుకుంది. మూడురోజుల నుంచి భర్తను చూడలేదు. ఈనా డాయన్ను చూడగానే శరీరంలోని రక్త మొక్కొక్క చుక్క మండుతూంది! కాని ఈ సమయాన ఆమె ఏమీ అన లేకపోయింది.

ధాతువు విద్యుచ్ఛక్తి సంపర్కము పొందినప్పుడు యెంత శక్తి వంతమవుతుందో విరాజ్ భర్తను చూడగానే అంత శక్తివంతురాలైంది. అయినప్పటికి కూడా సమస్త ఆకర్షణలకి విరుద్ధంగా మెదలకుండా నిలుచుని ఆమె ఒకే దృష్టితో చూస్తూవుంది.

నీలాంబరుడు ఒక్కసారి తలఎత్తి మళ్ళీ తల దించుకున్నాడు. ఆ క్షణంలోనే నీలాంబరుని కళ్ళు గన్నేరుపువ్వుల్లా యెర్రగా వుండడం గమనించింది. శవాన్ని పారేసేందుగాను శ్మశానంలో మూడురోజుల్నుంచి వుంటూ గంజాయిదమ్ము లాగుతుంటారని విరాజ్ గ్రహించింది.

అయిదారు నిముషాలు గడిచాక విరాజ్ భర్తదగ్గరకొచ్చి "తిండి తిప్పలు కాలేదా?" అని అడిగింది.

"లేదు"

విరాజ్ వంటింట్లోకి వెళ్ళబోతూంటే నీలాంబరుడు పిల్చి "యింత రాత్రప్పుడు నువ్వెక్కడికి వెళ్ళావు" అని అడిగాడు.

వెళుతున్నదల్లా ఆగి విరాజ్ కొంచమాలోచించి "అదే నదీతీరము కేసి వెళ్లాను" అని చెప్పింది.

ఆ మాట నమ్మక నీలాంబరుడు "కాదు. నువ్వు తీరంవేపు వెళ్ళ లేదు." అని అన్నాడు.

"అయితే మరి యమునిదగ్గర కెళ్ళాను."

అని విరాజ్ వంటింటిలో కెళ్ళింది.

ఒకగంటయాక వంటచేసి తిరిగి వచ్చేవరకు నీలాంబరుడు కళ్లు మూసుకుని వూరుకున్నాడు. గంజాయి యెక్కువగా త్రాగినందులకు అతని మనసులో కోపము బుద్ధి లేకుండా చేసింది అతను సరిగ్గా కూచుని మొదటివిధంగానే "నువ్వెక్కడి కెళ్లావు?" అని అడిగాడు.

విరాట్ తగిన జవాబు చెబుదామనుకుంది. కాని, ఆమె ఆ భావాన్ని కప్పిపుచ్చి శాంతంగా "ఇప్పుడు మీరు భోజనంచేసి పండుకోండి. రేపు అంతా చెపుతాను" అని అంది.

"కాదు, నువ్వెక్కడి కెళ్లావో, ఆ సంగతి యిపుడే చెప్పాలి"

నీలాంబరుడు అడిగిన తీరునుబట్టి విరాజ్ పెద్ద ఆపదలోపడి "ఒక వేళ చెప్పకుంటేనో" అని అడిగింది.

"కాదు, నువ్వు చెప్పితీరాలి"

"ఈ సంగతి నే నీనాడు చెప్పను. మీరు భోంచేసి పడుకోండి అప్పుడు చెపుతాను" విరాజ్ నవ్వుకు అతనికి సంతోషంలేదు. గుడ్లు రుముతూ ముఖం పైకెత్తాడు. అతని కళ్ళలో మత్తులేదు. వాటిలో హింసా, తిరస్కారము కనిపిస్తున్నయ్. గర్జిస్తూ "కాదు. యెప్పటికీకాదు. నేను తినను. ఇంత రాత్రప్పుడు నువ్వెక్కడి కెళ్ళింది చెప్పకుండా వున్నంతకాలము నీ చేతితో తెచ్చిన నీరుకూడా త్రాగను" అని అన్నాడు.

విరాజ్ వ్యాకులపడింది. కాలసర్పము కాటువేయబోతూన్న విధంగానే నీలాంబరునిముఖం తయారైంది. తడబడుతూ దగ్గర కెళ్ళి, కూలబడి "నేను ముట్టుకున్న నీళ్లుకూడా త్రాగరా?"

"లేదు. ఎప్పుడూ త్రాగను."

"ఎందుకని....?"

"ఇంకా యెందుకని అడుగుతావేం?"

భర్త వెఱ్ఱిచూపులు విరాజ్ చూచి ఆఖరుకు "నేను గ్రహించాను. ఇక నేను అడగను, మీరడిగినదికూడా యిప్పుడు చెప్పను. రేపు మీరు మత్తులోనుంచి కోలుకున్నాక, తెలుసుకుంటారు. ఇప్పుడు మీ బుద్ధి సరిగ్గాలేదు" అని అంది.

త్రాగుబోతు అన్నీ సహించగలడు, కాని ఒక్కమాట సహించ లేడు. మత్తువల్ల బుద్ధి భ్రష్టమవుతుందనే సంగతి. ఆ కారణంవల్ల మీరు మీలో లేరని విరాజ్ నోటిగుండా విన్నాక, నీలాంబరుని కోపానికి అంతు లేదు. కర్కశస్వరంతో — "నేను గంజాయి త్రాగాను. నువ్వు అనే దింతేనా? గంజాయివల్ల నా మతి పోయేందుకు, ఇది నేను క్రొత్తగా త్రాగుతుండడం లేదు. అదీగాక నీ బుద్ధిభ్రష్టమైంది. నువ్వు నీలో లేవు" అన్నాడు.

విరాజ్ ఆయనముఖంలోకి అలాగే చూస్తూంది.

నీలాంబరుడు "నువ్వెవరికళ్ళలో దుమ్ముకొడదామనుకున్నావు? నా కళ్ళలోనేనా? ఆనాడు నేను పీతాంబరుని మాటలు నమ్మలేకపోయాను. మూర్ఖుణి. అయినా, అతను నా తమ్ముడు. పెద్దన్నగారిమీదుండవలసిన భక్తిప్రభావాలు, కర్తవ్యమూ, అతను పాలించాడు. ఒకవేళ యేసంగతీ లేకుంటే నువ్వెక్కడికి వెళ్ళిందీ యెందుకు చెప్పవు? నువ్వు అబద్ధ మెందుకు చెపుతున్నావు? నిజంగా నువ్వు తీరంవేపు వెళ్ళావా?" అని అడిగాడు.

విరాజ్ నేత్రాలు రెండూ పిచ్చిదానిలా మిలమిలలాడినయ్. అయి నప్పటికీ, తన గొంతును తగ్గించి "నిజాన్ని కప్పిపుచ్చేందుకే నేను అబద్ధ మాడుతున్నాను. ఆ సంగతి వింటే మీరు సిగ్గుపడతారు. మీదు మిక్కిలి భోంచేయరు. కాని, నా యీ మాటలన్నీ నిరర్థకాలే. మీలో యిప్పుడు సంకోచమూ, సిగ్గూ లేవు. దానితోపాటు మనుష్యత్వముకూడా లేదు. మీరు నాతో అబద్ధము చెప్పలేదా? మీరు చేసిన మోసం, ఒక పశువుకూడా చేసేందుకు వెనకాడుతుంది. కాని, మీరు వెనకాడరు. మీరు సాధువుగా తయారవుతున్నారు. అయినా, యింట్లో రోగముతో పడి వున్న భార్యను వదిలి, మీ రే శిష్యుని దగ్గర, గంజాయి త్రాగుతున్నారో కొంచెం చెప్పండి" అని అడిగింది.

నీలాంబరుడు సంహించలేక "చెప్పుతున్నాను" అని చేతిలో వున్న ఆకు పళ్లాన్ని, విరాజ్ పేపు విసిరాడు. ఆకుపళ్ళెం పెద్దది. విరాజ్ నొసలుకు తగిలి ఖన ఖనలాడుతూ క్రిందపడింది. చూస్తుండగనే, విరాజ్, కనుకొనలనుంచి, జల—జలమంటూ. రక్తము పెదిమల వరకూ వచ్చింది. విరాజ్ముఖం రక్తముతో తడిసింది. యెడమచేత్తో నొసలు పట్టుకుని—"మీరు నన్ను కొట్టారా?" అని అరిచింది.

నీలాంబరుని పెదిమలు కపించినయ్. "లేదు, నేను కొట్టలేదు. కాని నువ్వు నా యెదుటనుంచి వెళ్లు. నీముఖం నా కింక చూపించకు. దూరంగా పో, నీచురాలా" అనిఅన్నాడు.

విరాజ్ లేచి నిలుచుని "వెళతున్నాను" అని ఒక్క అడుగు ముందుకేసి తిరిగి నిలుచుని,

"కాని, ఏం సహించగలవు? జ్వరంలో వున్నప్పుడు, నన్నుకొట్టి యింట్లోంచి వెళ్ళగొట్టానని, రేపు మీకు స్మరణకొచ్చినప్పుడు తెలుస్తుంది. మూడురోజులనుంచీ నేనేమీ తినలేదు, ఈ స్థితిలో ఇంత రాత్రప్పుడు మీ వద్దకు వస్తే నన్ను తరిమేస్తున్నారు. అయితే భవిష్యత్తులో నేను లేని కొరత సహించగలరా? యీ నీచురాల్ని వదిలి వుండగలరో లేరో!" అని అంది.

విరాజ్ నొసటినుంచి రక్తము కారడం చూచి, నీలాంబరుని మత్తు ఒక్కసారిగా వదిలిపోయింది. మూర్ఖునిలా మెదకుండా చూస్తూ వుండి పోయాడు.

పైటకొంగుతో రక్తాన్ని తుడ్చుకుని, "ఒక సంవత్సరంనుంచీ, నేను వెళతాను. వెళతాను అని అంటూనే మిమ్మల్ని వదిలి వెళ్లలేక పోయాను. నా వంట్లో శక్తి యేమీ లేదని కొంచెం పరికించి చూసి నట్లయితే మీకే తెలుస్తుంది. కళ్లతో సరిగ్గా చూడలేగపోతున్నాను. ఒక అడుగుకూడా నడవలేకపోతున్నాను. నేను వెళ్లలేను. అయినా నా కీనాడు మీరు జ్ఞాపకచిహ్నంలా ముఖంమీద వేసిన మచ్చతో యిక నా ముఖం మీకు చూపను. ప్రపంచంలో నాకున్న కోరిక మీ పాదాలముందు ప్రాణాలు పదులుదామనే ఈ కోరిక ఏంతో కాలంనుంచి నా హృదయంలో మెదు

లుతూ వుంది. మీ కాళ్ళముందు చచ్చిపోదామని నా కెంతో ఆశగావుండి. ఈ ఆశను వదలలేను. కాని, యీనాడు ఆ ఆశనుకూడా వదిలిపెట్టి కున్నాను" అని రక్తం తుడుచుకుంటూ విరాజ్ తెరిచివున్న వాకిలిగుండా తోటలో చీకటిలోకి అదృశ్యమైంది.

వర్షాకాలంలో ఇంత భయంకరమైన కటికచీకటిలో, సరస్వతీ నదీ తీరంకేసి ఒక్కసారి చూచినట్లయితే భయం కలగకమానదు. ఇప్పటి సరస్వతీనది వైశాఖమాసంలో బాగా యెండి, మెల్లగా ప్రవహించే నది కాదు. అప్పటికే వర్షాలు బాగా కురిసినయ్. అందువల్ల ఆ నది రెండు గట్లకు ఎగదట్టి మహావురవడితో ప్రవహిస్తూవుంది. ఒక వసంతఋతువు నాటి ఉదయాన, నీలాంబరుడు తన చెల్లెలితో వచ్చి కూర్చుని, ఆనంద మనుభవించిన నల్లబండమీద యీనాడింత చీకటిలో విరాజ్ కంపిస్తూ వచ్చి నిలుచుంది. ఆ క్రిందనే బ్రహ్మాండమైన జలరాశి గోడకు కొట్టు కుంటోంది. దానివేపు విరాజ్ వంగి చూచి మళ్ళీ తన ముందున్న ప్రదేశాన్ని చూస్తోంది. ఆమె కాళ్ళక్రింద ఆ నల్లనిబండ, తలపైన మేఘాలతో నిండిన నల్లని దట్టమైన ఆకాశమూ, యెదురుగ్గా నల్లని నీటి ప్రోపు, నాల్గు వేపులా నల్లని చీకటి అంటిపెట్టుకుని వుంది. వీటన్నిటితోపాటు విరాజ్ హృదయంలో ఆత్మహత్య చేసుకుందామనే నల్లని ప్రవృత్తి మేలుకుంది. విరాజ్ ఆ రాతిమీద కూర్చుని గట్టిగా కాళ్ళూ చేతులూ కట్టివేసుకునేందుకు ప్రారంభించింది.

# 12

మరునటి ఉదయంకూడా ఆకాశ మింకా మేఘాలతోనే నిండి వుంది. వర్షంకురుస్తూ వెలుస్తూంది. నీలాంబరుడు తలుపు తెరిచి గుమ్మం మీద తలపెట్టి యెప్పుడో నిద్రపోయాడు. ఇప్పటివరకు అతను కళ్ళు తెరవలేదు. ఇంతలోనే యెవరో "విరాజమ్మగారూ! ఏం చేస్తున్నారు?" అని పిల్చారు.

నీలాంబరుడు దిగ్గున లేచి కూర్చున్నాడు. ఒకనాటి వసంతఋతువు లోని ప్రభాతాన శ్రీకృష్ణునిపేరువిని, రాధకూడా యిలాగే లేచి కూర్చుని

వుంటుంది. కళ్లు నలుపుకుంటూ. నీలాంబరుడు బయటికి వచ్చాడు. వాకిట ముంగిట్లో నిలబడి తులసి పిలుస్తూంది. నీలాంబరుడు రాత్రంతా విరాజ్‌ను వెదుకుతూనే గడిపాడు.............చుట్టుప్రక్కల నున్న తోటలో, చెట్లుక్రింద పరీక్షగా చూశాడు. చివర కెక్కడా ఆమె కనుపించకపోయే సరికి యింటికి వచ్చి, గుమ్మంమీద తలపెట్టి పడుకుని, ఒక గంట గడిచి వుంటుందేమో! మరి యీ మధ్యలోనే నిద్రవచ్చేసింది.

"అమ్మగా రెక్కడ బాబుగారూ?" అని తులసి మళ్ళీ అడిగింది

మూర్ఛునిలా ఆమె ముఖంవేపు చూస్తూ నీలాంబరుడు "నువెవ్వరిని పిలుస్తున్నావు?" అని అడిగాడు.

"ఈ యింటి కోడలుగారినే పిలుస్తున్నాను బాబుగారూ! రాత్రి ఒక ఝామగడిచాక నా దగ్గరకువచ్చి 'ఇంట్లో యేమీ లేవ'ని చెప్పి, కాసిని ముడిబియ్యము తెచ్చింది. ప్రొద్దున్నే తలుపు తెరిచివుంటే అవి పనికి వచ్చాయో లేదోనని అడిగేందుకు వచ్చాను."

నీలాంబరుడు లోలోన అంతా అర్థంచేసుకున్నాడు. కాని, నోరు విప్పి ఏమీ చెప్పలేదు.

"అయితే ఇంత పెందలాడే తలుపెవరు తీశారు? ఒకవేళ విరాజమ్మగారు నదికి స్నానంచేసేందుకు వెళ్ళిందేమో?" అని తులసి వెళ్ళిపోయింది.

నీలాంబరుడు విరాజ్‌ను వెదికేందుకు బయలుదేరాడు. నదీ తీరాన్నున్న లోయలూ పొదలూ ఎన్ని వెదికినా, విరాజ్ కనిపించలేదు. ఉదయం నుంచి ఆయన స్నానంచేయలేదు. ఇక తిండి తినే దెవరు? విరాజ్‌ను వెదుకుతూ, వెదుకుతూ నీలాంబరుడు అలసిపోయి ఒకచోట ఆగి మనసులో "నేను ఎంత పిచ్చివాణ్ణయాను. ప్రొద్దుటినుంచీ నే నేమీ తినలేదని, విరాజ్‌కు తెలియదేమో! తెలిసివున్నట్లయితే ఆమె ఒక్క నిమిషమైనా నిలుచుంటుందా? అనవసరంగా నే నీ వుదయంనుంచీ తిరుగుతున్నాను" అని అనుకున్నాడు.

విరాజ్ తిరిగి, ఇంట్లోకి వచ్చేవుంటుందని నీలాంబరుడు మనసులో విశ్వయించుకున్నాడు. మానవనేత్రంతో అతను ఆమెను స్పష్టంగా చూచి

నట్లనిపించింది. వెంటనే మనసులో దురభిప్రాయాలన్నీ పోయినయ్.
దారిలోని ఎన్నో లోయలూ, పొలాలూ, యెన్నో పిల్లకాలవలు యిట్టేదాటి
యింటికి చేరాడు.

పగలంతా గడిచింది. పశ్చిమదిశను, సూర్యుడు తన యెర్రని
ముఖాన్ని కొన్నిక్షణాలపాటు మేఘాలచాటున దాచుకున్నాడు. నీలాంబరు
డా సమయానికి యింటికిచేరి, మొట్టమొదట అతను తిన్నగా వంటింటి
లోకి వెళ్ళిచూశాడు. ఉదయంవేసిన పీట అలానే వుంది. రాత్రి వండిన
అన్నం యెండి ఇంకా అక్కడ పడివుంది. వంటింటిలో అక్కడక్కడ
యెలుకలూ, బొద్దెంకలూ పరుగెడుతున్నయ్. కంచంలోని అన్నం చాలా
భాగం ఎలుకలు తిన్నయ్. రాత్రి నీలాంబరుడు ఇటువేపు రాలేదు. అప్పు
డా అన్నము చూసి, విరాజ్ తులసివద్ద తెచ్చిన ముడిబియ్యపు అన్నమే
ననుకున్నాడు. జ్వరముతో బాధపడుతూ కష్టమనుకోక భిక్షం అడుక్కొ
చ్చింది. ఈ బియ్యంకోసమే ఆమె దెబ్బలుతిన్నది. వీటి కారణంతోనే
ఆమె వినరాని మాటలువిని, సిగ్గుతో, అభిమానముతో ఈ కటికచీకటిలో
కష్టసుఖములతో యెప్పటినుంచో సంసారముచేసుకుంటున్న యింటిని
వదిలిపెట్టింది.

నీలాంబరుడు అక్కడే కూర్చుని రెండుచేతులతో ముఖం కప్పు
కుని, గట్టిగా యేడ్చాడు. విరాజ్ ఇంతవరకూ తిరిగి రాలేదు. ఇక తిరిగి
వచ్చే ఆశకూడా లేదు. భార్యసంగతి అతనికి తెలుసు. ఆమె యెంత అభి
మానవంతురాలో అతనికి తెలుసు. ప్రాణంపోయినా ఆమె యితరుల
ఇంట్లోవుండి కళంకితురాలయేందుకు వొప్పుకోదు. భూమిమీద బోర్లాపడు
కుని "నేను నువ్వు లేకుండావుండను. విరాజ్! నువ్వు తిరిగిరా" అంటూ
యేడ్చాడు.

చీకటి పడింది. ఇంట్లో దీపమెవ్వరూ వెలిగించలేదు. రాత్రయినా
వంటచేసేందు కెవరూలేరు. ఏడుస్తూ యేడుస్తూ నీలాంబరుని ముఖం
కళ్ళు వాచినయ్. అతని కన్నీళ్ళు తుడిచేవాళ్ళెవరూలేరు. రెండురోజుల
నుంచి తిండిలేదు. ఒక్క మెతుకుకూడా నోట్లో వేసుకోలేదు. అయినా,
అతణ్ణి అన్నానికి ఎవరూ పిలవలేదు. జోరుగా బయట వానకురుస్తోంది.

ఆ భయంకరమైన చీకటిని చీల్చుకుంటూ, మెరుపులు అతని కళ్ళమీదపడి ఈ రాత్రే మహాభయంకర మయినదని చెప్పినట్లుంది. అయినా, నీలాంబరుడు లేవలేదు, కళ్లు తెరవలేదు. పడివున్నవాడు పడివుండే ఏడుస్తున్నాడు.

నీలాంబరునికి మెలకువవచ్చేసరికి తెల్లవారింది. బయట ఏదో గందరగోళము విని, పరుగెత్తుకుంటూ బయటికి వచ్చాడు. గుమ్మంముందు బండి ఒకటి నిలుచుంది. బయటకు వచ్చి నిలుచోవడంతో చిన్నకోడలు దిగి తలముసుగు సరిచేసుకుంటూ, బండి దిగింది, ఒక్కసారి అన్నగారి వేపు వక్రదృష్టితో చూచి పీతాంబరుడు లోపలకు వెళ్లాడు. మోహిని బావగారి పాదాలకు నమస్కరించింది. నీలాంబరుడు నోరువిప్పి యేదో ఆశీర్వాదమిద్దా మనుకున్నాడు. కాని, నోటివెంట మాట పెకలలేదు. పై పెచ్చు దాగివున్న ఏడ్పు ఒక్కసారిగా కట్టలు త్రెంచుకుని బయటకు ప్రవహించింది. మోహిని తలెత్తి చూచేసరికి ఆయ నక్కడ లేడు.

చిన్నకోడలు తన భర్తతో వాదించటం ఇదే ప్రథమము. కన్నీళ్ళతో బరువుగా వున్న, తన రెండు కళ్ళను యెత్తి, "మీ హృదయం రాతితో చేశారా ఏం? దుఃఖాలతో, కష్టాలతో అక్కయ్య ఆత్మహత్య చేసుకుంది. అయితే, మనం ఇప్పుడుకూడా పరాయివాళ్ళలాగానే వుందామా? మీ మనస్సు ఒకవేళ అట్లాగే వున్నట్లయితే వుండవచ్చును. కాని, నా హృదయంమాత్రం ఈనాటినుంచీ ఆ ఇంటిపనులుకూడా చేయమని చెపుతూంది" అన్నది.

పీతాంబరుడు త్రుళ్ళిపడి "ఏమి టంటున్నావు?" అని అన్నాడు.

మోహిని తులసి చెప్పగా విని, తను అనుమానించినది అంతా భర్తతో చెప్పింది.

పీతాంబరుడు గబుక్కున నమ్మే స్వభావంకలవాడు కాదు. అందువల్ల "అయినా నీళ్ళల్లో ఆమె శవము తేలిందా?" అని అడిగాడు.

"శవము తేలడ మంత పెద్దపనికాదు. ఆమె దూకడంతోనే ప్రవాహములో కొట్టుకపోవచ్చు. లక్ష్మిలాంటి పవిత్రురాలు. గంగామతల్లి తన వొడిలోకి లాక్కపోవచ్చు. అదిగాక ఆమె సంగతెవరు కనుక్కున్నారు? వెదికేందు కెవరెళ్ళారు?"

భార్య అన్న మొదటిమాటను పీతాంబరుడు నమ్మక చివరిమాటను నమ్మి "సరే. నేనే వెదుకుతాను" అని మళ్ళీ కొంచెమాగి "అయితే, వదినెగారు ఆమె మామగారింటికి వెళ్ళలేదుకదా?" అని అడిగాడు.

మోహిని తలూపుతూ "ఆమె అక్కడికి కెప్పుడూ వెళ్ళదు. అక్కయ్య మహా అభిమానవంతురాలు, ఈ నదిలోనే ఆమె ఆత్మహత్య చేసుకుని ఉంటుంది" అని చెప్పింది.

"సరే వెళ్ళి వెదుకుతాను" అని పీతాంబరుడు బయటికి వెళ్లాడు. ఈనాడు వదినగారి కోసము అతని మనసు విచారించింది. విరాజ్‌ను వెది కేందుకు ఆయన కొంతమంది మనుష్యులను నియమించాడు. ఒక మని షిని, విరాజ్ మామగారియింటికి పంపాడు. ఈవిధంగా పీతాంబరుడుమొట్ట మొదటిసారి తన జీవితములో పుణ్యకార్యము చేశాడు. భార్యనుపిల్చి యదుని పిల్చి, ఇంటికి అడ్డుగా పెట్టిన తడికె పీకించివేయ్. నువ్వు చేయ వలసిన విధంగా చేయ్" అని నోట్లో కొంచెం బెల్లం వేసుకొని, నీళ్లుత్రాగి దస్తరం చంకలో పెట్టుకొని తన పనిమీద వెళ్ళాడు.

ఇంటి పనులన్నీ చేసుకుంటూ మోహిని "ఎవరి కష్టసుఖాల్నీ చూడని తన భర్త ఇప్పు డీ విధంగా యెవరి ముఖం చూచి మారారా?" అని ఆలోచిస్తూ కూర్చుంది.

నీలాంబరుడు దేవీమందిరముమధ్య కళ్లుమూసుకుని కూర్చున్నాడు. ఎదురుగా గోడకు, రాధాకృష్ణుల పటం వ్రేలాడుతూంది. ఈ పటం మేలు కుని వుందా? ప్రాణంతో వుందా? రైళ్ల పడకపూర్వం నీలాంబరుని తండ్రి కాలినడకను బృందావనమువెళ్ళి దీన్ని తీసుకొచ్చారు. ఆయన పరమ వైష్ణవుడు. ఆయనగారితో యీ పటము మనిషిలానే మాట్లాడేదట. ఈ సంగతి తనతల్లి చెప్పగా, నీలాంబరుడు యెన్నోసార్లు విన్నాడు. ఆయ నకు దేవతలు రాతిబొమ్మలుకారు. ఆయన పిల్చినవెంటనే, పీళ్లంతా ఆయనకు సాక్షాత్కరించేవాళ్లట! ఈ కారణంవల్ల, నీలాంబరుడు యిత రులకంటికి కనపడకుండా యెన్నోసార్లు విగ్రహాలతో, పటాలతోమాట్లా డేందుకు ప్రయత్నించేవాడు. కాని సాధ్యపడలేదు. అయినప్పటికీ నీలాంబరుడు నిరాశపడలేదు. తన అసమర్థతే కారణమనుకున్నాడు. పటంలో శక్తిలేదనే సంగతి అతనికి తోచలేదు.

నీలాంబరుడు చదువుకున్నవాడు కాడు. ఎలాగో ఆయనకు అక్షర జ్ఞానం మాత్రం అబ్బింది; మాతృభాషలో ఏదో తప్పొప్పులతో మహా భారతము చదవగలడు; తప్పొప్పులతో ఉత్తర ప్రత్యుత్తరాలు వ్రాయ గలడు. శాస్త్రముగాని, ధర్మగ్రంథాలు కానీ అతనెప్పుడూ చదవలేదు. అందువల్ల భగవంతునిమీద అతనికి మూఢభక్తి యెక్కువ. అతనికున్న విశ్వాసమే అది. ఇంకెవ రెన్నివిధాల చెప్పినా వినడు. ఇటువంటి తర్క వితర్కాలతో వాదప్రతివాదాలతో, చిన్నతనమం దతను పీతాంబరునితో విరాజ్‌తో దెబ్బలు తినేవాడు.

విరాజ్ నీలాంబరునికన్న నాలుగేళ్ల చిన్నది. ఆమె అతనికి ఎక్కువగా భయపడదు. చిన్నతనంలో ఒకసారి నీలాంబరుడు ఆమెను కొట్టాడు. విరాజ్‌కూడా, అతని పొట్టమీద కరిచి గాయపర్చింది. ఆ గాయమునుంచి రక్తము కారుతుండగా నీలాంబరుని తల్లి యిద్దర్ని వదిలించింది. ఆ తరువాత ఆమె "విరాజ్ నీ కిది తగనిపని. ఇతను నీకు పూజ్యుడు. ఈ విధంగా కొరకడం నీకు మంచిదికాదమ్మా!" అని చెప్పింది.

విరాజ్ ఏడుస్తూనే "ముందు యీయనే నన్ను కొట్టాడు" అని అన్నది.

ఆమె నీలాంబరుని పిల్చి "ఇకనుంచి నీవు విరాజ్‌మీద చేయిచేసుకో నని శపథంచెయ్" అని చెప్పింది.

అప్పటికి అతనికి పదునాలుగేండ్లుంటాయ్. ఇప్పుడు ముప్పైయేండ్లు విండినయ్. అప్పటినుంచి మాతృభక్తిపరాయణుడు నీలాంబరు డింత వరకూ ఆ మాటను తప్పలేదు.

ఈనాడు నీలాంబరుడు కాళ్లూ చేతులు ముడుచుకుని శాంతంగా కూర్చున్నప్పుడు, తన జీవితంలో మర్చిపోయిన యీ కథ గుర్తుకొచ్చే సరికి ముందు తన స్వర్గీయ తల్లిని జ్ఞాపకంచేసుకొని క్షమాపణకోరాడు. ఆ తరువాత గుణగుణలాడుతూ భగవంతు నుద్దేశించి—"భగవంతుడా, నువ్వు అన్నీ చూస్తున్నావ్; విరాజ్ ఏ అపరాధము చేయనప్పుడు, ఆమె అపరాధాలన్నీ నా నెత్తినరుద్ది, స్వర్గానికెళ్ళేట్టు చేయ్. ఇక్కడామె ఎన్నో కష్టాలూ, బాధలూ తనవు కాదన్నట్లు భరించింది, ఇ కామెకు దుఃఖాన్ని కష్టాన్ని కలిగించకు" అని ప్రార్థించాడు.

మూసుకునివున్న నీలాంబరుని కనుకొలకులనుంచి, నీళ్ళు కారు తున్నాయ్.

"బావగారూ?"

నీలాంబరుని ధ్యానం భగ్నమైంది. తలెత్తి చూసేసరికి, మోహిని అతని యెదుట నిలుచునివుంది. ఆమె ముఖంమీద సాధారణమైన ముసుగు వుంది. స్వాభావికంగానే ఆమె—

"బావగారూ! నేను మీ కూతురులాంటిదాన్ని. లోపలికి వెళ్ళి స్నానంచేసి, కొద్దిగా భోజనంచేయండి. మీకు పెట్టకుండా నే నుండ లేను" అని అంది.

నీలాంబరుడు ఎన్నో యుగాలనుంచి భోజనానికి తన్నెవరూ పిలువ నట్లు ఆశ్చర్యంగా చూస్తున్నాడు.

చిన్నకోడలు మళ్ళీ "బావగారూ! అన్నం సిద్ధమైంది".అని అన్నది.

అసలు సంగతిప్పుడు తెలిసి ఆతని శరీరమంతా ఒక్కసారి కంపించింది. ఆ తరువాత బోర్లపడుకుని యేడుస్తూ—

"భోజనము తయారయిందామ్మా?" అని అడిగాడు.

విరాజ్ నీళ్ళలోపడి చచ్చిపోయిందని ఆ వూరివాళ్ళందరికీ విశ్వా సము కలిగింది. ఒక్క పీతాంబరుడు మాత్రం నమ్మలేదు. "నది అంతా గాలించి వెదికాను! పొదలకు ఆమె శవము తగులుకొని వుండాలి. కాని, అలా జరగలేదు. ఈ దగ్గరలో యెక్కడో ఒకచోట ఆమె శవము తగులు కొని వుండాలి" అని అనుకొని, ఓ చిన్న నావమీద చాలాదూరం తిరిగి వచ్చాడు. శవ మెక్కడ ఉన్నదీ కనబడకపోయేసరికి, తన వదినెగా రేమి చేసినా, నదిలోపడి మాత్రం చనిపోలేదని అనుకున్నాడు.

అంతకుముందు కొన్ని రోజులనుంచి పీతాంబరుని హృదయంలో ఒక సందేహం పీడిస్తూవుంది. ఆ సందేహమిప్పుడు వుండి, వుండి అతని హృదయాన్ని కలవరపెడుతూవుంది. అయినా పీతాంబరుడు యెవరితో యేమీ చెప్పలేదు. ఒక్కసారి మోహినివద్ద మాత్రం తన అనుమానాన్ని బైటపెట్టాడు.

మోహిని పెదిమలు కొరుక్కుని రెండడుగులు వెనక్కువేసి—

"ఒకవేళ మీ అనుకున్నమాటలే నిజమైనట్లయితే, మానవులు నమ్మే దేవతలూ, రాత్రిందిగట్లా అన్నీ అబద్ధమే" అని గోడకు తగిలించి వున్న అన్నపూర్ణ పటంవేపు చూచి "అక్కయ్య యీమె అపరావతారమే. ఈ సంగతెవరికి తెలియకపోయినా, నాకు తెలుసు" అని ఆమె వెళ్ళింది.

ఈ మాటలకు పీతాంబరుడు సంతోషించలేదు. అయినా, అప్పటి. నుంచి అతను బాగా మారి పూరుకున్నాడు.

మోహిని బావగారితోమాట్లాడం ప్రారంభించింది. ఆయన కంచంలో అన్నం వడ్డించి, కొంచెం చాటుగా కూర్చుని, సంగతి యావత్తూ, మొదటి నుంచీ, చివరవరకూ వింది. అయినా నిజమైన సంగతి ఒక్క మోహినికి మాత్రం తెలుసు.

"అమ్మాయ్: నేను చేసినతప్పు తెలిసివుండి చేసిందికాదు. కాని సంసారాన్నీ, కుటుంబాన్నీ నిన్నూ—నన్నూ ఈ ఇంటిని, చివరకు అన్నిటినీ వదిలి ఆమె యెందుకని వెళ్ళిందో తెలియటంలేదు. ఈ కష్టాలూ, దుఃఖాలు భరించలేకపోయిందేమో" అని నీలాంబరుడు ఆఖరికి అన్నాడు. మోహినికి సంగతంతా తెలుసు. ఒకనాడు అక్కయ్య "అన్నిటినీ వదిలి వెళ్ళిపోతానని" చెప్పినవిషయం చెప్పేద్దామనుకుంది. తనతో తనభర్త చెప్పిన విషయమూ తన భర్తగారి హృదయంలోని సంగతికూడా చెపుదామనుకుంది. కాని, చెప్పలేకపోయింది.

ఒకనాడు పీతాంబరుడు మోహినితో "నువ్వు మా అన్నగారితో మాట్లాడుతున్నావా?" అని అడిగాడు.

"నే నిప్పుడు వారిని తండ్రిగారితోసమానంగా పూజిస్తున్నాను. అందుకని మాట్లాడుతున్నాను" అని మోహిని చెప్పింది.

"ఇతరులు వింటే యేమనుకుంటారు?"

"నిందలువేయడంకంటే వాళ్ళచేతుల్లో ఇంకేముంటుంది? యెవరకున్న పనులు వాళ్ళు చేసుకుంటారు. నేను నా పనికూడా పూర్తిచేస్తాను. ఈ మారు ఆయన్ని నేను రక్షించగలిగినట్లయితే ప్రజలనుకునే నిందలన్నిటికీ హృదయపూర్వకంగా స్వాగతమిస్తాను" అని తన పనిమీద వెళ్ళిపోయింది.

# 13

పదిహేను నెలలు గడిచినయ్. ఆశ్వయుజమాసపు నవరాత్రులు దగ్గరకు వస్తున్నయ్. దుర్గాపూజోత్సవ దినాల్లోని ఆనందోత్సవాలు మిన్ను ముట్టబోతున్నయ్. అపరాహ్ణకాలములో నీలాంబరుడు కంబళి కప్పుకుని, ఒక ఆసనముమీద కూచున్నాడు. ఆయన శరీరం కృశించింది. ముఖంలో పసుపు పచ్చదనము కనిపిస్తుంది. తలమీద జుట్టు పెరిగి, సంస్కారము లేక జడలు చుట్టుకపోయాయి. అతని కళ్ళల్లో వైరాగ్యమూ, కరుణా, తొణికిసలాడుతూవుంది. తెరచివున్న మహాభారత పుస్తకం మూసి, విధవ మరదలును చూస్తూ, "అమ్మాయ్! హరి ఈనాడుకూడా రాలేదేమో!" అని అన్నాడు.

మోహిని తెల్లని చీర కట్టుకుని బావగారికి కొంతదూరంలో కూర్చుని మహాభారతము వింటూవుంది. ఆమె "కాదు బావగారూ! ఇంకా వ్యవధి వుంది. ఇప్పుడే బయలుదేరి ఉండవచ్చు!" అని అంది.

కర్కోటకుడయిన హరి మామగారు చనిపోయారు. ఆమె ప్రస్తుతం స్వతంత్రురాలు. అందువల్ల అక్కడనుంచి తమ నౌకరులతో, వంటలక్కలతో వచ్చి, దేవీనవరాత్రులు ఆఖరయేవరకూ వుండి వెళతానని కబురుచేసింది. ఇంతవరకూ, యిక్కడి సంగతు లామెకు తెలియవు! తల్లిలా ప్రేమించే పెద్దవదినగారిప్పుడు లేదు. షుమారు ఆరేళ్ళక్రితం తన చిన్నన్న పీతాంబరుడు పాముకాటువల్ల చనిపోయాడు. ఈ విషయా లేవీ ఆమెకు తెలియవు.

ఒక్క నిట్టూర్పు విడిచి, నీలాంబరుడు "ఒకవేళ ఆమె రాకుండా వుండేనే మంచిదమ్మా, ఈ దుఃఖాలన్నీ ఆమె భరించగలదా!" అని అడిగాడు.

తన ప్రాణాలకంటె ప్రియమైన చిన్న చెల్లెలిమాట గుర్తుకొచ్చేసరికి యిప్పటి కెన్నో నెలలనుంచీ యెండిపోయివున్న అతని కనుకొలకుల్లో అశ్రువులు కనుపించినయ్. పీతాంబరుడు తన్ను పాము కరిచిన రాత్రి నీలాంబరుని రెండుకాళ్లు పట్టుకుని—"నా కిం కే మందూ—మాకూ వద్ద

న్నయ్యా! నీ పాదధూళి మాత్రం నా తలమీదా. యింత నోట్లో వేస్తేచాలు. దానితో నేను ముక్తిపొందితే సరే సరి. లేకుంటే నేను బ్రతుకుదామనే ఆశకూడాలేదు" అని చెప్పి. ఔషధాలు సేవించకుండానే, అన్నగారి పాదాలు పట్టుకుని, విషజ్వాలతో తన ప్రాణాలు బలిచేశాడు. ఆనాడు కూడా నీలాంబరుడు కంట తడిపెట్టలేదు. సాధ్వియైన మోహినికూడా ముఖం త్రిప్పుకుని కంటినీరు తుడ్చుకుంది.

నీలాంబరుడు మెల్లమెల్లగా "ఇందుకు కూడా నాకేమీ విచారము లేదు. పీతాంబరుని తీసుకువెళ్ళినవిధంగానే, భగవంతుడు విరాజ్‌ను కూడా తీసుకొనివెళ్ళివుంటే బాగుండేది. కాని అలా జరగలేదు. హరి ఇప్పుడు పెద్దదయింది. మంచి చెడ్డలు తెలుసుకునే యోగ్యత ఆమె కుంది. అటువంటి స్థితిలో, తన వదినెగారికళంకాన్ని విన్నట్లయితే ఆమె హృదయ మెలా వుంటుంది? అటువంటప్పుడు ఆమె యీ సంగతి విని ముఖమెలా ఎత్తుకొని తిరుగుతుంది?" అని అన్నాడు.

సుందరి మనసులోని సంగతులు దాచివుంచే రకము కాదు. అందువల్ల రెండునెల్లక్రితం నీలాంబరువిదగ్గరకు వెళ్ళి—విరాజ్ చచ్చిపోలేదనీ, ఆ రాత్రిపూట రాజేంద్రకుమార్‌తో వెళ్ళిపోయిందనీ చెప్పింది.

నీలాంబరుడు ఈనాడు యీ విషయాన్ని ప్రస్తావిస్తుంటే మోహిని కొంచెంసేపు విని చివరవరకు "హరిమతితో యీ విషయం చెప్పే అవసరంలేదు" అన్నది.

"ఎలా దాస్తామమ్మా! పెద్దవదినె ఎక్కడికి వెళ్ళిందని అడిగితే యేమని చెపుతావ్?"

"అందరికి తెలిసినసంగతే చెపుతాం"

తలూపుతూ—"ఇదేమంత మంచిదికాదమ్మా! పాపాన్ని దాచినట్లయితే, అది యింకా ఎక్కువతుందని విన్నాను. మనమంతా దానికి ప్రాణంలాంటివాళ్ళం. దాని పాపాన్ని యెక్కువచేయడం ధర్మంకాదు" అని చెప్పి కొంచెం నవ్వాడు. ఆ నవ్వులోని బాధా, వ్యధా హృదయంలో మోహిని జీర్ణంచేసుకుంది. కొంచెంసేపు ఊరుకుని మెల్లగా, "ఇవన్నీ నిజమైన సంగతులుకావు గనక చెప్పనవసరములేదు" అని అన్నది.

"ఏ సంగతులు? నీ అక్కగారి సంగతులేనా?"

నేలవేపు చూస్తూ కూర్చున్న మోహిని మాట్లాడలేదు.

నీలాంబరుడు "కాదమ్మా కాదు .... ఆ సంగతంతా నిజమే. అందులో యేమీ అబద్ధములేదు. కోపము వచ్చినట్లయితే, ఆ పిచ్చిదానికి జ్ఞానము వుండదని నీకు తెలుసు. అది చిన్నపిల్లగా వున్నప్పుడూ ఈవిధంగానే వుంది. పెద్దదయాకకూడా ఇదే పద్ధతి....దానికి చేసిన అపచారాలను గురించి భగవంతుడుకూడా నన్ను మన్నించడు. అయినా. అది ఒక మనిషి!" అని చెప్పి నీలాంబరుడు కన్నీరు తుడుచుకుని, ఆ తరువాత—

"ఎప్పుడన్నా జ్ఞాపకంవస్తే, హృదయం పగిలిపోతుందమ్మా! ఏం చెప్పను? పాప మది మూడురోజుల్నుంచి తిండి తినకుండా జ్వరముతో బాధపడుతూ నాకోసం బియ్యము అడుక్కొచ్చింది. ఆపైన నేను........"
అంటుంటే నీలాంబరునికంఠం గాద్గదికమైంది.

మోహినికూడా అలానే యేడ్చింది. ఆమె యేమీ అనలేదు. ఇలా చాలా సమయం గడిచిపోయింది.

కొంతసేపయాక, తన్నుతాను సంబాళించుకుని, నీలాంబరుడు "నీ కన్నీ తెలుసు! అయినప్పటికి కొన్ని విషయాలు చెపుతున్నాను, జ్ఞానహీనురాలై, ఆ రాత్రే అది సుందరిఇంటికి చేరింది. సుందరి డబ్బుమీదున్న ఆశతో—దాన్ని జమీందారుతాలూకు ఓడమీద యెక్కించింది. అని అంటూంటే, మోహిని సహించలేక, "అది నిజంకాదు. అదెప్పటికి నిజం కాదు. అట్టి పని అక్కయ్యతో యెవరూ చేయించలేరు. ఆమె సుందరిముఖంకూడా చూసివుండదు" అని అన్నది.

నీలాంబరుడు శాంతంగా "ఆ సంగతి నాకూ తెలుసు! నువ్వన్నదే నిజం. అప్పట్లో ఆమె హృదయంలో ప్రాణంలేదు. ఆమెకు జ్ఞానోదయం ఎప్పుడైతే కలిగిందో, అప్పటినుంచీ తన ప్రాణాన్ని నాకు వప్పగించింది. ఇక్కణ్ణుంచి అది వెళ్ళేప్పుడు ఆ ప్రాణాన్ని తీసుకోలేకపోయింది. అదిప్పటికీ నా దగ్గరేవుంది" అని కళ్లు మూసుకున్నాడు.

మోహినిముగ్ధురాలై, బావగారిముఖంలోకి చూస్తూంది. ఆ ముఖంలో కోపమూ, యీర్ష్య. ద్వేషమూ యేమీలేవు. అపరిమితమైన వ్యథ తొణికిసలాడుతూ వుంది.

సాయంకాలము దీపం ముట్టిస్తూ, మనసులోనే మోహిని "అక్కయ్య పేరిని గుర్తించినందువల్లనే, ఒకనాడుకూడా వదలి వుండ లేకపోయింది" అని అనుకుంది.

నాలుగేండ్లుగడిచాక హరిమతి పుట్టింటికివచ్చింది. ఆమె ఒక సంపన్న కుటుంబీకుల స్త్రీ మాదిరిగా వచ్చింది. ఆమెతోపాటు భర్తగారూ, చంకలో ఆరుమాసాల పసిబిడ్డా, అయిదారుగురు పనివాళ్ళూ కూడా వచ్చారు సామానుకూడా యెక్కువగానే వుంది. ఈ విధంగా ఇల్లంతా నిండి పోయింది. స్టేషన్‌లోనే యదువల్ల ఇంటిపరిస్థితులన్నీ తెలుసుకొని, అక్కడినుంచే ఏడుస్తూ వచ్చింది. వచ్చీరావడంతోనే ఆమె అన్నగారి పదిలో తలపెట్టి యేడ్చింది. ఆ రాత్రి హరిమతి పెదిమలు నీళ్ళుకూడా రుచి చూడలేదు. ఆమె అన్నగారినికూడా వదలలేకపోయింది. దానితోపాటు, ఒక్కొక్కటిగా అన్ని సంగతులూ వింది. అసలు హరి చిన్నప్పటినుంచీ వదినగారంటేనే భయపడేది. ఆమెయెదుట ఏమైనా అనేందుకు భయ పడుతుంది. అన్నగారంటే సంకోచంకాని, భయంకాని లేదు. ఈయన ఒక పురుషుడనీ, పురుషుని యెదుట యెలా మెసలాలనే సంగతికూడా ఆమెకు తెలియదు. ప్రతిదానికి ఆమె అన్నగారిని వేధించుకుతినేది. అత్తవారింటికి వెళ్ళిపోయే ముందటిరోజున, వదినెగారితో విదిలింపుపడి, అన్నగారివద్దకొచ్చి ఏడ్చింది.

అటువంటి తన అన్నగారిని యీ స్థితికి తీసుకొచ్చినవాళ్ళమీద, హరిమతికి కోపమింతంత కాకుండా పెల్లుబికిపోయింది. అన్న దుఃఖాల్లో తన దుఃఖం తుచ్ఛంగా కనుపించింది. తన అత్తవారింట్లోనివాళ్ళమీద అసహ్యమనిపించింది. చిన్న పాముకాటువల్ల చచ్చిపోయినా ఆమె కింత బాధలేదు. దురదృష్టవంతురాలైన చిన్న వదినెమీదకూడా ఆమెకు అసహ్యమే.

రెండురోజులు గడిచాక, హరిమతిభర్తను పిలిచి "నే నన్నగారిని తీసుకుని యాత్రకు వెళతాను. మీరు వెంటవస్తే సరేసరి, రానట్లయితే ఇంటికి వెళ్ళండి" అని అన్నది.

బాగా ఆలోచించాక హరిమతిభర్త యతీశుడు చివరివిధంగానే చేసేందుకు ఒప్పుకుని తను వెళ్ళేందుకు ప్రయత్నం చేసుకున్నాడు.

యాత్రకు కావలసిన సరంజామా అంతా తయారుచేసుకుంటు న్నారు. హరిమతి రహస్యంగా సుందరిని పిలపనంపింది. కాని అది రాలేక "ఈ ముఖ మిక వారికి చూపలేను. చెప్పదలచుకుందేదో చెప్పే శాను" అని కబురుచేసింది. హరి పెదిమలు కొరుక్కుని పూరుకుంది.

హరిమతి వ్యవహారమూ, పద్ధతీ అన్నీ కలిసి మోహినిని యెంత కష్టపెట్టాయో అది భగవంతునికే తెలుసు. చేతులు జోడించి, అక్కగారి నుద్దేశించి, "అక్కయ్యా! నన్ను గుర్తించేవాళ్లు నువ్వు తప్ప ఇంకెవరూ లేరు. నువ్వెక్కడ వున్నా, నన్ను క్షమించినట్లయితే అదే పదివేలు" అని అనుకుంది.

అసలు కాళ్లూ చేతులు ముడుచుకుని, ఒకప్రక్క కూర్చునే స్వభా వము మోహినికి చిన్నతనంనుంచే అభ్యాసమైంది. ఏదైనా అత్యవసర మైన పని వుంటేనే తప్ప ఇతరులతో మాట్లాడే స్వభావ మామెకు లేదు. ఈనాడుకూడా నీరసభావంతో అందరికీ సేవచేస్తూ ఆమె యెవరితో ఏమీ మాట్లాడలేదు. బావగారి తిండి తిప్పల బరువు హరిమతి తీసుకుంది. అందువల్ల, కొన్ని రోజులనుంచి, ఆయనదగ్గర కూర్చునే అవసరమే ఆమెకు లేకపోయింది.

యాత్ర నిశ్చయింపబడిన రోజున, ఆశ్చర్యముతో నీలాంబరుడు మోహినిని "యేమన్మా, నువ్వుకూడా రావా?" అని అడిగాడు.

మోహిని మెదలకుండా తలూపింది.

చంకలో పసిబిడ్డతో హరిమతి తన అన్నగారిదగ్గరకు వచ్చి, వాళ్ళిద్దరిసంభాషణ వింటూంది.

నీలాంబరుడు "అలా కాదమ్మా! ఒంటరిగా నువ్వెక్కడ యెలా వుంటావ్? అదీగాక ఇక్కడివుండి నువ్వు చేసేదేమిటి? నా మాట విని నువ్వుకూడా పద." అని అన్నాడు.

"తలవంచుకునే నే నెక్కడికీ రాలేను" అని మోహిని అన్నది.

మోహిని పుట్టింటివారు గొప్పవాళ్ళే! విధవ అయిన తమ కూతు రును తీసుకెళ్ళేందుకు వాళ్ళనేకమార్లు ప్రయత్నించారు. కాని ఆమె వెళ్ళలేదు.

తన ఒంటరి జీవితాన్ని చూసే ఆమె వాళ్ళింటికి వెళ్ళడంలేదని నీలాంబరుడు ఆలోచించాడు. అయినా ఇప్పుడు నిర్మానుష్యమైన ఈ ఇంట్లో వుండేందుకు కారణమేమిటో ఆయనకు బోధపడలేదు. "యే మమ్మాయ్! నువ్వెక్కడికైనా యెందుకని వెళ్ళవు?" అని అడిగాడు.

మోహిని మాట్లాడలేదు.

"నువ్వు ఎందుకని రాలేవో ఆ కారణం చెప్పేంతవరకూ, నేను కూడా యిక్కణ్ణుంచి వెళ్ళను" అని నీలాంబరుడు అన్నాడు.

మెల్లగా మోహిని "మీరు వెళ్ళండి. నేను ఇంట్లోనే వుంటాను" అని అన్నది.

"యెందుకు....?"

మోహిని మళ్ళీ కొన్ని క్షణాలపాటు మెదలకుండా వూరుకుంది. అయినా సంకోచముతో ఆమెలో కలిగిన భావాన్ని దూరంచేసేందుకు మనసులోనే ప్రయత్నించి--తుదకు తన సమస్త శక్తిని బిగపట్టి "అక్కగా రెప్పుడన్నా వస్తుందేమో! అందుకనే నే నిక్కడనుంచి కదలను" అని అంది.

నీలాంబరుడు ఆశ్చర్యపోయాడు. మెరుపు మెరిసినప్పుడు కళ్ళు యెలా జిగేలుమని యెక్కడా యేమీ కనుపించకుండా చేస్తుందో, అలానే నీలాంబరునికి, నాల్గువేపులా చీకటి వ్యాపించింది. కాని, ఆ స్థితి ఒక్క ముహూర్తం మాత్ర ముంది. ఆ మరుక్షణంలోనే తనను తాను సంబాళించుకుని, సహజపూర్వకమైన నవ్వుతో "ఛీ! నీ విటువంటి పిచ్చి ఆలోచనలతో, ఇంత తెలివితక్కువగా వ్యవహరిస్తే నన్నెలా చూస్తావమ్మా?" అని అడిగాడు.

కనురెప్పపాటుకాలము, కళ్ళు మూసుకుని ఆ తరువాత మోహిని "తెలివితక్కువదాన్ని కాదు. మీ కిష్టంగావుంటే అలానే, అనండి. కాని సూర్యచంద్రులు ఉదయిస్తున్నంతకాలము నే నెవరిమాటా నమ్మను" అని అన్నది.

అన్నాచెల్లెలు ఒకరిప్రక్క ఒకరు నిలుచుని, ఆశ్చర్యంతో మోహిని వ్చుతున్నమాట వింటున్నారు. ఆమె దృఢస్వరంతో "అక్కయ్య, మీ

వద్ద ఒక వరమడిగి పుచ్చుకుంది. భర్త పాదాలమీద తలవుంచి ప్రాణాలు వదులుతానని ఆమె ఎన్నోసార్లు అన్నది. ఆ వరము నిష్ఫలము కానే కాదు. మా అక్కయ్య లక్ష్మీదేవిలాంటిది. ఆమె తప్పకుండా ఇక్కడకు తిరిగి వస్తుంది. నా బొందిలో ప్రాణంవున్నంతవరకూ, ఈ ఆశామార్గము మీదనే దృష్టివుంచి, ఆమెకోసం యెదురుచూస్తూ వుంటాను. ఇక్కడ నుంచి నన్నెక్కడికీ వెళ్ళమని చెప్పకండి" అని అన్నది.

నీలాంబరుడు సహించలేకపోయాడు. కట్టలు తెగివస్తున్న ఏడ్పును ఆపుకోలేక, అక్కడనుంచి గబగదా అడుగులువేసుకుంటూ ఏకాంత ప్రదేశానికి వెళ్ళాడు.

హరిమతి నాల్గువేపులా ఒకసారిచూసి, మోహిని సమీపానికి వొచ్చి బిడ్డను ఆమెపాదాలమీద వుంచి, లేచి, మొట్టమొదటిసారి యీ విధవ వదినను కౌగలించుకొని యేడుస్తూ "వదినా! నిన్నింతవరకూ గుర్తించ లేకపోయాను. నన్ను క్షమించు" అన్నది.

మోహిని వంగి హరిమతిబిడ్డను ఎత్తుకొని, ముద్దుపెట్టుకుని వస్తున్న యేడ్పును దాచుకుంటూ వంటింటిలోకి వెళ్ళిపోయింది.

# 14

ప్రాణాలు విడవడమే విరాట్కు న్యాయంకాని, ఆమె అలా చేయ లేదు. ఆ రాత్రే ఆత్మహత్య చేసుకుందామని నిశ్చయించుకున్న మరు క్షణాన్నే మృత్యుమార్గాన్ని వదలి విపరీతమార్గము వెంట కాళ్ళను నడి పింది. ఎంతోకాలమునుంచి, దుఃఖాలూ, కష్టాలూ సహిస్తూ—సహిస్తూ వుండడము మూలాన్ని, ఆమె మెదడు వికృతమైంది. ఇప్పటికి మూడు రోజులనుండీ తిండి లేనందున ఆకలి ఏహించేస్తోంది. రెండోది అవ మానాన్ని మరీ ఉజ్వలముగా ఆమె మనసును మార్చి బుద్ధిని పెడత్రోవ త్రొక్కించింది. మృత్యువును సమీపంలో వుంచుకుని, కాళ్లూ చేతులు కొంగుతో ముడివేస్తున్న సమయంలో ఎక్కడో పిడుగుపడింది. ఆ వెలు తురులో ఆవలిగట్టున చేపలను పట్టుకునేందుకు కట్టినమంచే, స్నానాల రేవూ కనుపించినై. ఆ రేవూ, ఆ మంచే యింతసేపటినుంచీ తన రాక

కోసమే యెదురు చూస్తున్నట్లుంది. చూపుల్లో చూపులు కలవడంతో, ఆ రెండూ విరాజ్‌ను పిల్చినయ్! విరాజ్ గంభీరంగా, "సాధుపురుషులు నేను ముట్టుకున్న నీళ్లుకూడా పుచ్చుకోరు. కాని ఈ పాపిష్టిది పుచ్చుకుంటుంది" అని అనుకుంది.

కొలిమిలోవేసిన కోయిల ఏవిధంగా ఆరచి, అరచీ బూడిదవు నట్లే విరాజ్‌లోని అమూల్యమైన హృదయముకూడా మాడిపోయింది, మళ్ళీ వురుము వురిమింది. ఆ కటికచీకటిలో, ఆకాశపు వక్షస్థలాన్ని చించుకుని మెరుపు మెరిసింది. విస్ఫారితమై విరాజ్‌దృష్టి, సంకుచితమై, ఆవేపునుంచే తిరిగి వచ్చేసింది. ఒకసారి నీటివేపు మరొకసారి ఇంటివేపు చూచింది. తేలిపోతూన్న చేతులతో, కట్టుకున్న బంధాలన్నీ తెంపుకుని బయలుదేరింది. ఆమె నడుస్తున్న వేగానికి త్రోవవెంట వున్న జీవులు సర—సర—కస్—కస్ మంటూ ప్రక్కకు తప్పుకున్నయ్! వాటివేపు విరాజ్ చూడనేలేదు. కొద్దిసేపట్లోనే ఆమె సుందరి యింటికి వచ్చి మెల్లిగా తలుపు కొట్టింది. ఆ తరువాత రెండుగంటల అనంతరము 'కంగాలి' అను పేరుగల నావికుడు అవతలఒడ్డుకు చేర్చేందుకు తన నావను సిద్ధముచేశాడు. రాత్రిపూట నావ నడపడం కంగాలికి క్రొత్తకాదు. డబ్బుమీదున్న ఆశలో సుందరిని ఎన్నోసార్లు అవలిగట్టున దింపేవాడు. ఈనాడు విశేషమేమంటే, ఆ నావలోనే యిద్దరు కూర్చున్నారు ఆ చీకటిలో కంగాలీ విరాజ్ ముఖాన్ని సరిగ్గా చూడలేకపోయాడు. రేవు సమీపాన కొచ్చేసరికి, దూరంగా ఒక పొడుగాటి మనిషిని విరాజ్ చూచి కళ్లు మూసుకుంది.

సుందరి ఊరికినే "ఏమమ్మా, ఎవ రిలా కొట్టారు?"అని అడిగింది.

"ఏం సుందరీ! వారుతప్ప యింకే వ్యక్తికి నా మీద చెయిచేసుకునేందుకు శక్తివుంది! అది తెలిసివుండికూడా, మాటిమాటికీ అడుగుటావేమిటి?"

ఆ మాటలు విని సుందరి సిగ్గుతో పూరుకుంది.

అరగంట గడిచాక, బాగా అలంకరించిన ఓడ ఒకటివచ్చి లంగర్ వేసింది. ఆ ఓడ లంగరువేస్తుండగా విరాజ్ చూసి, సుందరితో "ఏం సుందరీ, వాతో నువ్వూ రావా?" అని అడిగింది.

"లేదమ్మా! నే నిక్కడ ఉండకపోతే ప్రజలు అనుమానపడతారు. నువ్వెళ్లు, భయమేమీ లేదు. మళ్ళీ నేను కలుసుకుంటాను."

విరాజ్ ఇంకేమీ మాట్లాడలేదు. కంగాలీ నావలో కూర్చుని సుందరి మళ్ళీ తిరిగి వచ్చేసింది.

జమీందారుని ఓడ బాణంలా త్రివేణీవేపు మళ్ళింది.

నదిలో నావికులంతా తెడ్లువేస్తున్నారు. తప్–తప్–మనే శబ్దము వినవస్తుంది. అయినా, సంయ్–సంయ్ మని వీస్తున్న ఆ ధ్వని గాలిలో లీనమవుతూంది. రాజేంద్రుడు ఓడలో ఒకమూల కూర్చుని, మౌనంగా మధువును సేవిస్తున్నాడు. అతనికి కొంచెందూరంలో కూర్చునివున్న విరాజ్ రాతిప్రతిమలా నీళ్ళవేపు చూస్తూంది. ఈనాడు రాజేంద్రుడు ఎక్కువగా త్రాగాడు. అతని మత్తు శరీరంలోని రక్తాన్ని వుడుకెత్తిస్తూ, మెదడును వున్మత్తంగా తయారుచేస్తూవుంది సప్తగ్రామసీమ దాటాక, లేచి వచ్చి విరాజ్ ప్రక్కన అతను కూర్చున్నాడు. విడిపోయిన తల వెంట్రుకలు వీపుమీదనుంచి జారి ఓడమీద పడుతున్నయ్! తలమీదున్న ముసుగు జారి భుజముమీద పడింది. ఆమెకు ఈ విషయాల్లో ఏమాత్రమూ జ్ఞానమే లేదు. 'ఎవరు వచ్చారు? తనప్రక్కన కూచున్నదెవరు?' ఇవన్నీ ఆమె కేమీ తెలియవు.

కాని రాజేంద్రుని స్థితి మారింది. ఒంటరిగా ఏదో భయంకర ప్రదేశంలోకి వచ్చినప్పుడు, భూతప్రేతాల భయము పట్టుకున్నట్లు అతను భయపడుతున్నాడు. అయినా ఆమెను చూస్తూనేవున్నాడు. కాని, కదిలించి మాట్లాడించే శక్తి అతనిలో లేదు.

తను ఎవరిని పొందేందుకు అనేక ప్రయత్నాలుచేశాడో, ఆమె యీ మె! అతను రెండేండ్లనుంచీ ఈమెను అనుసరిస్తున్నాడు. ఈమధ్యలో రాజేంద్రునికి మెలకువగా వున్నప్పుడూ నిద్రపోతున్నప్పుడూ విరాజ్ మూర్తే కనిపిస్తున్నది. ఆమె నొకసారి చూడాలని, నిద్రహారాలు మాని పొదల్లో దాక్కొని, రాత్రింబగళ్ళు కనిపెట్టుకుని వుండేవాడు. తను కలలో కూడా అనుకోని విషయాన్ని, సుందరి తన చెవినివేసి అభిలాషునిగా చేసింది.

ముందునుంచే నది మలుపుతిరిగింది. రెండు గట్లకూ వెదురుగడలు వంగి ఒకదాని కొకటి మెలివేసుకుని వున్నాయి. మర్రిచెట్ల వూడలు నీటిలోకి దిగివున్నయ్. అక్కడక్కడ చెట్లకొమ్మలు నదిలో నీళ్ళమీదకు వంగి వున్నయ్. వాటివల్ల నదంతా చీకటిగావుంది. ఓడను ఇటు త్రిప్పక ముందే, యెంతో సాహసంతో రాజేంద్రుడు "నువ్వు....మీరు....మీరు కొంచెంసేపు లోపలికి వెళ్ళండి. కొమ్మలు తగులుతాయేమో!" అన్నాడు.

విరాజ్ ముఖంత్రిప్పి రాజేంద్రుని చూసింది. ఆమెముందు ఒక చిన్నదీపము వెలుగుతూంది. దాని వెలుతురులో ఒకరి నొకరు చూసు కున్నారు. అంతకుముందు ఒకరి నొకరు చూసుకున్నారు. దుర్మార్గుడైన రాజేంద్రుడు తనను ఒకరి అధికారంలో వున్న భూమిమీద నిలుచుని ఒక ప్పుడు చూశాడు. అయినా—యీనాడు తన అధికారంలోవున్న ఓడమీద కూర్చున్న విరాజ్‌ను చూస్తున్నాడు. మత్తు అతణ్ణి వున్మత్తునిగా చేస్తూంది. అయినప్పటికీ విరాజ్ దృక్కులను సహించగల శక్తి అతనిలో లేదు. ఒక్కసారి విరాజ్‌ముఖంలోకి చూచి, తల క్రిందకు దించుకున్నాడు.

విరాజ్ అదోమోస్తరుగా వుంది. ఆమె రాజేంద్రుని చూస్తూనే వుంది. ఈనా డామె దగ్గరగా ఓ పరపురుషుడు కూర్చునివున్నాడు. అయి నప్పటికీ ఆమె తన ముఖాన్ని కప్పుకోలేదు. ఈ మధ్యలో ఓడ దట్టంగా వ్యాపించివున్న చెట్లకొమ్మల క్రిందకు వచ్చింది. నావికులు తెడ్లువిడిచి చెట్లకొమ్మలను ప్రక్కకు తప్పిస్తున్నారు. ఈ ప్రదేశం చాలా భయంకర మైంది. రాజేంద్రుడు నావికులతో 'జాగ్రత' అని చెప్పి, విరాజ్‌వేపు చూచి "లోపలికి పదండి! ఇక్కడ మీ తలకు కొమ్మలు తగులుతాయి" అని రాజేంద్రుడు గదిలోకి వెళ్ళాడు. అప్పుడు విరాజ్ మోహముతో అభి భూతురాలైంది. ఏదో యంత్రంలా అతని వెనకాలే గదిలోకి వెళ్ళసాగింది. అయినా, లోపల కాలుపెడుతూనే 'అమ్మయ్యో!' అని కేకేసింది.

ఆ కేకకు రాజేంద్రుడు త్రుళ్ళిపడ్డాడు. మసక వెలుగులో, విరాజ్ రెండుకళ్ళూ రక్తముతో తడిసి, నొసటిబొట్టు చండీతల్లి త్రినేత్రములా యెర్రగావుంది. నిషామత్తులోవున్న రాజేంద్రుడు దెబ్బతిన్న కుక్కలా భయంతో కంపిస్తూ, అవ్యక్తధ్వనిచేస్తూ ఆ జ్యోతినుంచి తప్పుకున్నాడు.

చీకటిలో పడివున్న పాముమీద మనిషి అకస్మాత్తుగా పాదమేసి నప్పుడు కలిగే గగుర్పాటు, మెత్తని శీతలస్పర్శకు కలిగే వులికిపాటుతో, యెలా కొంచెం దూరంవెళ్ళి నిలుచుంటాడో, అలాగే విరాజ్ రెండడుగులు వెన క్కేసి నీటివేపు చూసి "అమ్మయ్యో, నే నిలా చేశానేమిటి?" అని అంటూ అగాధమైన నీటిలో దురికింది.

నావికులుకూడా భయంతో అరిచారు. ఇటునుంచి అటూ—అటు నుంచి ఇటూ పరుగెత్తుతూ ఓడను తల్లక్రిందులుచేసేందుకు సంసిద్ధ మయారు. కాని వాళ్ళచేతనేమీ కాలేదు. కళ్ళు చించుకుని అంతా చూస్తు న్నారు, కాని ఆ దుర్భేద్యమైన కటికచీకటిలో యెవరి కేమీ కనుపించ లేదు. రాజేంద్రుడు చెక్కుచెదరలేదు. అతని మత్తు వదిలింది. అయి నప్పటికీ నిలుచున్న చోటునుంచి కదలలేదు. కొంతసేపయాక, నీటి వర వడికి ఓడ దానంతట అదే ఒడ్డుకువచ్చి చేరింది. నావికులంతా ఉద్విగ్న భావంతో రాజేంద్రునిదగ్గర కొచ్చారు. భయంతో వాళ్ళు "బాబుగారూ! ఇప్పుడు ఏమి చేయాలి? పోలీసులకు రిపోర్టు రాయాలా?" అని అడిగారు.

రాజేంద్రుడు కూడా విహ్వలుడయాడు. నావికులవేపు చూస్తూ "పోలీసులకు రిపోర్టుయిచ్చే అవసరమేముంది? జైలు కెళ్లాలని సరదాగా వుందా? గదాయ్! ఇక్కణ్ణుంచి ఎంత తొందరగా వెళ్ళితే అంత మంచిది" అని అన్నాడు.

గదాయ్ నావికుడు ఎంతోకాలంనుంచీ పనిచేస్తున్నాడు. అతనికి ప్రతి రహస్యమూ తెలుసు. అందువల్ల సంగతంతా ముందే గ్రహించాడు. ఇప్పు డీ మాటతో కళ్ళు తెరుచుకున్నయ్. అందువల్ల నావికు లందర్నీ పిలిచి, ఓడను తొందరగా పోనిమ్మని ఆదేశించాడు. అతని అనుచరులు కూడా అతని ఆదేశాన్ని పాలించారు. ఈ ప్రయత్నాలతో ఓడ మాటలోనే సాగిపోయింది.

కలకత్తా సమీపించాక రాజేంద్రుడు శాంతియుతమయిన నిట్టూర్పు విడిచాడు. రాత్రి అతను చూచిన విరాజ్ దృష్టిలోని తేజాన్ని యింకా మర్చిపోలేక కంపించాడు. చెవి మెలివేసుకుని అతని మనసులోనే "జీవి తంలో యిటువంటి పని యింకెప్పుడూ చేయను. ఎవరి అంతరాత్మలో

ఏముందో ఎవరికి తెలుసు? ఆ పిచ్చిది తన నల్లటి కళ్ళతో, నా తండ్రి తాతలనుకూడా దగ్గరవచ్చలేదు. అదే పదివేలు" అని అనుకున్నాడు.

భవిష్యత్తులో ఇటువంటి పని చేస్తాననే ఆశ రాజేంద్రునకు ఇక లేదు. ఇంతకాలంవరకూ, కులటలవెంటబడి తన మనసును అపవిత్రం చేసుకుని గడిపాడు. 'సతి' అని యెవరి ననాలో —ఆ సంగతి అతనికి తెలియదు. తన పాపిష్టి జీవితంలో మొట్టమొదటిసారిగా యిప్పుడే జ్ఞానోదయమైంది. పాము కూనముతో ఆటలాడుకోవడం సంభవమే కాని, బ్రతికున్న పాము గొప్ప జమీందారుకొడుకు క్రీడావస్తువు కాజాలదు.

# 15

అనాడు మూడోజామున, తన తలదగ్గర కూచున్న స్త్రీవల్ల తను హుగ్లీ ఆసుపత్రిలో వున్నట్లు విరాజ్ తెలుసుకుంది. ఆమె ఆయాసముతో కంపముతో బాధపడుతోంది. కొంచెం విమ్మళించాక, తన విషయంలో సంగతు లన్నీ జ్ఞాపకముచేసుకుంటూంది. తను నదిలోదూకి ఈదుకుంటూ ఒడ్డుచేరి తడిసినబట్టతో, వెంట్రుకలతో, రాత్రంతా ఒంటరిగా కూచునే కంపించింది. చివరకు ఆమె ఒక గృహస్థుని ఇంటిదగ్గరకు చేరింది. అక్కడే పడుకుంది. ఇవే విరాజ్‌కు జ్ఞాపకమున్న సంగతులు. తనను ఇక్కడి కెవరు తీసుకువచ్చారో, ఆ అవస్థలో అక్క డెన్ని రోజులుందీ, ఆమె కేమీ తెలియవు. అదీగాక పరపురుషుని ఆశ్రయంమీద ఆధారపడి గృహాన్ని త్యజించిన కులటనని కూడా విరాజ్‌కు గుర్తుంది.

ఆ తరువాత సంగతి తెలుసుకుందామని విరాజ్‌కు లేదు. అసలు యిష్టంలేదు. మెల్లమెల్లగా ఆరోగ్యము కోలుకుంటోంది. లేచి కూచునే శక్తి వచ్చింది. కొద్ది రోజుల్లోనే లేచి తిరిగేశక్తి కలిగింది. కాని, భవిష్యత్తు ఆలోచన ఆమె విడనాడలేదు. అదే ఘటనో, అందులోని ప్రతి ఒక్క పరమాణువును ఆమె తనలో తానే అనుభవంలోకి తెచ్చుకుంటూంది. కాని పడిపోయిన తెరను ఒకప్రక్కకు తొలగించి, చూచినట్లయితే తన శరీరమంతా, మంచుగడ్డలా గడ్డకట్టుకుపోతూంది. ఆమెతల తిరిగింది

మూర్ఛ వచ్చినట్లయింది. ఒకనాడు మార్గశిరమాసపు ఉదయాన్నే ఆసు పత్రి మనిషి వచ్చి—"ఇప్పుడు నీకు నయమైంది. ఇక నీ యిష్టమువచ్చిన చోటికి వెళ్ళవచ్చు" అని చెప్పినప్పుడు తను "మంచిదే" అని అన్నది.

ఆ వచ్చిన మనిషి, విరాజ్‌కు యెవరూ లేరని గ్రహించి—"వేరే విధంగా అనుకోవద్దు....ని న్నిక్కడకు చేర్చినవాళ్లు నీ బంధువులుకారా? ఇక్కడ చేర్చాక మళ్ళీ రాలేదే?" అని అడిగింది.

"లేదు....వాళ్ళ నెప్పుడూ చూడలేదు. ఒకనాడు వర్షము కురు స్తుండగా, త్రివేణీలో పడిపోయాను. వాళ్ళు దయాతత్పరులు కాబట్టి నన్నిక్కడకు చేర్చారు"

"ఓ....నువ్వు నీళ్ళలో మునిగిపోయావా? అయితే మీ ఇల్లెక్కడ?"

తల్లి పుట్టిల్లుఊరు పేరుచెప్పి "నే నక్కడికే వెళతాను. నా కక్కడ చాలామంది బంధువు లున్నారు" అని అంది.

"అక్కడికే వెళ్ళమ్మా! కొంచెం జాగ్రత్తగావుండు! రెండురోజుల లోనే నీకు ఆరోగ్యము చేకూరుతుంది."

విరాజ్ కొంచెం నవ్వి "నాకు ఆరోగ్య మింకేమి బాగుపడుతుం దమ్మా? ఇక యీ కన్ను బాగుపడదు. ఈ చేయికూడా పనికిరాదు" అని చెప్పింది.

జబ్బులో ఎడమకంటి దృష్టిపోయింది ఎడమచేయికూడా పడి పోయింది. ఆ పనిమనిషికూడా కళ్ళనీళ్లు పెట్టుకుని "అలా అంటా వేమమ్మా! నీ కన్నూ, చెయ్యి బాగుపడవచ్చునంటే అందులో ఆశ్చర్య మేమీ లేదు" అని అంది.

ఆ మరునా డామె కంబళి, కొంత దారిఖర్చుకూడా యిచ్చింది. ఆమె యిచ్చిన వస్తువుల్ని పుచ్చుకుని రెండుమూడు డడుగులు నడిచి, తిరిగి వచ్చి—"నా ముఖం ఒక్కసారి చూడాలనివుంది. కొంచెం అద్దం ఇస్తారా?" అని అడిగింది.

"ఎందుకు ఇవ్వను? ఇప్పుడే యిస్తానువుండు" అని ఆమె ఒక అద్దాన్ని తెచ్చి యిచ్చింది.

విరాజ్ మళ్ళీ ఒకసారి ఇనపమంచంమీద కెళ్ళి కూచుంది. తన ప్రతిబింబమువేపు ఒక్కసారి చూచుకొని, తనమీద తనకే అసహ్యము

పుట్టడంవల్ల ముఖాన్ని తిప్పుకుంది. అద్దాన్ని అవతలపారేసి మంచంలో ముఖాన్ని దాచుకుని యేడ్చింది. ఆమె తల బోడిదైంది. ఆకాశాన్ని నల్లగా చేసే మేఘాల్లావున్న వెంట్రుకలు యెక్కడికో పోయినయ్. ముఖాన్నంతా ఇలా యెవరు చేశారు? కమలాల్లా వున్న క ళ్ళెటు పోయినయ్! బంగారు లాంటి శరీరం రంగు నెవరపహరించారు? విరాజ్ మనసులోనే "అయ్యో! భగవంతుడా! నా కిటువంటి దండన విధించావేమిటి? ఒకవేళ యెప్పుడన్నా కలుసుకోవడం తటస్థపడితే యీ ముఖాన్ని ఆయన కెలా చూపను? మనిషి శరీరంలో ప్రాణమున్నంతవరకూ ఆశ అనేది ఒక్కసారే నిర్మూలము కాదు. అందువల్ల యెక్కడో ఒకింత ఆశ ఇంకా తన హృదయంలో దాక్కుని వుంది.

తెలివి వచ్చాక, విరాజ్ ఆ రోగశయ్యమీద పడుకుని, తన మానస నేత్రంతో నీలాంబరుని వుజ్వల ముఖాన్ని చూస్తోంది. తను చేసినదంతా జ్ఞానరహితంగా చేసింది. అయితే, అజ్ఞానావస్థలో చేసిన తప్పును క్షమించ లేరా? మనిషిచేసిన పాపాలన్నిటికీ, యేదో ఒక ప్రాయశ్చిత్తముంటుంది. అయితే యీ ఒక్క పాపానికే ప్రాయశ్చిత్తములేదా? తను యదార్థంగా ఏమీ చేయలేదు. అయినా తను చేసిన యీ కొద్దో-గొప్పో పాపానికి, తను భర్తకు చేసిన సేవలతో నాశనముకాదా?

వారి మనసులో కోపభావమనేదే వుండదు అని విరాజ్ అప్పు డప్పుడు అనేది. నేనే వెళ్ళి కాళ్ళమీద పడి, సంగతంతా చెప్పినట్లయితే వా రేమంటారు?

ఆసుపత్రి గదిలోనే ఇంకొకరోజు వుంది. ఈవిధంగా విరాజ్ యేడవడం చూచి, ఆశ్చర్యంతో "ఏమమ్మా? యెందు కేడుస్తున్నావు?" అని అడిగింది.

అయ్యో! విరాజ్ దుఃఖానికి కారణం కనుక్కునే వ్యక్తి యింకొకతె అక్కడుందా? గబుక్కున కళ్లు తుడ్చుకుని, ఎటుప్రక్కకూ చూడకుండానే విరాజ్ లేచి బయటికి నడిచింది.

ఉద్దేశ్యరహితంగా తను యాత్రకు కాలు బయటపెట్టడం యిదే మొదటిసారి. ఆ త్రోవవెంట యెంతోమంది నడుస్తున్నారు, వాళ్ళ కాళ్ళ

చప్పుళ్ళు—మాటల ధ్వని, వాయుమండలములో లీనమవుతున్నయ్. గుంపులతో నిండివున్న త్రోవవెంట, విరాజ్ అభ్యాసరహితమైన కాళ్ళు యీడుస్తూంది. అప్పుడు విరాజ్ వక్షస్థలాన్ని చించుకుంటూ, ఒక నిట్టూర్పు వచ్చింది. మనసులో—"భగవంతుడా! నువ్వు మంచిపని చేశావు! నావేపు యింకెవరూ చూడరు. ఈ ముఖమూ, యీ కాళ్ళూ, ఈ రాత్రికే ఉపయోగించేట్లున్నయ్. నా విషయంలో మా గ్రామస్థులకు నే నొక గృహత్యాగినియైన కులటనని తెలుసు. ఇక యీ నోటితో వాళ్ళను పలకరించను. ఈ రూపాన్ని అందుకనే యిలా పరివర్తన చేశావు, భగవంతుడా! నువ్వు చేసింది చాలా మంచిపనే!" అని అనుకుంది.

# 16

ఎన్నోరోజులు గడిచినయ్! ముందు దాసీపని చేయబోయింది. ఆ రోగశరీరము అందుకు తగిన విధంగాలేదు. తను నౌకరి చేస్తున్నవాళ్లు మాన్పించారు. అటువంటప్పుడు భిక్షాటనానికి బయలుదేరింది. ఇంటింటా భిక్షానికి వెళ్ళేది. దొరికినది ఏదో చెట్టుక్రింద వండుకుతినేది. రాత్రులు చెట్లనీడనే పడుకునేది. తన ఈ వర్తమాన జీవితంలో ఆమెకు కొంచెమైనా విరక్తి కలగలేదు. ప్రస్తుతం ఆమె కట్టుకున్న చీరె అనేకచోట్ల చినిగిపోయింది. తలమీదున్న వెంట్రుకలకు నూనె సంపర్కము లేదు. ఒక దయాళువు మాసిన బొంతొకటి ఇచ్చాడు. ఇప్పుడు దాన్నే ఆమె కప్పుకుంటూంది. శరీర మెంత దుర్బలంగా, సౌందర్యహీనంగా వుందో ఆ గుడ్డలుకూడా అలానే వున్నయ్. అయినా ఆమె వయసిప్పుడు 25 ఏండ్లు మాత్రమే.

విరాజ్‌లాంటి అందమైన స్త్రీలు ప్రపంచంలో లేని రోజుకూడా ఒకటుండేది. భగవంతుడు ఆ గొప్పతనాన్ని లాక్కుని. రూపాన్ని పాడుచేసి క్రొత్తరూపము కలుగజేశాడు.

ఆమె తన పాతకాలపు స్థితినే మర్చిపోయింది. కాని రెండు సంగతులు మాత్రము తనకు గుర్తున్నయ్. ఎవరినన్నా అడుగుతున్నప్పుడు

తన కెంతో సిగ్గు. అయినప్పటికీ ప్రస్తుతము తను భిక్షాటనముమీదనే ఆధారపడవలసివచ్చింది. అడుక్కునేప్పుడు స్పష్టంగా ఉచ్చరించలేక పోయింది. అదీగాక తనెంతో దూరంవెళ్ళి చావాల్సివుంది. తను యేదైనా దేశాంతరాల్లో చచ్చిపోవాలని తనకు తెలియదు. కాని, గమ్యస్థానము చేరేందుకు ఎంతోదూరము నడవాల్సి వుంటుందని తనకు బాగా తెలుసు. ఈ అవస్థలో తన భర్తకు కనబడకూడదనుకుంది. తను ఎంతగొప్ప అపరాధము చేసినా, యీ స్థితిలో తను భర్త కళ్ళపడితే అతని హృదయం పగిలిపోతుందని, తనకు బాగా తెలుసు. అందుకనే ప్రతి నిముషమూ యెంతోదూరము నడుస్తూంది.

ఈవిధంగా విరాజ్ ఒక సంవత్సరమువరకూ నడుస్తూనే వుంది. కాని తన గమ్యస్థానమెక్కడో ఆమెకు తెలియదు. అ దే ప్రదేశమో? ఈ పాడు జీవితాన్ని, సమాప్తముచేసేందుకు తనెక్కడి కెళ్ళాలో ....? రెండురోజులనుంచి చెట్టునీడలో వుంటూంది. అక్కణ్నుంచి లేవలేక పోయింది. మెల్ల మెల్లగా ఆమెను మళ్ళీ జబ్బు పీడిస్తూంది. దగ్గూజ్వరమూ వస్తూంది. గుండెలో నొప్పి బయలుదేరింది. ఆమె శరీరము బలహీనముగానే వుంది. ఆ స్థితిలో ఆసుపత్రిలో చేరింది, ఆరోగ్యము సరిగ్గా కుదటపడకముందే అక్కణ్ణుంచి వెళ్ళవలసివచ్చింది. ఆ తరువాతనే, యెంతో దూరము నడవాల్సివచ్చింది. ఒక్కొక్కప్పుడు అర్ధాకలితో వుండేది. ఒక్కొక్కప్పుడు నీళ్లు మాత్రము త్రాగేది. మరొకప్పుడు పస్తులతో గడపవలసివచ్చింది. ఈస్థితిలోకూడా ఆమె నడవాల్సివచ్చింది. ఇప్పు డిక ఎక్కువదూరమువడిచేస్థితిలో లేదు. కళ్లుమూసుకుని, యీ చెట్టుక్రిందనే ప్రాణాలు వదలవలసివస్తుందేమోనని ఆలోచిస్తూంది. అయితే ఇక్కడికి చేరేందుకేనా, విరంతరము తిరుగుతూంది—ఇక లేవనేలేదా?

పగలంతా గడిచింది. చెట్లచివరనుంచి సూర్యకిరణాలు పోయినయ్. ఆ గ్రామములో సంధ్యాకాలపు హారతి విచ్చేప్పుడు కలిగే శంఖధ్వని గాలితో వచ్చి, విరాజ్ చెవులకు వినిపిస్తూవుంది. దానితోపాటు కళ్ళెదుట అపరిచితులైన బంధువులు కనిపించాను. ఇటువంటప్పుడు తులస్త్రీల కేమి పని వుంటుందో ఎవరు దీపమెలిగిస్తారో—చేతులో దీపం

వుంచుకుని ఎక్కడెక్కడకు వెలుతురును ప్రసారిస్తున్నారో—ఇవన్నీ తలపోస్తూంది....

# 17

హరిమతి అన్నగారికి నిమిషముకూడా తీరుబడిలేకుండా చేసింది. దుర్గ నవరాత్రులకు వచ్చింది మొదలు, పుణ్యసంక్రాంతి వరకూ ఒక వూరునుంచి ఇంకొక ఊరికి, ఒక తీర్థంనుంచి ఇంకొక తీర్థానికి త్రిప్పుతూనేవుంది. హరిమతి మంచి పుష్టిగా, ఆరోగ్యముగా వుంది. అదీగాక ఆమెకు యాత్రలు యింకా చేయాలని కుతూహలము యెక్కువగానేవుంది. ఆమెవలె తొందరగా యాత్రలుచేయటానికి నీలాంబరుని శక్తికి మించిన పనైంది. ఆయన అలసిపోయాడు. కాని, ఎక్కడన్నా కూర్చుని విశ్రాంతి తీసుకుందామని ఆయన అనుకోలేదు. అతని మనసు తిరగబడి ఇంటి కెళ్లాలని చూస్తూంది. బరువైన అతని మనసు పదేపదే స్వగ్రామం వెళ్ళమని బోధిస్తూవుంది. అలా యెందుకయిందో ఆయనకే తెలియదు. తన గ్రామములో ఏముంది? ఇటువంటి ప్రశాంతస్థానంలో తన మనసెందుకు నిలకడగా లేదు? మోహిని అప్పుడప్పుడు హరిమతికి వుత్తరాలు రాస్తూనే వుంది. అయినప్పటికీ ఆ ఊరివేపే మనసంతా కేంద్రీకరించిపోయింది.

అన్నగారు అన్ని సంగతులు మర్చిపోయి—చిన్నప్పుడు వున్న విధంగానే బలంగా రావాలని ఆమె ఆశించింది. ఆయన ముఖంమీదున్న చిరునవ్వు మళ్ళీ యధాప్రకారంగా వుండాలనీ, యిదివరకు పాడుతూన్న పాటలు మళ్ళీ పాడాలనీ, సంతోషంగా పదేపదే నవ్వాలనీ, హరిమతి అనుకుంది కాని, హరిమతి ప్రయత్నాలన్నీ బూడిదలోపోసిన పన్నీరైనాయి.

ఆమె నిరాశపడలేదు. ఇంకా రెండురోజులు యిలానే గడుపుదామనుకుంది. ఇలా రెండుమూడురోజులంటూనే నాలుగయిదు నెలలు దాటినది. నీలాంబరునిలో మార్పుయేమీ కనుపించకపోయేటప్పటికి హరిమతి విచారానికి అంతులేకపోయింది.

వీళ్ళ ప్రయాణం అరచేతుల్లో పెట్టుకున్నప్పుడు, మోహిని చెప్పిన మాటలకు నీలాంబరుని హృదయం ద్రవించింది. విరాజ్ విషయంలో మోహిని వెల్లడించిన మాటలన్నీ అతను నమ్మాడు. అన్నగారి ఆరోగ్యము కుదుటపడుతుందనీ, చిన్ననాటి విషయాలు తలుచుకుని, వదినెగారిని క్షమించగలడనీ హరిమతి ఆశించింది. ఈ మధ్యలో వదినెగారి ప్రసంగము తెచ్చి అన్న హృదయంలో శాంతిని యేర్పరుచుదా మనుకుంది. కాని సాధ్యంకాకపోయింది.

ఒకనాటి ఉదయాన్నే హరిమతి ముఖం ముడుచుకుని అన్నగారి వద్దకు వచ్చి "అన్నయ్యా! పద....యింటికి వెళ్దాం...." అని అన్నది.

నీలాంబరుడు విస్మయంగా చూశాడు. మాఘమాసాంతమువరకూ 'ప్రయాగ' లోనే వుందామని ఆదివరకే నిశ్చయించుకున్నాడు.

అన్న మనసులోని భావాన్ని గ్రహించి హరిమతి "ఇక్కడ నే నొక్క క్షణంకూడా వుండను. ఇక్కడనుండి రేపే వెళ్దాం" అన్నది.

హరిమతి కోపంగావున్నట్టు గమనించి ఆమెను శాంతింపచేద్దామనే వుద్దేశ్యముతో ...."ఏమమ్మా హరీ! ఇంటికి అప్పుడే ఎందుకమ్మా?" అని అడిగాడు.

హరిమతి కళ్ళల్లో ఇంతవరకూ బలవంతంగా ఆగివున్న నీళ్ళు జలజలమని బయటకు వచ్చినయ్! కన్నీళ్ళతో, రుద్ధమైన కంఠంతో "ఇక్క డున్నందువల్ల లాభమేమిటి? నీ మన సిక్కడ వుండడములేదు. ఇంటి కెళ్ళేందుకు మనసు మాటిమాటికీ వుబలాటపడుతోంది. అందు వల్లే నానాటికీ చిక్కిపోతున్నా వన్నాయ్! ఇక ఇక్కడ ఒక్కరోజుకూడా వుండలేను" అని అన్నది.

నీలాంబరుడు హరిమతిచేయిపట్టుకుని తనదగ్గర కూర్చోపెట్టు కుంటూ "ఏం హరీ! మనం తిరిగి యింటికి వెళితే నాకు ఆరోగ్యము కలుగుతుందా? చెల్లీ! ఈ శరీర మిక బాగుపడుతుందనే నమ్మకము నా కిక లేదు. అయినా, నీకు యింటికి వెళ్దామనివుంటే యింటికే పద. జరగవలసినదంతా అక్కడే జరుగుతుంది" అని అన్నాడు.

ఈమాట వినడంతోనే హరిమతి గట్టిగా ఏడుస్తూ "అన్నయ్యా! నువ్వెప్పుడూ ఆమెను గురించే కుమిలి కుమిలి విచారంలోనే మునిగి వుంటున్నావు. ఎప్పుడూ ఆమె ధ్యానలో విచారిస్తూ యిలా యెండిపోయావు" అని అన్నది.

"నే నామెమీది ధ్యానలో వుంటున్నానని నీతో ఎవరన్నారమ్మా?"

"ఇంకెవ రనాలి? నాకు తెలుసు"

"అయితే నువ్వే దాన్ని జ్ఞాపకముచేసుకోవా"

"ఉహూ! ఆమెను జ్ఞాపకముతెచ్చుకోను. ఆమెను గుర్తుకు తెచ్చుకుంటేనే పాపము చుట్టుకుంటుంది."

నీలాంబరుడు త్రుళ్ళిపడి "ఏం చుట్టుకుంటుందీ?" అని అడిగాడు.

"పాపము చుట్టుకుంటుంది. నోటితో ఆమెపేరు ఉచ్చరించితేనే నోరు చెడిపోతుంది. ఆమెను స్మరించినట్లయితే. స్నానం చెయ్యాల్సి...."

"హరీ............" హరి అన్నముఖంవంక చూసింది. ఆ ముఖంలో మార్పు ద్యోతకమవుతూంది.

అన్నగా రిలా పిలిచినప్పుడు భయపడింది. ఆమె నీలాంబరునికి ప్రియమైన చెల్లెలు. చిన్నతనంలో ఎన్ని తప్పులు చేసినా, అన్నముఖం యిలా మారు అయేదికాదు. ఇటువంటి కంఠాన్నెప్పుడూ ఆమె వినలేదు. ఇంత పెద్దయాక, అవమానంతో కొంచెంసేపు తలొంచుకు కూచుని లేచి వెళ్ళిపోయింది.

మధ్యాహ్న భోజన మప్పుడు హరిమతి అన్నగారిదగ్గరకు రాలేదు. సాయంకాలపు ఫలహారము దాసీదానితో పంపి తను చాటుగా నుంచుంది.

నీలాంబరుడు హరిని పిలవనూలేదు, మాట్లాడనూలేదు.

సాయంకాలమైంది. నీలాంబరుడు సాయంకాలము సంధ్యావందనము ముగించుకుని కూచున్నాడు. హరిమతి నీరసంగా గదిలోకివచ్చి, అన్నగారివీపు నానుకుని, మోకాళ్ళమీద కూర్చుంది. హరిమతి ఫిర్యాదు చేసే విధ మిదే. చిన్నప్పుడు వదినెగారితో దెబ్బలు తిని, యిలానే ఫిర్యాదుచేసేది. ఆ సంగతి నీలాంబరునికి గుర్తుకొచ్చింది. అందువల్ల,

రెండు కళ్ళవెంట నీళ్ళు తిరిగినై. చెల్లెలు తలమీద చెయివుంచి మెల్లగా "ఏమిటమ్మా?" అని అడిగాడు.

హరిమతి అన్నగారి వీపును వదలి ఆయన వడిలో బోర్లపడుకుని, యేడుస్తూంది. ఆమె తలమీద తన చేతిని నీలాంబరుడు అలానే వుంచాడు. చాలా సేపయాక, కన్నీళ్ళతో రుద్ధమైన గొంతుతో హరిమతి "ఇక నే నెప్పుడూ అలా అన నన్నయ్యా!" అని అన్నది.

హరిమతి తల వెంట్రుకల్లోకి వ్రేళ్ళు పోనిచ్చి, వాటిని సవరిస్తూ నీలాంబరుడు "వద్దు........ఇక అనకమ్మా" అని అన్నాడు.

హరిమతి మాట్లాడలేదు. ఆమె మనసులోని భావాన్ని కనిపెట్టి నీలాంబరుడు "అది నీకు పూజ్యురాలు. కేవలం వదినెగానేకాదు హరీ! నిన్ను తల్లిలా పోషించి, ప్రేమతో పెంచి, పెద్దదానిని చేసింది. ఆ కార ణంతోనే అది నీకు తల్లితో సమానమైంది. ఇతరు లేవిధంగా అనుకున్నా ఫర్వాలేదుగాని, నువ్వు అన్నట్లయితే పాపం చుట్టుకుంటుంది" అని అన్నాడు.

కళ్లు తుడ్చుకుంటూ—హరిమతి "అయితే వదిన మనల్ని ఎందుకు వదిలిపెట్టి వెళ్ళింది?" అని అడిగింది.

"అదెందుకని వెళ్ళిందో ఏ కారణంతో వెళ్ళిందో నాకూ భగవంతు నికే తెలుసు. అసలు వెళ్ళడమనే సంగతి నిజానికి దానికే తెలియదు. అప్పు డది పిచ్చిదైంది. ఆ సమయంలో దానికి ఒకింత ఇంగిత జ్ఞానమే వున్నట్లయితే యిటువంటి పనిచేయకుండా ఆత్మహత్య చేసుకుని వుండేది.

హరి యింకొకసారి కళ్లు తుడ్చుకుని "అయితే, వదిన తిరిగి యెందుకు రాదన్నయ్యా?" అని అడిగింది.

"ఎందుకు రాదా? రావటానికి ఏ వుపాయము లేనేలేదు. అందుకే రాదు" అని తనను తాను సంబాళించుకుని, "నన్నే అవస్థలో, వదిలి వెళ్ళిందో, ఆ అవస్థలో తిరిగి రావటానికి ఏ మాత్రమన్నా వుపాయం తోస్తే వచ్చేది. ఒక్క రోజన్నా ఆగేదికాదు" అని అన్నాడు.

"అన్నయ్యా! ఒకవేళ...."

"అదే నిజమమ్మా! అది రావాలనుకుంది. కాని రాలేకపోయింది. ఇదెంత కఠినమైన దండనో నాకు తెలుసు. కాని, మీకు తెలియదు హరి! ఈ అనుభూతే నన్ను నానాటికీ క్రుంగదీస్తూంది కాని మరేమీ కాదు."

హరి యేడ్చింది.

నీలాంబరుడు కళ్ళు తుడుచుకుని "అది అప్పుడప్పుడు నాతో రెండు సంగతులు ఆప్యాయంగా చెబుతుండేది. అందులో మొదటిది, నా వొడిలో తలపెట్టి ప్రాణాలు నిర్విచారంగా త్యజించాలనీ, రెండోది సావిత్రిలా సతిగా మహాపతివ్రతల స్థానాన్ని పొందాలనుకునేది. కాని ఆ కోరికలు కోరికలలాగే వుండిపోయాయి!" అన్నాడు.

హరిమతి మెదలకుండా వింటూంది.

నీలాంబరుడు మొదలుపెట్టాడు. "అది తప్పుచేసిందని మీరంతా అంటున్నారు. ఏ ఒకరో యిద్దరో అయితే వాళ్ళను సమర్థించి చెప్పే వాణ్ణేగాని ఇది లోకంకదూ! కనక కళ్లుమూసుకుని వింటున్నా. అంతకంటే నేనేం చేయగలను? అయితే యీ ప్రపంచాన్ని మోసముచేయగలను కాని భగవంతుణ్నెలా మోసపుచ్చను? ఎవరితప్పును నెత్తినవేసుకు మోస్తూ, అది మునిగిపోయిందో, ఆ సంగతి పైనుంచి సర్వాంతర్యామి చూస్తు న్నాడు....నువ్వే చెప్పు; అది అపరాధి అని నన్నేవిధంగా అనమంటావు? దాన్ని ఆశీర్వదించకుండా ఎలా వుండను? కాదు చెల్లీ! ప్రపంచానికి అదెంత కళంకితురాలైనా దానికి విరుద్ధంగా నే నేమీ అనను; నా దోషం వల్ల నా పనికిమాలినతనంవల్లనే దాన్ని పోగొట్టుకున్నాను. కాని రెండో జన్మలో దాన్ని నాకు భార్యను చేయమని భగవంతుణ్ణి ప్రార్థిస్తాను."

నీలాంబరుడు ముందేమీ చెప్పలేకపోయాడు. ఈ సంగతి చెపు తుంటే కంఠం బొంగురుపోయింది. హరిమతి అన్నగారి కళ్లుతుడ్చి, తను ఏడ్చి "నువ్వెక్కడికి వెళ్ళనాసరే, నేను నిన్నొదిలిపెట్ట నన్నాయ్!" అని అన్నది.

తలెత్తి నీలాంబరుడు మెల్లిగా నవ్వాడు.

* * * *

విరాజ్ తిరిగి ఇంటికి వెళ్లాలని వస్తూంది. ఆమె శరీరం చాలా శుష్కించిపోయింది. నడుస్తూ నడుస్తూ అలిసిపోయింది. ఈ శ్రమకు ఆమె శరీరము విశ్రాంతి కోరుతూంది. కాని ఈ ప్రార్థన వినడంతోనే విరాజ్‌కు కోప మెక్కువైంది. ఆమె ఒక్క క్షణంకూడా ఆలస్యం చేయదలచుకోలేదు.

ఆమెకు చాలాకాలంనుంచి వస్తున్న దగ్గు క్షయగా మారింది. అందువల్ల ఆమెకు అనుమానమెక్కువైంది. ఆలస్యము చేసినట్లయితే గమ్యస్థానము చేరలేదని ఆమె అధైర్యపడింది.

. చిన్నతనంనుంచీ విరాజ్‌కు ఒక్కసంగతి మాత్రమే తెలుసు. పాపరహితంకానిదే, యే స్త్రీ కూడా తన భర్త పాదాలముందు ప్రాణాలు వదలదని ఆమె నమ్మకం. ఆ కారణంతో తన పాపానికి ప్రాయశ్చిత్తం జరిగిందా లేదా అని తన ఆత్మను అడిగి తెలుసుకోవాలనుకునేది. ఈ పరీక్షకు తను నిలబడినట్లయితే, నిశ్చయంగా సంతోషపూర్వకంగా జీవితంలో రెండో ఘట్టంలో నిలుచుని, భర్తగమనాన్ని పరీక్షిస్తుండవచ్చు. అయినా, "దామోదరం" దగ్గరికి వచ్చేసరికి, కాళ్ళు చేతులు వాచినయ్. నోటివెంట రక్తము పడుతూంది. కాళ్లు ముందుకు అడుగుపెట్టడమేలేదు. నిరాశురాలై విరాజ్ ఒక చెట్టుక్రింద తిరిగి కూర్చుని, భయంతో కంపిస్తూ "ఇంత ప్రయాసపడినా, బాధలకు ఓర్చుకున్నా నా కోరిక చివరకు నిరర్థకమై పోయిందే! యీ జీవిత మెంత నిరర్థకమైంది? పునర్జన్మలోనన్నా మనసులోని కోరిక సఫలమౌతుందనే ఆశలేదు. ఇప్పుడు నేనేం చేయాలి?" అని అనుకుంది.

విరాజ్ కిక ఆశలేదు. అయినప్పటికీ ఆ చెట్టునీడనే పడుకుని భర్త నుద్దేశించి దుఃఖాజనమైన ఆయన జీవితము సౌఖ్యవంతం కావాలని ఆమె ప్రార్థనచేస్తూనేవుంది.

ఆ మరునాడు తారకేశ్వరము చుట్టుప్రక్కల సంత జరగబోతూంది. అందువల్ల తెల్లవారుఝామునుంచే ఆ దారివెంట యెద్దుబండ్లు నడుస్తున్నయ్. ధైర్యాన్నంతా ఏకంచేసి, ఒక వృద్ధుని తననుకూడా బండిలో యెక్కించి తీసుకెళ్ళమని ప్రార్థించింది. ఆమె ప్రార్థన విని, పరిస్థితి

చూచి, వృద్ధుడు దయతో ఆమెను తారకేశ్వరము చేర్చాడు. తారకేశ్వరము గుడి చుట్టుప్రక్కలనే వుందామని విరాజ్ నిశ్చయించుకుంది. ఇక్కడి కెంతోమంది వస్తూ పోతుంటారు. తనకు తెలిసివున్న వాళ్ళెవరన్నా కని పిస్తే సంగతి సందర్భాలు మోహినికి తెలియపరుద్దామనుకుంది.

పెద్ద జబ్బులతోనున్న ఎంతోమంది స్త్రీ పురుషులు గుడి చుట్టు ప్రక్కల పడుకునివున్నారు. ఎన్నో యుగాలు గడిచినట్లు చాలా కాల మయాక ఈనాడు వాళ్ళందరిమధ్యకు వచ్చి, శాంతంగా శ్వాసతీసుకుంది. వీళ్ళవలె తాను వ్యాధిగ్రస్తురాలే! తనుకూడా కోరికలతోనే వుంది. ఈ విధంగా కోరికలతో, వ్యాధితో తనుకూడా యిక్కడే పడివుంటుంది.

ఇంతవరకూ తనపై పెవరి దృష్టిపడలేదు. ఇవన్నీ ఆలోచించు కుంటున్నకొద్దీ విరాజ్‌కు సుఖమనిపించింది. కాని ఆమెకు వ్యాధి ఎక్కు వవుతూనేవుంది, మాఘమాసపు చలి జోరుగానేవుంది. ఇంతకూ ఆమె తిండి కేమీ ప్రయత్నించలేదు. తిండి లేకుండానే ఆమె ఆరురోజులు గడి పింది. ఇప్పు డిక ఎక్కువ రోజులు గడుస్తాయని ఆమెకు ఆశలేదు. సప్త గ్రామమునుంచి ఎవరన్నా వస్తారనేదికూడా కలలోనివార్తయింది. ఆమెకు ఇప్పు డున్న నమ్మకమల్లా, తోడల్లా ఒక్క మృత్యువే! మృత్యువుకు స్వాగతమిచ్చేందుకు ఆమెమనసు సిద్ధంగావుంది.

అనాడు ఆకాశము మేఘావృతమై వుంది. చీకటిపడేందు కింకా వ్యవధి వున్నా—చీకటిపడినట్లుంది. మొదటిరూమునుంచే విరాజ్ నోటి వెంట రక్తము పడుతూనేవుంది. తిండీ తిప్పలూ, సరైన పోషణలేక క్షీణించిన ఆమెశరీరం మరీ బలహీనమైంది. ఆమె మనసులోనే— "యీవేళే యీ జీవితపు సుఖదుఃఖాలు ఆఖరవుతాయ్." అని అనుకుంది.

ఆ కారణంతోనే ఆమె గుడివెనుక తలుపువద్ద పడుకునివుంది. రోజూమల్లే యీనాడుకూడా లేచి భగవంతునికి నమస్కరించలేక పడు కునే నమస్కరించింది.

ఇంతకాలంవరకూ ప్రార్థన లన్నిటినీ, విరాజ్ భర్తపాదాలకు నివేదించుకున్నది. ఆమె తెలివితక్కువదికాదు. తన పరజన్మకూడా నష్ట పరచకూడదనుకుంది. ఆమె కున్నదల్లా యీ ఒక్క భిక్షే! అయినా, ఆ

సూర్యుడు అస్తమిస్తున్నప్పుడు, ఆమె ఆలోచనలన్నీ, విచిత్రరూపంలో పరిణమించినయ్। విరాజ్ హృదయంలో యిప్పుడు బిక్ష అడగాలనే భావములేదు. ఆ హృదయంలో విద్రోహభావము వ్యక్తమవుతూంది; ఆమె హృదయమంతా ఒక అపూర్వమైన అభిమానమనే మధురసంతో నిండి, అనిర్వచనీయమైన మాధుర్యములా పొంగింది. అందులోనే నిమగ్నురాలై ఆమె మనసులోనే "అప్పుడు నువ్వెందుకు చెప్పావ్?" అని అనుకుంది. విరాజ్‌కు తెలియకుండానే, పక్షవాతంతో పడిపోయిన ఎడమ చేయి దారిలో పడింది. ఆ సంగతి ఆమెకు తెలియనే తెలియదు. కాని దానిమీద ఏదో భారము పడేప్పటికి, అవ్యక్తమైన ధ్వనితో ఆమె మూలిగింది. ఆ దారివెంట ప్రజలు వస్తూ పోతుంటారు. చూడక చేయి త్రొక్కినందుకు ఆ మనిషి సిగ్గుపడ్డాడు. అతను వెనక్కి తిరిగి నిల్చుని "అయ్యో! యెవరు నువ్వు? ఇలా దారిలో పడుకున్నావేం? చాలా తప్పు జరిగింది. దెబ్బ తగలలేదు కదా?" అని అడిగాడు.

నిమిషంలో ముఖంమీదున్న గుడ్డనుతీసి విరాజ్ ఆ వ్యక్తిని చూసింది. ఆ తరువాత యేదో మూల్గి ఊరుకుంది. ఆ వ్యక్తి నీలాంబరుడు. ఒకసారి వంగి చూచి వెళ్ళాడు.

కొన్ని క్షణాలకు సూర్యుడు అస్తమించాడు. పశ్చిమాకాశంలో మేఘాలులేవు. దిక్చక్రాల్లో వ్యాపించిన బంగారు కిరణాలు, గుడిగోపురం మీదా చెట్లకొమ్మల చివరనూ తాకుతున్నయ్. కొంచెందూరంలో నిలబడి నీలాంబరుడు హరిమతితో "చూడమ్మాయ్. అక్కడ జబ్బుతో ఒకామె పడుకునివుంది. నే నామెను తొక్కాను. దాని కేమన్నా ఇస్తే బావుంటుంది. అడుక్కునేదిలా వుంది" అని అన్నాడు.

ఆమె తనవేపే చూస్తూండడము హరిమతి గమనించి మెల్ల మెల్లగా ఆమెదగ్గరకొచ్చి నిలబడింది. ఆమెముఖం కొంత గుడ్డతో కప్పుకుని వుంది. అయినప్పటికీకూడా ఆమె నెక్కడో చూసినట్టు హరిమతికి జ్ఞాపకము. ఆమె "ఏమండీ! మీ ఇల్లెక్కడ? సప్తగ్రామమేనా?" అని అడిగింది మెల్లగా.

విరాజ్ ముఖంలోని మధురమైన వస్తువు చిరునవ్వు! ఒక్కసారి విరాజ్ నవ్వుచుండగా చూస్తే, మర్చిపోయేవాళ్లు ప్రపంచంలో వుండరు. "అన్నయ్యా! ఈమే వదిన; మా వదిన" అని ఆ శుష్కశరీరంమీదపడి, ముఖంలో ముఖంపెట్టి యేడ్చింది.

నీలాంబరుడు కొద్దిదూరంలో నిలుచునివుండి అంతా చూస్తున్నాడు. అత నేమీ వినలేదు. కాని సంగతంతా గమనించి, దగ్గరకొచ్చి ఆ పాద మస్తకం ఒక్కసారి చూచి "హరీ! ఇక్కడ యేడవకమ్మా, లే." అని చెల్లెల్ని ప్రక్కకు తప్పించి, రక్త మాంసములేని విరాజ్ శరీరాన్ని చిన్న పిల్లలా యెత్తుకుని, గబగబా అడుగులు వేసుకుంటూ తాము దిగినచోటికి చేరారు.

* * * *

చికిత్సకోసం ఏదైనా ఆసుపత్రికి విరాజ్‌ను తీసుకెళదామను కున్నారు. కాని విరాజ్ ఇష్టపడలేదు. ఆమె తన యింటికి తప్ప యిం కెక్కడికీ రానంది.

హరిమతిని చాటుగా పిల్చి నీలాంబరుడు "అమ్మాయ్! మీ వదిన ఇక యెక్కువరోజులు బ్రతకదమ్మా! ఎక్కడ వుంటాలంటే అక్కడే వుంచేద్దాము. మీరంతా దీన్నింకేమీ బాధపెట్టకండి!" అని అన్నాడు.

పావుగంటకు ముందు విరాజ్ తారకేశ్వరంలో భర్తఒడిలో తల పెట్టి తన ప్రార్థన వినిపించింది. అనునయంగా ఆమె "నన్నింటికి తీసుకు వెళ్ళి నా మంచంమీద నన్ను పడుకోబెట్టండి" అని చెప్పింది. ఇంటివేపూ యింట్లోని సామాగ్రివేపూ, ఆమెకు ఎంత మమతవుందో, అది ఆమెకే తెలుసు. హృదయంలోనించి ఉబికివచ్చిన మాటలు, శక్తిహీనమై—క్షీణించి జీర్ణించిపోయి కంఠంలోంచి పైకివచ్చిన ఆ మాటలు అర్థహీనమై వినేవాళ్ళనే యేడ్పించేటట్లున్నాయ్.

నీలాంబరుడు రోగి మంచాన్ని వదిలి యెక్కడకూ వెళ్ళడంలేదు. కళ్ళవెంట నీళ్లుపెట్టుకుని "భగవంతుడా! యిప్పటికి విధించిన శిక్ష చాలు. ఇక దీన్ని క్షమించు ప్రభూ: పరలోకానికి సిద్ధంగావుంది. ఇకనైనా ఈ

లోకంమీదున్న మమతను దూరంచేసి శక్తి సామర్థ్యం దానికి కలుగజేస్తే చాలామంచిది" అని వాపోయాడు.

గృహాన్ని పరిత్యజించి వదిలి వెళ్ళిపోయిన విరాజ్ హృదయం ఇంటివేపు ఆకర్షిస్తున్నందుకు నీలాంబరునికి ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. అత నిటువచ్చి రెండువారాలు గడిచిపోయినై. నిన్నటినుంచీ విరాజ్‌కు సన్నిపాతంలా కనిపిస్తూంది. ఈనా డంతా ఆమె కలవరించి కలవరించి, యిప్పు డిప్పుడే నిద్రపోయింది. సాయంకాల మవబోతుండగా ఆమెకు మెలుకువవచ్చింది. హరిమతి ఏడ్చి ఏడ్చి, ఆమెకాళ్ళదగ్గర నిద్రపోయింది. మోహిని ఆమెతలదగ్గర కూర్చునివుంది. ఆమెనుచూసి, విరాజ్ "మోహానీ! నువ్వేనా?" అని అన్నది.

అక్కగారి ముఖంమీదకు వంగి, మోహిని—"అవు నక్కాయ్, నేనే" అని అన్నది.

"హరిమతి యేదీ?"

హరిమతిని చూపిస్తూ "నీ కాళ్ళదగ్గరే పడి నిద్రపోతూవుంది" అని చెప్పింది మోహిని.

"వా రెక్కడ?"

"ఆ గదిలో పూజచేసుకుంటున్నారు"

"అయితే నేనూ పూజచేసుకోనా?" అని విరాజ్ మనసులోనే జపముచేసుకోవడం మొదలుపెట్టింది. చాలాసేపయాక కుడిచేతితో నొసలు ముట్టుకుని నమస్కరించి క్షణంసేపు మోహినిముఖంలోకి చూసి, మెల్ల మెల్లగా—"ఈనాడే వెళ్ళిపోతానేమో! మళ్ళీ జన్మలో నిన్ను కలుసుకోవాలని నా కెంతో కోరికగావుంది" అన్నది.

తన జీవితయాత్ర పూర్తి కాబోతోందని విరాజ్ విన్ననే విన్నది. అందువల్ల కళ్ళవెంట నీరుకార్చి స్పృహతప్పి పడుకుంది.

రెండుగంటలు గడిచేటప్పటికి విరాజ్‌కు తెలివివచ్చి, కొంచెం సేపయాక కంఠాన్ని నొక్కిపట్టి—"అమ్మాయ్! ఒక్కసారి సుందరిని నేను పిమ్మన్నానని పిలుస్తావా?" అని అన్నది.

కన్నీళ్ళతో బొంగురుపోయిన గొంతుతో—"ఇప్పుడు దాన్ని పిలిచి మాత్రం యేమి చేస్తావక్కాయ్! అది రాదు" అని మోహిని అన్నది.

"వస్తుందమ్మా, వస్తుంది! దాన్ని నేను రమ్మన్నానని కబురుచెయ్ దాన్ని క్షమించి, ఆశీర్వదిస్తాను. ఇప్పుడు నా కెవరిమీదా కోపములేదు. క్షోభా లేదు. భగవంతుడు నన్ను క్షమించి భర్తదగ్గరకు పంపినప్పుడు ఈ ఆనందసమయంలో నే నందరినీ క్షమించి వెళ్ళాలనుకుంటున్నాను."

మోహిని ఏడుస్తూనే "అక్కాయ్! దీన్నేనా క్షమ అని అనేది. ఏ అపరాధంలేనివాళ్ళ నింత ఇదిగా బాధించినా, ఆయన మనోవాంఛ పూర్తికాలేదా? ఆయన నిన్నుకూడా తీసుకెళ్ళేందుకు తయారయాడా? ఆర్త్రాణపరాయణుడైనప్పుడు నీకున్న రెండుచేతులలోనూ ఒకదాన్ని తీసుకున్నాడు గాని —ఇంతటితో తృప్తిపడి...." అని అడిగింది.

విరాజ్ నవ్వి "ఊరంతా నా ప్రవర్తనను గురించి చెడుగా చెప్పుకుంటున్నప్పుడు, నన్ను నువ్వేమిచేసుకుంటావ్? నేను బ్రతికుండడంవల్ల లాభమేమీ లేదమ్మాయ్!" అని అన్నది.

"లాభం ఉందక్కాయ్! గ్రామములో అనుకుంటున్న అపవాదు నీ మీదున్న కళంకము అంతా అబద్ధమే! లోకుల మాటలకు మనం భయ పడవలసిన పనేమీలేదు."

మీకు ఇతరులవల్ల భయం లేకపోవచ్చు. కాని నాకుంది. నా మీదున్న కళంకముమాత్రం అబద్ధము కాదు. అది సత్యము....అమ్మాయ్ నా అపరాధము పెద్దదికాకపోయినా ఇటువంటి విషయం జరిగాక హిందూ స్త్రీకి సమాజములోగాని ప్రపంచములోగాని స్థానముండదు. మీరంతా భగవంతునికి దయలేదంటారు....కాని ..."

విరాట్‌మాట యింతా పూర్తికాకముందే హరిమతి, గట్టిగా అరుస్తూ "ఓహో గొప్పదయే! భగవంతునికి గొప్ప దయవుంది...." అని అన్నది.

హరిమతి ఇంతవరకూ యేడుస్తూ విరాజ్ చెప్పిన మాటలన్నీ వింటూంది. ఆమె ఇక సహించలేక, యేడుస్తూనే—"ఆయనలో ఏమాత్రం దయలేదు. న్యాయములేదు."

"నిజానికి అపరాధం చేసినవాళ్ళే చీకూ చింతా లేకుండా హాయిగా వున్నారు. ఆయన మనల్నే వేలుపెట్టి చూపెట్టి కష్టపెడుతున్నారు. అందులో మహా కష్టపెడుతున్నాడు" అని వాపోయింది.

హరిమతి ఇలా అంటున్నకొద్దీ, విరాజ్ నవ్వింది. ఆ నవ్వెంతో మధురంగానూ, సహృదయపూర్వకంగాను వుంది. అయినా తెచ్చిపెట్టుకున్న కోపముతో "నోరుముయ్! అరవకు...." అని అన్నది.

హరిమతి పరుగెత్తుకు వచ్చి ఒదినను కౌగలించుకుని, "నువ్వు చచ్చిపోవద్దు వదినా! నువ్వు లేకుండా మేము వుండలేము, నీ ఎడబాటును మేము సహించలేము. నువ్వు మందు తిను. మంచి ఆరోగ్యవంతమైన ప్రదేశానికెళ్ళి వుండు వదినా, నీ కాళ్లు పట్టుకుంటాను" అని ఆమెవేపు చూస్తూ కన్నీళ్ళు రాల్చింది.

హరిమతియేడ్పు విని, నీలాంబరుడు పూజ ఆపి, భయంతో కంపిస్తున్న పాదాలతో, దగ్గరకువచ్చి వింటున్నాడు.

విరాజ్ కళ్ళంట రెండుచుక్కలు నీళ్లు కారినయ్. మోహిని, కళ్ళు తుడ్చినతరువాత హరిమతిని ఇవతలకు లాగింది. చివరకు విరాజ్ అందర్నీ యేడిపిస్తూ. తనూ యేడ్చింది. ఇలా కొంతసేపు గడిచాక "ఏడవకు హరీ! నా మాట విను" అని అంది.

నీలాంబరుడు చాటుగా నిలుచుని అంతా వింటున్నాడు. విరాజ్ మంచి తెలివితో మాట్లాడుతుండడం గమనించి ఆమె చివరిగడియలు సమీపించాయని అనుకున్నాడు.

"హరీ! తెలుసుకోకుండా ఆయన్ని దోషినిచేయకు. భగవంతుడు ఒక్కొక్కవ్యక్తిని, యెంతో సూక్ష్మంగా విచారిస్తాడు. ఈ అవస్థలోవున్న నామీద ఆయన యెంత దయచూపించాడో, అది నాకు తప్ప మీ కెవరికీ తెలియదు. చనిపోవడమే నేను జీవించివుండడమన్నమాట. ఈ సంగతి మీ కిప్పుడు తెలియదు. నేను పోయాక మీరు తెలుసుకుంటారు. మీ రనుకున్నట్లు, భగవంతుడు నా కన్నూ, చెయ్యీ ముందే తీనాకున్నా డంటావా? అవి, ఒకరోజు అటూ ఇటూ ఎప్పుడన్నా పోగలవు. ఇంత శిక్ష విధించి

కూడా, "ఆయన ప్రేమతో ఎంతో దయతో నన్ను మీకు తిరిగి అప్ప గించినందు కేమంటావు?" అని విరాజ్ అన్నది.

"అవును తిరిగి ఇచ్చాడు. ఆయన ఇచ్చింది బూడిద" అని హరి ఏడుస్తూ అంది.

కొంచెంసేపయాక "హరీ! మీ అన్నగా రెక్కడున్నారు? ఆయన గారిని కొంచెం ఇటు పిలువు. వారు చాలాసేపటినుంచి కనపడలేదు" అని విరాజ్ అంది.

చాలాసేపటినుంచి గోడప్రక్కనే నీలాంబరుడు నిల్చున్నాడు. ఆయన రావడంతోనే మోహిని మంచం దిగి వెళ్ళి కొద్దిదూరంలో నిల్చుంది. నీలాంబరుడు తలదగ్గర కూచున్నాడు. ఆయన భార్యకుడిచేతిని తన చేతిలోకి తీసుకుని నాడి పరీక్షించాడు. విరాజ్‌కు ఇప్పు దేమీలేదు, జ్వరంతోనే ఇలా వాగుతోందని, జ్వరం తగ్గగానే అఖరవుతుందని నీలాంబరుడు ముందే గ్రహించాడు, ఇప్పుడు నాడిలో కూడా అలానే కనుపిస్తుంది.

విరాజ్ "నీకు నాడి చూడ్డం బాగా తెలుసుగదూ?" అని నవ్వింది. ఎటువంటి పరిహాసం చేసింది. నీలాంబరుడు చేతిని చూస్తూనే ఆవేదనతో, ముఖం నిస్తేజమైంది. ఇటువంటి పరిహాసంతోనే ఇతని హృదయంలో ఆఘాతము యేర్పడిందని అందరూ ఎరుగుదురు. భర్తలో మార్పు విరాజ్‌కూడా గమనించింది. అనుతాపంగా ఆమె—"కాదు.... కాదు....నే ననేది అదికాదు. ఇప్పు డింకెంత ఆలస్యముందో నిజంగా చెప్పండి" అని అడిగి అతిప్రయత్నంమీద తన తలను భర్తఒడిలో పెట్టి, "అందరి యెదటా, మీరు మళ్ళీ ఒకసారి క్షమించారో లేదో చెప్పండి" అని అడిగింది.

నీలాంబరుడు గద్గదికంగా "క్షమించాను" అని కళ్ళు తుడుచు కున్నాడు.

కొన్ని క్షణాలు కళ్ళుమూసుకుని విరాజ్—"ఇన్ని రోజులవరకూ నేను గృహాన్ని సంబాళించుకున్నాను. ఈమధ్యలో నావల్ల అనేక పొర పాట్లు మీకు చేయరాని అన్యాయాలు చేశాను. అందుకనే మోహిని చెల్లీ!

విను. హారీ! నువ్వుకూడా వినమ్మా! నా పొరపాట్లూ, నావల్ల జరిగిన న్యాయాన్యాయాలన్నీ మీరంతా మర్చిపోయి నాకు సెలవు ఇప్పించండి! నే నీనాడే వెళ్ళవలసివుంది" అని విరాజ్ చేయి చాపి, భర్తపాదాలు స్పృశించింది. నీలాంబరుడు తల క్రిందనున్న దిండ్లను నెట్టివేసి ఆ స్థానములో కప్పుంచాడు. భర్త పాదధూళి తలమీద పెట్టుకుంటూ విరాజ్ "ఇంతవరకూ రకరకాల సుఖదుఃఖాలు అనుభవిస్తూవస్తున్నాను. ఈనా డన్నీ సార్ధకమైనదు! ఇక నా కే విచారమూ లేదు. నా శరీరము పవిత్రమై పాపరహితమైంది. ఇక నేను వెళుతున్నాను. వెళ్ళి నిల్చుంటాను" అని విరాజ్ ఒకప్రక్కకు తిరిగింది.

భర్తఒడిలో తలపెట్టి "ఇల్లాగే కూర్చోండి, యెక్కడికీ వెళ్ళవద్దు" అని అన్నది.

అంతకన్నా చెప్పేశక్తిగూడా ఆమెలో లేదు. ఆమె శాంతపడింది.

ముఖాలు మాడ్చుకుని అంతా కూర్చున్నారు. రాత్రి పన్నెండు గంటలకు విరాజ్ కలవరింతలు మొదలుపెట్టింది. నదిలో దూకినప్పటి నుంచి జరిగిన సంగతంతా చెప్పింది. అయినా, అమెచెప్పినవాటన్నిటిలోనే తన తప్పు వుందనుకొని, తన భర్తకోసము తహతహలాడినట్లు కనిపిస్తుంది.

విరాజ్ తిరిగివచ్చినప్పటినుంచి నీలాంబరుడు ఆమెయెదుటనే భోజనముచేయవలసివచ్చింది. ఆనాడు వుండి, వుండి హరిని, మోహినిని పిలుస్తూనేవుంది. ఆ తరువాత తెల్లవారబోతూండగా చివరిశ్వాస విడచింది. ఆమె మళ్ళీ కన్ను తెరవలేదు. మాట్లాడనూలేదు. భర్తఒడిలో తలపెట్టి సూర్యోదయముతోపాటు విరాజ్ తన జీవితాన్ని చాలించింది. ఈవిధంగా దుఃఖితురాలి దుఃఖము అనంతసాగరంలో లీనమైంది.

* * *

# శుభద

[శరత్ బాబు]

అనువాదం :

"రవి"

శరత్ గ్రంథమాల, విజయవాడ

# సుభద

కృష్ణప్రియ గంగానదిలో స్నానంచేస్తున్నది. ఆమె మెడలోతు నీటిలో నిలచి వున్నది. మూడు మున్కలు వేసింది. ఇత్తడి బిందెలో నీరు నింపుకొని "గ్రహబలం సరిగా లేకపోతే యిలానే జరుగుతుంది" అన్నది.

ఆ రేవులో యింకా నలుగు రైదుగురు స్త్రీలు స్నానంచేస్తున్నారు. వారంతా కృష్ణప్రియవంక బెదుకు బెరుకుగా చూడసాగారు. కృష్ణప్రియ నోరుకదిపితే తుఫాను వీచినట్లే. ఆ విద్యలో ఆమెను జయించగల వా రెవ్వరూ లేరు. ఏమిటి అంటున్నావ్? అని ఆమెను ప్రశ్నించడానికికాని, లేక అలాకాదు యిలా అని జవాబు చెప్పడానికికాని యెవరికీ దమ్ములు లేవు. వారందరికంటే ఆమె వయసులో పెద్దది. అందుచే ఆమెతో వాద వివాదాలు నెరపడం మంచిది కాదనుకొన్నారు.

"బిందూ! గ్రహబలం తిన్నగాలేనప్పు డిలానే జరుగుతుందమ్మా!"

ఏ సౌభాగ్యవతిని సంబోధించి ఆమె యీ మాట అన్నదో ఆమె పేరు "వింధ్యవాసిని." కాని బయటివారు యింట్లోవారుకూడా ఆమెను "బిందూ" అని పిలుస్తారు. బిందూ శ్రీమంతుల పిల్ల. అష్టసిద్ధులు, నవ విధులూ వున్న యింటి కోడ లైంది. నే డామె కన్నవారింటికి వచ్చింది.

తనను సంబోధించే ఆమె మాట్లాడుతున్నదని గ్రహించి సాహసించి 'ఏమి టత్తయ్యా! అంటున్నావ్?' అన్నది బిందు.

'అదేనే' హారాన్ ముఖర్జీ విషయం గుష్టికివచ్చింది. పాపం! భగవం తుడతనిమీద ఆగ్రహించాడని తోస్తున్నది.'

హారాన్ ముఖర్జీ దుర్భరస్థితిని గురించి ఆమె మాట్లాడుతున్నదని బిందువాసిని వెంటనే గ్రహించింది. ఆమె మాట విని ఆమెగూడా ఖిన్నురాలైంది. దాదాపు నెలరోజులక్రితం హారాన్‌ముఖర్జీ ఏకైక పుత్రుడు పరలోకగతు డైనాడు. కుఱ్ఱవాని వయస్సు అయిదు లేక ఆరు సంవత్సరాలుంటుంది. ఆ సంఘటన ఆమె కన్నులయెదుట కన్పిస్తున్నది.

"భగవంతునియెదుట మనమెంతవారమమ్మా! ఈ భూమండలములో యెవరి యింట్లో సుఖ-దుఃఖాలు, జనన-మరణాలు, భయ సంతోషాలు లేకుండావున్నవి?" అన్న[illegible].

వింద్యవాసిని అన్న యీ మాటలు మొదట్లో కృష్ణప్రియకు అర్థం కాలేదు. కొద్దిక్షణాల తరువాత "అవును. పిల్లవాడు చనిపోయి మాసం రోజులేమో అయింది. కాని నేను చెప్పేది అది కాదమ్మా బిందూ! చావు బ్రతుకులు మన చేతిలో లేవు. కాని నేను చెప్పబోయేది వేరే విషయాన్ని గురించి. బహుశా నీ కది గ్రహించలేదనుకుంటాను."

బిందువాసిని మౌనంగా కృష్ణప్రియవంక చూడసాగింది.

'బిందూ హారాన్‌ముఖర్జీని గురించి నేను చెపుదామనుకొన్న విషయాన్ని నీవు గమనించలేదనుకొంటాను.'

'ఏ విషయం?'

'అదేనమ్మా: భగవంతునికి కోపంవస్తే యిలానే జరుగుతుంది. అతని దుస్థితికి నాకేమీ విచారంలేదు. కాని బంగారుబొమ్మలాంటి అతని కోడలి స్థితిని తలచుకుంటే నాకు దుఃఖమాగదంలేదమ్మాయ్.'

బిందుకి యీ మాటగూడా అర్థంకాలేదు. ఆమె వెనుకటిమాదిరిగానే కృష్ణప్రియముఖంవంక చూడసాగింది. కాని కృష్ణప్రియ నోటి నుండి వెలువడినమాటలు నిరర్థకం కాలేదు. అసలు విషయం గోప్యంగా వుండడానికిమాప గోప్యమనే పరదా యెగిరిపోయి అసలువిషయం బట్టబయలైనది. గంగానది రేవులో వున్నవారందరికీ యీ విషయం ఆశ్చర్యాన్ని, కుతూహలాన్ని కలిగించింది. హారాన్‌ముఖర్జీవిషయంలో మనకు తెలియని క్రొత్తవిషయాలుయేమి జరిగాయాఅని అందరూ కృష్ణప్రియవంక విప్పారిన నేత్రాలతో చూడసాగారు.

కొంచెంసే పాలోచించి 'అత్తా! ఆ విషయమేమిటో నాకు చెప్పగూడదా?' అన్నది బిందు.

'ఎందుకు చెప్పగూడదమ్మా! కాని ఆ విషయ మంత ప్రియమైనది. పసందైనది కాదు. అందుచే దాన్ని విపరించి చెప్పవలెననే కుతూహలం నాకులేదు. ఆ విషయాన్ని తలచుకుంటేనే నాకు దుఃఖమాగటంలేదు. హే విధాతా! నీవు వాడి నొసట యిన్ని కష్టాలనుభవించమని వ్రాసి పెట్టావా?'

ఏమి కష్టాలత్తయ్యా!'

'తల్లి చిరునవ్వు నవ్వి 'మంచంలో పడుకోవడం నీకు సుఖంగానే వుంటుంది కాని నీకు సేవచేయలేక మా తాడు తెగుతుంది.'

'సరేకాని ముఖర్జీకి ఏం జరిగిందమ్మా!'

'ఏమున్నదమ్మా జరగడానికి!'

'ఈ రోజు రేవులో కృష్ణత్తయ్య మాటలసందర్భంలో హారాన్ ముఖర్జీకి పుత్రశోకమే కాకుండా యింకా అనేక కష్టాలు వచ్చిపడ్డవని చెప్పింది. నీకు తెలియదా అమ్మా!'

'నాకేమీ తెలియదు. మీ కృష్ణత్తయ్య యేమని చెప్పిందే?'

'హారాన్‌ముఖర్జీపై భగవంతు డాగ్రహించాడట. కాని అతని దుర దృష్టానికి నాకేమీ విచారంలేదు. బంగారుబొమ్మలాంటి వాడి కోడలిని చూస్తే నాకు విచారం పొట్లుకువస్తున్నది—అన్నమాటలే ఆమె నోటి నుండి వెలువడినవి. నే నెన్నివిధాల బ్రతిమాలినా 'ఇతరుల విషయాలలో జోక్యం కలిగించుకోవటం మంచిదికాదని' చెప్పి వెళ్ళి పోయింది'

'పాపం! ఇంతకాలానికి ఆమెకు జ్ఞానోదయమైనదన్నమాట.'

'అసలు నీ కీ విషయమేమీ తెలియదా అమ్మా!'

'తెలియదమ్మా, నా కేం తెలియదు.'

'అయితే యివాళ పంద్రెండు గంటలకు నేను వారింటి కెడతాను'

'ఎందుకు? అసలువిషయమేమిటో తెలుసుకోడానికా?'

'అవును.'

'నీ తలకాయ యేమైనా తిరిగిందాయేమే? ఇతరుల విషయంలో జోక్యంకలిగించుకోరాదని అలా పారిపోతే. నీకేం పట్టిందే?'

'ఎవరూ పారిపోయింది?'

'ఇంకెవరు—కృష్ణప్రియ.'

'అయితే కృష్ణప్రియే మనకు ఆదర్శచిహ్నమా?'

'ఈ విషయంలో ఆమె నిస్సందేహంగా ఆదర్శచిహ్నమే.'

'ఏమైనాకానీ, యివ్వాళ వారిఇంటికి తప్పకుండా వెడతాను.'

'అమ్మాయ్ బిందూ! ఇతరుల పోట్లాటల్లో తలదూర్చడం మంచిది కాదమ్మా.'

"అయితే మునిగిపోతున్నవారిని రక్షించడం మంచిది కాదంటావ్, ఇది మానవలక్షణమా?"

"అయితే నువ్వు వారిని ఉద్ధరిద్దామని వెళ్ళడంలేదు బిందూ!"

"మునిగిపోతున్నారని తెలిస్తే నే నెందుకు వెళ్ళను?"

కొంచెంసేపు బిందుతల్లి మౌనంగావుండి, తరువాత మెల్లగా "బిందూ! అక్కడకు వెళ్ళడం ఉచితంకాదు. హారాన్‌ముఖర్జీ మంచివాడు కాడు. నీ తండ్రి కతడు ఆగర్భశత్రువు. అక్కడకు వెళ్ళడం మనకు తగని పని. కులమర్యాద నతిక్రమించి విపరీతకార్యాలు చేయడం నీకు శ్రేయస్కరమా?"

"హారాన్‌ముఖర్జీ మంచివాడుకాడు. ఈ విషయం నాకూ బాగా తెలుసు. కాని నే నాతనిని కలుసుకోవడానికై వెళ్ళడంలేదు. నే నతని భార్యవద్దకు వెడతాను. అతనిభార్యను కలుసుకొంటే మన కొచ్చే అపకారం మేమిటి? పాప మామె చాలా కష్టాలలో మునిగివున్నట్లు స్పష్టంగా కనిపిస్తున్నది. ఈ సమయంలో మన మామెకు సానుభూతి చూపించి ధైర్యాన్ని పురికొల్పకపోతే లోక మేమనుకుంటుంది? కష్టాలలో వున్న వారిని ఆదుకోవడం మన కర్తవ్యం. పొరుగునవున్న కారణంగా మనం ఆమెను తప్పక వోదార్చాలి. లేకుంటే నా అత్తవారింటిలో నన్నూ అలానే చూస్తారు."

"నిన్ను ఇంటింటికి తిరగమని అఘోరనాధ్ ఆదేశించాడా? అందరి క్షేమ సమాచారాలు కనుక్కోమన్నాడా? అందరి కష్టాలలోను పాలు పంచుకోమన్నాడా? హారాన్‌ముఖర్జీ విషయం నీవు ఎరిగుంటే వాడి ఇంటికి వెడతానని పట్టుబట్టవు. వాడు నిన్నగౌరవపరుస్తాడు. నేను నీ తల్లిని, నా మాట విను.

"చూడమ్మా! ఈ సమయంలో నే నక్కడకు తప్పక వెళ్లాలి. అది మానవకర్తవ్యం."

"హారాన్‌ముఖర్జీకి ఏమి జరిగిందో తెలుసుకోవడానికైనా నీ వక్కడకు వెళ్ళేది? ఆ విషయం ఇంట్లోవాళ్ళకుగూడా తెలియదు."

"మరి నీ కెలా తెలిసినదమ్మా!"

"మీ నాన్నగారిద్వారా!"

"అయితే నేను తెలుసుకోవడానికి నీ ఆటంకమేమిటో చెప్పనమ్మా! మాట్లాడవేం?"

"హారాన్‌ముఖర్జీ నందబాబుదగ్గర నౌకరీచేస్తున్నాడు. సర్కారు డబ్బు తన స్వంతఖర్చులకు వాడుకొన్నాడు. నమ్మకద్రోహానికై అతని మీద కేసు బనాయించి నందబాబు అతనిని పోలీసులకు అప్పగించాడు.

"నంది బాబెవరు?"

నందబాబు బ్రాహ్మణవాడ్ జమీందారు. హారాన్‌ముఖర్జీ ఆయన సంస్థానంలో సర్కారుడు శిస్తులు వసూలుచేస్తుంటాడు.

"స్వంతానికి వాడుకొన్న డబ్బెంత?"

"దాదాపు రెండువందలు."

"మరి యెవరూ జామీనువుండి అతనిని విడిపించలేదా?"

"ఈ గ్రామంలో అతనికి జామీనువుండి విడిపించే వారెవరు? ఈ గ్రామంలో మీ నాన్నగారు పేరుపొందిన పెద్దమనిషి. ఇక అతనికి జామీనువుండి విడిపించాలంటే అందుకు మీ నాన్నగారే సమర్థులు. పాప మా అభాగ్యుడు మీ నాన్నగారికి బద్ధవిరోధి. మీ నాన్నగారు జామీను వుండడానికి నిరాకరించారు.

బిందు ఆలోచనాసాగరంలో నిమగ్నురాలై నది. కొంచెంసేపాగి "మంచిదమ్మా! ఇవ్వాళ కొంచెంసేపు వాళ్ళింటికి వెడతాను. ఇంతవరకు నేను వారి కోడలిని కలుసుకోనేలేదు" అన్నది.

తల్లికి కోపంవచ్చింది. "ఎంతచెప్పినా నీ మూర్ఖపు పట్టుదల వదల వన్నావ్. ఇంకా నీకు వెళ్ళాలనే వున్నదా?"

"అవునమ్మా!"

"బిందుతల్లి మారుమాటాడలేదు"

వారింటికి వెళ్ళినంతమాత్రాన మనకేవిధమైన అమంగళమూ జరుగదు. నా ఉద్దేశమేమంటే పురుషులకు పురుషులలో యేవైనా పొరపొచ్చాలు వస్తే వారి స్త్రీలు సరిదిద్దాలి. అది ఉభయులకు శ్రేయస్కరం కళ్యాణప్రదం.

చాలా ప్రొద్దెక్కినందున తల్లి అక్కడనుండి వెళ్ళిపోయింది. పోతూ పోతూ "ఈ విషయం మీ నాన్నగారికి తెలిస్తే అగ్గిలా మండిపడతా రమ్మాయ్!" అన్నది.

"నాన్నగారి కీ విషయం తెలియనివ్వను."

"వారి కెలాగైనా తెలియకుండా వుండదు."

"ఇంక నీవు చెపితే తెలియాలి. లేకుంటే ఎలా తెలుస్తుంది."

"తెలిసినతరువాత వారి క్రోధానికి హద్దుండదు."

"తల్లిదండ్రుల కోపం పిల్లలమీద శాశ్వతంగా వుండదమ్మా. అప్పుడే తగ్గిపోతుంది. నాన్నగారు కోప్పడతారని నీవు భయపడబోకమ్మా!"

## 2

హాలుడ్‌పూర్ ఫలానా జిల్లాలో అంతర్భాగమని వర్ణిస్తూ మీ హృదయాలను కష్టపెట్టదలచలేదు. ఎవరైనా అచ్చటకు వెళ్ళతగినస్థలంకాదు, కాని యెవరైనా ఆ వూరు చూడవలెననే అభిలాషవుంటే యీ క్రింద నమోదుచేయబడిన ఆ గుర్తుల ననుసరించి ప్రయాణం సాగించవలసి వుంటుంది.

ఈ గ్రామానికి కింతపేరు ఎందుకు వచ్చిందంటే పూర్వ మెప్పుడో వొకప్పుడు యీ గ్రామంలో ఒక సంపన్న కుటుంబం నివసించేది. ఇప్పుడు గ్రామంలో కనిపించే భగ్నావశేషాలన్నీ ఆ తాలూకువే. ఈ గ్రామం గంగానదిగట్టుపైనున్నది ఇక్కడ రెండు మూడు ప్రాచీన శివాలయాలుగూడా వున్నవి. ఈ ఆనవాళ్లు ఊరివెలుపల శిధిలావస్థలో వున్నవి. ఆ చుట్టుపట్ల కామంచి పొదలు, పేము పొదలు బలిసిపోయాయి. ఈ మందిరా లీ పొదలమధ్యలో మౌనముద్రాలంకారులైన యోగిపుంగవుల్లా కనిపిస్తున్నాయి. రెండు మూడు చెరువులుగూడా వున్నవి. కాని నీళ్లు నిర్మలంగా పరిశుభ్రంగా వుండవు. ఒడ్డు విరిగిపడిన కారణంగా నీళ్ళు బురద బురదగా వుంటాయి. వర్షాకాలం పోగానే నీ రెండిపోతుంది. అప్పు డవి వచ్చికబీళ్లుగా మారిపోతవి.

ఈ వర్ణన మూలంగా యీ గ్రామ మొకప్పుడు సిరి—సంపదలతో తులతూగినట్లు స్పష్టమగుచున్నది. కాని నే డిచ్చట పది పండ్రెండు బ్రాహ్మణుల, కాయస్థుల ఇండ్లు మాత్ర మున్నవి. వీరి నాశ్రయించుకొని యాభై అరవై శూద్రుల గుడిసెలున్నవి. ఊరును చుట్టుకొని అడవి వున్నది. అడవిలోనుండి ఊరిలోకి పోవటానికి రెండు కాలిబాట లున్నవి.

శ్రీయుత హారాన్‌చంద్ర ముఖోపాధ్యాయ యీ గ్రామంలోనే నివసిస్తున్నాడు. అతని ఇల్లు పాతది. ఇటుకలతో కట్టింది. రెండు గదులు పై భాగంలోనూ, నాలుగైదు గదులు క్రింది భాగంలోనూ వున్నవి. ఇంటికి నాలుగుప్రక్కలా వెదురుపొదలూ, రెండు మారేడు చెట్లూ, రెండు మామిడి చెట్లూ, ఒక వెలగ చెట్టు, రెండు మూడు అరటిచెట్లు వున్నవి. ఇవీ అతనికున్న సంపద.

హలుద్‌పూర్ గ్రామానికి ఒక మైలుదూరంలో బ్రాహ్మణపాడ్ అనే మరొక గ్రామమున్నది. నందిబాబు ఈ గ్రామ జమీందారు. హారాన్ చంద్ర ముఖోపాధ్యాయ యీతనివద్ద మాసమునకు యిరువది రూపాయల వేతనంపై గుమాస్తాగా పనిచేస్తున్నాడు. ఇరువది రూపాయలతో అతనికి యిల్లు గడవడంలేదు. ఇంట్లో జీవితావసరవస్తువు లెప్పుడూ అభావంగానే వుండేవి. మరొక మాటలో చెప్పాలంటే ఆ యింట్లో యినుపగజ్జెల తల్లి యెప్పుడూ నృత్యంచేస్తుండేది.

హారాన్‌చంద్ర పరివారం పెద్దది. అతని పరివారంలో విధవసోదరి ఒకామె, ఇద్దరు కొడుకులు, ఇరువురు కూతుళ్లు, భార్య ఉన్నారు. మొదట్లో నెలజీతం చేతిలోకి రాగానే అంతా భార్యచేతి కిచ్చేవాడు అతని భార్య, విధవ సోదరి కుటుంబాన్ని ఎలాగో దిద్దుకొచ్చేవారు. లేమి ఎవరికీ కని పించేదికాదు. కాని ఇప్పుడు హారాన్‌బాబు తన నియమాన్ని మార్చు కొన్నాడు. ఈ కారణంగానే ఆ ఇంటిలో దరిద్రదేవత పీటవేసుకొని కూర్చున్నది. ఒకప్పుడు ఉప్పుంటే పప్పుండదు. పప్పు ఉంటే ఉప్పు ఉండదు. మొన్న కట్టెలు లేని కారణంగా వంటచేయిలేదు. ఈ దుర్దశ కారణంగా అతని మెదడు వేడెక్కింది. ఈ బాధలన్నిటినీ మఱచిపోవ డానికై అనుచితమార్గా లవలంబించాడు.

రిస్తు వసూలుచేసే పని హారాన్‌చంద్రచేతిలో నున్నది. అందు లోని డబ్బు కొద్దికొద్దిగా తన స్వంత ఖర్చులకు వినియోగించుకోసాగాడు. నందిబా బతనిని యింతవరకూ విశ్వాసపాత్రుడైన నౌకరుగానే భావిస్తు న్నాడు. ఈ విశ్వాసమనే పరదామాటున హారాన్‌చంద్ర తన దుచ్చేష్టలు యథేచ్ఛగా సాగింపజొచ్చాడు. కాని ఎప్పుడో వొకప్పుడు పాపం బ్రద్ద లవక మానదు.

జమీందారు నందిబాబు కతని నడవడి చూచి అనుమానం కలిగింది. హారాన్‌వద్దనున్న లెఖ్ఖలన్నింటినీ తనిఖీచేయించాడు. కేసుపెట్టడానికి తగిన సాక్ష్యాధారాలు దొరికాయి. హారాన్‌చంద్ర సర్కారుడబ్బు మ్రింగి నట్లు తేలింది.

జమీందారు నందిబాబు ధార్మికప్రవృత్తిగల వ్యక్తి. కరుణా హృద యుడు. అత డావేశపూరితుడై యెప్పుడూ ఎవరినీ దండించలేదు. అతను హారాన్‌చంద్రుని పిలచి మెల్లగా యిలా ప్రశ్నించాడు. "నీ వెంత సొమ్ము వాడుకున్నావ్?"

"నాకు తెలియదు."

"నీకు తెలియనే తెలియదా? మూడువేల రూపాయలకు పైగా నీ స్వంతానికి వాడుకొన్నట్లు లెక్కలద్వారా తేలుతున్నది. ఆ డబ్బు ఏమైనది?"

"ఖర్చయినది."

"అలా యెందుకు చేశావ్? కేసుపెడతానని తెలియదా?"

"ఇరువది రూపాయలతో నా యిల్లు గడవడంలేదు. ఉప్పు లేదనో పప్పు లేదనో యింట్లో రోజూ పోరే. అందుచే నే నలా చేయవలసి వచ్చింది. నన్ను మీ రేమిచేసినా సరే."

"ఇదివరకు యిరువది రూపాయలతోనే నీ యిల్లు గడిచేది. ఇప్పుడు యిరవై రూపాయలతో గడవకపోవడానికి కారణం నా కేమీ కనిపించటం లేదు. పోనీ నిజంగా యిరవై రూపాయలు నీకు చాలకపోతే ఆ విషయం నాతో ఎందుకు చెప్పలేదు? సర్కారు డబ్బును యెందుకు అపహరించావ్?

"చెపితే మీరు నా జీతాన్ని పెంచేవారా?"

"తప్పక పెంచేవాడిని. కాని ఇప్పుడు జీతం పెంచడమన్న ప్రశ్నే లేదు. ఈ డబ్బుకడితే యిప్పుడు నిన్ను విడిచిపెడతాను"....

"నా చేతిలో చిల్లికానీ లేదు. డబ్బెక్కడనుండి తెచ్చేది?"

"ఏదైనా ఆస్తివుంటే అమ్మి బాకీ తీర్చు."

"తాత తండ్రులు మిగిల్చిపోయిన ఇల్లున్నది. దానిని అమ్మి మీ బాకీ రాబట్టుకోండి."

"ఇల్లమ్మితే నీ పిల్లాజెల్లా యెక్కడుంటారు?"

"ఆకాశంక్రింద."

నందిబాబు అతని ముఖంవంక చూచి "నీ కండ్లుయెర్రగా వున్నాయేం?"

"నాకు తెలియదు."

"హారాన్‌ముఖర్జీని వెళ్ళిపొమ్మని నందిబాబొక నౌకరునుపిలిచి హారాన్‌విషయ మేమైనా నీకు తెలుసా?" అని ప్రశ్నించాడు.

"ఏ విషయం?"

"అతని ఆర్థికవిషయం. అతనికి యెంత ఆస్తివున్నది? అప్పేమైనా వున్నదా? లేదా? అన్ని విషయాలు తెలుసుకోవాలి."

ఆ నౌకరుకు హారాన్‌ముఖర్జీ వ్యవహారమంతా తెలుసు. "అతని ఆర్థికస్థితి అత్యంత శోచనీయం ప్రభూ! ఆస్తిగూడా లేనిదానిలోనే జమ. కాని అతని కెవరైనా బాకీదారులున్నారో లేరోమాత్రం చెప్పలేను."

"మంచిది. వెళ్ళి అతని యింటివిషయాలన్నీ సమగ్రంగా తెలుసుకొని వచ్చి నాకు చెప్పు."

"రెండురోజుల అనంతరం ఆ నౌకరు తిరిగివచ్చి యిలా చెప్పాడు. నేను నిజం చెపుతున్నాను ప్రభూ! హారాన్‌ముఖర్జీ ఆర్థికస్థితి అత్యంత శోచనీయం. ఇందులో యేమీ సందేహంలేదు."

"హారాన్‌ముఖర్జీ నిషావస్తువులు సేవిస్తాడా!"

"గంజాయి త్రాగుతాడు"

"అందుకే అతని కన్నులా రోజున అంత యెఱ్ఱగావున్నవి. ఇదికాక యింకేమైనా దుర్గుణా లున్నవా?"

"చిత్తం...."

"మంచిది. అతనిపై కోర్టులో కేసు బనాయించి రేపతన్ని పోలీసులకు వొప్పగించుతాను."

కేసు బుజువై ముఖర్జీని జైలులో పెట్టారు. హాలుద్‌పూర్ గ్రామవాసుల కీ విషయం తెలియదు. కాని బిందుతండ్రి భవతారన్ గంగూలీకి ఈ విషయమంతా తెలుసు. బహుశా నందిబాబే యీ విషయమతనికి చెప్పివుంటాడు. అతను లబ్ధప్రతిష్టుడు. ఆ యిలాకాలో అతనికి మంచి పలుకుబడివున్నది. హారాన్‌ముఖర్జీని విడిపించగల సమర్థత అతనికున్నది. కాని అత నేమీ జోక్యం కల్పించుకోలేదు. పాపం హారాన్‌కి సాయపడే వా రెవరూలేరు. అలానే జైలులో పడివున్నాడు. కాని ఈ విషయం కలహాభోక్త కృష్ణప్రియచెవి నెలా పడింది? ఈ ప్రశ్నకు ఆమె సమాధానం చెప్పవలసినదే."

వైశాఖమాసం. మధ్యాహ్నసమయం. ఆకాశమంతా నల్లని కారుమేఘాలు క్రమ్ముకొన్న కారణంగా మధ్యాహ్నసుందరి నల్లని ముసుగు కప్పుకొన్నట్లున్నది. సరిగా యిదే సమయంలో హారాన్‌ముఖర్జీ భార్యా, కూతురు లలన వంటయింటి వసారాలో కూర్చొని వొకరిముఖం వొకరు చూచుకొంటున్నారు. ఇరువురి ముఖాల్లోను ఉదాసీనత గోచరిస్తున్నది. నేడు ఏకాదశి. లలన యెండిపోయిన పుష్పలతలా వున్నది. ఆమె తల్లి గూడా యింతవరకు పచ్చిగంగైనా ముట్టుకోలేదు.

"అమ్మా! నాన్న యివాళకూడా యింటికివచ్చే ఆశలేదు. ఆకాశం మేఘావృత్తమైనది. వర్షం వచ్చేటట్లున్నది. వర్షంకురిస్తే వంటిల్లంతా తడుస్తుంది. నీవు కొద్దిగా ఎంగిలిపడమ్మా!' అన్నది లలన.

"ఇం కొంచెంసేపు చూద్దాం. ఆయనగారు యింటికి వచ్చి మూడు రోజులైనది. బహుశా యివాళ రావచ్చు" అన్నది తల్లి.

"అమ్మా! నాన్నగారు మూడురోజులు యింటికి రాకుండా ఇదివరకెన్నడూ వుండలేదు. ఆయనవెళ్ళి మూడురోజులైనది. ఇవాళరాకపోతే?"

"రాకపోతే నేనేమి చేయగలము? అన్నిటికి భగవంతుడే వున్నాడు."

రాసమణి హారాన్‌బాబుకి పెద్దక్క. నియమానుసారంగా ఏకాదశీ

వ్రతాలూ, పూజలూ చేస్తుంది. నిత్యకృత్యాలు నిర్వర్తించుకొని తల్లీ కూతుళ్ళు వున్నచోటికి వచ్చి—

"అమ్మాయ్! నీ వింకా భోజనంచేయలేదటే?" అన్నది.

"ఇంకా కొంచెంసేపు చూద్దామత్తయ్యా!"

"ఇంకా యెంతసేపని కాచుకు కూర్చుంటావే! ఆ గాడిద గంజాయి త్రాగి రోడ్డుమీద యెక్కడ దొర్లుతున్నాడో, లేకుంటే యే ముండ ఇంట్లో దూరాడో, ఇప్పు డేమొస్తాడే."

"ఉపవాసమున్నరోజున రాసమణి చిరాగ్గావుంటుంది. ఆమె మాటలకు తల్లీ—కూతు ళ్లేమీ జవాబు చెప్పలేదు. ఆమెకు కోపం మరీ యెక్కువైంది. "ఆఁ, ఆ వెధవ చస్తేనన్నా బాగుండును, నా హృదయం చల్లబడుతుంది" అన్నది.

రాసమణినోటిలోనుండి యీ మాట వెలువడగానే లలన కళ్ళనీరు నింపి "అత్తయ్యా! ఏకాదశిపూట యెందు కలాంటి అశ్లీలాలు వలుకుతావ్?" అన్నది.

లలన అన్న యీ మాట రాసమణిహృదయంలో శూలంగా గ్రుచ్చుకొన్నది. తన పొరపాటుకు పశ్చాత్తాపపడ్డది. ఆమె మనసులో చాలా దుఃఖించింది. సిగ్గుపడింది. అయినా పసిపిల్ల లలన అన్న మాటతో ఆమె కోపాగ్నిలో ఆజ్యం పోసినట్లయినది. "గుడ్డు వచ్చి పిల్లను వెక్కిరించినట్లు నీవు నాకు నీతులు చెప్పవచ్చావా? నా వెంట్రుకలు యెండకు పండినవనుకున్నావా? హారాన్ నీ తండ్రి అన్నట్లు నీ మాటలవలన స్పష్టమవుతున్నది. వాడు నాకేమీకాడా? వాడిమీద ప్రేమ నీకేనా? నాకులేదా?"

రాసమణి కన్నులలో నీరు తిరిగింది. ఖిన్నవదనంతో "నా తమ్ముడు యింట్లోనుండి పోయి మూడురోజులైంది. ఇప్పటివరకు తిరిగిరాలేదు. అతనికొరకు నే నెంత దుఃఖిస్తున్నానో నా హృదయానికే తెలుసు" అంటూ పైటకొంగుతో కండ్లు తుడుచుకొని "నా కాలొకటి శ్మశానంలోను, వొకటి యింట్లోను వున్నది. కోపావేశంలో నే నేమైనా అంటే మీ రదిగూడా సహించలేకుండావున్నారు. మాటకు మాట అనడానికి సిద్ధంగా కూర్చున్నారు. మంచిది. నేను పెద్ద పొరపాటుచేశాను,

ఇక యెప్పటికీ అలాంటిమాట లనను. మరదలి దుఃఖాన్ని చూడలేక నే నలాంటిమాట అనవలసివచ్చింది" అన్నది.

లలన తను అన్నమాటలకు చాలా పశ్చాత్తాపడింది. అత్తగారి కింత కోపంవచ్చి ఆమె కండ్ల నీరునింపుతుందని అనుకోలేదు."అత్తయ్యా! నన్ను క్షమించు. ఇప్పుడుగాని మరెప్పుడుగాని నే నిక అలాంటి మాట లనను. క్షమించు".

ఇంతలో తల్లి కల్పించుకొని "అమ్మాయ్! నీ కిన్నేళ్లవచ్చాయి. కాస్త పెద్దా చిన్నా విచారించి మాట్లాడాలి" అన్నది.

తరువాత రాసమణి, లలనా బ్రతిమాలగా తల్లి భోజనంచేసింది. అదే సమయంలో వింధ్యవాసిని తన కుమార్తె ప్రమీల వ్రేలుపుచ్చుకొని హారాన్ ముఖర్జీ యింటిలో ప్రవేశించింది.

ఇంటిలో కాలుపెట్టగానే రాసమణి యెదుమగా కన్పించింది. బిందుని చూడగానే ఆమె యిలా అన్నది. "బిందూ! మా యింటికి రావడమే మానేశావేమమ్మా!"

"మీరుమాత్రం మా యింటికి వస్తున్నారాయేం?" అన్నది బిందు జవాబుగా.

"మేమేదో ఝంఝూటంలో చిక్కుకొన్నాం. కాలు బయట పెట్టడానికికూడా తీరిక చిక్కడంలేదు. చిన్నపిల్లవానికి జబ్బుగావున్నందున క్షణంకూడా వాడిని విడిచి వుండడానికి వీలు చిక్కడంలేదు."

"వాడికి జబ్బేమిటి?"

"చలిజ్వరము. లివరు పెరిగిందట. ఇంకేమేమి రోగాలున్నవో నాకు తెలియదు. రోగాలన్నీ వాడినే చుట్టుముట్టాయ్."

"మరద లెక్కడున్నది?"

"ఇప్పుడే రెండు మెతుకులు కొరికి అదుగో ఆ గదిలో వాడి మంచందగ్గర కూర్చొని వున్నది."

"భోజనంచేయకుండా ఇప్పటిదాకా ఏం చేస్తున్నది."

"హారాన్ రాకకై యెదురుచూస్తూ కూర్చున్నది. వాడు యిల్లు వదలి మూడురోజులైంది. వాడిరాకకై యెదురుచూస్తూ భోజనంచేయడానికి ఆలస్యమైనది."

అక్కడనుండి బిందు మాధవుడున్న గదివద్దకు వెళ్ళింది. తల్లి మాధవుడికి చిన్న చిన్న కథలు చెపుతున్నది.

మాధవుడు హారాణాముఖర్జీ చిన్నకొడుకు. అతని వయస్సు ఎనిమిది సంవత్సరాలు. ఒక సంవత్సరంనుండి అతను మలేరియాచే పీడింపబడుతున్నాడు. లివరుగూడా పెద్దదయిన కారణంగా అతని పొట్ట పెద్దదిగా వికారంగా కన్పిస్తున్నది. అతను మంచంమీదనుండి లేవలేడు. ఎవరైనా మంచి డాక్టరుచేత మందిప్పిస్తే నయంకావొచ్చు. కాని ధనాభావంచేత అతనికి యింతవరకు సరియైన వైద్యం జరగలేదు. మామూలు మందు లిస్తున్నారు. కాని వాటివల్ల ఫలితం కన్పించడంలేదు. మాధవుడు తల్లి ముఖంలోకి చూస్తూ, "అమ్మా! మూడు రోజులనుండి నాన్నగారు నన్ను చూడడానికి రావడంలేదు. కారణమేమిటే?" అన్నాడు.

"నాన్నగారు యింటివద్ద లేరయ్యా!"

"ఎక్కడికి వెళ్లారు?"

"నీకు మంచి మందు తీసుకురాబోయారు."

తల్లి చెప్పిన ఈ మాటలు వినేసరికి మాధవుని సంతోషానికి మేర లేదు. "అమ్మా! చేదుమందు గొంతు దిగడంలేదు. నాన్నగారు తియ్యని మందేదైనా తెస్తే బాగుండును. అమ్మా! మంచి మందుతాగి నయమయాక వెనకటిమాదిరిగా లేచి తిరగాలనీ గంతులువేయాలనీ నా కోరిక అమ్మా! నయమవుతుందా?" అన్నాడు.

తల్లి కనులలో నీరు తిరిగింది. "భగవంతుని దయ యెలాగున్నదో" అని మనసులో అనుకొన్నది. "భగవంతుడు నా నుదుట యేమి వ్రాశాడో తెలియదు" ఇంతలో బిందు మంచంవద్దకువచ్చి "నీకు తప్పక నయమౌతుంది బాబూ, భయపడబోకు, నేను నీకు నయంచేస్తాను" అన్నది.

బిందు రాకను తల్లీ కొడుకు లిరువురూ గమనించనేలేదు. ఈ మాటలు విని యిరువురూ ఉలిక్కిపడ్డారు.

బిందు మంచంమీద కూర్చుంటూ "సుభద్రా, నీవు భోజనం చేశావా?" అని ప్రశ్నించింది.

హారాన్ ముఖర్జీ భార్యపేరు సుభద. బిందు వయసులో ఆమె కంటే చిన్నది. అయినా బిందు ఆమెను సుభదా అనే పిలుస్తుంది.

సుభద "తిన్నా" నన్నట్లు తలవూపింది.

"పెద్దమ్మాయి ఎక్కడకు వెళ్ళింది?"

"బహుశా పైగదిలో ఉన్నదేమో."

"ఆమెను పిలువు" అంటూ బిందు స్వయంగానే "లలనా, లలనా" అంటూ పిలువసాగింది.

పై గదిలోనుంచే "ఏమిటి సంగతి?" లలన జవాబిచ్చింది.

"క్రిందికి దిగిరా అమ్మాయ్"

లలన క్రిందికి దిగివచ్చింది. ఆమె రాగానే బిందు తన కుమార్తె ప్రమీలను ఆమె చేతికిచ్చి "మీ రిద్దరూ కొంచెంసేపు ఈ మంచంవద్ద కూర్చోండి. నేనూ మీ అమ్మా మాట్లాడుకుంటాం. చాలా రోజులకు మే మిరువురమూ కలుసుకొన్నాం. మే మింకొకగదిలోకి పోయి మాట్లాడు కొంటాం. అందాక మీ రిక్కడుండండి" అన్నది.

బిందు సుభదచేయి పట్టుకొని ప్రక్కగదిలోకి తీసుకుపోయి లోపలి గడియవేసింది. "సుభదా! హారాన్ బాబు ఇంట్లోనుంచి వెళ్ళి ఎన్ని రోజు లైంది?"

"మూడురోజులు."

"మూడురోజులనుండి రాని కారణమేమిటో నీకు తెలుసా?"

"తెలియదు."

బిందుమాట వినగానే సుభద కనుమానం కలిగింది. అయినా ముఖంలో గాంభీర్యం తొణికిసలాడుతోంది. ఇక బిందు ఆలోచనాసాగరంలో మునిగింది. బిందు ఏమైనా సంగతులు చెప్పుతుందేమోనని సుభద ఆమెముఖంవంక ఆతురతతో చూస్తున్నది. "సుభదా! జీవితంలో ఇలాంటి ఘడియ లనేకం వస్తుంటవి. ఏదైనా చెప్పవలెననుకొన్నా చెప్పలేం. తెలిసిందా?"

సుభద "ఎందుకు చెప్పలేం?" అన్నది ఉదాసీనభావంతో.

"ఏవైనా అమంగళవాక్యాలు చెప్పవలసివస్తే యెలా?"

"ఈ మాటలు వినేసరికి సుభద కాళ్లు వణకసాగాయి. వారీ లోకంలో లేరా?" అంటూ విలపించసాగింది.

"ఎందుకలా భయపడతావ్? వారీ లోకంలో లేరని ఎవరన్నారు?"

"అయితే వారు జీవించివున్నారా?"

"ఎందుకమ్మా గాభరాపడతావ్? ఆయన ఈ లోకంలోనే వున్నారు. హాయిగా వున్నారు."

ఈ మాట విన్న తరువాతగూడ సుభద కనుమానం వదలలేదు. ఆమె మాటలలో తొట్రుపాటు పోలేదు.

"అసలేమి జరిగిందో చెప్పవేమమ్మా!" అన్నది మెల్లగా.

"చెప్పడానికే నే నిక్కడకు వచ్చాను. అయినా నీవిట్లా భయపడుతుంటే నే నెలా చెప్పేది."

సుభద దీర్ఘ విశ్వాసం విడిచి "సరే భయపడను. ఇక చెప్పు" అన్నది.

"సర్కారుడబ్బు అపహరించాడనే నెపంమీద నందిబాబు ఆయనగారిపై కేసు బనాయించి కొట్లో పెట్టించాడు."

ఈ మాట వినగానే సుభదముఖంలో కత్తివ్రేటుకు నెత్తురుచుక్కలేదు. "అయితే మన మిప్పు డేం చేయాలి?" అన్నది.

"ఆయనను జైలులోనుండి విడిపించాలి."

"ఇది సాధ్యమా?"

"సాధ్యమెందుకుకాదు? సాధ్యంకాని కార్యమంటూ ఒకటున్నదా?"

సుభధ కొంచెంసేపు మౌనంవహించి "ఈ విషయాన్నిగురించి మీ నాన్నగారివద్దకు వెడదామనుకొంటున్నాను." అన్నది.

బిందు వద్దన్నట్లు తల వూపింది. ఆయనగారికి విషయం ఆమూలాగ్రం తెలుసు. సుభద సర్వనాశనమైనాసరే భవతారిన్ గంగూలీ పట్టించుకోడు. పైగా నువుగూడా నీ భర్తవద్దకు వెళ్ళడానికి ఒప్పుకోడు."

"అయితే మరి నా కింకెవరున్నారు? ఈ కష్టసమయంలో నన్నాదుకొనేవారెవ్వరు? ఆయనవద్దకే పోయి దయాభిక్ష యాచిస్తాను. ఆయన పాదాలమీద పడతాను కరుణించమని."

"దిక్కులేనివారికి దేవుడే దిక్కు. నా తండ్రికి హారాన్‌బాబుకి బద్ధవైరం. అందుచే నా తండ్రివద్దకుపోయి లాభంలేదు."

"అయితే యిప్పు డేంచేయాలి?"

"నేను నీకు సహాయంచేస్తాను. ఈ అంధకారాన్నుండి నిన్ను వెలుపలకు లాగి వెలుగును చూపిస్తాను. మరి నేను చెప్పినట్లు వింటావా?"

"తప్పక వింటాను."

"ఒకవేళ నీకు కష్టం కలుగవచ్చు."

"అయినా తప్పక వింటాను."

"రెండు మూడునందల రూపాయలకేసు

"ఎవరైనా రెండుమూడువందల రూపాయలు ఒక్క పర్యాయం ఖర్చుచేయగలరా? ఈ రెండుమూడువందల రూపాయలు యిస్తే నంది బాబు కరుణించి ఆయనగారిని విడిపించవచ్చు; కాని నాకు నమ్మకం కుదర డంలేదు బిందూ!"

"సరిగా ఆలోచించావా సుభదా! ఇలాంటి తర్కవితర్కాలతో యిప్పుడు పని జరుగదు. ఆ రెండు మూడువందల రూపాయలు అవతల పారేస్తే నందిబాబు కేసు యెత్తివేసుకొని ఆయనను విడిపిస్తాడు."

"అయితే యింతడబ్బు నే నెక్కడ తెచ్చేది?"

"ఈ సమస్యాపరిష్కారంగూడా చెప్పుతాను. ఇది సిగ్గుపడవల సిన సమయంకాదు. నా బంగారు మురుగులు నీ కిస్తాను. ఈ మురుగులు తీసుకొని నీవు నందిబాబువద్దకు వెళ్లు. అతనిని కలుసుకొన్నతరువాత నీకు యెలా ఉచితమనితోస్తే అలా చెయ్యి."

"నీ మురుగులా?" అన్నది సుభద ఆశ్చర్యంగా.

"సంకోచించవలసినపనిలేదు. ఈ రెండు మురుగులు రెండుమూడు వందలు చేస్తవి. వీటిని ఇచ్చి నీ వాయనను బ్రతిమాలు. బహుశా ఆయన కరుణించి నీ భర్తను విడిపించవచ్చు."

"కాని బిందూ....!"

"కానీ గినీలతో ఆలసించడాని కిది సమయంకాదు. మొదట నీ భర్తను విడిపించే మార్గ మాలోచించు. నా డబ్బును గురించి నీ కేమీ

విచారించకు. భగవంతుడు తిన్నగాచూస్తే నీ పిల్లలు పెద్దవాండ్లయి నా దాకీ తీర్చుకొంటారు. సందేహించకు."

"అయితే నేడే వెడతాను."

"అవును. యివ్వాళే వెళ్లు."

"వెంట ఎవరిని తీసుకువెళ్ళేది?"

"నమ్మకమైనవారు యెవరైనా వున్నారా?"

"ఎవరూ లేరు."

"అయితే ఒంటరిగానే వెళ్ళు. ఎందుకంటే యీ విషయం ఇతరులకు తెలియడం మంచిదికాదు."

"సరే, నేడే వెడతాను."

"చీకటిపడినతరువాత మాసిన చీర కట్టుకొని ముఖాన ముసుగు వేసుకొని వెళ్లు. రేపదే సమయానికి నేను వచ్చి నిన్ను కలుసుకుంటాను."

బిందు ఇక వెడతాననగానే సుభదకన్నులలో నీరు గిర్రున తిరిగింది. బిందు తన పైటచెంగుతో ఆమె కన్నులొత్తుతూ "పిచ్చిదానా! ఎందుకు విచారపడతావ్. ఈ ఉపాయం కొనసాగకపోతే రేపు మరొక ఉపాయం ఆలోచిద్దాం, భయపడకు."

పోతూ పోతూ బిందు సుభదచేతికి అయిదురూపాయలుగూడా యిచ్చింది. "చూడు సుభదా! మన మిరువురము అక్కచెల్లెండ్రలాంటివారము. సిగ్గు, మోమోటపడవలసిన పనిలేదు. ఈ అయిదురూపాయలు పిల్లవాడి మందుకూ మాకుకూ వుపయోగిస్తవి. వుంచుకో."

బిందు ఇక వెడతానంటూ ప్రమీలను తీసుకొని లలనవంక ప్రేమపూరిత నయనాలతో చూస్తూ వెళ్ళింది.

# 3

గాలి తీవ్రంగా వీచసాగింది. ఆకాశాచ్ఛాదిత మేఘాలన్నీ విడిపోయాయి. కాని సూర్యాస్తమయం కాగానే ఆకాశమంతటా కారుమేఘాలు క్రమ్ముకొని గాఢాంధకారం నలుదిశలా వ్యాపించింది. ఉరుములూ, మెరుపులూ చూచి యివ్వాళ తప్పక వర్షం కురుస్తుందను

కొన్నారు. ఈ వర్షంపడే సూచనను గ్రహించి అందరూ నెమళ్ళనాట్యం చేయసాగారు. ఇంతవరకూ ఎండలు కాచి, గాడ్పులువేసిన కారణంగా ఈ చినుకులు వారికి ఆనందాన్ని కలిగించాయి. కాని సుభదమాత్రం ఆనందంలో పాలు పంచుకొనలేదు. ఆమె గతించిన సంతోషదినాలను నెమరువేసుకొంటూ విచారసాగరంలో మునిగివున్నది. ఆమె ఆనందో ద్యానవనం యెప్పుడో యెండిపోయింది.

వర్షాకాలం రసవత్తరమైనది. కాని యీ వర్షాన్ని తలుచుకుంటేనే ఆమెగుండె బేజారైపోతున్నది. ఎందుచేతనంటే ఆమె యీ వర్షంలో అడవిలోగుండా ప్రయాణంచేయాలి. దారిగూడా సరిగా తెలియదు. ఈ ప్రయాణ మాపడానికి వీలులేదు, ఎలాగైనా వెళ్ళితీరాలి. రెండు మురుగులు కొంగున కట్టుకొన్నది. శరీరమంతా పక్కదుప్పటితో కప్పుకొన్నది. బ్రాహ్మణపాడ్‌కి ఆమె అపరిచిత. ఇదివరకెన్నడూ వెళ్ళవలసిన అవసరం కలుగలేదు. ఉత్తరదిశగా అరకోసుదూరం పోతే రాజబాట కన్పిస్తుందని, యింకా కొంచెందూరంపోతే బ్రాహ్మణపాడ్ కనిపిస్తుందని మాత్రం ఆమెకుతెలుసు.

ఎలాంటికష్టాలు వచ్చినాసరే బ్రాహ్మణపాడ్ వెళ్లాలని నిశ్చయించుకొన్నది. గ్రామంలో కాలుపెట్టగానే నందిబాబు మేడ కన్పిస్తుందని ఆమె లోగడ విన్నది. కాని అడవిదారులు తెలుసుకోవడ మామెకు దుస్తరమైపోయింది. ఎలాగో అడవి దాటి రాచబాటవెంట కొంతదూరం పోయేసరికి గాఢాంధకారం నలుదెసలా వ్యాపించింది. చినుకులు పడసాగాయి కాని సుభద ధైర్యాన్ని చిక్కబట్టి నిర్భయంగా అడుగులు ముందుకు వేయసాగింది. చూస్తుండగానే కుంభవర్షం కురవసాగింది. సుభద ఒక చెట్టుక్రింద నిలబడింది. ముందుకు వెళ్లాలంటే గాఢాంధకారం మూలంగా దారి సరిగా కన్పించడంలేదు. ఉరుములు, మెరుపులు, పిడుగుల మ్రోత భయావహంగా వున్నది. సుభదకు భయమేసింది.

వన్యమృగాలు భయంతో అటూ ఇటూ పరుగెత్తుతూ సుభద నిలిచివున్న చెట్టువద్దకు వచ్చి అక్కడవున్న మానవమూర్తినిచూచి భయంతో పారిపోతున్నవి. ఎవరైనా దొంగలు వస్తారేమోనన్న భయంతో

సుభద ఆ చెట్టుక్రింద అట్టేసేపు నిలబడలేకపోయింది. కాని బంగారు ముపసులను గురించే ఆమె భయం. ఆ మురుగులను తన ప్రాణాలకంటే విలువైనవిగా భావిస్తున్నది. తన ఆశాసౌధాలన్నీ ఆ మురుగులపై ఆదార పడివున్నవి. ఆ మురుగులను తీసుకొని తన భర్తను జైలునుండి విడి పించడానికై పోతున్నది.

ఆలోచనా సాగరంలోనుండి తెప్పరిల్లి ఆమే భయంతో ముందుకు సాగింది. ఆమె మరల తన గమ్యస్థానంవైపు పయనించసాగింది. ఆమె శరీరమంతా వర్షానికి తడిసి, బురదకొట్టుకున్నది. కంటకావృతమార్గం వెంట పయనించిన కారణంగా ఆమె పాదాలు పచ్చిపుండ్లయినాయి. అయినా ఆమె అవిరళగతితో ముందుకు సాగిపోతూనేవున్నది. వర్షం ధారాపాతంగా కురుస్తూనేవున్నది, అవిరామంగా ఉరుములు, మెరుపులు భయం గొల్పుతున్నాయి. ఆ గాఢాంధకారంలో పాపా మామెకు యేవైపుకు పోవాలో కూడా తెలియడంలేదు. ఇలా ఆలోచనా డోలికల్లో ఊగులా డుతూ ఆమె ముందుకు పయనిస్తున్నది.

రాచబాట దొరికేవరకూ గమ్యస్థానం చేరుకోగలనా లేనా అనే భయం కలిగిం దామెకు. రాచబాటలో ప్రవేశించినతరువాత గాఢాంధ కారంలో ప్రాణాలకు తెగించి యీ అడవిమార్గంవెంట యెలా పయనిం చానా అని ఆమెకే ఆశ్చర్యమేసింది. ఆమె ధైర్యం సన్నగిలజొచ్చింది. "చాలా పొద్దుపోయింది. ఇంత ప్రొద్దుపోయినతరువాత బాబుగారిని కలుసుకొనడం సాధ్యమా? ఈ పరిస్థితుల్లో యెలాగైనా వారిని కలుసు కొనకుండా యింటికి తిరిగిపోవడ మెలా?"

ఇలా ఆలోచనా సాగరంలో మునుగుతూ తేలుతూ సుభద బ్రాహ్మణపాడ్ చేరింది. పెద్ద మేడ. చుట్టూ ఉద్యానవనం. దానిచుట్టూ ముండ్లతీగ చూడగానే యిదే జమీందారుగారి మేడఅయివుంటుందను కొన్నది. ఈ అర్ధరాత్రి సమయంలో ఆ జమీందారుగారిని కలుసుకొనడ మెలాగా అన్న ప్రశ్నే ఆమెను పట్టి వేధించసాగింది.

సమయంకాని సమయంలో వచ్చినందులకు ఆమె హృదయం బాధపడింది. పైగా మార్గాయాసంమూలాన ఆమెలో సత్తువలేకుండా

పోయింది. మేడ కెదురుగా ఒక దేవాలయమున్నది. ఆ దేవాలయం యెదుట వొక మంటపమున్నది. ఆమె ఆ మండపంలో పండుకొన్నది. కుంభవర్షమాగి తుపరపడసాగింది. వైశాఖ మేఘాలు గాలిగుఱ్ఱాన్నెక్కి ఆకాశరంగంలో షికార్లుచేస్తున్నవి. ఇట్టే కన్పిస్తవి. అట్టే మాయమౌతవి. నేడు కన్పించిన మేఘాలు ఈ పద్ధతినే అనుసరించాయి. వర్షం తగ్గి పోయిన కారణంగా ఆకాశంలో చంద్రుడు ప్రకాశింపజొచ్చాడు. వెన్నెల పిండారబోసినట్లున్నది.

తడిసిన గుడ్డలు పిండుకొంటూ సుభద యిలా అనుకొన్నది. "ఇంటికి తిరిగివెళ్ళడానికి మంచి అనుకూలముగనున్నది" ఇలా అను కుంటూ వుండగానే ఆమె దృష్టి ఒక వృద్ధ నౌకరుపైపడింది. ఆ నౌకరు జమీందారుగారి మేడ సింహద్వారం తెరుస్తున్నాడు. ద్వారం తెరిచి అతను దేవాలయంవైపుకు రాసాగాడు, అతని చేతిలో లాంతరున్నది. అతనిని చూడగానే సుభదకు అణగిపోయిన ఆశాలత తిరిగి పుష్పించింది. అతని ద్వారా జమీందారుగారి విషయం తెలుసుకొనవచ్చుననే ఆశ ఆమెలో మొలకెత్తింది. అయినా ముందుకు అడుగువేయలేక అతనివంక చూస్తూ మంటపంలో అలా నిలబడిపోయింది.

ఆ నౌకరు మంటపమువద్దకు వచ్చి ముసుగులోనున్న ఆమెను చూచి పలకరించకుండా దేవాలయములోకి వెళ్ళాడు. చాలసేపు దేవా లయములోనే వుండి అతను బయటికి వచ్చాడు. అతను ఆ స్త్రీమూర్తిని అదే రూపంలో అదే స్థానంలో మరల చూచాడు.

ఎవరో భయపడి పారిపోయివచ్చిన స్త్రీగా వృద్ధనౌకరు భావిం చాడు. వర్షం కురుస్తూవుండడంచేత యిక్కడ నిలబడింది. వర్షం వెలి సింది, బహుశా యిక వెడుతుందనుకొన్నాడు. కాని తాను దేవాలయం లోకి వెళ్ళి తిరిగివచ్చేవరకు అక్కడే నిలచివున్న కారణంగా అతనికి మనసులో శంక పొడమింది.

"ఎవరు నీవు?" అని ప్రశ్నించాడు.

ఆమె మాట్లాడలేదు.

"ఎవరు నీవు? ఎక్కడికి వెడతావ్?"

సుభద సిగ్గుచే తలవంచుకొన్నది. కాని విధిలేక మౌనాన్ని విడచి పెట్టవలసివచ్చింది. "జమీందారుగారి యింటికి వెళ్ళాలి" అన్నది కోమల స్వరంతో.

"ఎదురుగా వారి మేడ కన్పిస్తుంటే యిక్కడ తారట్లాడుతావేం?"

సుభద మాట్లాడలేదు.

"నీ వెవరిని కలుసుకోవాలి?"

"జమీందారుగారిని"

"ఎవరినీ?"

"నందిబాబుగారిని."

ఈ మాట వినగానే వృద్ధ నౌకరు కాశ్చర్యమేసింది. "ఎవరిని? నందిబాబుగారినా?"....అని తిరిగి ప్రశ్నించాడు.

"అవును."

"సరే పద. నేను తీసుకుపెడతా" నంటూ అతను ముందుకు సాగాడు. వెన్నెలకాంతిలో పాలవలె తెల్లగా నెరసిన తెల్ల వెంట్రుకలు గల ఆ వృద్ధునిముఖంలో సరళత్వాన్ని గమనించింది సుభద. ఆమె నిస్సంకోచంగా అతనిని అనుసరించసాగింది. ఉపవనం దాటిన తర్వాత మేడవద్దకుపోయి ఒక గది తలుపు తెరచి "లోపలకు వెళ్ళు" అని చెప్పాడు నౌకరు.

సుభద గదిలోకి వెళ్ళింది. గదిలో అలంకారములన్నీ నిరాడంబరముగ నున్నవి. క్రింద తివాసీ పరచివున్నది. జమీందారుగారు కూర్చొనడానికి అమూల్యమైన ఆసన మున్నది. ఒక వృద్ధుడు ఆ ఆసనముపై ఆసీనుడై వున్నాడు. గదిలో వెలుతురున్నది, ఆ వెలుగులో వృద్ధు డామెను నఖశిఖపర్యంతం గౌరవపురస్సరంగా చూచాడు. ముఖము పైనున్న ముసుగు ఉచ్ఛ్వాస, నిశ్వాసముల మూలంగా కొద్దిగా చెదరింది. ఆ సమయములో జమీందారుగారు ఆమె ముఖవర్ఛస్సును తిలకించారు. సుభద వొకప్పు డందమైనదే. ఆనాడు అందంలో ఆమెకు సాటిరాగల వా రా చుట్టుపట్ల లేరు. కాని యవ్వనం అంతరించి, దుర్దినాలు వచ్చి పడినందున ఆమె అందమంతా కర్పూరంలా హరించుకుపోయింది.

లకు యింపుగా తోచేవికావు. లలన పేరు పరవాలేదు. ఏదో ఒక మోస్తరుగా వుంది. ఛలన పేరే ఆమె చెవులకు డబ్బాలో రాళ్లుపోసి మోగించినట్లుండేది.

సుభద ఆడబిడ్డ రాసమణి ఛలనను క్రీగంటితోగూడా చూచేది కాదు. ఛలన పేరు వింటేనే మండిపడేది. ఆమె కోపానికి కారణం 'ఛలన' అన్న పేరు ఆమెకు యింపుగా తోచకపోవడమే. రాసమణి అభిప్రాయంలో ఆడపిల్లలకు, మగపిల్లలకు దేవతల పేర్లు పెట్టాలి. ఎందుచేతనంటే ఆ విధంగానైనా దేవుళ్ళను. దేవతలను తలుస్తామని. ఆ దేవతలు మనకు మేలు చేకూరుస్తారనీ ఆమె భావం. అందుచే ఈ లలన, ఛలన అన్న పేర్లు ఆమెకు నిరర్థకంగా కనిపిస్తున్నవి.

హారాన్‌బాబు కూతుళ్ళ పేర్లు లలనామణి, ఛలనామణి. ఒకమ్మాయికి పదిహేడు సంవత్సరాలు, ఒకమ్మాయికి పదకొండు వసంతాలు గడిచాయి. పెండ్లి అయిన కొద్ది కాలానికే పెద్దపిల్లకు వైధవ్యం ప్రాప్తించింది. చిన్న పిల్లకు యింకా పెండ్లి కాలేదు.

ఇది వారిని గురించిన పరిచయం. ఇక వారి రూప లావణ్యములనుగూర్చి చెప్పవలసియున్నది. ఆ విషయాన్ని గురించి చెప్పడానికి నేనసమర్థుడను. అవును, లలన నిత్యమూ గంగానదిలో స్నానం చేస్తుంది. ఈ విషయం నాకు బాగా తెలుసు. రేవులో స్నానంచేయడానికి పిన్నలూ, పెద్దలూ అందరూ వెడతారు. వారంతా లలనను చూచి "భగవంతుని లీలలు విచిత్రములు. పాడు భగవంతుడింత చిన్నతనంలోనే దీనినొసట వైధవ్యాన్ని రాసిపెట్టాలా? వైధవ్యాన్ని రాసిపెట్టేవాడు ఇంత చక్కదనా న్నెందుకివ్వాలి?" అంటూ గుసగుసలుపోయేవారు. లలన ఇవేమీ వినిపించుకోకుండా గంగలో స్నానంచేసి యింటికి తిరిగి వచ్చేది. నవయువతు లామెను చూచి ఏమనుకుంటారో తెలియదుగాని, వారు ముక్కువిరుపులూ, మూతివిరుపులూ చూస్తే వారు లలనను ప్రశంసించడం లేదనిమాత్రం తోస్తుంది. లలనయవ్వనంమీద వారికి దురభిప్రాయమున్నది, లలన ఇతరులతో యెక్కువగా మాట్లాడదు. ఆమె ఇతరులవ్యవహారాలలో జోక్యం కలిగించుకోదు. ఆమెను పలకరిస్తే

పలుకుతుంది. ఆమె గంగలో స్నానంచేసి బిందెతో నీరు తీసుకొని తన దారిని తాను యింటికి తిరిగివస్తుంది. కాని ఛలన స్వభావం దీనికి పూర్తిగా విరుద్ధం. ఆమె వసబోసినట్లు యెప్పుడూ వాగుతూనేవుంటుంది. ఇరుపుర మాట్లాడుకొంటుంటే మెల్లగా అక్కడకు చేరుతుంది. ఆమె యింటినుండి ఎనిమిది గంటలకు స్నానానికి బయలుదేరితే పదకొండు గంటల తరువాతగాని యింటికి చేరుకోదు. నగలూ, నాణాలూ లేవని ముక్కూ మూతీ ముడుచుకొంటుంది. ఆమెకు ముదుగుబియ్యపన్నం దిగదు. ముదుగుబియ్యపు అన్నం చూడగానే పోట్లాటపెట్టుకొంటుంది. ఒక్కొక్క రోజున పళ్ళెంగూడా పగలగొడుతుంది. ఆమెకు రోజూ పోట్లాట వుండితీరాలి. లేకుంటే తోచదు.

ఛలనగూడా లలనవంటి సౌందర్యవతే. వారి రూప లావణ్యాలను చూస్తే "భగవంతుడు తీరిక సమయాల్లో వీరిని తీర్చిదిద్దాడా?" అని పిస్తుంది వారి శరీరకాంతి గులాబిచాయను మరిపిస్తుంది. ధనస్సులా వంగిన కనుబొమలు, పలుచనైన పెదవులు. తమలపాకులు వేసుకొంటే ఎఱ్ఱగా వాటి అందం ద్విగుణీకృతమౌతుంది. బాగా యవ్వనం వస్తే ఇంద్రధనస్సుకంటే అందంగా వుంటాననుకొనేది మనస్సులో.

ఛలన తన యౌవ్వనాన్నిగూర్చి మధుర స్వప్నాలు కంటున్నది. "ప్రతి అవయవానికి యిన్నిన్ని నగలు ధరిస్తాను. ఇక్కడ గొలుసు, ఇక్కడ మురుగులు, ఇక్కడ కడియాలు, ఇక్కడ బాజీబందులు, ఇక్కడ కంటె, అబ్బా! యింకేమేమి పెట్టుకుంటానో తెలియదు" ఇలా మధుర స్వప్నాలలో తేలియాడుతూ లలనవద్దకు వచ్చింది. లలన ఆమెని చూచి "ఛలనా! ఏమిటీ హడావుడి." అన్నది.

"ఏమక్కా! నా శరీరం నల్లబడిందా?"

"నల్లబడటమా? ఎందుకు నల్లబడుతుంది?"

"పడలేదూ? ఈ ఊరిలో యెవరైనా జ్యోతిష్కుడున్నాడా?"

"ఎందుకు?"

"చేయి చూపించుకోవాలనుకుంటున్నాను."

'ఎందుకు?'

'నాకు నగలు వస్తవా? రావా? అని.'

లలనకన్నులలో నీరుతిరిగింది. 'తప్పకుండా వస్తవి. చాలా నగలు పెట్టుకుంటావు. నీవు రాణివి అవుతావు.' అన్నది.

లలన మాట విని ఛలన సిగ్గుతో బయటకు పరుగెత్తి 'ఇదేమిటి, నగల మాటడిగితే రాణి వౌతావంటుంది. రాణి మాట యీమె నెవరడిగారు?' అని మనసులో అనుకొన్నది.

ఆమె ఎప్పుడూ అక్కను యిలానే ప్రశ్నిస్తుంది 'అక్కా! మన వద్ద ఏమీ వుండవేమే?'

'మనం పేదవాళ్ళం'

'మనం పేదవాండ్ల మెందు కైనా మక్కా! గ్రామంలోవాళ్ళంతా సుఖంగా వుంటున్నారు. అందరి ఇండ్లలోను వెలుగు కనిపిస్తున్నది. మన యింట్లోనే యీ అంధకార మెందుకున్న దక్కాయ్.'

'భగవంతుని కరుణాదృష్టి యెవరిపైన ప్రసరిస్తే వారు సుఖంగా వుంటారమ్మా.'

'భగవంతుని కీ భేదభావ మెందుకు అక్కా!'

'పూర్వజన్మకర్మానుసారంగా యీ జన్మలో సుఖదుఃఖాలు కలుగుతవి. మనం పూర్వజన్మలో పాపం చేసుకొన్నాం.'

'మన మేం పాపం చేశా మక్కా?'

'చూడమ్మా! పాపాలు అనేక విధాలు. తల్లిదండ్రులకు సేవజేయక పోవటంగూడా వొక పాపమే. అకారణంగా యితరులను నిందించడం గూడా ఘోర పాపమే. ఇదేవిధంగా ఇతర పాపకర్మలుగూడా వుంటవి.'

లలన మాటలు వినగానే ఛలనముఖంలో దీనత్వం గోచరించింది. 'అయితే మన కెప్పుడూ అంధకారమేనా? మన గృహంలో సౌఖ్యమనే వసంత లక్ష్మి అడుగుపెట్టదా?'

'చెల్లీ, యెందు కలా నిరాశపడతావ్; కవి కుమారు దేమన్నాడో తెలుసా; అరటిగెల కొట్టిన తరువాతే పండుతుం దన్నాడు. కనుక మనకూ వెలుగు వస్తుంది. నిరాశపడకు. ఏదీ నీ చేయి యిలా చూపించు. నీ వెంత సౌఖ్యంగా ఉంటావో, ఏయే సొమ్ములు పెట్టుకుంటావో చెపుతాను.'

'అక్కా, నీవో?'

లలనకు వైధవ్యం ప్రాప్తించిందని ఛలనకు తెలుసు. కాని సహజ చపలత్వంవలన యీ మాట అడిగింది. ఛలన మౌనంగా తల వంచు కొన్నది.

లలన చిరునవ్వు నవ్వి 'చెల్లీ! నేనుకూడా సుఖంగానే వుంటాను. అదిగో చూడు. అమ్మ నన్ను పిలుస్తున్నది. వెడతా.'

లలన తల్లివద్దకు వచ్చి 'ఏమిటమ్మా! ఎందుకు పిలిచావ్?' అన్నది.

'మీ నాన్నగారు వచ్చారు. అదిగో ఆ గదిలో .......'

తల్లిమాట పూర్తికాకపూర్వమే లలన అక్కడినుంచి వెళ్ళి పోయింది.

హారాన్‌బాబు భోజనానికి కూర్చున్నాడు. రాసమణి 'మూడు రోజులనుండి యింటికి రాకుండా ఎక్కడికి వెళ్ళావ్?' అని ప్రశ్నించింది.

రాసమణి వేసిన యీ ప్రశ్న వినేసరికి హారాన్‌బాబుముఖం గంభీరాకృతి దాల్చింది. 'అది వొక పెద్ద కథ'.. అన్నాడు.

'పెద్ద కథేమిటి?' అని రాసమణి తిరిగి ప్రశ్నించింది.

'తలమీద పెద్ద తుపానొచ్చి పడింది.'

ఈ మాట వినగానే రాసమణి కాశ్చర్యమేసింది. 'ఏమి జరిగిందో సరిగా చెప్పరా?' అన్నది.

హారాన్‌బాబు తెచ్చి పెట్టుకున్న చిరునవ్వుతో 'ఇక ఇంట్లోకూర్చుని చేతులు పిసుక్కోవలసిందే. నందిబాబు నా మీద కోర్టులో కేసు పెట్టాడు. నే నాతని సొమ్మపహరించానట '

'కేసు పెట్టాడా?'

'పెట్టాడు. కాని రుజావుచేయలేకపోయాడు, అందుచేత విడుదల చేశారు. నేను విజయగర్వంతో ఇంటికి తిరిగి వచ్చాను.'

సుభద పైటచెంగుతో కన్ను లొత్తుకున్నది. రాసమణి హారాన్‌బాబు నాశీర్వదించింది. 'అయితే తిరిగి నందిబాబు నిన్ను నౌకరీలో పెట్టుకొంటాడా?' అన్నది రాసమణి.

ఈ మాట వినగానే హారాన్‌బాబుకు కోపం వచ్చింది. 'ఆ వెధవ వద్ద నే నింకా నౌకరీ చేస్తానా! వాడికి నా ముఖంకూడా చూపించను.

అతని ముఖం చూస్తేకూడా పాపం చుట్టుకొంటుంది. భగవంతుడు తి
చూస్తే అతని సంగతేమిటో అంతు తేల్చుకుంటాను. దీనికి ప్రతి
చేయందే నేను నిద్దురపోను.'

రాసమణి కొద్ది నిమిషాల వరకూ ఆశ్చర్యంగా తమ్ముని ము
లోకి చూస్తూ 'అయితే యిల్లు గడవడ మెలాగురా?' అన్నది.

'మీరేమీ విచారపడకండి. నేను పురుషుణ్ణి. నరులకు ని
ఎప్పుడూ పనికిరాదు. ఇంకెక్కడైనా ఉద్యోగం చూచుకొంటాను. ఉద
గాల క్షేమి తక్కువ.'

హారాన్‌బాబుమాటలమీద రాసమణికి విశ్వాసం లేదు. కాని యే
చేస్తుంది పాపం! విధిలేక నమ్మి ధైర్యవహించవలసివచ్చింది. ఎప్పుడై
మానవుడు నిరాశ అనే మైదానంలో విహరించి విసుగుచెందుతాడ
అప్పుడు ఆశ అనే మృగతృష్ణలవెంట పరుగెత్తుతాడు. రాసమ
యిప్పుడు సరిగా యిదేస్థితిలో వుంది. ఆమెలో ఆశాంకురం మొలకెత్తింది
'హారాన్‌లో పరివర్తన రాకూడదా? అతనే అర్జనపరుడు కాకూడదా?' అను
కాని కొంచెం సేపు మౌనంవహించి మరల యిలా అన్నది. 'నీ కెలా
నచ్చితే అలా చెయ్యి. కాని యిదిమాత్రంజ్ఞాపకముంచుకో—ఏదో ఒకపని
చేయకపోతే యిల్లు గడవదని గుర్తుంచుకో.'

హారాన్ చంద్ర భోజనంచేసి బయటకువచ్చి మాధవుని వద్దకు
వెళ్లాడు. తండ్రిని చూచి మాధవుడు మంచంమీద లేచి కూర్చున్నాడు.
హారాన్‌బాబు అతని వీపు నిమురుతూ 'ఎలా వున్నది. నాన్నా!' అన్నాడు.

'ఇవాళ కొద్దిగా నయమే! కానీ, నాన్నా నీ వెక్కడి కెళ్ళావ్?'

'దీని కేమి జవాబు చెప్పాలా' అని హారాన్ తడుముకొంటున్నాడు,
ఇంతలో మాధవుడు 'నాన్నా నీవు నాకు మందు తేవడానికి వెళ్ళావటగా,
తెచ్చావా మందు?'

'ఆఁ'

'మంచి మందేనా? త్రాగగానే నయమవుతుందా?'

'ఎందుకు నయంకాదు. త్రాగగానే లేచి గంతులువేయాలి.'

మాధవుని ఆనందానికి మేరలేదు. అతడు చేయిచాచి 'ఏదీ మందు'
అన్నాడు,

హారాన్‌బాబు గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్లైనది. ఎలాగో

ంయించుకొని 'ఇప్పుడు కాదు. రాత్రికి తాగాలి.' అన్నాడు.

ఈ జవాబుకు కూడా మాధవుడు సంతోషించాడు. 'మంచిది. త్రికే త్రాగుతాను.' అంటూ కొద్ది క్షణాలు తండ్రివంక చూడసాగాడు. ువాత 'నాన్నా! నా కొక్క దానిమ్మకాయ తెచ్చిపెడతావా?' అన్నాడు.

'ఎందుకు తీసుకురానూ? తప్పక తెస్తానయ్యా!'

ఇంతలో సుభధ అక్కడకు వచ్చింది. సుభదవంకచూచి 'ఒక దవుంటే ఇవ్వు.' అని అడిగాడు.

'ఎందుకు?'

'అవసర మున్నది. ఒకనికి బాకీ వున్నాను. తీర్చాలి.'

సుభద ట్రంకుపెట్టె తెరచింది. ట్రంకు తెరవగానే హారాన్‌బాబు దృష్టి దానిపై పడింది. ట్రంకులో డబ్బుండటం చూశాడు. బేడ తీసు కున్న తరువాత 'ఇంకొక పావలా యివ్వు. మాధవుడికి దానిమ్మకాయ కావాలట.

సుభద భయంగా భర్తవంక చూచింది. అతనిచేతికి డబ్బివ్వడ మామెకు యిష్టంలేదు. విధిలేక అత నడిగిన పావలాకూడా యిచ్చింది.

'రేపు తప్పకుండా యీ డబ్బు తిరిగి ఇచ్చేస్తాను.'

సుభదకు హారాన్‌బాబు చెప్పేది టాలాటోలీ మాటలని బాగా తెలుసు. 'ఇప్పు డెక్కడకూ వెళ్ళకండి. విశ్రాంతి తీసుకోండి' అన్నది.

'విశ్రాంతి యెలా తీసుకొంటాను. బాధ్యతంతా నా నెత్తిమీద వున్నది. విశ్రాంతితీసుకుంటే పనికాదు.'

'మంచిది. సరే వెళ్ళండి.'

హారాన్‌బాబు వెళ్ళిపోయాడు. తరువాత సుభద మరల ట్రంకుపెట్టె తెరచింది. బిందు యిచ్చిన డబ్బు లెక్క పెడితే యింకా ఒక్క రూపాయ మిగిలింది. ఆ వొక్కరూపాయే ఈ పరివారానికి జీవనాధారం. సుభద ఆ రూపాయను భద్రంగా దాచి మాధవుని గదిలోకి వెళ్ళింది.

'అమ్మా! నాన్న దానిమ్మకాయ తెస్తానన్నాడు. ఎప్పుడు తెస్తాడే?' అని అడిగాడు మాధవుడు.

'సాయంత్రం.'

సాయంత్రమైంది. చాలా ప్రొద్దుపోయింది. కాని హారాన్‌బాబు పత్తా యెక్కడా లేదు. మాధవుడు 'నాన్న యెప్పుడు వస్తా'డని తల్లిని అడిగాడు. అతను ఏడుపు లంకించుకొన్నాడు.

సుభద లలన లిరువురూ అతనిని ఊరడింపజేయడానికి విశ్వ ప్రయత్నాలు చేశారు. కాని అతను ఏడుపు మానలేదు. చీదేయడం మాన లేదు. ఏడ్చి ఏడ్చి నిదురపోయాడు. తెల్లవారబోయేటప్పుడు లేచి దానిమ్మ కాయకోసం యేడ్వసాగాడు.

"దానిమ్మకాయ తినడం మంచిదికాదు నాన్నా!"

"ఏం?"

"జబ్బుపడినవాళ్లు దానిమ్మకాయ తినకూడదు."

మాధవుడు మరల కన్ను మూశాడు. మరునాటి సాయంకాలం హారాన్‌బాబు యింటికివచ్చాడు. క్రిందటిరోజునుండి రాసమణి అత నంటే మండిపడుతున్నది. పూజా గీజా మానేసింది. లలనే అతను కాళ్ళు కడుక్కోవడానికి నీళ్ళిచ్చి హుక్కాగొట్టం దగ్గర పెట్టింది. భోజనాలైనతరువాత సుభద "దానిమ్మకాయ తెచ్చారా?" అని అడిగింది.

"ఏం తెచ్చేది? జేబు చిరిగిపోయింది. పొరపాటున ఆ జేబులోనే వేసుకొన్నాను. ఎక్కడ జారిపోయినవో తెలియదు. ఉంటే ఇంకొక పావలా యివ్వు. సాయంత్రం తిరిగి ఇచ్చేస్తాను."

సుభద దుఃఖిస్తూ "నావద్ద లేవు" అన్నది.

హారాన్‌బాబు చిరునవ్వు నవ్వి "నీవద్ద డబ్బులు లేవంటే నేను నమ్మను. మీ ఆడవాళ్ళ ఖజానాపెట్టె ఎప్పుడూ రిత్తపోదు."

"నిజంగా ఇప్పుడు డబ్బు లేదు."

"నిన్న నీ పెట్టెలో రూపాయ చూశానే"

సుభద మాట్లాడదు,

"ఛీ! పావలా డబ్బులకు నన్ను నమ్మలేకపోయావ్! డబ్బు మొహం చూశావేగాని మనిషిమొహం చూడలేదు."

సుభద పెట్టెతీసి అతను కోరిన పావలా తెచ్చి యిచ్చింది.

# 5

ఇప్పుడా డబ్బు ఎలా సదుపయోగపడ్డవో చూద్దాం. హారాన్ బాబు హాలుడ్‌పూర్‌నుండి బ్రాహ్మణపాడ్ చేరుకొన్నాడు. ఒక గల్లీలోకి పోయి ఒక ఇంటిలో జొరబడ్డాడు. అది పూరిల్లు. చుట్టూ తాటి ఆకులదడి. అక్కడ చాలామంది ఒకమూల కూర్చునివున్నారు. హారాన్ బాబునుచూడగానే వారిసంతోషానికి మేరలేకపోయింది. చాలసేపు సంపడి చేశారు. ఒకరొకరే హారాన్‌ని ఆలింగనంచేసుకొన్నారు. ఒకరు మామా అనీ, ఒకరు దాదాయ్ అనీ, ఒకరు అన్నయ్యా అనీ, ఒకరు బాబూ అనీ హారాన్‌ని సంబోధించసాగారు. అందరూ తమ తమ చుట్టరికాల నతనితో కలుపుకొన్నారు. హారాన్‌బాబు ఆనందాతిరేకంతో అందరిమధ్యా కూర్చు న్నాడు. అంతా కోతలు తెగకోస్తున్నారు. ఈ యింట్లో యెంతోమంది నవాబుల, రాజుల, మంత్రుల దీపాలారాయి. లక్షల కాసులు దోచుకో బడ్డాయి.

వీరి సంతోషానికి ఆధారభూతమైన ఆ స్థలం నల్లమందు, గంజాయి అమ్మే దుకాణంతప్ప మరొకటి కాదు. ఈ ప్రపంచంలో రెండేరెండు స్థలాలున్నవి. ఒకటి స్మశానము. రెండవది నల్లమందు దుకాణం. స్మశానంలో రాజు బిచ్చగాడవుతాడు. అంటే యిరుపురకు భేదం పాటింప బడదన్నమాట. ఇక నల్లమందుకొట్లో బిచ్చగాడు రాజవుతాడు, నల్ల మందుమత్తు యెక్కేసరికి శౌర్యము, ధైర్యము, మహత్తు, పాండిత్యము క్రమంగా వికాసంచెందుతాయి. చూస్తూ చూస్తుండగానే దానకర్ణులై పోతారు. రాజ్యం, రత్నాలు, వజ్రవైఢూర్యాలు, భోగభాగ్యాలు, ఆరోగ్యం, అన్నీ నల్లమందు మాత్రమెంట పయినించి మాయమౌతాయి. చుట్టూ తాటియాకులదడి, పైన నాలుగు వెదురువాసాలతో నున్న ఆ కొంపలో మనుష్యులను సర్వనాశనంచేసేవస్తువులన్నీ వున్నాయి. నేలకు దిగివచ్చిన ఆ ఇంద్రసభను వర్ణించడానికి నా శక్తి చాలదు.

సూర్యాస్తమయమైనది. ఢిల్లీపాదుషాలు, కాశీరాజులు, నవాబులు, సురాజుద్దౌలాలు, తాన్‌సేనులు క్రమంగా వొక్కరొక్కరే తలుపుతీసు కొని బయటకు రాసాగారు. ఈ ప్రపంచములోనున్న మానవులతో పీడ

మూట్లాడరు. వారివంక కన్నెత్తిగూడా చూడరు. అందుచేత రోడ్డు ప్రక్క ప్రక్కలపడి వారివారి రాజప్రాసాదాలకు వెళ్ళారు.

హారాన్‌బాబు హఠా భూమికిదిగివచ్చిన ఆ ఇంద్రసభనుండి బయలు దేరారు. ఇంద్రసభనుండి బయటకురాగానే అతనికి మాధవునిమాట గుర్తికి వచ్చింది. దానిమ్మకాయ తీసుకొనిపోవడానికై వచ్చానన్న విషయం యీ జ్ఞాపకాన్ని బలపరచింది. అందరితోపాటు ఏదో అనిర్వచనీయా నందంతో బయటికైతే వచ్చాడుగాని, మాధవుడు గుర్తికిరావడంతో అతని నిషాకాస్తా దిగిపోయింది. ఈ ఢిల్లీ పాదుషాగారి జేబులో చిల్లికానీ లేదు. ఈ చక్రవర్తిగారిజేబులో గంజాయిచిలుము ఒక అణాడబ్బులుతప్ప యింకేమీలేవు. ఒక్కనిట్టూర్పువిడిచి అతను సమీపంలోనున్న గంజాయి కొట్లోకెళ్ళి మృదుమధురస్వరంతో "బాబాయ్! ఒక అణా గంజాయి యివ్వు" అన్నాడు.

దుకాణదారుడు వెంటనే పొట్లం చేతికిచ్చాడు.

హారాన్‌బాబుమనస్సు విశృంఖలంగా విహరించసాగింది. ఒక చెట్టు క్రింద కూర్చుండి గంజాయిదమ్ము లాగాడు. దమ్ము లాగగానే మనో విశృంఖలత్వం చప్పబడింది. చాల ప్రొద్దుపోయింది. ప్రొద్దు పోయిన కారణంగా అతనా చెట్టుక్రిందనుండి మెల్లిగా లేచి ముందుకు సాగాడు. పోతూ పోతూ అత నొక యింటిముందాగి "కాత్యాయినీ, కాత్యాయినీ" అంటూ తలుపు కొట్టసాగాడు.

ఎవరూ పలకలేదు.

"ఓ కాత్యాయినీ, కాత్యాయినీ" అంటూ బిగ్గరగా కేకలుపెట్టాడు.

ఈమారుగూడా యెవరూ జవాబివ్వలేదు.

హారాన్‌బాబుకి కోపంవచ్చింది. "ఎక్కడ చచ్చావ్? పిలుస్తుంటే వినిపించటంలా? బయట నిలబడి యెంతసేపని కేకలుపెట్టేది?" అన్నాడు.

"ఎవరు?" అన్న మందస్వరం వినిపించింది.

"నేనే; నేను. నామాట గుర్తుపట్టలా?"

"నే నస్వస్థగావున్నాను. లేవలేను."

"ముందు తలుపు తెరువ్; నన్ను బాధించకు."

ఒక యువతి దగ్గుతూ వచ్చి తలుపు తెరచింది. ఆమెవయస్సు పాతిక సంవత్సరా లుంటుంది. స్థూల శరీరం. నల్లగా వుంటుంది. ఆమె వొడలంతా పచ్చలు పొడిపించుకొన్నది. హారాన్‌బాబుని చూడగానే ఆమె దగ్గుతూ "నీ కేం పోయేకాలం వచ్చిందీ. కడుపునొప్పితో నేను తన్నుకొంటూంటే అట్లా గావుకేకలేస్తా వెందుకు?" అన్నది

"కేకలువెయ్యాలని నాకేం సరదాలేదు.నీవు ముందు తలుపు తెరిస్తే నేను కేకలువెయ్యవలసిన అవసరమేమిటి?"

ఆమెముఖం కోపంతో యెఱ్ఱవారింది. "ఇది నేను సహించను. నీవు కావలిస్తే వేళకురా. ఇలా వేళకానివేళప్పుడు వచ్చి నన్ను వేధించడం బాగుండదు. నా విశ్రాంతికి భంగం కలిగించావ్. ఇది నేను సహించను. ఇలాంటి వేషాలు నా దగ్గర సాగవు."

హారాన్‌బాబు లోపలకు రాగానే తలుపు ఘడియవేశాడు. కాత్యాయినివంక తిరిగి "కడుపులో నొప్పిగా వున్నదా? ఈసంగతి నాకు తెలియదే?" అన్నాడు.

"నీ కెలా తెలుస్తుంది? ఈ పేటవాళ్ళందరకూ తెలుసు. నిన్నటి నుండి పచ్చిగంగ ముట్టుకోలేదు. సరేగాని యీ అర్ధరాత్రప్పుడు యెందు కొచ్చావ్?"

"ఒక పనికోసం."

"ఏం పని?"

"చెపుతాను. ముందొక పొగాకుతుంపు పట్టుకురా."

ఇలా ఆజ్ఞాపించేసరికి కాత్యాయినికి మండుతున్న క్రోధాగ్నిమీద ఆజ్యంపోసినట్లయింది. "అదుగో పొగాకుపట్టా అక్కడ వున్నది. చుట్ట కాల్చుబుద్ధిపుడితే మెదలకుండా ఆ మూల కూర్చుని కాల్చుకో. నా యెముకలు కొరక్కు. నేను పడుకోవాలి." అన్నది.

హారాన్ సంకుచితభావంతో "క్షమించు. నేను నిన్ను పొరపాటున పుగాకుపట్టా తెమ్మని చెప్పాను. నీవు వెళ్ళి పడుకో, నేనే తెచ్చుకుంటా" నన్నాడు.

కాత్యాయిని వెళ్ళి పడుకొన్నది. హారాన్ హుంకా గుడగుడా పీలుస్తూ ఆమెవద్దకు పోయి కూర్చున్నాడు. హుంకా పీకి పీకి మెల్లగా "కాత్యాయినీ! నా కిప్పుడు రెండు రూపాయలు అవసరం. నీవు యివ్వక తప్పదు." అన్నాడు.

కాత్యాయిని మాట్లాడ లేదు.

"కన్నంటిందా, నేను చెప్పింది వినిపించిందా? నాకు రెండు రూపాయ లవసరంగా కావాలి, నీ వెక్కడయినాసరే నాకు తెచ్చివ్వాలి?"

కాత్యాయిని ఇటునుండి అటు దొర్లింది. ఆమెమౌనం యథాతథం గానే ఉన్నది.

హారాన్‌బాబు వుండబట్టలేక ఆమెమంచంమీద కూర్చుని ఆమెపై చేయివేసి "ఏం ఇస్తావా?" అన్నాడు.

కాత్యాయిని కోపంగా "ఇక్కడేమైనా రూపాయలచెట్లు కాస్తున్న వనుకున్నావా? నా వద్ద లేవు" అన్నది.

"నీవద్ద రూపాయలు నిజంగా లేవా?"

"లేవు."

"అవసరం. దయవుంచి రెండు రూపాయ లివ్వు."

"వుంటే అలాగే యిచ్చేదాన్ని...."

"నీ దగ్గర డబ్బు లేదంటే నే నెప్పుడూ నమ్మను డబ్బులేక మా యింట్లోవారంతా పస్తులుంటున్నారు. మలేరియాతో తీసుకొంటున్న మాధవుని నోటికాడికూడుగూడా నేనే కాజేశాను. సిగ్గుచే నా హృదయం బ్రద్దలైపోతున్నది. ఇవాళ నా పరువు కాపాడు కాత్యాయినీ!"

"నీవు చెప్పేది యథార్థమే కావచ్చు. నా వద్ద చిల్లిగవ్వ లేదు. ఇంక నే నెక్కడ చచ్చేది."

ఈ మాట వినగానే హారాన్‌బాబుకి కోపంవచ్చింది. "నీ దగ్గర డబ్బు లేదంటే యెవరు నమ్ముతారు? నేను నీ వడిగినప్పుడల్లా డబ్బిచ్చాను. నీ మాట నెన్నడూ త్రోసివేయలేదు. కాని నే నిప్పుడు మానాభిమానాలమధ్య నలిగిపోతున్న సమయంలో రెండు రూపాయలిమ్మని చేయి చాచి అడిగితే లేదంటున్నావ్. నిజంగా నీవద్ద రెండురూపాయలే లేవా?

ట్రంకుపెట్టె తాళా లిలా యివ్వు. నేను చూచుకొంటాను. నీ మాటల్లోని నిజ మిప్పుడే బయట పడుతుంది.

ఈ మాట కాత్యాయనికి మెడమీద గ్రుద్దినట్లయినది. ఆమె నోటి నుండి అశ్లీలాలు బయలుదేరినవి. కోపంతో ఆమె కన్ను లెర్రబారినవి. "తాళాలడగడానికి నీ కే మధికారమున్నదోయ్. నీచజాతిలో పుట్టినవాడికి మంచిబుద్ధి లెలా పట్టుబడతాయ్. మంచిచెడ్డ లేం తెలుస్తాయి. నీవు ఎప్పుడో యేమిటో వెంగబెట్టానంటున్నావ్! ఆ డబ్బడగడానికి నీ కిప్పు డధికారం లేదు. ఆ డబ్బేమైనా కష్టకాలంలో అక్కరకువస్తుందని నా వద్ద దాచిపెట్టావా?"

కాత్యాయని నిష్ఠురవాక్యాలు వినగానే హారాన్‌బాబుముఖం పాలి పోయింది. కాత్యాయనికి మరి ముఖం చూపించలేకపోయాడు. అటు తిరిగి మెల్లగా యిలా అన్నాడు "కాత్యాయనీ! మన యిరువురకూ యెప్పటినుండో ప్రేమ వున్నది. ఆ ప్రేమను పురస్కరించుకొనైనా ఈ కష్టకాలంలో న న్నాదుకోవూ?"

"అబ్బ! ఏం ప్రగాఢప్రేమ! మూడు మాసాలనుండి నాకు చిల్లి గవ్వ అయినా యిచ్చావా చెప్పు? ప్రేమట ప్రేమ వొలకబోస్తున్నాడు."

"ఇలాంటి మాటలు నీ నోటివెంట రానీయకు కాత్యాయనీ! మన ప్రేమకు విలువలేదా? మనది యింత చవకబారు ప్రేమా?"

"చేతిలో చిల్లిగవ్వ లేనివానితో ప్రేమేమిటయ్యా! మా జాతి ఎవరు డబ్బిస్తే వారినే ప్రేమించేది. డబ్బివ్వడం బందవగానే ప్రేమ వ్యాపారంకూడా బందవుతుంది. ఇలా చేయమని మీ సమాజమే నేర్పు తున్నది. మేము మీ భార్యల్లాంటివారం కాము, మీరు చెప్పినట్లు విని, పెట్టింది తిని చచ్చినట్లు పడివుండడానికి. పాపం మీ ఆడవాళ్లు మీ రెన్ని తన్నినా కుక్కినపేనుల్లా పడివుంటారు. మా ప్రేమను బజారులోపెట్టి అమ్ముతాం. డబ్బుగలవాళ్ళు డబ్బిచ్చి మా ప్రేమను కొనుక్కొంటారు. డబ్బిచ్చేవారినే మేము గౌరవిస్తాం. మాట్లాడకుండా యింటికి పో. ఇక్కడ అల్లరిచేస్తే బాగుండదు."

"నీ వింత నిష్ఠురంగా మాట్లాడుతావనుకోలేదు కాత్యాయినీ! మన ప్రేమదర్వాజా మూసివేశావా?"

"ఇవ్వాళకాదు చాలారోజులక్రితమే మూశాను. కాని నీతో చెప్పడానికి సంకోచించాను. ఇవాళ అవసరం కలిగిందికనుక స్పష్టంగా చెపుతున్నాను. నీ చరిత్ర, నీ స్వభావం చాలా నీచంగా వున్నవి. ఇక నీవు పొరపాటునైనా నా వద్దకు రాకు. నీ మీద కేసెందుకుపెట్టారు? నీవు జైలుకు ఎందుకుపోయావ్? నీ ఉద్యోగంకూడా ఊడిపోయింది. నీవు నన్నుగూడా మోసంచేయదలచావా? పొరపాటునగూడా యిక నా యింట్లో అడుగు పెట్టకు."

హారాన్‌బాబు చాలాసేపటివరకు మౌనంగా అక్కడే కూచున్నాడు. అతనినోటికి తాళంవేసినట్లయింది. కొంచెంసేపాగి తెప్పరిల్లి "మంచిది. ఇక నీ యింటికి రావడం మానేస్తాను. కాని నా యీ దుస్థితికి కారణం నీవేనని జ్ఞాపకంఉంచుకో, నీ మూలంగా నేను త్రాగుబోతును, ముండలమితాకోరుని, దొంగని, యింకేమేమో అయినాను. నేను నా భార్యాబిడ్డలను వదిలిపెట్టాను. తుదకు నీవు నన్ను........"

హారాన్‌బాబు ఆఖరువాక్యం అర్ధోక్తిలోనే మునిగిపోయింది. కొంచెంసేపు మౌనంవహించాడు. తరువాత మెల్లగా యిలా అన్నాడు. "నే వింతవరకూ అంధకారంలోపడి కొట్టుకొన్నాను. నీవు నా కన్నులను తెరిపించావ్. నాకు వెలుగు కన్పిస్తున్నది."

"కన్నులకు కప్పినపొరలు తొలగిపోగానే వెలుగు కన్పిస్తుంది. మేము నీచజాతి స్త్రీలమైనా, పురుషులు ముందు తమయిండ్లు చక్కబెట్టుకొని తరువాత పరాయి యిండ్లకు పోవాలనేవిషయం మాకు తెలుసు. ముందు యింట్లో అన్నివస్తువులు వున్నవా లేవా అవి చూచుకొని తరువాత నిషావస్తువులవంక చూడాలి. నేను నీ శత్రువును కాను, నీ నాశనాన్ని కోరడంలేదు. నీ మేలు కోరే నే నీ మాటలు చెపుతున్నాను. నీవు నీ భార్యాబిడ్డలను పోషించుకొంటూ మర్యాదగా జీవించు. నీవు మరణించిన తర్వాత నీ పిల్లల భవిష్యత్తునుగురించి ఆలోచించు. ఎక్కడైనా ఉద్యోగం సంపాదించు. లేకుంటే నీ పిల్లలు నిత్యమూ ఏకాదశే. ఈ

యేర్పాట్లన్నీ చక్కగా చేసిన తరువాత నీవు నా యింటికి వస్తే నిన్ను గౌరవిస్తాను." అంటూ కాత్యాయిని మంచంపైనుండి లేచి పోయి పెట్టె తీసి పదిరూపాయలు తీసుకొచ్చి హారాన్ చేతిలోపెట్టి "ఈ డబ్బు తీసుకొని తిన్నగా యింటికి పో" అన్నది.

హారాన్ తలవంచుకొని "నాకు డబ్బక్కరలేదు" అన్నాడు.

"తీసుకొనివెళ్లు. లేకుంటే ఇంట్లోవారంతా వస్తుండవలసివస్తుంది"

# 6

సదానంద చక్రవర్తిని కొందరు "అరేభాయి!" అని పిలుస్తారు. కొందరు పిచ్చివాడంటారు. అతని నివాసస్థానము హలద్‌పూరే. అతని తండ్రి శుద్ధ సనాతనుడు. ఇంగ్లీషంటే యేవగించుకొంటాడు. అతని మతానుసారం ఇంగ్లీషు మ్లేచ్ఛభాష. దానిని చదివినవాళ్ళంతా కర్మభ్రష్టులు, ధర్మభ్రష్టులు. అందుచే తనకుమారుణ్ణి ఆ భాషకు దూరంగా ఉంచాడు. అతనికి పండ్రెండెకరాల పొలమున్నది. అందుచే తన కుమారుడు యింటింవద్ద నౌకరీచేయవలసిన అవసరంలేదని భావించాడు. కొంతమం దతనిని సంస్కృతభాషాపారంగతుడంటే, కొంతమంది నిరక్షర భట్టాచార్యుడనేవారు. ఏమైనా వీరిలో యే యిద్దరికీ మత్తైక్యం లేదు. కాని సదానందుడు పిచ్చివాడనేమాట అందరూ అంగీకరిస్తారు. అతను శవాలను మోయడానికి పోతాడు. పొలంపని చేస్తాడు. గడపగడపకూ తిరుగుతాడు. లల్లాయిపాటలు పాడుకొంటూ ప్రొద్దుగూకులూ ఊరంతా తిరుగుతాడు. ఇతని కొక మేనత్త వున్నది. ఆమె యితనికి దూరపు బంధువు. అత నందరి యిండ్లకూ వస్తూపోతూ వుంటాడు. అందరితోనూ చుట్టరిక మిట్టే కలుపుకొంటాడు. సదానందునికి వివాహం చిన్నతనంలోనే జరిగింది. పిల్లతండ్రులకు వధుకట్నంకూడా యిచ్చారు. పాపం! పెండ్లయిన మరుసటి సంవత్సరమే పెండ్లికూతు రీలోకాన్ని విడిచిపెట్టింది. గత ఆరు సంవత్సరాలనుండి అతను యేకాకి జీవితాన్ని గడుపుతున్నాడు. అతనికి పునర్వివాహం కాకపోవడానికి కారణం ధనాభావమో, లేక అతనికి యిష్టం లేదో చెప్పలేం. కుల మర్యాదల ననుసరించి యెంతో సొమ్ము ఖర్చుపెడితేగాని అతనికి పునర్వివాహం కాదు.

ఎవరైనా "పెండ్లిచేసుకోరాదా ?" అంటే "పెండ్లిచేసుకోవడానికి కావలసినంత డబ్బు నా వద్ద యెక్కడున్నదయ్యా!" అనేవాడు.

సాయంకాలము. ఆకాశము మేఘావృతమైనది. నలుగడల నిశ్శబ్దత తాండవిస్తున్నది. ప్రకృతిదృశ్యాన్నిబట్టి వర్షించేలా తోస్తున్నది.

"లలనా, లలనా! మంచినీళ్ళు అయిపోయినవమ్మా! ఒకబిందె మంచినీళ్ళు పట్టుకురా!" అంటూ దాసమణి ఆజ్ఞాపించింది.

బిందె తీసుకొని లలన మంచినీళ్ళకై బయలుదేరింది. నీళ్ళు తీసుకొనివస్తుంటే వర్షం జోరైనది. లలన బిందెయెత్తుకొని త్వరత్వరగా నడువసాగింది,

సదానందుని యిల్లు మార్గమధ్యంలోనే వున్నది. వసారాలో కూర్చుని కూనిరాగాలు తీస్తున్నాడు. లలనను చూడగానే ఆలాపన ఆపి "వర్షంలో అలా తడుస్తున్నావేం?" అన్నాడు,

లలన చిరునవ్వు నవ్వి "నీ రాగాలాపన ఆపావేం ?" అన్నది.

సదానందుడుగూడా చిరునవ్వునవ్వాడు. చిరునవ్వు, రాగాలాపన అతని దైనందిన జీవితంలో ఒకభాగమైపోయాయి.

"పాటయిపోయింది." అని రాగయుక్తంగాఅని తరువాత మామూలుగా "వృధాగా అలా బట్టలు తడుపుకొంటావేం? కాసేపు ఆగినతరువాత పోగూడదూ?" అన్నాడు.

లలన బిందెదింపి కొంచెముసేపు వసారాలో నిలబడ్డది.

"ఇక్కడ నిలబడతావేం? లోపలికి పద"

"నీ అభిప్రాయం?"

"నా అభిప్రాయమా? ఇల్లు ఖాళీగావున్నది. అత్తయ్య యెక్కడకో వెళ్ళింది. వర్షమిలాగే కురుస్తుంటే నీవు యింటికి వెళ్ళడం కష్టం.

లలన అతనిమాటలమీద విశ్వాసముంచి రెండడుగులు లోపలకు వేసి మరల వెనుకకువచ్చింది.

"నీవు తిరిగిరావడానికి కారణం"

"రాత్రి నాకు సుస్తీచేసింది. తడిస్తే జ్వరమొస్తుందేమోనని అనుమానంగావున్నది."

"సరే, మంచిది. ఇక్కడేవుండు" అంటూ సదానందుడు మరల పాడసాగాడు. ఆ పాట సారాంశమేమంటే హే! మధురిమా! నేను వ్యర్థంగా నీకొరకై చేతులు చాస్తున్నాను. బహుశ నిన్ను కలుసుకోవడ మిక సంభవం కాదేమో! ఓ పాషాణహృదయమా! నా మనోవేదనను నీవు గ్రహించలేదు. నా జీవితోద్యానవనాన్ని సర్వనాశనం చేశావు...."

లలన తన్మయురాలై పాట వింటున్నది. సదానందుని కంఠస్వర మామె కర్ణపుటాలకు శ్రావ్యంగావున్నది. అతను పాట ఆపినప్పుడల్లా "ఆపావేం? పాడు" అనేది.

"ఇప్పుడుగాదు"

"ఏం?"

"ఇప్పుడు నాకిష్టంలేదు."

లలన చిరునవ్వునవ్వి, "అయితే అసలెందుకు మొదలెట్టావ్?"

"నేను తరుచుగా పాడుకుంటాను" అంటూ ఆకాశంవంక చూచి "మేఘాలలో కమలంవికసించడం నీ వెప్పుడైనా చూశావా?" అన్నాడు.

లలన చిరునవ్వు నవ్వి "లేదు. నీవు చూచావా?" అన్నది.

"నేను చూచాను."

"ఎప్పుడు?"

"ఆకాశము మేఘాచ్ఛాదితమైనప్పుడల్లా నేను చూస్తాను." అన్నాడు ముఖం గంభీరంగా పెట్టి.

"ఇది సంభవమా?"

"సంభవ మెందుకుకాదు. కమలం నీళ్ళలో వికసిస్తుంది. మేఘాలలో నీళ్ళుంటాయి."

"మేఘాలలో మట్టిలేదు. మట్టి లేకుండా కమలం ఎలా వికసించ గలదు?"

సదానందు డామెముఖంలోకి చూస్తూ "నీవు చెప్పింది యదార్థమే కావచ్చు. కాబట్టి అది వాడిపోతుంది." అన్నాడు.

లలన మారు మాట్లాడలేదు, సదానందుడు నిత్యమూ ఇలాంటి వ్యర్థాలాపములుచేస్తాడనే విషయం అందరికి విదితమే.

"చూడు లలనా! శారద యిప్పుడు మీ యింటికి రావటంలేదను కుంటాను."

లలన ముఖ మటు తిప్పుకొన్నది. బహుశా ఆ క్షణంలో అతనికి ముఖం చూపించడం యిష్టంలేకేమో!

"చెప్పవేం? రావడంలేదా?"

"లేదు."

"ఎందుచేత?"

"నాకు తెలియదు."

సదానందుడు మరల రాగాలాపన మొదలెట్టాడు.

అతని రాగాలాపన ఆగిపోయింది. కాని వర్షంమాత్రం మాగలేదు. మేఘాలు గర్జిస్తూనే వున్నవి. లలన బిందె ఎత్తుకొని పోవడాని కుద్యుక్తురాలైనది.

"ఇదేమిటి? ఎక్కడికి వెడతావ్?"

"మా యింటికి."

"ఇలా కుంభవర్షం కురుస్తుంటే యెలా వెడతావ్? తడిస్తే జలుబు చేయదూ?"

"ఏమి చేసేది. వెళ్ళక తప్పదు."

లలన వెళ్ళినతరువాత సదానందుడు మరల రాగాలాపన మొద లెట్టాడు"

# 7

కాత్యాయిని యింటినుంచి హారాన్‌బాబు తిన్నగా తనయింటికి వచ్చాడు. పదిరూపాయలూ తనభార్య సుఖదచేతిలో పెట్టాడు. కాని ఆమె ముఖంలో యేవిధమైన సంతోషమూ ప్రస్ఫుటంకాలేదు. విచారంగా "ఈ రూపాయ లెక్కడివి?" అని ప్రశ్నించింది.

సుఖదచేతిలో యీ రూపాయలు పెడుతున్నప్పుడు హారాన్‌ముఖర్జీ ముఖంగూడా విచారంతో నల్లబడింది. "ఈ రూపాయలుగూడా దొంగ తనంచేసి తెచ్చాననుకొన్నావా?" అన్నాడు నొసుడుగా.

ఈ మాటవినగానే సుభదకు దుఃఖమాగలేదు. ఆమె దుర్బలహృదయంలో యీ ఆశంక పొడమింది. కాని నోటితో పైకి అనలేకపోయింది. భగవంతుని కృపవలన యిది దొంగసొమ్ము కాకుండుగాక. ఒకవేళ దొంగసొమ్మెఅయితే దీనిని నేను గ్రహింపవచ్చునా? దొంగసొమ్ము తీసుకోవడం కంటె పస్తులుండి చావడం మేలు. కాని ఇంట్లోవున్న మిగతావారి సంగతిః నలుగురు పిల్లయీ ఆమెప్రాణాల్లో ప్రాణాలు, కన్నులవెలుగులు. ఇంకా డబ్బునుగురించి తర్జనభర్జనలుచేయడం అంత ఉచితంకాదని భావించి డబ్బు పెట్టెలో పెట్టింది.

ఇప్పుడు రోజులుగడవడం కొద్దిగా మెరుగైంది. హారాన్‌బా బిప్పుడు హాలుద్‌పూరులో అప్పుడప్పుడు మాత్రమే కన్పిస్తున్నాడు. ఇంటికివచ్చినప్పుడు మాత్రం రాసమణి "ఎక్కడికి వెళ్లావురా?" అని ప్రశ్నించేది.

"ఉద్యోగం కోసమని తిరుగుతున్నాను." అని జవాబిచ్చేవాడు.

సుభద హారాన్‌బాబు మాటలు నిజమనే విశ్వసిస్తున్నది. ఎందుచేత నంటే అతను వెనుకటిమాదిరిగా పావలా బేడా అడగడంలేదు గనుక. ఎవరైనా ఆమెను హారాన్‌బాబు బొత్తిగా కన్పించడంలేదు, ఎక్కడుంటు న్నాడేమిటని ప్రశ్నిస్తే "తిండీ తిప్పలులేకుండా ఉద్యోగం కోసమని తిరుగుతున్నారనిజవాబుచెప్పేది. తమదుఃఖగాథను అందరకూ వినిపించేది. పెద్దలు మొదలుకొని పిన్నలవరకు ఉద్యోగంకోసమని అందరికాళ్ళా పట్టుకొంటున్నాడు హారాన్‌బాబు. చిట్టా, ఆవర్జాలు వ్రాసి పెడతానంటు న్నాడు. ఇంకేదైనా లెక్కపనుంటే చేసిపెడతానంటున్నాడు. కాని యెవ్వరూ అతనిని నమ్మి ఉద్యోగ మివ్వడాని కిష్టపడడంలేదు. అతని విషయం లోకమంతా తెలుసు. అతనిమీద యెవరికీ విశ్వాసంలేదు. సాయంకాలానికి కాళ్ళీడ్చుకొంటూ కొంపకుచేరుకొనేవాడు. అతని దుర్దశ చూచి సుభద "ఇవ్వాళ అసలు భోజనంచేశారా?...."అనేది.

హారాన్‌బా బేమీ జవాబు చెప్పలేకపోయేవాడు, మెల్ల మెల్లగా బిందెలో నీరులా, యింట్లోవున్న పదిరూపాయలు సమాప్తంకావచ్చినవి. ఇక ఆ డబ్బుతో రెండుమూడురోజులకన్నా యెక్కువకాలం గడవదు.

కాని యీ విషయం సుభద భర్తతో చెప్పలేదు. ఈవిషయాన్ని బయటకు పొక్కనివ్వగూడదని నిశ్చయించుకున్నది. ఇంటి ఖర్చును గురించిన ఆలోచనలనే పడుగుపేకిల్ని మనసులోనే నేస్తున్నది.

రాత్రిసమయం. మూడురోజుల అనంతరం అలసి సొలసి యింటికి తిరిగివచ్చిన భర్త పాదాలొత్తుచున్నది. పాదాలొత్తుచున్న సమయంలో ఆమె మనస్సులో ఆలోచనాతరంగాలు లేవసాగాయి. ఇంటిఖర్చు విషయమై అతనితో చెప్పాలని లేదు. కాని విధిలేక "డబ్బు అయిపోయింది. ఇంట్లో నూకలుగూడా నిండుకొన్నవి" అన్న దామె మెల్లగా.

హారాన్‌బాబు కండ్లుమూసుకొనే "పదిరూపాయల మూలధనమున్న దిగా?, అన్నాడు.

వాక్యం పూర్తిఅయినతర్వాత కొద్దిసేపు యిరువురూ మౌనంగా వున్నారు. రాత్రిపూట యీ విషయాన్ని గురించి కీచులాడుకోవడం మంచిదికాదని భావించింది సుభద. కాని రేపు ఇల్లుగడవడ మెలాగా అనే విచారం ఆమెను తెల్లవార్లూ బాధిస్తునేవున్నది. రేపటిమాటేమిటని భర్తనుఅడుగలేకపోయిం.ది "పదిరూపాయలు అప్పుడే మ్రింగేశారా?, అని కోపపడతాడేమోనని భావించింది. పదిరూపాయలఖర్చు వివరాలు గురించి చెప్పడాని కామె సిద్ధంగానేవున్నది. కానిఅతనికి కోపం తెప్పించగూడదు. కోపానికిబదులు సానుభూతినిపొందాలి.

తెల్లవారుజామునే హారాన్‌బాబు యింట్లోనుండి బయలుదేరాడు. లలన తన పనిలో నిమగ్నురాలైనది. రాసమణికూడా నియమానుసారం స్నానాదికముల నిర్వర్తించుకొన్నది. సుభదమాత్రం కుంటిదానిలా కూర్చున్నది. ఆమె కూర్చుంటే అలానే కూర్చుంటుంది. నిలబడితే అలానే నిలబడుతుంది.

సుభద కదలక మెదలక కూర్చోవడం లలన చూచింది. ఎనిమిది గంటలు కావచ్చినది. నిత్యకృత్యాలుకూడా తీర్చుకోలేదు.

"అమ్మా యింకా కూర్చున్నావేం? రేవుకు వెళ్ళవూ?"

"వెళ్తానమ్మా"

లలన యింట్లోకిపోయి కొద్దిసేపటికి తిరిగివచ్చి చూస్తే తల్లి యథాప్రకారంగానే కూర్చునివుండడం చూచి ఆశ్చర్యంతో "ఏమిటమ్మా అలా విచారంగావున్నావ్?" అని ప్రశ్నించింది.

"ఏమీలేదమ్మా"

"మరి అలా విచారంగావున్నావేం?"

"ఏంచేయనమ్మా!"

"నిత్యకృత్యాలుతీర్చుకోవా? వంటచేయవా?"

సుభదకన్నులలో నీరు తిరిగింది. "ఇంట్లో పిడికెడు నూకలు లేవు. వంట యెలాచేయమంటావమ్మా?"

ఈమాట వినగానే లలనముఖం కుంచించుకుపోయింది."అయితే పిల్లలు పస్తుండవంసినదేనా ?"

"భగవంతుని దయ యెలావుంటే అలాజరుగుతుంది. చూడమ్మా! ఒక్కమారు మీ బిందత్తయ్యగారింటికి వెళ్ళిరాగలవా?"

"ఎందుకు?"

"బహూశా యేమన్నా సహాయం చేస్తుందేమో!"

లలన వెళ్ళగానే సుభద కన్నులొత్తుకొన్నది. ఇంతకుముందెప్పుడూ సుభద తనపిల్లలను బదులుకోసమని పొరిగిండ్లకు పంపలేదు. ఆమెమనస్సు చాలా ఖేదపడింది. సిగ్గుతోపాటు గర్వపడిందికూడా. గర్వమెందుకంటే, వారిమీద....

సుభద చాలసేపలానే కూర్చున్నది. పదకొండుగంటలైంది. ఇంతలో ఛలనామణి అక్కడకు వచ్చింది. చేతిలో ఒక మట్టిబొమ్మ ఉన్నది. దానికి గుడ్డలు కట్టింది. మెడలో మాలవేసింది. అమ్మవద్దకువచ్చి "అమ్మా! అన్నం పెట్టు" అన్నది.

సుభద నిరుత్తరురాలై ఛలనముఖంలోకి చూడసాగింది.

"ఆకలవుతున్నది. అన్నంపెట్టవే"

సుభద మాట్లాడలేదు,

మట్టిబొమ్మను యీ చంకనుండి ఆ చంకకు మార్చి "అమ్మా! ఇంకా అన్నంఉడకలా?" అన్నది ఛలన.

లేదన్నట్లు తలవూపింది సుభద.

"ఎందుచేత? బహూశా యివ్వాళ నీవు ప్రొద్దెక్కి లేచావను కొంటాను" అంటూ ఆమె వంటయింట్లోకి పోయి పొయ్యి రాజేయక పోవడం చూచి "ఇంకా పొయ్యి రాజేయనేలేదు. వంట యెప్పుడు చేస్తావే?" అన్నది.

"ఇప్పుడే రాజేస్తానమ్మా."

"ఇప్పటిదాకా పొయ్యి ఎందుచేత రాజేయలేదే?"

"ఇప్పుడు రాజేస్తాగా!"

"నీవు విచారంగా వున్నా వెందు కమ్మా?"

సుభద లేచి నిలబడింది.

"నీవు కూర్చో అమ్మా! నేను మాధవన్నయ్యదగ్గరకు పోయి ఆడుకొంటాను."

"మంచిది. అన్నయ్యదగ్గరకు పో."

లలన భవతారణ గంగోపాధ్యాయయింటికి వెళ్ళింది. సందు వాకిలిగుండా యింట్లో ప్రవేశించింది. వింధ్యవాసిని అప్పుడు యింటో లేదు. క్రిందటిరాత్రే ఆమె తనపుట్టింటికి వెళ్ళింది. ఆమె అవసరంగా వెళ్ళవలసివచ్చింది. లేకుంటే పోయేముందు సుభదను కలుసుకొని వెళ్ళేది.

నిరాశతో లలన భవతారణ గంగోపాధ్యాయయింటినుండి తిరిగి వస్తున్నది. ఆమెకు అడుగు ముందుకుపడడంలేదు. గంగోపాధ్యాయ యింటికి వెళ్ళేటప్పుడుగూడా ఆమె సిగ్గుతో తలవంచుకొనే వెళ్ళింది. అడుగు ముందుకు సాగడంలేదు. దారిలో ఒకచోట నిలచి ఆలోచించ సాగింది. తరువాత గంగానదివైపు నడువసాగింది. సమీపంలోనే సదానంద చక్రవర్తి యిల్లున్నది. వెలుపలనున్న గోశాలవద్ద సదానందుడు నిలబడివున్నాడు. అతనొక ఆవుదూడను కౌగలించుకుని తన గాఢాను రాగాన్ని దానిపై కురిపిస్తున్నాడు. లలన అతనికి సమీపంగా పోయి నిల బడింది, సదానందు డామెవంక చూచి 'ఓహో నీవా లలనా!" అన్నాడు.

"అవును నేనే. అత్తయ్య యింటో వున్నదా?"

"లేదు. ఇప్పుడే యెక్కడికో వెళ్ళింది"

లలన వెనుకకు మరలినది. సదానందుడు ఆవుదూడను విడిచి "అత్తయ్యతో పనివున్నదా?" అని ప్రశ్నించాడు.

"అవును."

"ఆమె లేదు. ఆ పనేమిటో నాతో చెప్పగూడదా?"

లలనగూడా చెపుదామనే అనుకొంటున్నది. కాని సిగ్గుతో తల వంచుకొన్నది. ఇంటో వంటపదార్థాలేమీ లేవు అని యెలాచెప్పను. చేసేదేమిటి? నే నొకరోజు తినకపోయినావుండగలను. కాని తతిమ్మావారి మాట?, అని ఆలోచించసాగింది. ఒకనాడు సుఖదగూడా యిలానే అనుకొన్నది. నేడు లలనమనస్సులోకికూడా అదేఆలోచన వచ్చింది. ఆమె వాణి మూగవోయింది. ఈ పరిస్థితులలోనున్న వ్యక్తులకష్టాలుఅనుభవం కావాలేకాని వర్ణింపనలవికాదు. గౌరవనీయుడైన పెద్దమనిషి పరిస్థితులు మారితే యితరులవద్దకు పోయి చేయిచాచడాని కెంతో బాధపడతాడు. అతని మనస్సెంతో బాధపడుతుంది మాటచెప్పడానికి నాలుక ఆడదు. కోరికలు లోలోపలే అణగిపోతవి.

లలన నోరువిప్పి చెప్పడానికి అసమర్థురాలైనది. సదానందు డామె మనోభావాన్ని గ్రహించాడు. ఆమెముఖకవళికలను చదువనారంభించాడు. ఆమె హృదయావేదన గ్రహించుకొన్నాడు. అకారణంగా ఆమెచేయి పట్టుకొన్నాడు. అతను పిచ్చివాళ్ళ ప్రపంచంలో నివసిస్తున్నాడు. సదానందునిబుద్ధి స్థిరంగా వుండదని అందరకూ తెలుసు. ఎవరూ ఊహించని కార్యా లతను చేస్తుంటాడు. ఇతరులు చేయడానికి సంకోచించే పను లతను యిట్టే చేసి వూరుకొంటాడు. అతనిదృష్టి యితరుల దృష్టికంటే భిన్నమైనది. అతనిది నిర్మలమైనమనస్సు. స్వచ్ఛందభావంతోనే అతను లలనచేయి పట్టుకొన్నాడు. చిరునవ్వు నవ్వుతూ "లలనా! నీ సదన్నయ్య దగ్గరకూడా సిగ్గెందుకు? ఎమిటో చెప్పు." అని చేయి విడిచిపెట్టాడు.

సదానందుని కంఠస్వరానికి అతని మాటలలోని భావానికి పూర్తి అన్వయం కుదిరింది. ఎలాంటి మాటలవలన కనులవెంట ఆనందాశ్రువులు రాలుతవో అలాంటిమాటలే చిరునవ్వు వెన్నెల లొలకబోస్తూ

అతని నోటివెంట వెలువడతవి. సదానందుడడిగిన యీ ప్రశ్నకు కూడా లలన నిరుత్తరురాలైనది. 'అసలువిషయ మేమిటో చెప్పమంటే చెప్పవేం? దాస్తావెందుకు?' అన్నాడు గంభీరంగా.

లలన రుద్ధకంఠంతో కన్నుకొత్తుకుంటూ 'నా కొక రూపాయి కావాలి.'

సదానందుడు నవ్వి 'సరే, ఈ మాటకేనా ఇంతసేపు చంపావు. మీ సదన్నయ్యను ఇలా అడగవచ్చునా? సరేకాని, నీకు రూపాయి యెందుకో చెప్పు' అన్నాడు.

ఈ ప్రశ్నకు జవాబుచెప్పడానికికూడా లలన సిగ్గుపడింది. 'నాన్నగారు ఇంట్లోలేరు. అందుచే మిమ్మొక రూపాయ అడుగవలసివచ్చింది.'

సదానందుడు యింట్లోకిపోయి అయిదురూపాయలు తెచ్చి ఆమె చేతిలోపెట్టి 'పిచ్చివాడినిచూచి సిగ్గుపడతావేం? నీ కెప్పుడే అవసరం వచ్చినా యీ పిచ్చివాడితో చెప్పు. ఏం చెపుతావా?' అన్నాడు.

తనచేతిలోనున్న రూపాయలవంక చూచి 'ఇన్నిరూపాయలెందుకు?' అన్నది లలన.

'రూపాయ లెందుకంటావేమిటి? ఉంచు. అవసరానికి అక్కరకు వస్తవి.'

'నా కిన్నిరూపాయ లవసరంలేదు.'

లలన రూపాయలు తిరిగి యివ్వబోయింది. సదానందు డామెచేయి పట్టుకొని 'పిల్లచేష్టలు చేయకు. ఈ రూపాయలు పట్టుకెళ్ళు. అంతగా మిగిలితే అప్పుడే తెచ్చియిద్దువుగాని. ఇది గుర్తుంచుకో. ఎవరైనా అడిగితే మా పిచ్చిఅన్నయ్యదగ్గర అణాకి బదులు రూపాయి తెచ్చానని చెప్పు.'

ఆ రో జలా గడిచిపోయింది. అందరూ భోజనాలుచేశారు. కాని సుభదమాత్రం అన్నం నీరూ ముట్టుకోకుండా వుండిపోయింది. లలన బ్రతిమాలినా, రాసమణి కోపడ్డా ఆమె వినిపించుకోలేదు.

సూర్యభగవాను డస్తాద్రికి చేరుకొన్నాడు. శకుంత సంతానములు తమతమ కులాయములకు చేరుకొంటున్నవి. ఆకాశంలో నక్షత్రాలు మిణుకు మిణుకుమంటూ ప్రకాశిస్తున్నవి. ఈ సమయంలో హారాన్‌బాబు యింటికి వచ్చాడు. అతని మోకాళ్ళవరకు దుమ్ముకొట్టుకుని వున్నది.

నూనెపూయని కారణంగా అతని తలవెంట్రుకలు పీచుపీచుగా రేగివున్నవి. అతను ధోవతికొంగున కొద్దిగా బియ్యం, కొద్దిగా ఉప్పు, బంగాళా దుంపలు ఇంకా యేవేవో మూటగట్టుకొని తెచ్చాడు. హారాన్‌బాబు తెచ్చిన ఆ వస్తువులు చూడగానే సుభద కన్నులలో నీరుతిరిగింది. అందులో అన్నిరకాల బియ్యమూ వున్నవి. భర్త ఇంటింటికి పోయి బిచ్చమెత్తి యీ వస్తువులు తెచ్చివుంటాడని ఆమె అనుమానించింది.

## 8

స్సూర్యాస్తమయానికి పూర్వం మాధవుడు లలనతో యిలా అన్నాడు. 'అక్కా! ఇంక నాకు నయంకాదని అనుమానంగావున్న దక్కా!'

'భయపడకు. నీకు తప్పక నయమౌతుంది. రెండు రోజులలో నీ ఆరోగ్యం కుదుటబడుతుంది.'

'రెండురోజులు, రెండురోజులని చాలాసార్లు చెప్పావు. కాని ఇంత వరకు నాకు నయంకాలేదు.'

'నామాట నమ్ము. నీకు తప్పకుండా నయమౌతుంది.'

'ఒకవేళ నయంకాకపోతే?'

'ఈదఫా అనుమానించడాని కవకాశంలేదు.'

'అయినా ఒకవేళ నయంకాకపోతే?'

లలన మాధవునిచేయి తనచేతిలోకి తీసుకొని 'చూడమ్మా, ఇలాంటి అశుభవాక్యా లనగూడదు.' అన్నది. మాధవుడు మారుపలుకలేదు.

'తినడాని కేమైనా కావాలా?'

'అక్కరలే' దన్నాడు మాధవుడు మెల్లగా.

మందుత్రాగే వేళయింది. లలన మందుగ్లాసు అతని పెదవులకా నించి 'త్రాగు బాబూ!' అన్నది.

త్రాగనన్నట్లు మాధవుడు తలవూపాడు. మందుత్రాగమన్నప్పుడల్లా అతడు సాధారణంగా యిలాగే అంటాడు. చేదుమందు కావడంమూలాన త్రాగనని మొరాయిస్తాడు. కోప్పడితే కండ్లుమూసుకొని త్రాగుతాడు.

లలన కోపంగా 'మందుత్రాగకుంటే యెలా నయమౌతుంది. త్రాగనని మొరాయించడం మంచిదికాదు. మందు త్రాగు' అన్నది.

మాధవుడు మందు పారబోశాడు.

మంచు త్రాగేవిషయంలో మాధవుడు యీప్రకారంగా పొరబోయడం యిదే మొదటిసారి. ఇదిచూచి లలనకు ఆశ్చర్యమేసింది. కోపంకూడా వచ్చింది. ఆమె కండ్లుపెద్దవిచేసి 'ఇదేంపనిరా? ఈపని మంచిదికాదు' అన్నది.

'ఇక నేను మందు త్రాగ నక్కా'

'ఏం?'

'మందుత్రాగినా లాభంలేదు గనుక.'

'లాభంలేదని యెవరు చెప్పారు?'

ఈ ప్రశ్నకు మాధవు డేమీ జవాబు చెప్పలేదు.

లలన అతనిమంచంమీద కూర్చుని అతనిశరీరం చేతితో నిమురుతూ 'బాబూ! నామాట వినవూ?' అని అడిగింది. బ్రతిమాలుతుంటే బిఱ్ఱబిగుసుకోవడం పిల్లల స్వభావం. ఈ జబ్బు మాధవునికికూడా వున్నది. 'నామాట యెవరూ వినడంలేదు. అందుకని నేనూ యెవరిమాటా వినను' అన్నాడు.

'ఎవరు నీమాట వినడంలేదు?'

'ఎవరు వింటున్నారు? అమ్మ మాటిమాటికి కోప్పడుద్ది. నాన్న కూడా అంతే. అత్తయ్య నాతో అసలే మాట్లాడదు. ఇక నీవు తప్పక మాట్లాడుతున్నావ్.' అంటూ మాధవుడు కండ్లనీరు నింపాడు.

లలన పైటచెరగుతో అతని కన్నులొత్తుతూ 'నేను వింటా'నన్నది.

'అయితే నేనిలా మంచంలో పండుకొని మందు త్రాగుచుండ వలసిందేనా? నయం కాదు.'

'నీకు నయంకాదని యెవరు చెప్పారు?'

'ఎప్పుడు నయమవుతుందంటావ్?'

లలన పెదవులు కంపించినవి. ఈ 'ఎప్పుడు నయమవుతుంది' అనే ప్రశ్నకు ఆమె సమాధానం చెప్పలేకపోయింది.

మాధవుడు లలనముఖంవంక చూస్తూ 'అక్కా! నీకు జ్ఞాపకం లేదనుకుంటాను. తమ్ముడు యాదవునికి జబ్బుచేసింది. వానికి నయం కాలేదు. మంచానపడి వాడు ప్రాణాలు వొదిలాడు. అందరూ గొల్లున యేడ్చారు. అమ్మ యిప్పటికిగూడా వాడిని తలచుకొని యేడుస్తుంది. కాని యాదవుడు తిరిగిరాలేదు. ఒకవేళ నాకుగూడా అలాంటిదశే పడితే....?'

లలన తన చేతులతో ముఖాన్ని మూసుకొన్నది. ఇతరసమయాల్లో అయితే ఆమె మాధవుని కోప్పడేది. కాని యిప్పుడేమీ అనలేకపోయింది. మాధవుడుకూడా కొద్దిక్షణా లేమీ మాట్లాడక తరువాత 'మాట్లాడవే మక్కా నా మాటకు జవాబు చెప్పవేం? ఈ ప్రపంచాన్నుండి నేనుకూడా వెళ్ళిపోతే యేమవుతుంది?'

లలన కళ్ళు తుడుచుకొంటూ 'ఏమవుతుంది, అందరూ యేడుస్తారు' అంటూ ఆమె తిరిగి ముఖాన్ని చేతులతో కప్పుకొన్నది.

లలన మనోభావాన్ని మాధవుడు గ్రహించాడో లేదో చెప్పడం కష్టం. అతని హావభావాలనుబట్టి చూస్తే నేడు యెలాగైనా తన అనుమానాన్ని తీర్చుకోవాలన్న పట్టుదలతో వున్నట్లు కన్పిస్తున్నాడు. చాలా రోజులనుండి తన ప్రశ్నలకు సమాధానాలు పొందాలని చూస్తున్నాడు. ఆ కారణంగా 'అక్కా! మనిషి చచ్చిన తరువాత యెక్కడకుపోతాడు....?' అని ప్రశ్నించాడు.

'ఆకాశంలోకి'

లలన చెప్పిన యీ సమాధానాన్ని విని మాధవుడు ఆశ్చర్యపడ్డాడు. 'ఆకాశంలో నే నెవరిదగ్గరుంటాను?'

'నావద్ద'

ఈ సమాధానం వినగానే మాధవుని ఆనందానికి మేరలేకపోయింది. చిరునవ్వు నవ్వి 'అక్కడ యిల్లుంటుందా?' అని ప్రశ్నించాడు.

'ఆ'

'అయితే మన మక్కడ సుఖంగా వుందాం'

'ఎందుకుండకూడదూ?' అంటూ ఆమెమనసులో భగవంతునిగూర్చి యిలా ప్రార్థించింది 'హే భగవాన్! ఒకవేళ మాధవుని తీసుకొని పోదలిస్తే వాడికంటె ముందు నన్ను తీసుకొనిపో.'

మాధవుడు లలనముఖం తనవైపుకు త్రిప్పుకొని 'అక్కా! అక్కడ మనయిష్టం వచ్చినట్లు తినడానికి యేమైనా దొరుకుతవా?'

'ఎందుకు దొరకవు'

'దానిమ్మకాయలు దొరుకుతాయా?'

'ఆ'

మాధవుడు నవ్వుతూ యీ ప్రక్కనుండి ఆ ప్రక్కకు దొర్లాడు. కొంచెం సేపటికి మరల యథాప్రకారంగా దొర్లి 'అక్కా! అయితే మనం ఆకాశంలోకి ఎప్పుడు వెడలాం?'

'మాధవ్!'

'అక్కా'

'అమ్మనువదలిపెట్టి నీ వక్కడకు యెలా వెళతావు?'

'అమ్మకూడా వస్తుంది.'

'ఆమె రాకపోతే?'

'ఆమెనువదలి నేనే వెడతాను'

'అమ్మ కోప్పపడితే?

ఈ మాటలు వినగానే మాధవుడికి విచారమేసింది. 'అయితే అమ్మ యెప్పుడూ యిక్కడే వుంటుందా? అక్కడకు వెళ్ళదా?'

'ఆమె యిప్పుడు వెళ్ళదు. ఎప్పుడో వెడుతుంది.'

'అయితే మనం ముందువెళ్ళి ఆమె వచ్చినదాకా అక్కడుందాం. ఈ విషయం అమ్మనడిగేదా?'

'వద్దు. ఈ విషయం అమ్మకు తెలియనీయకు. అమ్మకు చెపితే అమ్మ నీవెంట నన్నుకూడా రానివ్వదు.'

'మంచిది. అయితే ఆమె కీ విషయం చెప్పనే చెప్పను. నీవు నాకు మందు త్రాగించి, పోయి అన్నంతిను. నేను మందుత్రాగి కాసేపు పడు కొంటాను.'

మాధవుడు మందుత్రాగి పంచదారబిళ్ళ నోట్లో వేసుకొని యిన్ని నీళ్ళుత్రాగి ఆకాశంలోకి వెళ్ళే విషయాన్ని గురించి ఆలోచించసాగాడు. 'చాలా దానిమ్మకాయలు తింటాను. మంచిమంచి ఆటవస్తువులు కొంటాను. ఆడుకొంటాను. రెండు దానిమ్మకాయలు అమ్మకోసమని ఆకాశంలోనుండి క్రిందకు పడవేస్తాను. పండిన కాయలైతే నేను తింటాను. పచ్చివి ఛలన కోసం క్రిందకు పడవేస్తాను. ఛలన అడగ్గా అడగ్గా ఒకటో రెండో కాయలు క్రింద పడవేస్తా' నంటూ కలలు కనసాగాడు.

ఇలా కలలుకని అతను నిద్రాదేవిఒడిలోకి చేరుకొన్నాడు. లలన తన గదినుండి వెలుపలికి రాలేదు. రాసమణి, సుభద, హారాన్‌బాబు, ఛలన

యెంతమంది పిలిచినా ఆమె గది తలుపులు తెరవలేదు. కేకలు పెట్టగా పెట్టగా 'నా వొంట్లో బాగాలేదు. నన్ను విశ్రాంతి తీసుకోనివ్వండి. నేను లేవలేను.' అని సమాధానమిచ్చింది.

మరుసటి రోజునుండి మాధవుని ఆరోగ్యంలో పరివర్తన కన్పించ సాగింది. అతని మనస్సు కొద్దిగా శాంతించింది. అత నిప్పుడు మందు త్రాగనని మొరాయించడం లేదు. కక్కులుగూడా ఆగిపోయినవి. అతని ముఖంలో ప్రసన్నత గోచరిస్తున్నది. అమ్మ 'ఏమైనాకావాలా అని ప్రశ్నిస్తే 'తీసుకురా అమ్మా!' అని జవాబిస్తున్నాడు.

'ఏం తెమ్మంటావ్?'

'ఏదివుంటే అది'

ఇప్పుడు లలన మాధవు లిరువురూ యెంతో ఆప్యాయంగా మాట్లాడుకొంటున్నారు. అనేక విషయాలు చర్చించుకొంటున్నారు. ఎవరి కాళ్ళచప్పుడైనా వినిపిస్తే గప్‌చిప్‌గా వూరుకుంటారు.

గత నాలుగైదురోజులనుండి హారాన్‌బాబు పరివార మంత ఇబ్బంది పడడంలేదు. అవసరంవచ్చినప్పుడల్లా లలన ఒకటో రెండో రూపాయ లిస్తున్నది. లలనవద్దకు యీడబ్బు యెక్కడనుండి వచ్చిందో సుభదకు తెలియదు. రాసమణి హారాన్ సంపాదిస్తున్నా డనుకొంటున్నది. 'ఇందులో తప్పేమున్నది, డబ్బు యెక్కడనుండో వస్తున్నది. నేనుమాత్రం సరిగా తెచ్చానా' అనుకొంటున్నాడు హారాన్‌ముఖర్జీ. కాని అతనికి అప్పుడప్పు డీవిషయం గుర్తికివచ్చి విచారించేవాడు—గంజాయి, నల్లమందు అలవాటు తప్పుతున్నదే అని. కాని యేమిచేస్తాడు. డబ్బులేదు, నల్లమందు మాన గూడదనుకుంటే కావలసిన నల్లమందు యెక్కడనుండి వస్తుంది. ఏదోలే కడుపునిండా కూడు దొరుకుతున్నది, నల్లమందులేకపోతే నేం?' అని సంతృప్తిపడేవాడు. చెడ్డరోజులొచ్చినవి. మంచిరోజులు రాగానే అన్నీ సర్దుకుపోతాయి.

ఇలా కొన్నిరోజులు గడిచినవి. సదానందుని అత్తగారు ఒక రోజున కాశీకి పోవలెననుకొన్నది. 'అబ్బాయ్! ఇలాచూడు. నా వయసు మళ్ళిపోయింది. ఊరు పొమ్మంటున్నది. కాడు రమ్మంటున్నది. నేను పండిన మామిడిపండులా వున్నాను. బావబోయేముందు కాశీ విశ్వనాథుని

దర్శించవలెనని నా కోరిక. ఒక్క పర్యాయం నన్ను కాశీకి తీసుకొనిపో నాయనా.'

సదానందు డెన్నడూ తన అత్తగారి మాట కెదురాడలేదు. అత్తగారు కోరిన యీ కోర్కెనుగూడా అతడు తిరస్కరించలేదు. ఒకటి రెండు రోజులలో కాశీకి వెళ్ళడానికి నిశ్చయించుకొన్నాడు. అతను కాశీకి వెళ్ళ వలెననుకున్న రోజున సదానందుడు 'లలనా, లలనా' అని పిలుస్తూ వారి ఇంటికి వెళ్ళాడు. సదానందుని చూచి లలన లేచి నిలబడింది. సదానందుని వద్ద యేబది రూపాయిలున్నవి. ఆ డబ్బు లలనదిండుక్రింద పెట్టి 'నేడు మేము కాశీకి పోతున్నాము. ఎప్పుడు తిరిగివచ్చేదీ చెప్పలేను. అవసరం వస్తే ఈ డబ్బు వాడుకో....' అన్నాడు.

లలన ఆశ్చర్యంగా 'యాభై రూపాయలా?' అన్నది.

'అనుకోవడానికియాభయ్యేకానిఖర్చుచేస్తేయిపియెన్నాళ్ళొస్తయి?'

'కాని యింత....'

ఈ వాక్యం పూర్తికాకముందే 'ఉంచ'మన్నట్లు చేతితో సంజ్ఞ చేస్తూ అతను సుఖదవద్దకు వెళ్ళి కూర్చుని 'నేడు మేము కాశీకిపోతున్నాం చిన్నమ్మా!' అన్నాడు.

ఆమాట సుఖదచెవికి యింపుగా సోకింది. 'కాశీనుంచి యెప్పుడు తిరిగివస్తావ్ నాయనా?' అని ప్రశ్నించింది.

'ఇప్పుడే యెలా చెప్పగలను? అత్తగారికి అన్నీ సరిగా చూపించిన తరువాత తిరిగివస్తాం.'

సుఖద ఒక నిట్టూర్పు విడిచి 'మంచిది. సుఖంగా వెళ్ళిరా నాయనా. భగవంతుడు మీ కాశీయాత్రను సుఖప్రదం చేస్తాడు.'

ఈ మాట విని సదానందుడు సంతోషంతో అక్కడినుండి వెళ్ళి పోయాడు. మరునటిరోజు లలన సదానందు డిచ్చిన ఆ యాభై రూపా యలలో పాతిక రూపాయలు తనవద్ద వుంచుకొని మిగతా పాతిక రూపా యలు అమ్మచేతి కిచ్చింది. రూపాయలిస్తూ ఆమె తల్లితో యిలా అన్నది 'అమ్మా! సదన్నయ్య కాశీకిపోతూ యీ డబ్బు యిచ్చాడు.'

సుభద విస్ఫారిత నేత్రాలతో రూపాయలు లెక్కపెట్టింది. లెక్కపెట్టి 'తప్పకుండా పూర్వజన్మలో మా యిరువురకూ యేదో సంబంధ ముండివుంటుంది.' అన్నది.

'అవు' నన్నట్లు తల ఆడించింది.

'ఎవరైనా యింత సొమ్ము వూరకే యిస్తారటే?'

లలన జవాబివ్వలేదు.

'అమ్మాయ్! సదానందుడు పిచ్చివాడా?'

'ఏం?'

'మరి అత నిలా యెందుకు చేస్తాడు?'

'ఆపదలో వున్నవారికి సహాయపడటం ఉన్మత్తుని లక్షణమా?'

'అయితే లోక మతన్ని పిచ్చివాడని యెందుకంటున్నది?'

'అనుకొనేవాళ్ళకు పిచ్చి.'

ఇప్పుడు హారాన్‌బాబు కుటుంబానికి వెనుకటికంటె సుఖంగా జరుగుతున్నది. వేళకు అన్నం దొరుకుతున్నది. కాని నలుగురూ నాలుగు విధాల చెప్పుకోసాగారు. కొంతమంది హారాన్‌బాబుని తిట్టసాగారు-నంది బాబు డబ్బంతా తిన్నాడని. కొంతమంది పీడు పేటయ్యాడయ్యా అని హేళన చేయసాగారు. కొంతమంది వాడి పొయ్యిలో పిల్లి లేవలేదనేవారు. ఇలా యెవరియిష్టంవచ్చినట్లు వారు తిట్టేవారు.

మధ్యాహ్న సమయం. కృష్ణాదేవి హారాన్‌బాబు యింటికి వచ్చి 'ఏమమ్మా! భోజనా లయినవా?' అని ప్రశ్నించింది.

'ఆ, యిప్పుడే భోంచేశామమ్మా.'

కృష్ణాదేవి తమలపాకులతోపాటు పొగాకు నములుతూ 'హారాన్ యేమిచేస్తున్నాడే?' అన్నది.

'ఉద్యోగంకోసం వెదుకుతున్నారు.'

'మరి ఇంటిఖర్చెలా గడుస్తున్నది?'

ఈ ప్రశ్నకు సుభద జవాబివ్వలేదు.

'హారాన్‌బాబు నందిబాబు సొమ్మంతా అపహరించాడని లోకమను కొంటున్నది. 'అతడుపేటయాడు. ఇంక అతనికేం తక్కువ' అనుకొంటు

టున్నారు. కాని మీ స్థితి చూస్తే అలాంటిదేమీ జరిగినట్లు కనిపించడం లేదు. మరి యిల్లెలా గడుస్తున్నదే....'

'ఏదో రోజులలానే దొర్లిపోతున్నాయి.'

'ఆ బ్రాహ్మణపాడ్ జమీందారుమూలంగానే మీ కిన్ని కష్టాలు వచ్చాయి. నేనైతే వాడి తల నరికి ఉప్పులో ఊరబెట్టేదాన్ని.'

సుభద యీ మాటలు వినిపించుకోకుండా 'భోంచేశావా అత్తయ్యా' అన్నది.

'ఆఁ తిన్నాను. ఆ పాడుముండాకొడుకుమూలంగా యిలాంటి దుర్దినాలు చూడవలసివచ్చింది. ఈ సర్వనాశనానికి కారణ మతడే. పాపం హారాన్ అమాయకుడు కావడంచేత అతనివలలో చిక్కాడు. మూడువేల రూపాయలే అతను అపహరిస్తే ఒక వందో రెండు వందలో నీ చేతిలో పెట్టడూ? అలా జరిగివుంటే యింట్లో యిన్ని తిప్పలు లేకుండా గడిచి పోయేదిగా?'

'ఇవ్వాళ ఏంకూర వండావమ్మా?'

'ప్రొద్దెక్కిందని ఏదో పచ్చడి నూరాను. కాని ఆ పాడు ముండా కొడుక్కి పాపభీతికూడా లేనట్లున్నది. హారాన్‌బాబు కాళ్ళావేళ్ళాబడితే రెండు రూపాయలివ్వడానికి చచ్చాడట. భగవంతు డెక్కడ నిద్రపోతు న్నాడో, బ్రాహ్మణులను కష్టపెట్టినవాడెవడూ బాగుపడలేదు. నీ వంటి ఉత్తమ ఇల్లాలి ఉసురు తప్పక తగులుతుంది. ఇలా మిమ్ములను సర్వ నాశనంచేసి అతను అందలాలెక్కి ఊరేగుతున్నాడు. అతని కేమి గతి పట్టుద్దో చూడు. నేను భవిష్యత్తు చెబుతున్నాను.'

'సరేకాని, బిందు ఊరికి వెళ్ళిందటగా?' అన్నది ఆమె మాటల ధోరణి మార్చాలని.

'ఆఁ వెళ్ళింది. వాళ్ళ మేనత్తకు కలరా తగిలితే చూచివద్దామని వెళ్ళింది. 'అయ్యో! పాపం! ఇంక మీ యిల్లు గడవడమెలాగే'

'మనదేమున్నదమ్మా: అంతా భగవంతుని దయ. ఎలా రాసిపెట్టి వుంటే అలా జరుగుద్ది

'అంతేలే అమ్మా! మనదేమున్నది! కాని లలనామణి పెండ్లి యెలా చేస్తారా అని దిగులుగా వుంది. అది రజస్వలయిందా, ఇక పెండ్లి

చేయకపోతే లోకం ఆడిపోసుకొంటుంది. పెండ్లిసంబంధా లేమైనా వస్తు న్నవా?'

సుభద ముఖం నల్లబడింది. పెదవులు యెండిపోయాయి. ఆ సమయంలో లలన అక్కడకు వచ్చింది. ఛలనామణి పెండ్లివిషయాన్ని గురించే వారిరువురూ మాట్లాడుకొంటున్నారని ఆమె గ్రహించింది. 'వంగ దేశపు ఆడపిల్లలకు పెండ్లిచేయకుండా వుండటానికి వీలులేదు.' అన్న వాక్యాలు ఆమె కర్ణపుటాల్లో ప్రతిధ్వనింపసాగాయి. 'ఏడుస్తూనో, మొత్తు కొంటూనో పెండ్లి చేసితీరాలి. పెండ్లిచేయకపోతే కులంలోనుండి వెలి వేస్తారు.

# 9

శుక్లపక్ష ఏకాదశి. అర్ధరాత్రి గడిచిపోయింది. గంగానదివొడ్డున ఒక శివాలయమున్నది. అది శిథిలావస్థలో నున్నది. ఆ దేవాలయం చుట్టూ పొదలూ, పెద్దపెద్ద చెట్లూ పెరిగాయి. ఆ కారణంగా దేవాలయం సగంమాత్రమే వెలుపలకు కన్పిస్తున్నది. దేవాలయం ముందున్న అరుగు పైన నవయువకు డొకడు కూర్చునివున్నాడు. అతని వయస్సు సుమారు యిరువదిరెండు సంవత్సరము లుండవచ్చు. జాగ్రత్తగా పరిశీలిస్తే అత డెవరికోసమో నిరీక్షిస్తుట్లు తోస్తుంది.

ఆ నవయువకుని పేరు శారదాచరణ్. అతను హాలుద్‌పూరులో ఒక భాగ్యవంతుని యేకైకపుత్రుడు. అత నెంతవరకు చదువుకొన్నాడో తెలియదు గాని, అతను మేధావి. కుశాగ్రబుద్ధిగల నవయువకుడు. అతను పని పాటులయందు చూపే దీక్ష ప్రశంసనీయం. యిందులో యేమాత్రం సందేహంలేదు. అతని తండ్రి వయోవృద్ధుడు. అందుచే యింటి పను లన్నీ తనే స్వయంగా చూచుకొంటాడు.

శారదాచరణుని తల్లి పరలోకగతురాలైనది. ఆమె బ్రతికివుండగా హారాన్‌ముఖర్జీయింటికి తరచు వస్తూవుండేది. రాసమణి అన్నా, సుభద అన్నా ఆమె ప్రాణాలు వదిలేది. ఆమె మరణించినతరువాత ఒకరింటికి ఒకరి రాకపోక లాగిపోయాయి. శారదాచరణ్ తండ్రిపేరు రామ మోహన్. రామమోహన్‌కి పేదకుటుంబముతో యెటువంటి సంబంధం పెట్టుకోవడమూ సుతరాం యిష్టంలేదు.

ఇక్కడ లలనను గురించి కొద్దిగా చెప్పవలసివున్నది. ఎందుచేత ననగా యీ ప్రకరణములో ఆమెకు ప్రముఖ పాత్ర వున్నది. అసలు లలనను చిన్నతనంలో శారదాచరణ్ కివ్వాలనుకొన్నారు. పెండ్లిబేరాలు కూడా జరిగాయి. ఆ సమయంలో హారాన్‌బాబు ఆర్థికస్థితి బాగుండని కారణంగా ఆమె పెండ్లి ఆగిపోవలసివచ్చింది. తరువాత హారాన్‌బాబు తన అంతస్తుకు తగినవానికే లలననిచ్చి అట్టహాసంగా పెండ్లిచేశాడు. కాని రెండు సంవత్సరాలు తిరగకపూర్వమే లలనకు వైధవ్యం ప్రాప్తించింది. ఆమె తెల్లని ముసుగు కప్పుకొని పుట్టింటికి తిరిగివచ్చింది.

లలనకు వైధవ్యం ప్రాప్తించినా వెనుకటిమాదిరిగానే శారదా చరణునియందు బద్ధానురాగయైయున్నది. వారి అనురాగం దినదినాభివృద్ధి చెందుచున్నది. వారి వయస్సు ముదురుతున్నకొద్దీ వారి ప్రణయం సుఖాంతం కాదనే అనుభవం కాజొచ్చింది. ఒకవేళ శారదాచరణుని కీ అనుభవం కలుగకపోయినా లలనకుమాత్రం కలుగజొచ్చింది. దీని పరి ణామ మేమంటే లలన మెల్లమెల్లగా తన ప్రేమసామ్రాజ్యాన్ని కుంచిం చుకోసాగింది.

ఇప్పుడు లలన శారదాచరణునివద్దకు రాకపోకలు బంద్‌చేసింది. అతనుకూడా తనవద్దకు రావడానికి అవకాశం కల్పించలేదు. అతనిమీద యెన్నడూ తన అనురాగాన్ని ప్రదర్శించడంలేదు. ఇప్పుడతనికి ఉత్తరాలు గూడా వ్రాయడంలేదు. లలనయొక్క యీ మనోభావాన్ని చూచి శారదా చరణుడు సందిగ్ధావస్థలో పడ్డాడు. ఆమె మనోభావంలో పరివర్తన తీసు కొనిరావడానికి అతను విశ్వప్రయత్నం చేశాడు. ఈ మనోవృత్తికి విరు ద్ధంగా తన అసమ్మతిని ప్రకటించాడు. ఈ ఉదాసీనత అనుచితమంటూ ఆమెను వొప్పించడానికై యెన్నో ప్రయత్నాలు చేశాడు. కాని లలన మస్తిష్కంమీద వీటి ప్రభావమేమీ పనిచేయలేకపోయింది. ఆమె తన భావాలనే కొమ్మలతో యెండిన రావిచెట్టులా వుండిపోయింది. తుద కొక నాడు శారదాచరణునితో 'ఇక నన్ను కలుసుకొనవద్దు. లాభంలేదు.' అని స్పష్టంగా చెప్పివేసింది.

ఈ మాట వినగానే శారదా చరణునికి మనసులో కోపంవచ్చింది, 'ఇంతవరకు మహోదాత్తంగా కన్పించిన మనప్రేమ నేడు నీకు తుచ్ఛంగా కన్పించిందా?' అని ప్రశ్నించాడు.

'చిన్నతనంచేత అప్పుడు గ్రహించలేకపోయాను, నే నిప్పుడు పెద్దదాననయాను.'

'పెద్దదాననయితే యిదేమీ మంచిదికాదా?'

'కాదు.'

'కాని........'

శారదాచరణుని వాక్యం పూర్తిగాకపూర్వమే లలన 'నేనుచెప్పింది పదహారణాల నిజం, ఇప్పుడు నీవు నన్ను తప్పుత్రోవలవెంట నడిపించకు' అన్నది.

శారదాచరణ్ కోపంగా 'అయితే నేను నిన్ను తప్పుత్రోవను నడిపిస్తున్నానా?' అని ప్రశ్నించాడు.

'కాక మరేమిటి?'

'యదార్థంచెప్పు'

'యదార్థమే చెపుతున్నా'

'అయితే యివాళతో మనసంబంధాన్ని త్రెంచుకొందాం.'

'మంచిది.'

ఇక నేను నీతో మాట్లాడను.'

'మాట్లాడవద్దు.'

ఇలాఅనుకొని యెవరిదారినివారు వోయారు. దారిపొడవునా శారదా చరణ్ నిప్పులుకక్కుతూనే వున్నాడు. ఇక లలన కన్నులొత్తుకుంటూ వెళ్ళింది.

ఇది నాలుగు సంవత్సరాలనాటి సంఘటన. నాలుగు వసంత్సరాల అనంతరం శారదాచరణుకు లలనను కలుసుకోవలెననే అభిలాషతో శివాలయంలో కూర్చున్నాడు. వెనుకటి విషయాలన్నీ మరచిపోయి శివాలయం వద్దకువచ్చి కలుసుకోమని లలన బ్రతిమాలితే వచ్చి ఆమెకొరకై నిరీక్షిస్తున్నాడు. వెనుకటివిషయా లనేకం అతనికి వరుసగా స్మృతికిరాజొచ్చినవి.

చిన్ననాటి అనురాగాలను గురించి లోకంలో పలువిధములైన అభిప్రాయాలున్నవి. కొంతమంది మతానుసారంగా అది అభిశాపం. కొంతమంది మతానుసారంగా చిన్ననాటి అనురాగమనే గోడ దృఢమైన పునాదులపై నిర్మింపబడదని.కాని కొంతమంది అభిప్రాయమేమంటే చిన్న నాటి ప్రేమలత పెరిగి పెద్దదై మూడుపూవులూ ఆరుకాయలూ కాస్తుందని. ఈవిధంగా లోకంలో యీ విషయంలో మతైక్యంలేదు. కాని చిన్ననాటి ప్రేమ చిరకాలం స్మృతిపథంలో నిలచివుంటుం దనడానికి లోకంలో అనేక నిదర్శనాలున్నవి.ఇది కాదనడానికి వీలులేని సత్యం. దానిముద్ర హృదయఫలకంమీద చెరగని మచ్చలా పడుతుంది, ఎంత చెరుపుదా మన్నా యేదో వొక గుర్తు వుండకపోదు.

శారదాచరణుని మొదడులోకి అనేక ఆలోచనలు రాసాగినవి. 'ఇన్ని సంవత్సరాలకుగాను లలన నేడు నాకు యెదురుగా కూర్చుంది మాట్లాడుతుంది. ఈమాటలు తలచుకొంటేనే అతని మనస్సు ఆనందంతో గంతులువేయసాగింది, అతను పులకాంకితుడైనాడు. 'నే డామె నావద్దకు యెందుకు వస్తున్నది? ఈ సమయంలో ఆమె నన్నెందుకు పిలిపించింది. మా యిరువుర సంబంధం యేనాడో తెగిపోయిందిగా?' ఎంత ఆలోచించినా యీ ప్రశ్నలకు జవాలు దొరకలేదు.

రాత్రి సమయము. గడియారపు చిన్నముల్లు ఒకటిమీద వున్నది. ఒక స్త్రీ నెత్తిపై ముసుగులేకుండా ఆవైపునకే వస్తున్నది. శారదాచరణుని దృష్టి ఆమెమీద పడింది. అరే! లలనే, చాలా పెద్దదయినదే!

లలన వచ్చి అతని సమీపంలో కూర్చున్నది. చాలాకాలానికి పండువెన్నెలలో శివాలయపు అరుగుమిద యిరువురూ మౌనంగా కూర్చు న్నారు. కొంతసేపటికి శారదాచరణ్ ధైర్యంవహించి 'నన్ను యిక్కడకు పిలిపించిన కారణమేమిటి?' అని ప్రశ్నించాడు.

'అవసరమైన పని వుండి పిలిపించాను.'

'అదేమిటో చెప్పు.'

'ఇప్పుడే చెపుతా'

కొంచెంసేపు నిశ్శబ్దత తాండవించింది.శారదాచరణుడు నిశ్శబ్దతను భంగపరుస్తూ 'చెబుతానని మౌనంవహించావేం?' అన్నాడు.

'చిన్నప్పుడు నీవు న న్నెంతగానో ప్రేమించావు. ఆ ప్రేమ యిప్పుడు గూడా వున్నా ?'

'ఇప్పు డా విషయాన్ని చెప్పినందువలన ప్రయోజనం ?'

'ప్రయోజనం తప్పకుండా వున్నది.'

'నేను, ఉన్నది....అని తల వూపుతాననుకో అప్పుడు ?'

లలన సిగ్గుపడింది. అయితే మీరు పెండ్లిచేసుకుంటారా ?' అన్నది నేలవంక చూస్తూ.

శారదాచరణుడు వెనుకకు జరిగి 'లేదులేదు' అన్నాడు కంగారుగా.

'ఎందుచేత ?'

'నిన్ను పెండ్లిచేసుకుంటే నన్ను కులంలోనుండి వెలివేస్తారు.'

'ఏం వెలివే స్తే ?'

'అన్న మెక్కడ తినేది ?'

'దానినిగురించిన విచారం నీకు వద్దు.'

'మా నాన్న వొప్పుకోడు.'

'ఆయనకి పడే తాళం నీవద్ద వున్నది. నీవు ఆయన యేకైక పుత్రుడవు. నీవు యెదురుతిరిగితే అతను తప్పక రాజీబేరానికి వస్తాడు.'

'ఇది సంభవమని నాకు తోచడంలేదు.'

'కారణం ?'

"చాలా కారణాలున్నవి. తండ్రిమాట కాదని నేను నిన్ను వివాహమాడితే విధవను పెండ్లాడానని లోకం నన్ను కులంలోంచి బహిష్కరిస్తుంది. కులంతో మనకు చాలా పనివున్నది. కులంలేకుండా యీ హాలుడ్‌పూరులో నేను బ్రతుకలేను. నా జీవితం దుఃఖభాజనమౌతుంది. ని న్నే దూరదేశాలకో తీసుకొనిపోయి పోషించడానికి నావద్ద చాలినంత ద్రవ్యంకూడా లేదు. మన సంబంధం యిదివరకే తెగిపోయింది. ఆ తెగిపోయిన సంబంధం తెగిపోయినట్లుంటేనే మన యిరువురకూ మంచిది, శ్రేయస్కరం !

లలన ఒక్కక్షణ మాగి "మంచిది. అలానే చేద్దాం. కాని నా కొక మేలు చేస్తావా ?" అని ప్రశ్నించింది.

"చేయతగినదై తే తప్పక చేస్తాను."

"చేయతగినదే. అయితే చేయడం చేయకపోవడం నీ యిష్టా యిష్టాలమీద ఆధారపడివున్నది."

"అయితే చెప్పు. చేయతగినదైతే చేస్తానన్నానుగా."

"నా చెల్లెలు లలనను పెండ్లిచేసుకో."

శారదాచరణ్ చిరునవ్వు నవ్వి "ఏం, ఆమె కెక్కడా మగడు దొరకలా?" అన్నాడు.

"లేదు. మేము పేదవాళ్ళం. మావంటి పేదవాళ్ళ పిల్లలను పెండ్లి చేసుకోవడానికి యెవరు యిష్టపడతారు? మాకంటే తక్కువ కులంవాళ్ళయితే పెండ్లాడుతారు. నీచకులంవాళ్ళను పెండ్లాడటంకంటే జీవితాంతం కన్యగావుండటమే మేలంటారు. చిన్నతనంలో మన యిరువురకూ పెండ్లిబేరాలు జరిగాయి. నీవు సరేనంటే మా కష్టాలన్నీ గట్టెక్కుతవి. ఏమంటావో చెప్పు."

"మా నాన్నగారితో ఆలోచించకుండా యీ విషయాన్ని గురించి నేనేమీ చెప్పలేను. తండ్రిగారియెదుట యీ విషయాన్నిగురించి మాట్లాడడానికి నా కధికారంలేదు."

"సరే. వారితో చెప్పకుండానే నీవు స్వతంత్రించి వివాహం చేసుకోరాదూ?"

"ఆయనగా రిలాంటి వివాహానికి ఎంతమాత్రం సమ్మతించరని నాకు బాగా తెలుసు."

"ఎందుచేత?" అన్నది లలన ముఖం విచారంగాపెట్టి.

"మంచిది. విను చెబుతా. ఉన్న విషయమంతా స్పష్టంగా చెబుతా. ఇక దాచి ప్రయోజనంలేదు. నా పెండ్లికి కట్నం కావాలని మా నాన్నగారి కోరిక. అది మీ రివ్వలేరు. అందుచేత ఆయన వొప్పుకోడు."

"మేము పేదవాళ్ళమన్న విషయం నీకు తెలుసు. మేము కట్నమివ్వడానికి సొమ్మెక్కడ తెస్తాం? భగవంతుని దయవలన భార్యాభర్తలిరువురూ కలకాలం సుఖంగా వుండాలిగాని, కట్నమిచ్చినసొమ్ము యెంత కాల ముంటుంది?'

'నీవు చెప్పింది యదార్థమే. కాని నాన్నగారికి నచ్చజెప్పేదెవరు?'

'నీవు చెప్పగలవు. దానికి సరిపడేతాళం నీవద్దనే ఉన్నది.

'సరే, చెప్పడానికి ప్రయత్నిస్తాను. కాని గట్టిగా దబాయించి మాత్రం చెప్పలేను.'

'గట్టిగా చెప్పకపోతే మన ప్లానంతా చెడిపోతుంది. గట్టిగా చెప్పి తీరాలి. ఇందు కేదైనా ఉపాయ మాలోచించాలి.'

'అయితే ఏమిటి ఉపాయం?'

"బహూశా నీకే యిష్టంలేనట్లు నాకు తోస్తున్నది."

"లేదు లేదు."

"ఛలనలాంటి పిల్ల దొరకడం దుర్లభం. ఆమె రూపవతి, గుణవతి, అదీగాక ఒక పేదయింటిపిల్లను ఉద్ధరించినవాళ్ళమవుతాం, అని మీనాన్న గారికి చెప్పండి. ఏం చెపుతారా! నా జీవితాంతంవరకు మీపేరు తలుచు కుంటాను. ఏం, చెప్పండి, ఈ పెండ్లి మీకిష్టమేనా?"

"నాన్నగారు యెలాచెబితే అలా చేస్తాను."

"నేడు నేను నా హృదయాన్ని విప్పి మీముందు పెడుతున్నాను. జీవితంలో యిలాంటి అవసరం మరొక పర్యాయం కలుగకుండుగాక. నేను మిమ్మల్నెప్పుడూ అనుమానించలేదు. ఉన్నవిషయం సంకోచించ కుండా మీముందు పెట్టాను. నేను మిమ్ములను నా హృదయపూర్వకంగా ప్రేమించాను. ఇప్పుడుగూడా ప్రేమిస్తున్నాను. ఈ విషయాన్ని ఇదివరకే మీకు తెలియజేశాను. ఇప్పుడుగూడా తెలియజేస్తున్నాను. కాని మీరు నా మాట వినలేదు. ఇదే నా చివరి కోరిక. ఇక భవిష్యత్తులో యిలా జరుగ కూడదు. నేను మిమ్ములను వ్యర్థంగా కష్టపెట్టాను. క్షమించండి."

శారదాచరణుడు మనసులో దుఃఖించాడు. లలన వెళ్ళిపోవడానికి సిద్ధమైనది. సరే నాన్నగారి కీవిషయం తప్పక చెబుతా" నన్నాడు శారదాచరణ్. "చెప్పండి."

"కాని నేను పరతంత్రుడను. నాన్నగారు యెలాచెబితే అలా చేస్తాను."

లలన పోతూ పోతూ యీ మాట విన్నది.

"ఈవిషయంలో నా చేతనైనదంతా చేస్తాను"

"మంచిది."

"లలనా! క్షమించు."

# 10

నాది పందెం.బాబూ! పావలా బయటకు తియ్."అంటూ హారాన్ బాబు డబ్బులు లెక్కచూచుకొని ధోవతికొంగున ముడివేసుకొన్నాడు.

"ఈతడవ అర్ధరూపాయి కాస్తాను. నా అదృష్టాన్ని పరీక్షిస్తాను."

ఎదురుగా చిరుగుల చాప ఉంది. హారాన్‌బాబు ఎనిమిదణాలు ఆ చాపమీద అక్కడ పెట్టి, పేకముక్కలు చేతికి తీసుకొన్నాడు. మిగతా వారంతా ఎంతో ఉత్సాహంతో వారి వారి పేకముక్కలు చేత్తో తీసుకొని చూడసాగారు.

"పందెం నాదే. మూడాసులు, బొడ్లోనుండి డబ్బులు తియ్యండి." అన్నాడు హారాన్.

గాడిల్ రూపాయి హారాన్‌కిచ్చి పేక క్రింద పడేశాడు. మిగతా వారుకూడా జేబుల్లోనుండి బొడ్లలోనుండి డబ్బులు తీయసాగారు.

"ఇంకా - కాయ్ ఇంకా .... ఇంకా.

"ఇక చాలు."

"పదిహేనుమీద ఆగాలి."

"ఈసారికూడా మీరు ఓడిపోయారు. నేనే గెలిచాను."

చాల ప్రొద్దుపోయింది. హారాన్‌బాబు అక్కడినుండి బయలు దేరాడు. రూపాయలబరువుతో అతనివొడి క్రిందికి వ్రేలాడుతున్నది. ఆ రాత్రి అతను యింటికి వెళ్ళలేదు. బయటనే పడుకొన్నాడు. తెల్లవారింది. అత నటూ యిటూ తిరిగాడు, ఇంతలో మధ్యాహ్నమైనది. సాయంత్రం నాలుగు గంటలైనది. హారాన్‌బాబు యింటికి చేరుకున్నాడు.అతని కన్నులు పీక్కుపోయాయి. గుడ్డలు గంజాయివాసన కొడుతున్నవి.

అతను కాళ్లు కడుక్కొని భోజనానికి కూర్చున్నాడు. సుభద అతని కెదురుగా కూర్చుని 'ఇవాళ యింత ఆలస్యంచేశారేం?' అని ప్రశ్నించింది.

'ఏమి చేయను సుభదా! ఉద్యోగమంటే మాటలతో వున్నదా. ఆలస్యమౌతూనేవుంటుంది. సరేకాని, నీ వింకా భోజనంచేయలేదా?'

సుభద మాట్లాడలేదు.

"చూడు సుభదా! ఇది మంచిపద్ధతి కాదు. నీవు నాకోసం నిరీక్షిస్తూ అన్నం తినకుండావుండటం మంచిదికాదు. నేను ఫలానా వేళకు తిరిగివస్తాననే నమ్మకం లేదాయె. బహుశా యిట్లానే రోజూ ఆలస్యం కావచ్చు. అలాంటప్పుడు నీవు భోజనంచేయకుండా వుండటం ఉచితం కాదు. బాగా ఆలోచించు. రెండు ముద్దలు తిను. ప్రొద్దుట నీవు నన్ను డబ్బు అడిగావుకదూ" అని ప్రశ్నించాడు.

ఈ మాటలయొక్క తాత్పర్యాన్ని సుభద గ్రహించలేకపోయింది. "నేను మిమ్మలను డబ్బు అడుగలేదే?" అన్నది.

"బహుశా నీవు అడిగివుండొచ్చు ననుకొన్నాను." హారాన్‌బాబు చిరునవ్వు నవ్వి "ఇవాళకాకుంటే రేపైనా అడుగుతావు, తప్పదు. అదిగో ఆ పంచెమూటను ఎనిమిది రూపాయలున్నవి. మూట విప్పి అయిదు రూపాయలు తీసుకో."

"సరే!" నన్నట్లు సుభద తలవూపింది.

ఇది ఆశ్చర్యకరమైన సంఘటన. సుభదకుగూడా ఆశ్చర్యం కలిగించింది. ఎందుకనగా హారాన్‌బాబు చాలారోజులనుండి ఆమెచేతికి ఒక్క దమ్మిడీగూడా యివ్వడంలేదు.

హారాన్‌బాబు భోజనం ముగించి లేచాడు. సుభద మెల్లగా "ఈ డబ్బు యెక్కడిది" దని ప్రశ్నించింది.

హారాన్‌బాబు నవ్వి "మగవాళ్ళకు డబ్బుకేం తక్కువ. తెలివివుంటే యెంత డబ్బైనా సంపాదించవచ్చు. మగవాడు కొంచెం తెలివిగా సంచరిస్తే అడుగడుగునా డబ్బు కన్పిస్తుంది. తెలివితో సంపాదించాను" అన్నాడు.

సుభద కీమాట అర్థంకాలేదు. అతనితో వాదించడం యిష్టంలేక మెదలకుండా వూరుకొన్నది.

ఈ సంఘటన జరిగి సుమారు రెండుమాసములైనది.

సాయంసమయము. సుభద విచారంగా "డబ్బేమైనా వున్నదమ్మా?" అని లలనను అడిగింది.

"లేదమ్మా"

"నీవు మొదట్లో అలాగే అని తరువాత తెచ్చియిస్తుంటావ్! ఏమైనావుంటే చూడమ్మా! లేకుంటే యివాళ అందరము పస్తువుండ వలసివస్తుంది."

లలన కన్నులలో నీరుతిరిగింది. "నీ పాదాలు పట్టుకొని చెబు తున్నానమ్మా! నావద్ద రాగికానీ లేదు."

ఇరువురూ కన్నీటిప్రవాహంలో మునకలువేయజొచ్చారు. సుభద కన్నీటికి కారణం తన కుమార్తెనుకూడా అనుమానించానే అని. లలన కన్నీటికి కారణం వేరేవున్నది. ఆమె మొదట్లో లేదులేదంటూ తరువాత పావలో అర్ధో తెచ్చి తల్లిచేతిలో పెట్టేది. కాని నే డామె చిల్లికానీ యివ్వ లేని అసమర్థురాలైనది. సదానందు డిచ్చిన యాభై రూపాయలు ప్రొద్దు టితో అయిపోయినవి.

లలన యిలా విచారసాగరంలో మునుగుతో తేలుతూవున్నది. ఇవ్వాళంతా పస్తుండాలి. ఈ దుఃఖసాగరాన్ని గడిచే దెలా? అమ్మ హృదయం పంజరంలోని పిట్టలా కొట్టుకొంటున్నది. ప్రొద్దున్నే పోయి యెవరిని అడిగేది? ఇలా ఆలోచనలతో ఆమె కన్నులవెంట అశ్రుధారలు కారసాగినవి. బిందు వుంటే ఏదైనా సహాయంచేసేది. ఆమెగూడా లేదు. సదానందుడుకూడా లేడు.ఆమె విచారానికి మరొక కారణంకూడా వున్నది. హారాన్‌బాబు రెండు మూడు రోజులనుండి యింటికి రావడంలేదు. అతను జూదమాడుతూనో, లేక నల్లమందు తిని రోడ్లమీద దొర్లుతూనోవుంటాడు.

ఇక్కడ హారాన్‌బాబునిగురించి చెప్పడం అత్యంతావశ్యకం.

హారాన్‌బాబుకి నల్లమందంటే పోయిన ప్రాణాలు లేచివస్తవి. అతను గంజాయికూడా త్రాగుతాడు. అణో, బేడో ఎవరిదగ్గరైనా అప్పు తీసుకొంటాడు. అప్పుడప్పుడు సుభదను బెదిరించి పావలా బేడా ఎత్తుకు పోతుంటాడు, మరీ డబ్బులు దొరకవినాడు బిచ్చమెత్తుకుంటాడు. ఒంటి నిండా విభూతిరేఖలు దిద్ది, నొసట త్రిపుండ్రాలు తీర్చి బిచ్చానికి బయలుదేరుతాడు. మొదట్లో అతనికి జూదమాడడం చేతనయేదికాదు. ఇప్పు డీ విద్యలో పారంగతుడైనాడు.

ఇప్పు డతని ఉత్సాహమంతా జూదంమీదకు మరలింది. అతను మొదట్లో జూదంలో కొన్ని రోజులు వరుసగా గెలిచాడు, ఆ కారణంగా

అతను జూదానికి అంకితమైపోయాడు. తరువాత అతను తన సర్వస్వాన్ని
కోలుపోయాడు. సుభద కిచ్చిన అయిదురూపాయలే ఆఖరుసారిగా అతను
ఆమెచేతికిచ్చిన డబ్బు. తరువాత అతనిచేతి కెన్నడూ డబ్బు రానూ
లేదు. ఇవ్వనూలేదు. ఒకవేళ అతని చేతికి పావలో బేడో దొరికినా
అంతకు రెట్టింపు ఖర్చు చేస్తున్నాడు.

మొదట్లో హారాన్‌బాబు హలుద్‌పూర్‌లో నిశ్చింతగా బ్రతకడానికి
అవకాశంలేకపోయింది. ఇప్పుడు బ్రాహ్మణపాడ్ పోవాలన్నా వీలులేదు.
అత నందరిదగ్గరా అప్పులుచేశాడు. అతని దృష్టినుంచి తప్పించుకోవా
లన్నా యెవరూ తప్పించుకోలేకపోయేవారు. ఇదిగో యిప్పుడే తెచ్చి
యిస్తానని అతను యెంతమందినో మోసంచేశాడు. అతని చేతికి పోయిన
డబ్బు తిరిగి రావడం సున్న. పావలా, బేడా, రూపాయి, పుట్టినట్లల్లా
అప్పుచేశాడు. ఆ చుట్టుపట్ల అతనికి అప్పుపెట్టనివాడంటూ లేడు. ఈ
కారణంగా అతను బ్రాహ్మణపాడ్‌లో తనముఖం చూపించలేకపోతున్నాడు.
అన్నిటికన్న ఆశ్చర్యకరమైన విషయమేమంటే ఎక్కడ తిరిగినా సాయం
కాలానికి నల్లమందుకొట్టుదగ్గరకు హాజరుకావడం. ఇప్పు డతను
యెప్పుడూ జూదందగ్గరే కాలం గడుపుతున్నాడు.

హారాన్‌బాబువద్ద జూదమాడడానికి డబ్బులేదు. ఎవరి ఆటైనా ఆడి
పెట్టి పావలో బేడో కాజేస్తూవుంటాడు. లేకుంటే జూదగాళ్ళకు బీడీలు,
అగ్గిపెట్టెలూ టీలూ అందిచ్చి అణో బేడో సంపాదిస్తుంటాడు. ఇలా
తిప్పలుపడి సాయంకాలానికి అణో అర్ధణో సంపాదించి నల్లమందు,
గంజాయి త్రాగుతాడు. ఎక్కువ డబ్బులు దొరికిననాడు జూదంగూడా
ఆడుతాడు. అప్పుడప్పుడు గెలుస్తాడుగూడా. ఓడిపోతే విచారించడు. పైగా
తన మనస్సుకి ధైర్యం చెప్పుకుంటాడు—"అన్యాయంగా సంపాదించిన
డబ్బు అన్యాయంగానే పోయింది" అని. పావలా డబ్బులు దొరికితే అతనిని
పట్టుకోవడం కష్టం.

నల్లమంసుకొట్టువద్దకు చేరగానే హారాన్‌బాబు పద్మాసనంవేసి
కొందరు రాజులనీ కొందరు మంత్రులనీ పిలిచేవాడు. ఇల్లూ, సుభదా
జ్ఞాపకంవచ్చినప్పుడుమాత్రం యింటికి వచ్చేవాడు ఇంట్లో అన్నాని కేమీ
లోటులేదని తలపోసేవాడు. సుభద చేతిలో పరువనేది వున్నది. కనుక

ఆ చేతు లెప్పుడూ రిక్తపోవు అనుకొనేవాడు. ఆమె అన్నపూర్ణ అనుకొనే వాడు. ఇది నిజమే. ఇంటిలోనివారంతా పస్తుండైనా అతనికి అన్నం పెడతారు. కాని నేడొక జటిల సమస్య ఉత్పన్నమైనది. ఇంటికి పోవ డానికి తను సిగ్గుపడుతున్నాడు. ఇంటివద్దకు రాగానే అడుగు ముందుకు సాగడంలేదు. సాహసించి యింట్లో అడుగుపెట్టగానే అతని వ్యాకులం ఉగ్రరూపం దాల్చింది.

అతను రాగానే సుభద కాళ్ళకు నీళ్ళు తెచ్చి కాళ్ళు కడిగి అన్నం వడ్డించేది. సుభద విచారంగా వున్నదని హారాన్ గూడా గ్రహించకపోలేదు. ఆమె దుఃఖభారంతో కృశించిపోతున్నదని అతనికి తెలియకపోలేదు.

హారాన్‌బా బెప్పుడూ వేళకానివేళ యింటికి వస్తాడు. అతను యింటికి రాగానే సుభద కాళ్ళకు నీళ్ళిచ్చి పళ్ళెంలో అన్నంపెట్టి అతని కొరకు నిరీక్షిస్తుండేది. 'ఇంత ఆలస్యంగా వచ్చారేం?' అని ఆమె యెన్నడూ కోపగించుకొనేదికాదు. సుభద విచార సూచిత వదనాన్ని చూడగానే అతని మనస్సు వ్యాకులపడజొచ్చింది. 'ఏవిధమైన సుఖాన్ని అనుభవించడానికి నా కధికారంలేదు' అనే భావం అతనికి కలుగ జొచ్చింది. ఇలా ఒక రెల్లప్పుడూ అపరాధాలు చేస్తూవుండడం రెండవ వాడు వాటిని సహించి క్షమిస్తూవుండడం మంచిదికాదు. మహాసాధ్వి గనుక నేను నల్లమందు తిన్నా గంజాయి త్రాగినా యెరుగనట్లు ఊరుకొం టున్నది. ఆమె నా మాటకు యెన్నడూ యెదురాడలేదు. నా పనులయెడ అసంతృప్తి ప్రకటించలేదు.

హారాన్‌బాబు సిగ్గుపడడానికి అతని హృదయం వ్యాకులపడడానికి కారణం సుభదయెడల తను అనుసరిస్తున్న విధానమే. అందుకై తనలో తాను తిట్టుకోసాగాడు.

ఈ ప్రకారంగా జీవితం గడుస్తున్నది.

మామూలుప్రకారంగానే హారాన్‌బాబు చాలా ప్రొద్దుపోయిన తరు వాత యింటికి వచ్చాడు. నే డతను సుభద వ్యవహారంలో పరివర్తనాన్ని గమనించాడు. ఇవాళ తను యింటికి రాగానే సుభద కాళ్ళుకడుక్కోడానికి నీళ్ళివ్వలేదు. పళ్ళెములో అన్నం పెట్టి అతనిరాకకై నిరీక్షిస్తూ కూర్చో

లేదు. ఇంటిలో ఒకమూల దీపం మిణుకు మిణుకుమంటున్నది. దీపం హెచ్చిద్దామని చూస్తే అందులో నూనె లేదు. ఇది చూచి అతనికి సంశయం కలిగింది. ఏదో అశుభకార్యం జరిగివుంటుందని ఊహించాడు. పోయి కుక్కిమంచంలో కూలబడ్డాడు. ఆ సమయంలో అతని బుర్ర లోకి యెన్నో ఆలోచనలు రాసాగినవి.

తెల్లవారింది. కాని యెవరూ యెదురుగా కన్పించలేదు. చేసేది లేక తన పాత చెప్పులు చేతితో పట్టుకొని యింట్లోనుంచి బయలుదేరాడు. ఎవరికంటాబడకుండా యింట్లోనుంచి పోవాలనుకొన్నాడు. కాని ఛలనా మణి చూడనే చూచింది. ఆమె అరుగుమీద కూర్చునివున్నది. అంత పెందలకడనే ఆమె యెన్నడూ నిద్రలేవదు. ఇవాళ అంత ప్రొద్దుటే యెందుకు లేచిందో యెవరికీ తెలియదు. తండ్రిని చూడగానే "నాన్నా ! యెప్పుడు వచ్చావ్ ?" అని ప్రశ్నించింది.

ఈ మాట చెవినిబడగానే హారాన్ కుంచించుకుపోయాడు. తమా యించుకొని "రాత్రి వచ్చానమ్మా !" అన్నాడు.

"నీ తెలివితేటలన్నీ యెక్కడకు పోయినవి నాన్నా ! ఇంటిగొడవ నీవు కొంతయినా పట్టించుకోవడంలేదు. విన్నంతా పస్తుపడివున్నాం. అత్తయ్య, అమ్మ, అక్కయ్య యెవరూ పచ్చిమంచినీళ్ళయినాముట్టలేదు. మీరు యింటికి వచ్చారో లేదో అప్పుడే చెప్పులు తీసుకొని బయలు దేరారా? ఇంట్లో పిడికెడు నూకలు లేవు. ఇవ్వాళ మే మేమి తినం ?"

ఈ మాటలు వినగానే హారాన్‌బాబునెత్తిన పిడుగు పడినట్లయింది. చేతిలోని చెప్పులు జారి నేలపై పడ్డవి. ఛలనవంక గుడ్లప్పగించి చూస్తూ "ఇది నిజమేనా ఛలనా ?" అన్నాడు.

"అత్తయ్యా! ఓ అత్తయ్యా! ఇలా రా. విన్నావా నాన్న మాటలు. నాన్నతో నేను అబద్ధాలు చెప్పుతున్నానట. విన్న రాత్రంతా అమ్మా, అక్కా యేడుస్తూ కూర్చున్నారు. ఈ విషయం నీ కెందుకు తెలియదు ? భోజనంకోసమనేనా నీవు యింటికి వచ్చేది ? మాతో నీకేం సంబంధం లేదా ?"

హారాన్‌బా బక్కడ నిలబడలేకపోయాడు. క్రిందబడిన చెప్పులు చేతితో తీసుకొని అక్కడనుండి తొందరగా వెళ్ళిపోయాడు.

"చూడండి, చూడండి. నాన్న పారిపోతున్నాడు" అన్నది ఛలన.

ఛలన యింకా చిన్నపిల్ల. అందుచే ఆమె మాటకూడా పిల్లతనపు మాటగానే వుంటుంది. ఎవరితో యెలా మాట్లాడాలో, ఏ సమయంలో యెలా ప్రవర్తించాలో ఆమె కింకా తెలియదు.

లలన దాగి ఆ దృశ్యాన్ని చూస్తున్నది. హారాన్‌బాబు వెళ్ళిపోయిన తరువాత ఛలనవద్దకు వచ్చి "ఛలనా, నీకు బుద్ధిలేదే" అన్నది.

"ఏం ?"

"ఎవరిదగ్గర యెలా మాట్లాడాలో నీ కింతవరకు తెలియదు. నాన్నగారిని అనరాని మాట లనడం మంచిదిగాదు."

ఈ మాటలు వినగానే ఛలనకు కోపంవచ్చింది. కన్ను లెఱ్ఱబారినవి. "ఎవరు పారిపొమ్మన్నారేఃఆయనే చెప్పులు చేతపట్టుకొని పారిపోతేః

"నీ తెలివితేటలు చూచి పారిపోయాడు. ఎవరైనా తండ్రిగారిని యిలాంటి మాట లంటారా ?"

"తండ్రి తండ్రివిధులను నిర్వర్తిస్తుంటే అనగూడనిమాట నిజమే. ఆయన వ్యవహారం సరిలేదు. ఇంటి విషయమే పట్టించుకోవడంలేదు. అలాంటివాడిని ఏమన్నా పాపంలేదు. మంచివాళ్ళను గౌరవించవలసినదే. తండ్రిగారి వ్యవహారం సరిగా లేదు గనుక ఆయనతో అలానే వ్యవహరించాలి. చేసుకొన్నవానికి చేసుకొన్నంత మహాదేవ ! ఆదష్ఠపిత సంసారనౌకను విచారసాగరంలో వదలి గంజాయి, నల్లమందు త్రాగడు. చూడక్కా ! ఇకముం దాయన ఆ అలవాట్లను మానకపోతే యింకా ఏమేమి అంటానో చూస్తూవుండు."

లలన కోపంగా 'అతలికి పోః" అని కసిరింది.

"నే నెందుకు వెళ్ళాలిః కావాలంటే నీవే వెళ్ళు. మాటల్లో నన్ను జయించడానికి యెన్నడూ ప్రయత్నించకు."

లలన విధిలేక అక్కడనుండి వెళ్ళిపోయింది.

## 11

మధ్యాహ్నసమయం గడచిపోయింది. రాసమణి యెదుట ఒక యిత్తడి బిందె పెట్టి సుఖద యిలా అన్నది. "బహుశా వా రివ్వాళ ఇంటికి

రా రనుకొంటాను. ప్రొద్దు తిరిగింది. ఈ బిందె తాకట్టుపెడితే యీ పూట కెలాగో పని జరుగుతుంది."

రాసమణి చాలాసేపు సుభదముఖంలోకి చూచి "నాకు సిగ్గేస్తున్న దమ్మా!" అన్నది.

రాసమణి చేతిలోబిందె తీసుకొని "సరే నేనే వెళ్ళి చూస్తాను."

"ఎక్కడ?"

"ఘోష్‌బాబు దుకాణంలో."

"నీవు వెడతావా?"

"నే నెందుకు వెళ్ళకూడదు? వెళ్ళడానికి నాకేం సిగ్గేయడంలేదు. నే నిక్కడపుట్టాను. ఇక్కడి ఉప్పూ పులుసు తిని పెద్దదానినైనాను. నా విషయం అందరకూ తెలుసు. ఇందులో సిగ్గుపడవలసిన విషయమేము న్నది? వెన్నెల తరువాత చీకటి, తరువాత వెన్నెల రావడం ప్రకృతి సహజం." అంటూ సుభద బిందె తీసుకొని వెళ్ళడానికి సిద్ధమైనది. రాసమణి సుభద చేతిలోని బిందె లాక్కొని "నీవు వెళ్ళవద్దు, నేనే వెడతాను" అన్నది.

ఆ రోజు మూడుగంటల అనంతరం అందరూ భోజనాలు చేశారు. భోజనాలయాక సుభద లలనచేయిపట్టుకొని ఏకాంతస్థలంలోకి తీసుకొని పోయి "కాస్త మునగాకు తెచ్చిపెట్టమ్మా!" అన్నది.

"లలన ఆశ్చర్యంగా "ఇప్పుడు మునగాకు యెందుకమ్మా!" అన్నది.

"పని వున్నది!"

"ఏం పని అమ్మా!"

"మునగాకు ఏంచేస్తారో తెలియదా అమ్మా?"

లలన సుభదముఖభంగిమనుబట్టి అమ్మ అన్నం తినలేదని గ్రహించింది. "అమ్మా కుండలో అన్నం లేదూ?" అని ప్రశ్నించింది.

"ఉంటేనేం. ఆకుకూర వండుకుంటే వచ్చిన నష్ట మేమిటి?"

"అమ్మా! నీ వేదో దాస్తున్నావ్! ఆకుకూర యేం చేస్తావో సరిగా చెప్పమ్మా!"

"చెపుతున్నానుగా"

"అమ్మా నీ కాళ్లు పట్టుకొంటాను. ఈ విషయం నావద్ద దాచ డానికి ప్రయత్నించకు."

లలన సుభదపాదాలు పట్టుకోవడానికై వంగింది.సుభద లలనను లేవనెత్తి 'అమ్మా! ఒకరికి సరిపోయే అన్నమున్నది. ఒకవేళ మీ నాన్న గారు వస్తే.... అందుకని....'

"మంచిది, తెలిసింది. ఆకుకూరతో నీ పొట్ట నింపుకుందా మను కొంటున్నావన్నమాట"

సుభద చిరునవ్వు నవ్వి 'ఏం, ఆకుకూర తినకూడనిదా?' అన్నది.

"ఆకుకూర తినవచ్చు. కాని దానితో పొట్ట నిండదు."

"లలనా! నీ వన్నమాట నీవే మరచావ్. ఇంతకుముందే నీవు 'ఎవరి యింట్లో కష్టాలులేవు?' అన్నావు. కనుక కష్టాలు వచ్చినప్పుడు ధైర్యంగా వాటిని యెదుర్కోవాలి. భగవంతుని దయవలన మంచిరోజులు రాకపోవు" అన్నప్పుడు సుభద కన్నులలో నీరు తిరిగింది.

లలన ఆకుకూర తెచ్చి అమ్మవద్ద పెట్టి కన్నీరు తుడుచుకొంటూ అక్కడనుండి వెళ్ళిపోయింది.

సూర్యాస్తమయం కావడానికి ఇంకా ఆలస్యమున్నది. ఒక భిక్షువు బ్రాహ్మణపాడ్‌లో వున్న దుకాణంవద్ద నిలబడ్డాడు. దుకాణం చిన్నది. బీదవాళ్ళు ఆ దుకాణంలో కొనుక్కొంటారు. భారీయెత్తున సరుకు కొనే వాళ్ళు ఆ దుకాణానికి రారుకాని, చిన్న దుకాణమైనా అక్కడ కొనే వాళ్ళ సంఖ్య యెక్కువగానే వుంటుంది.

ఆ దుకాణంలో ఒక డొక కానీకి ఉప్పు కొంటే ఒక డొక కానీకి పప్పు కొంటాడు. అంతా కానీలబేరమే. వచ్చినవాళ్ళంతా యేదో వొకటి కొనుక్కొని వెళ్ళిపోతున్నారు. కాని భిక్షువు అలానే నిలబడి వున్నాడు. ఇలా ఆ దుకాణంవద్ద అత నెంతసేపటినుండియో నిలబడి వున్నాడు. దుకాణదారుని దృష్టి అతనిపైపడింది."ఏమి కావాలో చెప్పు" అన్నాడు.

'ఏమీ వద్దు.'

'అయితే ప్రక్కన మంచో. వచ్చేవాళ్ళకు అడ్డం లే.'

'బిచ్చ మడుక్కోవడానికి వచ్చినట్లున్నా' డన్నా రెవరో.

ఈ మాట వినగానే దుకాణదారునికి కోపంవచ్చింది.'ఫో అవతలికి ఫో. ఎద్దులా వున్నావ్. పని చేసుకోరాదూ. అయినా బిచ్చానికి వేళాపాళా లేదూ' అని కసురుకొన్నాడు.

భిక్షుకు డావలకు వెళ్ళినట్లే వెళ్ళి మరల వచ్చి యధాస్థానంలో నిలబడ్డాడు. దుకాణదారుని దృష్టి అతనిమీద పడగానే 'యాల్నాటిశనిలా మళ్ళీ దాపురించావేం?' అన్నాడు.

'బియ్యం తీసుకుంటావా?'

'ఏవీ చూపించు, ఎలా యిస్తావ్?'

'ముదుగుబియ్యం'

'చూపించవయ్యా.'

భిక్షువు మూట విప్పి బియ్యం చూపించాడు.

బియ్యం చూడగానే దుకాణదారు మూతి విరుస్తూ 'ఇందులో అన్ని రకాల బియ్యమూ యేడ్చినవే. సరే యెంత కిస్తావో చెప్పు.'

'బేడ కిస్తాను.'

'సరి సరి, పట్టుకెళ్లు. అణాకిచ్చే బియ్యం బేడంట. నా కవసరం లేదు పట్టుకుపో. ఇంకెక్కడన్నా అమ్ముకో.'

భిక్షువు హారాన్‌బాబేనని పాఠకులకు వివరించవలసిన అవసరం లేదనుకొంటాను.

హారాన్‌బాబు ఒక చెట్టుక్రింద కూర్చుని ఆ దుకాణదారుని తిట్టుకొంటూ బియ్యం నమలసాగాడు 'ఇన్ని బియ్యం అణాకు యిచ్చే మూర్ఖుడెవరైనా వుంటాడా? ప్రొద్దుటి మొదలు యిప్పటిదాకా కాళ్ళు అరిగిపోయేలా గడప గడపకూ తిరిగితే వచ్చే ఫలితం అణా డబ్బులా? ఈ బియ్యమే నల్లమందుకొట్లో యిస్తే నాలుగురోజులు నిషా చేయవచ్చు.కాని నల్లమందుకొట్టువాడు ముష్టెత్తి తెచ్చిన బియ్యమంటే తీసుకోడు. వాడి కదొక రోగం. పోనీ యీ బియ్యాన్ని యింటికి పట్టుకుపోయేదా? ఈ కాసిని బియ్యం యింటికి పట్టుకుపోతేమాత్ర మేమి సరిపోతవి. వీటి నింటికి తీసుకొనిపోను.' అనుకొంటూ అతను మరల ఆ దుకాణంవద్దకు పోయి 'ఇవిగో తీసుకో బియ్యం' అన్నాడు.

'అణాకంటే యెక్కు విద్వను.'

'సరే, అణాయే యివ్వు.'

'అయితే యీ బుట్టలో పొయ్యి.'

హారాన్‌బాబు మూట విప్పి బియ్యం బుట్టలో పోసి అణా తీసుకొని వెనుకకు మరలాడు. కొంతదూరం పోయి తనలో తానే నవ్వుకోసాగాడు. 'పిచ్చి ముండాకొడుకు, సగం బియ్యం చెట్టుక్రింద కూర్చుని తింటే కనుక్కోలేకపోయాడు' అనుకొంటూ అతను నల్లమందుకొట్టువైపు నడక సాగించాడు.

హారాన్‌బాబు నల్లమందుకొట్లోకి పోయి నల్లమందు తిన్నాడు. గంజాయి త్రాగడం వర్ణించవలసిన ఆవశ్యకత లేదనుకొంటాను. అతని విషయం వదలి యితర విషయాలు తెలుసుకొందాం.

# 12

సుభద అన్నం తిని మూడురోజులైనది. ఆకలితో ఆమెముఖం వాడిపోయింది. కళ్ళు లోపలకు పీక్కుపోయాయి. పొట్ట వెన్నుపూస కంటుకుపోయింది. సంస్కారంలేక జుట్టంతా రేగిపోయింది. చెవులు దిబ్బళ్లుపడుతున్నాయ్. ఆమె విచారంగా లలనవంక చూచి 'ఈ ఆకలి బాధను నే నిక సహించలేనమ్మా!'

లలన కండ్ల నీరుపెట్టుకొని "ధైర్యంగా వుండమ్మా! భగవంతుని దయవలన మంచిరోజులు రాకపోవు" అన్నది.

"భగవంతుని దయవలన మనకు మంచిరోజు లెప్పుడు వస్తవోనమ్మా! నాదేమున్నదిగాని చిన్నపిల్లలు మీ కష్టాలు చూస్తుంటే గుండె తరుక్కుపోతున్నదమ్మా! నా కనులకు చీకట్లు క్రమ్ముతున్నవి. నే నిక గంగలోపడి ప్రాణత్యాగం చేద్దామనుకొంటున్నాను. నేను పోయినాక యిల్లు చక్కగా దిద్దుకో అమ్మా! పోట్లాడుకోకుండా అందరూ సుఖంగా జీవించండి. ఇంట్లోవున్న వస్తువులన్నీ తాకట్టుపెట్టి, యింటింటా చాటవ్పులుచేసి యీ జీవయాత్ర నే నిక గడపలేనమ్మా" అంటూ ఆమె కన్నుల నీరు నింపింది. బిడ్డల కష్టాలను చూచి తల్లిప్రేమ ఒక్కసారిగా పెల్లుబికింది.

సుభద క్రౌంచపక్షిలా విలపించసాగినది. ఆమెదుఃఖానికి రాళ్లు గూడా మెత్తబడుతవి. ఇన్ని సంవత్సరాలకుగాను నే డామెధైర్యం సన్నగిలింది. పోయిన ధైర్యాన్ని కూడదీసుకోలేకపోతున్నది. శాంత మూర్తికి కోపం వస్తే ప్రళయం సంభవిస్తుంది. ఇప్పుడు సుభదకు యీ దశే సంభవించింది. లలన ఘోర సంకటావస్థలో పడింది. తల్లికి ధైర్యం చెప్పడాని కామె అసమర్థురాలైనది.

రాత్రి సమయము. ఎల్లెడలా నిశ్శబ్దత తాండవిస్తున్నది. తల్లీ కూతుళ్ళిరువురూ నిద్రాదేవివాడిలోకి చేరారు.

హారాన్‌బాబు గత ఆరురోజులనుండి యింటికి రావడంలేదు. సుభద అతనికొరకై చింతిస్తున్నది. ఆనాడు లలన అన్న మాటలకు. చేసిన అవమానానికి కోపంవచ్చి ఆత్మహత్య చేసుకొంటాడేమోనని భయ పడుతున్న దామె."ఏ వ్యక్తిఅయినా తన కన్న సంతానమే తనను తిరస్క రిస్తే తప్పక ఆత్మహత్యచేసుకొంటాడు" ఈ మాట వుండి వుండి సుభద మెదడును కలతపెట్టసాగింది. ఇవాళగూడా ఆమెకు యీ మాట గుప్తికి రాగానే ఉలిక్కిపడిలేచింది. మెల్లగా లలనను లేపి "అమ్మా! వారీ ప్రపంచంలో లేరు" అన్నది.

లలనకు కన్నంటిన కారణంగా తల్లి చెప్పిన మాట ఆమెకు సరిగా వినిపించలేదు. కండ్లు నులుముకొని "ఏమిటమ్మా! అన్నావ్?" అన్నది.

"వారీ ప్రపంచంలో లేరన్నట్లు కలవచ్చి మెలకువవచ్చిం దమ్మా!"

"కలలో వచ్చింది యిలలో జరగదంటారు. ఇలాంటి అశుభ వాక్యాలు మాట్లాడకమ్మా!" అంటూ లలన యేడ్వసాగింది. లలన యేడుపు చూచేసరికి సుభదకుకూడా యేడుపు వచ్చింది. ఇలా తల్లీ కూతుళ్ళ యేడుపులతో తెల్లవారింది.

ప్రాతఃకాలసమయం. సూర్యోదయమై అప్పుడే బారెడు ప్రొద్దు కూడా యెక్కింది. పదిగంటలు కొట్టారు. కృష్ణాదేవి స్నానంచేసి కుశల ప్రశ్న లడగడానికై హారాన్‌బాబు యింటికి వచ్చింది. వాకిట్లో అడుగు పెడుతూనే "చెలీ చెలీ, యెక్కడున్నావమ్మా!" అని పిలిచింది.

"ఇద్దిగో వస్తున్నా నక్కయ్యా! కూర్చోండి."

"కూర్చోవడానికి తీరికెక్కడిది! ఆలస్యమైనది. పోవాలి. ఇల్లు యెలా గడుస్తున్నదో అడిగిపోదామని వచ్చాను."

సుభద మాట్లాడలేదు.

"ఇలా చూడమ్మా!" అన్నది కృష్ణాదేవి. మెల్లగా సుభద ఆమెవద్దకు వచ్చి నిలబడింది.

"హారాన్ సంగతేమైనా తెలిసిందా?"

"లే దక్కయ్యా."

"ఎన్నిరోజులనుండి యింటికి రావడంలేదు?"

"ఇంట్లోనుండి బయటకి అడుగుపెట్టి ఆరురోజులైనది."

"పోనీ ఎవరినైనా బ్రాహ్మణపాడ్ పంపించకపోయావా?"

"నేను చెబితే యెవరు వెడతారమ్మా!"

"మరి యీ విషయం యింతకుముందే నాకెందుకు చెప్పలేదు?"

సుభద నిరుత్తరురాలైనది.

కృష్ణాదేవిచంకలో నీళ్ళబిందె వున్నది. అది మాటిమాటికి క్రిందికి జారిపోతున్నది జారిపోతున్న బిందెను సరిజేసుకొంటూ "ఇంట్లో యేమైనా వున్నదా?" అని ప్రశ్నించింది.

"చిల్లిగవ్వ లేదు."

"మరి యిల్లు యెలా గడుస్తున్నది?"

"ఏదోవిధంగా"

"లలనను నావెంట పంపించు."

కృష్ణాదేవి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళినపిమ్మట సుభద లలనను పిలిచి 'అమ్మా! కృష్ణత్తయ్య నిన్ను వారింటికి రమ్మన్నది వెడతావా?' అంది.

"ఎందుకు?"

"ఎందుకో నాకు తెలియదు."

లలన కృష్ణాదేవియింటికి పోయి తిరిగి వచ్చి తల్లి చేతిలో రెండు రూపాయలు పెడుతూ 'అమ్మా, యీ రూపాయలు కృష్ణత్తయ్య యిచ్చింది.' అని చెప్పింది.

"ఇంకేమైనా చెప్పిందా?"

"ఆఁ, నాన్నగారు రాగానే ఆమెకు కబురుచేయమన్నది."

ఆరోజు సుభద చాలాసేపటికివరకూ దుర్గాదేవిపూజ చేస్తున్నది. తులసికోటదగ్గరకూడా పూజచేసుకొని నమస్కరించింది. తరువాత అవసర మైన సామానులు తెప్పించి స్నానానికి గంగానదికి వెళ్ళింది.

ఆరోజున ఫలనకు వేళకు అన్నం దొరికింది. అందుచే ఆమె ఆనం దానికి మేర లేదు. సంతోషంతో గంతులువేస్తూ ఆమె బొమ్మలపెండ్లి చేయడానికని లలితయింటికి బయలుదేరింది. లలిత యిల్లు ప్రక్కపేటలో వున్నది.

హారాన్‌బాబు యింటిలో కాలుపెట్టే సమయానికి విభావరీదేవి యింకా తన నీలి ముసుగును తొలగించలేదు. 'పనిచేయనివాడు యింటికి దొంగ, పన్ను కట్టనివాడు దివాణానికి దొంగ' అన్నట్లు హారాన్ తక్కుతూ తారుతూ చీకట్లోయింట్లో కాలుపెట్టాడు. అతనిలో ఏవిధమైన పరివర్తనం రాలేదు. పరివర్తన మేమైనా కలిగిందంటే అతని బట్టలలో మాత్రమే. అతని బట్టలు చిరిగి జీరండాలై మురికికోడుతూ కంపుకొడుతున్నాయ్.

సుభద హారాన్‌బాబుకు స్నానానికి నీళ్లతోడి భోజనంపెట్టి భోజనమైన పిమ్మట లలనవద్దకు పోయి చిరునవ్వు నవ్వుతూ 'అమ్మా, ప్రొద్దున్నే నీముఖం చూస్తే మంచిదమ్మా! ఇక నిత్యమూ నీ ముఖం చూస్తూ నిద్రలేస్తా నమ్మా' అన్నది.

లలనగూడాచిరునవ్వునవ్వి 'అసలుసంగతేమిటో చెప్పమ్మా!అంది

"ఈ రోజున నాకు కలిగిన ఆనందం నా జీవితంలో యెన్నడూ కలుగలేదు."

తెల్లవారగానే లలనవెళ్ళి నాన్న వచ్చాడని కృష్ణాదేవితో చెప్పింది.

ఈ మాట వినగానే కృష్ణప్రియ మనస్సు ఆనందంతో ఉప్పొంగి పోయింది. 'మీ నాన్న బాగా కులాసాగా వున్నాడా?' అని ప్రశ్నించింది.

"ఆఁ,"

"ఇన్నిరోజులు యెక్కడున్నాడట?"

"నాకు తెలియదు."

"మీ అమ్మ అడగలేదా?"

"లేదు."

"మరి మీ అత్తయ్య అడగలేదా?"

"ఆమెగూడా అడగలేదు. ఆమె నాన్నతో మాట్లాడడమేలేదు."

"ఎందుచేత?"

"నాకు తెలియదు."

"పదకొండు గంటలకు వండినకూర తీసుకొని కృష్ణప్రియ సుభద్ర యింటికి వచ్చింది. వస్తూనే 'సుభద్రా! కూర తెచ్చాను. హారాన్‌బాబుకి పెట్టు' అన్నది"

"సుభద్ర కూరచట్టి తీసుకొని కృష్ణప్రియకు హారాన్‌బాబున్న గది వంక వ్రేలుపెట్టి చూపిస్తూ 'నే నిప్పు డాయనవద్దకు వెళ్ళను. పాచి కొంపన్నా ఊడవలేదు. ఇంట్లో వస్తువులన్నీ చిందరవందరగా పడి వున్నాయి, అంట్లన్నా తోమలేదు' అన్నది."

కృష్ణప్రియ పోతూ పోతూ వెను దిరిగి 'సరే కాని, అతనిని ఒక మాట అడగగలవూ?'

"ఏమి మాట అక్కయ్యా!"

"ఇన్ని రోజులనుండి అత నెక్కడున్నాడో అడుగు'

"అడుగుతా" నన్నట్లు సుభద్ర తల వూపింది.

హారాన్‌బాబు భోజనానికి కూర్చోగానే 'మీ రెక్కడి కెళ్ళా'రని సుభద్ర ప్రశ్నించింది.

హారాన్ నిర్విచారంగా 'భూమిమీదకు, ఆకాశంక్రిందకు వెళ్లాను.'

సుభద్ర తరువాత యేమీ ప్రశ్నించలేదు.

మరునటిరోజు కృష్ణప్రియ సుభద్ర యింటికి మరల వచ్చింది. మధ్యాహ్నసమయం. ఈమాటా ఆమాటా కాసేపు మాట్లాడి 'ఆ మాట అడిగావా అమ్మాయ్' అని ప్రశ్నించింది.

"అడిగాను అక్కయ్యా!"

"ఏమన్నాడు?"

"ఆకాశం క్రింద భూమిమీదనే ఉన్నానని చెప్పారు."

కృష్ణప్రియ వెడుతూ వెడుతూ సుభద్రచేతికి రెండు గుడ్డలతాను లిచ్చి "ఇవి హారాన్‌బాబు కివ్వమ్మా" అన్నది.

సుభద్ర రెండు తానులు తీసుకొన్నది.

కృష్ణప్రియ పోతూపోతూ "ఇదిగో అమ్మాయ్! ఇలా చూడు, ఒక వేళ హారాన్‌బాబు యీ తాను లెవరిచ్చారని అడిగితే నా పేరు చెప్పకు. ఇంకెవరిపేరైనా చెప్పు" అన్నది.

సుభద చిరునవ్వు నవ్వి "ఎందుకని అక్కయ్యా!"

"ఎందుకోలే."

"ఒకవేళ నీపేరే చెబితే"

"నామీద ఒట్టు. నా పేరుమాత్రం బైటపెట్టవద్దు."

రోజులు గడుస్తున్నాయ్. హారాన్‌బాబు యిప్పుడు యింట్లోనుండి బయటకు పోవడంలేదు. ఈ కారణంగా సుభదకు అతనిపై నున్న చెడు భావం, అశంక తొలగిపోజొచ్చినవి. కాని యింటిఖర్చు విషయమై ఆమె మనస్సు యెప్పటిలాగానే బాధపడుతున్నది. ఆమె మనస్సులోనుండి అది లేశమాత్రం కూడా తొలగిపోలేదు. ఎవరైనా ఎప్పుడైనా దయతలచి రూపాయి, అర్ధా యిస్తే దానితో యీ కుటుంబం జరగడం బహుకష్టంగా వున్నది.

సుభద విచారాని కింకొక కారణంకూడా వున్నది. ఛలన ఆమె దుఃఖభారాన్ని ద్విగుణీకృతం చేస్తున్నది. ఆమె కింకా వివాహం కాలేదు, ఇంతవరకు ఆమెవివాహ ప్రయత్నమే జరగలేదు. ఈ దుఃఖాలన్నీ సుభదను కృంగతీసినవి. మాధవుని జబ్బుకంటె ఛలనకు వివాహం కాలేదన్న చింతే ఆమెకు యెక్కువగా వున్నది. ఒక్క లలనతప్ప ఆమె విచారాన్ని గ్రహించినవారెవరూ లేరు.

సుభద యిప్పుడు గంగలోనుండి ఒక్క బిందెడు మంచినీరు తెస్తే అలసిపోతున్నది. ఏదైనా కూరగాయ తరగాలన్నా ఆయాసపడు తున్నది. మొదట్లో ఒక్క పంటిక్రింద పెట్టి పటపట పగలగొరికేది వక్క. ఆ ఊరిలోవా రెవ్వరూ పోటీచేసి ఆమెతో వక్కలుకొరకలేక పోయేవారు. ఇప్పు డామె వక్కను మెత్తగా నూరియిచ్చినా నమలలేక పోతున్నది. ఆమె యిప్పుడు రోజు కొక్కపర్యాయంకంటె భోజనం చేయలేకపోతున్నది. అదయినా నాలుగుగంటల తరువాత.

తల్లిస్థితి తలుచుకొని లలన యేకాంతంగా కూర్చుని యేడ్చేది. ఒక్కొకసారి తలుపులు బిగించుకొని లోపల కూర్చుని రోజంతా ఏడ్చేది. కాని యిలా యేడ్చినందువలన ఫలితమేమీ కన్పించడంలేదు.

# 13

నేడు ఏకాదశి. లలన వంటయింట్లోకి వెళ్ళి తల్లి వంటచేస్తూ వుండడం చూచి "ఏమిటి వేయిస్తున్నావమ్మా!" అని ప్రశ్నించింది.

"ఆవపూలు వేయిస్తున్నానమ్మా"

"వీటిని వేయించి యేం చేస్తావమ్మా!"

ఈ పూలు ఛలన తెచ్చింది. ఆమె స్నానంచేసి వస్తూ వస్తూ యీ పూ లెక్కడో పొలాలలో కోసుకొనివచ్చింది. ఆమెకు తినాలని బుద్ధి పుట్టిందట. ఇంట్లో నూనెకూడా లేదు. అందుచే అరటిఆకుమీద పెట్టి నిప్పుమీద వెచ్చజేస్తున్నాను.'

లలన ఇంకేమీ ప్రశ్నించలేదు.

ఛలన భోజనానికి తయారైనది. వేయించిన ఆవపూలు పళ్ళెంలో వడ్డించగానే వాటినిచూచి మండిపడుతూ 'పూలన్నీ నాశనం చేశా'రన్నది.

'కొద్దిగా మాడినవి, ఫరవాలేదు తినమ్మా.'

'నేను తినను.మాడినవస్తువులంటే మీకు మహాయిష్టమనుకొంటాను అందుకే నా పూ లన్నీ యిలా మాడబెట్టారు. మీరే తినండి. నాకు వద్దు' అంటూ ఛలన మూతిముడుచుకొని పళ్ళెం ఆవతలకు నెట్టింది.

ఛలనకు తినడానికి అనుకూలమైన పదార్థాలు దొరకనప్పుడు ఇల్లంతా యెగిరిపోయేలా గల్లంతుచేస్తుంది. మంచిగాని చెడుగాని పిన్నా పెద్దా లేకుండా అందరినీ దుమ్మెత్తిపోస్తుంది. అనరానిమాటలంటుంది. ఎవరైనా యేమన్నా అనుకొనిపోతారేమోనన్న భయ మామెకు లేదు.

ఆ రోజు గొణుగుకొంటూ ఛలన యెలానో తిండి తిన్నది. ఛలన తిండి తిని ఆవలకుపోయిన తరువాత లలన అమ్మవద్దకువచ్చి 'అమ్మా! ఛలన కీ పాడు అలవాటు బాగుండలేదు. మాటిమాటికి నోరు పారేసు కొంటుంది. చిన్న చిన్న విషయాలకుగూడా అలిగి అందరినీ దుమ్మెత్తి

పోస్తుంది. నీవేమీ మాట్లాడవు. నే నెప్పుడైనా కోపంవచ్చి ఒక్కటిఅంటే వెంటనే పది అంటుంది. మర్యాదకోసమని నోరు మూసుకొని ఊరుకో వలసివస్తున్నది.

లలన అంటున్న యీ మాటలు విని సుభద ఒక్కక్షణకాలం ఆలోచనాసాగరంలో మునిగింది. తరువాత తన మౌనాన్ని భంగంచేస్తూ "చూడమ్మా! చేతికి వున్న ఐదు వ్రేళ్ళూ సమానంగా వుండవు. హెచ్చు తగ్గులుగా వుంటవి. వాటివాటి స్వభావాలుగూడా వేరువేరుగా వుంటాయి. అందుచేత మనం చేతిని విడిచిపెట్టుకుంటామా? అలానే ఛలనగూడా దానికి కావలసిన చిరుతిండి నేను తెచ్చిపెట్టలేకపోతున్నాను, అందుచే అది అనేమాటలకు నోరుమూసుకొని కూర్చోవలసివస్తున్నది."

'ఆడపిల్లలకు, అందునా పెండ్లికాని ఆడపిల్లలు యిలా మాట్లాడడం మంచిది కాదమ్మా! ఎవరైనా వింటే ఏమనుకొంటారు?'

'నీ కన్ని విషయాలు తెలుసమ్మా! వెన్నెలరాత్రులలో నీడ మన వెనువెంటనే వుంటుంది. చీకటి రాత్రులలో అదికూడా మనలను విడిచి పెడుతుంది. ఛలన స్వభావంగూడా సరిగా యిలానే వున్నది. నా కిందు వలన ఆశ్చర్యం కలగడంలేదు. మన కివి చెడు రోజులు. అందుకే నోరు మూసుకొని ఆమె అనే మాటలు పడవలసివస్తున్నది.'

తల్లి చెప్పినదానిలో యదార్థమున్నదని లలన గ్రహించింది. మరుసటిరోజు లలన తల్లి వద్దకుపోయి ఎదురుగా నిలబడింది.

సుభద ఛలనవంక చూచి 'ఏమిటమ్మా సంగతి?' అన్నది.

లలన సుభదచేతికి ఒక రూపాయి యిస్తూ 'రోజు రోజు నేను రూపాయ లెక్కడ తెచ్చేదని కృష్ణత్తయ్య కోప్పడుతుందమ్మా! ఇంక నేను సహాయంచేయలేను. నావద్ద డబ్బేమీ మూలగటంలేదు, కావాలంటే మీ నాన్న సడుగు అంటూ కోప్పడిందమ్మా!'

ఇంటిపనులన్నీ ముగించుకొని లలన రోగగ్రస్తుడైన మాధవుని వద్దకు వచ్చింది.

'ఆ విషయాన్నిగురించి యేమాలోచించా వక్కా?'

'ఏ విషయాన్ని గురించి?'

'అదే. మనం అక్కడకు వెళ్ళే విషయాన్ని గురించి'. లలన ఒక్క క్షణం 'ఆ విషయం చెప్పడానికే వచ్చాను.'

మాధవుడు లేచి కూర్చుని 'అయితే యెప్పుడు వెడదాం?'

'నేను రేపు వెడతాను.'

'మరి నేనో అక్కా?'

'మొదట నేను వెడతాను. తరువాత నీవుకూడా రా.'

ఈమాటవిని మాధవు డావేశంతో 'ఇరువురమూ కలిసివెళ్ళితేనేం?' అన్నాడు.

'ఇరువురమూ కలిసి వెళితే అమ్మ బావురుమని యేడుస్తుంది.'

'నేను ఏడవనుగా'

'గోలచేయకు, ముందు నన్ను వెళ్ళనివ్వు.'

'అయితే మళ్ళీ యెప్పుడు తిరిగివస్తావ్?'

'నీవు వచ్చినతరువాత'

'అయితే నేను వెళ్ళే దెప్పుడు?'

'నేను వచ్చినతరువాత'

'త్వరగా వస్తావా అక్కా?'

'ఆఁ'

'నీవు వెళ్ళినతరువాత అమ్మ యేడుస్తుంది.'

'ఏడుస్తుందనే అనుకొంటున్నాను.'

మాధవుడు కొంచెముసేపాగి 'అయితే అక్కడకు వెళ్ళవలసిన అవసరం లే దక్కా' అన్నాడు

'ఎందుచేత?'

'అమ్మను యేడిపించడం నాకిష్టంలేదు.'

'అయితే నీవు వెళ్ళవా?'

మాధవుడు క్షణం ఆలోచించి 'నేను వెళ్ళ నక్కా!' అన్నాడు.

"అయితే నేను వెళ్లుతాను"

"వెళ్ళక్కా"

"నేను వెళ్ళినతరువాత నీవు యేడవకూడదు"

"అయితే నీవు మళ్ళీ వచ్చి నన్నెప్పుడు తీసుకెళ్ళతావ్?"

"కొన్నిరోజులున్నాక వచ్చి తీసుకువెడతాను"

"అయితే నేను యేడవను"

అటుతిరిగి లలిత కండ్లనీరు తుడుచుకొన్నది. తరువాత యెంతో వాత్సల్యంతో "చూడు నాన్నా ! ఈ మాటలు అమ్మతో చెప్పవద్దు. తెలిసిందా ?" అన్నది.

"చెప్పను"

"ఎప్పుడూ అమ్మ చెప్పినమాట విను. అమ్మకు కష్టం కలిగించే పని యెన్నడూ చేయకు. వేళకు మందు త్రాగు."

"త్రాగుతా నక్కా"

"చూడు మాధవ్ ! సదన్నయ్య నీకు జ్ఞాపకమున్నాడా?"

"ఉన్నాడు"

"ఒకవేళ అతను నిన్ను చూడటానికి వస్తే...."

"వస్తే?"

"అతను వస్తే యెవరూ లేకుండా చూచి "అక్క వెళ్ళిపోయింది" అని అతనితో మెల్లగా చెప్పు."

"అలానే చెబుతా నక్కా"

ఇంతలో సుభద అక్కడకు వచ్చి "చాలా ప్రొద్దుపోయినదమ్మా! పోయి పడుకో" అన్నది.

"ఇవాళ అక్కయ్య వాగదిలో పడుకొంటుం"దన్నాడు మాధవుడు.

ఆ సమయంలో మాధవుడు లలిత తనను విడిచి యెక్కడకూ వెళ్ళకూడ దనుకొంటున్నాడు.సుభదకూడా తలవూపి "సరే, అక్కయ్య నీ గదిలోనే పండుకొంటుంది. నే నవతలగదిలో పండుకొంటాను."

సుభద అక్కడనుండి వెళ్ళిపోయింది. తరువాత లలితా మాధవు లిరువురూ చాలాసేపు మాట్లాడుకొన్నారు. మాట్లాడుతూ మాట్లాడుతూ మాధవుడు నిద్రాదేవిఒడిలోకి చేరుకొన్నాడు.

సూర్యోదయమైనది. సుభద నిద్రనుండి లేచి వాకిట్లోకి వచ్చి చూచేసరికి పాచివాకిలి అలానే వున్నది. వాకిలి చిమ్మలేదు. నీళ్ల చల్లలేదు. ముగ్గులుపెట్టలేదు, నిత్యమూ లలిత అందరికంటే ముందే లేచి యీ

పనులన్నీ చేసేది. సుభద మాధవుడున్న గదివద్దకు పోయింది. 'అక్క యెక్కడకు పోయింది నాన్నా!' అని ప్రశ్నించింది.

'నాకు తెలియదు'

'మీ అక్క యెక్కడకు పోయింది?'

'నాకు తెలియదమ్మా'

ఆ రోజు యింటి పనులన్నీ సుభదే చేసుకొన్నది. 'ఎవరింటికైనా వెళ్ళిందేమో నేను పోయి పిలుచుకొని వస్తా' నంటూ ఛలన యిల్లిల్లూ వెదకసాగింది.

'కనిపించలేదు'

ఇంతలో ఛలన వచ్చి 'ఊరంతా వెదికాను. అక్కజాడ యెక్కడా కనిపించలేదు' అన్నది.

అంధకారం ఘనీభవించింది, లలన యింటికి తిరిగిరానేలేదు.

లలన యింటికి తిరిగిరాలేదన్న విషయం హారాన్‌బాబుకి తెలిసింది. 'ఇది దురదృష్టకరమైన విషయం. లలన యెక్కడకు పోయివుంటుంది?' అంటూ అతనుకూడా ఆమెను వెదకడానికై బయలుదేరాడు. ఊరంతా వెదకి అర్ధరాత్రికి కొంపకు చేరుకొని 'ఇది చాల విచారకరమైన విషయం. ఊరంతా గాలించాను. లలనజాడ పత్తా దొరకలేదు. ఆమె యెక్కడకు పోయి వుంటుంది? ఇప్పు డేం చేయాలి? ఇంకా యెక్కడని వెదకను?'

ఆ రోజు సుభద అన్నమూ, నీళ్ళూ ముట్టలేదు. ఆమె 'అయ్యో లలనా, ఎక్కడికి పోయావమ్మా!' అంటూ విలపించసాగింది. తల్లి యేడుపు చూచి ఛలనకూడా యేడువసాగింది. మాధవుడుమాత్రం కదలక మెదలక తన మంచంలో పండుకొనివున్నాడు. ఇంట్లోవాళ్ళ యేడుపులు పెడబొబ్బలు విని సంగతంతా చెపుదామనుకున్నాడు. కాని అక్క 'చెప్పవద్దు' అన్నమాట గుర్తుకువచ్చి ఆగిపోయాడు. తల్లి కనులవెంట కారుతున్న కన్నీరు చూచినా అతని మనసు మెత్తబడలేదు. అతను మౌనంగా పండుకొన్నాడు.

ఇలా యేడుపులు, పెడబొబ్బలతో ఆరాత్రి గడిచింది. బాలసూర్యుని బంగారు కిరణాలు దశదిశలకు బంగారు మలామావేస్తున్నవి. సూర్యాస్త

మయమైనది. రాత్రి గడిచింది. మరల సూర్యోదయమైనది. మరలసూర్య భగవానుడు అస్తాచలాన్ని చేరుకొన్నాడు. కాని లలన ఇంటికితిరిగిరాలేదు.

ఈ విషయం ఊరిలోవారందరికీ తెలిసింది. ఆమెయొక్క మంచి స్వభావాన్ని నలుగురూ నాలుగువిధాల పొగడసాగారు. ఆమెయెడ తమ కున్న ప్రేమానురాగాలను వ్యక్తంచేయజొచ్చారు. ఆమె కనిపించలేదన్న విషయం ఊరందరనూ దుఃఖసాగరంలో ముంచింది. కొంతమంది కండ్ల నీరు నింపారు. కొంతమంది అనునయవాక్యాలు పలికారు. కొంతమంది లలన యెక్కడికి పోయివుంటుందా అని ఆలోచింపసాగారు. ఇలా నాలుగైదు రోజులు గడిచినవి.

రోగగ్రస్తుడైన మాధవుని మంచందగ్గర కూర్చున్నా సుభదకు దుఃఖమాగేదికాదు. కాని మాధవుని స్థితి తలచుకొని దుఃఖాన్ని దిగమింగేది. సుభద తన దుఃఖాన్ని అతనికి తెలియనిచ్చివుంటే అతను తప్పక తన రహస్యాన్ని బయటపెట్టివుండేవాడు. అమ్మ ఏడవకపోవడంచూచి అతను తన రహస్యాన్ని బయటపెట్టలేదు.

అందరూ ఏడుస్తుంటే మాధవు డిదేమిటా యిలా మౌనంగా వూరుకొంటున్నాడని సుభదకు ఆశ్చర్యమేసింది. అతడు లలనను గురించి అడగడేం? బహుశా లలన యెక్కడకు వెళ్ళిందీ మాధవుడికి తెలిసి వుంటుంది. కాని యీ విషయాన్ని గురించి మాధవుని ప్రశ్నించడానికి ఆమెమన స్సంగీకరించలేదు.

లలన కనిపించి నేటికి ఆరురోజులైనది.

నందమల్లాహీన్ చేపలు పట్టుకొంటున్నాడు. చేపలు పడుతూ పడుతూ అతను రేవుదాటి కొంచెం అవలికి పోయాడు. అక్కడ డొంక ఎర్రని చీర పడివున్నది. చీర సగం నీటిలో నున్నది. మిగతాసగం వొడ్డున నున్నది. చీరమీద ఇసుక పొరవేసింది.

మల్లాహీన్ ఇల్లు హారాన్‌బాబు ఇంటిసమీపముననే యున్నది. లలన యిలాంటి ఎర్రచీరకట్టుకోవడ మతను చాలాసారులు చూచాడు. ఈ చీర లలనదేమోనని సందేహించాడు. పరుగెత్తుకుంటూ వచ్చి విషయమంతా రాసమణితో చెప్పాడు.

రాసమణి యీ మాటలు వినగానే అక్కడకు వెళ్ళింది. చీరమీద ఆమె దృష్టి పడగానే చీర లలనదేనని గుర్తించింది.

రాసమణి గుండెలు బాదుకొంటూ చీర ఇంటికి తెచ్చింది. సుఖద ఛలన, హారాన్‌బాబు, యింకా చుట్టుపట్లనున్నవారంతా చీరసుచూచి లలనదే నని గుర్తించి విచారింపసాగారు.

ఆ చీరమీద లలన తన పేరు కుట్టుకొన్నది. ఆ పేరు చూడగానే అందరకూ లలన ఆత్మహత్యచేసుకొన్నదనే దృఢవిశ్వాసం కలిగింది.

సుఖద స్మారకంలేకుండా పడిపోయింది. హారాన్‌బాబు కుమార్తె లలన ఆత్మహత్యచేసుకొన్నదనే విషయం క్షణంలో ఊరంతా పాకి పోయింది.

# 14

సురేంద్రనాథ్‌చౌదరి నారాయణపురం జమీందారు. ఆరోగ్యం చెడిందని భావించి గాలిమార్పు జరగకపోతే మంచమెక్కవలసివస్తుందను కొన్నాడు.

సురేంద్రనాథ్ వయస్సు పాతిక సంవత్సరాలుంటుంది. అతను షోకిల్లా పురుషుడు, పూలరంగడు. స్నేహితులుకూడా చాలామంది వున్నారు. ఇద్దరు ముగ్గురు స్నేహితులను దగ్గరకు పిలిచి 'నాకు అస్వస్థ తగా నున్నది. గాలిమార్పుకోసమని యెక్కడకైనా పోదామనుకొంటు న్నాను. మీ రేమంటా' రని ప్రశ్నించాడు.

సురేంద్రుడన్న ఈ మాటలు వినగానే వారు 'నిజంగానే మీరు అస్వస్థులుగానున్నట్లు కనపడుచున్నారు. మేము మొదట్లోనే ఈ విషయం తమతో మనవిచేసుకొందా మనుకొన్నాము. కాని తమరు విచారంతో ఆరోగ్యాన్ని మరీ పాడుచేసుకొంటారేమోనని భయపడ్డాం' అన్నారు.

'నాకు డాక్టరుతో, మందుమాకులతో పనిలేదు. గాలిమార్పు జరిగితే పూర్ణారోగ్యాన్ని పొందుతాను. నా కలాంటి విశ్వాసమున్నది.'

అందరు 'అవును. అవు'నంటూ ముక్తకంఠంతో అరిచారు. వాయుసేవనంకంటే మంచి దేముం దన్నారు.

'వాయుసేవనానికి అన్నిటికంటే మంచిస్థలమేదో మీరెరుగుదురా

ఇందులో వారికి ఏకాభిప్రాయం కుదరలేదు. ఒకరొకచోటు మంచి దంటే మరొక రింకొకచోటు మంచిదన్నారు.

కొంచెముసేపు ఆలోచనాసాగరంలో మునిగి సురేంద్రనాథ్ ఇలా అన్నాడు: 'ఏదైనా నదిలో నౌకావిహారంచేస్తే బాగుంటుం దను కుంటాను.'

అందరూ ఐక్యకంఠంతో 'భేష్, భేష్' అన్నారు.

నౌకావిహారానికి తయారుకాజొచ్చారు. ఒక పెద్ద నౌకను బాగా అలంకరించారు. ఒక శుభముహూర్తమున అందరూ నౌకావిహారం బయలుదేరారు. వెంట ఒక నర్తకికూడా వున్నది. జంత్రవాద్యాలన్నీ వున్నవి.

నరంగులు టెంకాయలు కొట్టి, పూజలుచేసి తెరచాప యెత్తారు.

'గాలి అనుకూలముగానున్న కారణంగా ఆ విశాలనౌక వేగంగా పోతున్నది. ఎక్కడ ఆగవలెననుకొంటే అక్కడ లంగరువేస్తున్నారు. సురేంద్రనాథ్ తన స్నేహితులతో కలిసి అనేక స్థలాలు చూస్తున్నాడు. ఇలా చాల రోజులు గడిచినవి. రేవుపటాలన్నీ తిలకిస్తూ వారు కలకత్తా చేరుకొన్నారు. కలకత్తాలో వీరు చాలరోజులుండదలిచారు. కాని సురేంద్ర బాబు ఇందుల కొప్పుకొనలేదు.

'కలకత్తాగాలి యితరచోట్లగాలికంటే మహా చెడ్డది. నా కిక్కడ ఆగడం యిష్టంలేదు. నౌకను ఉత్తరదిశగా పోనివ్వండి' అన్నాడు.

సురేంద్రనాథ్ ఆజ్ఞానుసారంగా వారు కలకత్తాలో ఒక్కరోజు కంటె యెక్కువ గడపలేకపోయారు. నౌక ఉత్తరదిశగా బయలుదేరింది. సురేంద్రనాథ్ స్నేహితులతో 'నౌకావిహారం నాకు మహానందముగ నున్నది. ఈ మందమలయానిలము వలన నా శరీరము పులకాంకితమగు చున్నది. నా ఆరోగ్యంలోకూడ చాల మార్పు వచ్చినది. నా కిప్పు డెంతో ఉత్సాహముగ నున్నది. 'నాకు యింటికి తిరిగివెళ్ళవలెననియున్నది' అన్నాడు.

అందరూ 'సరేనన్నట్లు తలలూపారు.

ఇలా ఒకటి రెండురోజులు గడిచినవి. 'ఇంటినుండి వచ్చి చాలా రోజులైనది. తొందరగా పోవాలి.'అని కొందరు తొందరపడుతున్నారు.

'ఇప్పుడు మీ ఆరోగ్యం బాగా కుదుటపడింది. చాలా ఉత్సాహంగా కనిపిస్తున్నారు. ఇప్పుడు యింటికి తిరిగిపోయినందువలన నష్టమేమీ లే' దన్నారు.

సురేంద్రబాబు చిరునవ్వు నవ్వి 'నష్టమేమీలేదు. కాని నా కిప్పుడప్పుడే యింటికి తిరిగిపోవాలని లేదు. మీరు వెళ్ళవలెననుకొంటే నిశ్చింతగా వెళ్ళండి.'

సురేంద్రబాబుమాటలు వినగానే వారు మనసులు మార్చుకొన్నారు. వా రంతా నౌకావిహారంకోసమని ఆయనవెంట వచ్చారు. ఆయన అండను బ్రతుకుతున్నారు. 'ఒకవేళ ఇల్లు జ్ఞప్తికివస్తేమాత్రం మిమ్మలను వదలిపెడతామా' అన్నారు.

నౌక అక్కడక్కడ ఆగుతూ మరల తన విహారాన్ని సాగించింది. కాని దానిపైనున్న వ్యక్తులు మొదట్లోమాదిరిగా ఆనందాన్ని అనుభవించలేకపోతున్నారు. అందరికి జీవితం దుర్భరంగా తోచసాగింది. కాని యింతమందిలో ఆనంద మనుభవిస్తున్నది ఒక్క సురేంద్రబాబే. ఇంటికి తిరిగి వెళ్ళడం పిరికివాని లక్షణం అన్నవాళ్ళకే యిప్పుడు యింటిమీద గాలి మళ్ళింది. సమయం కొరకై వేచివున్నారు. ఎప్పుడైతే పురుషునికి భార్యాబిడ్డలు గుర్తుకువస్తారో అప్పు డా జీవితం ఎడారి జీవిత మనుకొంటాడు. లోపల లోపలే వెక్కి వెక్కి యేడుస్తాడు. ఒక్కొక్క రోజు ఒక్కొక్క యుగంగా వుంటుంది. సురేంద్రబాబు వెంట నౌకావిహారం వచ్చినవారం దరిస్థితీ యిదేవిధముగ నున్నది. ఇలా నాలుగైదు రోజులు గడచినవి. ఒకరోజు వీరంతా యింటికి తిరిగివెడదా మన్నారు.

సురేంద్రబాబుకి వారిని ఆపడం ఉచితంగా కనిపించలేదు. చందననగరునుండి బయలుదేరడానికి ముందే వారు నౌకనుండి దిగి వారియిండ్లకు బయలుదేరారు. ఇప్పు డా నౌకపై సురేంద్రబాబు అతనిపరివారంమాత్రం మిగిలి వున్నారు. ఇతర వ్యక్తులల్లా సారంగీ వాద్యగాడు, మార్దంగీకుడు నౌకపై వుండిపోయారు. వీరుగాక ఒక గాయకురాలుకూడా వున్నది. సురేంద్రబా బీమెను ప్రాణాలకంటె ఎక్కువగా ప్రేమిస్తున్నాడు. వీరిని వెంటబెట్టుకొని అతను ముందుకు సాగాడు. అతను కలలోకూడా యింటికి తిరిగివెళ్ళవలెననే కోర్కె ప్రకటించలేదు.

సూర్యభగవాను డస్తాచలాన్ని చేరుకోబోతున్నాడు. చరమభానుని అరుణకిరణాలు భూమిని ఆకాశాన్ని జేగురురంగుతో ముంచెత్తాయి. పశ్చిమదిశలో నల్లని మేఘాలు క్రమ్ముకొన్నవి.

సురేంద్రబా బొక సరంగును పిలిచి 'మేఘాలుక్రమ్ముకొంటున్నవి చూచావా?' అని అన్నాడు.

'అవును దొరా,'

'అయితే తుపాను వస్తుందంటావా?'

'ఇందులో అనుమానపడవలసిన విషయమేమీలేదు దొరా! జ్యేష్ఠ వైశాఖమాసములలో తప్పక తుఫానులు వస్తుంటాయి.'

'అయితే నౌకను యెక్కడ కట్టివేద్దాం?'

'దగ్గరలో ఊరుకూడా యెక్కడా కనిపించడంలేదు. నౌకను వొడ్డు పట్టించుదామంటే దగ్గరలో రేవుకూడా కనిపించడంలేదు.'

'ప్రాణాలు పోగొట్టుకొనేకంటె యేదైనా వొడ్డు చేరడం మంచి దంటాను.'

సరంగు చిరునవ్వు నవ్వి 'తమరు భయపడకండి దొరా! నేను నావి కుడను. యెప్పు డేమిచేయాలో నాకు బాగా తెలుసు. తుఫాను రావడానికి ముందే నేను లంగరువేస్తాను. ప్రాణాలు పోగొట్టుకోనవసరంలేదు' అన్నాడు.

సురేంద్రబాబు చిడిముడిపాటుతో 'అదంతా నా కనవసరం.ముందు నౌకను వొడ్డుపట్టించు.'

హరిచరణ్ నౌకను వొడ్డుకు మరలించాడు.

సురేంద్రబాబు నౌకపైభాగంమీదకువెళ్లి కూర్చున్నాడు. నౌకర్లు హుకా తెచ్చి దగ్గరపెట్టారు. హుకాదమ్ములాగి సురేంద్రబాబు నౌకరును పిలిచి 'ఉస్తాదు నిక్కడకు పంపించు' అన్నాడు.

ఉస్తాదు తలమీద పెద్ద తలపాగ ధరించి సురేంద్రబాబువద్దకు వచ్చాడు. అతని గడ్డము బారుగావున్నది. మీసాలు సన్నగా వున్నవి. ఉస్తాద్‌జీ వస్తూనే వంగి జమీందారుగారికి సలాంచేశాడు.

ఇంతలో సురేంద్రబాబుదృష్టి నది ఆవలిగట్టువద్దనున్న యేదో నల్లని వస్తువుమీద పడింది. అది ఆవలిగట్టుదగ్గరగా నీటిపై తేలుతున్నది.

సురేంద్రబాబు దానివంక నిశ్చలదృష్టితో పరికించిచూచాడు. అది వొక మనుష్యుని శిరస్సులాగ గోచరించింది.

ఆ వస్తువు సురేంద్రనాధుని దృష్టిని ఆకర్షించడానికి కారణం ఉస్తాద్‌మాట అతనికి వినిపించకపోవడమే. ఉస్తాద్‌జీ అతనిదృష్టిని తన వైపు కాకర్షించుకోవడానికై 'సర్కార్' అని పిలిచాడు.

ఈసారి ఉస్తాద్ పిలుపు సురేంద్రబాబు చెవికి సోకింది. అతను వెంటనే ఉస్తాద్‌జీవైపుకు తిరిగి 'తుఫానుబెడద తగ్గినసూచనలు కన్పిస్తున్నవి. కాసేపు నృత్యగీతాలతో కాలక్షేపంచేద్దాం.'

'దేవర ఆజ్ఞ శిరోధార్యం'

~~సురేంద్రబాబు దృష్టిని మరల ఆ~~ నల్లనివస్తువాకర్షించినది. అతను రెప్పవేయకుండా దానివంక చూడసాగాడు.

ఒక్క క్షణకాలమైనపిమ్మట ఒక స్త్రీ వచ్చి ఆయనయెదుట నిలిచి నమస్కరించింది. ఉస్తాద్‌జీ తబలా సితారు మొదలైన జంత్రవాద్యాలతో నావ పైభాగానికి చేరుకున్నాడు. సురేంద్రబాబు వారురావడం చూచి 'ఇవాళ జంత్రవాద్యాలు లేకుండా సంగీతాన్ని వినగోరుచున్నా' నన్నాడు. ఉస్తాద్‌జీని క్రిందకు దయచేయమన్నాడు.

ఉస్తాద్‌జీ చిరునవ్వు నవ్వుతూ క్రిందికి వెళ్ళాడు.

ఆ స్త్రీ పేరు జయావతి. ఆమె ఇరువది వసంతాలను చూచినట్లుంటుంది. ఆమె అవయవనిర్మాణం చక్కగా తీర్చిదిద్దినట్లుంటుంది. ఆమె అపురూప సౌందర్యవతి. ఆమె యెప్పటినుండో సురేంద్రనాధుని హృదయంలో పీఠంవైచుకొని కూర్చున్నది. ఆమె వంగయువతి. ఆమె నల్లని చీర ధరించింది. అలంకరణాలేమీ పెట్టుకోలేదు. చూడడానికామె సంసారి స్త్రీలా కన్పిస్తుంది. ఆమెవంక చూడగానే సురేంద్రబాబు మధుర మందహాసంచేస్తూ 'ఏమిటి సంగతి జయా! ఇప్పుడు కన్పిస్తున్నావా? ప్రొద్దుటి నుండి ఏంచేస్తున్నావ్?' అని ప్రశ్నించాడు.

'తలనొప్పిగా వుండి పండుకొన్నాను.'

'తలనొప్పి ఇప్పుడు తగ్గిందా?'

జయావతి చిరునవ్వు నవ్వి 'ఇంకా కొద్దిగా వున్నది.

'అయితే యిప్పుడు పాడగలవా?'

'తమ ఆజ్ఞ'

'నీకు పాడవలెననివుంటే పాడు.'

జయావతి పాట ప్రారంభించింది.

సురేంద్రబాబు అన్యమనస్కుడై పాట వింటున్నాడు. అతని దృష్టి ఆవలిగట్టున నీటిపై తేలుతున్న ఆ నల్లని వస్తువు మీదే వున్నది. జయావతిపాట పూర్తికాకముసుపే 'జయా! అటు చూడు. ఆ నీటిపై తేలే వస్తు వేమిటంటావ్?'

జయావతి వెంటనే తన పాట నాపింది. ఆమె చూపు నా వస్తువు పైకి మరల్చింది. కొంచెంసేపు పరికించి చూచి 'ఏదోనల్లగా కన్పిస్తున్నది.'

'అయితే దుర్భిణితో చూడాలి. ఎవరురా అక్కడ? దుర్భిణీ యంత్రాన్ని యిలా పట్టుకురా.'

దుర్భిణీ నావపైకి వచ్చింది. సురేంద్రబాబు దుర్భిణితో ఆవస్తువును చూచిన తరువాత దాన్ని పెట్టెలో పెట్టాడు.

'అది యేమిటో తెలిసిందా?'

ఏదో శవంలా కన్పిస్తున్నది.'

"శవమా?"

"అవును. పోయి చూస్తేగాని నిర్ధారణగా చెప్పలేను."

"అయితే ఎవరినైనా పంపించండి."

"నేను స్వయముగా వెడతాను."

సురేంద్రబాబు నరంగును చిన్న నావ తీసుకురమ్మని ఆజ్ఞాపించాడు. నరంగు వెంటనే చిన్న నావ తీసుకురాగా వా రిరువురు దానిమీద యెక్కి ఆవలివొడ్డుకు బయలుదేరారు.

వారు ఆవలివొడ్డుకు చేరగానే ఒక స్త్రీ మెడలోతు నీటిలో తేలుతూండడం చూచారు. ఆమె రూపలావణ్యం అత్యంత మనోహరమైనది. నల్లగా తుమ్మెదరెక్కలలాగున్న ఆమె తలవెంట్రుకలు నీటిపై నాట్యం చేస్తున్నవి. వారు ఆమెకు అత్యంత సమీపంగా వెళ్ళారు. కాని ఆ స్త్రీ

ఆ నావలోనికి రావడాని కంగీకరించలేదు. ఆమె మౌనంగా అలానే నిలబడివున్నది.

సురేంద్రబాబు "ఈసమీపంలో యేదైనా గ్రామమున్నదా?" అన్నాడు

"బహుశా లేదు" అని ఆ యువతి జవాబిచ్చింది.

"నీ వెక్కడనుండి వచ్చావ్?"

యువతి మాట్లాడలేదు.

"నీ దీ సమీపములోనున్న యేదైనా గ్రామమా?"

"కాదు, మాది చాలా దూరదేశం."

"నీ విక్కడకు యెందుకొచ్చావ్?"

"మా నౌక మునిగిపోయింది"

"ఎప్పుడు?"

"క్రిందటిరాత్రి"

"నీ వెంటనున్నవా రేరీ?"

"ఏమైనారో తెలియదు."

"అయితే నీ వీ నీటిలో నిలబడి యేంచేస్తున్నావ్? గట్టుకువచ్చి యేదైనా ఊరు కనిపిస్తుందేమోనని యెందుకు వెదకడంలేదు?"

యువతి యీ ప్రశ్నకుకూడా జవాబు చెప్పలేదు.

"సరే. మంచిది మీ ఊ రిక్కడకు యెంతదూరం ఉంటుంది?"

"పదిపంద్రెండు కోసులుండవచ్చు"

"ఎటువైపు?"

సురేంద్రబాబు నౌక యేదిశగా ప్రయాణంచేస్తున్నదో ఆ వైపునకు వ్రేలుపెట్టి చూపుతూ "ఆ వైపు" అన్న యువతి.

'నేనుకూడా ఆ వైపునకే పోతున్నాను. నా నౌకమీద మరొక యువతికూడా వున్నది. నీవు యింటికి వెళ్ళవలెననుకొంటే నా వెంట రా. మీ యింటివద్ద దిగబెడతాను.'

యువతి యీమారుగూడా జవాబుచెప్పలేదు. మామూలు ప్రకారం గానే ఆమె మౌనంగా నిలబడింది.

ఆమె మౌనాన్ని భంగంచేయాలని సురేంద్రబాబు 'సరే తయారవు. వెడదా' మన్నాడు.

'చిత్తం'

'మరి రా'

ఒక్కక్షణమాగి ఆమె 'నా చీర యెక్కడో పోయింది' అన్నది.

ఆ యువతి యింతసేపటినుండి నీటిలోనే నిలిచి ఎందులకు మాట్లాడుతున్నదో సురేంద్రబాబు కిప్పు డర్థమైనది. అతను గట్టుమీదనే నిలబడ్డాడు. ఒక చీర పట్టుకురమ్మని నరంగుని పంపించాడు.

నరంగు చీర తేవడానికై వెళ్ళినపిదప సురేంద్రబా బామెతో యిలా అన్నాడు; 'చీర కట్టుకొన్నతరవాత నావెంట వస్తావా?'

అంగీకారసూచకంగా యువతి తలవూపింది.

నరంగు చీర తెచ్చిఇచ్చాడు. ఆ యువతి చీరకట్టుకొన్నతరువాత అందరు ఆ చిన్ననావయెక్కి పెద్దనావవద్దకు చేరుకొన్నారు. నావవద్దకు చేరుకోగానే ఆ యువతిని జయావతి కప్పగించారు. జయావతి ఆమెను రాత్రంతా తనవద్దనే వుంచుకొని సగౌరవంగా సపర్యలుచేసింది.

మరుసటిరోజు భోజనాలైనపిమ్మట జయావతి ఆ యువతిని 'నీ పేరే' మని ప్రశ్నించింది.

'నా పేరు మాలతి. మరి నీ పేరు?'

'నా పేరు జయావతి. కాని మీ దేవూరు?'

'మహేశపురం'

'మీ ఊరిక్కడ కెంతదూరముంటుంది?'

'పంద్రెండు కోసులు'

'మీ అత్తవారి ఊరు?'

మాలతి చిరునవ్వు నవ్వి 'ఎక్కడాలేదు' అన్నది.

'అయితే నీ కింకా వివాహం కాలేదా?'

'నేను సధవనే. కాని సర్వం సమాప్తిమైపోయింది'

జయావతి విచారసూచకంగా 'ఎన్నిరోజులైనది?' అని ప్రశ్నించింది.

'చాలా రోజులైనది. నాకు జ్ఞప్తిలేదు'

'నీ కింకెవరూ లేరా?'

చేస్తున్నవి. ఉన్నది. బహుశా ఆమెకూడా స్వర్గానికి వెళ్ళివుంటుంది.

'నావ మునిగిపోయిన కారణంగా భయపడి యిలా చెబుతున్నదని భావించింది జయావతి. అందుచే ఆమె నిక ప్రశ్నించడం మంచిదికా దనుకొని వుండబట్టలేక 'మీ రెక్కడకు వెడుతుంటే మీ నావ మునిగింది?' అని ప్రశ్నించింది.

'సాగర ద్వీపానికి'

'నీవెంట వచ్చినవారంతా యేమైనారు?'

'నాకు తెలియదు'

'నీకు యింటికి తిరిగివెళ్ళవలెననే కోర్కె వున్నదా ?'

'వెళ్ళవలెననే అనుకొంటున్నాను.'

'మావెంట వస్తావా?'

'మీ దయ. మీ భర్తగారు నన్ను చాల అనుగ్రహించారు. వారి దయ. నా దేమీ లేదు. నే నెక్కడికి పోవాలో నాకే తెలియడంలేదు.'

జయావతి ఆమెను తనవెంట తీసుకుపోవాలని మొదట్లో వుబలాట పడింది. మాలతిమాటలు వింటుంటే ఆమెకు సందేహం కలిగింది. మాలతిని తనవెంట తీసుకొనిపోవడం తనకు క్షేమకరంకాదని అంతరాత్మ ప్రబోధించసాగింది. సురేంద్రబాబుని గూర్చి—'మీ దేవూ' రని మాలతి ప్రశ్నించింది.

'నారాయణపూర్.'

'ఎక్కడకు వెడుతున్నారు ?'

'వాయుసేవనంకొరకని యిలా నౌకాయానంచేస్తున్నాం. వారి ఆరోగ్యం సరిగా లేదు. అందుకోసమని—'

ఇలా మాట్లాడుకొంటూ యిరువురూ నిద్రపోయారు.

# 15

సురేంద్రబాబుకు రాత్రంతా నిద్రపట్టక పక్కపై అటు నిటు దొర్లుతున్నాడు. అలాగే తెల్లవారిపోయింది. ప్రొద్దుపొడవకముందే ప్రక్కమీద నుండి లేచి ముఖం కడుక్కొని హుక్కా పీలుస్తున్నాడు. గాలి అనుకూలముగా నున్నది, సరంగులు తెరచాప యెత్తారు. నౌక మెల్ల

మెల్లగా ప్రయాణం సాగించింది. ప్రొద్దు పొడవగానే సురేంద్రబాబు జయావతిని పిలిచి "ఆ అమ్మాయి విషయ మేమైనా తెలిసిందా?" అని ప్రశ్నించాడు.

"చిత్రం"

"ఏవూరు?"

"మహేశపూర్"

"మహేశపుర మెక్కడ వున్నది?"

"బహుశా ఇక్కడకు పదిపంద్రెండుకోసులదూరంలో ఉత్తరంగా."

"ఆమె తండ్రిపేరు?"

"ఆమెకు తండ్రిలేదు."

"ఆమె భర్తపేరు?"

"భర్తకూడా లేదు."

"అత్తవారి ఊరేది?"

"అత్తవారి ఊరేదో ఆమె చెప్పలేదు"

"కులమైనా చెప్పిందా?"

"లేదు"

"పేరేమిటి?"

"మాలతి"

"ఆమెకేమీ యిబ్బందిలేకపోతే ఆమెను నావద్దకు పంపించు. నే నామెతో స్వయంగా మాట్లాడాలి."

ఒక్క క్షణకాలమైన పిమ్మట నౌకరు వచ్చి సురేంద్రబాబుతో "గదిలోకి దయచేయండి" అన్నాడు.

సురేంద్రబాబు గదిలోకి వెళ్ళాడు. మాలతి క్రింద పరచివున్న తివాసీమీద తలవంచుకొని కూర్చునివున్నది. జయావతిగూడా ఆమె ప్రక్కనే నిలబడి వున్నది. సురేంద్రబాబు గదిలోకి రాగానే జయావతి అవతలికి వెళ్ళిపోయింది.

తా నక్కడ వుంటే వారివురూ మనసులు విప్పి మాట్లాడుకోవ డానికి భంగమని జయావతి ఆ గదిలోనుండి వెళ్ళిపోయింది. ఆమె యేమూలనైనా పొదిగివుండి వారిమాటలు వింటున్నదేమో చెప్పడం కష్టం.

ఆగదిలో తివాచీ పరచేవున్నది. ఒకమూల కుర్చీవేసి వున్నది. సురేంద్రబాబు గదిలోకివచ్చి కుర్చీలోకూర్చుని మాలతివంక తదేకదృష్టితో చూడసాగాడు. ఆమెముఖంలో విషాదరేఖలు స్పష్టంగా కన్పిస్తున్నాయి. అయినప్పటికీ ఆమెముఖాకృతిలోని లావణ్యం, మార్దవం తగ్గలేదు. ఆమె శరీరసౌష్టవాన్ని చూచి అతనిశరీరం పులకరించింది. గంధర్వలోకాన్నుంచి దిగివచ్చిన గంధర్వకన్యగా భావించాడు.

ఈమె విధవా? లేక సధవా? ఈమె జాతి ఏమిటి? అని సురేంద్రనాథ్ ఆలోచింపసాగాడు. తుదకు పొడిదగ్గుదగ్గి గొంతు సవరించుకొని 'మీ నాన్నగారి పేరేమి'టన్నాడు.

"నా తండ్రిపేరు హారాన్‌చంద్ర ముఖోపాధ్యాయ."

"ఆయన యింటివద్ద నున్నాడా?"

"లేదు"

ఈమాట వినగానే అతను మరణించాడనుకొన్నాడు. సురేంద్రనాథ్ "అయితే మీ యింట్లో యింకెవరెవరున్నారు?" అనడిగాడు.

మాలతి కొంచెంసేపు మౌనం వహించి తరువాత "బహుశా మాయింటిలో యెవరూ వుండరు" అన్నది.

ఇంతవరకు నీవెక్కడ వున్నావ్?"

"ఇంటివద్దనే వున్నాను. మేము సాగరద్వీపం వెడదామని బయలు దేరాం. కాని మార్గమధ్యంలో యీ దుర్ఘటన సంభవించింది."

"నీ పెండ్లి యే ఊరిలో జరిగింది?"

"కాశీపాద్‌లో."

"మీ అత్తవారింట్లో యెవరున్నారు?"

"బహుశా యెవరోవొకరు వుండి వుంటారు. కాని నే నెవరినీ గుర్తించలేను."

"నీ వక్కడకు యెప్పుడైనా వెళ్ళావా?"

"ఒక్కపర్యాయంమాత్రం వెళ్ళాను."

సురేంద్రబాబు కొంచెంసేపాలోచించి "మీ అత్తవారింట్లోనూ యెవరూలేరు. కన్నవారింట్లోనూ యెవరూలేరు. అయితే నీ విప్పు డెక్కడకు వెడతావ్?

"నేను కలకత్తా వెడతాను"
"కలకత్తాలో నీ కెవరున్నారు?"
"ఎవరూ లేరు"
"అయితే నీవు కలకత్తాలో యెక్కడకు వెడతావ్?"
"ఎవరింటికైనా సరే వెడతాను."
"అదేమిటి?"
మాలతి మాట్లాడకుండా కూర్చున్నది.
"నీవువంట చేయగలవా?"
"చిత్తం"
"అయితే కలకత్తాలో ఎక్కడయినా వంటపని చేసుకు బ్రతుకుదామనుకుంటున్నావా?"
"చిత్తం"
సురేంద్రబాబాలోచించి 'కలకత్తాలో కాకుండా యింకెక్కడైనా పని దొరికితే చేస్తావా?' అనడిగాడు.
అనంగీగార సూచకంగా మాలతి తలూపింది.
"పోనీ వొక్కమాటడుగుతాను చెప్పు. కలకత్తాలో సంపాదించే దానికంటే రెండురెట్లో మూడు రెట్లో జీతం ఇతరత్రా దొరుకుతుందంటే పని చేస్తావా?"
లేదన్నట్లు మాలతి తల వూపింది.
సురేంద్రబాబు ఒక నిట్టూర్పు విడిచాడు. అతని ముఖం మాడిపోయింది. మాలతి అతని ముఖంవంక చూచి 'బహుశా నా మాట అతనికి రుచించలేదు కాబోలు'ననుకొన్నది. అతని సంతాపానికి దేకారణంకావచ్చు.
సురేంద్రబాబు ఇంటికప్పుమీద దృష్టినిలిపి 'క్రొత్తవాళ్ళకు కలకత్తా మంచి ప్రదేశంకాదు. నీవు నీ యిష్టంవచ్చినపని చెయ్యి. కాని నీవు చాలజాగరూకతతో మెలగవలసి ఉంటుంది. ఇంకొక్కమాట చెప్ప దలచాను. నా పేరు సురేంద్రనాథ చౌదరి. నేను నారాయణపురం జమీందారుని. నీ కవసరంకలిగినప్పుడు నావద్దకు నిరాటంకముగా రావచ్చు. నీకు అవసరంపడినప్పుడు తగిన సహాయంచేయడానికి నే నెల్లప్పుడూ సంసిద్ధమే"

మాలతి శిరస్సు వంచుకొని మౌనంగా కూర్చున్నది.

"ఒక వారంరోజులైనతరువాత మేము కలకత్తా వెడతాము. అప్పటివరకు నీవీ నౌకపైనే ఉండు. నేను కలకత్తా చేరగానే దిగిపోవచ్చు"

సురేంద్రబాబు వెళ్ళిపోయాడు.మాలతి కండ్లనీరు తుడుచుకొన్నది. సురేంద్రబాబు చెప్పినవిషయా లామె మనస్సును కలవరపెట్టాయి. కాని ఆమె కన్నీరు కార్చడానికి వేరే కారణమున్నది. ఆమె సిగ్గువిడిచి అతని నౌకమీద వుంటున్నది. అతను తనకెంతో మేలుచేశాడు. భవిష్యత్తులో గూడా కావలసిన సహాయంచేస్తానని వాగ్దానంచేశాడు. కాని తాను వంటపని చేసుకొని జీవించడానికని కలకత్తా వెళ్ళడంలేదు 'రోగగ్రస్తుడైన సోదరుని, ప్రియమైన తల్లినీ, నిస్సహాయుడైన తండ్రినీ వదలి కేవలం పొట్టనింపుకోడానికనే యిల్లువదలి వచ్చానా? కలకత్తాలో ధనం సంపాయించాలనుకొన్నాను. ఎందుచేతనంటే అలాంటి మహానగరంలో ఏపని చేసైనా సులభంగా డబ్బు సంపాదించవచ్చునని భావించాను. ఇతరచోట్ల డబ్బు సంపాదించలే' ననుకొన్నది.

మాలతి ధనోపార్జనచేసే ఉపాయా లాలోచింపసాగింది. ఆమె రూపలావణ్య మామెకు బాగా తెలుసు. కలకత్తా సర్వసమృద్ధమైన మహాపట్టణం. ఈ సౌందర్యాన్ని ఎక్కువ వెలకు అమ్మవచ్చు. ఇందుకోసమని ఆమె కలకత్తా వెళ్ళదలచింది. అక్కడ నా సౌందర్యాన్ని యెంతోమంది ఆరాధిస్తారు. నన్నెంతో గౌరవ మర్యాదలతో చూస్తారు. ఇప్పుడు నా ఆర్థికస్థితి చాల దుర్భరముగనున్నది. నే నప్పుడు ధనవంతురాలనై పోతాను. దాసదాసీలు నా వెంట వుంటారు. సౌందర్యారాధకులంతా నా వెంట కుక్కల్లా తిరుగుతుంటారు. నా చూపొక తూపులా, వాక్కొక బాకులా పనిచేస్తుంది. ఈ దుఃఖమయ జీవిత మప్పుడు సుఖమయిన జీవితంగా మారుతుంది.

అయితే వీటన్నింటికీ విరుద్ధముగ ఆమె ఈ కన్నీటి సాగరంలో ఎందుకు విహరిస్తున్నది? ఆమెదుఃఖానికి కారణమేమిటి? దీనికి జవాబు ఆమె తప్ప మరెవరు చెప్పగలరు?

మరునటిరోజు నౌక హాలుడ్‌పూరునుండి బయలుదేరింది. మాలతి కిటికీనుండి వెలుపలకు చూచింది. గట్టుమీద ఎవరూ కనిపించలేదు.

ఆమెకి తన ఊరివారెవరైనా కనిపించకపోతారా అనే ఆశతో ఇంకా అలానే చూస్తున్నది. నౌక ఆ గ్రామాన్ని వదలి దూరంగా వెళ్ళిపోయింది. మాలతి కిటికీ మూసి వెక్కి వెక్కి ఏడువసాగింది. జయావతి ఆమె వద్దకు వచ్చి 'ఇలా ఏడిస్తే ప్రయోజనమేమిటమ్మా? కష్టసమయాల్లో ధైర్యంగా ఉండాలి. వారంతా గంగానదిలో మునిగిపోయి ఉంటారు. వారిక ఈ భూమిమీద నూకలులేవు' అన్నది.

మాలతి గంగానదిలో మునిగిపోయిన తనవారికోసమై దుఃఖిస్తున్నదని భావించింది జయావతి. జయావతి మాలతిని సోదరిలా ప్రేమిస్తున్నది. మాలతి కండ్లనీరు నింపితే, తనూ నింపింది. కలకత్తా చేరుకోగానే మాలతి దిగిపోతుందని దృష్టికిరాగానే జయావతి మరింత విచారింపసాగింది. అనునయ వాక్యాలు చెప్పి మాలతిదుఃఖాన్ని రూపుమాపడానికి ప్రయత్నించింది.

# 16

కాశీలో మరణిస్తే స్వర్గానికి పోతామని హిందువుల దృఢ విశ్వాసం? ఈ కారణంగానే సదానందుని అత్త కాశీకి ప్రయాణమైనది. ఆమె అక్కడనుండి తిరిగి యింటికి రాలేదు. ఆమె మరణించినతరువాత కాశీలోనే దహనసంస్కారాది అంత్యక్రియలు నిర్వర్తించి సదానందుడు హాలుడ్‌పూర్ తిరిగివచ్చాడు.

అతను యింట్లో కాలుపెట్టేసరికి చాల ప్రొద్దుపోయింది., అతను స్వయంగా వంటచేసుకొన్నాడు. భోజనమైనపిమ్మట హారాన్‌బాబు ఇంటి విషయాలు తెలుసుకోవలె ననుకున్నాడు. కాని ప్రొద్దుపోయినకారణంగా హారాన్‌బాబుయింటికి వెళ్ళడం మానుకొని ప్రక్క పరుచుకొని పండుకొన్నాడు.

సదానందుడు కాశీలో ఉన్నన్నాళ్ళూ హారాన్‌బాబుయింటిగొడవలను గురించే ఆలోచిస్తుండేవాడు. హారాన్‌బాబు అసమర్థతను తలుచుకొన్నప్పుడల్లా అతనికి సుభదయొక్క దౌర్భాగ్యస్థితి గుర్తుకువచ్చేది. అస్వస్థురాలైన అత్తగారి సేవలో మునిగికూడా అతను హారాన్‌బాబు సంసారపు గొడవలను మరిచిపోలేకపోయేవాడు.

కలకత్తాలో వుండగా ఒక వుత్తరంద్వారా వారి క్షేమసమాచారములు కనుక్కొన్నాడు. అటుపిమ్మట ఇరువురిమధ్య యెటువంటి సమా

చారములు తెలియరావటంలేదు. మరీ ఒక మాసంరోజులనుండి హారాన్ బాబు యింటివిషయాలు బొత్తుగా తెలియరావటంలేదు.

కాశీనుండి తిరిగివచ్చినప్పటినుండీ హారాన్‌బాబు విషయ మాతని బుర్రలో కలతపెట్టసాగింది. ఈ కారణంగా ఆ రాత్రి అతనికి సరిగా నిద్రపట్టలేదు. శూన్యదృక్కులతో యింటికప్పువంక చూస్తూ ఆలోచింప సాగాడు. 'మేఘాలలో కమలం వికసిస్తుందా లేదా? మట్టితో సంపర్కం లేకపోతే కమల మెన్నటికీ వికసింపలేదని లలన చెప్పింది. ఇది యెంత వరకు సత్యం? మట్టితో సంపర్కంలేకపోతే కమలం వికసింపదని ఆమె కెలా తెలిసింది. ఈ విషయాన్ని గురించి ఆలోచిస్తూ అతను తన్మయా వస్థను చెందాడు. రాత్రి నాల్గవఝాము మొదట్లో అతనికి మట్టిలేకపోయినా కమలం వికసిస్తుందనే విశ్వాసం కలిగింది. కాని స్థాయీరూపంలో కాదు.

సూర్యోదయమైనది. సదానందుడు పూలు, పత్రి విశ్వనాధుని ప్రసాదము తీసుకొని హారాన్‌బాబుయిల్లు చేరుకొన్నాడు. ఇంట్లో కాలు పెట్టగానే అతని దృష్టి సుభదమీద పడింది. ఆమె వాకిలి ఊడుస్తున్నది. సుభద సదానందుని చూడగానే యెంతో ఆప్యాయంగా 'కాశీనుండి యెప్పుడు వచ్చావ్ నాయనా?' అని ప్రశ్నించింది.

'రాత్రి'

'అంతా క్షేమమా?'

'అంతా యెవరున్నారు. అత్తయ్య కాశీలోనే ప్రాణత్యాగం చేసింది.' అన్నాడు సదానందుడు విచారంగా.

'ఏమన్నావ్?'

'అత్తయ్య కాశీలో మరణించింది.'

సుభద కీ విచారకరమైనవార్తఇదివరకు తెలియదు. తనసంసారపు గొడవలతో ఆమె ఇదివరకే దుఃఖసాగరంలో మునిగిఉన్నది. ఇప్పు డీ వార్త ఆమె దుఃఖాన్ని ద్విగుణీకృతం చేసింది. ఆమె ధైర్యాన్ని కోల్పో యింది. మొదలునరికిన చెట్టులా నేలమీద కుప్పలా కూలబడి విలపించ సాగింది. కొంతసేపటికి యెలానో ధైర్యంతెచ్చుకొని 'బాబూ, లలన కూడా లేదు.'

'ఎక్కడకు పోయింది?' అన్నాడు సదానందు డాదుర్దాగా.

'ఇంకెక్కడకు పోతుంది? మనలనందరనూ దుఃఖసాగరంలో ముంచి ఆత్మహత్య చేసుకొన్నది. నేటికి అయిదురోజులైనది. ఆమె కట్టుకొన్న ఎఱ్ఱచీర గంగానదివొడ్డున దొరికింది.' అన్నది సుభద కండ్లు తుడుచుకుంటూ.

సుభదయేడుపు చూచి సదానందునికి కూడా దుఃఖమాగలేదు. మారుమాటలేక యేడుస్తూ ఆమెవద్ద అలా కూర్చుండిపోయాడు. కొంచెం సేపటికి తెప్పరిల్లి 'వెళ్ళేటప్పు దేమైనా చెప్పిందా?'

'ఏమీ చెప్పలేదు'

'హారాన్‌బాబు యెక్కడ?'

సుభద కన్నులొత్తుకుంటూ 'ఎక్కడున్నారో తెలియదు. అప్పు డప్పుడు యింటికి వస్తూంటారు'

'ఏం చేస్తున్నాడు?'

'ఏమి చేస్తున్నారో నాకు తెలియదు.'

'మాధవుని ఆరోగ్యమెట్లున్నది?'

'ఎప్పటిమాదిరిగానే ఉన్నది.'

'మిగతావారంతా ....?'

'మిగతావారంతా క్షేమంగానే వున్నారు.'

సదానందుడు యింటికి తిరిగి వెళ్ళడానికి సిద్ధమవడం చూచి 'నీకు వంట ఎవరు చేస్తారు బాబూ?' అని ప్రశ్నించింది.

'నేనే స్వయముగా వండుకొంటాను.'

'పోనీ యిక్కడ భోజనంచేయగూడదూ?'

'ఎందుకమ్మా! నేను నిముషంలో వంటచేయగలను'

'మా యింట్లో భోజనంచేస్తే....?'

సదానందుడు కొంచెంసేపాలోచించి 'ఇంకెప్పుడైనా తింటాను. ఇవాళ అత్తగారికి తర్పణం వదలాలి' అన్నాడు. సుభద సదానందుని మాటలు నమ్మి యిక ఆ విషయాన్ని అంతటితో విడిచిపెట్టింది.

సదానందుడు యింటికి తిరిగివచ్చి తలుపులుమూసుకుని నేలమీద పండుకొన్నాడు. ఉదయం ఎనిమిది గంటలు కావచ్చింది. సదానందుడు నేలమీద పడుకొని రాత్రి ఎనిమిది గంటలవరకు నిద్రపోయాడు.

వెన్నెల రాత్రి. వెన్నెల పిండారబోసినట్లున్నది. సదానందుడు తలుపుతీసుకొని బయటకువచ్చాడు. అతను శారదాచరణుని యింటివైపు బయలుదేరాడు. శారదాచరణుని యింటి కిటికీవద్ద కొంచెంసే పాగి తరువాత 'శారదా' అని పిలిచాడు.

శారదాచరణుడు యింటిలోనే వున్నాడు. కేక విని కిటికీ తెరచి 'ఎవరు?' అన్నాడు.

'నేనే'

'ఎవరు, సదానందా!'

'ఆఁ'

"ఎప్పుడొచ్చావ్?"

"నిన్న రాత్రి"

"అక్కడే నిలబడ్డావేం? లోపలకు రా"

"నేను లోపలకు రాను. నీవే బయటకు రా"

శారదాచరణుడు అతనివద్దకు వచ్చాడు. అతను దగ్గరకు రాగానే 'లలన ఆత్మహత్యచేసుకొన్నదన్న విషయం నీకు తెలుసునా?' అని ప్రశ్నించాడు సదానంద్.

"అవును. తెలుసు"

"ఆమె ఆత్మహత్యచేసుకొవడానికి కారణ మేమిటో గూడా తెలుసా?"

"ఏవో కుటుంబపు గొడవలతో పడలేక ఆత్మహత్య చేసుకొన్నది"

"నీ కింకేమైనా తెలుసా?"

"నా కింకేమీ తెలియదు."

సదానందునికి కోపంవచ్చింది. కను లెఱ్ఱబారినవి. 'నీవు నీచుడవు. పాపివి, పరమ దుర్మార్గుడవు. కష్టాలలోనున్న నీతోటివారికి సాయపడలేకపోయావ్; ఛీ, నీ జన్మ వ్యర్థం.'

సదానందుని భావభంగిమలు చూచిశారదాచరణునికి భయంవేసింది. అతని భయానికి కారణం లేకపోలేదు. సదానందుడు తాను ఆబాల్య స్నేహితులు. కనుక తన విషయాలన్నీ అతనికి క్షుణ్ణంగా తెలుసు. తన

విషయాన్ని తెలుసుకొన్న తరువాత సదానందుడు క్షమించి విడిచిపుచ్చేరకం కాదు. తన అసమర్థతను ఆధారంచేసుకొనే సదానందు డలా తిడుతున్నా డని గ్రహించాడు చరణ్.

ఒక్కక్షణ మాగి 'చూడు సదా! ఈ మాటలవలన ప్రయోజనం లేదు. నా తండ్రిగా రింకా జీవించేవున్నారన్నసంగతి నీవు మరచిపోలేదను కొంటాను. నేను అస్వతంత్రుడను. ఆయన జీవించివుండగా నే నెవరి కెలాంటి సహాయమూ చేయలేను. అస లామె యెన్నడూ నాతో యీ విష యాన్ని గురించి ముచ్చటించనేలేదు. ఇంట్లో బొత్తిగా జరగడంలేదని ఆమె నాతో యెన్నడూ చెప్పనేలేదు.

సదానందు డాశ్చర్యంగా 'ఆమె నీతో యెన్నడూ చెప్పనేలేదా?' అని ప్రశ్నించాడు.

'లేదు. కాని చాలారోజులక్రితం ఆమె నావద్దకు వచ్చింది....

'ఏమి పనిమీద వచ్చింది? ని న్నెక్కడ కలుసుకొన్నది?'

ఇప్పటికి సుమారు నెలరోజులౌతుంది. రాత్రి చాలా ప్రొద్దుపోయిన తరువాత శివాలయంవద్ద ఆమె నన్ను కలుసుకొన్నది, ఇష్టంలేకపోయినా నే నక్కడకుపోయి ఆమెను కలుసుకొనక తప్పలేదు.

సదానందుడు రుద్ధకంఠంతో 'అనిచ్ఛాపూర్వకంగానే వెళ్ళావా ' అని ప్రశ్నించాడు.

'అవును.'

'తరువాత యేం జరిగింది?'

'తనను పెండ్లిచేసుకొమ్మని బ్రతిమాలింది.'

'ఎవరిని చేసుకోమన్నది?'

'నన్నే'

'మంచిది లలిత నిన్ను పెండ్లిచేసుకొనమని కోరిందా? అందులకు నీ వేమన్నావ్?'

శారదాచరణునకు చిన్ననాటి ముచ్చట్లు గుర్తుకివచ్చి సిగ్గుపడ్డాడు. తలవంచుకొని 'నేను....నేను....నాన్న....గారు జీవించివుండగా....'

క్రోధము, దుఃఖము, ఆవేశము ఒక్కసారిగా సదానందుని చుట్టుముట్టాయి. 'మీ నాన్నగారు జీవించివున్నందువల్ల లాభమేమిటి?' అని గద్దించాడు.

ఈమాట వినగానే శారదాచరణునకు గూడా కోపంవచ్చింది. తన తండ్రిమీద మాటపడితే విని సహించి వూరుకోవడానికి కతను సిద్ధంగా లేడు. 'ఏపనిచేస్తే లాభంవస్తుంది? ఏపని చేస్తే నష్టంవస్తుంది? అనే విషయం మా నాన్నగారికి బాగా తెలుసు. ఆయనగారి తలవెంట్రుకలు యెండవలన తెల్లబడలేదు. ఈ నా పెండ్లి విషయాన్ని గురించి మాట్లాడడానికి గాని, వినడానికిగాని నా కధికారంలేదు। ఆయనగారిమాట కెదురాడి మనంతట మనంస్వతంత్రించడం క్షేమంకాదు. అందుచేత మనయిరువురకు సంబంధం కుదర'దని నే నామెతో స్పష్టంగా చెప్పాను.'

'ఈ మాట విని ఆమె వెనుదిరిగి వెళ్ళిపోయిందా?'

లేదు. ఆమె అలానే నిలబడి 'పోనీ నన్ను చేసుకోవడం ఇష్టం లేకపోతే ఛలనను నీ అర్ధాంగినిగా చేసుకొన' మన్నది.'

'నీ వందులకుకూడా యియ్యకొనలేదా?'

శారదాచరణుకు సదానందుని మనోభావాన్ని గ్రహించాడు. 'నేను నకారాత్మకంగా జవాబివ్వలేదు. కాని, నాన్నగారు వొప్పుకొంటే నే నామెను అర్ధాంగినిగా స్వీకరించడానికి సిద్ధముగనున్నానని స్పష్టంగా చెప్పాను.'

'అయితే మీ నాన్నగారు వొప్పుకోలేదా?'

'లేదు.'

'ఎందుచేత?'

ఈ ప్రశ్నకు జవాబు చెప్పడం నా కిష్టంలేదు. అయినా నీవడిగావు గనుక చెప్పకతప్పదు. శ్రద్ధగా విను. నాన్నగారు నా పెండ్లికి కట్నం రావలె నంటున్నారు. మా నాన్నగారు కోరిన కట్నం హారాన్‌బాబివ్వ గలడా ?'

'సరే, మీ నాన్న నీ పెండ్లికి యెంతకట్నం కావలెనంటున్నాడు?'

'ఆ లెక్క యెంతో నాకు తెలియదు'

'ఆయన కోరినమొత్త మిస్తే పెండ్లిచేసుకోవడానికి సిద్ధమేనా?'

'బహుశా ఆయనకోరిన డబ్బిస్తే యింకేమీ పేచీలుపెట్టడను కొంటాను.'

"మరి నీవు?"

"నేనేమీ పేచీలుపెట్టను. ఆయన కిష్టమైతే నాకూ యిష్టమే."

"సరే. మంచి" దనుకొంటూ సదానందుడు వెనుతిరిగి వెళ్ళిపోయాడు.

అతను వెడుతుంటే శారదాచరణుడు "ఇప్పుడెక్కడకు వెడతావ్? కొంచెంసేపు కూర్చో" అన్నాడు.

"ఉహుఁ"

"సదా! నేను నిర్దోషిని."

"కావచ్చు. దోషి యెవడో, నిర్దోషియెవడో భగవంతుడు నిర్ణయిస్తాడు."

"నీకు కోపంవచ్చినట్లున్నది,"

"లేదు"

ఇంటికి తిరిగివచ్చినతరువాత సదానందు డీ గదిలోనుండి ఆ గదిలోకి ఆ గదిలోనుండి యీ గదిలోకి తిరగసాగాడు. ఇలా కొంతసేపు తిరిగి గంగానదివైపు బయలుదేరాడు. నదీతరంగా లొకదాన్నొకటి నొరుసుకుంటూ వచ్చి వొడ్డుకు తాకుతున్నాయి. సదానందుడు కొంచెం సేపు ఆ దృశ్యాన్ని చూస్తూ కూర్చున్నాడు. కొంచెందూరంలో అతనికి పెద్ద నౌక కనిపించింది. నౌకపోతున్న వేగానికి తట్టుకోలేక నీళ్లపాయలు పాయలై గలగల శబ్దంచేస్తున్నవి. సదానందు డా నౌకవంక చూస్తూ నిలబడ్డాడు.

తరువాత అతను గట్టుమీద కొంచెంసేపు కూర్చున్నాడు. నీళ్ళల్లో కాళ్ళాడిస్తూ ఆకాశంవంక చూచి కూనిరాగాలుతీయసాగాడు.

# 17

వెన్నెలకాంతిలో గంగానది గలగలలాడుతూ ప్రవహిస్తున్నది. సురేంద్రబాబునౌక ఉత్తరదిశనుండి దక్షిణదిశగా పయనిస్తోంది.పరంగులు

తెడ్లసహాయంతో నౌకను వేగంగా నడుపుతున్నారు. ఈతనేర్చిన ఈత గాడు చేతులాడిస్తూ నీటిలో వేగంగా ఈదినట్లు నౌక వేగంగా పోతున్నది.

నౌకపై భాగంలో కూర్చుని సురేంద్రబాబు జయావతితో మాట్లాడు తున్నాడు. మాలతి క్రిందిభాగంలో కూర్చునివున్నది. ఆమె కిటికీలో నుండి గంగానదీతరంగపంక్తులను తిలకిస్తున్నది. ఆమె కన్నులవెంట అశ్రు ధారలు ప్రవహిస్తున్నవి. ఆమె తరంగపంక్తులనుతిలకిస్తూనే అప్పుడప్పుడు కన్నులొత్తుకొనుచున్నది. హాలుడ్‌పూర్ సమీపములోనే వున్నదని ఆమె గ్రహించింది. ఆమెదృష్టి గంగానది వొడ్డుమీదనున్న రావిచెట్టుపైకి మళ్ళింది. రావిచెట్టు సమీపముననున్న రేవు వెన్నెలకాంతిలో స్పష్టంగా గోచరిస్తున్నది. ఆమెదృష్టి రేవుమీదకు మళ్ళింది. నిద్రిస్తున్నట్లు హాలుడ్‌పూ రామె దృష్టిలో పడింది. ఆ ఊరు, ఎడారిలోని ప్రతి యిల్లు, ప్రతి వ్యక్తి ఆమె మనోనేత్రాలకు గోచరించారు.

నిత్యమూ ప్రాతఃసంధ్యల నామె ఆ రేవుకే స్నానంచేయడానికి వచ్చేది. అప్పు డామె లలనరూపంలోవుండేది. ప్రతిరోజూ యిత్తడి బిందెతో ఆరేవునుండే వంటచేసుకోవడానికి త్రాగడానికి నీరు తీసుకు పోయేది. ఆ లలన యిపుడు మాలతిగా మారింది. కాని లలన జీవితగాధ మాలతి మనఃఫలకంమీద నేటికిని అచ్చుగ్రుద్దినట్లున్నది. హారాన్‌బాబు, సుభద, మాధవుడు ఆమెకు మరపురావడంలేదు. వాళ్ళు గుప్తికివచ్చినప్పు డల్లా వెక్కి-వెక్కి యేడ్చేది.

పిచ్చి సదానందుడు గూడా మొదట్లోలాగే మాలతికి అప్పుడప్పుడు గుప్తికివచ్చేవాడు. ఆమె ఆ పిచ్చివాడినిగూడా మరచిపోలేకపోతున్నది. నౌక హాలుడ్‌పూర్ చేరుతుందనగానే ఆమె తన కల్పనా చక్షువులతో ఆ గ్రామవాసుల నెందరిని చూచిందో చెప్పలేం. 'బిందు,కృష్ణత్తయ్య, ఛలన, శైలవతి, రామా, గిరిజ వీరంతా ఆమె కనుల కిలా కనుపించి అలా మాయమైనారు. కాని సదానందుడు మాత్రం ఆమె స్మృతిఫలకంపైనుండి చెరిగిపోలేదు. అతనికంఠస్వరం వుండవుండి ఆమెకర్ణపుటాల్లో ప్రతిధ్వని స్తున్నది. ఆపాట యింకాదవుదవ్వులకు వస్తున్నట్లున్నది. ఆమెకుఆశ్చర్యం కలిగింది. ఏకాగ్రచిత్తంతో పాట వినసాగింది. సదానందునివలె మరెవరైనా పాడగూడదా? అనే అనుమానం కూడా ఆమెకు కలిగింది.

నౌక ముందుకు సాగిపోతూనేవున్నది. మాలతి కిటికీలోనుండి ఎవరో నీళ్ళలో కాళ్ళాడిస్తూ రేవులో కూనిరాగాలుతీస్తుండడం గమనించింది. కాని అతనిని సరిగా గుర్తించలేకపోయింది. అతడు తప్పక సదానందుడై వుంటాడనే గట్టినమ్మక మామెకుకలిగింది, పిచ్చిసదానందుడు తప్ప యింకెవరు అర్ధరాత్రిసమయంలో రేవులోకూర్చుండి కూనిరాగాలు తీస్తారు? మాలతికి మరల కన్నులలో నీరుతిరిగింది. సదానందుని పాటతో పాటు ఆమెకు తన జీవితగాధ గూడా గుర్తుకిరాసాగింది. ఇలా ఆలోచనా సముద్రములో యీదులాడుతూ ఆమె ప్రొద్దుపోయిన సంగతే గమనించలేదు. ఏడ్చి యేడ్చి నిదురపోయింది.

ఆమె కన్నులు తెరచిచూచేసరికి చాల ప్రొద్దెక్కినది. కాని ఆమె ప్రక్కపైనుండి లేవలేదు. ఆమెవొడలంతా విరగగొట్టినట్లున్నది. శిరస్సు పగిలిపోతున్నది. జ్వరంవచ్చింది.

దాసి ఆమెశరీరాన్ని తాకి 'మీకు జ్వరంవచ్చిందమ్మా!' అన్నది.

మాలతి మాట్లాడలేదు.

ఇంతలో జయావతి అక్కడకు వచ్చి ఆమెశరీరాన్ని తాకిచూచి 'కిటికీవద్ద పండుకొన్న కారణంగా చలిగాలి తగిలి తలనొప్పి, జ్వరమూ వచ్చాయి' అన్నది.

'నిద్రవచ్చిన కారణంగా కిటికీతలుపులు మూయలేకపోయాను.' అన్నది మాలతి మందస్వరంలో.

ఈ విషయం సురేంద్రబాబుకుకూడా తెలిసింది. అతను త్వరత్వరగా మాలతివద్దకు వచ్చాడు. వస్తూ తనవెంట హోమియోపతి మాత్రలు తెచ్చాడు. మాత్రలు జయావతిచేతికిస్తూ 'చూడు. ఈ మాత్రలు రెండు గంటల కొక పర్యాయం ఒక మాత్రచొప్పున వెయ్యి. జాగ్రత్తగా చూస్తూ వుండు.' అని చెప్పాడు.

జయావతి మాలతికి దగ్గరగా కూర్చొన్నది. గదికిటికీలన్నీ మూసి వేయబడినాయి.. నౌక ప్రయాణంచేస్తున్నదీ లేనిదీగూడా మాలతికి తెలియడంలేదు. ఆమెబరువుగా కన్నులెత్తి జయావతివంకచూచి 'అక్కా!' అని పిలిచింది.

నేటినుండే ఆమె జయావతిని 'అక్కా' అని సంబోధించ సాగింది. 'అక్కా! నౌక యెంతదూరం వచ్చింది?' అని ప్రశ్నించింది.

'బహుశా యేడెనిమిది క్రోసులు వచ్చామనుకొంటాను.'

'కలకత్తా యింకెంత దూరమున్నది?'

'కలకత్తా చేరటాని కింకా రెండురోజులు పడుతుంది.'

'అప్పటికి నా ఆరోగ్యం కుదుటపడకపోతే?'

జయావతి చిరునవ్వునవ్వి 'ఈ గంగానదిలో పారేసి పోతాం'

ఆమాటకు మాలతిగూడా చిరునవ్వునవ్వింది. కాని యిరువురి నవ్వు లోను కొంచెంభేదమున్నది. 'అలాచేస్తే మంచిదే అక్కా'అన్నదిమాలతి.

ఈమాట వినగానే జయావతికి సందేహంకలిగింది. ఆమె మాట్లాడే మాటల్లో రెండర్ధాలుంటవని ఆమె వూహించనైనా లేదు. 'ఛా. అలాంటి మాట అనగూడదమ్మా!' అన్నది.

మాలతి మాట్లాడలేదు. జయావతి అన్నమాట కామె జవాబుచెప్ప లేదు. తనలోతా నిలా అనుకోసాగింది. భగవంతునిదయవలన జయావతి అన్న మాట యదార్ధంకావాలి. అలా జరగడం మంచిదా? లేదు. ఆమె మరణించాలని కోరుకోవడంలేదు. ఎవరైనా గట్టిగా ప్రశ్నిస్తే చావుకంటె నేను బ్రతికివుండే యెక్కువ కష్టాలనుభవిస్తున్నా నంటుంది. అలా అని చావడానికి వొప్పుకోదు. మరణమంటె ఆమెకు తగని భయం. నేను చావ డానికి వొప్పుకోను అంటుంది.

ఇలాంటి ఆలోచనలతో ఆమె కండ్లనీరునింపింది. జయావతి తన పైటచెరగుతో ఆమె కన్నీరు తుడిచింది. 'తూర్పుగాలి తగిలినందువలన నీకు తలనొప్పి జ్వరం వచ్చింది. నాలుగైదురోజులలో తగ్గిపోవచ్చు. గాబరాపడవలసినపనిలేదు. ఒకవేళ అంతగా తగ్గకపోతే కలకత్తానుండి డాక్టరునో హకీమునో పిలిపిద్దాం. కలకత్తాలో డాక్టర్లకు, హకీముల కేమికొదువ?'

ఏ డాక్టరుతోను, ఏ మందుతోను పనిలేకుండానే నౌక కలకత్తా చేరుకొనేసరికి మాలతిజ్వరం తగ్గిపోయింది. కాని ఆమె యింకా బల హీనంగానే వున్నది. ఆమె నాలుగు లంఘనాలుచేసింది. కలకత్తా రేవుకు

కొంచెము దూరంలో సరంగులు లంగరువేశారు. మాలతి కిటికీలోనుంచి నాలుగువైపులా తిలకించింది. చాలపడవలు, నౌకలు కనిపించినవి. ఆకాశా న్నంటుతున్న రమ్యహర్మ్యాలెన్నో కనిపించినవి. ఆ భవనాలన్నీ ఒక్కొ వరుసక్రమంలోనున్నట్లున్నవి. మాలతికి భయంవేసింది. 'ఇదేనా కలకత్తా నగరం? ఈ మహానగరంలో నా మొరాలకించువారెవరుంటారు? వంచిన నడుం యెత్తడానికికూడా వీలులేకుండా, క్షణకాలం విశ్రాంతి లేకుండా పనిచేస్తున్న వీరంతా నావంక కన్నెత్తి అయినా చూస్తారా? ఏమైనాసరే నే నీనగరంలో కాలుపెట్టితీరాలి. ఏ వుద్దేశంతో నేను సాహసించి ముంద డుగువేశానో, ఏ సౌఖ్యంకొరకు నేను యిహపరాలు రెంటిని కాల దన్నానో, దేనికొరకు నేను నరకకూపంలో పడడానికికూడా సిద్ధపడు తున్నానో....ఇంత తొందరలోనే వాటినన్నిటిని మరచి నా మనోరథాన్ని మార్చుకోగలనా? ఎప్పుడో వొకప్పుడు ఆశ్రయాన్ని విడిచిపెట్టక తప్పదు. చల్లకు వచ్చి ముంత దాచడ మెందుకు? ఇప్పుడు భయపడినందువలన ప్రయోజనంలేదు.

మాలతి వెళ్ళిపోవాలనే కోర్కె వ్యక్తపరిచింది. ఆ మాట విని సురేంద్రబాబు 'నౌక యింకా యిక్కడ నాలుగైదురోజులుంటుంది. పూర్ణారోగ్యం చేకూరినపిమ్మట నీయిష్టంవచ్చినచోటుకు వెళ్ళవచ్చు. నీ విటు వెళ్ళిపోగానే లంగరెత్తి మేమకు వెళ్ళిపోతాం.

ఈ మాట విని మాలతి సురేంద్రబాబుకు మనసులో ధన్యవాదా లర్పించింది. ఇలాంటి ఆశ్రయాన్ని విడిచి నిరాశ్రయమైన క్రొత్తతావులో కాలుపెట్టాలని సాహసించడం మాటలతోపనిగాదు. ఈ విషయాన్ని గురించి ఆమె యెంతగానో ఆలోచించింది. మనస్సుకు నచ్చజెప్పుకో డానికై ప్రయత్నించింది.

మరునటిరోజు జయావతి కలకత్తా చూడాలన్నది. నౌకరు బండి సిద్ధంచేశాడు. జయావతి సురేంద్రబాబును గూడా తనతోరమ్మని ప్రతి మాలింది. కాని అతను వెళ్ళలేదు. మాలతి జయావతివెంట వెళ్ళవలెననే కోర్కెను వ్యక్తపరచింది. కాని అస్వస్థతగా వున్నావని, బలహీనంగా వున్నావని జయావతి ఆమెను తనవెంట తీసుకొనివెళ్ళడాని కియ్యకొన లేదు.

ఒకదాసీని, నౌకరును వెంటబెట్టుకొని జయావతి కలకత్తానగరం చూడటానికి వెళ్ళింది.

మాలతి తన గదిలో పండుకొనివున్నది. సురేంద్రబాబు మెల్లగా ఆ గదిలోకి ప్రవేశించాడు. అతనినిచూచి ఆమె సిగ్గుతో లేచికూర్చున్నది. ఆమెకు కొంచెందూరంలో అతను కూర్చున్నాడు. ఇరువురు చాలసేపు మౌనంగా కూర్చున్నారు. అతను మాలతితో ఏకాంతంగా కొన్ని విషయాయాలు మాట్లాడాలని వచ్చాడు. కాని ధైర్యం చాలలేదు. చివరి కెలాగో ధైర్యంచేసి "ఏం, నీవిక్కడే దిగిపోవడానికి నిశ్చయించుకున్నావా?" అని ప్రశ్నించాడు.

అవునన్నట్లు మాలతి తలవూపింది.

"ఈ విషయాన్నిగురించి బాగా ఆలోచించ్రావా ?"

"ఆలోచించాను"

"ఎక్కడికి పోవలె ననుకున్నావ్?"

"నాకు తెలియదు"

ఈ మాట వినేసరికి సురేంద్రబాబుకు నవ్వువచ్చింది. "ఇంకా నీ వాలోచించేదేమిటి? ఎక్కడికి వెళ్లాలో నిశ్చయించుకోకుండా యెలా వెడతావ్? కలకత్తానగరంలో దిగి- అయ్యో! చక్కని ఆశ్రయం వదలి యీ నిరాశ్రయమైన ప్రదేశంలో కాలుపెట్టానే అని తరువాత విచారపడ తావ్, జాగ్రత్త.నేను నీ కేమీ అడ్డుచెప్పను. నీయిష్టంవచ్చినచోటుకు నిరాటంకముగా వెళ్ళవచ్చు.'

మాలతి యేమీమాట్లాడలేదు. సురేంద్రబాబుకూడా ఒకక్షణ మేమీ మాట్లాడలేదు. తరువాత విచారంగా యిలా అన్నాడు. 'నే నీవిషయాన్ని గురించి నీకంటెయెక్కువగానే ఆలోచించాను. నీవు బ్రాహ్మణవంశంలో పుట్టావు, నీవలన నీచకార్యాలు జరుగరాదు. ఈ పరిస్థితులలో నీ వేమి చేస్తావ్? ఈ విశాలనగరంలో మగతోడులేకుండా నీగౌరవాన్ని కాపాడు కొంటూ ఈ మహానగరంలో జీవించగలవా? నీ వలాంటి ఆపదలలో చిక్కుకొనవనే నా నమ్మకం.'

మాలతి కండ్లనీరునింపింది. సురేంద్రబాబు చెప్పిన మాటలను గూర్చి బాగా ఆలోచించసాగింది. కాని ఆమె కేమీ ఉపాయంతోచలేదు.

'అయితే నీవు వెళ్ళడానికే నిశ్చయించుకొన్నావా?'

మాలతి కండ్లనీరు తుడుచుకొంటూ 'చిత్త' మన్నది.

చాలమంది సురేంద్రబాబు వివేకశూన్యు డనుకొంటారు. కాని యథార్థంగా అతను వివేకశూన్యుడు కాడు. అలా అనుకొనేవాళ్ళు భ్రమ పడుతున్నారన్న మాట సురేంద్రబాబు వివేకశీలుడు. కాని అప్పుడప్పుడతడు 'పిచ్చివాడా యేం' అనుకొనే పనులు చేస్తుంటాడు. మాలతి మనోనిశ్చయాన్ని తెలుసుకొని అయితే నీకు డబ్బుకావాలా?' అన్నాడు.

ఈమాట వినగానే మాలతి కనులలో మరల నీరుతిరిగింది. ఇత నెంతో ధనవంతుడై వుంటాడు. లేకుంటే తన ఆర్థికస్థితిని యెదురొక్కవడానికి సాహసించడు.

'కావాలి' అన్నది మాలతి సిగ్గుతో తలవంచుకొని.

సురేంద్రబాబు మరల నవ్వాడు. ఆమెమనస్సు గ్రహించడానికతని కాస్టేసేపుపట్టలేదు. కాని ఆమెకన్నీరు చూడగానే అతనికి నవ్వు వచ్చింది. ఆడవాళ్ళు తప్పుచేసి దానిని కప్పిపుచ్చడానికిగూడా వగలేడుపులు యేడుస్తారు. ఆ విషయం జ్ఞాపనానికివచ్చి అతనికి నవ్వువచ్చింది. 'చూడు ఎందు కలా దుఃఖిస్తావ్? భగవంతుడు నిన్ను తీరుబడిగా తీర్చిదిద్దాడు. నీవు పోతున్నది కలకత్తా మహానగరం. కలకత్తాలో ఎక్కడచూచినా రూపాయలకు రూపాయలు కనుపిస్తవి. రూపాయలకేమీ కొదువరాదు.'

సురేంద్రబాబన్న ఈమాటలువినగానే మాలతికి తలతిరిగిపోయింది. కండ్లుమూసుకొని గంగానదిలో దూకుదామా అనిపించింది. ఆమె గంగానదిలో దూకి ప్రాణత్యాగం చేసుకోవడానికై సిద్ధపడి యేకారణంచేతనో తటాలున ఆగిపోయింది. అచేతనంగా యెవరి బాహుబంధంలోనో చిక్కుకొంటున్న ట్లామెకు అనుభవంకాజొచ్చింది. కాని ఆ బాహుబంధ మగ్ని జ్వాలగా ఆమెను దహింపసాగింది. మాతృకరస్పర్శలోని మార్దవము మనోజ్ఞత ఆనందము, హాయి ఆమె యిదివరకు చవిచూచివున్నది. ఇందులో కోమలత్వం లేదు. కఠోరత వున్నది. సచేతనావస్థలోకూడ ఆమె శరీరం కంపించసాగింది. కండ్లుతెరచి చూచేసరికి తాను తన ప్రక్కమీద పడుకొని వున్నట్లు సురేంద్రబాబు తనవంక చూస్తున్నట్లు తోచించి. సిగ్గుచే

ఆమె ముఖమువంచుకొన్నది. ముఖానికి చేతులు అడ్డంపెట్టుకొని అటు వైపు తిరిగి పండుకొన్నది.

సురేంద్రబాబు కొంచెముసేపాగి 'చూడు మాలతీ! రేపుపుదయాన్నే నౌక యిక్కడనుండి బయలుదేరుతుంది. నౌకపైనుండి నిన్ను క్రిందకు దిగనివ్వను. నీవు నావెంట రావాలి.'

మాలతి మౌనంగా అతనిమాటలు వింటున్నది. సురేంద్రబాబు తన సంభాషణకొనసాగిస్తూనేవున్నాడు.'మాలతీ!నీవే వుద్దేశ్యంతో కలకత్తా వెళ్ళదలచావో ఆ వుద్దేశ్యం పూర్తిఅవుతుంది.ఆవృత్తి నీ వంశంలోలేదు. నీకు యెంత సంపత్తి కావాలో, ఆనందం కావాలో అదంతా నావద్ద నీకు సులభంగా లభిస్తుంది.'

మాలతి కనులనుండి రెండశ్రుబిందువులు రాలి నేలపైబడినవి. ఆమె వణకసాగింది. సురేంద్రబాబు సస్నేహంగా ఆమెను తన బాహు బంధంలోకి తీసికొని 'నీవునావెంటరా. నేనొట్టి ధనవంతుడను గాక పోయినా బీదవాడను మాత్రంకాదు. నీకయ్యేఖర్చంతా నేను సులభంగా భరించగలను. నేను నిన్నిక్కడ వంటరిగా వదలివెళ్ళితే నీవు జీవించడం కష్టం. నేనుగూడా సంతోషంగా ఇంటికి తిరిగి వెళ్ళలేను.' అంటూ ఆమెను తనదగ్గరకు లాక్కున్నాడు. ఆమెకనుల వెంటకారే అశ్రుజలాన్ని తుడుస్తూ ఆమె పెదవులు ముద్దుపెట్టుకుంటూ 'ఏం, నావెంట వస్తావా?' అని ప్రశ్నించాడు.

మాలతి శరీరం గగుర్పొడిచింది. ఆమె అవయవాలన్నీ కంపింప సాగాయి. ఆమె యిప్పుడు లలనకాదు, మాలతికాదు. ఇప్పు డామె సురేంద్రబాబు సహధర్మచారిణి. ఇప్పుడామె సీత, సావిత్రి, దమయంతే కాదు, రాధా, చంద్రావతికూడ. సౌఖ్యానికాశించి పరుల బాహుబంధాల్లో చిక్కుకొన్నప్పుడు మాన, మర్యాదల ప్రసక్తియెందులకు? ఆమె సురేంద్ర నాథుని బాహుబంధంలో స్వర్ణమూర్తిలా వొదిగిపోయింది. కఠోరమైన ఆ బాహుబంధమిప్పుడు మృదువుగా కన్పించింది. ఇప్పు దది అగ్ని జ్వాలలా తోచటంలేదు. ఏదో మధురానుభూతిని పొందసాగింది. ఆమె స్వర్గసౌఖ్యాన్ననుభవిస్తున్నట్లు భావింపజొచ్చింది.

మాలతి మూతపడిన పెదవులు విడివడ్డాయి. సురేంద్రబాబు వాటిని మాటి మాటికి ముద్దుపెట్టుకున్నాడు. దినావసానసమయం. సూర్యభగవానుడు అస్తాద్రిని చేరుకొంటున్నాడు. ఆ కర్మసాక్షి కిటికీలోనుండి యీ పాపలీలను తిలకిస్తున్నాడు. సూర్యభగవానుని బంగారు కిరణాలు మాలతి ముఖకమలంపైబడి ఆమె సౌందర్యాన్ని ద్విగుణీకృతం చేస్తున్నవి.

సురేంద్రబా బామె పెదవులను మాటిమాటికి చుంబిస్తూ 'ఏం! నా వెంట వస్తావా' అని ప్రశ్నించాడు.

'వస్తాను'

అతడు తన్మయత్వంతో 'ఇప్పుడే వస్తావా'

'మరి అక్క-'

'అక్క యెవరు?'

'మీ అర్ధాంగిని.'

సురేంద్రబాబు కంపితస్వరంతో 'నాఅర్ధాంగినా? ఆమెను చాలా కాలం క్రిందటనే భగవంతుడు తీసుకొనిపోయినాడు.'

'మరి జయావతి?'

జయావతి నా అర్ధాంగిని కాదు.'

'అయితే ఎవరు?'

'ఎవ్వరూకాదు. నీవే నా సర్వస్వానివి'

మాలతి అతని భుజంమీద చెయ్యివేసింది. ముక్తకంఠంతో 'నన్ను నీ అర్ధాంగినిగా స్వీకరించు. నన్నెన్నటికి పరిత్యజించకు' అంది.

'కలలోకూడా పరిత్యజించను'

'అయితే మీవెంట నన్నూ తీసుకువెళ్ళండి'

'పద'

'నేడే'

'ఇప్పుడే'

ఇంతలో 'పరుగెత్తు-పట్టుకో-రక్షించు' అనేకేకలు వినిపించసాగాయి. సురేంద్రబాబు గదిలోనుండి బయటకు వచ్చాడు. అతని వెనుకనే మాలతికూడా వచ్చింది. సురేంద్రబాబు నాల్గువైపులా పరికించి చూచాడు. నదికి ఆవలివైపునా యీవలివైపునా సరంగులు, ఖాలీలు

పరుగెత్తుకొని వస్తున్నారు. ఈగోలకు కారణం చిన్నపడవొకటి స్టీమరుకు గ్రుద్దుకొని ముక్కలు ముక్కలై అందులోనివారంతా మునిగిపోతున్నారు.

సురేంద్రబాబు యీగోలకుకారణమేమిటో వెంటనే గ్రహించాడు. 'అయ్యో! నాజయావతి ఆపడవలోనున్నది ఆమెనీటిలో మునిగిపోతున్నది' అంటూ అతను నీటిలో దుముకబోయాడు. మాలతి అతని చేయిపట్టుకొని వారించింది. అతను పిచ్చివానిలా 'వదలు, నాచెయ్యివదలు. నాజయావతి నీటిలో మునిగిపోతున్నది.' అని అరవసాగాడు.

ఇంతలో పడవలోనివారంతా అదుగుపెట్టారు. సురేంద్రబాబు అచేతనంగా అలానిలబడిపోయాడు.

# 18

సురేంద్రబాబు ప్రకృతిస్థుడై కండ్లుతెరచి 'జయా' అన్నాడు. మాలతి అతని సమీపంలోనే కూర్చుండి అతనికి సేవచేస్తున్నది. అతని కండ్లనీరు తుడుస్తున్నది. చైతన్యవంతుడైనపిమ్మట అతని నోటి వెంట 'జయా' అన్న శబ్దము రావడానికి కారణమేమిటా అని ఆలోచిస్తూ అతనికనులు తుడువసాగెను. సురేంద్రబాబు కనులు తెరచి మాలతి యేమి చేస్తున్నది గమనించలేదు. ఒక్కపర్యాయ మామెవంక చూచి మరల కండ్లు మూసుకున్నాడు.

ఇలా చాలసేపు పడివున్నపిమ్మట సురేంద్రబా బొక నిట్టూర్పు విడచి 'జయవిషయ మేమైనా తెలిసిందా?' అని ప్రశ్నించాడు.

సమీపమున నున్న నౌకరు "లేదు" అని జవాబిచ్చాడు.

"సమాచారము తెలియలేదా? బహుశా ఆమె మరణించలేదుకదా?"

"బహుశా ఆమె మరణించివుండవచ్చు ప్రభూ!"

"ఇప్పు డెంత ప్రొద్దుపోయినది?"

"సుమారు పదిగంటలు కావచ్చు"

'పదిగంటలైనదా? ఇప్పటివరకు యే సమాచారము తెలియనేలేదా?'

నౌకరు నిరుత్తరుడైనాడు.

సురేంద్రబాబు హతాశుడై "మీరంతా వెళ్ళి ఆమెను వెదకండి. గంగానది అంతా గాలించండి."

"చిత్రం" అంటూ నొక రటనుండి వెళ్ళిపోయాడు.

గదిలో మాలతిమాత్రం మిగిలింది. కాని సురేంద్రబా బామెతో నొక్క మాటకూడా మాట్లాడలేదు. మౌనంగా కన్నీరు కారుస్తూ పండు కొన్నాడు. ఆ గదిలో నొక గడియారమున్నది. గడియారం పదకొండు, తరువాత పన్నెండు, తరువాత ఒకటి, రెండు, మూడు, నాలుగు అలా వరుసగా యెన్ని గంటలు కొట్టిందో యిరువురూ గమనించనేలేదు.

సురేంద్రబా బిటునుండి అటు,అటునుండి యిటూ పొర్లసాగాడు. ఎన్ని పొర్లిగింతలు పెట్టినా అతని మనస్సులో రేగిన అశాంతి తగ్గలేదు. మాలతి అతని సమీపముననే కూర్చుండి అతని దురవస్థను తిలకిస్తున్నది. ఆమెకన్నులలోకూడ నీరు తిరిగింది.మధ్యమధ్య కన్నులు తుడుచుకొంటు న్నది ఆమె మనస్సుకూడా వ్యాకులపడింది. సిగ్గుతోపాటు తనను తాను అసహ్యించుకొన్నది. ఆమె గంభీరంగా వర్తమానస్థితిని, భవిష్యత్తును గూర్చి ఆలోచింపసాగింది.

గడియారం అయిదు గంటలు కొట్టింది. స్నానార్థమై గంగానదికి వచ్చేవారి కోలాహలధ్వనులు వినిపింపసాగాయి.

సురేంద్రబాబు మెల్లగా లేచికూర్చున్నాడు. అతడు తన దృష్టిని మాలతిపైకి మరల్చాడు. కొంచెంసేపాగి "వ్యర్థంగా రాత్రంతా మేల్కొ వటం మంచిదికాదు. వెళ్ళి విశ్రాంతితీసుకో" అన్నాడు.

మాలతి లేచి రెండడుగులు వేసింది. సురేంద్రబాబు ఆమెను వెను కకు పిలిచి "ఇప్పుడు వెళ్ళవద్దు. నీతో అవసరమైన విషయాలు కొన్ని మాట్లాడాలి" అన్నాడు.

మాలతి తిరిగివచ్చి తన యథాస్థానంలో కూర్చుంది. సురేంద్ర బాబు కనులు తుడుచుకుని గంభీరంగా "ఎవరి పాపంవలన యీ ఘోర సంఘటన జరిగింది?" అని ప్రశ్నించాడు.

ఈ మాట వినగానే మాలతితలమీద పిడుగుపడినట్లయింది. ఈ ప్రశ్నే అనేక పర్యాయములు ఆమె మెదడులో మెదలసాగింది. ఒక విధంగా యీ ప్రశ్నకు ఆమె యిలా సమాధానము చెప్పుకొన్నది. కాని ఆ జవాబును బైటకు చెప్పుటకు ప్రయత్నించికూడా ఆమె అసమర్థురా

లై నది. దీని పరిణామం ఆమె మౌనంగా వుండిపోవడమే. సురేంద్రబాబు కూడా తన కథనాన్ని వ్యక్తం చేయడానికి అసమర్థుడై నాడు. "మంచిది. వెళ్ళి విశ్రాంతి తీసుకో. ఈ విషయాన్ని గురించి తరువాత మాట్లాడు కొందాం."

మాలతి గదిలోకి వెళ్ళి తన ప్రక్కమీద పండుకొన్నది. ఆమె మనస్సంతా చికాకుగావున్నకారణంగా నిద్రపట్టలేదు. రాత్రంతా ప్రక్కమీదనే పడివున్నది. ఎన్నిమారులు లేచికూర్చున్నదో, యెన్నిమారులు పండుకొన్నదో చెప్పలేము. ముక్కోటి దేవతలనూ స్మరించింది. ఆమె మెదడులో అనేక ఆలోచనలు రాసాగాయి. ఆమె కనులయెదుట జయావతి క్రోధారుణనేత్రాలతో తనవంక చూస్తున్నట్లుగా తోచింది. సదానందుని రాగాలాపాన తనకర్ణపుటాల్లో ప్రతిధ్వనిస్తున్నట్లుగాతోచింది. తరువాత చింకిరిజుట్టులో, మాసినబట్టలతో కండ్ల నీరుకారుస్తూ తనతల్లి సుభద కనుల యెదుట సాక్షాత్కరించింది. చివరకు తన సోదరుడు మాధవుడు వచ్చి తన తలగడవైపు నిలబడి ఏదో తెలియని అజ్ఞానప్రదేశంలోకి వెడదాం రావా అక్కా! అని పిలుస్తున్నట్లు అనుకోసాగింది. మాలతికి వెళ్ళవలెననిలేదు. కాని అతను వెంటపడి బతిమాలుతున్నాడు. ఇలాంటి దృశ్యాలెన్నో ఆమె మనఃఫలకంపై సినిమారీల్సులా తిరిగిపోసాగాయి.

మాలతి లేచికూర్చుని నాల్గువైపులా పరికించిచూసింది. కాని ఆమె కెవ్వరూ కనిపించలేదు. ఉదయభానుని లేతకిరణాలు కిటికీనుండి ఆమె ప్రక్కమీద పడుతున్నాయి. ఆమె గదిలోనుండి బయటికి వచ్చింది.

ఆ రోజు మాలతి సురేంద్రబాబుని సాయంతాలంవరకు చూడలేక పోయింది. తెల్లవారుజామునే అతడు నౌకను వదలి యెక్కడికో వెళ్ళాడు. రాత్రి గడిచిపోయింది. మరల ప్రొద్దుపొడిచింది. సూర్యాస్తమయ మైంది. సురేంద్రబాబు తిరిగి నౌకమీదకు రాలేదు. మూడవనా డతడు తిరిగివచ్చి తన గదిలోకివెళ్ళి తలుపులు బిగించుకొన్నాడు.ఆ రోజుకూడా అలానే గడిచిపోయింది. మరుసటిరోజు తను మాలతిని పిలిపించాడు. మాలతి అతని గదిలోకివెళ్ళి తలవంచుకొని మౌనంగా నిలబడింది.

సురేంద్రడా బెవరికో ఉత్తరం వ్రాయడంలో నిమగ్నుడై వున్నాడు. మాలతి అతనివంక చూచింది, అతనిముఖం వాడిపోయి వున్నది. కను

ఎఱ్ఱగా వున్నవి. తలవెంట్రుకలు ముఖముమీద పడుతున్నవి. బట్టలమీద అక్కడక్కడా బురదమరకలున్నవి. ఈదృశ్యముచూచి మాలతి కంపించ సాగింది.

సురేంద్రబాబు సగము త్తరము వ్రాశాడు. దాని నొకప్రక్కనబెట్టి తలపైకెత్తి మాలతివంక చూచి 'నీ ఆరోగ్యం బాగున్నదా?' అని ప్రశ్నించాడు.

మాలతి తలవంచుకొనే 'బాగున్నద'న్నట్లు తల వూపింది.

'అవైపున కలకత్తానగరమున్నది. మా నౌక నేడే బయలుదేరి వెనుదిరిగిపోతుంది. నీవు నీ యిష్టంవచ్చినచోటికి యధేచ్ఛగా వెళ్ళవచ్చు.'

మాలతి మారు మాట్లాడలేదు. ఆమె కనులవెంట నీరు కార జొచ్చింది. సురేంద్రబాబు ప్రక్కనవున్న ఉత్తరాన్ని తీసుకొని 'ఇక్కడ నా కొక మిత్రుడున్నాడు.నీవీ ఉత్తరాన్ని తీసుకొనిపోయి అతన్నికలుసుకో అతడు నీకు తప్పక సహాయం చేస్తాడు."

మాలతి కన్నీటిబిందు వొకటి తివాసీమీద పడింది. బహుశా సురేంద్రుని దృష్టి ఆ బిందువుపై పడివుంటుంది. 'బహుశా నీదగ్గర యేమీలేదను కొంటాను' అన్నాడు.

'లేదు'

"ఈ విషయం నాకు మొదటనే తెలుసు. ఇదిగో ఈ డబ్బు తీసుకో" అంటూ అతను తలగడక్రిందనున్న మనీపర్సును ఆమెవైపుకు విసరివైచి 'తీసుకో. ఇందులోవున్న డబ్బుతో నీకు సులభంగా సంవత్సరం గడచిపోతుంది. తరువాత భగవంతుడు నీ కేదో దారి చూపించకపోడు.'

మాలతి కనులవెంట నీరు ధారగా ప్రవహించసాగింది.

'నేడు నాజ్ఞాననేత్రం తెరువబడింది.మదోన్మత్తుడనై నేను నీయెడల నీచంగా ప్రవర్తించాను. ఆ పాపఫలాన్నిప్పుడే అనుభవిస్తున్నాను. నా కిప్పుడు జ్ఞానోదయమైనది. ఇందులో నీ దోష మావంతయు లేదు. ఇదంతా నా పాపఫలమే. జయావతి మరణానికి కారణం స్వయంగా నేనే.' ముఖముమీదనున్న చెమటబిందువులను తుడుచుకొంటూ "మాలతీ! జరిగినదేమో జరిగింది. ఇక నే నెన్నటికి యిలాంటి నీచకార్యాలుచేయను.

కొన్నాళ్ళు సన్మార్గవ ర్తనుడనై నా మనస్సుకు శాంతిచేకూరుతుందేమో చూస్తాను."

మాలతి మౌనంగా నిలబడి వున్నది. సురేంద్రబాబు ఉత్తరం వ్రాయడం పూర్తిచేసి దానినిమడిచి పొకకవరులో పెట్టి అతికించి దానిపై చేరవలసినవారి అడ్రసువ్రాసి దానిని మాలతి చేతికిస్తూ 'ఇదిగో యీ ఉత్త రాన్ని తీసుకో. నా మిత్రుడు శ్యాంబజారులో నివసిస్తున్నాడు. శ్యాంబజారుకుపోయి వెతికితే నీ కతడు కనిపించగలడు. బహుశా అతడు నీ కేదైనా మార్గం చూపించగలడు.'

ఆ సమయంలో మాలతి మానసికదశ వర్ణనాతీతం. మాలతి చేయి చాచి ఆ ఉత్తర మందుకొన్నది. ఉత్తరాన్ని అందుకొంటున్న సమయంలో ఆమెచేయి కంపించసాగింది.

"మనీపర్సుకూడా తీసుకో" అన్నాడు సురేంద్రబాబు.

మాలతి మనీపర్సుకూడా తీసుకొని వాకిలివైపుకు ఒక అడుగు వేసింది.

సురేంద్రబాబు కన్నులలో నీరు తిరిగింది. "చూడు మాలతీ! భారతీయ స్త్రీ గౌరవాన్ని నిలబెట్టు. నీ ధర్మాన్ని నీవు చక్కగా నిర్వ ర్తించు."

మాలతి యింకొక్క అడుగు వాకిలివైపుకు వేసింది. సురేంద్ర బాబు కంపితస్వరంతో "నేను చేసిన నీచకార్యాలన్నింటినీ మరచిపో మాలతీ! వాటిని నీ మనస్సులో పెట్టుకోకు."

మాలతి గదిలోనుండి బయటకు వెళ్ళాలని వాకిలివద్దకువచ్చితలుపు తెరచింది. సురేంద్రబాబు కంపితస్వరం మరీ పెద్దదైనది. "మాలతీ! కష్ట సమయంలో నన్ను జ్ఞాపకముంచుకో."

మాలతిగదిలోనుండి వెలుపలకువచ్చింది. సురేంద్రబాబు కన్ను లలో నీరు తిరిగింది. "మాలతీ" అని పిలిచాడు.

మాలతి ఆగిపోయింది.

"మాలతీ" అంటూ సురేంద్రబాబు మరలపిలిచాడు.

మాలతి లోపలకువచ్చి తలుపుపట్టుకొని నిలబడ్డది.

సురేంద్రబాబు కండ్లుతుడుచుకొని "మఱతుమన్నను జయావతి మఱపు రాకున్నది" అన్నాడు.

మాలతికాళ్లు వణకసాగినవి. ఆమె తలుపునానుకొని కూర్చున్నది. సురేంద్రబాబు పిల్లవానివలె యేడుస్తూ "యింక నే నెవరిని చూచుకుని యీ ప్రపంచములో జీవించేది? నీవు నన్ను విడిచివెళ్ళగానే నా ప్రాణవాయువులు అనంతవిశ్వంలో విలీనమైపోతాయి" అంటూ అతను తివాసీ మీద కూలబడ్డాడు.

మాలతి అతని సమీపములోనే కూర్చునివున్నది. అతని తల తన వొడిలో పెట్టుకొని అతని కండ్లనీరు తుడుస్తూ "సరే, నేను మిమ్మి విడిచివెళ్ళనులే" అన్నది.

ఇరువురు చాలసేపటివరకు కన్నీరుకారుస్తూ అలానే వుండిపోయారు. మాలతి మరల అతని కన్నీరు తుడుస్తున్నది. "మాలతీ, నీవానా డన్నమాట జ్ఞాపకమున్నదా?" అని ప్రశ్నించాడు సురేంద్రబాబు.

"ఏ మాట"

"నా చరణదాసివని"

"అవును. నే నెప్పటికీ మీ చరణదాసినే"

"హరిచరణ్" అంటూ సురేంద్రబాబు కేకపెట్టాడు.

"చిత్త" మంటూ సరంగు మారుపలికాడు.

"లంగరుతీసి తెరచాప ఎత్తు"

"ఇప్పుడేనా ప్రభూ?"

"అవును. ఇప్పుడే."

# 19

నౌక కనుచూపులోనుండి దాటిపోయేవరకు సదానందుడు దాని వంక చూస్తూనేవున్నాడు. తరువాత అతడు యింటికి వచ్చి పండుకొన్నాడు. నే డతని మనస్సంతా చికాకుగానున్నది. ఆ రాత్రి అతనికి నిద్రపట్టలేదు. ఉదయాన్నే సుఖదవద్దకు వెళ్ళి "నే నిక్కడ భోజనంచేస్తే మీకేమైనా యిబ్బందిగావుంటుందా?" అని ప్రశ్నించాడు.

సుభద యెండిపోయిన పెదవుల్తో "ఏమి యిబ్బంది నాయనా?" అన్నది.

"నేనుకూడ అదే అనుకున్నాను. నా కెవరూ చుట్టపక్కాలు లేవు. నేటినుంచి నేనుకూడ యిక్కడే భోంచేస్తాను."

సుభద కొంచెంసే పాలోచించి "అలాగే కానివ్వు నాయనా!" అన్నది.

"మా అత్తయ్య పుట్టింటివద్ద ఆమె ఆస్తి వున్నది. అదంతా నాకే చెందుతుంది. ఒకటి రెండు రోజులలో అక్కడకు వెళ్ళి ఆ విషయం తేల్చుకువస్తాను. అదంతా యేదో సరిజూచుకోవాలి."

'మంచిది. సరిజూచుకోకపోతే యెలా నాయనా!'

అయితే యింట్లోవున్న ధాన్యం మీయింట్లో వుంచుతాను. ఇక్కడ వుంచిపోతే పరవాలేదు. ఇక్కడవుంచే దొంగలభయం లేదనుకుంటాను.'

ఈ మాటలోని అర్థాన్ని సుభద గ్రహించింది. 'అయితే ధాన్యం ఇదివర కెవరయినా దొంగిలించారా?' అని ప్రశ్నించింది.

'కాని, నా కిప్పు డెందుచేతనో అనుమానంగా వున్నది.'

సుభద మారుమాటాడలేదు.

రెండుమూడురోజుల వ్యవధిలో సదానందుడు తనయింట్లోవున్న బియ్యమూ, పప్పూ, బంగాళాదుంపలు, కొబ్బరికాయలు, బెల్లం, పాత్ర సామాగ్రి అంతా తెచ్చి హారాన్ బాబు యింట్లో దాచాడు.

'ఇదంతా చూచి లోక మేమనుకొంటుంది?' అన్నది సుభద.

సదానందుడు చిరునవ్వునవ్వి 'ఈ వస్తువులన్నీ నావి. లోకులవి కావు. నే నెక్కడుంటానో, నే నెక్కడ తింటానో అక్కడే నావస్తువులు కూడా వుంటవి.'

సదానందు డిలాచేసినపిమ్మట నలుగురూ నాలుగువిధాల అనుకో సాగారు. కొంతమంది పిచ్చిసదానందాన్ని సుభద వలలోవేసుకొన్న దన్నారు. కొంతమంది సదానందుని పిచ్చిముదిరిపోయిందన్నారు. సుభద సదానందుని కిచ్చి పెండ్లిచేస్తారట, అని కొంతమంది చెప్పుకోసాగారు. ఈ మాటలన్నీ విని సదానందుడు లోలోపల నవ్వుకొనేవాడు. వాళ్ళను

రెచ్చగొట్టడానికై రాగాలాపన మొదలెట్టాడు. 'నేను చావబోయేముందు నీకు రెండెకరాల పొలం వ్రాసియిస్తాలేవోయ్' అంటూ కొంతమందితో ఎగతాళిఆడేవాడు. కొంతమందితో గంభీరంగా 'పిచ్చిపనులు చేయడమే పిచ్చివాళ్ళపని. అందుకు మీరు విచారించకండి' అంటూ వారినోరు మూయించేవాడు. కాని కొంతమంది దుర్మార్గులు లోలోపల బాధపడ సాగారు. భవతారుణ మహాశయున కీ వార్త తెలియగానే సదానందుని పిలిపించి ఉపదేశామృతాన్ని పోశాడు.

భవతారుణమహోదయుని ఉపదేశామృతాన్ని గ్రోలినపిమ్మట సదానందుడు 'జరిగినదేమో జరిగింది. నే నిప్పుడు మా అత్తయ్య పుట్టింటికి వెళ్లుతున్నాను. తిరిగివచ్చిన తరువాత ధాన్యం మీ యింట్లోనే దాస్తాను.' అన్నాడు.

భవతారుణమహోదయు డుగ్రుడై 'సదానందా, నీ కీవిషయము తెలియదు కాబోలు. మీ తండ్రిగూడ నేను చెప్పినట్లు నడుచుకొనేవాడు.' అన్నాడు.

'నేనుగూడ మిమ్ముల నుపేక్షచేయలేదే?'

'అయితే నీ నోటివెంట యిలాంటిమాట లెందుకు వచ్చినవి?'

సదానందుడు భయంతో 'ఉన్మత్తుడనైన కారణంగా మతి స్థిరంగా ఉండ' దన్నాడు.

భవతారుణ మహోదయుడు కనులనుండి అగ్నికణాలను కురిపిస్తూ నీ వగ్నిగుండంలో దుముకబోతున్నా' వన్నాడు.

సదానందుడు చిరునవ్వునవ్వి 'తమరు నన్ను కరుణించకపోతే నేను తప్పక అగ్నిగుండలో పడిపోతా' నన్నాడు.

'ఛీ! నా యెదుటనుండి ఆవలకు పో.'

'మీ ఆజ్ఞ శిరోధార్యము.' అంటూ అతను యీవలకువచ్చి బిగ్గరగా నవ్వసాగాడు. వెంటనే రాగాలాపన మొదలెట్టాడు.

కంగాలీచరణుడు నెత్తిమీద కూరగాయల మూటపెట్టుకొని బజారు పోతున్నాడు. సదానందుడు సంతోషాతిరేకంతో పాడుతున్నపాట విని 'మహా హుంషారుగావున్నావ్! ఏమిజరిగిందేమిటి?' అని ప్రశ్నించాడు.

సదానందుడు చిరునవ్వునవ్వి....గంగూలీ మహోదయుడు యివాళ నాకు మంచి విందు చేస్తాడు.

'ఏమివిందురా నీబొంద'

'అయితే ఆ మూటలోవి యేమిటి?'

'కూరగాయలు'

సదానందుడు ఇందాక తను పాడుతున్న పాటను మరల యెత్తు కొన్నాడు. కంగాలీచరణుడు తనదారిని తాను పోయాడు.

ఇక్కడొకమాట చెప్పవలసిన అవసరమున్నది. 'మనయేవ మను ష్యాణాం కారణం బంధమోక్షయోః' అన్నారు పెద్దలు.

పరాకాష్ఠనందుకొన్న హారాన్‌బాబు భౌతికసుఖాలకు వెనుకటి మాదిరిగానే తన యథాశక్తి దోహదంచేస్తున్నది సుభద్ర. అతను తిరిగి యిస్తాడనే నమ్మకం లేకపోయినా అడిగినప్పుడెలానో తంటాలుపడి పావలో బేడో యిస్తున్నది. ఈ పావలా బేడా ఎలాగైనా తెచ్చియిద్దామనే అభిప్రాయ మతనికి లేశమాత్రంగూడ లేదు. ఇప్పు డతను తలయెత్తుకొని సగర్వంగా వీథులవెంట తిరుగుతున్నాడు. ఎవరినీ పావలా యివ్వమని బేడ యివ్వమని యాచించడంలేదు. అలా అడగని కారణంగా యెవరూ అతనినిజూచి పారిపోవడంలేదు. నే నెవరికీ చిల్లికానీ బాకీలేను. అలాం టప్పుడు వొకరిని చూచి భయపడవలసిన అవసర మేమిటంటూ హారాన్ రొమ్ము విరుచుకొని నడుస్తున్నాడు. అతనికిప్పుడొకరితో అవసరమేమిటి? అతనికున్న కొద్దిపాటి అవసరాలు సుభద్ర కష్టపడి యెలానో తీరుస్తున్నది. 'సదానందుడు వట్టి అమాయకుడు. డబ్బు తీసుకువస్తానని ఊరికివెళ్ళాడు. ఆ డబ్బు తీసుకురాగానే నేనే స్వయంగా నల్లమందు, గంజాయి, వ్యాపారం సాగిస్తాను. బాగా డబ్బుసంపాయించి ఆ పాడుముండ కాళ్యా యినినోరు మూయిస్తాను. నీచకులంలోపుట్టిన ముండకి మంచిమాట లెలా వస్తవి? మంచిబుద్ధులెలా అబ్బుతవి. నన్నుపట్టుకొని 'పోరా నీతిలేనివాడా' అంటూ గోగాకులోని పురుగులా తీసేస్తుందా. చూపిస్తాను నా తడాఖా' అంటూ హారాన్ పగటికలలు కనసాగాడు.

హారాన్‌బా బాలోచన యిలావుంటే పాపం సుభద్ర భర్త యిలా అయిపోయినాడే అనీ, ఛలనకు పెండ్లి కాలేదే అనీ, లలన కనిపించలే

గన్న పుట్టెడు దుఃఖంతో కృంగికృశించిపోతున్నది. హారాన్‌బా బనుభవి స్తున్న ఆనందంలో నూరవవంతు ఆనందాన్నిగూడా ఆమె అనుభవించడం లేదు. అతను భోజనంచేస్తే తాను తిన్నట్లుగానే తృప్తిచెందేది. ఇందులో వున్న ఆనందమేమిటో ఆమెకు తెలియాలిగాని యితరుల కెలా అర్థ మౌతుంది? హారాన్‌బాబు భోజనంచేస్తున్నసమయంలో ఆమెకంటివెంట వచ్చే ఆనందాశ్రువులను చూచి లేశమాత్రమయినా ఆమె ఆనందాన్ని అనుభవిస్తున్నదని మనం భావించాలి. కాని అవి ఆనందాశ్రువులో దుఃఖా శ్రువులో నిర్ణయించగలవారెవ్వరు? వాటిని అర్థంచేసుకోగల వ్యక్తి అదృశ్యురాలై పోయింది. ఛలనకు పెండ్లియీడువచ్చింది. ఈమెకు పెండ్లి చేయవలసిన బాధ్యత తనమీద వున్నకారణంగా సుభద యింకా జీవించి వున్నది. లేకుంటే తన నికృష్టజీవితాన్ని యెప్పుడో సమాప్తంచేసి వుండేది. తా నీ సంసారబంధాన్ని త్రెంచుకొనిపోతే మాధవునిగతి యేం కావాలి?

పరిణామం ఏమవుతుందో చెప్పలేం. కాని మాధవునికిమాత్రం వేళకు మందూ మాకూ అందుతూనేవుంది. సుభద వేకువనే లేచి కస వూడ్చి, గంగానదికి పోయి స్నానంచేసి బిందెతో మంచినీళ్ళు తెచ్చి, వంటచేసి అందరకూ వడ్డించేది. ఇలా రోజులు గడిచిపోతున్నాయి.

మధ్యాహ్నసమయం. సదానందుడు సుభదవంక చూస్తూ 'ఛలనకు పెండ్లి యీడువచ్చిందనుకుంటాను.' అన్నాడు.

'అవును.' అన్నది సుభద ఉదాసీనంగా.

'ఇక ఛలనను యీవిధంగా వుంచడం మంచిదిగాదు.'

'ఆ దుర్గాదేవి దయ.'

సదానందుడు చిరునవ్వు నవ్వి 'అమ్మా దుర్గాదేవి పెండ్లిప్రయత్నం చేయదు.' అన్నాడు.

సుభద మాట్లాడలేదు.

'మన ఛలనను హరమోహన్‌బాబు కొడుకు శారదాచరణున కిచ్చి వివాహంచేస్తే?'

ఈ మాటలోని తాత్పర్యం సుభదకు బోధపడక 'శారదానందుని కిచ్చా?' అని ప్రశ్నించింది.

'అవును'

'ఇది సంభవమా?'

'ఎందుకు కాదు?'

'ఏమో ఆ భగవంతునికి తెలియాలి' అన్నది సుభద నిరాశగా.

సుభద మనోభావాన్ని పిచ్చిసదానందుడు వెంటనే గ్రహించాడు. 'ఈ విషయాన్నిగురించి నేను శారదాచరణునితో మాట్లాడాను. పెండ్లి విషయంలో అత నెంతో ఆసక్తి కనబరిచాడు.'

సుభదముఖంలో పొడచూపిన నిరాశారేఖలు మటుమాయమైనవి. 'ఈ పెండ్లికి అతని తండ్రి వొప్పుకొంటాడా?'

'ఎందుకు వొప్పుకోడు?'

ఈ వివాహానికి శారదాచరణుని తండ్రి యెందుకు వొప్పుకోడో సుభదకు బాగా తెలుసు. ఈ విషయంలో తండ్రీకొడుకులకు మత్తైక్యం లేదనిగూడా తెలుసు. కాని యీ విషయాన్ని సదానందునియెదుట స్పష్టంగా చెప్పడాని కామె వెనుకంజవేసింది. 'అయితే యీ విషయాన్ని గురించి హరమోహన్‌బాబుతో మాట్లాడడానికి యెవరు వెడతారు?' అనే మాటగూడా సదానందునియెదుట అనలేకపోయింది. ఆమె మౌనంగా అతనివంక చూస్తూ కూర్చున్నది.

పిచ్చిసదానందు డామె మౌనాన్ని అర్థంచేసుకొన్నాడు. ఈ విషయాన్నిగురించి శారదాచరణుని తండ్రితో మనం మాట్లాడాలి. ఎలాగైనా అతనిని వొప్పించాలి. వివాహానికి ఇది ముఖ్యావసరం.'

సుభద ఆశ నిరాశల మధ్య కొట్టుకుంటూ'అయితే అతను వొప్పుకొంటాడా?' అన్నది అస్పష్టస్వరంతో.

'నిస్సందేహంగా వొప్పుకొంటాడు.'

'ఎట్లా చెప్పగలవు?'

పిచ్చి సదానందుడు చిరునవ్వునవ్వి 'ఎట్లాగో చెప్పలేను. కాని అతను తప్పకుండా వొప్పుకుంటాడని నిస్సందేహంగా చెప్పగలను.నీవేమీ భయపడవలదు.'

వృద్ధ హరమోహన్‌బాబు పెండ్లికి యెలాగైతే వొప్పుకొంటాడో ఆ వుపాయాలన్నీ యీ సదానందునికి తెలుసు. 'అతనీ పెండ్లికి వొప్పుకొని వెంటనే సిద్ధపడేలా చేస్తాను.'

'మంచిది నాయనా' అంటూ ఆమె లోపలకుపోయి ఒక కప్పులో యున్న టీ నీళ్ళు తీసుకొని వస్తున్నది. ఒక అశ్రుబిందు వా కప్పులో పడింది. వెంటనే కండ్లు తుడుచుకొని 'ఒక్క క్షణం ఆగు నాయనా! మరొక కప్పు పట్టుకువస్తా' నన్నది.

సుభద గదిలోకిపోయి ఒక్క క్షణకాలం యేడుస్తూ కూర్చున్నది. కన్నీటిచుక్కలు నేలపై టప్ టప్ మని రాలుతున్నవి. తరువాత కండ్లు తుడుచుకొని టీ నీళ్ళు వెచ్చబెట్టసాగింది. సుభద కనులవెంట కారేవి యింతకాలంనుండి ఆమె హృదయాన్ని బాధపెడుతున్నవి దుఃఖాశ్రువులు కావు, ఆనందాశ్రువులు. ఏదో అవ్యక్తానందాన్ని అనుభవిస్తూ ఆమె ఆనందాశ్రువులు రాల్చుచున్నది, కాని లలన విరహశోకాన్ని గురించి వొక కన్నీటిబిందువు, భర్త నడవడిని గురించి వొక కన్నీటిబిందువు గూడా రాల్చింది.

టీ నీళ్ళుత్రాగి పిచ్చిసదానందుడు మైదానంవైపు బయలుదేరాడు. అటువైపున అతని పొలంవున్నది. అతని పొలంలో కూలివాళ్లు పనిచేస్తున్నారు. పశువులు హాయిగా మేస్తున్నవి. సదానందుడు చేనుచుట్టూ తిరిగి గట్టుమీదనున్న రావి చెట్టునీడను చతికిలబడ్డాడు. కూర్చుని దుర్గాదేవిని ప్రార్థించాడు. తరువాత చుట్టకాల్చుకొని హరమోహన్‌బాబు యింటివైపు బయలుదేరాడు.

మధ్యాహ్న సమయము. సదానందుడు హరమోహన్‌బాబు యింటి వద్దకు చేరాడు. హరమోహన్‌బాబు కాళ్లుచేతులు కడుక్కొని తాంబూలం సేవిస్తున్నాడు. హుక్కా ప్రక్కనే పొగలు గ్రక్కుతున్నది.

సదానందుని చూడగానే హరమోహన్‌బాబు 'ఏమయ్యోవ్! దారి తప్పి యిలా వచ్చావ్! కనిపించడంలేదు. అసలు ఎక్కడుంటున్నావేమిటి?' అని ప్రశ్నించాడు.

'విశ్వనాథుని దర్శిద్దామని కాశీ వెళ్ళాను.

'అలాగనే విన్నాను' మీ అత్తగారు కాశీలోనే మరణించినదటగా. నీవు కాశీనుండి యెప్పుడొచ్చావ్? రా. అలా నిలబడే వున్నావేం? వచ్చి యిలా కూర్చో.'

సదానందు డతని సమీపంలో కూర్చున్నాడు. సదానందు దేదైనా మాట్లాడదలచుకొంటే ముందు కొండపీటి చేంతాడంత ఉపోద్ఘాత ముండదు. అతనిలో ఆడంబర మేమాత్రమూ లేదు. వివాహవిషయం మాట్లాడుదామని మీ వద్దకు వచ్చాను.' అని నిష్కర్షగా చెప్పాడు.

హరమోహన్‌బాబు చిరునవ్వు నవ్వి 'ఎవరి వివాహవిషయం?' అని ప్రశ్నించాడు.

'ఎవరి వివాహవిషయమో అయితే మీతో మాట్లాడవలసిన అవసర మేమిటి? మీ కుమారుని వివాహవిషయం మాట్లాడదామని వచ్చాను.'

ఈ మాట వినగానే హరమోహన్‌బాబు ముఖంలో గాంభీర్యం గోచరించింది.

హరమోహన్‌బా బడిగే వరాలకు తట్టుకోలేక ఆడపిల్లలను కన్న తండ్రి యెవడూ 'నాపిల్లను మీ పిల్లవాడికి చేసుకోండి' అని అడగడానికి సాహసించలేకపోతున్నారు. సదానందు డివాళ పెండ్లిసంబంధం తీసుకొని తన యెదుటకు వచ్చేసరికి హరమోహన్‌బాబుకు ఆశ్చర్యంవేసింది. సదానందుడు వేళాకోళాలాడే మనిషిగాదు. నిక్కచ్చిమనిషి. కాని కొద్ది రోజులనుండి సదానందునికి దాగా పిచ్చియెక్కినదని లోకం అనుకోవడం వింటున్నాడు. అందుచే ముఖం గంభీరంగాపెట్టి 'ఎవరి వివాహమయ్యా? శారద వివాహమా?' అన్నాడు.

'అవును'

'అయితే అదుగో ఆ గదిలోవున్నాడు పోయి అతనితోమాట్లాడు.'

హరమోహన్‌బాబు మనోభావాన్ని గ్రహించడానికి సదానందుని కొట్టేసేపు పట్టలేదు. సదానందుడు చిరునవ్వునవ్వి 'ఈ విషయాన్నిగురించి శారదాచరణునితో మాట్లాడి ప్రయోజనంలేదు. నేమ నీతోనే మాట్లాడాలని వచ్చాను.

'నాతో మాట్లాడాలని వచ్చావా?'

'అవును.'

'ఎందుచేతః'

'నే నింతకుముందే నివేదించుకొన్నాను. మీ కుమారుని పెండ్లి చేయరాః'

'ఎందుకు చేయనుః కాని నీవు నా కుమారుని పెండ్లివిషయమై మాట్లాడడానికి వచ్చావంటే నాకేమీ అర్థంకావడంలేదు. ఇందులో నీకు సంబంధమేమిటిః'

'నే నావిషయం మాట్లాడాలనే వచ్చాను.'

'నాతో మాట్లాడినందువలన ప్రయోజనముంటుందని నీకు నమ్మకమేనాః'

'అవును.'

'అయితే వివాహవిషయాన్నిగురించి నీతో వొక్కమాటగూడా మాట్లాడను.'

ఈ మాటలోని అర్థాన్ని సదానందుడు వెంటనే గ్రహించాడు. ఇతను పైసాకు దాసుడు. నే నేదో కట్నాలు కానుకలులేని పిచ్చి సంబంధం తీసుకొచ్చానని యితని ఊహ. ఇలాంటి నరరూపరాక్షసు లున్నంతకాలం మన సమాజం బాగుపడదు. 'ఏమైనాకానీ నేను సుభద కిచ్చిన వాగ్దానాన్ని నిలబెట్టుకోవాలి.' అనుకొంటూ సదానందుడు చిరు నవ్వు నవ్వి 'చూడు బాబూ! చిన్నతనంలోనే నా తండ్రి చనిపోయాడు. అప్పటినుండి ఆయనకున్న ఆస్తినంతా నేనే అనుభవిస్తున్నాను. నా ఆస్తికి సర్వాధికారిని నేనేనన్న విషయం నీకూ తెలుసుకనుక యీ పెండ్లికి నీవు వొప్పుకుంటే నీవు కోరిన కట్నం యివ్వడానికి నేను సిద్ధంగావున్నాను. నీ వేమాత్రము భయపడవలదు.'

సదానందుడు చెప్పేవి పిచ్చిమాటలు కావని వృద్ధ హరమోహన్ బాబుకు విశదమైనది. 'అయితే కట్నంవిషయమై మాట్లాడాలి.' అన్నాడు.

సదానందుడు మరల చిరునవ్వు నవ్వి "ఆ విషయం నేను మొద టనే మీతో విన్నవించుకొన్నాను. కట్నం విషయాన్ని గురించి నాతో మాట్లాడడానికి సంకోచించకండి. ఈ విషయాన్ని తేల్చుకోవడానికే నేను మీ వద్దకు వచ్చాను. నిస్సందేహంగా మాట్లాడండి.'

హరమోహన్‌బాబు హుక్కాదమ్ములాగి 'ఇంతకూ పిల్ల యెవరో చెప్పావుకావు." అన్నాడు.

"పిల్లసంగతి నీ కెందుకయ్యా ! నీకు కావలసినది కట్నం. అది యివ్వడానికి నేను సిద్ధంగా వున్నాను. పిల్లగుణగణాలతో రూపురేఖలతో నీకు పనిలేదు. నీకు కావలసినదల్లా డబ్బు."

"అదికాదయ్యా! ఏవూరు? ఎవరిపిల్ల?" అని అడుగుతున్నాను.

"ఈ వూరే. ఆమె తండ్రి పేరు హారాన్‌చంద్రముఖోపాధ్యాయ. ఈ అమ్మాయి హారాన్‌చంద్రుని రెండవకుమార్తె."

"హారాన్‌చంద్రుని కుమార్తెయా?"

"అవును"

"అత డేమిస్తాడోయ్?"

"మీ రేదికోరితే అది."

హరమోహన్‌బాబు కొంచెంసేపు ఆలోచించి "అయితే పిల్ల యెలా వుంటుంది?" అని ప్రశ్నించాడు.

"బహుశా మీ రిప్పుడు మరచిపోయివుంటారు. లోగడ మీరామెను చూచేవుంటారు. మీ కుమారుడుగూడా చూచాడు. ఆమెను పెండ్లిచేసుకోవడానికికూడా అతను సిద్ధముగానున్నట్లు తెలిసినది."

హరమోహన్ చిరునవ్వు నవ్వి "మంచిది. మేము గృహస్థులం. మాకు దొరసానులక్కరలేదు. పనిపాటులు చేసుకొనే అమ్మాయి కావాలి. పనిచేస్తే తప్పు అనుకొనేవాళ్ళు నా కవసరంలేదు. తెలిసిందా?"

"ఈ దృష్టితో చూస్తూ ఆమె తప్పక పనిచేస్తుంది."

"కాని హారాన్‌బాబు కట్నమేమీ యివ్వలేడనుకొంటాను. అతని ఆర్థికస్థితి చితికిపోయిందిగా."

"నిజం. అతని ఆర్థికస్థితి అత్యంత శోచనీయం. కాని యీ విషయంలో తమరు దయతలచి యెంతఅడిగితే అంత యివ్వడానికి సిద్ధముగా వున్నాడు."

హరమోహన్‌బా బాలోచనాసాగరంలో ఈదులాడసాగాడు. ఎంత అడిగితే బాగుంటుంది? ఇప్పు డితని కేమి సమాధానం చెప్పాలి?

హరమోహన్‌బాబు చాణక్యునిలాంటివాడు. "చూడబ్బాయ్, ఆర్థిక స్థితి యెలావున్నా ఆడపిల్లపెండ్లిఅన్నతరవాత అంతో యింతో ఖర్చు చేయకతప్పదు."

"ఖర్చులేకుండా పెండ్లి యెలా అవుతుందండీ?"

"ఏమైనాగానీ వెయ్యిరూపాయల కట్నమిస్తే శారదాచరణుని పెండ్లి చేయదలచా" నంటూ నిక్కచ్చిగా చెప్పాడు.

సదానందుడు చిరునవ్వు నవ్వి "మంచిది" అన్నాడు.

'మంచిది' అన్నమాట వినగానే హరమోహన్‌బాబు మన సారాట పడజొచ్చింది. "అరే నే నెంత పొరపాటుచేశాను. పదిహేనువందల రూపాయ లెందుకు కోరలేదు. పదిహేనువందలు కోరినా సరేననేవాడేమో అనుకొంటూ అతను దిగులుపడసాగాడు. ఏమన్నానో అన్నాను. నోరు జారింది. మరల మార్చుకొని యెక్కువయిమ్మని అడగడం భావ్యంకాదు. అయినా యింకా పిల్లకాయకు పెట్టవలసిన సొమ్మున్నదిగా ! అనుకొని "సరేకాని యేమంటావ్ సదానందా?" అన్నాడు.

"ఏమీలేదు"

"అయితే గృహోపకరణాలు. పట్టుతాపితాలు, వెండిచెంబులు, అత్తగారి లాంఛనాలు, మామగారి కోరికలమాటేమిటి?"

"అన్నీ అవశ్యం జరుపుతాం."

"అయితే యీ పెండ్లి నా కిష్టమే"

"మంచిది. లగ్నం పెట్టించండి."

హరమోహనబా బొక్క క్షణ మాలోచించి "చూడు సదా ! ఈ విషయం రెండోకంటివాడికి తెలియకూడదు. హారాన్‌బాబేమీ నాకు పరాయి వాడు కాడు. కాని వ్యవహారమన్నతరవాత వ్యవహారరీత్యానే వుండాలి. నియమం తప్పకూడదు."

సదానందుడు సంకోచంగా "ఏం నియమం?" అని ప్రశ్నించాడు.

హరమోహన బాబు చిరునవ్వు నవ్వి "నియమాలేమీ లేవయ్యా ! మాట అనుకొన్నతరువాత వ్రాతకోతలు జరిగితీరాలి."

"ఎవరికి వ్రాయాలి?"

"నాకు"

"ఎప్పుడు?"

ఎప్పుడో కాదు. ఇప్పుడే"

సదానందుడు ఆలోచించి "ఒక్క మాసంరోజులలోపల పూర్తి చేస్తాం" అన్నాడు.

హరమోహన్ యిందుకు వొప్పుకున్నాడు.

"అయితే వొక్క విషయం"

"ఏమి టది?"

"ఇచ్చిపుచ్చుకోవడాలు యితరులకు తెలియకూడదు."

"ఎందుచేత?"

"ఇందుల కొక ముఖ్యకారణమున్నది."

వ్యవహారదక్షుడైన వృద్ధ హరమోహన్ యీ మాటలోని అర్థాన్ని గ్రహించి "ఏం! నీవు గుప్తదానం చేయదలచావా?" అని ప్రశ్నించాడు.

సదానందుడు మాట్లాడలేదు. అతని విశాలహృదయాన్ని, త్యాగాన్ని చూచి హరమోహన్ సిగ్గుచే తలవంచుకొన్నాడు. కాని వ్యవహారదక్షుడైనకారణంగా ఆ సిగ్గు అతనిముఖంపై ఆట్టేసేపు నిలవలేకపోయింది.

హరమోహన్ మొఖంమీదకు చిరునవ్వు యెరువుతెచ్చుకొని "చూడు సదా! హారాన్ కుటుంబపరిస్థితులు నాకు బాగా తెలుసు. పెద్దవాడనైనాను. చూపు బాగా ఆనడంలేదు. నీవు గుప్తదానం యివ్వదలిస్తే సరే. ఏంచేస్తాను. నేనూ అలాగే గుప్తంగానే పుచ్చుకుంటాను. నీ వేమీ భయపడవలసిన పనిలేదు."

సదానందుడు హరమోహన్‌బాబువద్ద సెలవుతీసుకొని యింటికి తిరిగివచ్చాడు.

## 20

సుభద్రకు, హారాన్‌బాబుకు, ఛలనకుగూడా పెండ్లివిషయం తెలిసిపోయింది. హరమోహన్‌బాబుతో సదానందుడు మాట్లాడి యీ పెండ్లి సంబధం కుదిర్చాడని ఊరిలోనివారు చెప్పుకోసాగారు.

ఈ విషయం రాసమణి చెవినిబడగానే "సదానందుడు పూర్వ జన్మలో మా సుభదకొడుకై వుంటాడు" అనుకొన్నది. రాసమణి ఈ మాట సదానందునిదగ్గరే అన్నది. సదానందు డేమీ జవాబు చెప్పలేదు. సదానందు డేమీ మాట్లాడకపోవడాన్నిబట్టి ఇతను తప్పకుండా పూర్వ జన్మలో సుభదకొడుకే అయివుంటాడని రాసమణి నిర్ధారణ చేసుకొన్నది.

సదానందు డనేక వ్యవహారాలు నెత్తినవేసుకొంటాడు. ఆకారణంగా అత్తగారి ఆస్తినిగురించి విచారించడానికి కతనికి తీరికచిక్కడంలేదు. ఈవాళ తీరిక చూచుకొని ఈ విషయం సుభదకు చెప్పాడు.

"సరే, వెళ్ళి ఆ విషయమేమిటో తేల్చుకొనిర"మ్మన్నది సుభద. సదానందుడు ప్రక్కచుట్టి చంకనబెట్టి బయలుదేరాడు. ఇప్పుడు సుభద యిల్లే తన యిల్లుగా చూచుకొంటున్నాడు. సదానందుడు పోతూపోతూ యింట్లోకి కావలసిన సరుకులన్నీ తెచ్చియిచ్చి "చూడు, పెండ్లి పనులన్నీ త్వరత్వరగా కానివ్వు" ఏమాత్రం జాగుచేయవదు. తెలిసిందా?" అంటూ హెచ్చరించాడు సుభదను.

సదానందుడు తన అత్తగారి పుట్టింటికి వెళ్ళి అక్కడ ఆమె పేర వున్న ఆస్తినంతా విక్రయించి పదిహేనురోజులలో తిరిగి హాలుద్ పూర్ వచ్చాడు.

హాలుద్పూరు వచ్చిన తరువాత సదానందుడు హారమోన్ బాబు కోరిన నగలు, గృహోపకరణాలు, యింకా యితరవస్తువులు కొని లగ్నం గూడా నిశ్చయించాడు.

ఈ పనులన్నీ పూర్తయిన తరవాత అతను శారదాచరణుని కలుసుకొన్నాడు. ఏకాంతంగా కూర్చుని శారదాచరణునితో మాట్లాడడం లోగడ యెన్నడూ సంభవించలేదు. చాలారోజులకు యిరువురూ కలుసుకొని చేతులు చేతులు పట్టుకొని గంగానదివైపుకు నడకసాగించారు.

గంగానది వొడ్డున కూర్చుంటూ శారదాచరణుడు 'నీకు చిన్ననాటి విషయాలు గుర్తున్నవా సదా?' అని ప్రశ్నించాడు.

"కొద్దికొద్దిగా జ్ఞాపకమున్నవి"

"నే నొకమనిషితో యెక్కువ స్నేహంగా వుండేవాడిని, నీకు జ్ఞాపకమున్నదా? నేను నీవద్ద కూర్చుని నాహృదయంలోనున్న రహస్యా

లన్నీ నీకు చెప్పేవాడిని. నీవు నామాటలన్నీ శ్రద్ధగా ఆలకించేవాడివి. నా మనసులోనున్న ఊహలు, ఆశలు అన్నీ నీకు మర్మంలేకుండా చెప్పే వాడిని. నామాటలు విని నీ వప్పుడు నవ్వేవాడివిగూడా. అవన్నీ ఇప్పుడు నీకు జ్ఞాపకమున్నవా?"

"బాల్యక్రీడలెన్నటికైనా మరచిపోగలమా? ఏడెనిమిది సంవత్సరాలౌతుందనుకొంటాను. కాని నిన్నెప్పుడూ ఎగతాళిచేయలేదని నాకు జ్ఞాపకం."

"నామాటలకు నవ్వేవాడివని నాకు జ్ఞాపకం. ఏనాడైతే నీవు నా ఆశలన్నీ నిరాశలుచేశావో అనాటినుంచే మన యిరువురం మాట్లాడుకోవడం మానేశాము. మన యిరువురమధ్య పెద్ద అగాధమేర్పడింది. ఆ రోజు రాత్రి చాల ప్రొద్దుపోయేవరకు నేను నీవద్ద యేడుస్తూ కూర్చున్నాను. అది నీకు జ్ఞాపకమున్నదా?"

'ఎలా మరచిపోగలను? నేటికిగూడా ఆ దృశ్యం నా కన్నుల యెదుట కనిపిస్తున్నది.'

సదానందు డన్యమనస్కుడై ఏదో ఆలోచిస్తున్నాడు. శారదాచరణు డిది గమనించకుండా 'అదే నాజీవిత లీలను సమాప్తంచేసింది' అన్నాడు.

శారదాచరణుడన్న యీ వాక్యం సదానందుని కర్ణపుటాలవద్దకు గూడా చేరలేదు తెల్లని తెరచాప యెత్తుకొని ఒకనౌక వేగంగా పోతున్నది. సందానందునిదృష్టి ఆ నౌకపై బడింది.

'ఇక్కడే లలిత మునిగిపోయింది' అన్నాడు శారద.

'ఎక్కడ?'

'ఇక్కడే.'

'ఈ విషయం నీ కెలా తెలుసు?'

'ఇక్కడే ఆమెకట్టుకొన్న ఎఱ్ఱచీర దొరికింది.'

సదానందుడు వెంటనే లేచి నిలబడి 'పద, ఆ చీర చూద్దాం" అన్నాడు.

"పిచ్చివాడా! ఇంకా ఆ చీర యిక్కడే పడివున్నదనుకొన్నావా?"

"అయినా పద, ఆ చోటైనా చూద్దాం."

శారదాచరణుడు సదానందుడు కలిసి అక్కడకు వెళ్లారు. సదానందుడు నీటిలో కాళ్ళూచేతులూ కడుక్కొని అక్కడే చతికిలబడ్డాడు.

"నేను చాల పశ్చాత్తాపపడుతున్నాను సదా!"

"ఎందుకు ?"

"ఆమె జీవించివున్నదో లేక మరణించిందో భగవంతునికే తెలియాలి? ఆమె కోరినప్పుడే నే నామెను వివాహమాడివుంటే యిలాంటి దుస్సంఘటన జరిగి వుండేదికాదు."

సదానందు డొక నిట్టూర్పు విడిచి "ఇలా జరగాలని భగవంతుడు నిర్ణయిస్తే నీవేంచేయగలవు? ఆమె నుదుట అలా వ్రాసిపెట్టివున్నది."

"ఆ విషయం నాకు బాగా తెలుసు. కాని నే నామెను నాఅర్ధాంగిగా స్వీకరించివుంటే యిలా జరిగేదికాదు."

సదానందుడు చిరునవ్వు నవ్వి "నీ వామెను పెండ్లియాడివుంటే కులభ్రష్టుడవయ్యేవాడివి."

శారదాచరణు డొక్కక్షణం ఆలోచించి "ఏమైనా నాకు విచారం లేదు" అన్నాడు.

"జరిగిపోయినదానినిగురించి విచారమెందులకు? ఇప్పుడు నీవేం చేయగలవు ?"

శారదాచరణుని కన్నులలో నీరు తిరిగింది. ఆ నా డామె చెప్పినట్లు నేను వొప్పుకొనివుంటే యీనా డింత పశ్చాత్తాపపడవలసిన పని వుండేది కాదు. నా దురదృష్టం."

"శారదా! ఇప్పుడు విచారించి లాభంలేదు. నీ పశ్చాత్తాపం మెల్ల మెల్లగా సమసిపోతుంది."

"పోనీ నే నామె ఆఖరుకోరికను మన్నించినా యిలా జరిగివుండేది కాదు."

"ఆఖరు కోరికా? ఏమిటది?"

"తన్ను వివాహమాడకున్న పోనీ ఛలనైనా వివాహంచేసుకోమని బ్రతిమాలింది."

"అయితే ఛలనను వివాహమాడటం నీ కిష్టమేనా?"

"చెపుతా. అలాచేస్తే నా దోషాలన్నీ నమసిపోతవా?"

"తప్పక"

"అది సరేకాని, ఒక్కమాట అడుగుతాను చెప్పు సదా! ఈ పెండ్లికి మా నాన్నగారిని యెలా వొప్పించగలిగావ్?"

"శారదాచరణు డీ వివాహానికి హృదయపూర్వకంగా వొప్పుకుంటు న్నాడనీ, భలనను పెండ్లిచేసుకోవడాని కతడు ఉబలాటపడుతున్నాడనీ మీ నాన్నగారితో చెప్పాను."

"ఇంతేనా? ఇంతమాత్రానికే ఆయన తల యెగరేశాడా?"

"కాక మరేమిటి?"

"మా నాన్నగారి మనస్తత్వం నాకు తెలియదంటావా?"

ఈ మాట వినగానే సదానందునకు నవ్వువచ్చింది. మీ నాన్నగారి స్వభావం నీకు తెలిసివుంటే నన్నడగడమెందుకు?"

"ఎంత డబ్బివ్వడానికి వొప్పుకొన్నారో తెలుసుకుందామని."

"తెలుసుకొన్నందువలన లాభమేమిటి? తెలుసుకొని నీవేం చేస్తావు?"

"ఇలా తీసుకోవడం పాపం సదానందా!"

"నూరేళ్ళు వర్ధిల్లు శారదా! నీకు సమస్తసౌఖ్యాలు కలగాలని ఆశీర్వ దిస్తున్నా!"

"సమయము వచ్చినపు డా డబ్బు నేను తిరిగి మీ కిచ్చివేస్తాను."

"అలాగే యిచ్చివెయ్యి." అంటూ సదానందుడు చీర పడివున్న దని చెప్పేచోటుకు వెళ్ళి అక్కడి యిసుకను చేతిలోకి తీసుకొన్నాడు.

అదిచూచి శారదాచరణుడు ఆశ్చర్యంతో "ఏమిటి చేస్తున్నావ్ సదానందా?" అని ప్రశ్నించాడు.

"పిచ్చి పని"

ఇది వాస్తవమైన మాటే. నిజంగా సదానందుడు చేసేపని చూస్తుంటే శారదాచరణునకు పిచ్చిపిచ్చిగానే తోచింది....నీ వెటువంటి పిచ్చిపనులు చేసినా నీ నోటివెంట అలాంటిమాట రావడం నేను సహించ లేను.

'నా నోటితో నేనే అంటున్నాను."

'సదా! ఈ యిసుక యెందుకో యదార్థం చెప్పు.'

'అసలు విషయ మిది. నేను శివపూజ చేయదలచాను. ఇంట్లో గంగానదిమట్టిలేదు.అందుకోసమని దీనిని తీసుకుపోతున్నాను. అంతకన్న మరేంలేదు.'

శారదాచరణు డలా చూస్తూ నిలబడిపోయాడు.

సదానందు డా మట్టితో శివలింగాన్ని చేసి దానిని విసరి గంగలో పారేసి శారదాచరణునివద్దకు వచ్చాడు.

'శారదా! ఇక యింటికి వెడదామా?'

'ఇప్పుడు నీవుచేసిన పనేమిటి?'

'నే నేమిచేశానో నీ కండ్లతో నీవు చూస్తూనేవున్నావుగా?'

'శివపూజ చేయదానికి గంగమట్టిని తీసుకోలేదేం?'

'వద్దు, నే నిప్పుడు శివపూజచేయను.'

'ఎందుచేత '

'కారణం తరువాత చెపుతాను.'

తరువాత యిరువురూ వెనుదిరిగివచ్చి యెవరియిండ్లకు వారు వెళ్ళిపోయారు.

సదానందుడు యింట్లోకివెళ్ళి లోపల గడియవేసుకొని ఆరోజంతా యింట్లోనే వున్నాడు.

ప్రొద్దుకూకింది. భోజనానికని భలన పిలవడానికి వచ్చింది. కాని అతను తలుపుతీయలేదు. తరువాత రాసమణివచ్చి పిలిచింది. అయినా అతను తలుపు తెరవలేదు. రాసమణి కేకలు వేయగా వేయగా లోపలనుంచే యిలా జవాబిచ్చాడు. 'నా వొంట్లో బాగాలేదు. అందుచే నా కాకలిలేదు. నే నివాళ భోజనంచేయను.'

ఈ విషయం తెలిసి సుభద వచ్చింది. ఎన్ని కేకలువేసినా సదానందుడు పలుకలేదు.ఆమె నిరాశతో వెనుదిరిగిపోయింది.

మరునాడు సదానందుడు లేచి మైదానంవైపు బయలుదేరాడు. అక్కడనుండి తిరిగివచ్చినతరువాత భోజనానికి వెళ్ళి రాగాలాపన మొదలెట్టాడు. అతనిలో రోజురోజుకు పరివర్తన జరుగుచున్నది. కాని లోక

మది గ్రహించలేకపోతున్నది. అతడు నిన్న వున్నట్లు నేడు వుండలేదు. అనుక్షణమూ అతనిలో యేదో అనూహ్యమైన మార్పు జరుగుతూనేవున్నది.

నేడే ఛలన వివాహం. అందరి హృదయాలు ఆనందంతో నాట్యం చేస్తున్నవి. అందరిముఖాల్లోనూ చిరునవ్వు వెన్నెలలు చిందులాడుతున్నవి. సదానందుడు ఊపిరిపీల్చుకోవడానికి కూడా తీరికచిక్కడంలేదు. హారాన్ బా బది అట్లా యిదియిట్లా అని కేకలుపెడుతున్నాడు. రాసమణి కన్నుల నీరునింపి యింటికి వచ్చినవారందరితో 'లలన వుంటే యీ పెండ్లిచూచి యెంత సంతోషపడేదో! అదిలేకపోతేమెంతలోటుగావున్న'దంటూకన్నీరు కార్చసాగింది. వచ్చినవారుకూడా ఆమె మాటలు విని 'నిజమేనమ్మా! లలనవుంటే యెంతో సంతోషించే'దంటూ ఆమెకు వంతపలికేవారు.

సుఖద మాత్రం ధైర్యంగా వున్నది.

సూర్యాస్తమయమైనది. వాకిటిముందు సన్నాయిమేళం మ్రోగుతున్నది. ముత్తయిదువులంతా వస్తున్నారు. పెండ్లికొడుకుని పెండ్లికూతురిని అలంకరించి పెండ్లిపీటలమీద కూర్చోబెట్టారు. బ్రాహ్మణులు ఆశీర్వచనాలు పలుకుతున్నారు. మంగళవాద్యాలు మ్రోగుతున్నవి. శారదాచరణుడు ఛలనమెడలో మంగళసూత్రం కట్టాడు.

ఊరంతా పినాసి హరమోహన్‌ని ప్రశంసింపసాగారు. అతని విరోధులుకూడా అతని కింత విశాలహృదయం యెక్కడినుండి వచ్చిందా అని ఆశ్చర్యపడసాగారు. పినాసిముండాకొడు కెంత త్యాగం చేశాడని ముక్కుమీద వేలు వేసుకుంటున్నారు.

ఎవరైనా సాహసించి "ఏమయ్యా ఇలా చేశా"వని ప్రశ్నిస్తే "ఏమి చేయమంటారు? ఒక్కగాను వొక్కకొడుకు. ఛలననుతప్ప మరొకరిని పెండ్లిచేసుకోనని పట్టుపట్టి కూర్చున్నాడు. ఇలాంటిస్థితిలో నే నేమిచేయగలను. పెండ్లిచేసుకొనేవాడి యిష్టంగాని మనయిష్టమేమిటి? అదీగాక హారాన్‌బాబు పిల్లని మనం చేసుకోకపోతే మరెవ్వరు చేసుకొంటారు? ప్రొద్దునలేస్తే ముఖముఖాలు చూచుకోవాలి. పొరుగువాడికి అమాత్రం సాయపడకపోతే యెలా? అత నేమైనా పరాయివాడా? మా పొరుగువాడేనని సమాధానమిచ్చేవాడు.

ఈ మాటలువిని శారదాచరణుడు ముఖ మటు త్రిప్పుకొని పండ్లు కొరికేవాడు. కనుబొమలు ముడివదేవి.

## 20

అనేక కఠిన సమస్యల నెదుర్కొన్నారు. ఇప్పుడు మనస్సుకు కాస్త స్థాయిచిక్కింది. అందరి ముఖాలలోను ఆనందరేఖలు గోచరిస్తున్నవి. కాని యీ ఆనందం అట్టేకాలం నిలువలేదు.

సదానందుడు లలిత వివాహానికి కావలసిన ప్రయత్నాలన్నీ చేశాడు. హరిమోహన్‌బాబడిగిన కట్నంగూడా యితరులకుతెలియకుండా గుప్తంగా యిచ్చాడు. ఎలాగో పెండ్లి అయినదనిపించాడు. పెండ్లి హడావుడి కారణంగా నిద్రలేక నాలుగురోజులు వరుసగా నిద్రపోయాడు. ఇప్పు డతని మనస్సు శాంతించింది. లలిత పెండ్లికాకపూర్వ మతను హత్యానేరంచేసి ఖైదులో పెట్టబడినట్లు బాధపడేవాడు. ఇప్పుడు కోర్టువారతనివి నిర్దోషి అని విడిచిపెట్టినట్లుగా సంతోషిస్తున్నాడు.

ఇలా రెండు మూడు రోజులు గడిచినతరువాత అతను ప్రక్కమీద లేచి కూర్చున్నాడు. ప్రక్క వేడియెక్కింది. దిండంతా నలిగిపోయింది. ఇల్లంతా అంధకార మావరించింది, అతను బయటకు వచ్చి ఒకచోట నిలబడి ఆకాశంవంక చూచాడు. నల్లని కారుమేఘాలు ఆకాశమంతటా అలముకొన్నవి. వర్షంకురిసేలాగున్నది. అతను యింట్లోకి పోయి గొడుగు తీసుకొని బయటికి బయలుదేరాడు.

వర్షం కురవసాగింది. సదానందుడు వర్షంలో కాసే పటూ యిటూ తిరిగి కాళ్ళనిండా బురదకొట్టుకొని హారాన్‌బాబింటికి చేరాడు. ఆ సమయంలో సుభద వంటయింట్లో వున్నది. సదానందు చావైపుకు వెళ్ళలేదు. రాసమణి యింట్లోలేదు. ఆమె బహుశా ప్రక్కయింటికెక్కడికో పోయి వుంటుంది. ఆమె యెక్కడకు పోయివుంటుందా అనే ఆలోచనకూడా అతనికి రాలేదు. బురదకాళ్ళు కడుక్కొని సరాసరి మాధవుని గదివద్దకు వెళ్ళాడు.

లలిత వెళ్ళిపోయినప్పటినుండి మాధవుడు నిర్వికల్ప సమాధిలో వుంటున్నాడు. జ్ఞానయోగిలా ఆత్మానాత్మ విచారణచేసి దానిమీద తన నిర్ణ

యాన్ని వివరిస్తున్నాడు. అన్నపానాదులను విసర్జించాడు. ముఖం గంభీరంగాపెట్టి యెప్పుడూ ఆలోచనానిమగ్నుడైవుంటున్నాడు. దిండుమీద పంపుపెట్టి దానినానుకొని వేదాంతిలా ఆలోచిస్తూ మౌనంగా పండుకొంటాడు. తనవద్ద కెవరు వస్తున్నారో యెవరు పోతున్నారో అనే విషయం గూడా అత నిప్పుడు పట్టించుకోవడంలేదు.

ఈనాడుగూడా మాధవుడు అదేవిధంగా పండుకొనివున్నాడు. సదానందు డతని సమీపమునకు రాగానే "ఇప్పుడు నాదగ్గరకే రావడంలేదేం సదన్నయ్యా! పనులన్నీ పూర్తయినవా?" అని ప్రశ్నించాడు.

"ఆఁ, పూర్తయినవి"

"చిన్నక్కయ్య తిరిగి యెప్పుడు వస్తుంది?"

"నాలుగైదు రోజులలో వస్తుంది"

"సదనన్నయ్యా! చాలారోజులనుండి నీతో ఒకవిషయం చెప్పవలెననుకొంటున్నాను. కాని సమయం చిక్కడంలేదు."

"ఎందుచేత?"

"ఎందుచేతనంటే నీవు నాకు ఏొంటరిగా కనిపించడంలేదు. అందుచేత చెప్పడానికి వీలుపడడంలేదు."

సదానందుడు మాధవునిదగ్గరగా కూర్చుని "అంత రహస్యమైన మాట యేమిటి బాబూ!" అన్నాడు.

"లలనక్కయ్య నీతో రహస్యంగా చెప్పమన్నది."

"ఎవరు?"

"లలనక్కయ్య యింట్లోనుండి వెళ్ళిపోయినప్పుడు నీ విక్కడ లేవు. లలనక్కయ్య నాతో తను వెళ్ళిపోతానని చెప్పింది. ఆమె యెక్కడకు పోయివుంటుంది?"

సదానందుడు మాధవునిశరీరంపై చేయివేసి నిమురుతూ "మాధవ్ ఆమె వెళ్ళిపోవడానికి కారణమేమిటో బహుశా నీకు తెలిసివుంటుంది. ఆమె నెవరైనా కోప్పడ్డారా?" అన్నాడు.

"ఎవరూ యేమీ అనలేదు."

"అయితే ఆమె యెందుకు వెళ్ళిపోయింది?"

"నేనుగూడా వెళతాను"

"ఛీ"

మాధవుడు చిరునవ్వు నవ్వాడు. 'నాకు అక్కకుతప్ప యీ విషయ మెవరికీ తెలియదు. ఆమె ముందుగా వెళ్ళింది. అక్కడంతా సరిజూచు కొని నన్నుగూడా తీసుకువెడతా నన్నది. అక్కడ మే మిద్దరము హాయిగా కాలం గడుపుతాం. మరల చిరునవ్వునవ్వి 'అక్క స్వయంగావచ్చి నన్ను తీసుకుపోతానన్నది' అన్నాడు.

'అయితే ఆమె యెప్పుడు వస్తానన్నది?'

'నాకు కాలమాసన్నమైనప్పుడు.'

'ఈ మాటలు నీ కెవరు నేర్పారు మాధవ్?'

'అలనక్కయ్య'

'ఆమె గట్టిగా వస్తానని చెప్పిందా?'

'ఆఁ'

'ఒకవేళ రాకపోతే?'

'తప్పక వస్తుంది.'

'ఒకవేళ ఆమె రాకపోతే వొంటరిగా నీవొక్కడవే వెళ్ళగలవా?'

మాధవు డాలోచించి 'చెప్పలేను' అన్నాడు.

సదానందుడు మౌనంవహించాడు.

మాధవుడు కొంచెంసేపు ఆలోచించి 'చూడు సదన్నయ్యా! అక్కడకు ఒంటరిగా వెళ్ళగలనా?' అని ప్రశ్నించాడు

'ఎందుకు వెళ్ళలేవు. మీ అక్కయ్య ఒంటరిగా వెళ్ళలేదూ.'

'అయితే నేనుగూడా వెళ్ళగలనా?'

'అవశ్యం'

మాధవుడు మరల ఆలోచించి 'నా వొంట్లో సత్తువలేదు. నే నెలా వెళ్ళగలను?' అని ప్రశ్నించాడు.

సదానందుడు మాధవునివంక చూస్తూ అలా నిలబడిపోయాడు.

'అక్కశరీరంలో బలమున్నది. అందుచేత ఆమె ముందు వెళ్ళ గలిగింది. ఈ జబ్బుశరీరంతో నే నెలా వెళ్ళగలను? ఇప్పుడు నా శరీరంలో నిలబడడానికికూడా శక్తిలేదు. అలాంటప్పుడు నేను ఒంటరిగా యెలా వెళ్ళగలను?

సదానందుని కన్నులలో నీరు తిరిగింది. చీకటిగావున్న కారణంగా మాధవుడు దానిని గమనించలేదు. మాధవుడికి అంతిమఘడియలు సమీపించాయని సదానందుడు గ్రహించాడు. బహుశా నాలుగురోజులకన్నా యెక్కువ జీవించడు. తరువాత అనంతకాలగర్భంలో లీనమైపోతాడు. సుభద్ర శోచనీయస్థితి అతని దృష్టికివచ్చింది.లలనగూడా జ్ఞప్తికివచ్చింది. అతనికి దుఃఖమాగలేదు.

సదానందుడు కండ్లనీరు తుడుచుకుంటూ 'చూడు మాధవ్ ! నేనిదివరకటిలాగా పాటలు పాడడంలేదు. ఇప్పు డెక్కడకూ వెళ్ళడం కూడా లేదు. మొదట్లో నా జీవితాన్ని సౌఖ్యంగా గడిపాను. కాని నా జీవిత మిప్పుడు దుఃఖమయమైనది. నాలోని త్యాగభావం నశించి దాని స్థానాన్ని అసక్తి ఆక్రమించుకున్నది. ఇప్పుడు నా జీవితానికి సుఖంలేదు. బ్రతికినన్నాళ్ళు కష్టాలు తప్పవనుకుంటాను. ఇక యీ జీవికి చచ్చిన తరువాతనే సౌఖ్యం.' సదానందుని మనస్సులోనికి అనేక ఆలోచనలు రాసాగినవి. 'లలన పోతూపోతూ నన్ను మరచిపోలేదు. మాధవునికి మరణమాసన్నమైనది. లలన ఆత్మహత్యచేసుకొని తనకష్టాలనన్నింటినీ సుభద్రపైకి ఉసిగొల్పింది.' అలాంటి ఆలోచనలెన్నో అతనిమెదడును కెలకసాగాయి.

ఆరాత్రి మాధవునిస్థితి విషమించింది. ఇంతవరకు అతను లలనక్కయ్య వచ్చి తనను తీసుకుపోతుందనే ఆశతో జీవించాడు. నేడు సదానందుని మాటలు వినేసరికి అతనిఆశలు నిరాశలైనవి. అతని గుండెలు దిగజారినవి. శక్తి వుడిగిపోయింది. 'నేను శక్తిహీనుడను. ఒంటరిగా అక్కవద్దకు యెలా వెళ్ళగలను?' అని తలపోయసాగాడు. రాత్రి చాలా ప్రొద్దుపోయింది. 'నా లలనక్కయ్య యెన్నటికీ అసత్యమాడదు. ఆమె నన్ను తీసుకువెళ్ళడానికి తప్పక వస్తుంది.' అనే విశ్వాసానికి వచ్చాడు. అతని మనస్సుకు కొద్దిగా శాంతిచిక్కింది. నిద్రాదేవి వొడిలోకి చేరుకొన్నాడు.

# 22

ఈవిధంగా రోజులు గడుస్తున్నాయి. ఛలన అత్తవారి యింటి దగ్గరనుండి పుట్టింటికి వచ్చింది. ఊరిలోనున్న అమ్మలక్కలందరూ

చూడడానికి వచ్చారు. ఇల్లంతా సందడిగానున్నది. హరమోహన్‌బాబు స్వయంగా వచ్చి తన మృదుమధుర సంభాషణలతో అందరినీ ఆనంద సాగరంలో ముంచుతున్నాడు. రెండురోజులున్నతరువాత సెలపుపుచ్చు కొని యింటికి తిరిగివెళ్లాడు.

నేడు మాధవునిస్థితి మరీ అధ్వాన్నముగ నున్నది. అతడు బాధతో మూలుగుతున్నాడు. అతడు తనంతటతానుగా యీ ప్రక్కనుండి ఆ ప్రక్కకు పొర్లలేకపోతున్నాడు. అతని మంచానికి ఒకవైపున కృష్ణప్రియ, మరొకవైపున రాసమణి, యింకొకవైపున ఛలన కూర్చునివున్నారు. సుభద అక్కడ లేదు. ఆమె వంటపనిలో నిమగ్నురాలై వున్నది. వంట చేస్తున్నప్పు డామె కనులవెంట అశ్రుజలం ప్రవహిస్తున్నది.

సదానందుడు డాక్టరును తీసుకురావడానికి వెళ్లాడు. హారాన్‌బాబు యిప్పుడే వస్తానని చెప్పి బయటకు వెళ్లాడు. అతను వెళ్ళి మూడుగంట లైనది. ఇంతవరకు పత్తాలేదు. అందరూ మంచంమట్టూ కూర్చున్నారు. కృష్ణప్రియ మాధవునిమీద చేయివేసిచూచింది. అందరూ డాక్టరు రాకకై యెదురుచూస్తున్నారు.

సాయంకాలానికి డాక్టరు వచ్చాడు. డాక్టరు అయిదారురోజుల నుండి నియమానుసారంగా వచ్చి చూస్తున్నాడు. అతడు ప్రతినిత్యమూ రోగిని పరీక్షిస్తున్నాడు. రోగం యేమాత్రమూ తిరుగుముఖం పట్టలేదని అతను గ్రహించాడు. రోజురోజుకు పరిస్థితి విషమిస్తున్నది. రోగి నానాటికి దిగజారిపోతున్నాడు. రోగికన్నులలో తేజస్సులేదు. శరీరం అస్థి పంజరంలాగున్నది. చేతులు కాళ్లు గోగుపుల్లల్లాగా వున్నవి. ఇక యితె యెక్కువకాలం జీవించడని డాక్టరుకు తోచింది. అందుచే నే డతను మాధవుని చూడడానికి రాదలచలేదు. కాని సదానందునిమాట త్రోసిపుచ్చ లేక వచ్చాడు.

డాక్టరు మాధవుని పరీక్షచేశాడు. పరీక్షచేసినతరువాత డాక్టరుగారు సదానందుని బయటకు పిలిచి యిలా చెప్పాడు: "ఈ రాత్రి గడవడం కష్టం. అందుచే జాగ్రత్తగా చూస్తూవుండండి."

ఈమాట డాక్టరుగారు చెప్పకపూర్వమే సదానందుడుగ్రహించాడు.

రాత్రి చాల ప్రొద్దుపోయినతరువాత హారాన్ యింటికి వచ్చాడు. దొంగలా బయట నక్కి యింట్లో పరిస్థితులన్నీ తెలుసుకొన్నాడు. మెల్లగా తలుపు తెరచి లోపలకు ప్రవేశించి మాధవునికి యెలావున్నదని ప్రశ్నించాడు.

ఈ ప్రశ్న కెవరూ జవాబు చెప్పలేదు. సుభద బయటకువచ్చింది. అన్నం వడ్డించి అతనికి యెదురుగా కూర్చున్నది.

"మాధవునికి యెలావున్నది?"

"ఎలావున్నదని చెప్పను. నిరాశాజనకంగా వున్నది."

"నిరాశాజనకంగా వున్నదా? నా మనసుగూడా బాగాలేదు"

హారాన్‌బాబు ఆమాట యెందుకన్నాడో చెప్పడం కష్టం. ఈ మాట అతని హృదయంలోనుండి వచ్చిందో లేక గొంతులోనుండి వచ్చిందో చెప్పడంకూడా కష్టమే. కాని యీమాట సుభద చెవినిపడలేదు.

పిల్లవాని ఆరోగ్యాన్నిగురించి ప్రశ్నించినా జవాబు చెప్పలేదే అని హారాన్‌బాబుకు బాధకలిగింది. అత నదీ తిరస్కారంగా భావించి క్రోధావేశంతో ముందున్నకంచం విసరి ఆవలపారేసి "నేను భోంచేయను. పోతే ప్రాణంపోతుంది." అంటూ అతను లేచి చేయికడుక్కొని తన గది లోకిపోయి మంచంమీద పండుకొన్నాడు.

సుభద చేయికడుక్కొని మాధవునివద్దకు పోయింది.

"హారాన్ యెక్కడ?" అని కృష్ణప్రియ ప్రశ్నించింది

"మనసు బాగుండలేదని పండుకొన్నారు."

కృష్ణప్రియ కొంచెంసేపు మాట్లాడలేదు. తరువాత ముఖం గంభీరంగాపెట్టి "జన్మయెత్తగానే సరా ; జనాభాలెక్కకు పుట్టాడు. మనిషి జన్మమెత్తిన తరువాత నీతీ నియమం వుండాలి" అన్నది.

ఈమాట విని రాసమణి పెదవికరచుకొన్నది. కృష్ణప్రియ తన జీవితంలో యెంతోమంది మరణించడం చూచింది. ఎవరికైనా జబ్బుచేసి మరణిస్తారని సందేహంగావుంటే రాత్రింబవళ్లు కృష్ణప్రియ వారివద్దనే వుంటుంది. కాని మృత్యుముఖంలోకి పోతూవుండగా యెవరినీ ఆమె చూడలేదు. మాధవుని ముక్కువద్ద చేయిపెట్టి చూచింది. శ్వాస యింకా ఆడుతున్నది.

"తలనొప్పిగా వున్నది" అన్నాడు మాధవుడు.

కృష్ణప్రియ అతని తల నవరింపసాగింది.

"కడుపులోకూడా నొప్పి పుడుతున్నది.బహుశా నేనికజీవించను."

అక్కడ ఉన్నవారంతా వౌకరిముఖా లొకరు చూచుకోసాగారు. వారి మనోభావాలను వీరు, వీరి మనోభావాలను వారు చదవడానికి ప్రయత్నిస్తున్నారు.

కొంచెంసే పంతా నిశ్శబ్దం. అందరూ అంతిమఘడియ కొరకై నిరీక్షిస్తున్నారు.

మాధవుడు మూలుగుతూ "నాలుక పిడచగట్టుకుపోతున్నది." అన్నాడు.

కృష్ణప్రియ యిన్నితులసినీళ్లు గొంతులో పోసింది. అవి త్రాగి మాధవుడు కాసేపు మెదలకుండా పండుకొన్నాడు.

కృష్ణప్రియకు నాడి చూడడం తెలుసు. కొంచెంసేపయిన తరువాత నాడిచూచి, 'సదానందా' మాధవుని నేలమీద పండుకోబెట్టు' అన్నది.

సదానందుడు మాట్లాడలేదు.

ఈ మాట రాసమణిగూడా విన్నది. 'చూడు సదా ! ఏమి టాలోచిస్తున్నావ్ ?'

ఛలన ఉలిక్కిపడింది. కృష్ణప్రియకన్నులలో నీరు తిరిగింది. మాధవుని భౌతికశరీరం క్రిందబెట్టారు.

కొంతసేపటికి మాధవుడు మరల నోరు తెరచాడు. కృష్ణప్రియ మరల తులసినీళ్లు పోసింది. నీళ్ల గొంతులోనికి పోగానే అతను బరువుగా కనులు తెరచాడు.

'లలనక్కయ్య వచ్చిందా సదన్నయ్యా!' మెల్లిగా ప్రశ్నించాడు.

ఛలన దగ్గరలోనే కూర్చునివున్నది. ఈ రాత్రంతా ఆమె మేలుకొనే వున్నది. మాధవు డడిగిన యీ ప్రశ్న చెవినిబడగానే ఆమెకన్నులలో నీరు తిరిగింది. శరీరం కంపించింది. భయంతో వణకిపోతూపోయి తల్లి వొడిలో దూరింది. రాసమణిశరీరంకూడా కంపింపజొచ్చింది.

మాధవుడు కొంచెంసేపలా చలనంలేకుండా పడివున్నాడు. అటని నాడి అందడంలేదు. ఎక్కిళ్లు వచ్చాయి. కృష్ణప్రియ కంఠ్లసీరు నింపి 'అంతా అయిపోయింది' అన్నది.

రాసమణి యేడుస్తూ వాడి ఆత్మకు శాంతి చేకూరాలని భగవంతుని ప్రార్థించింది.

అందరూ యేడుస్తున్నారు. ఏడుపు వినేసరికి హారాన్‌బాబుకి మెలకువ వచ్చింది. వెంటనే తన గదిలోనుండి బయటకువచ్చాడు. వచ్చి చూచేసరికి మాధవుని జీవితయాత్ర సమాప్తమైంది. శవాన్ని యింట్లోనుండి బయటకు తీసుకొనివచ్చారు. హారాన్‌బాబు 'నాన్నా మాధవ్!' అంటూ అతనిమీదపడి యేడ్వసాగాడు.

# 23

చక్కగా అలంకరించిన వొకమేడ. ఆ మేడలోని వొక గదిలో మాలతి సోఫాలో కూర్చునివున్నది. ఆమె అపురూప సౌందర్యవతి. ఆమె సౌందర్యం ఆ గదికికూడా వన్నెతెచ్చింది. వెండిచిమ్నీలో దీపం వెలుగుతున్నది. ఆ దీపపుకాంతిలో మాలతి పుస్తకం చదువుకొంటున్నది. ఇతర గదులకన్న ఆ గది అలంకరణ అద్భుతముగానున్నది. నేలమీద పలురకములైన తివాచీలు పరచివున్నవి. గోడలనిండా అజంతా చిత్రాల్లాంటి చిత్రాలు చిత్రింపబడివున్నవి. రవివర్మ మొదలైన ప్రసిద్ధ చిత్రకారుల చిత్రాలు గోడలకు వ్రేలాడుచున్నవి. పలువిధములైన ఆలియోగ్రాఫులు, ఆయిల్ పెయింటింగ్‌లు, ఫొటోగ్రాఫులు వున్నవి ఇవి ఆ గది శోభను ద్విగుణీకృతం చేస్తున్నవి. అపూర్వ కళాఖండాలెన్నో ఆ గదిలో చక్కగా అలంకరింపబడివున్నవి. ఎఱ్ఱని, తెల్లని, పచ్చని వెలుతురు గది అంతా వ్యాపించివున్నది. నాలుగువైపులనున్న గోడలకు నాలుగు పెద్దపెద్ద అద్దాలున్నవి. గదిమధ్యలో గుండ్రని చలువరాతిబల్ల వున్నది. ఈ బల్ల దగ్గరనే పెద్ద అద్దమున్నది. నాలుగువైపులా నల్లని, తెల్లని, ఎర్రని మనుష్యుల విగ్రహాలున్నవి. వెలుగులో అవి సజీవమూర్తుల్లా ప్రకాశిస్తున్నవి.

ఇలాంటి అందమైన గదిలో మాలతి వొంటరిగా కూర్చొనివున్నది. ఆమె భౌతిక సౌందర్యాన్ని పెంపొందించుకోడానికి చేయవలసిన ప్రయ

త్నాలన్నీ చేస్తున్నది. కాని ఆ సౌందర్యాన్ని చూచి ఆనందించేవారు, ప్రశంసించేవా రక్కడ యెవరూలేరు. అందుచేతనే ఆమె మౌనంగా కూర్చొని పుస్తకం చదువుకొంటున్నది.

వాస్తవికదృష్టితో పరిశీలిస్తే ఆమె పుస్తకం చదవడంతే దన వలసివస్తుంది. ఊరికే పుటలు తిరుగవేస్తున్నది. ఏ పుటాగూడా ఆమె హృదయాన్ని ఆకర్షించలేకపోతున్నది. చదువుదామన్నా ఆమె చదువలేక పోతున్నది. అశ్రుబిందువులు చెక్కిళ్ళమీదుగా జారుతున్నవి.

స్వర్గతుల్యమైన యిలాంటి మహల్లో సమస్తసౌఖ్యాలు అనుభవిస్తూ గూడా మాలతి యెందుకు విచారిస్తున్నదో యెవరికీ తెలియదు. ఆమె మన శ్శాంతికోసమో, దుఃఖాన్ని దిగమ్రింగడానికో పుస్తకం చేతబట్టిందని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఆమెముఖంలో నిరాశరేఖలు గోచరిస్తు న్నాయి. ఆమె ఆభరణాలేమీ ధరించలేదు. కొంచెంసేపు పుస్తకాన్ని తిరగ వేసి పుస్తకం ప్రక్కనపెట్టి ఆమె సోఫాలో జేరగిలబడి కూర్చున్నది.

ఆమె కన్నులలో నీరు తిరిగింది ఎంత ప్రయత్నించినా ఆగక రెండు కన్నీటిబిందువులు సోఫాలో పడ్డవి.

కొంతసేపటికి సురేంద్రబా బా గదిలోకి వచ్చాడు. నేలమీద తివా చీలు పరచివున్న కారణంగా అతను వస్తున్నప్పుడు చప్పుడు కాలేదు. అందుచే అతనిరాకను మాలతి గమనించలేదు. ఆమెకన్నులవెంట అశ్రుజలం మామూలుగానే ప్రవహిస్తున్నది.

సురేంద్రబాబు నిశ్చలభావంతో ఆమెకంకే చూచాడు. మెల్లగా ఆమె సమీపమునకు వెళ్ళి "మాలతీ!" అని పిలిచాడు.

సురేంద్రబాబుమాట చెవినిపడగానే "రండి, కూర్చోండి" అన్నది. మాలతి.

సురేంద్రబా బామె ప్రక్కనేకూర్చుండి ఆమెచేతులు తన చేతుల లోనికి తీసుకొని "నీవు మరల కన్నీరుకారుస్తున్నావా?"అని ప్రశ్నించాడు.

అప్పటి పరిస్థితిబట్టి 'లేదు' అని చెప్పలేకపోయింది. మాలతి మౌనంగా ఊరుకొన్నది.

'నీవు కన్నీరు కారుస్తున్నావా?'

మాలతి మాట్లాడలేదు.

సురేంద్రబాబు కొంచెంసేపు మూనంగావుండి తరువాత ఆమెచేయి గట్టిగా పట్టుకొని 'నేను లక్ష ప్రయత్నాలుచేసికూడా నీ జీవితాన్ని సుఖ మయంచేయలేనందుకు విచారిస్తున్నాను. ఎంత ప్రయత్నించినా నీ హృదయఫలకంమీద నా అధికారముద్ర వేయలేకపోతున్నాను' అన్నాడు.

మాలతి దీనికి సరియైన జవాబు చెప్పవలెననుకొన్నది. కాని అస మర్థురాలైనది. ఆమె కన్నీరు ఆపుకోడానికి ప్రయత్నించింది. కాని ఆపుకోలేకపోయింది. ఆమె కనులవెంట యథాప్రకారంగానే అశ్రుజలం ప్రవహిస్తున్నది.

"మానవాతీతమైన విషయమేమంటే మానవులకు తమతమ జీవితాలను యెలా సుఖమయంచేసుకోవాలో తెలియదు. బహుశా దేవతలు కూడా యీ విషయాన్ని తెలుసుకోవడంలో అసమర్థులేననుకొంటాను. నేను నా ఐశ్వర్యానికి తగినట్లుగా యీ మహలు కట్టించాను. అపూర్వ కళాఖండాల నెన్నింటినో తెప్పించి అలంకరించాను. కాశ్మీరు దేశాన్నుండి తివాచీలు తెప్పించి నేలమీద పరిపించాను. జయపూరునుండి చలువరాళ్లు తెచ్చి పరిపించాను. ఉద్యానవనాలు వేయించాను. అయితే నా జీవితం సుఖమయమైనదేనా? సుఖాన్ని గురించి కలలుగనడమేకాని నిజమైన సుఖాన్ని అనుభవిస్తున్న వెవరు ? నా దుఃఖం రోజురోజుకు అభివృద్ధి చెందుతున్నట్లుగా నాకు తోస్తున్నది. ఎవరి జీవితాన్ని సుఖమయం చేయా లని నేను ప్రయత్నించానో ఆమె సౌఖ్యంగా ఉండడం నే నెప్పుడూ చూడలేదు. నీ ముఖంలో చిరునవ్వు వెన్నెలలు చిందులాడగా నే నెన్నడూ చూడలేదు." అంటూ సురేంద్రబాబామెచేతులు విడిచిపెట్టి గడ్డం పట్టుకొని మోము పైకెత్తి "మాలతీ! ఇన్నిరోజులైనా నీవు నా యెడల ప్రసన్ను రాలవు కాలేదు. నీ ముఖంలో మందహాసరేఖలు తొణికిసలాడుతుండగా నాతో వొక్కమాట మాట్లాడవూ? ఏదీ వొక్క చిరునవ్వు."

మాలతి కన్నులొత్తుకున్నది.

"నీ సౌందర్య మెంత మనోహరంగా, ఆకర్షవంతంగా వున్నదో నేను మాటలతో వర్ణించలేను. నీవు ధరించడానికని నే నెన్ని చీరలు, రవికలు, నగలు పట్టుకొచ్చాను. కాని క్షణకాలమైనా నీవు వాటిని ధరించి

నా ముచ్చట తీర్చలేదు. నీ కృపాదృష్టిని నాపై ప్రసరింపజేయవా? నన్ను చూడగానే నీకు విరక్తిభావ మేల కలుగుచున్నది?"

సురేంద్రబాబువొడిలో తలపెట్టుకుని మాలతి విలపించసాగింది. ఆమెవిచారాన్ని చూచేసరికి సురేంద్రబాబు కన్నులలోగూడా నీరుతిరిగింది. చేతితో మాలతితల నిమురుతూ 'నీవు నావంక కన్నెత్తిఅయినా చూడడం లేదని నా తాత్పర్యంకాదు. నిన్నుగురించి నా మెదడులోకి పలురకాలైన ఆలోచనలు వస్తున్నవి. ఈరోజు నా హృదయాన్ని విప్పి నీముందు పెడదామనుకొన్నాను. ఇలా స్పష్టంగా చెప్పినందుకు నన్ను క్షమించు. నీ వే మార్గంలో పయనించాలనుకొన్నావో ఆ మార్గంలో నీచజాతిస్త్రీలు తప్ప అన్యులు పయనించరు. ఆ మార్గంలో కుళ్లు, మోసం, దగా, రోగం తప్ప శాంతి సౌఖ్యాలు లభింపవు. నీవూ, నీ కులం యీ మార్గానికి పూర్తిగా వ్యతిరేకం. నీ వెందులకు విచారిస్తున్నావో నేను తెలుసుకొనజాలను. ఒకవేళ పతితురాలనైనానే అని నీవు విచారిస్తుంటే నీ జీవితం క్షీణమౌతుంది.'

సురేంద్రబా బిలా ఉపన్యసించి కొంచెంసేపున్నతరువాత "నీభర్త జీవించివున్నాడా?" అని ప్రశ్నించాడు.

సురేంద్రబాబు వొడిలో తలకాయపెట్టుకొలేనే మాలతి 'లే' దన్నట్లు తలవూపింది.

'నిన్ను నా సహధర్మచారిణిగా చేసుకొంటే నీ జీవితం సుఖమయమౌతుందా? చెప్పు, చెప్పు. నే నలా చేయడానికి యీషన్మాత్రంగూడా సందేహించను.'

మాలతి అతనివొడిలోనుండి లేచికూర్చున్నది. ముఖం రెండు మోకాళ్ళమధ్య దాచింది. సురేంద్రబాబుగూడా ఆమెముఖాన్ని పైకియెత్తడానికి ప్రయత్నించలేదు. ఆమె కన్నీటిప్రవాహంలో ఆమెపాదాలు తడుస్తున్నవని గ్రహించాడు. ఆ స్థితిలో మాలతికన్నీరు తుడవడానికి కూడా అతను ప్రయత్నించలేదు. ఒక నిట్టూర్పు విడిచి అలా ప్రతిమలా కూర్చుండిపోయాడు.

కొంచెంసేపయాక సురేంద్రబాబు రుద్ధకంఠంతో 'నా కీ స్థితి యెందుకువచ్చిందో భగవంతునికే తెలియాలి, నేను నిన్ను హృదయ

పూర్వకంగా ప్రేమిస్తున్నానో లేక నీ రూపలావణ్యాలకు వశవర్తినై నీ వెంట పిచ్చివాడిలా తిరుగుతున్నానో చెప్పలేను. నే నేదీ నిర్ణయించిచెప్ప లేనిస్థితిలో వున్నాను. నా బుద్ధి అస్థిరమైనది. మంచిచెడ్డలనుకూడా గ్రహింపలేని స్థితిలో వున్నాను. నీ పాదాలచెంత నాప్రాణా లర్పించడానికి కూడా సిద్ధముగానున్నాను. భగవంతునిసాక్షిగా చెబుతున్నాను. నీ హృదయఫలకంమీద నా అధికారముద్ర వేయాలనేప్రయత్నంలో నన్ను నేను మరచిపోయాను. మాలతీ! నీకు పునర్వివాహం చేసుకోవలెనని వుంటే చెప్పు. నే నందులకు సిద్ధముగానున్నాను. కులమర్యాదలను నేను పాటించను. నీ జీవితం సౌఖ్యప్రదంకావడమే నాకు కావలసినది.'

ఇలా అంటున్నప్పుడు సురేంద్రబాబు కనులవెంట నీరుప్రవహింప సాగింది. అతని కంఠస్వరం గాద్గదికమైనది. కన్నీరు తుడుచుకుంటూ "మాలాంటివారికి వున్నత్రోవ వొక్కటే - ఆత్మహత్యచేసుకొని నరకా నికిపోవడం" అన్నాడు.

మాలతి ధైర్యం సన్నగిలింది. "ఇలాంటిమాటలు తమ నోటివెంట రానీయకండి. మీరు నాకు ప్రాణదానం చేశారు. నా సిగ్గును దూరంచేశారు. మీ కరుణామృతాన్ని నామీద కురిపిస్తున్నారు. లేకుంటే నే నెప్పుడో యీ ప్రపంచాన్ని విడిచిపెట్టేదానను. నే నధమురాలనే కావచ్చు. కాని కృతఘ్నురాలను మాత్రం కాదు. మీ విశాలహృదయము, స్నేహ వాత్స ల్యము నాకు జీవితాంతంవరకు జ్ఞప్తివుంటవి. ఇలాచేస్తే నేను ఋణ విముక్తురాల నౌతానా ?" అని అడిగింది.

సురేంద్రబా బొక నిట్టూర్పు విడిచి "ఋణవిముక్తురాల వౌతావో కావో భగవంతునికి తెలియాలి. మానవశరీరదాసులు దీనికి జవాబు చెప్ప లేరు. ఒక్క మాసంరోజులనుండి మనఃక్లేశాలతో బాధపడుతున్న నేను యీ ప్రశ్న కెలా సమాధానంచెప్పగలను? నేనొక స్త్రీకి బానిసనైనానని చెప్పుకోవడానికిగూడా సిగ్గుపడడంలేదు. నేను నా వంశ గౌరవాన్ని, పూర్వుల పేరుప్రతిష్టలను పాడుచేశాను."

మాలతి తలవంచుకొనే మెల్లగా యిలా అన్నది "నేను మీ దాసికి దాసీగా వుండడానికికూడా తగను. నాకు లేనిపోనివిలువ నెందుకిస్తారు. మీ గౌరవమర్యాదలుకూడా నాశనమౌతాయి. నేను నోటిలో బంగారు

చెంచాకో పుట్టవేదు. పుట్టెకు దుఃఖంతో పుట్టాను. మీ రేంచేస్తారు? నా జీవితంలో యిచే ఆఖరు సంఘటన కావాలని భగవంతుని ప్రార్థిస్తున్నాను."

సురేంద్రదా బెంతో ఆప్యాయంగా మాలతిని లేవనెత్తి తనవద్ద కూర్చుండబెట్టుకుని 'ఏమిచేసినా నీకు సౌఖ్యంలేదంటావు" అన్నాడు.

"మా పరిస్థితు లత్యంత శోచనీయముగ నున్నవి."

"నేను దరిద్రుడను కాను. నాకున్న సర్వస్వం నీదే."

'నేను మిమ్ముల్ను గురించి మాట్లాడడంలేదు'

'మరింకెవరినిగురించి మాట్లాడుతున్నావ్?' నీ కింకెవరైనా బంధువులున్నారా?'

"ఇప్పు డెవరైనా వున్నారో లేరో ఆ భగవంతునికే తెలియాలి. కాని నేను యిల్లు విడిచివచ్చేటప్పుడు మాత్రం అందరూ వున్నారు."

'అయితే ఆ మునిగిపోయిన నౌకలో మీవారంతా....'

'అంతా అబద్ధం. నౌక మునిగిపోలేదు.'

సురేంద్రదా బాశ్చర్యంతో ఆమెవంక చూడసాగాడు. ఇంతలో యేది సత్యం? యే దసత్యం? అంటూ అత నాలోచింపసాగాడు. తుదకు యిప్పుడు మాలతి చెపుతున్నమాటే యదార్థమనే నిర్ణయానికివచ్చాడు. ఇలా కన్నీటితెరలమాటున యింతటి అబద్ధాన్ని దాచగలదని అతను నమ్మలేకపోయాడు. తుదకెలాగో వొకనిర్ణయానికివచ్చి 'మాలతీ!' అని పిలిచాడు.

'ఏమిటి?'

'నీవు చెపుతున్నది యదార్థమేనా?'

ఈ ప్రశ్నకు జవాబుగా మాలతి తల పైకెత్తి సురేంద్రబాబువంక చూచింది. ఆమె కన్నులనిండా నీరు తిరిగింది. సురేంద్రబాబుసిగ్గుపడ్డాడు. ఆమెకన్నీరు తుడుస్తూ 'అయితే విషయమంతా వివరించి చెప్ప'మన్నాడు.

మాలతి సురేంద్రబాబు భుజానికి తలానించి విచారంగా యిలా చెప్పసాగింది. 'నేను కష్టాలలో పుట్టాను. కష్టాలలో పెరిగాను, మా నాన్నగారు యేదోవిధంగా నా వివాహమైనదనిపించారు. కాని నా దౌర్భాగ్య వశాన వొక్కసంవత్సరకాలంలోనే నా భర్తగారు పరలోకగతులైనారు.

నేను నా భర్తను ఒక్కసారిమాత్రమే చూచాను. నా భర్తగారు చని పోయినపిమ్మట అయిదుసంవత్సరాలు నేను పుట్టింటివద్దనేవున్నాను. మా నాన్న బ్రాహ్మణపాడ్ జమీందారుగారివద్ద చిన్న గుమాస్తా. అవూరు మా వూరికి ఒకమైలుదూరంలో వుంటుంది. ఆయనగారు తెచ్చే జీతపువాళ్ల మా కుటుంబపోషణకే సరిపోయేవికావు. ఎలాగో కుటుంబాన్ని యీడ్చుకు వస్తున్నాం' అంటూ ఆమె కనుల నీరునింపింది.

'అప్పుడు మీయింటిలో యెవరెవరు వుండేవారు?'

'అప్పుడు మాయింటిలో అమ్మ, నాన్న, అత్తయ్య, ఒక చెల్లెలు, తమ్ముడు వుండేవారు. జమీందారుగారి డబ్బు అపహరించాడన్న నేరారో పణతో నాన్నగారి వుద్యోగం వూడింది. బిచ్చమెత్తుకోవడంతప్ప మాకింక వేరేమార్గం లేకపోయింది. ఒకరోజు అన్నంవుంటే నాలుగు రోజులు పస్తులువుండవలసివచ్చేది. నా తల్లి చాలా అమాయకురాలు. కాసిని నూకలు దొరికినా జావకాచి అందరకూ పోసేది. మిగిలితే ఆమె తినేది. లేకుంటే పస్తుపడుండేది. ఒక్కొక్కసారి ఆమె నాలుగైదురోజులు కూడా....' ఈ మాట చెపుతూ ఆమె ముఖం చేతులతో కప్పుకొన్నది. కొంచెంసేపయాక యెలానో తెప్పరిల్లి 'కాని మా తండ్రిగారివన్నీ పట్టించు కొనేవాడేకాదు. ఆయనగారు నల్లమందు తిని గంజాయి త్రాగేవారు. నాలుగైదురోజులు యింటివంకే తిరిగిచూచేవారుకారు. నా సోదరుడు మాధవ్ సంవత్సరంనుండి మలేరియాజ్వరంతో బాధపడుతున్నాడు. అత నికి మంచి మందూమాకూ యిప్పించడానికైనా మావద్ద శక్తిలేదు. మందు లేక రోగం ముదిరిపోయింది. పురాణజ్వరంక్రింద దిగింది. బహుశా అతనిజీవిత మిప్పటికి సమాప్తమైవుండవచ్చు."

ఈ మాటలు వినగానే సురేంద్రబాబు కన్నులలో నీరుతిరిగింది.

ఇప్పుడు మాలతి కృష్ణప్రియనుగురించి, సదానందునిగురించి, ఛల నను గురించి చెప్పసాగింది. "ఛలనకు పెండ్లియీడు వచ్చింది. కాని ఒక భీదయింటి పిల్లను పెండ్లిచేసుకొనుట కెవరు సిద్ధపడతారు? పెండ్లి చేయకుండా యింట్లో వుంచుకొంటే లోకం నానామాట లంటుంది. కులంలోనుండి వెలివేస్తారు. బహుశా మమ్ముల నిప్పటికి కులంలోనుండి వెలివేసేవుంటారు. మా అమ్మ నిద్రాహారాలు మానుకొన్నది. మా నాన్న

యింటివిషయా లసలు పట్టించుకోవడమేలేదు. సదానందుడు మాకు కొండలా దొరికాడు. కాని ఆయనకూడా ఊరిలోలేడు. ఆయన తన అత్తగారిని తీసుకొని కాశీయాత్రకు వెళ్ళాడు. నాన్నగారి ఉద్యోగం పోయిన తరువాత యీవిధంగా ఆరుమాసాలు గడచినవి. ఊరిలోవా రెంతకాలమని సహాయంచేస్తారు? సదానందు డిచ్చిన డబ్బుకూడా ఖర్చయి పోయింది. అప్పటి పరిస్థితులను మాటలతో వర్ణించడం కష్టం."

ఆమె కన్నులలో నీరు తిరిగింది. సురేంద్రబాబు హృదయావేదన కన్నీటిరూపంలో వెలువడింది. 'చాలు మాలతీ! ఇప్పటి కిక చాలించు, మరెప్పుడైనా చెప్పవచ్చులే' అన్నాడు.

మాలతి కన్నీరు తుడుచుకుంటూ 'నా విషాదగాథ నేడే వివరింప దలచాను. లోకం నన్ను సుందరీ! అని పిలిచేది. ఈ కారణంగా నేను కలకత్తాపోయి యేమైనా సంపాదించదలచాను. రాత్రి సమయము. గంగా నదివద్దకు చేరుకున్నాను. గంగానది గట్టువెంబడే నడిచి కలకత్తా చేరుకో దలచాను. అందువలన నాకు రెండు విధాలైన లాభాలున్నవి. ఒకటి నన్నెవ్వరూ చూడలేరు. రెండవది యితరులను మార్గమడిగి తెలుసుకో వలసిన అవసరంలేదు. గంగానదివొడ్డుకు వచ్చి చూచేసరికి చిన్నపడ వొకటి తెరచాప సహాయంతో గంగానదిలో ప్రయాణం సాగిస్తున్నది. నాకు ఈతవచ్చును. ఈదుకొంటూ పోయి ఆ పడవచుక్కాని పట్టుకొని ప్రయాణంచేయాలనుకొన్నాను. కలకత్తా మా వూరికి యెంతో దూరం లేదని చెప్పుకొంటూండగా విన్నాను. కాని కలకత్తానగర మెంత దూర మున్నదో నేను సరిగా చెప్పలేను. ఆ నావ కలకత్తా చేరుతుందనీ, దానిని పట్టుకొని ప్రయాణంచేస్తే నేనూ కలకత్తా చేరుకొంటాననీ భావించాను.

ఇలా నిర్ణయించుకొని నదిలోకి కొంతదూరం ఈదుకొంటూ వెళ్ళాను. ఇంతలో నా చీర కాళ్ళకు చుట్టుకొన్నది. నేను మునిగిపోసా గాను. చేసేదిలేక చీర వదలివేశాను. చేతిలోనుండి జారి ఆ చీర ప్రవాహం వెంట కొట్టుకొనిపోయింది. నే నలసిపోయాను. ఇంతలో నావ సమీప మునకు వచ్చింది. నేను తిరిగి యింటికివెళ్ళడం అసంభవం. కనుక పడవ చుక్కాని పట్టుకొన్నాను. పడవ ముందుకు సాగిపోతూనే వున్నది. చుక్కాని వదలిపెట్టడానికి నాకు ధైర్యంలేదు. చుక్కానివదలితే మునిగి

పోతానని భయంవేసింది. అలాగే చాలా దూరం ప్రయాణంచేశాను. అప్పు డిక వెనుదిరిగిపోవాలన్నా అసంభవమే.

నేను నా మనసులో యిలా నిశ్చయించుకున్నాను. ప్రొద్దుటనే చాలమంది....లు గంగానదిలో స్నానంచేయడానికని వస్తారు. వారినడిగి వొక చీర తీసుకొందాం. నేను నగ్నంగావుండడం చూచి వారి హృదయం ద్రవించి నాకొకచీర యివ్వకపోరు అని, తరువాత కథంతా మీకువిదితమే."

సురేంద్రబాబు మాలతిని మరింత దగ్గరగా లాక్కొని "ఇంత సాహసంచేసికూడా నీ కుటుంబాని కేమీ సహాయపడలేకపోయావుకదూ?" అని ప్రశ్నించాడు.

'లేదు'

"ఈ విషయం నాకు తెలుసు. కాని యీ విషయం చెప్పదానికే సిగ్గుపడుతున్న నీకు యింతటి సాహసం యెలావచ్చిందా? అని నా కాశ్చర్యంగానున్నది."

మాలతి మౌనంగా అతనిమాటలు వింటున్నది.

'మీ కుటుంబఖర్చులకు ప్రతినెలా యెంతయితే సరిపోతుంది?'

'ఇరవై రూపాయలు'

'అయితే ప్రతినెలా యాభైరూపాయలు పంపించు'

'మీ రిస్తారా?'

సురేంద్రబాబు చిరునవ్వు నవ్వి 'తప్పక యిస్తాను. కావాలంటే యింకా యెక్కువే యిస్తాను.'

'ఇంత కాలానికి నా జన్మ సాఫల్యమైనది.'

'చూడు మాలతీ! నీవింకొక్క పనిచేయాలి. నన్ను వివాహమాడు. ఎందుకంటే నీ నిర్మల హృదయాన్ని కళంకితం కానీయకు.'

'నేనుమిమ్ములను వివాహమాడను' అని మాలతి స్పష్టంగాచెప్పింది.

'ఎందుచేత? కులభ్రష్టనౌతానేమోనని భయమా? ఈ మాట నీవు కలలోకూడా అనుకొనవద్దు. నే నొక జమీందారుని, నావద్ద కావలసినంత ధనమున్నది. నేను నా ధనసహాయంతో నిన్ను కులభ్రష్టురాలను కానీయను. ధనికులెన్నటికీ కులభ్రష్టులు కారు."

'అయితే కులమర్యాదను పాటించనక్కరలేదా?'

"చూడు మాలతీ! నాకు సర్వసంపదలూ వున్నవి. కాని సౌఖ్యం లేదు. అందుకే నిన్నింతగా ప్రార్థిస్తున్నాను. నన్నొక్క రోజైనా సుఖ పెట్టమని నిన్ను మరీ మరీ వేడుకొంటున్నాను."

"నేను నా జీవితాంతవరకూ మీవద్దనే వుంటాను." అన్నది మాలతి కండ్లుతుడుచుకుంటూ.

"మంచిది. మాలతీ! నీకింకా ప్రపంచానుభవం లేదు. నే నీ ప్రపంచములో పూర్తి అనుభవాన్ని సంపాదించాను. నేను విశ్వాస పాత్రుడనుకానని నాకు తెలుసు. నీ ప్రేమానురాగాలను దొంగిలించి నేను పారిపోవచ్చు. నీ సర్వస్వం నా కర్పణచేశావు. నిన్ను భికారినిచేసి ఆవలకు గెంటవచ్చు. అందుకే నీ ప్రేమపాశంతో నన్ను బంధించు. దీప ముండ గానే యిల్లు చక్కబెట్టుకో."

సురేంద్రబాబు చెప్పిన మాటలన్నీ మాలతి విన్నది. తలవంచుకొని కాలిబ్రొటనవ్రేలితో నేలరాస్తూ "నే నిదివరకే నా ప్రేమపాశంలో మిమ్ము లను బంధించాను. మీకు శక్తివుంటే తప్పించుకోండి చూద్దాం. ఇతర బంధాలిక అనవసరం."

'కాని నా దృష్టిలో యీ బంధం చాలదంటాను.'

'కావచ్చు. కాని నేను మిమ్ములను పతిగా భావించలేదు.'

'ఎందుచేత? విధవా వివాహం తప్పా?'

'విధవా వివాహం మంచిదే. కాని వేశ్యను పెండ్లియాడడం తప్పు'

'అయితే నీవు వేశ్యవా?'

'మీరే బాగా ఆలోచించి యీ ప్రశ్నకు జవాబు చెప్పండి'

'ఇటువంటి మాటలు నీ నోటివెంట రానీయకు మాలతీ! నిన్ను నా హృదయంపూర్వకంగా ప్రేమిస్తున్నాను"

"అందుచేతనే నా నోటివెంట యిటువంటి మాటలువస్తున్నవి. లేకుంటే నే నెప్పుడో మిమ్ములను పతిగా వరించేదానను."

'మాలతీ!'

'ఏమిటి?'

'ఇందులకు కారణమేమిటో వివరించి చెప్పగలవా?"

'అయితే శ్రద్ధగా వినండి. ఇంతకుముందు నా శరీరాన్ని యెవరూ తాకలేదు. కాని వొకరికి నా సర్వస్వాన్ని అంకింతంచేశాను.'

'అప్పుడేమైంది?'

'కులంలోనుంచి వెలివేస్తారన్న భయంతో అతను నన్ను పెండ్లి యాడడానికి నిరాకరించాడు.'

'నీ మనస్సు నతనిపైనుంచి యెలా మరల్చుకోగలిగావ్?'

'అతను మరల్చుకొన్నట్లుగానే నేనూ మరల్చుకొన్నాను.'

'అంత తొందరలో నీ మనస్సును మార్చుకోగలిగావా?'

'నేను వేశ్యనని మీకు మొదటనే విన్నవించాను. వేశ్యలు క్షణ క్షణానికి మనసులు మార్చుకోగలరు. ఇంకా యేమైనా చేయగలరు.'

'అయితే అతను సదానందుడా?'

'కాదు. మరొకరు.'

'అయితే నీవు మనిషినిగూడా గుర్తించలేదన్నమాట. సదానందు నితో యీ మాట నీ వెందుకు చెప్పలేదు?'

ఈ మాట వినగానే మాలతికి ఎలెక్ట్రిక్‌షాక్ తిన్నట్లుగా తోచింది. ఆనాటి సంఘటనలన్నీ ఆమెకనులముందు సాక్షాత్కరిస్తున్నవి. ఆ రోజు వర్షం కురుస్తున్నది. ఆ రోజు తాను గంగానదికి వెళ్ళి బిందెతో నీళ్ళు తెస్తుండగా వర్షమారంభమైనది. వర్షంలో తడిస్తే జలుబుచేస్తుందేమో నన్న భయంతో ఆమె సదానందుని యింట్లోకి వెళ్ళింది. సదానందుడు యాభైరూపాయ లిచ్చాడు. తరువాత అతను అత్తను వెంటబెట్టుకొని కాశికి వెళ్ళాడు. ఈ విషయాలనేకం ఆమె కనులముందు సినిమా రీల్సులా తిరిగిపోసాగాయి. ఆమె కన్నులలో నీరు తిరిగింది. కాని అవి చెక్కిళ్ళ మీదకు జారకపూర్వమే మాలతి పైటచెరగుతో కన్నులొత్తుకున్నది.

'తరువాత యేమి జరిగింది?' అన్నాడు సురేంద్రబాబు ఆసక్తిగా.

'నేను కలకత్తా వెళ్లుతున్నాను.'

'వెడుతుంటే?'

'మీ కరుణార్ద్రదృష్టి నాపై పడింది. నన్ను రక్షించారు.'

'మాలతీ! నీవు సానబట్టిన రత్నంలాంటిదానవు. రత్నం చేయిజారి మురికిగుంటలో పడినా వెదకి తీసుకొంటాం.'

'ఈ మాట మీ కెవరు చెప్పారు? రత్నాన్ని కంఠసీమను ధరిస్తారు గాని కాలికి కట్టుకోరు. అలాచేస్తే రత్నాన్నే అయితే నేను ధన్యురాలను. అందులకు సర్వదా మీకు కృతజ్ఞురాలనై వుంటాను.'

'నే నింతవరకు నీవనాగరికురాలవని భ్రమపడ్డాను. నా భ్రమ యిప్పుడు పటాపంచలై పోయినది.'

మాలతి ముఖంలో చిరునవ్వువెన్నెలలు గోచరించాయి. ఇంతకాలానికి ఆమెముఖంలో మందహాసరేఖలు పొడచూపినవి.

ఇంతలో దాసీదివచ్చి 'అయ్యా! అఘోరబాబు దంపతులు వచ్చారన్నది.

'అఘోరబాబా! ఇక్కడి కెందుకు వచ్చాడు?'

'ఏదో అవసరమైన పనివుంది వచ్చారట'

సురేంద్రబాబు లేచి 'సరే, నేను వెళ్ళివస్తాను మాలతీ!' అన్నాడు.

'మంచిది. అఘోరబాబును పరిచయంచేసి వెళ్ళండి.'

'ఇప్పుడుకాదు తరువాత చెపుతాను'

'అయితే ఒక్కమాట చెప్పండి. అఘోరబాబు వివాహ మెక్కడ జరిగింది?'

'ఏం? నీ పతనిని యెరుగుదువా?' అన్నాడు సురేంద్రబాబు చిరునవ్వు నవ్వుతూ.

'ఎటిగివున్నట్లే జ్ఞాపకం.'

# 24

'జాతస్య మరణం ధృవం' అన్నారు. ఆకాశంలోకి రాయి విసరితే తప్పక నేలమీద పడుతుంది. హత్యచేసినవానికి ఉరిశిక్ష, దొంగతనంచేసినవానికి జైలు తప్పవు. అలాగే అన్యోన్యం ప్రేమించుకొనేవారికి ఆనందాశ్రువులు రావడం సహజం. ప్రేమభిక్షను పొందలేనివారు యేడవడం సహజం, కాని యీ విషయాన్నిమాత్రం యెవరూ బయటకు వెల్లడించరు. భగవంతుని ప్రేరేపణవల్ల కనులు నీళ్ళతో నిండుతాయో లేక వారివారి పనులను పూర్తిచేసుకోవడానికై యేడుపును సాధనంగా తీసుకొంటారో చెప్పడం కష్టం.

అశ్రుజలంతో తన ప్రేమను వెల్లడింపడం చిరకాలంగా వస్తున్న ఆచారం. ఈ ఆచారానుసారంగానే లోకం కన్నీరు విడుస్తున్నది. కాని యిది సరియైన ఆచారంకాదు. సరియైన ఆచారాన్ని లోకం గుర్తించలేదు. ప్రేమభిక్షనుపొందిన తరువాతగూడా ఎవరైతే కన్నీరు కారుస్తారో అదీ నిజమైన ప్రేమ. అవీ నిజమైన ప్రేమాశ్రువులు. మనలాంటి అభాగ్యులకు జీవితంలో యిలాంటి రసాస్వాదనం చేయడానికి అవకాశం చిక్కడంలేదు. ప్రేమభిక్షకోసమని యేడ్చియేడ్చి యిందులో అమృతమున్నదో హాలాహల మున్నదో పరీక్షించాలనే కోరిక ప్రబలంగా వుంటున్నది.

నే నీ ప్రేమమైదానంలో కాలు పెట్టడానికి కారణ మేమంటే లోకం దీనిని గురించి అప్రియంగా చెప్పుకోవడమే. ప్రేమవలన యీ హృదయ విదారకమైన సంఘటనలు జరుగుతాయని లోకమంటుంది. ఈ మాట వినగానే నా శరీరం కంపిస్తుంది. నేను వందగజాలు వెనుకకు పోతాను. నిరాశాహృదయంతో తిరిగి రావలసివస్తుందేమోనన్న భయం. ఇందుచే నేను ప్రేమ పరీక్ష చేయదలచలేదు. కాని ప్రేమపరీక్ష చేయాలనే కోరికమాత్రం నాలో చావలేదు. ప్రేమకోసమని యేడ్చేవాళ్ళను నేను చాటున దాగి చూచాను. వాళ్ళకు కలుగబోయే కష్టాలను ఊహించుకొంటే నాశరీరం కంపించేది. ప్రేమికులను లోకం పిచ్చివాళ్ళంటుంది. ప్రేమ గ్రుడ్డిదట. నేనూ కొంతకాల మీ మాటలు నిజమని నమ్మాను. కాని నా కిప్పు డీమాటలలో నిజం కనిపించటంలేదు. ఇలాంటి పిచ్చివాళ్ళు ప్రపంచంలో కోట్లకొలది వున్నారు. యిలాంటి పిచ్చిలోగూడా జీవితంలోని గొప్పగొప్ప కార్యాలు సాధింపబడుతున్నాయి.

సురేంద్రబాబు వెళ్ళిపోయాడు. మాలతి నేలమీద పండుకొన్నది. ఆమె యెంతగా ఏడ్చిందో చెప్పలేం. బహుశా ఆమె తన చిన్ననాటి ప్రేమ, యీనాటి ప్రేమలోని తారతమ్యాలను గురించి ఆలోచిస్తూ పండుకొని వుంటుంది. ఆమె తన కోర్కెల నన్నిటినీ చంపుకొని ప్రేమిస్తున్నది. ఆమె ప్రేమలో కృతజ్ఞతాభావ మిమిడివున్నది. తన సౌఖ్యం కొరకే ఆమె అలా చేస్తున్నదని యెవరైనా అనగలరా?

'నేను నా ప్రాణాలకంటే యెక్కువ మిమ్ములను ప్రేమిస్తున్నాను. మీ పాదాలచెంత ప్రాణాలు విడవడానికిగూడా సిద్ధముగనున్నాను.

నాచలన మీ: క్షేమయినా కళంకం వచ్చినదా? నలుగురూ నాలుగువిధాల చెప్పుకుంటున్నారు. మీమీద మాటపడితే నేను సహించలేను. నన్నిక్కడెవరూ యెరుగరు. అందుచే నాకేమీ భయంలేదు. కాని మీరు కులీనులు. మీ కేదైనా కించిత్తు అవమానం జరిగితే లోకానికి యిట్టే తెలిసిపోతుంది. మీ రొక వేశ్యను పెండ్లిచేసుకొన్నారని లోకం అపహాస్యం చేస్తుంది. సమాజం మిమ్ముల నగౌరవంగా చూస్తుంది. అప్పుడు మీ హృదయానికి బాధ కలుగుతుంది. ఇలా జరగడానికి వీలులేదు.'

మనసు కాస్త కుదటబడినపిమ్మట లేచి కూర్చుని కండ్లుతుడుచుకొని "హే భగవాన్!? నే నెన్ని తప్పులుచేశానో నీకు తెలుసు. కాని ఆ రోజుమాత్రం మరపునకు రానీయకు. ఈ ప్రపంచంలో నా కింకెక్కడా తావులేదు. నే నెప్పుడయినా నా భర్తగారిచేత వంచింపబడితే వెంటనే నీ పాదపద్మముల సన్నిధికి నన్ను చేర్చుకో"

ఇలాంటి ఆలోచనలతో ఆ రాత్రంతా మాలతి అక్కడే గడిపింది. సూర్యోదయమైనది. మధ్యాహ్నమైనది. తిరిగి సూర్యాస్తమయమైనది. కాని సురేంద్రబాబు తిరిగి రాలేదు. పగలంతా ఆయనకొరకు యెదురు చూచింది. తుదకు రాత్రి చాల ప్రొద్దుపోయినతరువాత అతను వచ్చాడు. అతనిముఖం వాడిపోయివున్నది. అతనిముఖం చూడగానే మాలతికి సందేహం కలిగింది. కాని అతను లోపల కాలు పెడుతూనే నవ్వుతూ 'మాలతీ! నీవు నా కొరకై నిరీక్షిస్తున్నావుకాబోలు' అన్నాడు.

మాలతి నిరుత్తరురాలైనది.

'ప్రతిరోజూ యేదో వొక వ్యాజ్యం వుంటుంది. డబ్బున్నవాడికి వ్యాజాలు ఎక్కువగా వుంటవి.'

'వ్యాజ్యా లెందుకు?'

ఈ మాట వినగానే సురేంద్రబాబుకు నవ్వువచ్చింది. 'ముందు నీవు నాదానవు కమ్ము. తరువాత యిదంలా నీ దనుకో. అప్పుడు వ్యాజ్యం ఎందుకు ఆడవలసి వస్తుందో నీకే తెలుస్తుంది.'

మాలతి సాదరంగా అతనిమాటలు వింటున్నది.

'నా మాట నీ వొప్పుకుంటావా?'

'ఏ మాట?'

'విన్నటిమాట అప్పుడే మరచిపోయావ్?'

'మరచిపోలేదు. జ్ఞాపకమున్నది.'

'తప్పక జ్ఞప్తి యుంటుంది. నీవు దానిని గౌరవిస్తావనుకుంటా.'

'గౌరవిస్తాను. కాని నిన్ను నేను పెండ్లిచేసుకోవడ మసంభవం.'

'అసంభవమా? ఏమంటున్నావ్?'

"నేను మొదటనే యీ విషయాన్ని గురించి విశదంగా చెప్పాను."

"ఏమంటున్నావ్? నేను నిన్ను తప్పక పెండ్లియాడి తీరుతాను."

"నే నిక్కడకువచ్చి మాసంరోజులకు పైబడింది. ఈ కోర్కె మీకు నిజంగావుంటే యిన్నిరోజు లెందుకువూరుకున్నారు? జయావతి మరణించిందిగనుక మీ కిప్పుడు మరొక వేశ్య అవసరమైనది. అంతేనా?"

"అంతే. అంతే. నా వుద్దేశ్యంకూడా అదే .... నేను ...."

"మీరు నన్ను బలవంతంగా పెండ్లిచేసుకొంటే నేను విషంత్రాగి ప్రాణత్యాగం చేసుకొంటాను."

'ఆ విషయం తరువాత ఆలోచిద్దాం. ఒక వారంరోజులలో పెండ్లి ప్రయత్నాలన్నీ యేర్పాటు చేయిస్తాను."

"ఈలోపలనే మీరు నన్ను చూడలేరు."

సురేంద్రదా బాశ్చర్యంగా 'ఎక్కడికి వెడతావ్?"అని ప్రశ్నించాడు.

"ఎక్కడకు వెళ్ళవలెనని వుంటే అక్కడకు వెడతాను."

"ఆత్మహత్య చేసుకొంటావా?"

"లేదు. ఆ వనినాచేతగాదు. నా మొదటిమార్గంలోనే పయనిస్తాను."

"అయితే వివాహబంధంలో చిక్కుకొనడం నీ కిష్టం లేదా "

"లేదు"

ఆమె ధృఢసంకల్పాన్నిబట్టి ఆమె చెబుతున్న మాటలలో లేశ మాత్రంకూడా సందేహంకలుగలేదు సురేంద్రబాబుకు. అత నాలోచనా సాగరంలో పడ్డాడు. తరువాత చిరునవ్వునవ్వి. "మంచిది. అది నీ ధర్మం. అదే సరియైన మార్గ" మన్నాడు.

ఈ మాటలకు మాలతి జవాబుచెప్పలేదు. కొంచెంసేపు యిరువురూ మౌనంగావున్నారు. కొంతసేపయాక సురేంద్రబాబు "మీ యింటికి డబ్బు వంపించావా?" అని ప్రశ్నించాడు.

"లేద"న్నట్లు మాలతి తలవూపింది.

"ఎందుకు పంపించలేదు?"

మాలతి జవా బివ్వకపోవటాన్నిబట్టి ఆమె దుఃఖిస్తున్నదని గ్రహిం చాడు సురేంద్రబాబు. "ఏం, నీ వద్ద డబ్బులేదా?"

"లేదు."

"ఏమీ లేదా?"

"లేదు."

'ఇంతవరకూ నీవు కొద్దిమొత్తాన్నయినా ప్రోగుచేయలేకపోయావా'

మాలతి ఏడువసాగింది. ఆమె ఈ ప్రశ్నకు జవాబు చెప్పలేక పోయింది. అత నీ ప్రశ్న పూరకే వేశాడు. ఆమెవద్ద చిల్లికానీగూడా లేదని అతనికి తెలుసు. ఆమెను తన దగ్గరకు లాక్కొని చేతితో తల నిము రుతూ "నీవు కావాలనే యిలా కష్టాలు కొనితెచ్చుకొంటున్నావ్. ఇంమ లకు నే నేంచేయను? మంచిచీరకట్టుకోవు. మంచిమంచి నగలుపెట్టుకోవు. నా కిది కావాలి, అది అక్కరలేదని నాతో చెప్పవు. నీవు చెప్పకపోతే నాకెలా తెలుస్తుం"దంటూ అతను జేబులోనుండి నోట్లకట్టనుతీసి "ఇవిగో యీనోట్లు తీసుకో. నీవు ఇంటికి యెంత పంపించాలనుకుంటావో అంతా పంపించు. మిగతాది నీ యిష్టంవచ్చినట్లు ఖర్చుచేసుకో. ఇంకా అవసర మైతే నన్నడుగు యిస్తాను."అంటూ చిరునవ్వునవ్వి "ఇప్పుడైనా డబ్బు నిలవజేయడం నేర్చుకో" అన్నాడు.

అతని మాటలువింటూ మాలతి అలాగే నిలబడిపోయింది.

"మరచిపోకు. ఇవాళ మీ యింటికి తప్పక డబ్బు పంపించు."

"ఎలా పంపను?"

"మనియార్డరుద్వారా."

"నాకు తెలియదు. మీరే మారు పేరుతో పంపించండి."

"అలా యెందుకు? ఓహో! నీ పేరుతో పంపిస్తే నీ ఉనికి మీ వాళ్ళకు తెలిసి వారువచ్చి నిన్ను తీసుకుపోతారని భయమా?

"అవును"

"మంచిది. అఘోరబాబుతో చెపుతాను. అతను నా వకీలు, అతను కలకత్తాలో వుంటున్నాడు. అక్కడనుండే పంపిస్తాడు."

అలా చేస్తే మంచిదే. కాని అతను నా విషయం అడిగితే యేమని చెపుతారు?

"ఉన్నది ఉన్నట్టు చెపుతాను"

"కొంపతీసి అలా చెప్పకండి.నావిషయం యెవరికీతెలియకూడదు"

"సరే. అలాగే"

# 25

జయావతి మరణించింది. కాని ఆమెతల్లి ఇంకా జీవించియే యున్నది. నారాయణపురానికి ఉత్తరదిశగా కొద్దిదూరంలోనున్న నాస్పూర్‌లో ఆమె నివసిస్తున్నది. ఆ వూళ్ళోనున్న ఒకరిద్దరు భ్రష్టాచారులు తప్ప యితరులకు ఆ తల్లీ కూతుళ్ళు యెలా వుంటున్నారో, యేమి చేస్తున్నారోగూడా పట్టేదికాదు. ఆ విషయ మలా వదిలేద్దాం.

ఇలా వుంటూ జయావతి యెలానో నారాయణపూరు జమీందారు గారి హృదయా న్నాకర్షించింది. తల్లీ కూతుళ్ళిరువురూ నారాయణపూర్‌లోనే కాపురంపెట్టారు. వాళ్ళస్థితి మూడుపూవులు ఆరుకాయలుగ నున్నది. ఇలా అయిదు మాసాలు గడిచినవి. తల్లీ కూతుళ్ళమధ్య తగాదా వచ్చింది. ఈ తగాదా వాగాముదిరి ఒకరినొకరు తిట్టుకొనేదాకా వచ్చింది. "నీ పీడ ఎప్పుడు విరగడవుతుందే" అని తల్లి అంటే "నీ కాష్టం యెప్పుడు కాలుతుందే" అని కూతురనేది. తల్లిచావుకు కూతురూ. కూతురుచావుకు తల్లీ దేవతలకు మ్రొక్కులు మ్రొక్కుకునేవరకు వచ్చింది పోట్లాట.

ఇలా పోట్లాటలతో యిరువురూ యింకొక ఆరుమాసాలు గడిపారు. తుదకు విధిలేక తల్లి తన తట్టా బుట్టా చంకనబెట్టుకొని స్వగ్రామం చేరక తప్పలేదు. మొదట్లో తన స్వగ్రామం విడిచివెళ్ళాలని తల్లికిలేదు. చేసేది లేక జయావతివెంట కన్నీరు కారుస్తూ వెళ్ళింది. ఆమె ఆశలన్నిటినీ యెక్కడయితే విడిచిపోయిందో తిరిగి అక్కడకే వచ్చింది.

తల్లి మూటాముల్లె సర్దుకొని అటు వెళ్ళగానే సురేంద్రనాథు తన నౌకర్లకు యిలా ఆజ్ఞాపించాడు."ఇక నాముసలిదానిని యిక్కడకు రానివ్వకండి. వస్తే మక్కెలిరగబొడవండి."

కాని యీ ఆదేశం అక్షరాలా పాటించబడలేదు. అప్పుడప్పుడు ముసలిది నారాయణపూర్ వచ్చేది. కూతురుయింట్లోకి పోయి దుమ్మెత్తి పోసేది. ఇంతలో కూతురు యెదురుతిరిగి నాలుగు తిట్టి కళ్లుపుచ్చుకోగానే గుండెలు బాదుకొంటూ, తలపీక్కుంటూ, పెద్దగా యేడుస్తూ, కూతుర్ని పిచ్చికూతలు కూస్తూ స్వగ్రామం తిరిగివెళ్ళేది.

ఇలాంటి సంఘటన నెలకొకపర్యాయమో రెండు నెలల కొక పర్యాయమో జరుగుతుండేది. బహుశా యిందులో వ్యక్తిగతలాభమేదో అంతర్గతంగా వుండివుంటుంది. లేకుంటే యిలా నెలకొక పర్యాయం పోట్లాటకురాదు. ఆ కూతురుమూలంగానే తాను ముసలితనంలో యే కష్టం లేకుండా సుఖంగా జీవిస్తున్నది. అది అలా వుంచండి.

బహుశా కూతురుమీద తల్లికి ప్రగాఢమైన ప్రేమ వుండివుంటుంది. లేకుంటే జయావతి తప్పుడుమార్గ మవలంబించినప్పుడే తన నిరసన తెలియజేసేది. ఒకవేళ జయ తనమాట వినకపోతే ఆమెముఖంవంక చూచేదికాదు.

ఇలా రోజులు గడుస్తున్నవి. ఒకనాడు జయావతితల్లికి తనకూతురు గంగానదిలోపడి చనిపోయిందనే కబురు తెలిసింది. ఈ మాట వినగానే ఆమె గుండెలు బాదుకొంటూ, బయలును కౌగలించుకొని బావురుమన్నది. ఆమె యేడుపు విని చుట్టుపట్లవారంతా ప్రోగయ్యారు.

బాస్‌పూర్ గ్రామంలో నిమ్నజాతులవారిసంఖ్యే యెక్కువ. ఆ ఊరిలోనున్న ఆబాలగోపాలం ఆ యింటిచుట్టూ మూగారు. వారంతా అక్కడచేరి గుసగుసలుపోసాగారు....'ఒక ఊరంతవోడ కలకత్తాదగ్గర మునిగిపోయిందట. అందులో జయావతి, ఆమె దాసదాసీలు అయిదు వందలమంది వున్నారట. పాపం వొక్కరుగూడా బ్రతికిబయటపడలేదట'

ఈ మాటలువిని జయావతితల్లి "అంత పెద్దవోడ కలకత్తాలోనే లేదంటమ్మా" అన్నది.

ఇంతలో ఒక ముసలమ్మ అందుకొని "నిజమేనమ్మా, అంత పెద్ద ఓడ కలకత్తా మొత్తంమీదే లేదు" అని సమర్థించింది తాను చూచినట్లే.

ఒకప్రౌఢ ఆశ్చర్యంగా "ఆ వోడ యెంతఖరీదుంటుందమ్మా?" అని ప్రశ్నించింది.

"ఎంత ఖరీదుంటుందో యెవరు చెప్పగలరు?

ఈ మాటలతో ప్రశ్నవేసిన ప్రౌఢనోరు మూతపడింది.

పై ప్రాయిగారుగూడా చూడటానికి వచారటమ్మా" అన్నది జయావతి తల్లి.

జయావతితల్లి పైటచెరగుతో కండ్లు తుడుచుకొన్నది. ముసలిదాని నోటినుండి వెలువడుతున్న ముత్యాల్లాంటి యీమాటలు వింటున్నవారంతా "ముసలమ్మ పూర్వజన్మపుణ్యమే జయావతి రూపంలో జన్మించింద"ని తలపోయసాగారు.

"మా జయ అపురూపసౌందర్యవతి. దుర్గాస్వరూపిణి. అందంలో ఆమెకు సాటిరాగలవారీ ప్రపంచములో లేరు. ఆమెముక్కు కోటేరు వేసినట్లుంటుంది. ఆమెకనులుతామరపద్మాలు. కనుబొమలు తీర్చిదిద్దినట్లుండేవి. ప్రతి అవయవము మలచినట్లుంటుంది. బ్రహ్మదేవుడు తీరిక సమయాల్లో కూర్చుని ఆమెను అపురూపసుందరిగా తయారుచేశాడు. ఆమె శరీరంమీద యెక్కడైనా యింత పుట్టుమచ్చన్నా లేదు."

అక్కడ చేరిన యువతులంతా ముసలిదాని మాటలు మౌనంగా వింటున్నారు. ఇక ముసలివారు 'నీవు చెప్పింది పదహారణాల నిజమమ్మా' అని సమర్థించారు.

"బాబుగారుగూడా అమ్మాయిని ప్రాణంకంటే యెక్కుడుగా ప్రేమించేవారు. ఆమె యేదికోరితే అది తెచ్చియిచ్చేవారు. కన్నులలో పెట్టుకు పూజించేవారు. ఇలాంటి పెద్దవారిప్రాపు సంపాదించడ మెంత కష్టం? మాటలతో అయేవనా?"

ఈ మాటనుగూడా అందరూ యేకగ్రీవంగా ఆమోదించారు.

"నేనింక యెక్కువకాలం జీవించను. ఈ దుఃఖం నన్ను మరీ కృంగదీస్తున్నది."

అక్కడ చేరినవారిలో యీ మాటను సందేహిస్తున్నవారుగూడా వున్నారు కాని, అందరితోపాటు వారూ తమ సానుభూతిని చూపించారు.

"జమీందారుగారు బాగున్నారా?" అని వొకామె ప్రశ్నించింది.

"ఆయన క్షేమముగానే యున్నారు. ఆయన యింకొకవోడపై వున్నారు" అని చెప్పింది జయతల్లి.

"అయితే జయావతి, జమీందారు వేరువేరు ఓడలపై ప్రయాణం చేస్తున్నారన్నమాట."

"అవును. లేకుంటేఆయనగూడాఆమెతోపాటే మునిగిపోయేవాడు. ఆయన లేకపోతేనేం, నౌకర్లు, చాకర్లు చాలామంది వున్నారు."

"వారంతా యేమైనారు?"

"గంగమ్మతల్లి అందరినీ తన పొట్టనబెట్టుకొన్నది."

"ప్రొద్దుక్రుంకవస్తుందమ్మా. వంటచేయాలి. పాలుతీయాలి, కసవు చిమ్మాలి. దీపాలు వెలిగించాలి" అంటూ ఒకరొక్కరుగా అక్కడినుండి వెళ్ళిపోయారు. అందరూ వెళ్ళిపోయినతరువాత జయావతితల్లిలేచి వంట చేసికొని భోజనంచేసి తలుపులు బిగించుకొని పండుకొన్నది. ఆమె నిద్ర పట్టేవరకు కూతురును తలుచుకొంటూ చీదేస్తూనే వున్నది.

తెల్లవారింది. జయావతితల్లి నారాయణపూర్ చేరింది. అక్కడి రోడ్లపైగాని, మేడలలోగాని, చెట్లుచేమలలోగాని యేవిధమైన పరివర్తనం రాలేదు. జయావతితల్లి కవన్నీ పరిచయమే. ఆమెకు వెనుకటి సంగతులన్నీ గుర్తికి రాసాగినవి. ఆమె మనసులో యిలా అనుకోసాగింది. "నాతో పోట్లాడడానికి నా కూతు రిప్పు డీ ప్రపంచంలోలేదు. కనుక అలాంటి పోట్లాట యిప్పుడు రావడానికి అవకాశంలేదు. ఇప్పుడు గుండెలు బాదుకొంటూ యింటికి తిరిగిపోవలసిన అవసరంగూడా లేదు."

కూతురు జ్ఞప్తికిరాగానే ఆమె మనసులో బాధపడింది. కాని యెలానో ధైర్యాన్ని చిక్కబట్టి ఆమె ముందుకుసాగింది. దారినపోయే వారంతా ఆమెవంక యెగాదిగా చూడసాగారు. ఆమె యివేమీ పట్టించుకోకుండా సురేంద్రబాబు మహలువద్దకు చేరింది. జయావతి స్మృతిచిహ్నాలనేకం ఆమె హృదయఫలకంమీద నున్నవి. మహలువద్దకు రాగానే ఆమె చీదేయసాగింది. ఇదివరకెన్నడూ ఆమె మహల్లోకి సింహద్వారం గుండా వెళ్ళలేదు. ఇందులకు కారణం సురేంద్రబాబీ ముసలిదానిని లోపలకు అడుగుపెట్టనీయవద్దని నౌకర్లతో చెప్పడమే. రాత్రింబవళ్ళు సింహద్వారంవద్ద పహరా వుంటుంది. కాని నే డామె పహరావాళ్ళను లక్ష్యపెట్టలేదు. తల విరియబోసుకొని, కండ్లు పెద్దవిచేసి దెబ్బతిన్న

పులిలా లోపలకు ప్రవేశించింది. ఆమె నడ్డగించగల సాహసం పహరా వాళ్ళకు లేకపోయింది. అంతా నిర్విణ్ణులై చూస్తూవూరుకొన్నారు. ఆమె వస్తున్న వూపుచూచి అంతా పదిగజాలు వెనుకకు సర్దుకొన్నారు.

ఆ సమయంలో సురేంద్రబాబు భోజనంచేస్తున్నాడు. ఆయ నిప్పుడు విశ్రాంతి తీసుకొంటున్నాడు. ఈ చీత్కార మతని చెవినివడింది. వెంటనే జయావతితల్లి లోపలకు వచ్చిందని గ్రహించాడు.

జయావతితల్లి. సురేంద్రబాబును చూడగానే "నా పిల్లను నాకు తెచ్చివ్వు బాబూ! నీ పాదాలు పట్టుకొంటాను. నీ కడుపున పుడతాను. నా బిడ్డను నాకు చూపించు నాయనా! నీకు పుణ్యముంటుంది. నా బిడ్డ లేకపోతే నేను బ్రతకలేను. దానిని చూచుకొంటూ యిన్నాళ్ళు బ్రతికాను" అంటూ ప్రాధేయపడింది. ఏడ్చింది. తల పీక్కొన్నది. గుండెలు బాదుకొన్నది. ఇంకా యేమేమి చేసిందో వర్ణించడ మనవసరం.

"ఇంట్లో చిల్లికానీలేదు. ఇంక నే నెలా బ్రతకను" అంటూ ఆమె తన చేష్టల నాపింది. 'ఈ సమయంలో మీరు నాకేదైనా సహాయం చేయాలి. లేకుంటే నే నిక్కడే ఉరిబెట్టుకొని చచ్చిపోతాను.'

"జరిగిపోయిందేదో జరిగిపోయింది. నీకిప్పుడేమిసహాయంకావాలి? ఏం చేస్తే నీకు యిబ్బందిలేకుండా గడుస్తుంది?"

"మీ రేమిచ్చినా నా జీవితం వెళ్ళమారిపోతుంది. నావద్ద చిల్లి గవ్వలేదు. నేను విధవరాలిని. ఒంటరిదానను. నాకు యెక్కువ డబ్బువ సరంలేదు."

"అయితే యెంత యివ్వమంటావ్?"

"నెలకు పదిహేను రూపాయలు చాలు."

"సరే. నీ జీవితాంతంవరకూ అలానే యిస్తాను. వచ్చి తీసుకు పోతూవుండు."

ఈ మాట వినగానే జయావతితల్లి ఆనందానికి మేరలేకపోయింది. సురేంద్రబాబును దీవించింది.

ఈ దఫా ఆమె యేడుస్తూ గుండెలు బాదుకొంటూ వెళ్ళలేదు. "నా తల్లి చచ్చి స్వర్గాన్నున్నా నా కేదో యింత దారిచూపించింది. కూతు రంటే యిలా వుండాలి" అనుకొనబోచ్చింది.

జయావతితల్లి సురేంద్రబాబుదగ్గరనుండి నౌకర్లుండే యింటివైపుకు వెళ్ళింది. అక్కడ యీమెను యెరిగినవాళ్ళున్నారు. వారంతా యీమెను చూడగానే తమ సానుభూతిని వ్యక్తపరచారు. ఒకరిద్దరి కనులలో సానుభూతిసూచకంగా నీరుగూడా తిరిగింది. జయావతితల్లి వారితో అనేక విషయాలు ముచ్చటించింది. సురేంద్రబాబు తనపై చూపించిన దయ విషయంగూడా ఆమె వారికి చెప్పింది. జయావతి చనిపోగానే సురేంద్రబాబు మరొక వేశ్యను తీసుకొనివచ్చి మహాలులో వుంచాడని అందులో వొకరు ముసలిదాని చెవినివేశారు. క్షణంలో ముసలిదాని ముఖాకృతి మారిపోయింది. కనులు నిప్పులు కురిపిస్తున్నాయి. భ్రుకుటిముడివడింది. పండ్లు పటపటాలాడించింది.

క్రోధావేశంతో జయావతితల్లి తను యెక్కడవున్నదీ, యెవరితో మాట్లాడుతున్నానా అనే సంగతి మరచిపోయింది. ఆమె తనను తానే మరచిపోయింది. సురేంద్రబాబు తీసుకువచ్చాడన్న వేశ్యను తిట్టసాగింది. ఏడ్వజొచ్చింది. గుండెలు బాదుకోసాగింది. జుట్టంతా పీక్కోసాగింది. ఆమెస్థితి చూచి నౌకర్లంతా వణకిపోయారు. వారంతా భయపడుతూ మెల్లగా యిలా అన్నారు. "నీవిలా యేడుస్తూ ఆమెను తిడుతుంటే నీకు జమీందారుగారు యిస్తానన్న డబ్బుకూడా యివ్వరు. పైగా తన్ని తగిలేస్తాడుకూడా" వీరిమాట లామెచెవికెక్కలేదు. చివరికెలానో యీముసలి దానిని వదలించుకొనేసరికి వారి తలప్రాణం తోకకు వచ్చింది.

ముసలిది సురేంద్రబాబు ఉద్యానవనంలోనున్న మహాలు వద్దకు వెళ్ళింది. ఆమె పుత్రీవియోగదుఃఖ మధికంకాజొచ్చినది. ఆమెలోని పశుప్రవృత్తి విజృంభింపసాగింది. ఆమె మనసులో యిలా తిట్టుకోసాగింది. 'ఈ పాడుముండే నా కూతురునుచంపి దానిస్థాన మిది ఆక్రమించుకొన్నది. ఇదేమి బావుకొంటుందో చూస్తా'నంటూ ఆ మహాలులోకి జొరబడింది. ఆమె కెదురైన దాసీలతో "ఏది ఆ చండాలిని యెక్కడున్నది? తప్పుడు ముండ! నా కూతుర్ని అన్యాయంగా చంపింది." అని ప్రశ్నించింది."

వారంతా భయపడుతూ "అదిగో అక్కడున్న" దన్నారు.

ఆ ముసలిది యెలా ప్రశ్నించిందో జవాబుకూడా అలానేవచ్చింది.

"అక్కడంటే యెక్కడ?" అని మరల ప్రశ్నించింది.

"అదిగో అక్క"డంటూ దాసీది వ్రేలితో చూపించి అక్కడనుంచి వెళ్ళిపోయింది.

జయావతితల్లి దాసీది చూపించిన గదివద్దకు వెళ్ళి లోపలకు తొంగి చూచింది. ఆ గదిలో ఆమెకెవరూ కనిపించలేదు; కాని ఆ గదికి చేయ బడిన అలంకరణ చూచి ఆమె ముగ్ధురాలైనది. "ఈ గది యెంత అంద ముగనున్నది? ఇక్కడెంతటి అమూల్యములైన వస్తువులున్నవి? నేనెన్నో పర్యాయము లిక్కడకు వచ్చాను. ఎన్నోపర్యాయము లీ గది చూచాను. కాని యింత అందంగా యెన్నడూలేదు." ఆ గదిని చూస్తుంటే ఆమెకు ఆనందంతోపాటు కోపంకూడా పెరగజొచ్చింది. 'ఈ వస్తువులన్నీ మా జయావతివే. అందుచే నాకేచెందాలి. ఈవిడెవరు అనుభవించడానికి?' అని అనుకోసాగింది.

ఇలా అనుకొంటూండగా ఆమె కొక స్త్రీ కనిపించింది. ఆమెకూడా పరిచారికే అనుకొని "చెప్పు, మీ యజమానురాలు యెక్కడున్నదో చెప్పు" అని గద్దించింది.

ముసలామెమాటలో కఠోరతవున్నది. ఆ స్త్రీ వెనుదిరిగి ముసలిదాని వంక చూచింది. ఆమె మామూలువస్త్రాలే ధరించింది. శరీరంమీద ఆభరణాలేమీ లేవు. ఆమె నిర్భయంగా ముసలిదానివంక చూచి "ఎవరు నీవు?" అని ప్రశ్నించింది.

"నీ విక్కడకువచ్చి యెన్నిరోజులైంది?"

"సుమారు మాసంరోజులకు పైబడింది."

"మీ యజమానురా లెక్కడున్నది? బహుశా నీ వామెతో వచ్చా వనుకొంటాను.

"నీ కామెతో యేమైనా పనివున్నదా?"

జయావతితల్లి కన్నులప్పళించి "ఉన్నది. ఆమెతో నాకు చాలా పనివున్నది. ఆ చండాలిదాని యివాళ నమిలి మ్రింగుతాను" అంటూ ఆమె పండ్లుకొరికింది. ఆమెకంఠస్వరంలో కర్కశత్వమున్నది. ఆమెకన్నులు అగ్నిగోళాల్లా ప్రకాశిస్తున్నవి. తలంతా రేగిపోయింది. "నే నెవరినో తెలుసా? జయావతి తల్లిని. నన్నంతా యెరుగుదురు. ఆ పాడుముండ నా కూతుర్ని తన పొట్టనబెట్టుకొన్నది. ఏదీ? పాడుముండను కనిపించనీ,

ఆవకాయబద్దలా నంజుకొంటాను. అప్పడంలా విరుచుకుతింటాను, రసగుల్లాలా చప్పరిస్తాను. ఆ పాడుముండ అంతుతేల్చందే నే నిక్కడ నుండి వెళ్ళను."

జయావతితల్లి చేస్తున్న యీ అలౌకికలీలలను ఆ యువతిచూస్తూ మౌనంగా విలబడ్డది.

'ఒసే గుడిసేటిదానా! నీ ప్రేగులుతోడ్తానే' అంటూ గుండెలుబాదు కొన్నది,'నిన్ను కత్తిపీటతో ముక్కలుముక్కలుగా తరుగుతాను' అంటూ జుట్టుపీక్కొన్నది. 'నిన్ను కాళీమాతకు బలియిస్తానే' అంటూ పండ్లు కొరికింది. 'నీ గ్రుడ్లుతోడ్తాను' అంటూ కన్నులెర్ర జేసింది. 'చెప్పు', ఆ తెంచిపోసినముండ యెక్కడున్నదో చెప్పు?'

ముసలిది యెవరిని గురించి యీ మాటలంటున్నదో ఆమె తన యెదుటనే యున్నది. కాని యీ విషయం ముసలిదానికి తెలియదు. తన ఎదుట నున్నది ఆమేనని తెలిస్తే వ్యవహారం యింకోవిధంగా మారేది.

మాలతి ఆ ముసలిదానివద్దకు వెళ్ళి చేయిపట్టుకొని 'శాంతించు మమ్మా' అన్నది.

ముసలిది కనులెర్రజేసి 'శాంతిస్తాను, ఎందుకు శాంతించను. నాకు చదువుచెప్పవచ్చావా? నాకు నీతులుచెప్పడానికి నీ కేమధికారమున్నది? ఆ ముండ నా కూతుర్ని చంపింది. అలాంటప్పుడు శాంతించమంటూ నీవు నీతులు చెప్పవచ్చావ్?' అంటూ తల నేలకేసి బాదుకోసాగింది.

ఈ గదిలో తివాచీలే లేకపోతే ఆ ముసలిదాని తలకాయ ముక్కలు ముక్కలై పోయే దనుకొన్నది మాలతి.

'ఆమె యిక్కడ లేదు' అన్నది మాలతి.

'ఇక్కడ లేదూ?'

"లేదు."

అయినా దాని అంతుతేల్చుకోనిదే నేనిక్కడనుండి వెళ్ళను. దాని నెత్తురు కండ్లచూడందే నాకండ్లు చల్లబడవు.'

మాలతి చిరునవ్వునవ్వి 'మంచిది. ఆమె వచ్చినదాకా యిక్కడే వుండండి. మరి భోజనానికి వేళయినది భోజనంచేస్తారా?'

"ఇప్పుడుకాదు. ఆ పాడుముండ కనిపించినతరువాత భోంచేస్తాను.

"అవును, పుత్రీవియోగమెంత భరించరానిదో నాకుబాగాతెలుసు."

ఈ మాట వినగానే ముసలిది ఐస్‌లా అయిపోయి "కష్టసుఖాలు నీలాంటివాళ్ళకు తెలుస్తాయి. నా మనస్సెంతబాధపడుతున్నదో నీవే చెప్పమ్మా!"

"చెప్పడాని కేమున్నది. నాకు తెలియదంటావా? ఆమె లేదు. ఇప్పుడేంచేస్తాం. భోజనం చెయ్యి. ఆ పాడుముండ వచ్చినతరువాత దాని అంతు తేల్చుకొందువుగాని."

"మా తల్లే! నా ఆయుస్సుకూడా పోసుకు బ్రతుకమ్మా"

'నీ తిండి యిక్కడే యేర్పాటుచేస్తాము.'

'సరే.'

'మామ్మా! జయావతక్కయ్య విన్నుగురించి ఊ పొగిడేది.'

'పొగిడేదని మెల్లగా అంటావేవమ్మా. అయితే నీవు నా జయను చూచావా?'

'మే మిద్దరమూ చాలారోజులు కలిసేవున్నాం—'

'మీ రిద్దరూ కలిసేవున్నారన్నమాట?'

'అవును. జయక్కయ్య యెప్పుడూ విన్నుగురించే చెప్పేది.'

తప్పక చెపుతుంది జయ సామాన్యమైన పిల్లకాదు. చాలా తెలివి కలది.'

'అవును. మాంచి తెలివైనది.'

'అలాంటివాళ్లగూడా చచ్చిపోతారమ్మా! కాని యిలాంటివాళ్ల చావరు. ఆ పాడుముండ యెక్కడకు వెళ్ళింది?'

'కలకత్తా వెళ్ళింది?'

'బహుశా సురేంద్రబాబు కది మంచు పెట్టిందనుకుంటాను.'

'నేనూ అలానే విన్నాను.'

'కనపడనీ పాడుముండని, ఆ మందూ మాకు లేమిటో తేలుస్తాను. దాని మంత్రాలు నాముందు సాగవు.'

'అది రాగానే నీ శక్తి చూపించాలి. తెలిసిందా?'

'తప్పకుండా నా తడాకా చూపిస్తాను. కాని ఆ పాడుముండకు మంత్రాలుకూడా వచ్చునంటావా?'

'అవును. దానికి మంత్రతంత్రాలు తెలుసునట. కొడీ కామాక్షి వద్ద మంత్రతంత్రా లభ్యసించిందట. మనుష్యుల్ని గొఱ్ఱెల్నిగా మారుస్తుందట. సురేంద్రబాబునే చూడు. ఆయన్ని తనవశంచేసుకొని గిరిలో నిలబెడుతున్నది. ఆమె కూర్చోమంటే కూర్చుంటాడు. లేవమంటే లేస్తాడు. పాప మామెచేతిలో కీలుబొమ్మయినాడు.'

ముసలిదానిముఖం పాలిపోయింది. ఎలాగో ధైర్యంచేసి 'నాకూ మంత్రతంత్రాలు తెలుసు' నన్నది.

'మంచిది. ఇవాళ మధ్యాహ్నం నీకు తప్పకుండా ఆమెను చూపిస్తాను.'

'అయితే ఆమెకు బాణంవేయటంకూడా తెలుసునంటావా?'

'తెలుసు.'

'అయితే యెప్పుడు వస్తుంది?'

'మధ్యాహ్నానికి రావచ్చు.'

ముసలిది బయటికి తొంగిచూచింది. మధ్యాహ్నం కావడానికి అట్టేసేపు పట్టదని తెలుసుకొన్నది. 'మంచిది. ఇవాళ కాదులే. ఇవాళ నాకు జరూరైన పనివున్నది. రేపు దానిఅంతు కనుక్కొంటాను.' అంటూ లేచి కోక దులుపుకొన్నది.

'ఇవాళిక్కడ భోంచెయ్యి'

'లేదు. త్వరగా వెళ్ళాలి, పని వున్నది'

'ఆలస్యంలేదు. ఇప్పుడే వడ్డిస్తాను.'

'సరే, నీ పేరేమిటమ్మా!'

'మాలతి' అంటారు.

''ఎంత తియ్యని పేరమ్మా!'

ముసలిది భోంచేస్తున్నంతసేపూ మాలతి దగ్గరకూర్చుని ఆమెలోని ఆదుర్దాను గమనిస్తున్నది.

మంచిది. వెళ్ళొస్తానమ్మా!'

'నీకొక్క మాట చెప్పాలి. జయక్కయ్యవద్ద నేను పదిరూపాయలు చేబదులు తీసుకొన్నాను. నావద్ద యిప్పుడు డబ్బులేదు. మరి నన్ను ఋణవిముక్తురాలను చేస్తే—'

ఈమాట ముసలిదాని కర్థంకాలేదు. 'న న్నేమిచేయమంటే అది చేస్తాను.'

'ఆ పదిరూపాయలు మీరు తీసుకొంటే—'

'నా కిస్తావా?'

'అవును. ఎందుకివ్వకూడదు?' అంటూ మాలతి లోపలకుపోయి పదిరూపాయలు తెచ్చి ఆమె చేతికిచ్చింది. ముసలిది ఆమెవంక సాదరంగా చూచి 'నీవేదో గొప్ప కుటుంబంలో పుట్టినదానిలా కన్పిస్తున్నావమ్మా!' అన్నది.

'నేను పుట్టెడు దుఃఖంతో పుట్టాను.'

ముసలిదాని కన్నులలో నీరు తిరిగింది. 'కావచ్చు.కాని నీమాటలు వింటుంటే, నీ చేష్టలు చూస్తుంటే నీవేదో గొప్పయింటి పిల్లవైనట్లు తోస్తున్నది. నీవు నా మాట నమ్ము. మా జయావతిచేతిలో యెప్పుడూ కావలసినంత డబ్బుండేది. కాని చచ్చి గిపెట్టినా నాకు దమ్మిడీఅయినా యిచ్చేది కాదు. ఇన్నిరూపాయలు నాచేతి కెన్నడూ యివ్వలేదు.' అంటూ కన్ను లొత్తుకున్నది.

'నే నెంత దుఃఖంలోవున్నా నా ధర్మాన్ని నేను పాలించితీరాలి.'

'ధర్మం మహత్తరమైనది.కాని ఈలోకం దానినిగుర్తించలేదు.'

'నీవు రేపు తప్పక వస్తావా?

తప్పక వస్తాను.'

'ఈ విషయం మా యజమానురాలితో చెప్పనా?'

'చెప్పు. ఆఁ ఆఁ వద్దు. నన్నుగురించి ఆమెతో చెప్పవద్దు.'

కొడీ కామాక్షివద్ద మంత్రతంత్రాలు, అస్త్రశస్త్రాలు అభ్యసించిందని చెప్పగానే ముసలిదానిగుండెల్లో బెంగపడింది. ఈ విషయం మాలతి కూడా గ్రహించింది.

'సరే. నేను వెళ్ళివస్తా. అప్పుడప్పుడు వస్తుంటా.'

'మంచిది.'

# 26

ఈ విషయం సురేంద్రబాబుకు చెప్పగానే అతను బిగ్గరగా నవ్వి "అయితే బాగా పోట్లాడిందన్నమాట?" అన్నాడు.

"బాగా పోట్లాడలేదు. కాని, కాస్త గలిబిలి చేసింది."

"గలిబిలి చేసిందా?"

"చిత్రం"

కూతురుతో కూడా సరిగావుండేదికాదు. ఎప్పుడూ యేదో వొక పోట్లాట పెట్టుకొనేది."

"ఆ విషయం నాకూ తెలుసు."

"నీకెలా తెలుసు?"

"మానసికవేదనతో ఉన్మత్తురాలయి ఆమె చెప్పింది"

"ఇంట్లో కాలుపెడుతూనే నిన్ను తిట్టిందనుకొంటాను?"

మాలతి చిరునవ్వు నవ్వి "నన్నేమీ తిట్టలేదు.మీరు కలకత్తానుండి తీసుకొనివచ్చిన ఆమెను తనయిష్టంవచ్చినట్లు తిట్టింది. ఆ తిట్లన్నీ ఆ చండాలినికి తగులుతవి,...."

"ఆ ఛండాలినివి నీవుకాదా?"

"అయితే నేను కలకత్తానుండి రాలేదుగా?"

"ఎక్కడనుండి వస్తే నేం? ఆ ఛండాలినివి నీవే."

"ఆమె నన్ను దాసిగా భావించింది. నన్ను గుర్తుపట్టలేదు."

"ఈ విషయం తెలిస్తే యితరు లేమనుకొంటారు?"

"ఆమె నన్ను గుర్తించకపోబట్టి నేను బ్రతికిబయటపడ్డాను. లేకుంటే ఆమె నన్ను నమిలిమ్రింగేది."

"తెలిస్తే చంపేదంటావా?"

ఆమెవాలకం చూస్తే అలానేవున్నది."

"అయితే నీవేమన్నావ్?"

"ఆమె యిక్కడలేదు, కలకత్తా వెళ్ళింది" అని చెప్పాను.

"అంటే ఆమె యేమన్నది?"

'సరే, రానివ్వు. రాగానే రసగుల్లాలా చప్పరిస్తానన్నది.'

ఈ మాట విని సురేంద్రబాబు బిగ్గరగా నవ్వాడు,

'ఇంకా పైగా యేమన్నదంటే—ఆ పాడుముండదాబుగారి కేమైనా మందుపెట్టిందా?— అని అడిగింది.'

'పెట్టివుంటుంది. లేకుంటే దానివెంటబడి ఆయనగా రిలాయెందుకు తిరుగుతారన్నాను.'

'నిజంగా నా స్థితి అలానేవున్నది.'

'ఇందులో సందేహంలేదు.'

'సరే, తరువాత యేమిజరిగింది?'

ఆ పాడుముండకు మంత్ర తంత్రాలుగూడా తెలుసునా?' అని ప్రశ్నించింది. 'ఆఁ బాగాతెలుసు. కౌడీ కామాక్షిదగ్గర మంత్ర తంత్రాలు అష్టశస్త్రాలు నేర్చుకొన్న'దని చెప్పాను.

'ఆమాట వినగానే ఆమె 'నాకూ మంత్రాలు వచ్చు'నన్నది. కాని ఆమె మాటలలో నాకు విశ్వాసం కలుగలేదు. భయపడి అలా చెపుతున్న దనుకొన్నాను. ఆమెకు బాణంవేయడం చేతనవునా ? అని ప్రశ్నించింది. ఓ మహాచక్కగా గురిచూచి బాణంతో కొట్టగలదని చెప్పాను.'

ఈమాట వినగానే సురేంద్రబాబుకు నవ్వాగలేదు. అతను విరగబడి నవ్వుతూ 'బహుశా యిందుకే ఆమె పారిపోయిందనుకొంటా' నన్నాడు.

'చిత్తం'

'ఆమె మరల వస్తుందంటావా?'

'తప్పకవస్తుంది. కాని ఆ చండాలినివద్దకు కాదు. నావద్దకు."

'ఆమె యెవరివద్దకు వస్తేనేం. కాని నీవుమాత్రం నావద్దకు రా'

మాలతి సురేంద్రబాబుదగ్గరకు వచ్చింది. అత నామెచేయిపట్టుకొని 'మాలతీ ! ఇలా యెంతకాలం గడపను? ఇలావుంటే నిన్ను చూడలేను.'

"ఆభరణాలు ధరిస్తే అందం ద్విగుణీకృత మౌతుందా?"

"నీ అందానికి హద్దులులేవు. బ్రహ్మదేవుడు నిన్ను చక్కని చుక్కగా తీర్చిదిద్దాడు. నీ వాభరణాలు ధరించకపోయినా నీ అందానికి లోటులేదు. కాని నా సంతృప్తికొరకైనా....

"మీ సంతృప్తికొరకై నన్ను ఆభరణాలు ధరించమంటారా?
"అవును"
'సరే అలాగే ధరిస్తాను. కాని మీకింతపట్టుదల యెందుకోచెప్పండి.'
"నీకు కోపమొచ్చినట్లున్నది"
"లేదు"

గదిలోనున్న అద్దంముందు నిలచి మాలతి తన అందాన్ని నఖశిఖ పర్యంతం చూచుకొన్నది.'నిజమే. నాలో చక్కని అంగసౌష్టవమున్నది. నాలోని జీవకళ నశించలేదు' అని తన మనసులో అనుకోసాగింది.

మరుసటిరోజు సాయంకాలం సురేంద్రబాబు గిరిధరుని వేషంలో వచ్చి ఆమెకు దర్శనమిచ్చాడు. అతని మెడలో పుష్పమాలలున్నవి. మల్లెలు, మొల్లలు, గులాబులు, మొదలైన పూలతోకట్టినదండలన్నీ కలిసి దూరానికి ఒకే దండలా కనిపిస్తున్నవి. అతని కుడిచేతిలో పుష్పగుచ్ఛమున్నది. ఎడమచేతిలో మనోహరమైన మొఖమల్ పెట్టి వున్నది. పట్టు వస్త్రాలు ధరించి మొఖమల్ చెప్పులు తొడుక్కొని అతను మాలతివద్దకు వచ్చాడు.అతనివేషాన్ని చూచి"ఇదేమివేషం?"అంటూ చిరునవ్వునవ్వింది.

సురేంద్రబాబు ముఖం గంభీరంగాపెట్టి "అర్చించడం నీకు తెలుసా?" అని ప్రశ్నించాడు.

"తెలుసు"

"నీవద్ద చందనముంటే నానుదుట వుంచు. నేడే నా ప్రాణిగ్రహణ మహోత్సవం...."

"పెండ్లికుమార్తె?"

"ముందు నేనుచెప్పినట్లు చెయ్యి.తరువాత నే నెవరిని పెండ్లియాడ బోతున్నానో నీవే తెలుసుకొంటావ్,"

మాలతి లోపలకువెళ్ళి చందనంతెచ్చి అతనినుదుట చక్కగా తీర్చి దిద్దింది. 'ఇప్పుడు చెప్పండి, ఎవరిని పెండ్లియాడబోతున్నారో....'అంది,

"ఇంకా నీవు తెలుసుకోలేదన్నమాట?" అంటూ సురేంద్రబాబు తనమెడలోనున్న హారాన్నితీసి మాలతిమెడలోవేశాడు. తరువాత ముఖ మల్ పెట్టె తెరచాడు, అందులో అమూల్యములైన ఆభరణాలున్నవి.

ఇలాంటి ఆభరణాలు మాలతి యిదివరలో చూచివుండలేదు. అందుచే ఆమె ఆశ్చర్యంగా వాటివంక చూడసాగింది.

ఆ ఆభరణాలన్నీ మాలతిచేతికిస్తూ అత నామెను ముద్దుపెట్టుకొన్నాడు. "ఇప్పుడు నిన్ను నేను సహధర్మచారిణిగా చేసుకొన్నాను. ఇన్నిరోజులకు నీవు నా అర్ధాంగినివైనావు. ఇంక నీవెక్కడికీ వెళ్ళలేవు. ఈ హారాన్ని నీవింకెన్నటికీ నీ మెడలోనుండి తీయలేవు."

ఇరువురి కన్నులలోను నీరుతిరిగింది. కొంచెంసేపు యిరువురూ మౌనంగా వున్నారు.

సురేంద్రబాబు కండ్లుతుడుచుకొంటూ "ఇంక యీ గృహభారమంతా నీమీదపడింది. ఎలా దిద్దుకొంటావో? నీ వెల్లప్పుడు సౌఖ్యంగా వుండాలని నాకోరిక" అన్నాడు.

మాలతి తలవంచుకొని తన హృదయపూర్వక ధన్యవాదాలర్పించింది. ఆమె కనులవెంట ధారాపాతంగా అశ్రుజలం ప్రవహింపసాగింది. ఆమె యెంత ఆపుకొందామన్నా ఆ అశ్రుజల మాగడంలేదు; ఇది సురేంద్రబాబు గమనించాడు.

"నీ తలిదండ్రులు జ్ఞాపకమొచ్చారా?"

అవునన్నట్లు మాలతి తలవూపింది.

"నిన్ను పెండ్లియాడి నాకు చిరకాలంనుండివున్న కోరికను తీర్చుకొన్నాను. మీ తలిదండ్రుల నిటకు తీసుకొనివస్తాను. ప్రపంచ మేమనుకొన్నా నాకు భయంలేదు. సరే, ఇంట్లోకి వెడతావా?"

"ఎక్కడకు?"

"నేను నివసిస్తున్న యింట్లోకి"

"ఇది నా యిల్లుకాదా?"

"అక్కడకు వెళ్ళడం నీ కిష్టంలేదా?"

"లేదు"

"నేనూ అదే అనుకొంటున్నాను."

కష్టాలు కలకాలం వొక్కచోటే కాపురంచెయ్యవు. కష్టపురోజులు మెల్లగా గడిచిపోతవి. చీకటిపోగానే వెలుగువస్తుంది. మాధవుడు మరణించగానే సుభదకు కొన్ని కష్టాలు గడిచిపోయినవి.

వర్షాకాలం. ఆకాశమంతటా మేఘాలావరించి వున్నవి. ఊరంతా బురదగావున్నది. కాలుపేస్తే జఝున జారిపోతున్నది.

వర్షాకాలంపోయి చలికాలం వచ్చింది. ఆకాశమంతా నిర్మలంగా వున్నది. బురదంతా యెండపోయింది. కాళ్ళుజారడంలేదు. కాని అప్పుడప్పుడు మేఘశకలాలు ఆకాశంలో కన్పిస్తూనేయున్నవి. వర్షాకాలంలో ప్రకృతిమాత విచారంతో యెప్పుడూ కన్నీరుకారుస్తూ వుంటుంది. కాని యిప్పుడా దశ గడిచిపోయింది.

కాని చలికాలంలోగూడా ప్రకృతిమాత విచారిస్తున్నట్లూ, ఆమె కనులవెంట అశ్రుధారలు చిందుతున్నట్లుగా తోస్తుంది. కాని వెంటనే ఆమె కన్నులొత్తుకుంటుంది.

గతించిన కష్టాలను తలచుకొని ఒక వేడినిట్టూర్పు విడిచినట్లు ఆకాశంలోనుండి మంచుపడుతోంది. కాని అందులో స్థిరత్వం, గంభీరత లేవు. మానవజీవితంలో యే దశా స్థిరంగావుండదని మన ప్రకృతి అనుభవాన్ని బట్టి తెలుసుకోవచ్చు. పరివర్తనం లేకుండా ప్రపంచపునడక సాగదు. ఈ విషయ మందరకూ తెలుసు. ఈ విషయాన్ని సుభద, సదానంద చక్రవర్తి కూడా సవినయంగా వొప్పుకుంటారు.

సుభద గంగానదికివెళ్ళి స్నానంచేసి బిందెతో మంచినీరు ముంచుకొని, బిందె భుజంమీద పెట్టుకొని ఆయాసపడుతూ యింటికి రావడం పొరుగువారంతా నిత్యం చూస్తూనేవున్నారు. మాధవుని మరణం, లలన కనిపించకపోవడం, ఇంటిచాకిరి ముమ్మరమై ఆమెను కృంగదీసినవి. ఆమెముఖంలో విషాదరేఖ లింకా తొలగిపోలేదు.

సుభదస్థితి చూచి ఊరిలోనివారంతా ఇలాంటి కష్టాలు పగవాళ్ళకు కూడా వద్దనుకొనేవాళ్ళు. ఆమె లేనిసమయంలో అందరూ ఆమె స్థితికి జాలిపడేవారు. కాని ఆమెయెదుటమాత్రం యీ విషయ మెత్తేవారు

కాదు. ఆమె మనోవేదన మరీ అధికమౌతుందన్న భయంలో ఆమెతో యీ విషయాలు ముచ్చటించేవారు కారు. ఆ కారణంగా సుభద రాగానే వారంతా మౌనంవహించేవారు.

స్నానంచేస్తున్నప్పుడు అల్లరిచేయడం పిల్లలస్వభావం. వాళ్ళు నీళ్ళలో గంతులువేస్తారు. ఒకళ్ళపై ఒకరు నీళ్లు చిమ్ముకొంటారు. అటు స్తారు. ఆ కారణంగా అక్కడ శివపూజ చేసుకొనేవారందరకూ బాధగా వుంటుంది. కాని సుభద బిందె తీసుకొనివచ్చి గట్టుమీదపెట్టి మౌనంగా నదిలో దిగి స్నానంచేసి, మంచినీళ్ళు తీసుకొనివెళ్లేవరకూ పిల్లలంతా తమ తమ బాలక్రీడలు కట్టిపెట్టి, సభ్యతగా ప్రవర్తించేవారు. సుభద స్నానంచేసి వెళ్ళగానే వారికి చైతన్యం కలిగేది. మామూలు అల్లరి చేసి గంతులువేసేవారు.

సుభద వారిని చూచి యెన్నడూ నవ్వేదికాదు. కన్నీరు కార్చడం గూడా మంచిదికాదని భావించేది. ఆత్మవిచారణ చేసుకోనడానికిగూడా సిగ్గుపడేది.

ఇప్పుడు యింట్లో యెవరూలేరు. భలన అత్తవారింటికి వెళ్ళింది. రాసమణి పగలంతా పొరుగిండ్లవద్దనే గడుపుతుంది. ఇక మిగిలింది హారాన్‌బాబు. ఇప్పు డతనిలో చాలా పరివర్తనమొచ్చింది. రెండుపూటలా యింటికి వస్తాడు, పావలో బేడో యిప్పించుకుని తిరిగి వెళ్ళిపోతాడు. సుభద మధ్యాహ్నసమయంలో పై టచెరగు నేలమీద పరచుకొని వంట యింట్లో పండుకొనేది. సూర్యాస్తమయం కాబోతున్నదనగా లేచి నదికి పోయి స్నానంచేసి వచ్చి దీపం వెలిగించేది. తరువాత వంటచేసి తన భర్తకోసమని వేరే ఒక పళ్ళెంలో అన్నం తీసి, తరువాత సదానందునికి పెట్టేది. అంతలో ప్రొద్దుక్రుంకేది. మరల సూర్యోదయమయ్యేది. మరల రాత్రి....

ఎప్పటిమాదిరిగానే ఆమె వంటయింటిలో పండుకొనియున్నది. ఇంతలో 'అమ్మా' అని పిలిచారు.

ఆ మాట వినగానే సుభద "యెవరో యెవరినో [illegible] మౌనంగా పడుకొన్నది.

"అమ్మా! ఎవరూ యింట్లో లేరా?" అని మరల కేక వినిపించింది

సుభద బయటకువచ్చి "ఎవరు?" అని ప్రశ్నించింది.

"పోస్టమ్మా! ఉత్తరంవచ్చింది"

సుభద ఆశ్చర్యంతో నాకు ఉత్తర మెవరువ్రాస్తారు?" సరే యిలా యివ్వు....'

"ఇది రిజిష్టరుఉత్తరమమ్మా! సుభదాదేవి పేరుతో వచ్చింది.ఆమె సంతకంచేస్తేగాని యివ్వడానికి వీలులేదు"

కలం సిరాబుడ్డి యిలా యివ్వు"

"కలం సిరాబుడ్డి నేనెక్కడ తెచ్చేదమ్మా! మీ యింట్లో లేవూ?"

"చూచి తెస్తా నుండు"

వెదకగా వగిలిపోయిన సిరాబుడ్డి కనిపించింది. అందులోని సిరా యెండిపోయింది. అందులో కొంచెం నీరుపోసి యెలానో సిరా తయారు చేసింది. ఇప్పుడిక కలంసమస్యవచ్చింది. "మాధవునివద్ద దస్తరముండే దనీ, లలన అతనిని తన గదిలో కూర్చోబెట్టుకుని చదువుచెప్పేదనీ ఆమెకు వెంటనే గుప్తికివచ్చింది. వెంటనే ఆమె తన గదిలోకి పోయి వెదకింది. ఒకమూల దస్తరం కనిపిచ్చింది. దానినిండా సిరామరక లున్నవి. దస్తరం విప్పగానే ఆమెకు పగిలిపోయిన పలక, ఒక బొమ్మల పుస్తకం, రెండు విరిగిపోయిన కలంపుల్లలు కనిపించాయి. ఇవి గాక రెండు బలపాలు, పాత పంచాంగాలలో చింపిన నాలుగైదుబొమ్మలు కనిపించాయి. ఒక కలంపుల్ల తీసుకుని దస్తరం యెప్పటిమాదిరిగా కట్టింది. మాధవుడు యీ వస్తువులను తన ప్రాణాలకంటే యెక్కువగా ప్రేమించేవాడు.

అతను చూపించినచోట సంతకంచేసి సుభద ఆ వుత్తరం తీసు కొన్నది. లోపలకు వెళ్ళి ఉత్తరం చింపిచూచింది. చూడగానే ఆమె ఆశ్చ ర్యానికి మేరలేకపోయింది. అందులో యాభై రూపాయల నోటున్నది.

పోస్టుమాన్ పొరపాటున యెవరివుత్తరమో తన కిచ్చాడని భావిం చింది. అతనిని పిలవడానికై వెంటనే ఆమె బయటకు వచ్చింది.కాని అత నప్పుడే కనుచూపుమేర దాటిపోయాడు. ఇల్లాలు కాబట్టి కేకవేసి అతనిని పిలవడానికి ఆమెకు మనస్కరించలేదు. విధిలేక నోటు తీసు కుని లోపలకు వెళ్ళింది.

సుభద రోపలకపెళ్ళి యిలా అనుకోసాగింది. "పోస్టు జవాను తప్పక పొరపాటుపడివుంటాడు. పొరపాటు తెలుసుకొన్నతరువాతవస్తాడు' కాని రెండు మూడు రోజులు యెదురుచూచినా పోస్టుజవాను తిరిగిరాలేదు. తరువాత సుభద యీ విషయం సదానందునికి చెప్పింది.

సదానందు దా ఉత్తరాన్ని జాగ్రత్తగా పరిశీలించి చూచాడు. దాని మీద 'సుభదాదేవి' అని స్పష్టంగా వ్రాసివున్నది. అతను సుభదతో యిలా అన్నాడు. 'ఈ గ్రామంలో యీ పేరువా రింకెవరూలేరు. పైగా కేరాఫ్, హోరాన్‌బాబని స్పష్టంగా వ్రాసివున్నది. కనుక యీ ఉత్తరం తప్పక నీదే. కాని కలకత్తానుండి నీ కెవరు డబ్బు పంపుతారు?'....

"నా కక్కడెవరూలేరు."

మరుసటిరోజు సదానందుడు పోస్టాఫీసుకు పోయి విచారించగా ఆ డబ్బు పంపినది. ఆ హోరనాదుడని తేలింది.

సుభద ఆశ్చర్యంగా 'ఇతనిపేరుగూడా నే నెన్నడూ వినలే'దన్నది.

'అయితే?'

'ఉపాయమేదో నీవే ఆలోచించు.'

సదానందుడు చిరునవ్వునవ్వి 'డబ్బు తీసుకోవడం యిష్టంలేకపోతే తిరిగి వారికే పంపించు. ఇంతకంటే ఉపాయ మేమున్నది?'

'నే నన్నంలేక మాడి చస్తున్నా, పిల్లలు వస్తులుపడుకోవలసి వచ్చినా యీ డబ్బు నే నుంచుకోను. ఈ డబ్బు నా కక్కరలేదు. నీవు దీనిని తిరిగి వారి కిచ్చివెయ్యి.'

"సరే, యిది నీవద్దనే వుండనివ్వు. నేను రేపు కలకత్తా వెళ్ళి వారి నోటు వారి కిచ్చివేస్తాను."

"దీనిని నా వద్ద వొక్క క్షణంగూడా వుంచుకోను. ఈ డబ్బు నీవెంట తీసుకుపోయి వారిది వారి కిచ్చివెయ్యి. వా రేదో పొరపాటుపడి నా పేర పంపివుంటారు. ఇందులో యేమాత్రం సందేహంలేదు."

"సరే, అక్కడికే పోయి విచారిస్తాను."

"మంచిది"

# 28

చాలా విశాలమైన గది. అందులో బాబూ అఘోరనాధుని ఆఫీసున్నది. అత నా గదిలో కూర్చుని యున్నాడు. అతని ప్రక్క కుర్చీలో సురేంద్రబాబు కూర్చునివున్నాడు. వారి ముందున్న డ్రాయరుమీద 'లా' పుస్తకాలు పడివున్నవి.

"ఈ దావాలో నేనే వోడిపోతా నన్నట్లు నాకు తోస్తున్న"దన్నాడు సురేంద్రబాబు.

"ఇప్పుడప్పుడే యే నిర్ణయం చేయలేము" అన్నాడు అఘోరనాధ్.

"ఎందుకు చేయలేం? ఈ దావా నాకు ప్రతికూలమయ్యేలా స్పష్టంగా కనిపిస్తున్నది."

"ఇక్కడపోతే నేమండి. హైకోర్టు లేదూ?"

"మీరుచెప్పేది నిజమే కాని హైకోర్టుకు పోవడం నాకిష్టంలేదు."

"అయితే మాల్‌పూర్‌లోని భూములన్నీ వొదులుకుంటారా?"

"ఇంకా వాటిని పట్టుకొని పీకులాడడానికి మార్గమేమిటి?"

"ఆ భూములు పోతే మీ రాబడి తగ్గిపోతుంది."

"నిజమే. రాబడి సగానికి సగం తగ్గిపోతుంది.

అఘోరబాబు మాట్లాడలేదు. సురేంద్రబాబు వేసిన అంచనా సరియైనదేనని ఆతను మనసులో అనుకున్నాడు.

ఇంతలో నౌకరు వచ్చి "మీకొరక కెవరో వచ్చా"రని చెప్పాడు.

అఘోరబాబు నౌకరువైపు తిరిగి "ఎవరు?" అని ప్రశ్నించాడు.

"ఎవరో నాకు తెలియదు. వేషాన్నిబట్టి బ్రాహ్మణపండితు డను కొన్నాను."

"ఇప్పుడు తీరికలేదని అతనితో చెప్పు."

నౌకరు బయటకు వెళ్ళి మరల వెంటనే తిరిగివచ్చి "ఆయ నేదో అవసరమైన విషయాలు తమతో మాట్లాడా లంటున్నాడండి" అన్నాడు.

అఘోరబాబు చిరాకుగా సురేంద్రబాబువంక చూచి "ఈ గదిలోకి..........?"

'ఏం, వస్తే రానివ్వండి.'

నౌకరు పోయి ఆయనను వెంటబెట్టుకుని గదిలోకి వచ్చాడు. అతని శరీరచ్ఛాయ దబ్బపండులాగున్నది. ఆజానుబాహువు. మెడలో జంధెమున్నది. నెత్తిన పిలకముడి వున్నది. కాని ముఖాన త్రిపుండ్రాలు గాని, మెడలో రుద్రాక్షమాలలుగాని లేవు. అతను తెల్లని వస్త్రం ధరించాడు. అతని భుజాన పండితశాలువా వున్నది. అతని కాళ్ళకు చెప్పులు లేవు. మోకాళ్ళవరకు దుమ్ముకొట్టుకొనివున్నది.

సురేంద్రబాబు, అఘోరనాథుడు అతనివంక సాదరంగా చూచారు. 'ఇలా దయచేయండి' అన్నాడు అఘోరనాధ్.

ఆగంతుకుడు ప్రక్కనున్న కుర్చీలో కూర్చుంటూ 'నేను అఘోర నాథవసుగారితో....

'నా పేరే అఘోరనాథవసు'

'అయితే మీతోనే నాకు పనివున్నది. ఇక్కడ మాట్లాడవచ్చునా?'

'నిరభ్యంతరంగా మాట్లాడవచ్చు'

ఆ బ్రాహ్మణుడు తనశాలువామడతలలోనుంచి యాభై రూపాయల నోటు బైటకుతీసి 'దీనిని మీరు సుభద్రాదేవికిపంపారా?' అనిప్రశ్నించాడు.

అఘోరబాబు నోటును జాగ్రత్తగా పరిశీలించి 'అవును. నేనే పంపా' నన్నాడు.

బ్రాహ్మణు డాశ్చర్యంతో 'హలుద్‌పూరు, హారాన్‌బాబింట్లో వుండే సుభద్రాదేవిపేర పంపారా?'

'అవును. ఆమెపేరనే'

'ఎందులకు?'

'మా యజమాని పంపమన్నాడు'

'ఎవరు మీ యజమాని?'

అఘోరబాబు వ్రేలితో సురేంద్రబాబువంక చూపించాడు.

'ఇదిగో మీ డబ్బు మీరు తీసుకోండి. ఎవరిపేర మీ రీ డబ్బు పంపించారో ఆమె యీ డబ్బు తీసుకోవడాని కిష్టపడడంలేదు. ఆమె మిమ్ములనుగాని, మీ యజమానునిగాని యెరుగదు. ఆమె యిందుకోసమే నన్నిక్కడకు పంపింది. పొరపాటున మీరీ డబ్బు పంపివుంటారని మేము భావిస్తున్నాం'

"అలాంటి పొరపాటువని మే మెన్నడూ చేయం"

"చేయండి, చేయకపోండి. మీ డబ్బు మీరు తీసుకోండి."

"వీలులేదు. మా యజమాని అనుజ్ఞలేనిదే నే నేపనీ చేయను."

"సరే, మీ యజమానితో ఆలోచించే చెప్పండి. నేను మరొక పర్యాయం వచ్చి కలుసుకుంటా" నంటూ అతను వెళ్ళబోయాడు.

ఇంతలో సురేంద్రబాబు 'మీ పేరేమి' టని ప్రశ్నించాడు.

"నా పేరు సదానంద చక్రవర్తి"

ఈ పేరు వినగానే సురేంద్రబాబు ఉలిక్కిపడ్డాడు. కొంచెంసే పతనివంక సాదరంగా చూచి "తమ నివాస స్థానం?"

"నే నెక్కడవుంటానో నాకే తెలియదు. తిన్నగా యిక్కడకు వచ్చాను. ఇక్కడనుండి మరల వెళ్ళిపోతాను."

సురేంద్రబాబు అఘోరబాబువైపు తిరిగి "మంచిది. నేను వెళ్ళి వస్తా. రాత్రికి వచ్చి మరల కలుసుకొంటాను" అంటూ సదానందునివైపు తిరిగి "మీతో కొన్ని విషయాలు మాట్లాడాలి" అన్నాడు.

"చెప్పండి"

"ఇక్కడకాదు. నాయిల్లు యిక్కడికి సమీపములోనేయున్నది. మీకే యిబ్బందీ లేకపోతే అక్కడకు వెళ్ళి మాట్లాడుకుందాం."

ఆయనవెంట వెళ్ళడానికి సదానందున కేవిధమైన సంకోచమూ లేదు. అందుచే ఆయనవెంటవెళ్ళి బయటసిద్ధముగనున్నబండి యెక్కాడు.

బండిలో కూర్చున్నతరువాత సదానందుడు "ఇదివరకు నేనెప్పుడూ మిమ్ములను చూడలేదు. కాని....కాని —మీరుగూడా నన్నెప్పుడూ చూచి వుండరనుకొంటా" నన్నాడు.

"నిన్నెప్పుడూ చూడలేదు. కాని నిన్నెరుగుదును"

"ఎట్లా యెరుగుదురు?"

"మా యింటికి పదండి. అక్కడ చెపుతాను"

బండి యింటివద్దకు చేరింది.

"నేనుకూడా బ్రాహ్మణుడనే. భోజనానికి వేళయినది. భోజనమైన పిదప చెపుతాను. మీకేమైనా సందేహమా?" అన్నాడు సురేంద్రబాబు.

"ఎంతమాత్రం లేదు"

భోజనాలైన పిమ్మట యిరువురూ విశ్రాంతిగా కూర్చున్నారు. "సుభదాదేవి పేదరాలుకదూ?" అని ప్రశ్నించాడు సురేంద్రబాబు.

"అవును. కాని యిందువలన....?"

"తెలిసింది. అయితే దానమెందుకు స్వీకరించదు?"

"బహుశా గుప్తదానాన్ని స్వీకరించడ మామెకు యిష్టంలేదను కొంటాను."

"గుప్తదానాన్ని స్వీకరించినందువలన వచ్చిన నష్టమేమిటి? ఏ విధమైన పొరపాటు జరుగలేదని దాతే చెబుతున్నాడు. క్షేత్రమెరిగి విత్తనం. పాత్రయెరిగి దానం చేయమన్నారు పెద్దలు. పాత్రురాలనే యీ దానం చేయబడింది."

"కాని ఆ దాత యెవరు?"

"ఆ దాత అఘోరబాబే అనుకోండి"

"అతని కేమి సంబంధం?"

సురేంద్రబాబు ఆలోచించి "పేదరాలు కావడమే" కనుక అంద రకూ సంబంధమున్నది.

"అయితే అందరూ యీ దానాన్ని స్వీకరింపగలరా?"

"స్వీకరింపలేరు. కాని యిల్లుగడవడమే కష్టంగా నున్నప్పుడు తప్పక స్వీకరిస్తారు."

ఈ మాట వినగానే సదానందునకు కోపంవచ్చింది. "ఈ బిచ్చం పుచ్చుకోకపోయినా ఆమెకు లోటురాదు. ఆమె కేలోటూ లేదు. గౌరవం గానే జీవిస్తున్నది. ఆమెకు బాగానే గడుస్తున్నది."

"ఇప్పుడు గడుస్తున్నది సరే, కొంతకాలంక్రిందట ఆమెస్థితి యెలావున్నదంటావ్?"

"ఈ ప్రశ్న అనవసరం. కొంతకాలంక్రితం ఆమె కెలాజరిగింది? అన్న విషయ మనవసరం."

నా కన్ని విషయాలూ తెలుసు. హారాన్‌బాబు సంపాదనపరుడు కాడు. పైగా దుబారా ఖర్చులు చేస్తాడు. అతనిలో అన్నివిధాలైన అవలక్ష ణాలూ వున్నవి. నిషాచేస్తాడు. ఇంటివిషయమే పట్టించుకోడు. ఎవరి సహాయమూ లేకుండా యిల్లు యెలా గడుస్తుందంటావ్?"

ఈ మాటలు వినగానే సదానందున కాశ్చర్యమేసింది. వెంటనే జవాబుచెప్పడానికి అసమర్థుడైనాడు.

"హారాన్‌బా బిప్పుడేమిచేస్తున్నాడు?"

"ఏమీలేదు"

"తెలిసింది, ఆ యింటిఖర్చంతా నీవు భరిస్తున్నావన్నమాట"

"నావద్ద ఏమున్నది. అంతా ఆ భగవంతుని దయ. నేనుకూడా పేదవాడనే."

ఛలనపెండ్లయినదా?"

"అయినది"

"ఎక్కడ? ఎవరితో?"

"మా గ్రామంలోనే శారదాచరణరాయ్‌తో"

"మాధవు డెట్లావున్నాడు?"

"ఇప్పు డత నీ ప్రపంచంలో లేడు. అతనుమరణించి చాలారోజు లైనది."

"పాపం! సరేగాని అతని పెద్దక్క యెక్కడున్నది ?"

"సదానందు డాశ్చర్యంగా "ఆమెగూడా మరణించింది"

మరణించిందా? ఎట్లా మరణించింది?"

"గంగానదిలో పడి మరణించింది"

"ఈ విషయం మీకెలా తెలిసింది? శవం దొరికిందా?"

"శవం దొరకలేదు, కాని ఆమె కట్టుకున్న ఎఱ్ఱచీర నదివొడ్డున దొరికింది. దానినిబట్టి ఆమెనదిలోపడి మరణించివుంటుందని భావించాము.

"ఈ విషయంలో ఇంకెవరికైనాసరే సందేహమున్నదా?"

"లేదు"

కొంచెంసే పిరువురూ మౌనంవహించారు. తరువాత సురేంద్రబాబు మౌనాన్ని విడిచి'ఒకవేళ ఈడబ్బుఆమేపంపించివుంటే?' అనిప్రశ్నించాడు.

"ఎవరు లలనా?"

"ఏమిటి? ఆమెపేరు లలనా?"

"అవును."

"అవును. నేనే పొరపడ్డాను. ఆమెపేరు లలనే. లలన. ఛలన

అక్క చెల్లెండ్రు. అవునా?"

"అవును."

"సరే. ఒకవేళ ఆమే యీ డబ్బు పంపివుంటే?"

"ఎవరు? మరణించిన లలనా?"

"అవును. ఆమే నదిఒడ్డున ఎఱ్ఱచీర దొకినంతమాత్రాన ఆమె మరణించినదని యెందుకనుకోవాలి? ఒకవేళ ఆమే యీ సొమ్ము పంపించి వుంటే?"

సదానందు డాలోచనలోపడ్డాడు. కొంచెంసే పయినతరువాత "ఆమె తప్పక మరణించివుంటుంది. లేకుంటే యింటికి ఉత్తరం వ్రాసేది." అన్నాడు.

"ఉత్తరం వ్రాయడాని కామె సిగ్గుపడవచ్చు."

"లలన స్వభావం నాకు బాగా తెలుసు. ఆమె సిగ్గుపడవలసిన పని యెన్నడూ చేయలేదు. చేయదు. అందువలన దాగివుండవలసిన పనిలేదు."

"పిచ్చివాడా! ఆమె మరణించలేదు. ఆమె జీవించియే వున్నది. డబ్బు పంపినది ఆమే. ముందు ముందు యింకా పంపిస్తుందిగూడా."

"తమ నామధేయం?"

"సురేంద్రనాధరాయ్"

"నివాసస్థానము?"

"నారాయణపూర్"

హారాన్‌బాబుకుటుంబాన్నిగురించి మీ కిన్ని విషయా లెలా తెలిశాయ్ "

"లలన చెప్పింది"

"ఆమె మరణించింది. సందేహంలేదు. ఆమె యెలా చెపుతుంది?"

ఆమె జీవించియే యున్నది. హాయిగా జీవితం గడుపుతున్నది"

"ఆమె స్వర్గానికిపోయింది." అంటూ సందానందు డక్కడనుంచి లేచి బయలుదేరాడు.

"ఒక్క క్షణ మాగండి. నే నిప్పుడే వస్తాను. మీతో ఇంకా కొన్ని విషయాలు మాట్లాడాలి."

"మీకు లలన కలిస్తే నా ఆశీస్సు లామె కందజేయండి"

"ఆమె తల్లితో...."

"ఆఁ చెబుతాను, లలన స్వర్గానికి పోయిందని చెబుతాను." అంటూ సదానందుడు తిరిగి చూడకుండా వేగంగా వెళ్ళిపోయాడు.

సదానందుడు వెళ్ళిపోయినతరువాత సురేంద్రబాబు మౌనంగా కూర్చున్నాడు. అతని కన్నులలో నీరు తిరిగింది. ఇంతలో నౌకరువచ్చి "సర్కార్' బండి సిద్ధంచేయమంటారా?" అన్నాడు.

సురేంద్రబాబు ప్రకృతిస్థుడై "ఆఁ సిద్ధంచెయ్యి. ఛి, ఛీ, ఇలాంటి విషాన్ని యెవరైనా మనస్ఫూర్తిగా సేవిస్తారా?"

## 29

చాలా ప్రొద్దుపోయేవరకు మాలతి ఆ గదిలోనే కూర్చుని 'సీతా వనవాసం' చదువుకొంటున్నది. కన్నీరు కారుస్తూ, తుడుచుకొంటూ, చదువుకొంటున్నది. ఆమె కా పుస్తక మేమినచ్చిందో? చేతుల కంటుకు పోయింది.

ఈ సమయంలో యెవరో బయటనుండి 'లలనా!' అని పిలిచారు.

ఈ మాట చెవినిబడగానే మాలతి కంపించిపోయింది. ఆమెచేతిలో నున్న 'సీతా వనవాస' మప్రయత్నంగా జారి క్రిందపడింది.

"లలనా!"

మాలతి హీనస్వరంతో 'ఎవరు?' అన్నది.

సురేంద్రబాబు నవ్వుతూ లోపలకువచ్చి 'లలనా' అని పిలిచాడు.

"మీరా!"

"ఆఁ నేనే. దొంగవు దొరికిపోయావ్. నీ అసలుపే రెందుకు దాచుకొన్నావ్?"

"ఎప్పుడు?"

"అదుగో మరల అబద్ధమా?'

సురేంద్రబా బామెను తనవద్దకు లాక్కొని ఆమెపెదవులు ముద్దు పెట్టుకుంటూ 'మొదట నీ పేరు లలన. ఇప్పుడు మాలతిగా మార్చుకొన్నావ్. అమ్మదొంగా."

"ఎక్కడ విన్నారు?"

"కలకత్తాలో"

"కలకత్తాలో నన్ను యెరిగినవారెవరూ లేరే?"

కలకత్తాలో నిన్ను యెఱిగిన వారెవరూలేరు. కాని హాలుద్ పూరునుండి నిన్ను యెఱిగినవారు కలకత్తా వచ్చారు."

"ఎవరు? "

"మీ సదన్నయ్య. ఆ డబ్బు తిరిగి యిచ్చివేయడానికి అఘోర నాధునివద్దకు వచ్చారు."

"డబ్బు తిరిగి యిచ్చివేయడానికా?"

"అవును"

"సదన్నయ్యా?"

"అవును"

మాలతి మారుమాట్లాడలేదు.

"మాట్లాడవేం? మౌనంవహించావే?"

"సదన్నయ్య యెలా వున్నాడు?"

"బాగానే వున్నాడు. మీ అమ్మగూడా కులాసాగానే వున్నదట. వారి ఆర్థికస్థితిగూడా కొంచెం మెరుగైనదట. అందుచేత నీ దానం స్వీకరించరట. బహుశా మీ సదనయ్య మీ కుటుంబాన్ని ఆదుకొంటున్నాడనుకొంటాను."

"నా పేరు లలన అని మీ కెలా తెలిసింది?"

"మీ సదన్నయ్యే చెప్పాడు. వారంతా నీవు గంగానదిలో పడి మరణించావనుకొంటున్నారు."

మాలతి వొక నిట్టూర్పు విడిచింది.

"నీవు మరణించలేదనీ, సౌఖ్యంగానే జీవిస్తున్నావనీ మీ సదన్నయ్యకు చెప్పాను."

"అలా యెందుకు చెప్పారు?"

"నే నసత్యం చెప్పానా? నీవు జీవించిలేవా? నీవు సౌఖ్యంగా—"

"సరేకాని, సదన్నయ్య యీ విషయం మిమ్మల నడిగాడా?"

"సదన్నయ్య అడుగలేదు. నేనే స్వయంగా చెప్పాను. పైగా ఈ విషయం మీ అమ్మకుగూడా చెప్పమని చెప్పాను."

"లలనే డబ్బు పంపించిందనిగూడా చెప్పమని చెప్పారా?"

"ఆఁ"

"మీరంతా గడబిడచేశారు. అతను పిచ్చివాడు. ఈ విషయం ఊళ్లో వారందరకూ చెపుతాడు. వారంతా నేను మరణించా ననుకొంటున్నారు. మీరు మధ్యలో యీ పనిచేశారు."

"లలనా! మీరంతా యెవరిని పిచ్చివా డనుకొంటున్నారో అతను పిచ్చివాడు కాడు. ఒకప్పు డతను పిచ్చివాడు కావచ్చు. కాని నేడతడు పిచ్చివాడు కాడు. కాని నీవు జీవించేవున్నావని అతనికి నమ్మకంలేదు. అత నెలా చెప్పగలడు?"

"ఈ విషయం మీ కెలా తెలుసు?"

"లలన జీవించివున్నదని మీ అమ్మతో చెప్పవలసినదిగానేనతనితో అనగానే, లలన సిగ్గుపడవలసినపని యేమీ చేయదు. ఆమెకు దాగికొన వలసిన అవసరంలేదు. ఆమె మరణించింది." అంటూ వెళ్ళిపోయాడు.

"లలన జీవించేవున్నదయ్యా" అన్నాను నేను.

"ఆఁ అవును. ఆమె స్వర్గంలోవున్నది" అన్నాడు.

"కొంచెం ఆగవయ్యా! అన్నాను. "ఆగడానికి వీలులేదు. నేను వెళ్ళాలి. ఒకవేళ లలన మీకు కనిపిస్తే నా ఆశీస్సు లందజేయండి"అంటూ తిరిగి చూడకుండా వెళ్ళాడు."

మాలతి వొక్క నిట్టూర్పు విడిచి 'నా కిలా తోస్తున్నది. నే నే విషంపుచ్చుకొన్నానో, అతనూ అదే విషం పుచ్చుకొని వుంటాడు. నావిషయంలో విషం అమృతంగా మారిపోయింది. కాని అతనివిషయంలో విషం విషంగానే పనిచేసి ప్రాణాలు తీసివుంటుంది."

సురేంద్రబాబు తలవంచుకుని యీ మాటలు వింటున్నాడు. కొంచెంసేపయాక తల పైకెత్తి 'ఇంకొక శుభవార్త చెపుతాను. మీ లలన పెండ్లిగూడా అయిందట."

"ఎక్కడ? ఎవరితో?"

"మీ వూరిలోనే శారదాచరణరాయ్‌తో"

లలిన వెంటనే గ్రహించింది. అతనికి మనసులో ధన్యవాదా లర్పించింది. "శారదాచరణుడు వెండ్లిచేసుకొంటాడని నాకు తెలుసు" నన్నది.

'నీ కెలా తెలుసు. అదివరకే పెండ్లిసంబంధం కుదుర్చుకొన్నారా?'

"పెండ్లిసంబంధం కుదుర్చుకోలేదు. నేనే ఒకపర్యాయ మతనిని లలనను పెండ్లిచేసుకోమని బ్రతిమాలాను. తండ్రిభయంచేత అతను లలనను పెండ్లిచేసుకోవడాని కిష్టపడలేదు. ఇప్పు డతని మనస్సు మారిం దనుకొంటాను. అందువల్లే పెండ్లిచేసుకొనివుంటాడు."

"అతను తండ్రి కెందుకు భయపడతాడు?"

"ఎందుకంటే అతనితండ్రి వట్టిలోభి. కొడుకుపెండ్లికి కట్నం కావాలంటాడు."

అయితే అతనిలో పరివర్తన మెలావచ్చిందంటావ్? వా డడిగిన కట్నం మీ నాన్న యివ్వలేదు. మరి యీ పెండ్లి యెలా జరిగిందంటావ్'

'మీలాగే అతనూ ప్రేమవలలో చిక్కుకొనివుంటాడు. అందుకే పెండ్లిచేసుకున్నాడు' ఈ మాటలు ఆమె మనసులోనే అనుకొన్నది. పైకి అనలేదు.

'మరి మాధవునివిషయమడిగారా?' అని అడిగింది.

'అడిగాను. అతనూ కులాసాగానే వున్నాడట'

మాలతి వొక్క నిట్టూర్పు విడిచింది. ఆరాత్రి చాలా ప్రొద్దుపోయే వర కామెకునిద్రపట్ట లేదు. అనేక విషయాలామె మెదడులో మెదలసాగి నవి. 'సదన్నయ్య వచ్చాడు. అతను డబ్బు తిరిగి యిచ్చివేయడానికి చాలా ప్రయత్నించాడు. వారి కిప్పుడు డబ్బుతో అవసరంలేదట. సరే నేనూ యిక పంపించను. శారదా! నీవు చాల మంచివాడివి. నీకు నా హృదయపూర్వక నమస్కారాలు. నా తప్పులన్నీ మన్నించు. నే నప్పుడు ని న్నేమేమో అన్నాను. నీ వింత మంచివాడివని గుర్తించలేకపోయాను. నీవు చేసిన యీ మేలు నా జీవితాంతం మరచిపోలేను. నీయెడల నా కెప్పుడూ భక్తిభావమున్నది' అనుకున్నది.

# 30

సదానందుడు తిరిగివచ్చాడు. దారిపొడవునా అతను పరధ్యానము గానే వున్నాడు. దారిలో యెవరో 'ఎక్కడినుండి రావడం?' అని ప్రశ్నించారు.

సదానందు డతనివంక చూచి 'ఇంటికి' అని జవాబు చెప్పాడు.

ఇంతలో ఆ మనిషి తోలుకొనివస్తున్న ఆవు ప్రక్కనున్న చేలో పడింది. చేనుసామి తిట్టసాగాడు. ఆవు యజమాని ఆవును చేలోనుండి బయటకు తోలుకొనివచ్చి 'పిచ్చిసదానందుడికి మతి సరిగాలేదు.' అనుకుంటూ వెళ్ళిపోయాడు.

రామూ మామానంద్ చిల్లరకొట్టుదగ్గర కూర్చుని హుక్కాకాలుస్తూ మోకాళ్ళవరకు దుమ్ముకొట్టుకొని వస్తున్న సదానందుని చూచి 'సదా! నాలుగైదు రోజులనుండి ఊరిలో కనిపించడమేలేదు. ఎక్కడకువెళ్ళావ్?' అనడిగాడు.

సదానందుడు తల పైకెత్తకనే వ్రేలితో 'అక్కడి' కంటూ సంజ్ఞచేశాడు.

'ఎక్కడకు? బ్రాహ్మణపాడా?'

'అవును'

'ఇన్నాళ్లున్నావా?'

'అవును.' అంటూ సదానందుడు వేగంగా ముందుకు సాగాడు.

'ఛూ, పిచ్చినాయాలు ఒక్కమాటా తిన్నగా చెప్పడు.'

ఈ మాట సదానందునిచెవిని పడిందో లేదో చెప్పలేము. అతను తిన్నగా సుభదవద్దకు పోయి నోటామెచేతికిచ్చి "వా రెవరో నాకు తెలియలే' దన్నాడు.

"అయితే నీవు వెళ్ళడం వృథాయే నన్నమాట."

సదానందుడు మాట్లాడలేదు.

'అయితే దబ్బేంచేయాలి?'

'నీ యిష్టంవచ్చినట్లు చెయ్యి! కావాలంటే నీవద్ద వుంచుకో. లేకుంటే విసరి అవతల పారవెయ్యి.'

విధిలేక సుభద ఆ డబ్బు పెట్టెలో పెట్టి దాచింది.

'హారాన్‌బా బెక్కడకు వెళ్లాడు?'

'ప్రక్కగదిలో వున్నారు'

'ఎక్కడకు వెళ్ళలేదా?'

'వెళ్ళి యిప్పుడే తిరిగివచ్చారు'

ఆరోజు బాగా తుపానుపీచి వర్షంకూడా పడింది. సుభద వంటపని ఉదయాన్నే పూర్తిచేసింది.

భోజనమైనపిమ్మట హారాన్‌బాబు డబ్బేమయినావుంటే యివ్వమని సుభద నడిగాడు.

'ఇవాళ బయటకు వెళ్ళకండి. వర్షం పడుతున్నది'

'వర్షం కురిస్తేనేం?'

'తిరిగి యింటికి రావడం కష్టం. బురదగావుంటుంది.'

'బురదేమిచేస్తుంది? నా కివాళ అర్జంటుపనివున్నది. తప్పక వెళ్లాలి

అతని అర్జంటుపనియేమిటో సుభదకు బాగా తెలుసు. 'ఇవాళ ఏకాదశి. మీ అక్కగారు అస్వస్థతగా పండుకొనివున్నది'

ఈ మా టతని చెవికెక్కలేదు. గొడుగుతీసుకొని చెప్పులు చేతితో పట్టుకొని విసురుగా యింట్లోనుండి వెళ్ళిపోయాడు.

సుభద వొక నిట్టూర్పు విడిచి'స్వభావ' మనుకొన్నది మనసులో.

సుభద అనుమానం సరియైనదే. రాత్రి పదిగంటలు కాగానే వర్షమారంభమైనది. ఇప్పుడు ప్రతిరోజూ రాత్రిళ్లు సుభదకు కొద్దిగా జ్వరం వస్తున్నది. ఈ విషయ మామె యెవరితోనూ చెప్పలేదు. తనలో తనే బాధపడుతున్నది.

వర్షంతోపాటు సుభధకు జ్వరంకూడా వచ్చింది. ప్రక్కనున్న గుడ్డలు తీసి కప్పుకొన్నది. అర్ధరాత్రిసమయానికి ఆమెకు కొంచెం నిద్ర పట్టింది.

వర్షమింకా కురుస్తూనేవున్నది. ఉరుము వురిమింది. సుభదకు మెలుకువవచ్చింది. సరిగా అదే సమయంలో యెవరో తలుపు గడియ తీసుకొని లోపలకు ప్రవేశించడానికై ప్రయత్నిస్తున్న ట్లామెకు తోచింది. 'ఫట్' మన్న శబ్దం వినిపించింది. తలుపు తెరుచుకొన్నది. తలుపుతెరుచు

కొనడంతో వక్షపుజల్లు లోపలకు కొట్టసాగింది. గదిలో దీపం వెలుగుతున్నది. సుభద కండ్లువిప్పి చూచేసరికి యెవరో గదిలో ప్రవేశి స్తున్నట్లు తోచింది. అతని శరీరమంతా నల్లసిరా పూయబడినట్లున్నది. అక్కడక్కడ తెల్లని మచ్చలున్నవి.

సుభద భయంతో వణుకుతూ'ఎవరు' అన్నది.

'అరవకు'

సుభద భయంతో కండ్లుమూసుకొన్నది,

ఆ వచ్చిన వ్యక్తి కర్రతో నేలమీద రెండుమాట్లు కొట్టి 'నీ పెట్టె తాళంచెవు లిలాయివ్వు' అని గద్దించాడు.

సుభద మాట్లాడలేదు.

'ఏయ్! నీకే చెప్పేది. తాళంచెవు లివ్వు. లేకుంటే నీ ప్రాణం తీస్తా' నంటూ మరల కర్ర నేలకేసి కొట్టాడు.

సుభద మెల్లగా లేచి తలగడక్రిందనున్న తాళంచెవులు తీసి అతని ముందు విసరివేసి 'పెట్టెలో కుడివైపున యాభైరూపాయల నోటున్నది. ఎడమవైపున కాశీవిశ్వేశ్వరుని ప్రసాదమున్నది. దానినిమాత్రం ముట్టుకో వద్దు' అన్నది.

'ఆ పెట్టెలో యింకేమైనా వున్నదా?'

ఈ ప్రశ్నకు సుభద జవాబుచెప్పలేదు. ఆమె భయంతో వణికి పోతున్నది.

తాళాలు తీసుకొని ఆ వ్యక్తి పెట్టెతెరిచాడు. ఎడమవైపు తను చేయి పెట్టనేలేదు. కుడివైపునున్న యాభైరూపాయలనోటు తీసి బొడ్లోదోపు కొన్నాడు. సుభద ముందే చెప్పిందికనుక అతనిపని సులభమైంది.

ఆ భయంకరరూపధారి గదిలోనుండి కాలు బయటపెట్టగానే సుభద నోటివిట్టూర్పు విడిచి 'నోటుమీద నంబరు, నెంబరు వున్నవి. కొంచెం జాగ్రత్తగా మార్చుకో' అన్నది.

———

# పల్లీయులు

[శరత్ బాబు]

అనువాదం:

నీలకంఠం

శరత్ గ్రంథమాల, విజయవాడ.

# పల్లీయులు

వేణీఘోషాల్, ముఖర్జీగారింట్లో అడుగుపెట్టాడో లేదో — తన కెదురుగా కన్పించిన ప్రౌఢ స్త్రీని చూసి — 'చిన్నమ్మగారేనే! చిన్నమ్మా! రమ ఎక్కడున్నది?' అని అడిగాడు.

అప్పుడే చిన్నమ్మగారు పూజచేసుకుంటూవుంది. ఆమె వంటింటి వేపు చూపించింది. వేణీ అక్కడనుంచి వంటింటిదగ్గరకువచ్చి —'ఏమి చేయాలని, నిశ్చయించుకున్నావు రమా?"అని అడిగాడు.

మండుతున్న పొయిమీదనుంచి, చిటచిటలాడుతున్న చిన్న బాణలి దించి, క్రిందపెట్టి–రమ తలెత్తిచూసి– 'ఏ విషయంలో పెద్దన్నయ్యా?' అని అడిగింది.

"తారిణీబాబాయ్ శ్రాద్ధంవిషయమమ్మా. నిన్న రమేశు యిక్కడికి వచ్చాడు. తన తండ్రి కర్మను అట్టహాసంగా చేయాలని చూస్తున్నాడు. నువ్వు వెళతావా —లేదా?" అన్నాడు వేణీ.

రమ చకితురాలై -కళ్ళు పెద్దవిగాచేసి అన్నది. "నేనా? నేను వెళతానా తారిణీఘోషాల్ యింటికి?"

వేణీ కొంచెం సిగ్గుపడుతూ చెప్పాడు—'అవును తల్లీ! అది నాకూ తెలుసు! యేది యేమైనా మీరు అక్కడికి వెళ్ళరు. కాని వాడు స్వయంగా వచ్చి అందర్ని పిలుస్తున్నాట్ట. చెడుబుద్ధుల్లో వాడు తండ్రినికూడా మించి పోయాడు. ఒకవేళ వాడు యిక్కడికివస్తే-యేమంటావు?"

"నేను యేమీ చెప్పను. తలుపుబైట నుంచున్న దర్వానే జవాబు చెప్పి పంపగలడు" అని కొంచెం కోపంతోనే అన్నది.

ఈ మాటలు చిన్నమ్మగారి చెవుల్లో పడినయ్! ఆ మాటలు ఆమె కంతగా రుచించలేదు, ఆమె పూజవద్దనుంచి లేచివచ్చి, రమ మాట పూర్తికాకముందే, రుసరుసలాడుతూ —'దర్వానెందుకు చెప్పాలి? నాకు చేతకాదా? మళ్ళీ యీగడప తొక్కకుండావుండేటట్లు చెప్పుతాను. తారిణీ ఘోషాల్ కొడుకు పిలవడానికి వస్తాడా? మాయింటికా? వేణీ! నే నింకా అన్ని సంగతులు మర్చిపోలేదు. తారిణీ తన యీకొడుకుకే, మా రమను పెండ్లిచేసుకుందామని చూశాడు. అప్పటికి మా యతీంద్రుడు పుట్టలేదు.

యీ వివాహం జరిగినట్లయితే, యదునాథముఖర్జీ ఆస్తంతా చిక్కుతుందని చూశాడు. గ్రహించావా వేణీ! ఎప్పుడైతే యీ పెళ్ళి జరగలేదో, అప్పుడిక, యీ భైరవాచారికి ఏదో లంచం మేపి - జపతపాలతో - చేతబడి చేయించి, నాబిడ్డ గొంతుకోశాడు. ఆర్నెల్లయినా గడవకముందే దీని ముఖాని కుంకుమ, చేతిగాజులు పోయినయ్! వాడివంశం ఎటువంటిది? పరువు—మర్యాదలేని వంశంలో పుట్టి-యదుముఖర్జీకూతురును కోడలిగా చేసుకుందామని ప్రయత్నించాడు. అటువంటి కుత్రిమముగలవాడికి అటువంటి చావే గలిగింది. చివరకు కొడుకుచేతిమీదుగా తలకొరివికూడా పెట్టించుకోలేకపోయాడు. పరువూ, మర్యాదలులేని పీడిముఖంమంద!' అని ఆమె కుస్తీపట్టి ఓడిపోయిన పీరువిలా రొప్పుతూవుంది.

మాటి మాటికి 'పరువు - ప్రతిష్టలూ - మానమర్యాదలు' అని అంటుంటే వేణీ ముఖం నల్లబడింది. ఎందుకంటే తారిణీ ఘోషాల్, వేణీకి పినతండ్రి. ఈ సంగతి రమ గ్రహించి, పినతల్లిని చీవాట్లుపెట్టి— "ఏం పిన్నీ—? జాతిని గురించి నీ వెందు కలా అంటావు? వంశమంటే ఒకరిచేత్తో గడించిన వస్తువుకాదు. ఎవ రే జాతిలో జన్మిస్తారో వాళ్ళకా జాతే గొప్పది."

వేణీ కొంచం లజ్జాభావంతో నవ్వుతూ—"కాదు రమా! చిన్నమ్మ అన్నదికూడా నిజమే! నువ్వు కులీనుల యింటి ఆడపడుచువు. అటువంటి నిన్ను మా యింటికి తెచ్చుకోగలమా? అసలు బాబాయ్ అలా అనడం తప్పంటాను. యిక, జపతపాలు - చాతబడులూ - ప్రయోగాలంటావా? అదీ నిజమే! భైరవాచారికీ, బాబాయ్‌కీ చేతకాని పనంటూ ప్రపంచంలో లేదు. మరి ప్రస్తుతం యీ భైరవాచారే, రమేశుకు సలహాదారు' అని చెప్పాడు.

"అదే తెలిసిన మాటంటే! పీడు పది పన్నెండేళ్ళనుంచి యీ వూరికి రాలేదు. అసలు యింతకాలం యెక్కడున్నట్లు?" అని చిన్నమ్మ అడిగింది.

"నాకేం తెలుసమ్మా! మా బాబాయ్‌తో మీ కెంత వ్యవహారం వుందో—నాకూ అంతే; అయినా వాడు యింతకాలం బొంబాయిలోనో ఎక్కడో వున్నాడని విన్నాను. కొందరేమో డాక్టరీ ప్యాసయాడని అంటున్నారు. మరికొందరు యిదంతా వట్టిదే, ఏమీలేదని యింకా కొంద

రన్నారు. పెద్ద త్రాగుబోతని చాలామంది అన్నారు. యింటికి వచ్చాక చూశాను. కళ్ళు ఎర్రగా మందారపు పువ్వుల్లా వున్నయ్!"

"అదా సంగతి....? అటువంటివాన్ని గడప తొక్కనీయకూడదు" అం పిన్నమ్మ అన్నది.

ఉత్సాహంగా తలూపుతూ' వేణీ అన్నాడు— "అవును. ఎప్పుడూ రానీయకూడదు. ఏం రమా! నీకు రమేశ్ గుర్తే కదూ?"

తన దౌర్భాగ్యపు ప్రసంగం రావడంతోనే రమ సిగ్గుపడింది· అయినా సలజ్జాభావంతో నవ్వుతూ చెప్పింది— "గుర్తెందుకు లేదు—? నా కంటే ఎక్కువ పెద్దవాడేమీ కాదు. అదీగాక, మే మిద్దరం ఆ మసూచి ఆసుపత్రి దగ్గరున్న పాఠశాలలో చదువుకున్నాం. కాని, అతనితల్లి చని పోవడం నాకు బాగా గుర్తువుంది. అతని తల్లికి నే నంటే మహా·ఆపేక్షగా వుండేది."

"దాని ఆపేక్ష మండిపోయిందిలే! తన పనికోసం తను చేసిన నటనది. నిన్నెలానైనా చేతుల్లో యిరికించుకోవాలనే వాళ్ళ వుద్దేశ్యం" అని పినతల్లి యింకోమారు ఎగిరిపడింది.

వేణీ ఏదో మహా తెలిసినవాడిలా హుంకరించి— "అతని మాట పూర్తికాకముందే రమ కోపంగా— "పిన్నీ! యిప్పు డా పాతపురాణం తవ్వుకోవడ మెందుకు!" అని అడిగింది.

రమేశుతండ్రితో రమకు ఎంత విరోధ మున్నప్పటికీ, అతని తల్లిమీద, ఎదో అంతరంగికమైన అనురాగం వుండేది. ఆ అనురాగం యింకా పూర్తిగా నశించలేదు. వెంటనే వేణీ రమమాటల్ని సమర్థిస్తూ— "అవునవును. అది నిజమే! పిన్ని గొప్పవారిబిడ్డ. ఆమె విషయం శీఘ్రమైనా అనుకుంటే మా అమ్మ యిప్పటికీ కళ్ళంట నీరు కారుస్తుంటుంది" అని చెప్పాడు.

అతి ప్రధానమైన సంగతి ఎటుపోయిందో తెలియదు. కాని ప్రసంగం మారిపోయిందని వేణీ గ్రహించి, దాన్నిక అంతటితో ఆఖరు చేద్దామని - "మరి మనం అనుకున్నట్లేనా రమా? లేక దీనికి తిరుగు యేమన్నా వుందా?"అని అడిగాడు.

రమ నవ్వి అన్నది-"అన్నయ్యా! అగ్నిశేషమూ, ఋణశేషమూ, శత్రుశేషమూ వుంచగూడదని మా నాన్నగారు నాతో అప్పుడప్పుడూ అంటుండేవారు. తారిణీఘోషాల్ బ్రతికివున్నంతకాలం మమ్మల్ని నానా బాధలుపెట్టారు. చివరకు మా నాన్నగారిని జైలుకుకూడా పంపాలని చూశారు. అన్నయ్యా! ఈ సంగతులు, నే నింకా మర్చిపోలేను. పైగా బ్రతికివున్నంతకాలం మర్చిపోను. మా నాన్న —తమ్ముడికీ, నాకూ ఆస్తి చెరి సగం పంచియిచ్చినమాట నిజం. కాని, ఆస్థి అంతా కాపాడే భారం నామీదనే వుంది. మేము వెళ్ళము. పైగా మాకు సంబంధమున్న వాళ్ళందర్నీ వెళ్ళనీయము!" అని, ఏదో ఆలోచించి —"సరే అన్నయ్యా! ఇంతకూ బ్రాహ్మణు డనేవాణ్ని వాళ్ళింటి కెళ్ళనివ్వకుండా చేయలేవా?" అన్నది.

•

వేణీ కొంచం ముందుకు జరిగివచ్చి. మెల్లిగా చెప్పాడు — "ఈ సంగతి నేనూ ప్రయత్నంచేస్తున్నానమ్మా; నువ్వు నాకు సహాయంగా వుంటేమాత్రం నాకేమీ చింతలేదు. నేను అతన్ని ఈ కుంవాపుర గ్రామము నుంచి వెళ్ళగొట్ట కుంటే నాపేరు వేణీఘోషాల్ కాదు. ఆ తరువాత నేనూ- భైరవాచారి వున్నాం, యిప్పుడిక తారిణీ ఘోషాల్ లేదు. ఇప్పుడు చూస్తాను యీ భైరవాచారిని రక్షించే వారెవరో?"

"రమేశ్ ఘోషాల్ రక్షిస్తాడు. చూడన్నయ్యా! శత్రుత్వం పెంచ డంలో యితనేమీ తక్కువాడుకాడు. ఈ సంగతి నేను నీతో ముందే చెప్పి వుంచుతున్నాను." రమ అన్నది.

యిప్పుడు వేణీ యింకా కొంచెం జరిగివచ్చి, గడపమీద కూచుని అటూ-యిటూ చూసి, తన స్వరాన్ని యింకా తగ్గించి అన్నాడు – "యిప్పుడు నువ్వు వెదురువాసాన్ని వంచాలంటే యిదే అదును. అది ముదిరిందంటే వంచడం చాలా కష్టం. డబ్బూ, దస్కం ఆస్థి-పాస్తులు ఎలా రక్షించుకోవాలో వాడింకా నేర్చుకోలేదు. యిప్పు డీ మధ్యలోనే శత్రువును నిర్మూలించకుంటే ఆ తరువాత మనవల్ల కాదు. వాడు ఎవరను కున్నారు; తారిణీఘోషాల్ కొడుకని మనం మర్చిపోకూడదు"

"అన్నయ్యా! ఆ సంగతి నాకు బాగా తెలుసు."అన్నది రమ.

"నీకు తెలవందేముందమ్మా — భగవంతుడు నిన్ను మగపిల్ల వాడిగా తయారుచేస్తూ — పొరపాటున ఆడపిల్లగా చేశాడు. తెలివితేటలు గల పెద్ద జమీందారైనా, నీ ముందు పనికిరాడు. సరే, రేపు ఏదో ఒక సమయంలో వస్తాను. చాలా ఆలస్యమైంది. యిక వెళతాను" అని వేణీ ఘోషాల్ లేచి నిల్చున్నాడు. ఈ ప్రసంగంవల్ల, రమ వుప్పొంగిపోయింది. ఆయన్ని సాగనంపేందుకు లేచి నిల్చుంది. హఠాత్తుగా ఆమెగుండె దడదడ లాడింది. పెరట్లోంచి ఎవరిదో పరిచితవ్యక్తి కంఠస్వరం వినిపించింది — "అరే, రాణీ! ఎక్కడున్నావే....?" అని.

రమను చిన్నతనంలో, రమేశ్ తల్లి యీ పేరుపెట్టి పిలుస్తుండేది. కాని రమ ఆ సంగతే మర్చిపోయింది. ఆమె తలెత్తి వేణీవేపు చూసింది. అతని ముఖం నల్లబడివుంది. ఆ వెంటనే రేగిపోయిన జుట్టుతో—కాళ్ళకు చెప్పులులేకుండా తలకు తువాలు చుట్టుకుని రమేశ్ అక్కడికివచ్చి నిలుచున్నాడు. అతనిచూపులు వేణీమీద పడగానే — "అరే! పెద్దన్నయ్యా యిక్కడున్నావేం? సరే పదండి! మీరు లేకుంటే అక్కడి పనంతా ఎవరు చూస్తారు? నేను మీకోసం వూరంతా గాలించి వస్తున్నాను. రాణి ఏదీ?" అని అడిగి గుమ్మానికెదురుగా వచ్చి నిలుచున్నాడు. రమ పారిపోయేందుకు వీలులేక, అక్కడే తలవంచుకుని నిలుచుంది. క్షణంసేపు రమేశ్ ఆమె వేపు చూసి ఆశ్చర్యపడుతూ అన్నాడు "అరే! నువ్వు చాలా పెద్దదానివయ్యావే? బాగా వున్నావా?"

రమ తలొంచుకునేవుంది. చటుక్కున మాట్లాడలేకపోయింది. రమేశు నవ్వుతూ అడిగాడు — "గుర్తించలేదాయే!? నేను నీ రమేశన్నయ్యను."

కాని రమ తలెత్తి అతనివేపు చూడలేక, ఎంతో మృదువుగా — "మీరు బాగావున్నారా?" అని అడిగింది.

"ఆ! బాగానే వున్నాను. కానీ, రమా! నువ్వు నన్ను 'మీరు' అని పిలుస్తావెందుకు?" అని వేణీవేపు చూసి విచారసూచకమైన నవ్వు నవ్వి - "పెద్దన్నయ్యా! ఆనాడు రమ అన్నమాటలు నేనింతవరకూ మర్చిపోలేము. మా అమ్మ చనిపోయినప్పుడు యిది చాలా చిన్నది. ఆనా డిది నా కళ్ళు తుడుస్తూ.... "రమేశన్నయ్యా నువ్వు, ఏడవ వద్దు. మా అమ్మ

వుంది. మనిద్దరం ఆమెను చెరిసగం పంచుకుదాం" అని చెప్పింది. యేం రమా? నీకాసంగతి గుర్తులేదుకదా? పోనీ, మాఅమ్మఅయినా గుర్తుందా?" అని అడిగాడు.

ఈ మాటలు విని రమ యింకా సిగ్గుపడిపోయింది. ఆమె తనకు బాగా గుర్తేనని తల వూగించైనా చెప్పలేకపోయింది. యిక రమతో రమేశు చెప్పడం మొదలుపెట్టాడు. "యిక ఎక్కువ వ్యవధిలేదు. యింకా మూడురోజులు మాత్రమే వున్నయ్! అక్కడ చేయాల్సిందేమో, మీరే చేయించండి! ఒక నిరాశ్రయానిలా మీ వాకిటముందుకు వచ్చి నిలుచున్నాను. మీ రక్కడికి రానిదే ఏపనీ చేయలేను."

రమ పినతల్లి మెదలకుండావచ్చి రమేశువెనక నిలుచునివుంది. వేణీగాని, రమగాని రమేశునికి జవాబుచెప్పలేదు. అప్పు డామె అతని ఎదటకువచ్చి — అతన్ని ఎగా దిగా చూసి "నువ్వు తారిణీఘోషాల్ కొడుకువు కదూ?" అని అడిగింది.

రమేశుడు యీమెను అంతకుముందెప్పుడూ చూడలేదు. అతను గ్రామమువదిలి వెళ్ళిపోయాక, రమ తల్లికి జబ్బుచేసినప్పుడు యీ యింటికివచ్చింది. అప్పటినుంచీ యిక్కడనుంచి బయటికి వెళ్ళలేదు. రమేశు చకితుడై ఆమెవేపు చూస్తున్నాడు.

"కాకుంటే యింత సిగ్గులేనివాడు ఎవడుంటాడు? తండ్రికితగ్గ కొడుకు. అడక్కుండా—చేయకుండా పరులయిళ్ళలోదూరి, యింత అల్లరి చేసేందుకు నీకు సిగ్గుకూడాలేదూ?"

రమేశు మతిలేనివానిలా చూస్తూ కొయ్యబారిపోయాడు — 'నేను వెళుతున్నాను.' అంటూ వేణీ జారుకున్నాడు.

రమ వంటింటిలోంచే అన్నది "ఏమిటా వాగుడు పిన్నీ? నువ్వెళ్ళి నీపని చూడరాదూ?

తన అక్కకూతురు అన్నమాటల్లోని ఆంతర్యాని గ్రహించిన దానిలా పినతల్లి —తన స్వరంలో యింకా కొంచం విషం కలిపి-అన్నది- "చూడు రమా? యిది వాగడమని నువ్వనుకోవద్దు. ఏదైనా పనిచేయవలసి వచ్చినప్పుడు, మీలా నేను మొహమాటపడను. యింతకూ వేణీ భయపడి పారిపోవాల్సిన అవుసర మేమివచ్చింది? చూడబ్బాయీ! మీకొంపలోదూరి

నీళ్ళుతేవడానికీ, పనిపాటలు చేయడానికీ, మేము నీ నౌకరులంగానీ, గుమాస్తాలంగానీ, మీ జమీందారీలోని ప్రజలంగానీకాము. తారిణీఘోషాల్ చనిపోయాడు. గ్రామమంతా చల్లబడింది. వేణీ యీమాట నా నోటితో చెప్పించక, తన నోటిమీదుగా చెప్పినట్లయితే మగవాడు తగినపని చేసినట్లయేది—"

అప్పటికి రమేశు రాతిప్రతిమలా నిల్చుని వున్నాడు. వాస్తవంగా ఈ సంగతులు, యిలా యెదురుతిరగుతవని అతను కలలో కూడా అనుకోలేదు. లోపల వంటగదిలో గొళ్ళెం చప్పుడు వినిపించింది. కాని ఎవరూ అది గమనించలేదు. నోరుమెదల్పక తెల్లబోయి చూస్తున్న రమేశ్ ముఖంలోకి చూస్తూ ఆమె మళ్ళీ అన్నది— "ఏది ఏమైనా—నువ్వు బ్రాహ్మణుల అబ్బాయివి. నిన్ను నౌకరుతో, దరవానులో గెంటించలేను. వళ్ళు దగ్గరెట్టుకుని పనులు చేస్తూవుండు. యిక్కడనుంచివెళ్ళు. యితరుల యిళ్ళలో దూరి అల్లరిచెయ్యడానికి నువ్వేమీ తెలియని పసివాడివి కావు. నీ యింట్లో కాలుగడిగేందుక్కూడా మా రమ రాదు. నేనా సంగతి నీకు ముందే చెబుతున్నాను."

రమేశ్‌కు నిద్రనుంచి మేలుకున్నట్లయింది. అతనిలోంచి ఓ పెద్దనిట్టూర్పు వచ్చింది. తన నిట్టూర్పును విని తనే త్రుళ్ళిపడ్డాడు. తలుపు చాటున నిలుచుని రమ తలెత్తి చూసింది. మొదట రమేశు కొంచెం తొట్రుపడ్డాడు. కాని, ఆ తరువాత వంటింటివేపు చూసి చెప్పాడు — "రావడానికి పిలులేనప్పుడు యిక వుపాయమేముంది? కానీ, నాకీసంగతు లన్నీ తెలియవు. నేను తెలియక చేసిన తప్పును క్షమించు రాణీ—"

ఈ మాట లని రమేశు బయటికి వెళ్ళిపోయాడు. గదిలోంచి ఏవిధమైన శబ్దము లేదు. రమేశు ఎవరిని క్షమించమని కోరాడో వాళ్లు తలుపుచాటున వుండి తనను చూస్తున్నారన్న సంగతే తెలియదు. ఆతరువాత వెంటనే వేణీ అక్కడకు వచ్చాడు. అతను పారిపోలేదు. ఎక్కడో దాగుకుని, రమేశు యెప్పుడు వెళతాడా అని చూస్తున్నాడు. ఆమె అరన్ని చూచి చారెడు ముఖంచేసుకుని ముందుకురాగా ఆమెతో అన్నాడు — "మా బాగా అడిగేశావు చిన్నమ్మా! యిలా మేము. అడగలేము రమా!

యిది నౌకర్లూ, దర్వానులు చేసేపనేనా? నేను చాటుగావుండి చూస్తున్నాను. వాడిముఖం ఆషాఢమేఘంలా అయిపోయింది. మంచిశాస్తి జరిగింది."

"అవును. బాగానే శాస్తి జరిగిందని నాకూ తెలుసు. కానీ యీ మాటలన్నీ మా యిద్దరి ఆడవాళ్ళతో చెప్పించకుండా— నువ్వన్నట్లయితే ఎంతో బావుండేది. పోనీ నువ్వు చెప్పలేకపోవచ్చు. మరి యిక్కడే నిల్చుని నే నన్నమాటలు వింటే ఎంతబావుండేది? నువ్విక్కడనుంచి తప్పు కోవడం యేమంత బావుండలేదు" అని అభిమానంతో ఆమె అన్నది.

ఆమె మాటలకు వేణిముఖంలోని నవ్వు మాయమైంది.ఆమె అన్న మాటలకు ఏమని జవాబు చెప్పాలో అతనికి చప్పున తోచలేదు. యింతలో రమ లోపల్నుంచి వచ్చి జవాబుచెప్పింది— యింతవరకూ ఆమె ఒక్కమాటకూడా మాట్లాడలేదు—"పిన్నీ! నువ్వు బాగానే అడిగావుగా? నువ్వు మాట్లాడ్డమే మంచిదయింది. ఎవరెంత బాగా మాట్లాడినా—నీలా యెవరికీ యింత విషం కక్కడం చేతకాదు."

వేణీ, పిన్నీ యిద్దరూ ఆశ్చర్యంలో మునిగిపోయారు. పిన్ని వం టింటివేపు చూస్తూ అడిగింది-'ఏమిటే నువ్వన్నది?'

"ఏమీలేదు.పూజచేస్తూ,చేస్తూ-ఏడుమార్లు లేచివచ్చావు. వెళ్ళి పూజ ఆఖరుచెయ్! యివాళ వంట ఏమీ చేయనవుసరంలేదా?" అంటూ రమ బయటికివచ్చి, ఎవరితో ఏమీ మాట్లాడకుండా వసారాలోంచి యింకొక గదిలోకి వెళ్ళిపోయింది. వేణి శుష్కించిన ముఖంతో చాలా నెమ్మదిగా- 'అసలు సంగతేమిటి పిన్నీ?' అని అడిగాడు.

"నాకేం తెలుసు? ఆరాజా-రాణీగారి ఉద్దేశ్యం తెలుసుకునేందుకు నా బోటి దాసీలకూ నౌకర్లకూ చేతకాదు-" అంది. కోపంతోనూ; క్షోభ తోనూ, పిన్నిముఖం నల్లబడిపోయింది, ఆమె వెళ్ళి పూజాసనం మీద కూచుంది. బహుశా మనసులోనే భగవంతుని తలుచుకుంటుందేమో! వేణి మెల్లిమెల్లిగా అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

## 2

ఈ కుంవాపురం సంపద సంపాదనవిషయంలో ఒక కథవుంది. అది యిక్కడ చెప్పడం అవసరం; వందసంవత్సరాలక్రితం మహాకులీనుడైన బలరామముఖర్జీ,తన మిత్రుడైన బలరామ ఘోషాల్ తో వెంటబెట్టుకుని,విక్ర

మధ్యరంనుంచి, యిక్కడికి వచ్చాడు. ముఖర్జీ కులీనుడేకాదు, చాలా తెలివి తేటలుగలవాడు. ఆయన తన వివాహం చేసుకుని, జమీందారునద్ద పని చేస్తూ - యింకా మోసాలు చేసి యీ ఆస్తంతా చేజిక్కించు కున్నాడు. ఘోషాలుకూడా యిక్కడే వివాహం చేసుకున్నాడు. ఆయన కూడ తండ్రిచేసిన అప్పులు తీర్చటం తప్ప యింకేమీ చేయలేక పోయాడు. అందువల్ల అతను చాలాకష్టంగా కాలం వెళ్ళదీస్తున్నాడు. వివాహ విషయంలోనే యిద్దరిమిత్రులకు విరోధం కలిగింది. ఈ విరోధం ఎంతవరకు వచ్చిందంటే, ఒకవూళ్ళోనేవుంటూ, మిత్రులిద్దరూ యిక్కడై యేండ్లవరకూ ఒకరి ముఖం ఒకరు చూచుకోలేదు. చివరకు బలరామ ముఖర్జి చనిపోయినప్పుడు కూడా ఘోషాల్ ఆయనింట్లో అడుగుపెట్ట లేదు. కాని ముఖర్జి చనిపోయిన మరునాడు తన యావదాస్తిని, సగం తన సంతానానికీ, మిగిలిన సగం మిత్రుని సంతానానికి చెందేట్లు వీలునామా వ్రాశాడని వూరంతా గుప్పుమన్నది. అప్పటినుండీ యీ కుంవాపురం జమీందారు యావత్తూ ముఖర్జీ-ఘోషాల్ వంశస్థుల హస్తగతమై చెరి సమానంగా అనుభవిస్తూ వస్తున్నారు. వీరు తాము జమీందారులమని సగౌరవంగా చెప్పుకుంటున్నా, గ్రామస్తులు కూడా కాదనడంలేదు. ఈ కథ జరిగేనాటికి, ఘోషాల్ వంశంవాళ్లుకూడా రెండు భాగాలుగా ఆస్తిని పంచు కుని వేరుపడి వుంటున్నారు. కొన్నిరోజులక్రితం, ఆ వంశంలో చిన్నవా డైన తారిణిఘోషాల్ దావా విషయంలో జిల్లాకోర్టుకు వెళ్ళాడు. అక్కడి కోర్టులో అతనికి అయిదారు కేసులున్నాయి; కాని, ఆ దావాలవ్యవసానం ఏమీ తేలకముందే, ఎక్కడిదో యింకొక పెద్దకోర్టు ఆజ్ఞనుంచి తప్పించు కోలేక, యీ లోకంనుంచి మెదలకుండా వెళ్ళిపోయాడు. ఈ సంగతి కుంవాపురమంతా గుప్పుమని ప్రక్కవూళ్లకుకూడా వ్యాపించిపోయింది. ఘోషాల్ వంశంలో పెద్దసంతతికి చెందిన వేణీఘోషాల్ తన పినతండ్రి చావుకు చాలా సంతోషించి నిట్టూర్పు విడిచాడు. ఆ తరువాత రాబోవు చిన్నాయనగారి శ్రాద్ధం సరిగ్గా జరుగనివ్వకుండా చేయాలని, లోలోపలే కుట్రలుచేస్తున్నాడు. పదిసంవత్సరాలనుంచి తనకూ పినతండ్రికీ మాటలు లేవు. ఒకరిముఖం ఒకరు చూచుకుని ఎరుగరు. పదిసంవత్సరాల క్రితం తారిణీ భార్య చనిపోయింది. అందువల్ల తన కొడుకు రమేశుని మేన

షూపల యింటికి పంపి. తను యింట్లోనే, దాసదాసీలతో - నౌకర్లతో- బయటి వ్యవహారాలతో తన కాలం కాస్తాగడిపాడు. కాలేజీలో చదువుకుం టున్న రమేశు తండ్రి మృత్యువార్త విని-ఎంతో దుఃఖంతో శ్రాద్ధాదికర్మలు చేసేందుకు తన స్వగ్రామము నిన్నటి మధ్యాహ్నమే వచ్చాడు.

మైలకొంప; యింకా రెండురోజులే వ్యవధివుంది. గురువారంనాడు తండ్రి శ్రాద్ధం. చుట్టుప్రక్కల గ్రామాలనుంచి, ముసలివాళ్లు ఒకరూ. యిద్దరూ వస్తున్నారు. కాని. వున్నవూరైన కుంవాపురంలోంచి యింకా ఎవరూ రాలేదు. ఎందుకురాలేదో-ఆ సంగతి రమేశుకు తెలుసు, అసలు శ్రాద్ధం అయిపోయేవరకూ ఎవరూ రారని కూడా గ్రహించాడు. ఒక్క భైరవాచారి- అతనింటివాళ్లమాత్రంవచ్చి, పనులన్నీ చేస్తున్నారు. చాలా పేపటినుంచి రమేశు యింట్లో తన పనులు చేసుకుంటున్నాడు, వూళ్లోని బ్రాహ్మణులు తనింటికి వస్తారనే ఆశలేకపోయినా - పనులన్నీ భారీగానే చేస్తున్నాడు. రమేశు ఏదో పనిమీద బయటికి వచ్చాడు, ఈలోపల ఎవరో యిద్దరు వృద్ధులు వచ్చి తివాచీమీద కూచుని హుంకా త్రాగుతూండడం చూశాడు. ఆయన వాళ్ళదగ్గరకువచ్చి ఏవోరెండు ఉపచార వాక్యాలు అందామని అనుకుంటుండే సరికి-వెనక చప్పుడైంది. ఆయన తలతిప్పి చూసేసరికి, ఎవరో పండుబారిన వృద్ధుడు అయిదారుగురు పిల్లలను వెంట బెట్టుకుని దగ్గుతో లోపలికి రావడం చూశాడు. ఆయన భుజంమీద ఒక పాత కండువావుంది. ముక్కుమీదగాజుల్లా, రెండు కళ్ళద్దాలున్నాయి; కళ్ళద్దాలు దారంతో వెనక కట్టివున్నాయి, తలమీద వెంట్రుకలు పండి తెల్లగావున్నయి. మీసాలుకూడా పొగాకురంగుగా మారిపోయినయి; ఆయన యింకా కొంచంముందుకువచ్చి, ఆ భయంకరమైన కళ్ళద్దాల్లోంచి రమేశునిముఖం చూస్తూ—అనునయ వాక్యాలు ఏమీ మాట్లాడకుండానే, ఒక్కసారిగాయేడ్చాడు. ఈయన ఎవరో రమేశు గ్రహించలేకపోయాడు. కానీ ఆయన ఎవరైతేయేం? రమేశు గాబరాతో ఆయనకు ఎదురు వెళ్ళాడు. రమేశు అతని చేతులు పట్టుకున్నాడో లేదో గద్గదకంఠంతో — "లేదు నాయనా రమేశ్! ఈవిధంగా నన్ను మోసపుచ్చి, తారిణీ యిలా వెళ్ళిపోతాడని నే నెప్పుడూ అనుకోలేదు. అక్కడా-యిక్కడాచేరి, ఎవరి ముందు వారిమాటలు మాట్లాడే ఛటర్జీవంశంలో పుట్టలేదునేను. రమేశు

శ్రాద్ధానికి ఎంతగొప్పగా ఏర్పాట్లు చేస్తున్నాడో, అంతగొప్పగా యిదివరకు ఈ ప్రాంతాల్లో ఎవరూ చేసివుండరు. అని నేను వచ్చేప్పుడు వాడితో చెప్పేవచ్చాను." అని కొంచెంఆగి—"చూడు నాయనా! కొంతమంది వెధవలు నామీద లేనిపోనిమాటలు మీముందు అనేవుంటారు, కానీ యీ సంగతిమాత్రం గుర్తుంచుకో! ఈ ధర్మదాసు కేవలం ధర్మానికి దాసుడు కానీ, యింకెవరికీ కాదు." అని వృద్ధుడు తన సత్యభాషణంలోని పౌరుష మంతా ప్రదర్శిస్తూ, గోవింద గంగూలీ చేతి హుక్కా లాగుకుని గట్టిగా దమ్ములాగి, గట్టిగా దగ్గడం సాగించాడు.

ధర్మదాసన్నదానిలో అత్యుక్తి యేమీలేదు. శ్రాద్ధానికి జరుగు తున్న యేర్పాట్లు చూస్తుంటే, యిదివర కెప్పుడూ యెవరూ ఇలా చేసి వుండ రనుకోవచ్చు, కలకత్తానుంచి వంటవాళ్లు వచ్చారు, వాళ్లు పెరట్లో ఒక ప్రక్కన పిండివంటలు చేస్తున్నారు. వూళ్లోని పిల్లలంతా అక్కడ చేరారు, బీదవాళ్ళకు బట్టలు పంచాలనుకున్నారు. చండీమంటపానికి ఒక ప్రక్కగా కూచుని, భైరవాచారి తానులనుంచి ధోవతులు చింపుతూ కుప్పలు పెడుతున్నాడు. కొంతమంది అక్కడకూడా కూచుని, యీ అప వ్యయం లెక్కలువేస్తూ—రమేశుని మూర్ఖత్వాన్నిగురించి మనసులో తిట్టు కుంటున్నారు. బీద-బిక్కా మొదలైనవాళ్ళంతా చాలాదూరంనుంచి వస్తు న్నారు. అన్నిరకాలైన మనుష్యులతో యిల్లంతా నిండిపోయింది. కొం దరు పోట్లాడు కుంటున్నారు. కొందరు అల్లరిచేస్తున్నారు. చుట్టూ కలియ చూశాడుధర్మదాసు. చివరకు యింత అపవ్యయము కంటబడేసరికి ధర్మ దాసుకు దగ్గుయెక్కువైంది.

ధర్మదాసుకు సమాధానంగా రమేశు—'కాదు, కాదు.' అని అంటూ యింకా యేదో చెప్పబోతున్నాడు.కానీ ధర్మదాసు చేత్తో అతన్ని ఆగమని. గడగడ మంటూ ఏవో వాగుతున్నాడు, కానీ దగ్గువల్ల అత నన్నమాటలు యెవరికీ అర్థంకాలేదు.

అసలు గోంవిదగంగూళి అందరికంటె ముందువచ్చాడు.ధర్మదాసు చెప్పిన మాట లన్నీ గోవిందగంగూళీ అందరికంటే ముందు చెప్పే అదను దొరికింది. కానీ, అప్పు డామాటలు చెప్పలేక పోయాడు. యిప్పుడు పశ్చాత్తాప పడుతున్నాడు. కానీ యిప్పుడు మళ్ళీ అవుస రం

దొరికింది. దీన్ని మాత్రం స్పర్థం చేయలేదు. ఆయన ధర్మదాసుకు చెప్పతున్నట్లు తొందర తొందరగా చెప్పాడు. "విను ధర్మదాసన్నయ్యా! నిన్న ప్రొద్దున యిక్కడికి వద్దామని యింట్లోంచి బయలుదేరాను. వేణు నన్ను పిలవడం మొదలుపెట్టాడు. 'గోవింద్ చిన్నాయనా! కొంచం హుక్కా త్రాగి వెళ్దువుగాని రా!' అని పిల్చాడు. మొదట అక్కడికి వెళ్ళవలసిన అవసరం లేదులేఅని అనుకుని, అయినా అతని అభిప్రాయం కూడా తెలుకోవచ్చునని వెళ్లాను. వేణీ యేమన్నాడో విన్నావా రమేశ్? అతను —"చిన్నాయనా! నువ్వు రమేశుకు సాహాయ్యం చేద్దామని, వెలుతున్నావు. కాని, మరి అక్కడికివచ్చి తిండి తిని వెళ్ళేవా రెవరైనా వున్నారా?" అని అడిగాడు. అయినా నేను వదిలి పెట్టాననుకున్నారా? అతను గొప్పవాడైతే కావచ్చు. కాని రమేశుకూడా ఎవరికీ తీసిపోడు. అతని దగ్గర్నుంచి చిట్టెడు గింజలు తెచ్చుకుందామనే ఆశ యెవరికీలేదు. నేను —"వేణీ! వచ్చేపోయేదారి యిదేకదూ? బీద-సాదలు సెలవుపుచ్చుకుని వెళ్ళిపోయేప్పుడుమాత్రం కొంచెం యిక్కడుండి చూస్తూవుండు. రమేశు యింకా పసివాడైతేయేం? హృదయమంటే అతనిదే. నాకింత వయసు వచ్చింది. కాని యిటువంటి ఏర్పాట్లు ఎక్కడా చూడలేదు. అయినా మనదేముంది ధర్మన్నయ్యా? ఇది యెవరిపనో-ఆయనే పైనుంచి చేయించుకుంటున్నాడు. తారిణీ అన్నయ్యశాపంవల్ల పుట్టిన దిక్పాలకుడు కాకుంటే మరెవరు ...?"

కాని ధర్మదాసు దగ్గుమాత్రం తగ్గలేదు. ఆయన దగ్గుతూనే వున్నాడు. తనయెదుటనే గంగూళీ వినసొంపైన మాటలు చిన్న జమీందారుకు చెపుతూంటే, తనంతకంటే మంచిమంచి మాటలు చెప్పాలని దగ్గుతో తల్లక్రిందవుతున్నాడు.

గంగూళీ యింకా చెపుతూనే వున్నాడు-"నాయనా! నువ్వు నాకేమీ పరాయివాడివికావు. మీ అమ్మ మా మేనత్త కూతురుకు చిన్నాయనకూతురు. రాధానగరంలో బెనర్జీల యింటిసంగతి తారిణీ అన్నయ్యకు బాగాతెలుసు. అందువల్లనే ఏపనికలిగినా- దావాలు కలిగినా-ఈ గోవిందునికి పిలుపు వచ్చేది."

ఇప్పుడు ధర్మదాసు ప్రాణాలన్నీ బిగబట్టి దగ్గు ఆపుకుని గోవిందతో అన్నాడు- "గోవింద్! మెంటున వ్యక్తంగా వాగుతావు? ఛీ-ఛీ-ఛీ- నే నిప్పటివాణ్ణికాను. నాకేమీ తెలవదను కున్నావా? ఒకప్పుడు సాక్ష్యానికి పిమ్మందే, నా కాళ్ళకు చెప్పులుండేవు. అంతదూరం నడిచి ఎలా పిమ్మంటావు? అని నువ్వు నలా? ఛీ-ఛీ-ఛీ. రాత్రివే తన్నుకొన్నా తెలుసు న్నకయిచ్చి కొనిపెట్టిన చెప్పులు తొడుక్కొని వెళ్ళి వేసేతప్పుడు సాక్ష్యం చెప్పి వచ్చావు. ఛీ-ఛీ-ఛీ."

గోవింద కళ్ళెర్రచేసి-'నేను సాక్ష్యం చెప్పానా?' అన్నాడు.

'చెప్పలేదూ?'

'పోరా—తప్పుడు ముండాకొడకా'

'తప్పుడువాడు మీనాయన, నేనుకాను.'

గోవిందుడు తన విరిగిపోయిన గొడుగు ఎత్తి - 'రారా! రా-' అన్నాడు.

ధర్మదాసు చేతికర్ర పైకెత్తి హుంకరించాడు. అప్పుడే దగ్గు తెర వచ్చింది-ఏమేశు గాభరాపడుతూ యిద్దరిమధ్యకు వచ్చి స్తంభించి పోయాడు. ధర్మదాసు తన చేతికర్ర క్రిందకు దించి దగ్గుతూ చూచుని అన్నాడు- ""ఆ వెధవకు నేను వరుసకు అన్న నవుతాను. వాడిపోగరు చూశారుగా?"

గోవిందగంగూళీ తన గొడుగుక్రిందకు దించి- "ఈ ముండావాడు నాకు అన్నట-" అన్నాడు.

కలకత్తా వంటవాళ్ళు వంటఆపి ఈ తమాషా చూస్తున్నారు. నది పాటల్లో మునిగివున్న వాళ్ళంతా ఈ గందరగోళం చూసేందుకు అక్కడ చేరారు. పిల్లలంతా ఆటమాని, ఈ ఆటదగ్గర పోగయారు. వాళ్ళందరి ఎదట ఏమేశు మాత్రం సిగ్గూ—సంభ్రమాశ్చర్యాలతో నిలుచుని వున్నాడు. అతని నోటంట మాటలేదు. ఏమిటిదంతా? యిద్దరూ పెద్ద వాళ్ళే! వయసు ముదిరినవాళ్ళే. బ్రాహ్మణులే! యింత నాసిరకం మనుషులు యీనిచ కూలివాళ్ళలా తిట్టుకుంటున్నారు. చండీ మండపం పంచలో కూచుని శైలజాచారి గుడ్డలు చింపుతున్నాడు, అంతా వింటున్నాడు.

చూస్తున్నాడు కూడా. అప్పుడు లేచివచ్చి రమేశుతో అన్నాడు-"యిప్పటికి నాలుగువందలు చింపాను. యింకా, ఏమన్నా కావాల్సి వస్తాయా?"

అందుకు వెంటనే రమేశుని నోటంటమాట పెగలి రాలేదు. అభిభూతుడైన రమేశుని చూసేసరికి భైరవాచారికి నవ్వు వచ్చింది. అతను ఎంతో మెత్తగా మందలిస్తూ అన్నాడు-"ఛీ. గంగూళిమహాశయా! బాబుగారు ఒక్కసారే విశ్చేష్టులయారు. బాబుగారూ! మీ రా విషయాలు అంతగా పట్టించుకోకండి! యిటువంటి సంగతులు యిక్కడ అప్పు డప్పుడూ జరుగుతూనే వుంటాయ్. పెద్ద పెద్ద కార్యాలు చేసే యిళ్ళలో యిటువంటి పోట్లాటలూ--కొట్లాటలూ జరుగుతూనే వుంటయి! చివరకు దెబ్బలాటలు మొదలుకుని, ఖూనీలవరకూ పోతూంటయి! ఆ తరువాత అంతా కలిసి ఒకటవుతారు. సరే యిక లేవండి ఛటర్జీగారూ! యింకా ధోవతులు కావాలేమో కొంచం చూడండి-"

ధర్మదాసు జవాబు చెప్పకముందే, గోవిందగంగూళీ యెంతో వుత్సాహంగా లేచినిల్చుని అన్నాడు- "అవును. యిలా జరుగుతూనే ఉంటయి! అప్పు డప్పుడు జరుగు తుంటయి! లేకుంటే యిది 'గొప్ప కర్మ' అని అనిపించుకోదు. లక్ష సంగతులు జరగనిదే పెళ్ళికాదని శాస్త్రాల్లో రాసివుంది. ఆ సంవత్సరం జరిగిన సంగతి నీకు గుర్తేకదూ భైరవ్? యిఖర్జీవారి కూతురు రమ పెళ్ళప్పుడు-రాఘవభట్టాచారీ, హరాన్ ఛటర్జీ తలకాయలు పగులకొట్టుకున్నారు. కాని భైరవన్నయ్యా! రమేశు పని నా కేమీ బావుండలేదు. అలాగా వాళ్ళకుగుడ్డలు పంచడం బూడిదలో నెయ్యి పోయడం వకటే. అంతకంటె బ్రాహ్మణులకు ఒక ధోవతులు, వారి పిల్లలకు ఒక్కొక్క ధోవతి యిచ్చి నట్లయితే పేరు వస్తుంది. చిన్నబాబుకి యీ పద్ధతి ప్రకారం చేయమని చెపుతున్నాను. ధర్మన్నయ్యా! నీ అభిప్రాయం ఏమిటి....?"

ధర్మదాసు తలూపుతూ-"అవును. గోవిందు ఏమీ తప్పనలేదు. వీళ్ళకు వెయ్యిపంచినా పేరుప్రతిష్ఠలురావు. లేకుంటే వీళ్ళను అలగా జాతని యెందుకుంటారు? గ్రహించావా రమేశ్?" అని చెప్పాడు.

యింతవరకూ రమేశు మెదలకుండా వున్నాడు. గుడ్డలు పంచే విషయంలో అదినిజేనాలా బాధగావుంది. కాని, పెళ్ళ...ప్తి పెయిట్ల కేమీ

బాధపడలేదు. అన్నిటికంటే ఈ సంగతే అతనికి గుర్తుకొస్తూంది. అలగా వాళ్ళనీ, నీచులనీ, యిప్పుడు అన్నవాళ్ళే, యింతమంది అలగా జాతి ముందు తాము సిగ్గెగులు లేకుండా దూషింపుకున్నారు. ఇంకా భైరవ్ తనముఖంవేపు చూస్తుండంచూసి రమేశు-ఇంకా రెండు పందులు "చంపి తయారుచేసి వుంచడి-" అని చెప్పాడు.

"అవును, అన్నిలేకుంటే వనెలాజరుగుతుంది.! పద భైర వన్నయ్యా! నేనూ వస్తాను పద, నువ్వు వంటరిగా యెంతపననిచేస్తావు?" అని గోవిందగంగూళి యెవరి అనుమతి అపేక్షించకుండా సుద్దులకుప్ప దగ్గరకెళ్ళి కూచున్నాడు. రమేశు లోపలికి వెళదామనుకుంటున్నాడు. ఇంతలో ధర్మదాసు అతన్ని పిల్చి, ఒకప్రక్కకు తీసుకునివెళ్ళి ఏవో గుస గుస చెవిలో చెప్పాడు, అందుకు సమాధానంగా తలూపి రమేశు లోప లికి వెళ్ళిపోయాడు. యీ సంగతి గోవింద గంగూళి క్రీగంట చూశాడు.

యింతలో మీసాలులేని ఓ ముసలి బ్రాహ్మణుడు —"ఏడీ! మా బాబు యెక్కడ?" అంటూ లోపలికి వచ్చాడు.

ఈ బ్రాహ్మణుని వెంట యిద్దరు ముగ్గురు పిల్లలువున్నారు. అందరికంటే ఆడపిల్ల పెద్దది. ఆమె శరీరంమీద పాతదోవతియాల ఫోవతి వుంది. మిగిలిన యిద్దరిపిల్లలకు గోచీలు తప్ప మిగిలిన శరీరమంతా దిగంబరంగానేవుంది. అక్కడున్నవాళ్ళంతా తలెత్తి చూశారు. గోవింద గంగూళి ఆయన్ని ఆహ్వానిస్తూ అన్నాడు.."రా దీనూఅన్నయ్యా! రాచో! మీ చరణ ధూళి మాయింట్లోపడడం మా భాగ్యం. పాపం రమేశు చాలా గాబరా పడుతున్నాడు. అందువల్ల మీరంతా.... .... ..."

ధర్మదాసు గోవిందునివేపు తీక్షణంగా చూశాడు. కాని గోవిందు ఆ చూపుల్ని లక్ష్యపెట్టకండానే దీనూతో అన్నాడు- 'అయినా మీరంతా యిటువేపే రాలేదు' అంటూనే అతనిచేతికి హుక్కాయిచ్చాడు. దీనూ భట్టాచారి, తన స్థానంలో కూచుని, నిప్పులేని హుక్కాను వ్యర్థంగా రెండుదమ్ములులాగి-"నే నిక్కడలేను తమ్ముడూ! కోడలిని తీసుకునిరావడానికి వెళ్లాను. యింతకూ రమేశు ఎక్కడ?చాలా పెద్దఏర్పాట్లు చేస్తున్నారని విన్నానే! దారిలో అవూళ్లో విన్నాను. భోజనాలయాక, చిన్నవాళ్ళకూ, పెద్దవాళ్ళకూ లడ్లూ, మాల్పూరీలు పంచిపెడతారటగా?"

గోవిందుడు కొంచం నిదానంగా— "అంతేకాదు. ఒక్కొక్కరికి ఒక్కొక్క ధోవతికూడా దొరుకుతుంది. అడుగో....యితనే రమేశ్, దీనూ అన్నయ్యా కదేచెపుతున్నాను. ఏదో మీబోటి పెద్దల ఆశీర్వాదబలం వల్ల అన్నీ చేసుకుని వస్తున్నాము. కాని, వేణీ మావెంటబడ్డాడు. ఆయన నన్ను పిలవడానికప్పుడే రెండుసార్లు మనిషిని పంపాడు. సరే నాసంగతటుంచండి; నాకూ— రమేశుకూ రక్తసంబంధముంది, కాని, ఈ దీనూ అన్నయ్యా, ధర్మన్నయ్యా వీళ్ళు నిన్నూరికే వదిలిపెట్టరు బాబూ; దీనూ అన్నయ్య దారిలోనే యీ సంగతివిని పరుగెత్తుకుంటూ వచ్చాడు. ఆరే ఓ షష్టీచరణ్: కొంచం పొగాకు తీసుకునిరారా; నాయనా రమేశ్; ఒక్కసారి యిటురా. ఒకసంగతి చెపుతాను" అని అన్నాడు.

రమేశుని ఒకప్రక్కకు తీసుకువెళ్ళి నెమ్మదిగా చెప్పాడు— "ఆయితే ధర్మదాసు భార్య లోపలవుందా? జాగ్రత్త రమేశ్; అటువంటి పనిమాత్రం చేయవద్దు. అతనెంతచెప్పినా—సామాను గదిభారం మాత్రం యిచ్చేవు? ధర్మదాసుభార్య ఎటువంటిదనుకున్నావు? ఆమె నెయ్యీ, పిండీ, నూనే, వుప్పూ — అన్నీ సగంసగం యింటికి చేరవేస్తుంది. నువ్వేమీ విచారపడవద్దు. నేను వెళ్ళి మీ వదినెను పంపుతాను. అదివచ్చి నీ సామాను గదిభారం వహించిందంటే ఓ పూచికపుల్లకూడా పోదు."

రమేశ్ తలూపి— 'మీ ఆజ్ఞ- అలాగే కానివ్వండి' అని మెదలకుండా వూరుకున్నాడు. అయినా అతని ఆశ్చర్యానికి అంతంలేదు. ధర్మదాసు సామానుగది బరువు మోయడానికి తనభార్యను పంపుతానని ఎంతో రహస్యంగా చెప్పాడు. ధర్మదాసు యిలా చెప్పాడని, గోవింద్ ఎలా గ్రహించగలిగాడు ?

దినమొలతోవున్న యిద్దరుపిల్లలూ, పరుగెత్తుకుని వచ్చి దీనూ భట్టాచారి భుజాలు కరుచుకుని— 'మిఠాయి కావాలి' అని గోల చేస్తున్నారు.

దీనూ ఒకసారి రమేశ్ ముఖంలోకి యింకొకసారి గోవిందుని ముఖంవేపుచూసి— 'అరే; మిఠాయి నేనెక్కడనుంచి తీసుకునిరాను?' అని అన్నాడు.

'అదిగో అక్కడ చేస్తున్నారుగా?' అని పిల్లలు అటు చూపించారు.

ఇంకా అక్కడవున్న నలుగురైదుగురు పిల్లలు యేడుస్తూ అక్కడికి వచ్చి— 'మాకుకూడా కావాలిబాబా' అని దీనూ భట్టాచారిని చుట్టేశారు.

రమేషు గాబరాపడుతూ ముందుకువచ్చి— "సరేలే — సరేలే! ఆచార్యులుగారూ! వీళ్ళంతా పగలు మూడో జామున యింటినుంచి బయలుదేరారుకాబోలు. అన్నాలు తినివచ్చారోలేదో—అరేయ్? నీపేరేమిటి....? ఆ పళ్ళెం యిటుపట్టుకునిరా" అని పిల్చాడు.

వంటమనిషి పళ్ళెం తీసుకునిరాగానే పిల్లలంతా విరుచుకుపడ్డారు. పంచే అవకాశంయివ్వలేదు. ఆ పిల్లలంతా మిఠాయి తింటూవుంటడం చూసి, దీనూచుక్కదృష్టి కూడా సజలమైంది — "ఓమునియా! తింటే తింటున్నావు.కాని రుచి యెలావుందో చెప్పు." అన్నాడు.

'బాగావుంది' అంటూ మునియ తింటూంది. దీను నవ్వి తలుపుతూ- "మీకూ రుచి తెలుసూ! తియ్యగావుంటేసరి. ఆ....ఏమోయ్! ఆ కళాయి ఎందుకు దించావు? ఏం గోవిందన్నయ్యా! యింకా కొంచెం ప్రొద్దున్నట్లుందే" అని అన్నాడు.

వంటవాడు ఎటువేపు చూడకుండా అనేశాడు— "ఎందుకులేమ. యింకాచాలా వ్యవధివుంది. యిప్పుడుకూడా సాయంత్రపు—పూజ.... ...."

"సరే ఏదీ ఒకటి మా గోవిందన్నయ్యకుకూడా యివ్వు! మీ కలకత్తా బ్రాహ్మణులవంట ఎలావుంటుందో రుచి చూస్తాడు. వద్దు.... వద్దు....నా కెందుకు....? సరే సగం యివ్వు. సగంకంటే ఎక్కువ యివ్వవద్దు. అరే ఓ షష్టీచరణ్! కొంచెం నీళ్ళు తీసుకురా —కాళ్ళూ — చేతులు కడుక్కోవాలి."

యింతలో రమేశ్ —"షష్టీచరణ్! లోపల్నుంచి యింకా నాలుగు పళ్లాలు పట్టుకురా" అని పురమాయించాడు.

యజమాని అజ్ఞ అవగానే లోపల్నుంచి మూడు నాలుగు పళ్లాలు వచ్చినయ్! వాటితోపాటు మంచినీళ్ళ గ్లాసులు. చూస్తూ- చూస్తుంతగానే, ఆ మూడు పెద్దపళ్లాల్లోని మిఠాయి అంతా ఆ ముగ్గురు మలేరియా బ్రాహ్మణులు మధ్యాహ్నపు ఫలహారం క్రింద మాడ్చేశారు. దీననాధుడు తలెత్తి అన్నాడు— "వీళ్ళే కలకత్తా వంటవాళ్ళంటే. ఏమంటావు గోవింద్? ఏమంటావు ధర్మదాస్."

ధర్మదాసు ముందున్న పళ్ళెం యింకా ఖాళీ కాలేదు. అందుచేత నోట్లో మిఠాయివుండ వున్నందువల్ల, అతని గొంతులోంచి మాట పెగల లేదు. కానీ, ఈ విషయంలో అతనికేమీ అభిప్రాయభేదం లేనట్లుగానే తోచింది.

"అవును. వస్తాదు చెయ్యే—" అంటూ గోవిందు చెయ్యి కడుక్కొనేందుకు వుపక్రమించాడు. కానీ వంటవాడు వినయంగా— "పండితులు గారూ! యింకా పిండివంట లున్నయ్! వాటినికూడా రుచిచూడండి" అని అడిగాడు.

"ఏదీ? పట్టుకునిరా—"

మిగిలిన పిండివంటలుకూడా వచ్చినయి! యింత మిఠాయి తిన్నాక కూడా—యీ కొత్త మిఠాయిని వారు సద్వినియోగం చేస్తుండడం రమేశు మెదలకుండా చూస్తున్నాడు. దీను తన ఆడపిల్లవేపు చూసి చేయిచాపి— "ఓ మునియా! యిదిగో యీ రెండులడ్లు తీసుకో" అన్నాడు.

"యిక నేను తినలేను నాన్నా"

"అరే యెందుకు తినలేవు? తినగలవు. కొంచెం నీళ్ల త్రాగి గొంతు తడిచేసుకో! ముఖం మొత్తినట్లుంది. అయినా తినలేకుంటే పవిట చెంగున మూటకట్టుకో! ప్రొద్దున్నే తిందువుగానీ! ఆ....బాగా తినిపించావు. వస్తువులన్నీ అమృతంలా వున్నయ్! మహా గొప్పగా చేశారు. అయితే ఈ రెండు రకాలే చేశారా"

రమేశు జవాబు చెప్పనవసరం లేకపోయింది. వంటవాడు ఉత్సాహంగా— 'క్షీరమోహన్—రసగుల్లా!'

దీననాథుడు విస్మయంగా రమేశుని ముఖంవేపు చూచి అన్నాడు— "క్షీరమోహన్ కూడా చేశారా? ఎక్కడ ఏదీ?అది యింతవరకూ తీసుకుని రాలేదేం? క్షీరమోహన్ రాధానగరంలో బోసుబాబుగారింట్లో తిన్నాను. యిప్పటికింకా నోట్లో వున్నట్లేవుంది. నేను అంటే నమ్ముతావోలేదో గానీ, క్షీరమోహన్ అంటే నాకెంతో యిష్టం."

రమేశు నవ్వి తలూపాడు. ఆమాట నమ్మడం కష్టమనిపించలేదు. యింతలో రాఖాలుడు ఏదో పనిమీద బయటికి వెళుతున్నాడు. రమేశు

అతన్ని పిల్చి— "బహుశా లోపల భైరవాచారి వున్నాడేమో! కొంచెం శ్రీసమోహన్ తీసుకురమ్మని అతనికి చెప్పు" అని చెప్పాడు.

చీకటి పడుతుంది. అయినప్పటికి బ్రాహ్మణులు శ్రీరమోహన్ కోసం అలాగే చూచుని వున్నారు. కొంచెంసేపయాక రాఖాలు తిరిగివచ్చి- "యిక యివాళ సామాను గదితలుపు తెరవవట"అని చెప్పాడు.

మనసులోనే కొంచెం కోపం చెందాడు రమేశ్ — "నేను చెప్పినట్లుగా చెప్పు."

గోవిందగంగూలీ రమేశుని కోపంచూసి, కళ్లు తిప్పుతూ చెప్పాడు— "దీనూ అన్నయ్యా! భైరవాచారి బుద్ధిచూశావా? తల్లి కంటే పినతల్లికి నొప్పి ఎక్కువ అని అంటారు. అందుకే నే ననేది...."

కాని, ఆయనమాట వినకుండానే రాఖాలుచెప్పాడు— "భైరవాచారి ఏంచేస్తాడు. ఆ యింటినుంచి అమ్మగారు వచ్చి సామాను గదికి తాళం వేశారు."

ధర్మదాసూ, గోవిందగంగూలీ యిద్దరూ ఉలిక్కిపడి, ఒకేసారి అడిగారు — "ఎవరూ? అమ్మగా రెవరు?"

రమేశు చకితుడై అడిగాడు— "అయితే పెద్దమ్మ వచ్చిందా?"

"అవునండి. ఆమె వచ్చీరాగానే, చిన్నగదికీ, పెద్దగదికీ రెంటికీ తాళాలు వేసింది."

ఆశ్చర్యానందాలతో రమేశుని నోటినుంచి మాట రాలేదు. ఆయన లేచి గబగబా లోపలికి వెళ్ళాడు.

# 3

"పెద్దమ్మా"

మాట వినగానే, విశ్వేశ్వరి సామాను గదిలోంచి బయటకు వచ్చింది. వేణీ వయసునుబట్టి చూస్తే, అతని తల్లి వయసు యాభై సంవత్సరాలకు తక్కువ వుండదు. కానీ చూపులకు మాత్రం నలభై సంవత్సరాలకంటే ఎక్కువ వుండదని అనుకుంటారు. రమేశు అదే పనిగా ఆమెను చూస్తున్నాడు. ఇప్పటికీ, అదే మేలిమిబంగారు వర్ణం-

ఒకప్పుడు ఆమె సౌందర్యం యిరుగుపొరుగున ప్రసిద్ధిగా చెప్పుకున్నారు. అటువంటి ఆమె అనింద్య సౌందర్యం యీనాటికి కూడా ఆ పుష్టి శరీరాన్నుంచి తొలగిపోలేదు. ఆమె తలవెంట్రుకలు కత్తిరించినట్లు ముఖంమీద పడుతున్నాయి! పెదవులూ, చెక్కిళ్ళూ, లలాటమూ, అధరాలూ, అన్నీ ఎవరో మహాశిల్పి ఎంతో నిపుణంగా మహాప్రయత్నంతో చేసినట్లుంది. అన్నిటికంటే, ఆశ్చర్యకరమైనవి ఆమెకళ్లు. కొంచెంసేపు ఆమె కళ్ళకేసి చూస్తేచాలు, సమ్మోహితులవుతారు.

ఈ పెద్దమ్మ ఒకప్పుడు రమేశుని, అతని పరలోక వాసియైన తల్లినీ, ఎంతో ప్రేమిస్తూండేది. వివాహమయాక యీ తోడికోడళ్ళిద్దరికీ కొంతకాలం సంతానంలేదు. అప్పుడు అత్తా—ఆడబిడ్డల బాధలకు భయపడి, యిద్దరూ చాటుగా ఒకచోట కూచుని కన్నీళ్ళు పెట్టుకునేవాళ్ళు. అప్పుడే వీళ్ళిద్దరి స్నేహసూత్రం మొట్టమొదటసారిగా ముడిపడింది. ఆ తరువాత రెండు సంసారాలు వేరుపడడం, కోర్టులకెక్కడం, మొదలైన తుచ్ఛ విషయాలు యెన్నో యీ సంసారాల మీదుగా జరిగి పోయినయ్! ఈ పోట్లాటలవల్ల వాళ్ళ స్నేహబంధనం శిథిలమైంది. కాని ఒక్కసారే విచ్ఛిన్నం కాలేదు. చాలాకాలం తరువాత ఆ చిన్నకోడలి సామాను గదిలోకివెళ్ళి, ఒకప్పుడు తన చేతిమీదుగా సర్దిన, సామాను చూచేసరికి, పెద్దమ్మ కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగినయ్! రమేశు పిలవగానే ఆమె కళ్లు తుడుచుకుని, బయటికి వచ్చింది. అయినా ఆమె ఎర్రని నేత్రాలూ, కన్నీటిఛాయలుగల ఆర్ద్ర కనురెప్పలు చూసి, రమేశు కొంచెంసేపు విస్మితుడయ్యాడు. పెదతల్లికూడా రమేశుని విస్మయం కనిపెట్టింది. అందుకే పిత్రువిహీనుడైన రమేశుని చూచేసరికి ఆమె హృదయమంతా హాహాకారాలతో నిండిపోయింది. కాని ఆమె దాన్ని బయటకు పొక్కనీయలేదు. పైగా నవ్వుతూ— "నన్ను గుర్తించావా రమేశ్?" అని అడిగింది.

అందుకు ప్రత్యుత్తరంగా రమేశుని పెదిమలు కంపించినయ్! తల్లి చనిపోయాక, తను మామగారింటికి వెళ్ళకముందు, ఈ పెద్దమ్మ తనను పెంచింది. అసలు మేనమామగారింటికి పంపడంకూడా విరోధించింది. యీ సంగతి యిప్పటికీ తనకు గుర్తుంది.దానితోపాటు చిన్న తను

పెద్దమ్మగారింటికివెళ్ళి వాకబుచేసి నప్పుడు ఆమె యింట్లోలేదనిచెప్పారు. ఆమెను కలుసుకోలేక పోయాడు తరువాత రమేశు యింటికి వెళ్లాడు. అక్కడ వేణీ కనుపించాడు. వేణీ ఎదటనే రమ చిన్నమ్మ తనను తిరస్కరించటం, అతను వెళ్ళాకకూడా అవమానించడం జరిగింది. ఈ సంగతు లన్నింటిని చూసి ఈ గ్రామములో 'నా' అనేవాళ్లు లేరనే నిశ్చయానికి వచ్చాడు తను.

రమేశు ముఖంలోకి కొంచంసేపు చూశాక విశ్వేశ్వరి అన్నది—"కాదునాయనా! యిటువంటి సమయంలో కొంచం ధైర్యంగా వుండాలి."

కాని ఆమె కంఠంలో మృదుత్వమనేది ఎక్కడా కనిపించలేదు. రమేశు తన్నుతాను సంబాళించుకున్నాడు. అభిమానానికి, విలువకానిచోట అభిమానం ప్రకటించడ మంత అజ్ఞానం ప్రపంచంలో యింకొకటి లేదని గ్రహించాడు— "నేను ధైర్యంగానే వున్నాను పెద్దమ్మా! అందుకనే నాకు చాతనైంది చేస్తున్నాను. అటువంటప్పుడు నువ్వెందుకు పిలిచావు—?"

పెద్దమ్మ నవ్వి అన్నది. "నీవు అడిగిన ప్రశ్నకు జవాబు చెప్పేందుకు నువ్వు నన్ను పిలుచుకుని రాలేదు, రమేశ్! సరే ఇటు విను! యిక్కడ కర్మకాండంతా పూర్తికానిదే, సామాను గదిలోంచి ఒక్క వస్తువుకూడా బయటికి రానివ్వను. నేను యింటికి వెళ్ళేటప్పుడు తాళాలు నీకు యిచ్చి వెడతాను, రేపువచ్చి మళ్ళీ తీసుకుంటాను. చూడు, తాళాలు మాత్రం యెవరికీ యివ్వవద్దు. సరేగాని నిన్న మీ పెద్దన్నయ్యను కలుసుకున్నావా!"

ఈ ప్రశ్న విని రమేశు యిరకున పడ్డాడు. తన కొడుకు వ్యవహారం ఆమెకు తెలుసునా—లేదా—అనే సంగతి కూడా తెలుసుకోలేక పోయాడు. ఆయన కొంచెం ఆలోచించి-- "అప్పుడు పెద్దన్నయ్య యింట్లోలేడు!" అని చెప్పాడు.

అసలు ప్రశ్న అడిగినప్పుడే, పెద్దమ్మ ముఖంలో ఉద్వేగఛాయలు కనుపించినయి! తను చెప్పిన జవాబువల్ల పెద్దమ్మ ముఖంలోని భావం మారిపోవడం గమనించాడు. ఆ ముఖం ప్రసన్నమైంది. ఆమె నవ్వుతూ స్నేహపూర్వకంగా అన్నది— "అయ్యో! అదృష్టమా! సరే నాయనా!

ఒకసారి కలవలేదు. మరి రెండోసారి వెళ్ళవద్దూ? మీ రంటే వాడికి, సరిపడని సంగతి నాకు తెలుసు. కాని ఈ పని నువ్వు చేయాలిరా? వెళ్లు, యింకొకసారి వెళ్ళి వాడికి నచ్చచెప్పు. వాడు నీ కంటే పెద్దవాడు. వాడి ముందు తలవంచవలసి వచ్చినా సిగ్గుపడవలసినపనిలేదు. అంతేగాదు. నాయనా! ఇది యెంత దుఃఖసమయం! ఎవరి దగ్గరికి వెళ్ళి కాళ్లా చేతులు పట్టుకుని తీసుకురావలసినా — సిగ్గుపడవలసిన సమయంకాదిది. మా తండ్రివి కాదూ! యింకొకసారి వెళ్ళిరా! యిప్పుడు వాడు యింట్లోనే వుండవచ్చు."

రమేశు మాట్లాడలేదు. ఆమె యింత యిదిగా బలవంతం ఎందుకని చేస్తుందో ఆ సంగతి అర్థంకాలేదు. మనసులోని సందేహం దూరమవలేదు. విశ్వేశ్వరి యింకా కొంచం ముందుకువచ్చి— "ఆ బయట కూచున్న వాళ్ళందర్నీ, నీ కంటే నేను బాగా యెరిగి వున్నాను. నువ్వు వాళ్ళ మాటలు వినవద్దు. వెళ్లు. నీ పెద్దన్నయ్య వద్దకు ఒకసారి నాతో పాటురా"— అన్నది.

"కాదులే పెద్దమ్మా! అలా జరగదులే! ఆ బయట వున్నవాళ్ళు యెటువంటివాళ్లైనా-యీ సమయంలో-వాళ్లేనాకందరికన్నా ఆత్మీయులు-"

అతనింకా ఏమో చెప్పబోతున్నాడు. కాని. పెద్దమ్మముఖం చూసి ఆశ్చర్యపడుతూ మెదలకుండా వూరుకున్నాడు. ఆమె ముఖం అప్పుడే నాలుగువేపులా వ్యాపిస్తున్న సంజచీకటికన్నా నల్లబడిపోయింది. కొంచం సేపయాక పెద్దమ్మ చల్లగా నిట్టూర్చి అంది- "సరే అలాగేలే! నువ్వు వాడి దగ్గరకు వెళ్ళడానికే వీలులేనప్పుడు వాడి విషయం నీతో చెప్పడం వల్ల లాభంలేదు. అయినప్పటికీ నాయనా! నువ్వేమీ దిగులు పెట్టుకోవద్దు. నీ పనులేమీ ఆగవు. నేను రేపుదయమే వస్తాను."అని విశ్వేశ్వరి తన దాసీనే పిలిచి, దానితోపాటు వెనకవేపున్న తలుపుగుండా బయటికి వెళ్ళిపోయింది.

ఈమధ్యలో రమేశు— వేణీని కలుసుకున్నాడనీ, యిద్దరికీ ఏదో జరిగి వుంటుందనీ వూహించింది. ఆమె ఏదారంట వెళ్ళిందో- కొంచెం సేపటివరకూ రమేశు ఆదారివేపు చూస్తూ నిలుచున్నాడు. ఆ తరువాత,

ఉదాసీనముఖంతో బయటికి రాగానే, గోవిందగంగూలీ [illegible]
అడిగాడు-" ఏం నాయనా! పెద్దమ్మగారు వచ్చిందా?"

తలూపుతూ రమేశు—'అవును' అన్నాడు.

"ఆమె సామాను గదికి తాళంవేసి, తాళాలు వెంటతీసుకుని
వెళ్ళిందని విన్నాను—"

అందుకు కూడా ఆయన తలూపుతూనే సమాధానం చెప్పాడు.
ఆమె వెళ్ళిపోయే ముందు ఏమాలోచించిందో - ఏమో - తాళాలు కూడా
తీసుకుని వెళ్ళింది. గోవిందుడు అన్నాడు—'చూశావా ధర్మదాసన్నయ్యా!
నే నన్నట్లే జరిగింది. ఏం రమేశ్. యిప్పటికైనా గ్రహించావా?'

యిప్పటివరకూ రమేశు మనసులోనే కోపంగా వున్నాడు. కాని
తన నిరుపాయస్థితి తలుచుకుని మెదలకుండా వున్నాడు. [illegible]
దీనూ భట్టాచారి యింకా వెళ్ళలేదు. అతనికి [illegible]. [illegible]
సహా ఎవరి అనుగ్రహంవల్ల కడుపునిండా తింటాయిత్తిన్నాడో - వారిని
ఆశీర్వదించకుండా - వారి ఏడుతరాలవారిని స్తుతించకుండా [illegible]
పోయాడు. ఆ బ్రాహ్మణుడు నిరీహభావంతో —'[illegible]
తెలుసుకోవడ మేమంత కష్టం బాబూ! తాళాలువేసి, [illegible] వెంట
తీసుకునివెళ్ళిందంటే, యిక ఆ సామానుగదిలో ఎవరి[illegible]
దన్నమాట. ఆమెకు అంతా తెలుసు!' అని చెప్పాడు.

గోవిందు విసుక్కుంటూ కోపంతో అన్నాడు—'నీకు సంగతి
సందర్భాలు తెలియవు. అటువంటప్పుడు మధ్య మాట్లాడాలని [illegible]
కెందుకని వస్తావు? నీ కీ సంగతులన్నీ యేం తెలుసని అర్థాలు
తీయొచ్చావు'

ఈ కోపం చూడగానే, దీనూ తెలివితక్కువతనం యింకా ఎక్కు
వైంది. అతనుకూడా కోపంగానే అన్నాడు—'అరే! [illegible] తెలుసు
కునే దేముంది? సామానుగదికి తాళంవేసి, తాళాలు [illegible] వెళ్ళిందని
విన్నాంగా? దీన్నేమంటా రేం?'

గోవిందు మండిపడి—'అరే భట్టాచారీ! [illegible]
ఏ పనికోసం వచ్చావో - [illegible]
యింటిల్లాదులూ తిన్నారు. మాటలు కట్టుకున్నావు? వెళ్ళు! [illegible]

ఎల్లుండి తిందువుగాని, యిక యివాల్టికి ఏమీలేదు. యిక వెళ్లు. మాకూ చాలా పనులున్నయ్" అని అన్నాడు.

దీను చాలా సిగ్గుపడ్డాడు. రమేశు కూడా సిగ్గుపడ్డాడు. కానీ కోపం కూడా వచ్చింది.

గోవిందు యింకా ఏమో అనాలని ప్రయత్నిస్తున్నాడు. యింతలో రమేశుని కఠినమైన కంఠం విని ఆగిపోయాడు—"గంగూళిగారూ ! ప్రతివాళ్ళనూ యిలాగే అంటారేం మీరు?"

గోవిందు ముందు విస్మయం పొందాడు. ఆ వెంటనే ఆయన శుష్కంగా నవ్వి—"నే నెవరిని అవమానించాను నాయనా? నేను అన్నది నిజమో-కాదో అతన్నే అడుగు. చూశావా ధర్మన్నయ్యా - యీ దీను సాహసం !"

ధర్మదాసు యేం చూశాడో కానీ, రమేశు మాత్రం, యీ మనిషి, నిర్లజ్జా, దుష్టత్వంచూసి నిశ్చేష్టుడయ్యాడు. ఆ సమయాన దీనూ భట్టాచారి రమేశువేపు చూసి అన్నాడు—"కాదు నాయనా ! గోవిందుడు అన్నది నిజమే! నేను చాలా బీదవాడినని అందరికి తెలుసు. పిళ్ళలా నా వద్ద భూమీ-పొలమూలేదు. ఏదోవిధంగా - ఆయవారాలతో - అడుక్కుంటూ వుంటాను. నా పిల్లలకు మిఠాయి కొనిపెట్టుకోగల స్థితి భగవంతుడు నాకివ్వలేదు. అందువల్ల గొప్పగొప్పవారిళ్ళలో, ఏదేని పెద్దకార్యకలాపాలు జరుగుతున్నప్పుడు పిళ్ళను కూడా తీసుకునివచ్చి తినిపించి బ్రతికిస్తున్నాను. నాయనా ! నువ్వేమీ అనుకోవద్దు. తారిణీ అన్నయ్య బ్రతికి వున్నప్పుడు మా తిండి చూసి ఎంతో సంతోషించేవాడు. అందువల్ల నాయనా , అయినా మేము మనసార తృప్తిగా తిన్నాం. ఈ సంగతి పైనుంచి చూస్తున్న తారిణి అన్నయ్య ఎంతో సంతోషిస్తున్నాడని చెప్పగలను."

ఈ మాటలు అంటుంటే, హఠాత్తుగా శుష్కించిన దీనూ కళ్ళలో నీళ్లు కనుపించినయ్. అక్కడున్నవారందరూ చూస్తుండగనే నాలుగైదు కన్నీటి చుక్కలు టపటపలాడుతూ క్రిందపడినయ్! అనేకచోట్ల చినుగులతో మాసిపున్న కండువాతో దీను, ఆకన్నీళ్లు తుడుచుకుని --"నాయనా! యిక్కడున్న వాదోటి బీదవాళ్ళంతా భ ీదీఅన్నయ్యవద్ద చేయిచాపి,

వ్యర్థంగా వెళ్ళలేదు. ఈ సంగతులన్నీ ఎవరెరుగుదురు-బాబూ! ఆయన కుడిచేత్తో చేస్తున్నదానం, ఎడమచేతికి తెలవదు. యిక మిమ్మల్ని వేధించను నాయనా! అయితే అమ్మా మునియా- రే నాయనా హరిధన్-పదండి. యింటికి పదండి-యిక రేపుదయం వద్దాం. నాయనా రమేష్! నేనేమి చెప్పను. కానీ మీతండ్రిలాంటి గుణాలు అలవర్చుకుని చిరకాలం వర్ధిల్లు!" అని బయలు దేరాడు.

ఆయనతో రమేశు కొంతదూరం వచ్చి ఆర్ద్రమైన కంఠంతో- "భట్టాచార్యులుగారూ! ఈరెండుమూడు రోజులు మామీద దయవుంచండి. మీతో చెప్పడానికే నాకు సంకోచంగా వుంది. ఒకవేళనాయింట్లో హరిధన్ తల్లిగారి పాదధూళి పడినట్లయితే, నేనెంతో భాగ్యవంతుణ్నని అనుకుంటాను-" అన్నాడు.

దీనూ భట్టాచారి, రమేశుని రెండుచేతులు పట్టుకుని బాదపడుతూ అన్నాడు-"నాయనా! నేను చాలా బీదవాణ్ణి! నువ్విలా అంటే సిగ్గుతో చచ్చిపోతాను."

తనపిల్లా—పీచుతో వృద్ధబ్రాహ్మణుడు వెళ్ళిపోయాడు. రమేశ్ తిరిగివచ్చాడు. గంగూళిని ఒకటిరెండు కఠినమాటలన్నాడు. రమేశు ఆ సంగతి గుర్తుకుతెచ్చుకుని ఏదో అందామని నోరువిప్పేసరికి గోవిందుడు ఉద్దీపితుడై — "నాయనా రమేశ్! యిది మా స్వంతపనిలాంటిది. నువ్వు ఒకవేళ పిలవకున్నా —మేమువచ్చి, పనంతా చేయాల్సివుంది. అందుకే నేను వచ్చాను. ధర్మదాసూ — నేనూ అన్నదమ్ములము. నీ పిలుపుకోసం ఎదురుచూస్తూ కూచోలేము" అని చెప్పాడు.

ఇప్పుడిప్పుడే హుంకా-త్రాగి ధర్మదాసు దగ్గుతున్నాడు. ఆయన తన చేతికర్ర సాహాయ్యంతో నిలుచుని, దగ్గును ఆపుకుందామని ప్రయత్నంచేస్తూ— ముఖం—కళ్లూ కందగడ్డలా చేసుకుని, చేతులు తిప్పుతూ— "నాయనా రమేశ్!విను! నేను వేణీఘోషాల్ ను కాను. మేము అసలైన పుట్టుక కలవాళ్ళం" అని అన్నాడు.

ధర్మదాసన్న యీ కుత్సితమాటలకు రమేశు త్రుళ్ళిపడ్డాడు. కాని కోపంచేయలేదు. శిక్షణలేనికారణాన, అభ్యాసదోషంవల్ల వీళ్ల సంకోచం

లేకుండా "ఎంత అసహ్యంగా మాట్లాడుతున్నదీ వాళ్ళకే గ్రహింపులేదని ఈ కొద్ది వయసులోనే రమేశు గ్రహించాడు.

పెద్దమ్మ ప్రేమపూర్వకంగా బ్రతిమిలాడడమూ— బాధపడుతున్న ఆమెముఖం స్ఫురణకు వచ్చేసరికి బాధపడ్డాడు. అందరూ వెళ్ళిపోయాక పెద్దన్న దగ్గరకు వెళ్ళేందుకు తయారయాడు. వేణీగారి చండీమండపం దగ్గరకు వెళ్లేసరికి సరిగ్గా రాత్రి ఎనిమిదిగంటలైంది. లోపల ఏదో పోట్లాట జరుగుతున్నట్లుంది. గోవిందగంగూళీ అరుపులు—బొబ్బలు ఎక్కువగా వినిపిస్తున్నాయి! బయటకు వినిపించేటట్టు పందెంవడ్డీ అంటున్నాడు —వేణీబాబూ! అతను నాల్గురోజుల్లో, వున్నదంతా నష్టపడకుంటే నన్ను గోవిందగంగూళీ అని పిలవవద్దు. అతని నవాబుదర్జా విన్నావుగా? తారిణీఘోషాల్ డబ్బుయేమీ నిలవచేయకుండానే చనిపోయాడు. అటువంటప్పుడు యింత గొప్ప ఏర్పాట్లు దేనికి? చేతిలో డబ్బువుంటే చేయవచ్చు. అది లేనప్పుడు ఆస్తి తాకట్టుపెట్టి, తన తండ్రి శ్రాద్ధం చేయగా, నేను ఎవరినీ చూడలేదు. వేణీబాబూ! యితను నందివద్ద మూడువేలు అప్పుగా పుచ్చుకున్నాడని విన్నాను."

వేణీ ఉత్సాహంగా అన్నాడు—"అయితే గోవింద్ — దీనిలోని నిజం అంతులాగాల్సిందే."

గోవిందు కంఠాన్ని తగ్గించి—"కొంచం ఓపికపట్టు నాయనా, నన్ను అక్కడికికూడా వెళ్ళనీయ్....ఆ తరువాత........ఎవరా బయటవున్నది? ఎవరూ? రమేశ్? నాయనా—మేమంతా వుండగా యింతరాత్రప్పుడు నువ్వు రావాల్సిన అవసరం ఏముంది బాబూ?" అని అన్నాడు.

రమేశు అందుకు జవాబు చెప్పకుండానే, కొంచెం ముందుకు వెళ్ళి— "పెద్దన్నయ్యా! నేను మీకోసమే వచ్చాను." అని చెప్పాడు.

వేణీ తొట్రుపడుతూ—సమాధానం చెప్పలేకపోయాడు. అయినా గోవింద్ వెంటనే అందుకుని అన్నాడు—"మీరు రాకపోతే యెల్లా బాబూ? వందసార్లయినా రావాలి. యిదికూడా మీ యిల్లేగా! పైగా పెద్దన్నయ్య తండ్రితో సమానం. అందుకే నేనూ వచ్చాను. తారిణీ బాబుతోవున్న పోట్లాటలన్నీ ఆయనతోనే అంతమైనయ్! యిప్పుడు

యిక పోట్లాట లెందుకు ? మీ పన్నదమ్ములు ఇద్దరూ ఏకమైనప్పుడు చూచి మేమంతా కళ్లుపల్ల పరుచుకుంటాము. ఏమంటావు హాల్దార్ మామా? కాని, నువ్వింకా నిలుచునే వున్నావేం నాయనా?అరే ఎవర్రా అక్కడ?ఒక పీటతెచ్చి వేయండి ; కాదు వేణీబాబూ ; నువ్వు పెద్దవాడివి. అంతా మీరే చేయాలి ; నువ్విలా వేరుగావుంతడం దానుండలేము. అయినా అమ్మగారు అక్కడికి వెళ్ళినప్పుడు.... నీకు.... ..."

వేణీ త్రుళ్ళిపడి అన్నాడు —"అమ్మగారు వెళ్ళిందా ?"

ఈ త్రుళ్ళిపడడం గోవింద్ చూచి మనసులోనే సంతోషించాడు. కాని, ఆయన ఆ భావం వ్యక్తమవకుండా, ఎంతో పెద్దమనిషిలా, ఆ సంగతి యింకా పెద్దదిగాచేసి అన్నాడు — "వూరికే వెళ్ళడమేకాదు. సామానుగది బరువంతా తీసుకుని, పనిచేయిస్తూంది. అవును మరి—ఆమె చేయించకుంటే యింకెవరు చేయిస్తారు?"

అందరూ మెదలకుండా వున్నారు. గోవింద్ ఒక నిట్టూర్పు విడిచి అన్నాడు— "ఈ వూళ్ళో పెద్దమ్మగారిలాంటి మనిషి యెవరన్నా వున్నారా? యిక వుండబోతారా? కాదు వేణీబాబూ! ముఖంమెదట అంటే ముఖప్రీతి అని అనుకుంటారు. అయినా ఎవరేమనుకున్నా—ఈ గ్రామములో లక్ష్మి వున్నదంటే ఆమె మీ అమ్మగారే ! అటువంటి అమ్మ అందరికీ దొరుకుతుందా?"

అంతవరకు అని, ఒకసారి పెద్దగా నిట్టూర్చి గంభీరమైయాడు. వేణీ కొంచెంసేపు మెదలకుండా వుండి —'సరే' అన్నాడు.

గోవింద్ వెంటనే అందుకుని — "వూరికే, 'సరే' అన్నంత మాత్రానకాదు వేణీబాబూ! మీ ఎక్కడికి వచ్చి, పనులన్నీ చేయించాలి. ఈ బరువంతా మీ మీదనె వుంది. సరే; యిప్పుడు మీ రంతా యిక్కడే వున్నారు. ఎవరెవరిని పిలవాలో — అక్కర్లేదో ఒక పట్టీ తయారు చేయించకూడదూ? ఏమంటావు రమేశ్? బాగుందికదూ హాల్దార్ మామా! మీరు వూరుకున్నారేం ధర్మదా సన్నయ్యా? ఎవరిని పిలవాలో? ఎవరిని పిలవగూడదో? మీకు బాగా తెలుసు ;" అన్నాడు.

రమేశు లేచి నిలుచుని—సహజభావంతో- —"పెద్దన్నయ్యా! మీ చరణధూళి నా యింట్లో.... ..."అన్నాడు.

వేణీ గంభీరంగా అన్నాడు— "అమ్మగారు వచ్చినప్పుడు, నేను వచ్చినా- రాకపోయినా...."

గోవిందు సమాధానం చెప్పకముందే రమేశు-"పెద్దన్నయ్యా! మిమ్మల్ని విసిగించేందుకు రాలేదు. యిందులో మీకు యిబ్బంది లేకుంటే ఒకసారి వచ్చి వెళ్ళండి" అని చెప్పాడు.

వేణీ మాట్లాడలేదు. గోవిందు ఏదో చెపుదామని అనుకుంటుండ గానే రమేశు లేచి వెళ్ళిపోయాడు. గోవిందు ఒకసారి బయటికి తొంగి చూసి తరవాత-"వేణీబాబూ! ఆ మాటలతీరు చూశారా!" అన్నాడు.

వేణీ అన్యమనస్కునిలా, ఎదో ఆలోచిస్తూ జవాబు చెప్పలేదు.

దారంట నడుస్తున్న రమేశు గోవిందుని మాటలు స్మరించి అస హ్యించుకున్నాడు. నగందూరం వెళ్ళి తిరిగి వేణీఘోషాల్ యింట్లోకి వెళ్లాడు. అప్పటికికూడా చండీమండపంలో వాదోపవాదాలు జరుగుతూనే వున్నాయి! కోలాహలం ఎక్కువగానేవుంది. అవి వినాలని ఆయనకు లేదు. ఆయన తిన్నగా లోపలికి వెళ్ళి — 'పెద్దమ్మా!' అని పిల్చాడు.

అప్పుడు పెద్దమ్మ తన గదిముందున్న వసారాలో 'చీకటిలో కూచునివుంది. యింత రాత్రివేళ రమేశుకంఠం విని ఆమె ఆశ్చర్యపడి- 'ఏం నాయనా! ఏం?' అని అడిగింది.

రమేశు దగ్గరకు వెళ్లాడు. ఆమె గాబరాపడుతూ - 'కొంచెమాగు నాయనా! దీపం తెస్తానుండు' అంది.

దీపం అవసరంలేదులే పెద్దమ్మా! మీరు కూర్చోండి'

ఆ మాట అనికూడా రమేశు అక్కడే ఒకమూల కూచున్నాడు— 'యింతరాత్రప్పుడు వచ్చావేం నాయనా?' అంది పెద్దమ్మ.

'యింకా యెవర్నీ పిలవలేదు. ఆ సంగతి మిమ్మల్ని అడగాలని వచ్చాను.'

'నాయనా, నన్ను మంచి యిరుకునవేశావు— వీళ్ళంతా ఏమంటు న్నారు? గోవిందగంగూలీ, భట్టాచారి....'

'వా శ్ఛేమనేది నాకు తెలవదు పెద్దమ్మా! తెలుసుకోవాలనికూడా లేదు. మీ రేది చెబితే అది జరుగుతుంది.

రమేశుమాటల్లోని ఉత్తాపం గ్రహించి విశ్వేశ్వరి మనసులోనే విస్మయంచెంది - కొంచెంసేపు మెదలకుండా వూరుకుని - 'కాని రమేశ్ వీళ్ళే నాకు అందరికంటే ఆత్మీయులని నాతో చెప్పావు. సరే, నాబోటి ఆడవాళ్ళతో ఏమవుతుంది నాయనా? ఈ వూళ్లో - ఈ వూరేమిటి .... అన్ని వూళ్ళలో కూడా వారిపంక్తిన వీరు తినరు. వీరి పంక్తిన వారు కూచోరు. యిలానే జరుగుతూవుంటుంది. కొంచెంకార్యా-కార్యాలు వచ్చాయంటే, వాళ్ళుపడే బాధకు అంతుండదు. ఎవరిని వదిలిపెట్టాలో? యెవర్ని పిల వాలో? పల్లెల్లో నిర్ణయించడం చాలా కష్టమైన పని.'

రమేశు ఎక్కువగా ఆశ్చర్యంచెందలేదు. ఎందుకంటే ఈ నాలు గైదురోజుల్లో చాలా విషయాలు చూశాడు. అయినప్పటికీ అడిగాడు - 'యిలా ఎందుకు జరుగుతూవుంటుంది పెద్దమ్మా?'

'చాలావుంది నాయనా! ఒకవేళ యిక్కడేవుంటే నీకే తెలుస్తుంది. కొందరికి దోషాలూ అపరాధాలు వున్నాయ్! మరికొందరికి అబద్ధపు అప రాధాలు నెత్తినవేస్తారు. ఆ తరువాత కోర్టులకెక్కడం అబద్ధపుసాక్ష్యం చెప్పించడంవల్ల పెద్ద పెద్ద పార్టీలు ఏర్పడుతుంటయ్! రమేశ్! నేను రెండురోజులక్రితం వచ్చినట్లయితే యింత గొప్పగా కర్మకాండ తలపెట్ట నిచ్చేదాన్నికాదు. ఆరోజున యేం జరుగుతూందోనని ఆలోచిస్తున్నాను' అంటూ పెద్దమ్మ చల్లగా నిట్టూర్చింది. ఆ శ్వాసలోని రహస్యాన్ని సరిగ్గా రమేశు గ్రహించాడో లేదో తెలియదు. ఎవరివి దోషాలో, ఎవరిమీద అపవాదులున్నాయో అదిగూడా గ్రహించలేకపోయాడు. పైగా ఉత్తేజంగా జవాబుచెప్పాడు - 'అయినా - యీ సంగతులకూ నాకూ ఏమీ సంబంధం లేదు. ఒకవిధంగా నేను పరదేశస్థుణ్ణి! నాకు ఎవరితోనూ శత్రుత్వంలేదు. అందువల్ల పెద్దమ్మా! నాకు యిక్కడి పార్టీల కక్షలతో సంబంధంలేదు. వాటినిగురించి విచారించనుకూడా. యిక్కడున్న - బ్రాహ్మణులను శూద్రులనుకూడా పిలుస్తాను. కాని, మీ అనుమతిలేనిదే చేయలేను. అందు కని మీ అనుమతికోసం వచ్చాను.'

పెద్దమ్మ కొంచెంసేపటివరకూ మౌనంగావుంది ఆ తరువాత చెప్పింది— కాని రమేశ్! నే నిటువంటి అనుమతి యివ్వలేను. దీనిపల్లె

చాలా గందరగోళం జరుగుతుంది. నువ్వు చెప్పినది అబద్ధమని నేను చెప్పను. నాయనా! యిది బాగోగులసంగతికాదు. సమాజం యెవరిని శిక్షించి వేరుచేసిందో- వారిని తిరిగి బలవంతంగా తీసుకునివచ్చి కలుపుకో లేము. సమాజం యెటువంటిదైనా - దాన్ని ఒప్పుకునితీరాలి. దాన్ని బాగుచేయాలన్నా - ఓగుచేయాలన్నా ఎవరికీ శక్తిలేదు. రమేశ్! అలా అయితే మనం ఏపని కూడా చేయలేము.'

కొంచెం ఆలోచించి చూచినట్లయితే రమేశు యీ విషయం ఒప్పుకోకుండావుండేవాడుకాడు. యిప్పుడిప్పుడే ఆ సమాజంలోని కర్తలందరి యొక్క షడ్యంత్రాన్నీ — నీచత్వాన్నీ చూశాడు. అది అతని హృదయాన్ని దహిస్తూవుంది. అందువల్ల తిరస్కారావేశంలో ఆయనఅనేశాడు. 'ఈ వూళ్లోని సమాజమంటే, ధర్మదాసూ - గోవిందగంగూళీ వీళ్లేగా పెద్దమ్మా! యిటువంటి సమాజానికి ఏమాత్రం పేరుప్రతిష్ఠలు లేకుండా వుండడమే మంచిది.'

పెద్దమ్మ అతని కోపం చూసి, శాంతంగానే అన్నది - 'రమేశ్—! వీళ్లేగాను, పైగా మీ పెద్దన్నయ్యకూడా ఈ సమాజంలోమహాముఖ్యుడు.'

రమేశు మాట్లాడలేదు. పెద్దమ్మ మళ్ళీ మొదలుపెట్టింది- "రమేశ్ అందుకనే వీళ్ళందరి అభిప్రాయప్రకారం పనిచేయమని చెపుతున్నాను. యిప్పుడిప్పుడే యీ వూళ్ళోకివచ్చి, వీరికి విరుద్ధంగా మాత్రం పని చేయవద్దు —"

ఎంతోదూరం ఆలోచించి పెద్దమ్మ అతనికి ఉపదేశించింది. కాని, తీవ్రమైన ఉత్తేజంలోపడి, రమేశు ఏదీ ఆలోచించలేక- "పెద్దమ్మా! రకరకాలైన కారణాలవల్ల, గ్రామంలో యిన్ని పార్టీలు ఏర్పడినట్లు చెప్పావు. ఈ కారణా లన్నిటిలోనూ వ్యక్తిగత దోషమే పెద్దకారణమని నే ననుకుంటాను. అదీకాక నాకు యెవరివి నిజమైన దోషాలో, ఎవరిమీద అపవాదు లున్నాయో తెలవదు. మరి అటువంటప్పుడు కొందరిని పిలవకుండా వుండడం అవమానించినట్లు కాదా?" అని అడిగాడు.

పెద్దమ్మ చిన్నగానవ్వి- "అరే పిచ్చివాడా! నేను నీకంటే పెద్దదాన్ని, నీ తల్లిలాంటిదాన్ని, నామాట వినకపోవడంకూడా అన్యాయమే-" అంది.

"నేం చేయను పెద్దమ్మా! అందర్నీ పిలవాలని నిశ్చయించు కున్నాను.

రమేశుని దృఢసంకల్పం విని ఐశ్వేశ్వరిముఖంలో అప్రసన్నత కనుపించింది. మనసులో కొంచెం కోపంకూడా వచ్చినట్టుంది. "అటు వంటప్పుడు నా అనుమతికోసంరావడం, మాటవరుసకన్నమాట-!"

పెద్దమ్మకు కోపంవచ్చినట్లు గ్రహించాడు రమేశు. అయినా అతడు చలించలేదు. ఆయన కొంచెంసేపుండి, మెల్లిగా అన్నాడు— "పెద్దమ్మా! అన్యాయం కానటువంటి పనులు నేను చేస్తుంటే, నువ్వు మనసారా దీవిస్తావని నాకు తెలుసు-నా...." మాట పూర్తికాకముందే, పెద్దమ్మ— "కానీ రమేశ్! నేను నా సంతానానికి విరుద్ధంగా ఏమీ చేయ లేనని కూడా తెలుసుకోవాల్సింది" అన్నది.

రమేశుకు ఆమాటతో మనసులో గాయంకలిగింది. యెందువల్లనంటే నోటితో ఏమన్నప్పటికీ, నిన్నటినుంచి పెద్దమ్మదగ్గర తనకు కూడా సంతానాధికారంవుందని అతనికి తోచసాగింది. కాని తన అధి కారంకంటే చాలాపైగా ఆమె స్వీయసంతానాధికారంవుందని తెలుసు కున్నాడు యిప్పుడు. ఆ తరువాత కొంచెంసేపు మెదలకండావుండి-లేచి నిల్చుని- "నిన్నటివరకూ అలాగే అనుకున్నాను పెద్దమ్మా : అందువల్లనే, మీతో అప్పుడు, నేను చేయగలిగినంతవరకు నేనే చేసుకుంటానని చెప్పాను, మీరు రావాలనేకష్టం మాత్రం చేయకండి! నిన్ను పిలిచే సాహసంకూడా నాలోలేదు" అభిమానంతోనే అన్నాడు.

అతని కోపం పెద్దమ్మ గ్రహించకపోలేదు. కాని, ఆమె యేమీ జవాబుచెప్పలేదు. ఆ చీకటిలో మెదలకండానే కూచుంది. కొంచెంసేప యాక, రమేశు వెడదామని లేచాడు. అప్పు డామే— వుండు రమేశ్— 'కొంచెం ఆగు, నీ సామానుగదితాళాలు యిస్తాను- "అని లేచివెళ్ళి తాళాలు తెచ్చి రమేశుని పాదాలముందు విసిరేసింది.

రమేశు కొంచెంసేపు మెదలకుండా నిశ్శబ్దంగా నిలుచుని ఆ తరు వాత గట్టిగానిట్టూర్చి తాళాలు తీసుకుని బయటికి వెళ్ళాడు. యిప్పుడే హాస్పి

అనుకున్నాడు. కాని. యింకా ఒకరాత్రి గడిచీగడవకముందే ఆయన తిరిగి దీర్ఘంగా నిట్టూర్చి- "కాదు. నాకెవరులేరు. పెద్దమ్మకూడా నన్ను వదలి పెట్టింది" అనుకున్నాడు.

# 4

బయట యిప్పుడిప్పుడే శ్రాద్ధం పూర్తయింది. పీటమీదనుంచి లేచి, రమేశు అభ్యాగతులతో పరిచయంచేసుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు. యింటిలోపల భోజనాలకు విస్తళ్ళు వేయడం జరుగుతూంది. అదే సమయంలో కొంత గందరగోళం విని రమేశుడు భయపడుతూ అక్కడికి వచ్చాడు. ఆయనతోపాటు యింకా చాలమంది లోపలికి వచ్చారు. వంటింటి తలుపుకు ఒకప్రక్కగా యిరవై అయిదు యిరవై యారు సంవత్సరాల వితంతువు కుంచించుకపోయిన ముఖంలో వెనకకు నిలుచునివుంది. ఆమెకు దగ్గర్లో యింకొక ప్రౌఢాంగన కోపంతో-కళ్ళూ-ముఖం ఎర్రచేసుకుని, గట్టిగా అరుస్తూ తిడుతూవుంది. ఈ పోట్లాట పరాణ్ హాల్దారుతో జరుగుతోంది. ఆ ప్రౌఢాంగన రమేశుని చూడ్డంతోనే "ఏం నాయనా! ఈ గ్రామానికి నువ్వూ ఒక జమీందారువే? ఈ దోష మంతా క్షేంతిబ్రాహ్మణకూతురి దొక్కదానిదేనా? మాకు అండయెవరూ లేరని, ఎన్నిమార్లు శాస్తి చేస్తారు?" అని అడిగి గోవిందునివేపు చూపిస్తూ, "వీరు ముఖర్జీగారింట్లో వృక్షప్రతిష్ఠాపన జరిగిననాడు జుల్మానా పేరులో స్కూలుకోసం నావద్ద పదిరూపాయలు వసూలుచేయలేదా? వూళ్లో అమ్మవారి జాతర చేస్తూన్నప్పుడు బలికోసం నావద్ద రెండు జతల మేకల విలువ తీసుకోలేదూ? అటువంటప్పుడు యింకా ఎన్నిసార్లని పీడిస్తారు. ఎందు కింత పోట్లాట? మీరే చెప్పండి" అని అడిగింది.

అసలుసంగతి సంపర్కాలు రమేశుకు అంతుపట్టలేదు. యింత వరకూ కూచున్న గోవిందగంగూళి దాన్ని చర్చించేందుకు లేచి నిల్చుని, ఆయనముందు రమేశునీ, ఆ తరువాత ఆ ప్రౌఢాంగనవేపు చూసి గంభీరంగా అన్నాడు — "క్షేంతిపిన్నీ! నాపేరు యెత్తావు కాబట్టి నేను నిజం చెప్తాను. ఈ గోవిందగంగూళీ ఒకరి గౌరవంకోసం, ముఖంయెదట

ముఖమాటపడకని, ఈ వూరివారందరికీ తెలుసు. నీ కూతురుకు ప్రాయశ్చిత్తం జరిగిపోయింది. అందుకు సమాజం జాత్మానాహా విధించింది. అదంతా నేను ఒప్పుకుంటాను. కాని ఆవిడను యజ్ఞంలో వంట చేయమనీ, మడిపనుల్లోకి రమ్మనమనీ అనుజ్ఞ మేము యివ్వలేదు, ఒకవేళ ఆమె చనిపోయినప్పుడు అవసరం వుంటే, శ్మశానందాకా ఒక భుజం యిస్తాం-కాని...."

"నీ బిడ్డ చచ్చినప్పుడు భుజం కాయనా! నా బిడ్డను గురించి నీకెందు కంత విచారం? గోవింద్! నీగుండెమీద చేయివేసి యెందుకు చెప్పకూడదు? నేనడుగుతున్నాను. చెప్పు? నీచిన్న మరదలు, యిప్పుడు సామానుగదిలో కూచుని తాంబూలాలు కడుతూందే ఆవిడ నిరుడు రెండు నెలలు పదిహేనురోజులు, ఏ కాశీలో వుండి- వచ్చిన మనిషి ఎందుచేత పిండిబొమ్మమాదిరి అయివచ్చింది? యివే గొప్పవాళ్ళ గొప్పతనం కామాలు? అయినా నాముందు ఎక్కువ రోతుకుదిగి మాట్లాడవద్దు. నేను బండార మంతా బయటపెట్టగలను. మేమూ పిల్లలుగలవాళ్ళమే! మాకన్నీ తెలుసు, మాకళ్ళలో దుమ్మెవరూ కొట్టలేరు" అని గర్జించింది.

గోవిందుడు కోపంతో పిచ్చివాడైపోయి, 'అయితే రావే తప్పుడు ముండా' అని ముందుకు దుమికాడు.

కానీ, ఆ తప్పుడుముండ కొంచెంకూడా భయపడలేదు. పైగా ఒక అడుగు ముందుకువేసి. చేతులు తిప్పుతూ గంతులేస్తూ "అయితే నన్ను కొడతావురా! ఈ క్షేంతిబ్రాహ్మణిని రెచ్చగొట్టావంటే యీవూరి బండార మంతా బయటపడుతుంది. మా అమ్మాయి వంటింటిలో కాలుకూడాపెట్ట లేదు. హోల్డాసు తలవని తలంపుగా అవమానంచేశాడు. అయితే అతని వియ్యపురాలికీ, ఆ శెట్టిబలిజీకి సంబంధం వుందని అపవాదులేదూ? నేనూ యీనాటిదాన్ని కాను. యింకా యేమైనా చెప్పాలా-యింతటితో చాలా?" అని అడిగింది.

పమేశుడు కొయ్యలా మారిపోయాడు, భైరవాచారి గాబరాపడి, లేచివచ్చి ఆమెచేతులు పట్టుకుని- "యిక చాలు చిన్నమ్మా! యింకా చెప్ప నవుసరంలేదు. లే సుకుమారీ! నాతో రా! ఆగదిలో కూచుందాం" అన్నాడు.

పరాన్‌హాల్దారు తుండుగుడ్డ బుజంమీద వేసుకుని, తిన్నగా లేచి నిలుచుని చెప్పాడు—"ఎంతవరకు యీ పాడుముండను యీ యింట్లోంచి వెళ్ళగొట్టరో—అంతవరకూ నేనీ యింట్లో నీటిచుక్క-కూడా ముట్టుకోను గోవింద్. ముందే చెపుతున్నాను. కాళీచరణ్! నువ్వు నీ మామ కావాలను కుంటే, లేచిరా! మామా అక్కడికి వెళ్ళవద్దని వేణీఘోషాల్ ముందే అన్నాడు. యిటువంటి ఛండాలపు ముండలంతా వస్తారని ముందే తెలిసి వుంటే, జాతిని భ్రష్టంచేసుకునేందుకు యీ గుమ్మమే త్రొక్కేవాణ్ణికాదు? కాళీ లేచిరారా."

మాటిమాటికీ మామగారు పిలుస్తున్నప్పటికికూడా, కాళీచర ణుడు తలవంచుకుని అలాగే కూచున్నాడు. అతను జనపనార వ్యాపారం చేస్తుంటాడు. నాలుగేళ్ళక్రితం కలకత్తానుంచి పెద్ద వ్యాపారస్తుడు వచ్చి అతని వెధవచెల్లెల్ని లేవదీసుకొనిపోయాడు. ఆమె మామగారింటికి వెళ్ళిందని కొంతకాలం, తీర్థయాత్రలకు వెళ్ళిందని కొంతకాలం, సంగతంతా గుప్తంగావుంచారు. ఇప్పుడా సంగతి యెక్కడ బయటికొస్తుం దనే భయంతో కాళీచరణుడు అలాగే తలవంచుకుని వున్నాడు. కాని గోవిందుని మంట తగ్గలేదు. అతను మళ్లీ లేచి నిలుచుని అన్నాడు—"ఎవరెన్ని చెప్పినా—ఈవూరి సమాజాధిపతులు, వేణీఘోషాల్, పాంణహాల్దారు, యదుముఖర్జీ కూతురు, మేము ఏవిధంగాకూడా వారిని వదిలిపెట్టము. రమేశబాబు అట్టి సంఘాన్ని కాదని, ఈ సంకరపు ముండల్ని యింట్లోకి యెందుకు రానిచ్చాడో, దానికి సరైన సంజాయిషీ యివ్వందే యిక్కడ, మేమంతా మంచినీళ్ళుకూడా ముట్టుకోము."

చూస్తూచూస్తుండగానే అక్కడున్న యింకా పదిమంది తుండు గుడ్డలు భుజంమీద వేసుకుని నిలుచున్నారు. వీళ్ళంతా యిక్కడివాళ్ళే. సమాజిక వ్యవహారాల్లో, ఏ ఎత్తువేస్తే అన్నిటికన్నా లాభదాయకమో వీళ్ళకు తెలుసు!

ఆ వచ్చిన బ్రాహ్మణులంతా తలొకవిధంగా అంటున్నారు. భైర వుడు, దీనూభట్టాచారి యిద్దరుమాత్రం యేడ్చినంతపనైంది. వారు ఒకప్పుడు క్షేంతిపిన్నిని, మరొకప్పుడు ఆమె కూతురును, యింకొకప్పుడు గంగూళి, హాల్దార్ చేతులు, కాళ్ళు పట్టుకుని బ్రతిమలాడేందుకు తయా

రై యారు. ఎటుచూసినా, చేసిన ప్రయత్నాలన్నీ భగ్నమవుతాయేమోనని అనుమానంగావుంది. కాని రమేశు ఒక్కమాటకూడా అనలేదు. ఆకలి దప్పులు అతన్ని దహిస్తున్నయ్। పైగా ఈ గందరగోళం జరగడంలో అతనిముఖం తెల్లబడిపోయింది, హతబుద్ధునిలా నిలుచుని చూస్తున్నాడు.

ఇంతలో పిలుపు వినిపించింది—"రమేశ్" అని.

హఠాత్తుగా క్షణంలో అందరి చూపులు విశ్వేశ్వరిముఖంమీద పడినయ్। ఆమె సామానుగదిలోంచి బయటకువచ్చి తలుపు యెదురుగా నిలుచుంది. ఆమె తలమీద పైటకొంగువుంది. కానీ ముఖంమీద లేదు. పెద్దమ్మ ఎప్పుడో తనంతతానే వచ్చిందని రమేశు గ్రహించాడు. ఆమె తనను యింకా వదలలేదు. ఆమె విశ్వేశ్వరనీ, ఘోషాల్‌వంశస్థుల యజమానురాలని అంతా గ్రహించారు.

పల్లెలలో బస్త్రీలమో స్తరుగా పరదాపట్టింపులు వుండవు. అయినప్పటికీ ఆమె గొప్పింటి స్త్రీ కావడంవల్లనో, యింకే కారణంవల్లనో, వయసు మీరినప్పటికీ, ఆమె ఎప్పుడూ ఎవరియెదుటకు వచ్చేదికాదు. అందువల్ల యీ నాడామెను చూసేసరికి అందరికీ ఆశ్చర్యం కలిగింది. ఆమెనుగురించి విని, కళ్ళతో చూడనివాళ్లుమాత్రం ఆమె విలక్షణమైన కళ్ళుచూసి ఆశ్చర్యచకితులయారు. ఆమెకు హఠాత్తుగా కోపంరాగానే బయటికి వచ్చినట్లుంది. అందరిచూపులు ఆమెమీద పడగానే, ఆమె చటుక్కున స్తంభంచాటుకు వెళ్ళింది. ఆమె పిలుపు వినేసరికి రమేశుని విహ్వాలమంతా ఎక్కడికో ఎగిరిపోయింది. అతను గబగబా ఆమెదగ్గరకు వెళ్లాడు. పెద్దమ్మ చాటునవుండే స్పష్టంగా-అందరికి వినపడేవిధంగా అన్నది-"రమేశ్, గంగూళీగారితో యీవిధంగా దబాయించడం, భయపెట్టడం మానమని చెప్పు। అందరినీ నేనే ఆదరపూర్వకంగా పిలుచుకుని వచ్చానని హాల్దారుతో చెప్పు. సుకుమారిని అనుమానించే అవసరంలేదు. మాటోటి పరాయివాళ్ళయింటిలో, కీచులాటలూ, గంద్రగోళం పనికిరాదని కూడా చెప్పు. యిందులో ఎవరికైనా అభ్యంతరంవుంటే, వాళ్ళు వెళ్ళి యింకొకచోట కూచోవచ్చునని చెప్పు."

పెద్దమ్మగారి ఆజ్ఞ అందరూ విన్నారు. రమేశు తననోటితో ఏమీ చెప్పవలసిన అవసరంలేకపోయింది. ఒకవేళ చెప్పాల్సివున్నా చెప్పలేక

పోయేవాడే! అక్కడ నిల్చుని చూడలేకపోయాడు. అతిప్రయత్నంమీద కన్నీళ్లు నింపుకుంటూ అతను ఒక గదిలోకివెళ్ళాడు. అక్కడ అతని కళ్ళనుంచి జరజరలాడుతూ నీళ్ళు ప్రవహించినయ్. ఇవాళవుదయంనుంచీ ఆయన పనుల్లో క్షణం తీరికలేకుండావున్నాడు. అందువల్ల, వచ్చినవాళ్ళెవరో-రానివారెవరోకూడా ఆయనకు తెలియదు. ఎవరువచ్చినా, రాక పోయినా పెద్దమ్మ వస్తుందని లే దశనికి. లేచినిల్చున్నవాళ్ళంతా ఒక్కొక్కరే కూచున్నారు. ఆ గుంపులోంచి ఎవరో కూచోరాదా బాబాయ్! భోజనంపెట్టి కూడా యింటికి తీసుకొనివెళ్ళేందుకు లడ్డూలు, బొబ్బట్లూ ఎవ రిస్తారేమిటి?" పారణిహోల్దారూ, గంగూళి యింకా నిల్చునివుండడం చూసి అన్నాడు.

పారణిహోల్దార్ మెల్లిమెల్లిగా బయటికి వెళ్ళిపోయాడు. కాని ఆశ్చర్యం ఏమంటే గోవింద గంగూళి నిజంగా కూచోవడమే! అయినా ముఖంమాత్రం యింతలావుచేసుకున్నాడు. భోజనాలకోసం విస్తళ్లు కోయగానే, వడ్డన నెపంతో పై పెత్తనం చలాయించాలని, పంక్తిలోంచి లేచి వెళ్లాడు. ఈ వ్యవహారాన్ని లక్ష్యపెట్టినవాళ్లుమాత్రం, గంగూళి ఎవరినీ సహజంగా వదలడనిమాత్రం మనసులో అనుకున్నారు. ఆ తరువాత ఏమీ అల్లరిజరగలేదు.. ఆనాడు బ్రాహ్మణులు భోజనంచేసిన తీరు కళ్ళతో చూడనిదే నమ్మడం కష్టం! అక్కడవున్న అందరూ తమపిల్లలకోసమని, మూటలుకట్టుకున్నదికూడా తక్కువకాదు. చీకటి పడబోతూండగా అంతా అయిపోయింది. రమేశు వీధివాకిట్లోవున్న నేరేడుచెట్టుక్రింద అన్యమనసుతో నిలుచునివున్నాడు. అతని మనసు మనసులోలేదు. యింతలో దీను భట్టాచార్యుడు తన పిల్లతో, మూటలుకట్టుకున్న బరువుతో అందరి చూపుల్ని తప్పించుకుని బయటికివస్తూండడం చూశాడు. అందరికంటే ముందు అతనికూతురు మునియచూపులు రమేశుమీద పడినయ్! ఆమె అపరాధిలా నిలుచుని-"బాబా! అక్కడ బాబుగారు నిలుచున్నారు" అంది.

అందరూ తొట్రుపడ్డారు. ఈ ఒక్కమాటతో రమేశు సంగతంతా గ్రహించాడు. ఒకవేళ అక్కడనుంచి తప్పుకునేందుకు వీలుంటే ఆయన స్వయంగా తప్పుకునేవాడే; కాని తప్పుకునేందుకు వీలులేకపోయింది.

అందువల్ల ఆయన స్వయంగా ముందుకువచ్చి, నవ్వుతూ అడిగాడు – “మునియా! యివన్నీ ఎవరికోసం?” అని.

మునియా దగ్గరున్న చిన్నా-పెద్దా మూటలకు సరైన సమాధానం చెపుతుందో లేదోనని; దీనూ శుష్కంగా నవ్వుతూ— “నాయనా? మా వీధిలో యింకా అలగాజనం, వాళ్ళపిల్లలు వున్నారు. ఏదో మిగిలిన ఎంగిలి మంగలం కొంత తీసుకునివెళ్ళి వాళ్ళకుకూడా యివ్వవచ్చునుకున్నాను. ఏమైనా ఆమెను అందరూ ‘పెద్దమ్మగా’ రని ఎందుకు పిలుస్తున్నారో యివ్వాళ గ్రహించాను” అన్నాడు.

రమేశు-అందుకేమీ జవాబు చెప్పకుండానే, అతనిలో గేటువరకూ వచ్చి అడిగాడు-“ఏం భట్టాచార్యులుగారూ! మీకు యిక్కడి సంగతంతా తెలుసు! ఈ గ్రామములో యింత ఈర్ష్య, ద్వేషం ఎందుకున్నాయో మీరు చెప్పగలరా?”

దీను ఏదో చప్పరించినట్లుగా రెండుమూడుసార్లు తలూపిఅన్నాడు- “నాయనా! యింకా మన కుంవాపురం నయం. మా మునియా అత్తగారి వూరిలో నాలుగురోజులుండి చూసివచ్చాను. ఏం చెప్పను? అక్కడ బ్రాహ్మణులపీ, కాయస్థులపీ మహావుంటే యిటువైపు యిళ్ళన్నా లేవు. అయినా అక్కడ నాలుగు పార్టీలు. హరనాథ్ విశ్వాసుడు తన స్వంత మేనల్లుణ్ణి తోటలో రెండు పండ్లు కోశాడని జెయిలుకు పంపారు. బాబూ. అన్ని పల్లెలూ యింతే. యిక అందరూ కోర్టులకెక్కి చితికిపోయారు.... ఆ.... మునియా! హరిధన్ చేతిలోని మూట తీసుకో! వాడు అలసిపోయినట్లున్నాడు.”

“అయితే భట్టాచారిగారూ! యిందుకు ఏమీ ప్రతీకారం లేదా?”

ఒక చల్లని నిట్టూర్పు విడిచి భట్టాచారి అన్నాడు-“యిందుకు ప్రతీకార మేముంది బాబూ? యిది కలియుగం....అయినా నే నొక సంగతి చెప్పగలను. నేను భిక్షాటనం చేస్తూ చాలా వూళ్ళకు వెళుతుంటాను. చాలా మంది నామీద దయగావుంటారు. అయినా నీచోటి యువకుల్లో దయాధర్మం వున్నసంగతికూడా చూశాను, అదే యీ వృద్ధులకు క్షేమ. వీళ్ల సమయంచూసి మనిషిగొంతుమీద కాలుపెట్టి, చావు వచ్చేవరకూ నాలుక సాగదీస్తూంటారు.”

అంటూ తను నాలుక బయటపెట్టి ఒకవిధంగా చూపాడు. అందుకు రమేశుకు నవ్వు వచ్చింది. ఆ నవ్వులో దీను పాల్గొనకుండానే-"నవ్వే సంగతి కాదుబాబూ! యిది నిజం! నేనుకూడా యిప్పుడు చాలా వందుబారి పోయాను. కాని....బాబూ చీకట్లో చాలాదూరం వచ్చేశారు" అనిఅన్నాడు.

"విచారం లేదులెండి ! మీరు చెప్పండి—"

"బాబూ ఏం చెప్పను? ప్రతి వూరు-గ్రామమూ యిలాగే వున్నయ్! ఇక ఈ గోవిందగంగూళీ వున్నాడు. వీడి పాపాలు తల్చుకుంటే ప్రాయశ్చిత్తం చేసుకోవాలి. క్షేంతీబ్రాహ్మణి అన్నమాటల్లో తప్పులేదు.... కాని వాడికి అందరూ భయపడతారు. మోసం చేయాలన్నా, అబద్ధపు సాక్ష్యం చెప్పడంలో, అబద్ధపు వ్యాజ్యాలు బనాయించడంలో వాడికి సరి పోయేవాడు ఎవడూలేడు. అయినా వేణీబాబుగారి మద్దత్తువుంది. అందు వల్ల వాడికి విరుద్ధంగా ఒక్కమాటకూడా ఎవరూ మాట్లాడలేరు. పైగా యితరులను వెలివేస్తుంటాడు."

చాలాసేపటివరకూ ప్రశ్నించకుండానే, దీనువెంట నడుస్తున్నాదు రమేశు! కోపంతో మండిపోతున్నాడు—"బాబుగారూ నామాట గుర్తుంచు కోండి! క్షేంతీబ్రాహ్మణిని సహజంగా వదిలిపెట్టరు. గోవిందగంగూళీ, పారణహాల్దారు యిద్దరూ రెండు కందిరీగలలాంటివాళ్లు. వాటిని రెచ్చ కొట్టడం మామూలుసంగతికాదు. అయినా ఏమన్నా అనండి బాబూ! ఆమె ధైర్యస్థురాలు. ధైర్యం ఎందుకుండదు....? ఇంటింటికీ తిరిగి పేలాలు అమ్ముతూవుంటుంది. ప్రతియింటికీ వస్తూ—పోతూవుంటుంది. అందరి సంగతులు తెలుసు. మొత్తంమీద దాన్నేమన్నా అన్నారా-యిక పిళ్ళరంకులు బయటపడి తీరాల్సిందే : అయినా అనాచారం ఏయింట్లోలేదో మీరేచెప్పండి? వేణీబాబుకుకూడా........"

మధ్యలోనే అతన్ని ఆపి —"ఆపండి! పెద్దన్నయ్యగారి సంగతి మన కవసరంలేదు" అని ఆయనవిషయంలో ఏమి చెపుతాడో నని భయపడి రమేశు అన్నాడు.

దీనుకూడా అప్రతిభుండై,—సరే ఆ సంగతి వద్దులెండి ! బీద వాడికి యిటువంటి మాటలు పనికిరావు. ఒకవేళ యీసంగతి వేణీబాబుతో

ఎవరన్నా చెప్పినట్లయితే—నాయిల్లు కూడా కాల్పించి...." రమేశు మధ్యే అతన్ని ఆపాడు.

"మీ యిల్లు యింకెంతదూరముంది?"

"ఎక్కువదూరం లేమదాబో! ఈ వంతెన ప్రక్కనే నా పూరిల్లు వుంది. ఒకవేళ యెప్పుడన్నా...."

"ఎందుకురాను? తప్పకవస్తాను. రేపుదయం మిమ్మల్ని కలుసుకుంటాను. ఆ తరువాతకూడా మీ పాదధూళి అప్పుడప్పుడూ మాయింట్లో పడేట్లు చేయండి."

అని రమేశు వెనక్కుతిరిగి వచ్చేశాడు. దీనూ భట్టాచారి కూడా తన మనసులోనే ఆశీర్వదించాడు— "దీర్ఘజీవిగా వుండు నాయనా! మీ తండ్రిలాకావాలి" అని.

ఆయన తన పిల్లలతో యింటివేపు నడిచాడు.

# 5

ఈ ఛూళ్ళో మధుపాల్ చిల్లరదుకాణం ఒక్కటే నదికి వెళ్ళేదారి ప్రక్కగావుంది. తాను యివ్వవలసిన పదిరూపాయలకోసం పదిపన్నెండు రోజులైనా ఎవరూ రాకపోయేసరికి, రమేశు ఏ మాలోచించాడో, ఒకనాటి రాత్రి ప్రొద్దున్నే ఆతని దుకాణందగ్గరకు బయలుదేరాడు. మధుపాల్ ఎంతో వినయంగా, చాప పరిచి చినబాబుగారిని కూర్చోపెట్టాడు. చినబాబుగారు వచ్చినసంగతి తెలుసుకుని చాలా ఆశ్చర్యపడ్డాడు. మధుపాల్కు యింతవయసు వచ్చినా-బాకీ తీర్చేందుకు స్వయంగావచ్చి యివ్వడం, దాను ఎవరిని చూడలేదు, వినలేదు. ఆ సంగతీ ఈ సంగతీ చాలా మాట్లాడుకున్నాక మధుపాల్- "దుకాణం ఎలా సాగుతుంది బాబూ? రెండణాలు, పావలా, రూపాయి, రూపాయపావలా, ఇలా యాభై అరవై రూపాయల వరకూ బాకీలు వున్నాయ్. ఇదుగో యిప్పుడే యిస్తామని నిష్ఠురపెట్టడమేకాని, రెండు మూడు నెలలైనా యివ్వటు....ఏమిటు....?పెద్దబ్బ గారేనా? నమస్కారాలు —ఎప్పుడు వచ్చారు? అని అడిగాడు.

బెనర్జీగారి కుడిచేతిలో చెంబూ, పీలమండలవరకు బురదా. చెవుల మీదకు ఎక్కించిన జంధ్యం. యెడమచేతిలోని ఆకులో నాలుగైదు చిన్న చిన్న చేపలతో ప్రత్యక్షమయ్యారు. ఆయన గట్టిగా వూపిరి పీల్చి అన్నాడు- "నిన్నటిరాత్రి వచ్చాను. మధూ కొంచెం పొగాకు యివ్వవోయ్"అని చెంబు క్రిందపెట్టి చేతిలోనిచేపల్ని ఒకప్రక్కగాపెట్టిఅన్నాడు. "ఆ పట్లముంత తెలివి చూశావా మధూ? అది చటుక్కున నాచేయిపట్టు కుంది. చూశావా కాలం ఎలామారిపోయిందో? ఇవన్నీఒకకానీ చేపలట? బ్రాహ్మణున్ని మోసగించి ఎంతకాలం తింటుందిలే?ఇది నాశనమైపోదూ?"

మధు ఆశ్చర్యంగా—"అది ఒక్కసారే, మీచేయి పట్టుకుందా?" అని అడిగాడు.

నాలుగు ప్రక్కలా ఒక్కసారి కలియచూసి-కోపంతో బెనర్జీ చెప్పాడు— "దానికి యివ్వవలసిన బాకీ డబ్బున్నర. ఈ కొంచెంకోసం, బజార్లో, అందరి యెదటా నాచేయి పట్టుకుంటుందా? చూడనివా శ్శెవ డిక్కడ? నేను బహిర్దేశానికివెళ్ళి నదిలో చెంబు తోముకుని, నదిలో కాళ్లూ-ముఖం కడుక్కుని కొంచెం బయి బజారుకువెళ్ళి పద్దామని బయలు దేరాను. తట్టెడు చేపలు పెట్టుకుని కూచుం దక్కడ. కాని నాతో 'మహా రాజా! యిప్పు డేమీ లేవు. అన్నీ అమ్ముడు పోయా యని' చెప్పింది. కాని, నా కళ్ళల్లో దుమ్ముకొట్టగలదా? ఆ తట్టమీద మూతతీశానో లేదో చటుక్కున నాచేయి పట్టుకుంది. అదివరకు యివ్వాల్సింది డబ్బున్నర. యిప్పుడు డబ్బు. మొత్తం ఈ రెండు కానులన్నరకు వూరువిడిచి పారిపోతానా? ఏమంటావు? నువ్వే చెప్పు మధూ?"

'ఆ.... అదేముందిలే....' అన్నాడు మధు,

"అలా అను! అయినా యీ వూళ్లో ఒక కట్టడి,ఒక శాసనంగాని, ఒక న్యాయంగాని వుందా? లేకుంటే, దానింటికి, చాకలిని, మంగలిని వెళ్ళకుండాచేసి, యిల్లు వూడదీసిపారేయవచ్చుకదా?" అని ఒ మేశు వేపు చూసి. మధూ! యీ బాబుగా రెవరు ?' అని అడిగాడు.

మధు గర్వపూర్వకంగా అన్నాడు- "పేట నున చినబాబుగారి కొడుకు కదూ! సరుకులు పట్టుకువెళ్ళిన పదిహూనాలుల యిచ్చేందుకు వచ్చారు."

బెనర్జీ పల్లెవాని సంగతి మర్చిపోయి, కళ్ళుచింపుకుని చూస్తూ అన్నాడు- "ఆ! రమేశబాబూ! చిరంజీవిభవ! చేయవలసిన విధంగానే చేశాని, బాగానే విన్నావు. ఋఋవంటి భోజనాలు, ఈ పుష్ప్రకర్రాలు యిదివరు తెలియా పెట్టించలేను. కానీ, . నాకళ్ళతో చూడలేదే అని విచారంగావుంది. నలుగురైదుగురి వలలోపడి నౌకరీకోసమని కలకత్తా వెళ్లాను. అందువల్లనే ఈ దుస్థితి కలిగింది. అరే రామ రామ. అక్కడ మనుష్యమాత్రు లుంటారా?"

రమేశు మెదలకుండా బెనర్జీముఖంలోకి చూస్తున్నాడు. అక్కడ చేరిన నలుగురైదుగురు మాత్రం అతని కలకత్తా యాత్రను గురించి సంగతులు తెలుసుకోవాలని ఉత్సాహపడుతున్నారు. మధు హుక్కా నింపి ఆయనచేతి కిచ్చి అడిగాడు—"ఆ తరువాత యేమైనది? నౌకరీ దొరికిందా?"

"ఎందుకు దొరకదు? నేను ఎంతకష్టపడి చదువుకున్నానో తెలుసా? కాని నౌకరీ దొరికినంత మాత్రంలో ఏమవుతుంది? అక్క డెవరుండగలరు? ఎంత వైభవముంటుందో అంత బురదమయంగా వుంటుంది. ఒకవేళ బయటికివెళ్ళి, బండ్లక్రిందా, కార్లక్రిందా పడి రాకుంటే, అది వాళ్ళ పెద్దలు చేసుకున్న పుణ్యఫలమే ననుకో !"

మధు ఎప్పుడూ కలకత్తా వెళ్ళలేదు. ఏదో ఒక సాక్ష్యం చెప్పేందుకు వెళ్ళి పట్టణం ఒక్కటిమాత్రం చూశాడు. అందుకని ఆశ్చర్యంగా చూస్తూ— 'బాగానే వుందే' అన్నాడు.

బెనర్జీ నవ్వుతూ — "నేను చెప్పేది నిజమో —అబద్ధమో రమేశబాబునే అడుగు. వద్దు మధూ! అన్నంలేకపోయినా, గుండెలమీద చెయి పెట్టుకుని హాయిగా యింట్లో చనిపోవడం చాలానయం. యిక ఏ పరాయి వూరుకూడా వెళ్ళను. నేను చెపితే మీరు నమ్మరు. అక్కడ తోటకూర, అరటిపువ్వూ, కొత్తిమీరీ కూడా కొని తినాలి. అలా కొని ఎంతకాలం తింటావో చెప్పు? ఈ ఒక్కనెలకే చూడు-నేను ఓ ఎలకలా తయారయాను. రాత్రింబగళ్ళు కడుపులో గుడగుడమంటూ వుండేది. గుండెలో మంట. మనసులో భయం. అందుకే పారిపోయివచ్చాక ప్రాణాల్లోకి ప్రాణాలు వచ్చినయ్! కాదు-కాదు. మనవూళ్లోనే వుండి ఏదో దొరికింది. ఒక్కపూట తిన్నా చాలు. అంతకూ దొరక్కపోయినప్పుడు పిల్లా-పీచుతో

అడుక్కొని తినవచ్చు. బ్రాహ్మణ సంతానానికి అందులో సిగ్గులేదు. ఆ లక్ష్మీకటాక్షం వున్నంతవరకు-నేను పరదేశంవెళ్ళను" అని చెప్పాడు.

ఆ కథ విని అందరూ ఆశ్చర్యం పొందారు. ఆ తరువాత ఆయన లేచివెళ్ళి గరిటతీసుకొని నూనెడబ్బాలోంచి ఒక చటాకు నూనె తీసుకుని దాన్ని చేతులో పోసుకుని, కొంత చెవుల్లో, కొంత ముక్కులో వేసుకుని మిగిలినది తలకు పెట్టుకుని మర్దించుకుని—"చాలా ఆలస్యమైంది మధూ! ఇక స్నానంచేసి యింటికి వెళతాను. మధూ! ఒక కానీ వుప్పు కట్టు— సాయంకాలం వచ్చి యిస్తాను."

"మళ్ళీ సాయంకాలమా? అంటూ మధు వుప్పుకట్టేందుకు లేచాడు. బెనర్జీ మెడసారించి చూసి, విస్మయంగా— "మీరంతా యిలా మారి పోయారేం? ముఖం పగలకొట్టి డబ్బు వసూలుచేసేటట్లున్నారే!" అని స్వయంగా పిడికిలినిండా వుప్పు తీసుకుని, మధు కట్టిన పొట్లంలోవేసి, పొట్లం అందుకున్నాడు. ఆ తరువాత చెంబు పుచ్చుకుని,రమేశువేపు చూసి అన్నాడు— "మీరుకూడా అటేవస్తారుగా....? రండి మాట్లాడుకుంటూ వెళదాం"

"పదండి—" అంటూ రమేశు లేచి నిల్చున్నాడు. మధు కొంచెం దూరంలోవుండి ఎంతో వినయంగా...."బెనర్జీగారూ! ఆనాటి గోధుమ పిండి అయిదున్నరఅణాలు..........." అని అన్నాడు.

బెనర్జీకి కోపంవచ్చింది— "ఏం మధూ? యిప్పుడు రెండు పూటలా కన్పిస్తుంటానుగా? మీకళ్ళకేమైనా చత్వారం వస్తుందా? యిప్పుడే ఆవెధవల జిత్తుల్లోపడి కలకత్తా వెళ్ళిరావడానికి అయిదు రూపాయలు నట్టేటిలో పోశాను. యిదేనా సువ్రతగాదాపెట్టుకునే సమయం. అందుకే పెద్దలంటారు. ఒకరికి సర్వనాశనం, యింకొకరికి ఆనందం. వీళ్ళ వ్యవహారం చూస్తున్నావా రమేశ్—?"

మధు సంకుచితంగా—మెల్లిగా అన్నాడు— "చాలాకాలం...."

"చాలా రోజులు అయితే కావచ్చు. కానీ, అంతా యిలా పీక్కు-తింటే, యీవూళ్లో వుండడం కూడా కష్టమే"

అని ఒకవిధంగా కోపంగానే తన సామాను తీసుకుని వెళ్ళి పోయాడు.

రమేశు అక్కడనుంచి తిన్నగాయింటికి వచ్చి, గుమ్మంలో కాలు పెట్టాడో లేదో, పెద్దమనిషి ఒకాయన గాబరాతో, వ్రాసుతున్న హుక్కా అవలపెట్టి, లేచి వచ్చి అతని పాదాలకు నమస్కరించాడు. ఆయనలేచి నిల్చుని— "నా పేరు వనమాలిపాండే! నేను మీవూరి స్కూలుకు హెడ్ మాస్టరును. యిప్పటికి రెండు మార్లు వచ్చాను. కాని తమ దర్శనంకాలేదు. అందుకని —" అని అంటుంటే రమేశ్ ఆయన్ని ఆదరపూర్వకంగా కుర్చీలో కూచోమని చెప్పాడు. అందుకాయన నిలుచునే అన్నాడు — "నేను తమ నౌకరును"

ఒకటి ఆయన వయస్సు పెద్దది. పైగా ఒక విద్యాలయపు ప్రధానోపాధ్యాయుడు. ఆయన అతివినయమూ, బెరుకూచూచేసరికి రమే శుని హృదయంలో అనాదరణ కలిగింది. ఆయన కుర్చీలో కూచునేందుకు నిరాకరించి, నిల్చునే, చెప్పడం మొదలుపెట్టాడు —"ఈ చుట్టుప్రక్కల యిదొక్కటే చిన్నబడి. ముఖర్జీ- ఘోషాల్‌ల ప్రయత్నాలవల్ల స్థాపించ బడింది. యిందులో ముప్పది, నలుబదిమంది పిల్లలు చదువుకుంటున్నారు. రెండు మూడుకోసుల దూరంనుంచికూడా పిల్లలు వస్తుంటారు. కొద్దో- గొప్పో గవర్నమెంటువారి సహాయం కూడా లభిస్తుంది. అయినప్పటికీ బడిసాగేటట్లులేదు —"చిన్నప్పుడు తనుకూడా యీ బడిలో చదువుకున్న సంగతి రమేశుకు గుర్తువచ్చింది-" అబడి, తిరిగి కప్పించకుంటే, ఈ వర్షాకాలంలో ఎవరూ లోపల కూచోలేరు. కాని యీ విషయం తరువాత చూడవచ్చు. అంతకన్నా ముఖ్యమైంది, యిటు మూడు నెలలనుంచీ మాష్టర్లకు జీతాలు అందలేదు. అందువల్ల తన యింట్లో తిండితింటూ- యీ పని యెవరూ చేయరు" అని కూడా పాండే చెప్పాడు.

స్కూలు విషయంలో రమేశు చాలా శ్రద్ధ చూపించాడు. ఆయన హెడ్‌మాష్టరుగారిని హాలులోకి తీసుకునివెళ్ళి- అక్కడ ఒకొక్కటే అడిగాడు. ఆ స్కూలుకు నలుగురు ఉపాధ్యాయులు. నలుగురు మాష్టర్లు ఎంతో కష్టపడి చదువు చెప్పినా, ప్రతిసంవత్సరం యిద్దరికంటె ఎక్కువ మైనరుక్లాసులు ప్యాసవడంలేదు. వారిపేర్లు కూడా కంఠతా వప్పగించినట్లు అప్పగించాడు. పిల్లలవద్ద వసూలుచేసే డబ్బుతో క్రింది తరగతి యిద్దరి మాష్టర్లజీతాలు సరిపోతయ్‌! సర్కారుగ్రాంటు ఒక

మాష్టరుకు సరిపోతుంది. ఒక్కమనిషికి మాత్రం పూరంతా చందా ప్రోగు చేస్తుంటారు. ఈ చందా వసూలుచేసే భారం కూడా మాష్టర్లమీదనే వుంది. ఒకొక్కక్కయింటికి, పదిపన్నెండుమార్లు తిరగాల్సి వస్తుంది. యిప్పటికి ఏడుంబావలా వసూలయింది?"

ఈ సంగతులు వినిరమేశు స్థంభించిపోయాడు. అయిదారు పూళ్లకు యిదొక్కటే బడి, ఈ అయిదారు పూళ్ళలో నాలుగు మాసాలు తిరిగి-వసూలైంది ఏడుంబావలా! — "మీకు జీతమెంత?"

"రశీదు మాత్రం యిరవై ఆరు రూపాయలకు యిస్తారు. మాకు ముట్టేది పదహారు పదిహేనులు అణాలు."

ఈ రహస్యం గ్రహించలేక రమేశు అతని ముఖంలోకి చూస్తు న్నాడు. ఆయన మనసును గ్రహించి, మాష్టరుగారు చెప్పారు— "గవర్న మెంటు రూలు అంతే! అందువల్ల యిరవై ఆరురూపాయలకు రశీదు వ్రాసి స్కూళ్ళ డిప్యూటీ యిన్స్పెక్టరుకు చూపించాలి. లేకుంటే గవర్న మెంటు గ్రాంటు ఆగిపోతుంది. అది అందరికీ తెలుసు! మీరు ఏ విద్యార్థిని అడిగినా- నేను చెప్పింది అబద్ధంకాదని తెలుసుకుంటారు."

కొంచెంసేపు మెదలకుండావుండి రమేశు అడిగాడు— "దీనివల్ల మీకు విద్యార్థులలో గౌరవమేముంటుంది?"

మాష్టరుగారు సిగ్గుపడుతూ చెప్పాడు—"మరేం చేయమంటారు రమేశబాబూ? వేణీబాబుగారు అది యివ్వడానికి యిష్టపడడు."

"అయితే ఆయనే దానికి యజమాననుకుంటాను"

మాష్టరుగారు సంకోచంలో పడినమాట వాస్తవమే! అయినా 'కాదు' అని అనలేక మెల్లమెల్లగా — "ఆయన సెక్రటరీ! కాని తన డబ్బు ఒక్క కానీకూడా ఖర్చుపెట్టరు. ఆ....యదుముఖర్జీగారి కూతురు లక్ష్మిలాంటిది. ఆమెగారి దయలేకుంటే ఎప్పుడో బడి ఆగిపోయివుండేది. ఆమెగారు యీ సంవత్సరము కప్పిస్తానని అన్నది. అంతలో ఎందుకో ఆమె చేతిని వెనక్కులాగి సాహాయ్యమంతా ఆపేసింది"అని చెప్పాడు.

రమ విషయం అడిగి తెలుసుకుని చివరకు—"ఆమె తమ్ముడు యీ స్కూలులోనే చదువుతున్నాడు కదూ?" అని అడిగాడు.

"యతీన్ కదండీ! అవును చదువుతున్నాడు"

"సరే మీకు స్కూలు టైమయింది, యిక మీరు వెళ్ళండి. రేపు మీ స్కూలుకు వచ్చిచూస్తాను."

"తమ దయ" అంటూ మాష్టరుగారు వినయంగా రమేశుని కేసి చూస్తూ ఛత్రీ తీసుకుని తలమీద పట్టుకుని వెళ్ళిపోయారు.

# 6

ఆనాటి విశ్వేశ్వరి పని ఆ చుట్టుప్రక్కల పదిగ్రామాల్లో వ్యాపించి పోయింది. వేణీ స్వయంగా ఎవరి ఎదటకూడా కథినంగా మాట్లాడలేదు. అందువల్ల ఆయన వెళ్ళి రమ చిన్నమ్మను పిలుచుకునివచ్చాడు. పూర్వం తక్షకుడనే పాము తన విషంతో ఓ గొప్ప మఱ్ఱివృక్షాన్ని కాల్చి చంపి వేశాడట. ఈ చిన్నమ్మకూడా ఆనాడు ఉదయాన్నే వచ్చి విశ్వేశ్వరిమీద కక్కిన విషం, రక్త-మాంసాదులతో నిండివున్న ఆమె శరీరం, కొయ్య కాదు, పైగా ఆ కాలానికీ, ఈ కాలానికీ అంతరంవుంది కాబట్టి, భస్మం కాలేదు. విశ్వేశ్వరి అవమానమంతా సహించింది. ఎందుకంటే, యిది జరిగింది తన కొడుకువల్లనే? తన నోరు విప్పి ఒక్కమాటకు జవాబు చెప్పినట్లయితే, ముందుగా తన కొడుకుసంగతి బయటపడుతుంది. ఆ విషయం రమేశుని చెవుల్లో పడుతుంది. ఆ భయంతో విశ్వేశ్వరి ఆ కొంచెంసేపూ-కొయ్యలా మారి వూరుకుంది.

కాని గ్రామాల్లోనూ, పల్లెల్లోనూ ఏ సంగతీ దాగదు. రమేశుకూడా విన్నాడు. తన పెద్దమ్మవిషయంలో మొదటినుంచీ అతనికి ఉత్కంఠత గానేవుంది. తనవల్ల తల్లి, కొడుకులిద్దరిమధ్య పోట్లాటలు జరుగుతాయని అతను అనుమానిస్తూనేవున్నాడు. కాని వేణీ బయటమనిషిని పిలిపించి, తనతల్లిని అవమానించడం, తనదృష్టిలో ఎక్కడా చూడలేదు. ఆ తరు వాత ఆ తల్లి కోపానికి అంతులేకపోయింది. యీ సమయంలో తను వెళ్ళి వేణీముఖం ఎదటనే, తల్లిని దూషించినందుకు నాలుగుతిట్టి వద్దామని అను కున్నాడు. ఎందువల్లనంటే తల్లిని యిలా అవమానించినవాడిని అవమా నించడానికి వెనకా ముందూ చూడనక్కరలేదు. కాని అలా చేసి చూపించిన ఆ మనిషితోనే అయిపోతున్నాడు. ఎవరివల్ల పెద్దమ్మ ...

మానసం యింకా ఎక్కువవుతూందేకాని తక్కువగాదు. అనాటు దీను నోటంటా, యీరోజు మాష్టరుగారి మాటలద్వారా రమనుగురించి విన్నం దువల్ల, ఆమెమీద అతనిమనసులో ఒకవిధమైన శ్రద్ధాభక్తులు గలిగినయ్; నాలుగుప్రక్కలా మూఢత్వమూ-కుత్సితమూ వ్యాపించిపోయిన ఆ గ్రామములో ఒక్క పెద్దమ్మ హృదయంలో తప్ప. మిగిన గ్రామమంతా అహంకారమనే అంధకారంలో మునిగివుందనే నమ్మకం కలిగాక, ఈ ముఖర్జీగారింటివేపు చూసినప్పుడుమాత్రం కొంచెం వెలుగు కన్పించ సాగింది. ఆ వెలుగు ఎంత క్షుద్రమైనా—నీచమైనాసరే అతనికి ఆనందం కలిగించింది. కాని యివాళ జరిగిన సంఘటనతో, ఆ భావానికి విరుద్ధంగా అతని మనసంతా, అసహ్యంతో-విరక్తితోనూ నిండిపోయింది. యీ యిద్దరూ, కూతురు—చిన్నమ్మలు కలిసి, వేణీతో కుట్రచేసి అన్యాయం చేసివుంటారని గ్రహించాడు. కాని యీ యిద్దరి స్త్రీలను, వేణీని ఏమని దండించాలా అని ఆలోచించినా - ఏమీ తోచలే దతనికి.

ఈ మధ్యలో యింకొక సంఘటన జరిగింది. ముఖర్జీ-ఘోషాల్ వంశస్తులకు యింకా పంపకంకానికి ఆస్తి కొంతవుంది.ఆచార్యుల యింటి వెనక గుంట అని పిలవబడే చెరువువుంది. అదికూడా యిటువంటి పంపకంకాని ఆస్థే; ఒకా నొకప్పుడు అదిచాలా పెద్ద చెఱువే; కాని మర మ్మత్తు- అవి చేయించనందువల్ల, పూడిపోయి చివరకు చిన్నగుంటలా తయారైంది. మంచి మంచి చేపలను తెచ్చి దానిలో వదలనూవదలరు. అందులో వుండనూ వుండవు. ఏదో మామూలు చేపలు అందులో వాటం తటవే పడుతుంటాయ్; భైరవాచారి వగర్చుకుంటూ వచ్చాడు. బయట చండీమండపంవద్ద ఆ యింటి గుమాస్తా గోపాల్‌సర్కారు కూచుని లెక్కలు వ్రాసుకుంటున్నారు. భైరవాచారి భయపడుతూ— "గోపాల్ సర్కారుగారూ! మీరు మీ మనుష్యుల్ని పంపలేదా? ఆ గుంటలో చేపలు పడుతున్నారు—"అని చెప్పారు.

సర్కారు చెవులసందున కలం యిరికించి తలెత్తి చూసి— "పట్టు కునే దెవరు?" అని అడిగాడు.

"యింకెవరు పట్టుకుంటారు? వేణీబాబు నౌకరు నిల్చుని వున్నాడు. ముఖర్జీగారి హిందుస్తానీ దర్వాను కూడా వున్నాడు. నేను చూసి యిప్పుడే

వస్తున్నాను. మీ మనుష్యులు ఎవరూ లేరు. [illegible]
పంపండి—"

గోపాల్‌సర్కారు పంరంత ఏమీ ప్రకటించలేదు— "బాబు గారు, మాంసం, చేపలు ముట్టుకోరు —"

ఆయన తినకుంటే ఏం? కాని, మనభాగం మనం తీసుకోవాలి—"

"మా అందరికీ తీసుకోవాలనే వుంది. అయినా పెదబాబుగారు బ్రతికివుంటే కావాల్సివుండేది. కాని రమేశబాబు అదొక రకమైన మనిషి!"

ఈ మాటలతో భైరవాచారి ముఖంలో ఆశ్చర్యచిహ్నాలు చూసి, గోపాల్‌సర్కారు నవ్వుతూ చెప్పాడు—"ఆచారిగారూ-యివి ఏవో నాలుగు కుళ్ళిపోయిన చేపలసంగతి! ఆనాడు ఉత్తరవీధిలోని ఆ పెద్ద చింతచెట్టు కొట్టించారు. ఆ రెండిళ్ళవాళ్ళే చెరిసగం పంచుకున్నారు. మాకు ఒక పుల్లకూడా యివ్వలేదు. నేను ఆ వెంటనే వచ్చి బాబుగారితో సంగతంతా చెప్పాను. ఆయన ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు. ఆయన ఒక్కసారి తలెత్తిచూసి నవ్వి—మళ్ళీ పుస్తకం చదవడంలో లీనమయ్యారు. ఏం చేస్తా మంటారని అడిగాను నేను. కాని మా రమేశబాబుగారికి, తలెత్తేందుకే వీలు లేకపోయింది. నేను ఎంతో బ్రతిమిలాడి, ఎన్నో చెప్పాక--ఆయన పుస్తకం మూసి ఆవులిస్తూ—'కట్టెలా? అయితే మన కేమీ చింతచెట్లులేవా?' అని అడిగారు. విన్నారా ఆమాట? 'ఎందుకులేవు? అయినా మనభాగం మనం పంచుకోవాలి! అని చెప్పాను. అప్పుడాయన ఏమన్నాడో చూశారా? 'వెధవ నాలుగు పుల్లలకోసం పోట్లాడలేను' అని."

భైరవుడు చకితుడై-'అరె! మీరనేది నిజమేనా?' అని అన్నాడు.

గోపాల్‌సర్కారు కొంచెం నవ్వి తలూపుతూ-"ఆచార్యులుగారూ! నేను చెప్పేదంతా నిజమే! నేనా రోజునే అంతా గ్రహించాను. ఇప్పుడు మాటిమాటికీ వ్యర్థంగా ఎందుకు చెప్పాలి? ఈ చిన్నయింటి లక్ష్మి తారిణీఘోషాల్‌తోనే అంతర్ధానమైంది" అని అన్నాడు.

భైరవుడు కొంచెంసేపు మెదలకుండావుంది అన్నాడు-"అయినా- ఆగుంట మా యింటివెనక వుంది. అందుకు నేను వచ్చి కబురుపెట్టాలిగా?"

"అటువంటప్పుడు మహారాజా! మీరే వెళ్ళి [illegible] రాత్రిందివళ్లు పుస్తకాలు చదువుతూ కూచుని, భాగస్తులను [illegible]

ఆస్థి సురక్షితంగా వుంటుందా? ముఖర్జీగారి కూతురు ఆడది. ఈ మాటలు విని ఆమెకూడా నవ్వింది. ఒకనాడు ఆమె గోవిందగంగూలీని పిలిచి పరిహాసంచేస్తూ అన్నదట-రమేశబాబును నెలకింత తీసుకుని ఆస్తిని తనకు అప్పగించమని-ఇంతకంటే సిగ్గుపడాల్సిదేముంది?" అని గోపాల్ సర్కారు, ఆ తరువాత తన పనిలో లీనమయాడు.

ఇంట్లో అడదక్షతలేదు. తలుపులన్నీ తెరిచేవున్నయ్! భైరవుడు లోపలికి వెళ్ళాడు. రమేశ్ పడకకుర్చీలో పడుకుని వున్నాడు. రమేశుని కర్తవ్యపథంవేపు తిప్పేందుకు ఉత్తేజితుణ్ని చేయడానికి, ఆస్తిని రక్షించు కునే విషయం ప్రారంభించి, ఈ సంగతి ఎత్తగానే, రమేశు నిద్రపోతూ తుపాకి గుండుదెబ్బ తిన్న పులిలాలేచి గావుకేకపెట్టాడు-"రోజురోజుకూ యిదొక తమాషా చేస్తున్నారే? భజువా?"

తలవని తలంపుగా కలిగిన అతని కోపానికి భైరవాచారి కంగారు పడ్డాడు. తమాషా యెవరిదో అర్థంకాలేదు. భజువ గోరక్‌పూరు నివాసి. రమేశునికి అంతరంగిక బంటు. మంచి బలాఢ్యుడు. విశ్వాసపాత్రుడు. సాములో రమేశుని శిష్యుడు. తను సాము నేర్చుకుని, రమేశు దాన్ని వృద్ధిచేసుకుందామని ఆ విద్య భజువాకు కూడా నేర్పాడు. భజువ రాగానే రమేశు వాడితో చెప్పాడు— "మొత్తం పట్టిన చేపలన్నీ లాక్కొనిరా! ఒకవేళ ఎవడన్నా అడ్డంవస్తే జుట్టుపట్టుకుని యిక్కడకు యీడ్చుకునిరా! అలాకూడా వీలులేకుంటే కనీసం వాళ్ళపళ్ళయినా వూడగొట్టిరా" అని కఠినమైన ఆజ్ఞ యిచ్చాడు.

అదే భజువ కోరుకున్నది. వాడు తన మూనెపట్టిన కర్రకోసం మెదలకుండా లోపలికి వెళ్ళాడు. అది చూచి భైరవుడు భయంతో వణికి పోయాడు. వాడు బెంగాల్‌దేశపు నీరు వంటపట్టినవాడు. అరుపులు, పెడబొబ్బలకు జంకడు. అటువంటి దృఢకాయుడు యజమాని ఆజ్ఞ విని, ఒకసారి తలపంకించి, యింకేమీ మాట్లాడకుండా—కర్రకోసం యింట్లోకి వెళ్ళాడు. ఆ దృశ్యం చూచేసరికి భైరవుని దవడలు పీక్కొని పోయాయ్. మొరగనికుక్క కరుస్తుందని అతనికి గుర్తువచ్చింది. భైరవుడు వాస్తవంగా శుభచింతకుడు.సరైన సమయానికి వెళ్ళి ఏదో నాలుగు దూకలేసి.కొన్ని చేపలు తెచ్చుకుంటారేమో నని చెప్పేందుకు వచ్చాడు. ఇందులో తనూ

కొంచెం సాయపడదామని భైరవుడు వచ్చాడు. కాని ఎక్కడా ఏమీ జరగలేదు. తిట్లకోలికి ఎవరూ పోలేదు. యజమాని కొంచెంగా హుంకరించాడు. నౌకరు నోరు విప్పకుండా, తిన్నగా లాఠీకోసం. లోపలకు వెళ్ళాడు. భైరవుడు చాలా పేదవాడు కోర్టుల కెక్కడం —సాక్ష్యం చెప్పడమంటే అతనికి భయం. యిష్టంకూడా లేదు. కొంచెంసేపట్లో భజువ లాఠీతో బయటకు వచ్చాడు. ముందు వాడు లాఠీని ముద్దు పెట్టుకుని, ఆ తరవాత రమేశుకు నమస్కరించి వెళుతున్నాడు. హఠాత్తుగా భైరవుడు ఏడుస్తూ—రమేశుని రెండుచేతులు పట్టుకుని— "ఒరేయ్ భజువా ఆగరా నాయనా, వెళ్ళద్దు. రమేశుబాబూ క్షమించండి! నేను పేద వాణ్ణి నా ప్రాణాలుకూడా దక్కవు" అన్నాడు.

రమేశు కోపంతో చేతులు విదుల్చుకున్నాడు. అతని ఆశ్చర్యానికి అంతు లేదు. భజువ తిరిగివచ్చి నిశ్చేష్టుడై నిలుచున్నాడు. భైరవుడు రుద్ధకంఠంతో "నాయనా! ఈ సంగతి దాగదు. పేటీవాళ్ళకు కోపంవస్తే ఒక్కనాటికీ బ్రతకను. నా యిల్లూ వాకిలీ కాల్చిపారేస్తారు, అప్పుడు ఆ విష్ణు, మహేశ్వరుడు కూడా నన్ను రక్షించలేరు!" అని చెప్పాడు.

రమేశు తమాయించుకొని, నిశ్శబ్దంగా నిలుచునివున్నాడు. ఈ గోల విని, గోపాల్‌సర్కారు లెక్కలు వదిలి అక్కడికివచ్చి నెమ్మదిగా చెప్పాడు—"అవును నాయనా! యితను అన్నది నిజమే."

రమేశు జవాబేమీ చెప్పలేదు. చేతితో భజువను లోపలకు వెళ్ళమని చూపించాడు. తాను మెదలకుండా లోపలికి వెళ్ళాడు. అతని హృదయంలో భైరవుని భయమూ, పిరికిమాటలూ, ఎంతగా కలవరపెట్టాయో, అది అంతర్యామికే తెలుసు.

## 7

"ఏరా యతీన్-ఆడుకుంటున్నావేం? స్కూలుకు వెళ్ళవా యేం?"

"మాకు యివాళ రేపు సెలవులు అక్కయ్యా"

ఈమాట విని రమ చిన్నమ్మ తన కుత్సితముఖాన్ని - యింకా వికృతంగాపెట్టి అన్నది-"మండినట్లే వుందిలే ఆ స్కూలు. నెలకు పదిహేను రోజులు సెలవు. అయినప్పటికీ నువ్వు దానికి బోలెడు డబ్బు తగలేస్తున్నావు. నేనైతే నిప్పుపెట్టేదాన్ని."

ఆమాట అని ఆమె తన పనికి వెళ్ళిపోయింది. ఎవరైతే రమ చిన్నమ్మను పనహారుఅణాల మిథ్యావాది అని అంటారో వాళ్లు పొరపాటు పడ్డారని చెప్పవచ్చు. ఆమె యిటువంటివే ఒకటీ రెండూ నిజమైన సంగతులుకూడా చెప్పుతూండేది. అవసరంవచ్చినప్పుడు ఆ సంగతులు యితరులముందు చెప్పేందుకుకూడా వెనుకాడేది కాదు.

రమ తమ్ముణ్ని దగ్గరకు లాక్కుని అడిగింది-"ఏరా. యతీన్! సెలవు యెందుకురా?"

యతీంద్రుడు తన అక్కగారి వొడిదగ్గరలో నిలుచుని చెప్పాడు- "మా స్కూలును కప్పిస్తున్నారక్కయ్యా? ఆ తరువాత సున్నంకూడా వేస్తారట. ఎన్నో పుస్తకాలు వచ్చినయ్. అయిదారు కుర్చీలు, టేబులు, పెద్ద బీరువా, ఓగడియారం కూడా వచ్చింది. అక్కయ్యా! ఒకనాడు వచ్చి చూడరాదూ?"

రమ చతురాలై అన్నది —'యిదంతా నిజమేరా?'

"అవు నక్కయ్యా! నిజమే! రమేశబాబు వచ్చాడు. ఆయనే యివన్నీ తెప్పించాడట —"

ఆతరువాత యింకా అతనేదో చెప్పబోతున్నాడు. ఎదురుగా చిన్నమ్మ రావడంచూసి, రమ తమ్ముని తీసుకుని తనగదిలోకి వెళ్ళిపోయింది. ఆమె అతన్ని దగ్గర కూచోబెట్టుకుని. అతన్ని అడిగి రమేశుని, స్కూలు విషయం అన్నీ ఒకొక్కటే తెలుసుకుంది. ఆయన ప్రతిరోజూ వచ్చి, గంటా, రెండుగంటలు పిల్లలకు చదువు చెపుతుంటాడనికూడా విన్నది. ఆ తరువాత హఠాత్తుగా అడిగింది —"అయితే యతీన్! ఆయన నిన్ను గుర్తించాడురా!"

తలుపుతూ అతను — "ఆ........" అన్నాడు.

"నువ్వు ఆయన్ను ఏమని పిలుస్తున్నావు ?"

యతీంద్రుడు కొంచెం కష్టంలో పడ్డాడు. ఎందుకంటే యింకా అంతవరకూ పోలేదు సంగతి సందర్భాలు. పైగా ఆయన స్కూలులోకి, రాగానే దుర్దాండ ప్రతాపుడైన హెడ్మాస్టరుగారు కూడా కుర్చీలోంచి లేచి ఒక ప్రక్కగా నిలుచుంటాడు. అదిచూసి విద్యార్థులకు భయం ఆశ్చర్యం కూడా కలిగేది. ఆయన్ని పిలవడం అటువుంచి, ఆయనవేపు

కన్నెత్తికూడా చూడకపోకపోయేవాడు. అక్కడగ్గర యీ సంగతి ఒప్పు కోవటం కూడా సహజంగాదు. సూటిగింతా అడుగున్న "చినబాబుగారు" అని పిలవడం విద్యార్థులంతా విన్నారు. అందువల్ల యతీంద్రుడు కొంచెం బుద్ధి నుపయోగించి చెప్పాడు — "చినబాబుగారు — అని పిలుస్తాను —"

కానీ వాడిముఖంలోని భావంచూసి రమ అంతా గ్రహించింది. ఆమె తమ్ముని యింకా తన దగ్గరకు వొడిలోనికి తీసుకుని నవ్వుతూ— "చినబాబుగా రెందు కవుతారురా? అతను నీకు అన్నయ్య అవుతాడు. ఏవిధంగా వేణీబాబును పెద్దన్నయ్యా అని పిలుస్తుంటావో—అదే విధంగా ఆయన్ని చిన్నన్నయ్యా అని ఎందుకు పిలవగూడదు?" అని అడిగింది.

ఆ పిల్లవాడు విస్మయానందాలతో విస్మితుడై — "అయితే ఆయన నాకు అన్నయ్య అవుతాడా? నిజమేనా అక్కా....?" అడిగాడు.

"అవును: అన్నయ్య అవుతాడు"

అని రమ కొంచెం నవ్వింది. కాని యతీంద్రుని ఆపడం కష్టమై పోయింది. ఎంత తొందరగా వీలయితే, అంత తొందరగా యీ సంగతి తన స్నేహితులకు చెప్పాలని ఉబలాటం కలిగింది. కాని బడిసెలవు. ఈ రెండురోజులు ఎలాగైనా ధైర్యంతో వోపికగా వుండాలి. అయినప్ప టికీ ఆ చుట్టు ప్రక్కల పిల్లలకుచెప్పకుండా యెలా వుండగలడు? బయ టికి వెళ్ళాలని తంటాలు పడుతూ— "అయితే యిక వెళ్ళ మంటావా అక్కయ్యా?" అని అడిగాడు.

"యిప్పు డెక్కడికి వెళతావు?" అని రమ అడిగింది. అందువల్ల యింతముఖం చేసుకుని, మెదలకుండా కొంచెం సేపుండి—"మరి యింత కాలం యెక్కడున్నారు—?" అని అడిగాడు.

"యింతకాలం చదువుకునేందుకు పరదేశం వెళ్ళాడు. నువ్వు పెద్ద వాడివయాక, అలానే పరదేశం వెళ్ళి చదువుకోవాలి. నువ్వు నన్ను వదలి యింకొక దేశంలో వుండగలవా యతీన్?"

ఈ మాట అని ఆమె తమ్ముణ్ణి కౌగిలిలోకి తీసుకుంది. యతీన్ చిన్నవాడైనప్పటికీ అక్కగారి కంఠస్వరంలోని పరివర్తనం గమనించి ఆశ్చర్యపూర్వకంగా ఆమెముఖంలోకి చూస్తూవుండిపోయాడు. రమ తన తమ్ముణ్ణి ప్రాణాలతోసమానంగా ప్రేమిస్తుంది. అయినప్పటికీ, ఆమె

మాటల్లోకాని చేతల్లోకాని యింత ఆవేగమైన ఉచ్ఛ్వాసనిశ్వాసము యింతకు ముందెప్పుడూ చూడలేదు.

"అక్కయ్యా! చిన్నన్నయ్య చదువంతా పూర్తయిందా?"

ప్రేమపూర్వకంగానే - "అవును! చదువంతా పూర్తిచేసుకునే వచ్చారు" చెప్పింది.

"నీ కెలా తెలిసింది?"

అందుకు జవాబుగా ఓ చల్లని నిట్టూర్పు విడిచి రమ తలూపింది. వాస్తవంగా యీ విషయంలో ఆమెకుగాని, యీ వూళ్లోవాళ్ళకుగాని ఏమీ తెలియదు. తను అనుకున్నది నిజమో కాదోకూడా తెలియదు. అయి నప్పటికికూడా, యితర పిల్లలకు చదువుచెప్పేందుకు యింత శ్రద్ధ కనుపరిచిన వ్యక్తి సామాన్యుడు కాడనిమాత్రం గ్రహించింది.

యతీంద్రుడు ఆ విషయంలో ఏమీ ప్రశ్నించలేదు. యీ మధ్యలో అతనికి ఒక ప్రశ్నతట్టింది. చటుక్కున అడిగాడు—"ఏం అక్కయ్యా! చిన్నన్నయ్య రోజూ వస్తుంటాడుగా?"

ఈ ప్రశ్న ఆమెకు తీవ్రమైన బాధ కలిగించింది. శరీరానికి విద్యుత్ ప్రసారం సోకినట్లయింది. అయినప్పటికీ ఆమె నవ్వుతూ—"అతన్ని నువ్వు ఎందుకని తీసుకుని రాగూడదు"? అని అడిగింది.

'అయితే వెళ్ళమంటావా అక్కయ్యా—?' అంటూ వెంటనే లేచి నిలుచున్నాడు.

'సరే! నువ్వు వట్టి పిచ్చివాడివిరా—!' రమ తన భయ వ్యాకులమైన చేతులతో అతన్ని పట్టుకుంది. అతన్ని హృదయానికి హత్తుకుంటూ అన్నది— 'యతీంద్ర్ కొంపతీసి ఆ పనిమాత్రం చేశేవ్?'

యతీంద్రుడు చిన్నవాడే: అయినప్పటికీ, అక్కగారి గుండె వేగంగా కొట్టుకోడం గమనించాడు. ఆశ్చర్యంగా ఆమె ముఖంలోకి చూస్తూన్నాడు. ఒకటి, ఆమె యిలా చలించిపోవడం, రెండోది, చినబాబుగారు చిన్నన్నయ్య అవుతాడని చెప్పగా విని, మనసులో సంతోషం కలిగింది. మరటువంటప్పుడు, అక్కయ్యగారు తన నెందు కింత ఝుదిగా భయపెడుతుందో అర్ధం కాలేదా చిన్నబుర్రకు. అదే సమయంలో చిన్నమ్మ పిలుపు విని, యతీంద్రుని విడిచిపెట్టి రమ లేచి నిల్చుంది.

కొంచెం సేపట్లో చిన్నమ్మ వాకిట్లోకి వచ్చి "అరే! నువ్వు నదికి స్నానా
నికి వెళ్ళావను కున్నాను. యివాళ ఏకాదశి కదూ? యింత ప్రొద్దెక్కినా
యింకా తల తడపకుండా వుంటావా? చూడు ముఖమంతా వాడి ఎలా
నల్లబడిందో—' అన్నది.

రమ కొంచెం గట్టిగా నవ్వి అన్నది—"నేను వస్తానుతే నువ్వు
పద చిన్నమ్మా?"

"ఇంకా ఎప్పుడు వచ్చేది? బయటికి వచ్చిచూడు. భాగాలు పంచ
డానికి వేణీ చేపలు పట్టించుకుని వచ్చాడు "

చేపలమాట వినగానే యతీంద్రుడు అక్కడనుంచి పారిపోయాడు.
రమ చిన్నమ్మకు కనపడకుండా, పై టకొంగుతో ముఖమంతా ఒక్కసారి
తుడుచుకుని ఆమె వెనకనే బయటకు వచ్చింది. అంగనంలో మహా
కోలాహలంగావుంది. పట్టుకున్న చేపలు తక్కువకావు. ఓ పెద్ద గంప
నిండా వున్నయ్! వాటిని పంచడానికి స్వయంగా వేణీబాబు అక్కడికి
వచ్చాడు. ఆ వీధిలోని పిల్లలంతా అక్కడచేరి గోలచేస్తున్నారు.

ఇంతలో ఎవరో దగ్గుతుండడం వినిపించింది. ఆ వెంటనే ధర్మ
దాసు చేతికర్ర వూతతో వస్తూ—'వేణీ, యివాళ చేపలు పట్టారాయేం?'
అన్నాడు.

వేణీ ముఖంమార్చుకుని-"ఏమంత ఎక్కువ పట్టలేదు" అంటూ
పల్లెవాళ్ళను పిలిచి "ఎందుకింకా ఆలస్యం, తొందరగా రెండు భాగాలు
చేయండి" అన్నారు.

పల్లెవాళ్లు భాగాలువేస్తున్నారు. ఇంతలో గోవిందగంగూలి అక్క
డికి వచ్చి "ఏమిటిదంతా రమా! నేనిటువేపురాక చాలారోజులైంది. నిన్ను
ఒకసారి చూసి మాట్లాడించి వెళదామని వచ్చాను" అన్నాడు.

"రాండి" అని రమ పల్కరించింది.

"ఏమిటి గుంపు?" అంటూ గంగూలి ఆ వెంటనే ఆశ్చర్యం
ప్రకటిస్తూ "ఓ అదా సంగతి? చేపలు తక్కువ పడినట్లుందే! పెద్ద చెరు
వులో వలవేసినట్లున్నారే!" అన్నాడు.

ఈ ప్రశ్న లన్నిటికి జవాబుచెప్పడం నిరర్థకమని అక్కడున్న
వాళ్ళంతా అనుకున్నారు. అందరూ చేపలను పంచుతున్నారు. కొంచెం

సేపట్లో ఆ పని పూర్తయింది. వేణీ ఓనపంతు చేపలన్నిటినీ నౌకరు నెత్తికెత్తి, పల్లెవాళ్ళకు ఏదో సైగచేసి వెళ్ళిపోయున్నాడు. ముఖర్జీవారికి ఎక్కువ అవసరంలేదు. అందువల్ల రమ తన భాగానికి వచ్చిన చేపలలో అక్కడున్న అందరకూ యోగ్యతలనుబట్టి తలోకొంచెం పంచింది. వాళ్లకూడా యిళ్ళకు వెళ్ళబోతున్నారు. ఇంతలో రమేశు హిందూస్థాని నౌకరు తన నిలువెత్తు కర్రతోసహా అంగనంలోకి రాగానే అందరూ ఆశ్చర్యచకితులయారు. వీడి ముఖం చూసి ఆ జన్మాంతం మరిచిపోయేవాళ్లండరు. అంత భీషణంగా వుంటుం దా ముఖం. వూళ్లో చిన్నా-పెద్దా అందరూ వాడిని గుర్తుపట్టగలరు, అంతేగాదు. వీణ్ణిగురించి రకరకాల కథలు మొదలుపెట్టారు. ఇంతమందిలో రమే యజమానురాలని ఎలా గుర్తించాడో అదివాడికే తెలుసు! వాడు అల్లంత దూరంనుంచే 'అమ్మగారూ!' అనిపెద్దసలాంచేసి, దగ్గరకువచ్చి నిల్చున్నాడు. వాడిముఖం యెలావున్నా—కంఠస్వరంమాత్రం భీకరంగావుంది. వాడు యింకొకసారి సలాంచేసి -- బెంగాలీ — హిందూస్థానీ భాషను కలగాపులగంగాచేసి తాను రమేశబాబు నౌకరునని, చేపల్లో మూడోభాగం పట్టుకుని వెళ్ళేందుకు వచ్చానని, చెప్పాడు. రమ విస్మయంతో నైతేనేం—వాడి ప్రశ్నలకు జవాబు ఆలోచిస్తుండడం వల్ల నైతేనేం —తొందరగా వాడికి జవాబు చెప్పలేకపోయింది. భజువ చటుక్కున వెనకకు తలత్రిప్పి వేణీనౌకరుతో—'అరేయ్! ఇప్పుడు వెళ్ళవద్దు' అని పెద్దగొంతుకతో అన్నాడు.

భయంతో నౌకరు నాలుగడుగులు వెనక్కువచ్చి నిలుచున్నాడు. అరనిముషంవరకూ ఎవరినోటంటా మాటలేదు. ఆ సమయంలో వేణీబాబు కొంచెం సాహసించి అన్నాడు—'ఏం భాగం?'

భజువ ఆయనకు కూడా సలాంపెట్టి వినయంగా – 'బాబుగారూ! మిమ్మల్ని అడగలేదు" అన్నాడు. రమ చిన్నమ్మ వరండాలోంచే అన్నది "ఏరా! కొడతావా యేమిటి?"

ముందు భజువ కొంచెంసేపటివరకూ చిన్నమ్మవేపు చూశాడు. ఆ మరుక్షణంలో యిల్లంతా అదిరిపోయేట్లు నవ్వాడు. కొంచెంసేపయాక నవ్వు ఆపుకుని, కొంచెం సిగ్గుపడి, రమువేపు [illegible] [illegible] — [illegible] గారు!'

భజావ మాటల్లోనూ, వ్యవహారంలోనూ ఎక్కువ వినయం వున్నప్పటికీ నిర్లక్ష్యం వుండడం గమనించింది. ఆ సంగతి పూహించి రమ కోపంతో—'మీ బాబుగారికి ఏంకావాలి?' అన్నది.

ఆమె కోపంచూసి, భజావ క్రుంగిపోయాడు. అందువల్ల రన కర్కశకంఠాన్ని సాధ్యమైనంతవరకు కోమలంగాచేసి తనప్రార్థన తిరిగి చెప్పాడు. కాని చెప్పినంత మాత్రాన లాభమేమిటి? పంపకం పూర్తయింది. యింతమందిలో రమకు చిన్నపోవడం యిష్టంలేదు. అందువల్ల ఆమె కఠినంగా చెప్పింది. "మీ బాబుగారికి ఈ చేపల్లో భాగంలేదు, వెళ్ళి చెప్పు. చేతనైతే పనిచేసుకోమనిచెప్పు."

"సరే అలాగే అమ్మగారూ!" అంటూ వేణీనొకరును వెళ్ళమని సౌంజ్ఞచేసి, ఏమీ మాట్లాడకుండా తానుకూడా వెళ్ళడానికి తయారయాడు. వెళ్ళిపోతున్నవాడల్లా తిరిగిరావడంచూసి అక్కడున్నవాళ్ళందరి ఆశ్చర్యానికి అంతులేకపోయింది, వాడు మళ్ళీ రమకేసి తిరిగి చూసి—సలాం చేసి, బెంగాలీ, హిందూస్తానీభాష కలగాపులగంగాచేసి "అమ్మగారూ! అందరూ చెప్పగా విని, చెఱువుదనే చేపలు లాక్కొని రమ్మని బాబుగారు చెప్పారు. మా బాబుగారు మాంసం, చేపలు ముట్టుకోరు. నేనుకూడా తినను, కానీ...." అని వక్షస్థలంమీద చేయిపెట్టుకుని— "బాబుగారి హుకుంవల్ల యివాళ చెఱువుదగ్గరే యీ ప్రాణాన్ని విడిచేవాణ్ణి, కానీ రాముడు రక్షించాడు. బాబుగారి కోపం తగ్గిపోయింది. ఆయన నన్ను పిలిచి చెప్పారు. "భజావా, నువెళ్ళి చెఱువులో మనకు భాగముందో లేదో అమ్మగారిని అడిగిరా" అంటూ లాఠీతోసహా చేతులెత్తి నమస్కరించి-'భజావా! ఎవరేమన్నా-అమ్మగారి నోటితో అబద్ధం చెప్పరని నాకు నమ్మకం. ఆమె పరాయివస్తువు ముట్టుకోదు.' అనికూడా చెప్పారమ్మా-" అని ఎంతో వినయంగా వెళ్ళిపోయాడు.

వాడు వెళ్ళిపోగానే వేణీ ఎగిరిగంతేసి, ఆడంగిగొంతుతో— "అంతే— యిలానే వాడు ఆస్తిని సంరక్షించుకుంటాడు. మీ అందరి ఎదట చెప్పుతున్నాను. యివాళనుంచి వాడికి చెఱువులో ఓ చేప పిల్లను కూడా దక్కనీయను. రమా! తెలిసిందా?" అంటూ పకపక నవ్వాడు.

కాని యీ మాటలు రమ చెవుల్లోకి పోలేదు. మాటి మాటికీ, భజూవ అన్నమాటలు చెవుల్లో గింగిర్లాడుతున్నయ్. 'అమ్మగారి నోటి నుంచి అబద్ధ మెన్నడూరాదు.' ఆమె ముఖం తెల్లపడిపోయింది. నెత్తురు చుక్కన్నా ఆముఖంలోలేదు। ఈ ముఖంమీద యెవరిచూపులు పడ కూడదని మాత్రం ఆమెకు గుర్తుంది. అందుచేత తలమీదున్న ముసుగు యింకొంచెం ముందుకు లాగుకొని, తొందరగా యింట్లోకి వెళ్ళి పోయింది.

# 8

"పెద్దమ్మా!"

"ఎవరూ? రమేశ్? రా నాయనా! లోపలికి రా."

విశ్వేశ్వరి తొందరగా ఒకచాప పరిచింది. లోపలికి అడుగుపెడు తూనే రమేశ్ త్రుళ్ళిపడ్డాడు. ఎందుకంటే తన పెద్దమ్మదగ్గర కూచుని వున్న స్త్రీముఖం తను చూడకపోయినా రమ అని గ్రహించాడు. ఆయ నకు కోపంవచ్చింది, వీళ్ళంతా కలిసి, పెద్దమ్మను అవమానించేందుకు ప్రయత్నించారు. అవమానించారుకూడా! అయినప్పటికీ యిప్పుడు సిగ్గులేకుండా ఏకాంతంగా పెద్దమ్మ దగ్గరకు వచ్చి మాట్లాడుతోంది. ఇటు రమేశు హఠాత్తుగా రావడం చూసేసరికి రమకూడా యిరుకున పడింది. యిందుకుకారణం ఆమె కేవలం పల్లెటూరిపిల్లకావడమే కాదు. రమేశుకూ ఆమెకూవున్న సంబంధంకూడా చిత్రమైనది. ఆమె రమేశుని ఎదట అపరిచితునిలా, తలమీద ముసుగువేసుకునేందుకుకూడా సిగ్గు కలిగేది. ముసుగువేసుకోకుండా వుండలేకపోయేది. అంతేకాదు. చేపల కోసం ఆనాడు పోట్లాట జరిగింది, అందువల్ల అన్నివిషయాలనూ, తలచుకుని, వీలైనంతవరకు చాటున కూచుంది. రమేశుడు ఆమెవేపు చూడలేదు. అసలు గదిలో యింకొకమనిషి వున్నట్లుకూడా తలచలేదు. ఆ చాపమీద కూచున్నాడు.

"ఏరా రమేశ్, యింతమధ్యాహ్నపువేళ వచ్చావేం?"

మధ్యాహ్నం రాకుంటే, యిక నీ వద్దకూచునేందుకు వీలుఎక్కడ చిక్కుతుంది? నీకు పనులేమీ తక్కువ వుండవు"

పెద్దమ్మ ఆమాటకు ప్రతివాదంచేయలేదు. కానీ చిరునవ్వుమాత్రం నవ్వి వూరుకుంది. రమేశ్ నవ్వుతూ- "చాలాకాలం క్రిందట, నేను చిన్నవాడినిగా వున్నప్పుడు నీ వద్ద సెలవుపుచ్చుకునేందుకు వచ్చాను. యిప్పుడు తిరిగి సెలవుపుచ్చుకునేందుకు వచ్చాను. ఇదే నా ఆఖరి సెల వనుకుంటాను పెద్దమ్మా?" అన్నాడు.

రమేశుని పెదిమలమీద చిరునవ్వువున్నా, అతని కంఠస్వరం లోని బరువునూ, హృదయంలోని బాధను అక్కడున్న యిద్దరూ చూసి, విస్మయంతో త్రుళ్ళిపడ్డారు.

"నువ్వు చిరంజీవిగావుండాలి నాయనా! ఏమిటి నువ్వంటున్నది?" విశ్వేశ్వరి కళ్ళల్లో నీళ్ళు కనుపించినయ్!

రమేశ్ కొంచెం నవ్వాడు. విశ్వేశ్వరి—"ఏం నాయనా! నీకు యిక్కడ శరీరం బాగా వుండడంలేదా?" అని అడిగింది.

బాగాబలిసి, కండలుతీరిన తన శరీరంవేపు ఒకటి రెండుసార్లు చూసుకుని చెప్పాడు—"పెద్దమ్మా! యిది పశమటిదేశపు రొట్టెతో— పప్పుతో పెరిగిన శరీరం. యిది అంతతొందరగా చెడిపోతుందా? కాదు. నా శరీరం చాలాబాగానేవుంది. కాని యిక యిక్కడ ఒక్కక్షణం కూడా వుండలేను. నా కేమిటో ప్రాణమంతా సుడిపడినట్లుంది."

రమేశుని శరీరంలో బాగానే వుందని తెలుసుకున్నాక పెద్దమ్మకు ధైర్యం కలిగింది. ఆమె నిశ్చింతగా అడిగింది—"ఇది నీ జన్మభూమి నాయనా! అటువంటప్పుడు నువ్వు యిక్క డెందుకుండవు?"

రమేశ్ తలూపి—"ఆసంగతి నేను చెప్పను పెద్దమ్మా! నీ కంతా తెలుసనుకుంటాను" అన్నాడు.

విశ్వేశ్వరి కొంచెసేపు మెదలకుండా వుంది. ఆ తరువాత గంభీ రంగా అన్నది—"అంతాకాదు. అయినా కొంతవరకు తెలుసు! కానీ రమేశ్! అందువల్లనే నువ్విక్కడ వుండకుంటే జరగదంటున్నాను."

"యెందుకు పెద్దమ్మా! ఎందుకని జరగదు? యిక్క డెవరూ నన్ను కోరడంలేదుగా?"

"ఎవరూ కోరడంలేదుకాబట్టే, నేను నిన్ను వెళ్ళనీయ నంటు న్నాను. హిందుస్తానీ రొట్టె, పప్పుతో పెంచిన నీ శరీరం పారి పోయేందుకేనా?"

రమేశ్ మాట్లాడలేదు. ఇవాళ అతనికి యీ పూరంటే ఎందుకంత మంటగావుందో, అందుకు ఒక కారణం వుంది. గ్రామమునుంచి తిన్నగా స్టేషన్‌కువెళ్లే రోడ్డు—పదిపన్నెండు సంవత్సరాలక్రితం వర్షాలవల్ల ఒక చోట గండిపడింది. అప్పటినుంచీ ఆ గండి రానురాను పెద్దదైపోయింది. అక్కడ నీళ్లుకూడా నిలిచివుంటయ్! దాన్ని దాటాలంటే అందరికీ కష్టంగానే వుంది. కొంతకాలం ఎలాగో జాగ్రత్తగా దాటేవాళ్లు. కాని వర్షాకాలంలో ఆ గ్రామస్థుల యిబ్బందికి లెక్కలేదు. ఒక్కొక్కసంవత్సరం దానిమీద బొంగులువేసి, మరొక సంవత్సరం తాడిబొందవేసి, ఏదోవిధంగా, కొందరు పడుతూ—కాళ్ళు విరగ్గొట్టుకుంటూ కాలం వెళ్ళదీసేవాళ్ళు. యింతకష్టపడుతున్నా గ్రామస్థులు దాన్ని బాగుచేయిద్దామని ప్రయత్నించలేదు. అది మరామ్మత్తు చేయడానికి కొంత డబ్బు అవుసరం. ఈ డబ్బు రమేశు తన స్వంతం ఖర్చుపెట్టకుండా—చందా వసూలుచేద్దామని, పదిరోజులనుంచి గ్రామమంతా తిరిగాడు. కాని పది కానులుకూడా వసూలుచేయలేకపోయాడు. అంతేకాదు, యీ రోజుకూడా చందాకోసం బయలుదేరి తిరిగి వస్తున్నప్పుడు దారిలో, ఒక కోమటి దుకాణంలో కొంతమంది యీ విషయంలోనే మాట్లాడుకుంటున్నారు. బయటనిలుచుని వింటున్నాడు, ఎవరో ఒక మనిషి యింకొకమనిషితో నవ్వుతూ అంటున్నాడు.—మీరంతా పక్కదమ్మిడీకూడా యివ్వవద్దు. దాని మరామ్మత్తు ఎక్కువగా అతనికే అవసరం ఒకళ్లేనా మీరివ్వకుంటే తనస్వంతడబ్బుతోనే బాగుచేయిస్తాడు. బూట్లుతొడుక్కుని 'చటచట నడుస్తుంటాడుకదూ? ఇంతకాలంనుంచీ ఆయన యిక్కడలేడు. అయినా మనం స్టేషన్‌కు వెళ్ళడం ఆగిపోయిందా?"

ఇంకెవరో మనిషి అంటున్నాడు. "అరే కొంచెం ఓపికపట్టవోయ్! రమేశు నెత్తినచేతులుపెట్టి అమ్మవారిగుడికూడా బాగుచేయించాలని ఛటర్జీగారన్నారు, ఆయన్ని కొంచెం పొగిడామంటే చాలు....పని జరిగిపోయిందన్నమాటే?"

ఈ రెండువిషయాలు, రమేశుని హృదయంలో మంటపుట్టించి నయ్! పెద్దమ్మకూడా అదేవిషయం ఎత్తి గాయాన్ని మరింత రేపింది,—
"నువ్వు ఆదారి బాగుచేయించే విషయం ఏంచేశావు?"

రమేశు విసుక్కుంటూ చెప్పాడు—"ఇంక దారి బాగుపడదు. ఒక్కదమ్మిడీ చందా ఎవడూ యివ్వలేదు—"

విశ్వేశ్వరి నవ్వి అన్నది—"యివ్వరు అంటే పనెల్లా జరుగుతుంది? మీ నాన్న నీకు చాలా డబ్బు యిచ్చి వెళ్ళాడు. ఈ కొద్ది రూపాయలు నువ్వొక్కడివే యివ్వగలవు—"

రమేశు మండిపడుతూ చెప్పాడు—"నేనెందుకు యివ్వాలి? సంగతి సందర్భాలు తెలుసుకోకుండా, యిప్పటికే వీళ్ళ స్కూలుకు చాలా డబ్బు పాడుచేశాను. అందుకు నాకు చాలా కష్టంగావుంది. యీ గ్రామములోని మనిషన్నవాడికి ఏమీ సాహాయ్యం చేయకూడదు" అని మళ్ళీ రమవేపు చూసి...."వీళ్ళకు కొంచెం ధర్మంచేశామంటే, మనల్ని మూర్ఖుని క్రింద జమకడతారు, వీళ్ళకు మేలుచేస్తే—అందులో ఏదో స్వార్థముందంటారు. వీళ్ళను క్షమించడంకూడా మహాపాపమే! ధైర్యంలేక వెనక్కు తగ్గిపోయా డంటారు—"

పెద్దమ్మ బాగానవ్వింది. కాని రమముఖం ఎఱ్ఱబడింది. రమేశు కోపంతో అడిగాడు—"నవ్వుతా వెందుకు పెద్దమ్మా?"

"నవ్వకుంటే ఏం చెయ్యమంటావు నాయనా?" ఒక్కనిట్టూర్పు విడిచి...."కాని, నువ్విక్కడ వుండడమే ముఖ్యమని నే నంటాను. రమేశ్! కోపంతో జన్మభూమిని వదిలిపెట్టి వెళదామనుకుంటున్నావా? అయినా నువ్వు కోపించదగ్గమనుష్యులు యిక్క డెవరున్నారు?" అని కొంచెంసేపుండి తనలో తను అనుకున్నట్లుగానే అన్నది—రమేశ్!" వీళ్లు ఎంత బీదవాళ్ళో—ఎంత దుర్బలులో నువ్వు గ్రహించినట్లయితే, నువ్వే సిగ్గుపడేవాడివి నాయనా! భగవంతుడు దయదలచి, నిన్నిక్కడకు పంపించాడు. అటువంటప్పుడు నువ్వు వెళ్ళి మధ్యనే వుండాలి—"

"కాని పెద్దమ్మా! వీళ్లు నన్ను కావాలనడంలేదు."

"అటువంటప్పుడు, నువ్వు అభిమానం చూపడానికి వీళ్ళెంత అయోగ్యులో నీకు తెలవడం లేదా? యిదేకాదు. నువ్వు ఏ గ్రామమైనా

తిరిగిరా! ఎక్కడ చూసినా యిదే పరిస్థితి" అని ఆమె రమవేపు తిరిగి–
"నువ్వు యిందాకటినుంచీ తలొంచుకొనే కూచున్నావేమ్మా? ఏం రమేశ్,
మీ యిద్దరన్నాచెల్లెళ్ళు మాట్లాడుకోరా? అమ్మాయీ—అలాకాదు. వీడి
తండ్రితో మీకున్న పోట్లాటలన్నీ ఆయనతోనే అంతరించిపోయినయ్.
మీరిద్దరింకా వాటిని పట్టుకుని మనఃస్పరలు పెట్టుకోవడం మంచిది
కాదు," అని అన్నది.

రమ తలొంచుకొనే అన్నది—"నేనెమీ మనస్పర్థలు పెట్టుకో
వాలనుకోవడంలేదు పెద్దమ్మా-రమేశ్ అ........"

అకస్మాత్తుగా రమకోమలస్వరాన్ని రమేశుని గంభీర కంఠ
స్వరం వినబడకుండాచేసింది. ఆయనలేచి నిలుచుని—పెద్దమ్మా-నువ్వు
వీళ్ళమధ్యలో పడవద్దు. ఆనాడు యీమెగారి చిన్నమ్మచేతుల్లోంచి
ఎలాగో ప్రాణాలు రక్షించుకున్నావు, యివాళ యీసంగతి తెలిసిందంటే
ఆవిడ నిన్ను నమిలిగాని వదలదు." ఆ తరువాత వాద-ప్రతివాదాలకు
ఎదురు చూడకుండానే గబగబా బయటికి వెళ్ళిపోయాడు.

విశ్వేశ్వరి అతన్ని పిలిచి అన్నది—"వెళ్ళకు రమేశ్! ఒకమాట
విని వెళ్ళు."

రమేశు తలుపుబయటినుంచే జవాబు యిచ్చాడు—"కాదుపెద్దమ్మా!
ఎవరైతే అహంకారంతో నిన్నుకూడా కాళ్ళతోమట్టాలని చూశారో-
వాళ్ళ తరపున నువ్వేమీ మాట్లాడవద్దు." అని యిక విశ్వేశ్వరి రెండవ
సారి బ్రతిమిలాడకముందే వెళ్ళిపోయాడు. రమ విహ్వాలంగా కొంచెం
సేపు విశ్వేశ్వరిముఖంలోకి చూసి ఏడ్చింది—"పెద్దమ్మా! చివరకు యీ
కళంకం నామీద ఎందుకని మోపుతున్నారు? అయితే చిన్నమ్మకు నేను
చెప్పివంపానా? అందుకు, నేనే బాధ్యురాలినా?"

పెద్దమ్మ రమచేతుల్ని తనచేతుల్లోకి, తీసుకుని, స్నేహపూర్వ
కంగా తన వద్దకు లాక్కుని—"నువ్వు నేర్పనిమాట నిజమే! కాని,
చిన్నమ్మమాటలకు కొంత బాధ్యత నీకూ వుంది రమా—"అని చెప్పింది.

రమ తన రెండోచేతితో కళ్ళు తుడుచుకుని, అభిమానంతో—
పెద్దమ్మ మాట వొప్పుకోకుండా—"నేనెందుకు బాధ్యురాలనవుతాను?
ఎప్పుడూ కాను. ఈ విషయంలో నాకేమీ తెలవదు పెద్దమ్మా! అటు

వంటప్పుడు నామీద అబద్ధపు కళంకం ఎందుకు మోసి వెళ్ళాడు?" అని అడిగింది.

అందుకు విశ్వేశ్వరి తర్కవితర్కం చేయలేదు. మెల్లిగా అన్నది— "అమ్మాయీ! అందరూ ఆంతరంగిక విషయం గ్రహించలేరు. అయినా, వాడు నిన్ను అవమానించాలని ఎప్పుడూ అనుకోడని నేను గట్టిగా చెప్పగలను. నీ మీద వాడి కెంత శ్రద్ధాభక్తులున్నాయో, నీకు తెలవదు. నేను గోపాల్ సర్కారువల్ల విన్నాను. ఆనాడు మీరు చింతచెట్టు కొట్టించి యిద్దరే పంచుకున్నారు. ఆ సంగతి వాడికి తెలిసింది. ఎవరెన్ని చెప్పినా వినలేదు. అందులో వాడికీ భాగముంది. వా డేమన్నాడో తెలుసా? అందరి ఎదటా 'విచారించవలసిందేమీలేదు. రమ అక్కడున్నప్పుడు, నా భాగం నాకు వచ్చే తీరుతుంది. ఆమె ఎప్పుడూ పరాయివస్తువును అంటుకోదు.' అన్నాడట, అమ్మాయీ! యింత పోట్లాట-కాట్లాటలు జరిగినప్పటికి వాడు నీ మీద మొదటిలానే విశ్వాసముంచాడు. అయినా ఆనాడు చెఱువు చేపలవిషయంతో........" అని విశ్వేశ్వరి ఒక్కసారిగా ఆగి రమముఖంలోకి చూసి చెప్పింది—"అమ్మాయీ రమా! యివాళ నీకొక సంగతి చెపుతున్నాను. నీ ఆస్తిపాస్తుల రక్షించుకునే విలువ ఎంతదైనప్పటికి రమేశుని ప్రాణాల విలువ అంతకంటే ఎక్కువైంది. అందువల్ల ఎవరిమాటలకు లోబడిగానీ, ఏదైనా వస్తువుకు భ్రమించిగానీ, వాణ్ని నాశనం చేయవద్దు. అందువల్ల దేశాని కెంతహానికలుగుతుందో తరువాత దాన్ని పూర్తిచేసుకోలేమని మాత్రం నేను నిశ్చయంగా చెప్పగలను."

రమ మాటాడలేదు. ఆమె ఏమీ ప్రతిగా వాదించలేదు. విశ్వేశ్వరి కూడా ఏమీ మాటాడలేదు. కొంచెంసేపయాక రమ అస్పష్టంగా కోమల స్వరంతో-"పెద్దమ్మా! చాలా ఆలస్యమైంది, యింటికి వెళతాను." అని ఆమె పాదాలకు నమస్కరించి వెళ్ళిపోయింది.

## 9

పెద్దమ్మవద్దనుంచి, రమేశ్ ఎంతకోపంతో వచ్చినప్పటికీ, యింటికి వచ్చేసరికి నీరైపోయాడు. మాటిమాటికి మనసులో అను

కుంటున్నాడు. ఈ సామన్య విషయాన్ని అర్థంచేసుకోలేక తనెంత బాధ
పడ్డాడు? వాస్తవంగా తనకోపం ఎవరిమీద? సంకుచిత స్వార్థపరులు
తమ అజ్ఞానంలో పడిపోయి నిజానికి మంచేదో, చెడ్డేదో, గ్రహించలేని
అంధులై తమయిరుగు పొరుగువారి బలాన్ని నాశనంచేయాలనిచూసేవాళ్ళ
మీదా. మంచిచేస్తున్నప్పుడు సందేహించే మూర్ఖులమీద కోపమూ-అభి
మానంతెచ్చుకునేంత భ్రమ యింకొకటి లేదు. పల్లెటూళ్ళకు దూరంగా
యెక్కడో పట్టణంలో వుంటూ — పుస్తకాలు చదివీ - వాళ్ళు, వాళ్ళు
చెప్పగా విని, కల్పించుకున్న వూహలు—పటాపంచలై పోయినయ్!
'తన బెంగాలీజాతికి ఏమివున్నా - లేకపోయినా - ఏకాంతంగా వుంటున్న
పల్లెల్లో తన జాతి శాంతి సౌఖ్యాలు యింకా నమసిపోలేదు. జనసంకీర్ణ
మైన పట్టణాల్లో అదిమాత్రం కనుపించలేదు. యీ అల్పసంతోషులైన
పల్లెవాసులలో సానుభూతి వున్నది. ఒక మనిషి కష్టాల్లో వుంటే రెండో
మనిషి ఆదుకుంటాడు.ఒకమనిషి సుఖంగావుంటే ఇంకొకడు పిలవకుండా
వచ్చి, పండుగచేసుకుంటాడు.అక్కడ మాత్రమే,ఆపల్లెవాసుల హృదయా
ల్లోనే మన బెంగాళీజాతి, సంపద అక్షయంగా నిలచివుంది.' కానీ అదంతా
భ్రాంతిగా మారిపోయింది, బస్తీలలోకూడా యిన్ని విరోధాలూ, యితర్ల
సంపదనుచూసి ఓర్వలేకపోవడమూ, త నెక్కడా చూడలేదు. ఆ మాట
తలుచుకోగానే తన శరీరమంతా జెర్రులు ప్రాకినట్లయింది. పట్టణంలో
రోడ్లప్రక్క ఎప్పుడైనా— ఏదైనా పాపపుపని చూసినప్పుడు—ఏదో
విధంగా తన పల్లెకుపోతే ఈ పాపకృత్యాలు కంటబడవుకదా అని అను
కునేవాడు. పై అన్నిటికంటే గొప్పదైన ధర్మం-చరిత్ర యింకా పల్లెల్లో
అక్షయంగా వుందనుకునేవాడు. అయ్యో భగవంతుడా! ఆ చరిత్ర యెక్క
డుంది? ఆ ధర్మం ఏదీ? ధర్మానికి ప్రాణం లాగేసి, దాని శరీరాన్ని
వుంచా వెందుకు? ఈ అభాగ్యులైన గ్రామవాసులు వికృతమైన వివర్ణ
శరీరాన్ని నిజమైన ధర్మమని పట్టుకుని వేళ్ళాడుతూ— దాని విషయుక్త

రమ యేమీ జవాబు చెప్పలేదు. కొంచెంసేపుండి లేచి తన గది
లోకి వెళ్ళిపోయింది. అక్కడ ఆ నిర్మానుష్యమైన గదిలో ఆమె కళ్ళంట
పెద్దపెద్ద నీటిచుక్కలు రాలినయ్!

మైన దుర్గంధాన్ని సేవిస్తూ—అధఃపతన మవుతున్నారు. అన్నిటికన్నా పరిహాసపాత్రమైన విషయం ఏమంటే—పట్టణంలో జాతిభేదం లేని వారియెడ వీరికి అంతులేని అసహ్యం.

రమేశు తనయింటికి వచ్చి చూచేసరికి, ఎవరో ఒక ప్రౌఢ స్త్రీ పదకొండు—పన్నెండేళ్ళ కుర్రవాడి చేయి పట్టుకుని ఒకమూల కూర్చొని వుండడం చూశాడు. ఆమె లేచి నిలుచుంది. ఏమీ తెలియకపోయినా, ఆ కుర్రవాడిముఖంచూచేసరికి, రమేశుకు ఏడుపు వచ్చినంత పనైంది. చండీమంటపం వసారాలో కూచుని లెక్కలు వ్రాసుకుంటున్న గోపాల సర్కారు వచ్చి చెప్పాడు— "ఈ కుర్రవాడు దక్షిణపాడ్ వీధిలోని ద్వారకా పండితుని కొడుకు. మీవద్దకు యాచనకోసమై వచ్చాడు."

'యాచన' అనే పేరు వినగానే రమేశు మండిపడుతూ-"అయితే నేను దానంచేయడానికే యింటికి వచ్చానా? యిక గ్రామములో ఎవరూ లేరా?" అని అడిగాడు.

గోపాలసర్కారు కొంత అప్రతిభుడై —"అవును బాబూ! అది నిజమే! పెద్దబాబుగా రున్నప్పుడు యిక్కడనుంచి యెవరూ ఒట్టిచేతులతో తిరిగి పోయేవాళ్ళుకాదు. అందువల్ల కష్టాల్లో వున్నవాళ్ళంతా ముందు యిక్కడికే వచ్చేవాళ్లు —తిరిగి ఆ పిల్లవాడివేపు చూసి, ఆ ప్రౌఢస్త్రీతో- "కామినీ తల్లీ వీళ్ళతప్పుకూడా తక్కువకాదు. ఆయన బ్రతికివున్నప్పుడే ప్రాయశ్చిత్తం చేసుకుంటే బాగుండేది. యిప్పుడు శవాన్ని తీసుకువెళ్ళ టానికి ఎవరూ రాకపోయేసరికి యిప్పుడు యింటింటికీ డబ్బుకోసం పరుగెత్తవలసివస్తూంది. అయితే యింట్లో చెంబూ తప్పేళా ఏమీలేవా?" అని అడిగాడు.

కామినితల్లి గొల్లది. ఈ కుర్రవాడి యింటిప్రక్కనే వుండేది. ఆమె తలవంచుకుని— "అంత నమ్మకం లేకుంటే తమరు వచ్చి చూడండి! యింట్లో ఏమన్నా వున్నట్లయితే, తండ్రి శవాన్ని అలా వుంచి యాచనకు తీసుకుని వస్తానా? మీరు కళ్ళతో చూడకపోయినా— అంతా వినేవుంటారు. ఆరుమాసాలనుంచీ మా కున్నదంతా వారికే పెట్టాము బాబూ! ప్రక్కయింటి బ్రాహ్మణపిల్లలను ఆకలితో చావనిస్తామా?" అని చెప్పింది.

రమేశు యిప్పుడు సంగతి కొంతవరకు గ్రహించినట్లున్నాడు. గోపాలసర్కారు కొన్ని విషయాలు చెప్పాడు— ఈ కుర్రవాడి తండ్రి ద్వారకాచక్రవర్తి ఆర్నెల్లనుంచి గుండెజబ్బుతో మంచంలోవుంటున్నాడు. యివాళ ఉదయం చనిపోయాడు. అతనికి ప్రాయశ్చిత్తం (బెంగాలు దేశంలో గుండెజబ్బువున్న రోగులు ప్రాయశ్చిత్తం చేసుకోవాలనే నియమము వుంది) కాలేదు. అందువల్ల శవాన్నెవరూ ముట్టుకునేందుకు రాలేదు. యిప్పుడు ప్రాయశ్చిత్తంచేయడం ముఖ్యం. కామినితల్లి రమారమి ఆర్నెల్లనుంచీ, తనకు వున్నది యీ బీదబ్రాహ్మణ పరివారానికే పెట్టింది. ఇప్పుడు ఆమె చేతిలో ఏమీలేదు. అందువల్ల కుర్రవాణ్ని తీసుకుని తమ దగ్గరకు వచ్చింది."

కొంచెంసేపు మౌనంగా వున్నాక రమేశు— "యిప్పుడు రెండు గంట లవబోతూంది. ప్రాయశ్చిత్తం జరక్కుంటే శవం అలా వుండ వుండవలసిందేనా?" అని అడిగాడు.

సర్కారు నవ్వుతూ చెప్పాడు— "బాబుగారూ! యిక ఉపాయ మేముంది? శాస్త్రానికి విరుద్ధంగా పనిజరగదు. ఈ విషయంలో వూళ్లో వాళ్ళదే తప్పని ఎవరనగలరు? ఏదేమైనా— శవం అలా వుండదు. ఎలాగైనా—ఆ పని, వాళ్ళవల్లనే జరగాలి. అందుకే యాచన............ ఆ.........కామిని తల్లి —? యింకెక్కడికైనా వెళ్ళివచ్చారా—-"

పిల్లవాడు పిడికిలి విప్పి చూపాడు. ఒక పావలాబిళ్ళ నాలుగు కానులు వున్నయ్! కామిని తల్లి అన్నది— "ఈ పావలా ముఖర్జీగారింటిలో—ఈ నాలుగు కానులు హల్దార్‌గారు యిచ్చారు. కాని తొమ్మిది పావలాలు లేనిదే పని జరగదు. అందుకు బాబుగారే............"

"సరే మీరు యింటికివెళ్ళండి! యింకెక్కడికివెళ్ళనవసరంలేదు. నేను అన్ని ఏర్పాట్లతో మనిషిని పంపుతాను—" అని రమేశు చెప్పాడు.

రమేశు వాళ్ళను పంపి — కొంచెసేపు గోపాల్‌సర్కారుముఖం వేపు చూసి అడిగాడు— "సర్కారుగారూ! యీ వూళ్లో యిటువంటి బీదవారి యిళ్ళు ఎన్ని వుంటాయో మీకు తెలుసా—!"

"ఎక్కువ లేవు. రెండు—మూడు వుండవచ్చు. వీళ్ళకు తిండానికీ వుంటానికి లోటులేదు. కాని ఒకచెట్టు విషయంలో ద్వారకాచక్రవర్తి

సనాతన హజరాం-యిద్దరూ కోర్టుల కెక్కి డబ్బు తగలేసి, అయిదేండ్లు గడిచినా దాని అంతులేదు" కొంచెం స్థాయి తగ్గించి—"బాబుగారూ యింత దూరం వచ్చేదికాదు మన పెద్దబాబుగారూ—గోవిందగంగూలి వాళ్ళను పురికొల్పారు. ఆ తరువాత వాళ్ళిద్దరిదగ్గ రున్నదంతా పెదబాబుగారి వద్దకు లాకట్టుకు వచ్చింది. పోయిన సంవత్సరమే వడ్డీతో— సహా లెక్కకట్టి యిదరి ఆస్తి మనపరంచేసుకున్నారు. అయినా కామినితల్లి మాత్రం ధన్యురాలు. యిటువంటి ఆపదల్లో బ్రాహ్మణులకు సాహాయం చేయడం ఎక్కడా చూడలేదు—" అని చెప్పాడు.

రమేశు ఒక నిట్టూర్పు విడిచి వూరుకున్నాడు. కొంచెంసేపయాక గోపాలసర్కారును అక్కడి విషయమంతా చూడమని చెప్పి మనసు లోనే— "పెద్దమ్మా! మీ ఆజ్ఞ శిరసావహిస్తాను. యిక్కడ ఒకవేళ చచ్చిపోయినా మంచిదే కావి, ఈ దౌర్భాగ్యపు వూరును విడిచిపెట్టి వెళ్ళను—" అని అనుకున్నాడు.

# 10

మూడు మాసాల తరువాత ఒక నాటి వుదయం రమేశు తారకే శ్వరంలోని—'పాలసాగరం' అని పిలవబడే కొలను మెట్లమీద ఒక స్త్రీకి ఎదురుపడ్డాడు. అనాచ్ఛాదితంగావున్న ఆమె ముఖంవేపు మర్యాద లేనివాడిలా ఒక్కక్షణంసేపు విస్తుబోయి చూస్తూ నిలుచున్నాడు. దారి తప్పుకోవాలనే ధ్యాసకూడా లే దతనికి. ఆమెకు యిరవై సంవత్సరాలు వుండవచ్చు. ఆమె స్నానంచేసి పైకి వస్తూంది. ఆమె చేతిలోని నీళ్ళ బిందెను క్రిందకుదించి తడిసిన బట్టలపైన రెండు చేతులతో హృద యాన్ని కప్పుకుని మెల్లిగా- "మీ రిక్కడ వున్నారేం-?" అని అడిగింది.

రమేశుని ఆశ్చర్యానికి అంతులేదు. కాని ఆతని విహ్వాలత మాయ మైంది. ప్రక్కకు తప్పుకుని— "మీరు నన్ను యెరుగుదురా—?" అని అడిగాడు.

"ఆ............యెరుగుదును. మీరు తారకేశ్వరం ఎప్పుడు వచ్చారు—?"

'యివాళ వుదయమే। మా మామగారింటివద్దనుంచి ఆడవాళ్ళు రావాల్సింది. కాని వాళ్ళెవరూ రాలేదు.'

"ఈ వూళ్లో ఎక్కడ బసచేశారు?"

'ఎక్కడా లేదు. యింతకు ముందు యిటువేపు యెప్పుడూ నేను రాలేదు. యివాళ యిల్లా యిక్క డెక్కడో వుండి వాళ్ళకోసం చూస్తుం డాలి. ఆ తరువాత యెక్కడో ఒకచోట బస వెదకాలి—'

'మీ వెంట నౌకరు వున్నాడా?'

"లేడు. నేను ఒక్కణ్ణే వచ్చాను—"

'సరే—' అంటూ నవ్వి తల పైకెత్తేసరికి యిద్దరి చూపులు కలుసుకుని నాలుగైనయ్। ఆమె మళ్ళీ తలదించుకుని మనసులోనే కొంచెం సంకోచంగా— 'అయితే నాతోపాటు రాండి—' అని బిందె యెత్తుకుని నడక సాగించింది.

రమేశుడు సంకటంలో పడ్డాడు— 'నేను నీతో రాగలను, ఎందు కంటే యిందులో దోష మేమన్నా వుంటే మీరు పిలిచేవారేకాదు. అంతే కాదు. నేను మిమ్మల్ని యెరుగక పోలేదు. అయినా జ్ఞాపకంరావడంలేదు. మీ పరిచయాన్ని కాస్త గుర్తుచేస్తారా?'

'సరే, కొంచెంసేపు మీ రిక్కడే వుండండి। నేను పూజచేసి వస్తాను. ఆ తరువాత వెళుతూ నా పరిచయాన్ని తెలియచేస్తాను—' అంటూ ఆమె దేవాలయంవేపు వెళ్ళింది. రమేశు ముగ్ధునిలా చూస్తున్నాడు. ఆమెయువ్వనశోభతడివస్త్రంలోంచి బయటికి పొడుచుకుని రావాలని చూస్తూ వుంది. ఆమె ముఖం— అవయవ నిర్మాణమూ— ఆ నడక తీరూ—అంతా రమేశునికి పరిచతంగానే వుంది. కాని అతని స్మృతి అనే తలుపు చాలా కాలంనుంచి మూసివుండడంవల్ల సరిగ్గా గుర్తించలేకపోతున్నాడు. ఒక అరగంటయాక పూజ ముగించుకుని వచ్చాక రమేశు యింకొకసారి ఆమె ముఖాన్ని చూశాడు. కానీ యిప్పుడు కూడా అపరిచితురాలుగానే కని పించింది. యిద్దరూ నడుస్తున్నప్పుడు రమేశు అడిగాడు. 'మీతోపాటు మీ వాళ్లు ఎవరూ లేరా?'

"లేరు. దాసిమాత్రంవుంది. అది యింట్లో పనిచేస్తూవుంది. నేను అప్పుడప్పుడు యిక్కడికి వస్తుంటాను. యిక్కడ నాకు అంతా తెలుసు।

"మరి నన్నెందుకు మీతో తీసుకుని వెళుతున్నారు?"

కొంచెంసేపు మెదలకుండా నడిచాక— "లేకుంటే మీకు భోజనానికి చాలా యిబ్బందిగా వుంటుంది. నేను రమను" అని చెప్పింది.

*  *  *  *

రమ ఎదట కూచుని రమేశుకు భోజనంపెట్టి ఆకు వక్కలు తెచ్చి యిచ్చింది. ఆ తరువాత పడుకునేందుకు స్వయంగా ఒక చాపతెచ్చి పరిచి మరొక గదిలోకి వెళ్ళింది. రమేశు ఆ చాపమీదనే కళ్లుమూసుకుని పడుకున్నాడు. తన యిరవై మూడు సంవత్సరాల జీవితం ఒక్కసారే మారిపోయినట్లనిపించింది. చిన్నతనంనుంచి అతను పరాయివాళ్ళలో యితరుల ఆశ్రయంలో పెరిగాడు. భోజనంచేయడంలో ఆకలితీరడంతప్ప మరొక అనుభవం వుంటుందని అతను ఎరుగనే యెరుగడు. అందుచేత యివాళ యీ అచింతనీయమైన పరితృప్తితో అతని మనస్సంతా విస్మయంమాధుర్యంలో మునిగిపోయింది. తన భోజనంకోసం రమ ప్రత్యేకించి వస్తువులనేమీ సేకరించలేదు. సాధారణపు భోజనమే పెట్టింది. అతని భోజనం విషయంలో ఆమెకు చాలా విచారంగానేవుంది. అతను తృప్తిగా భోజనంచేయకుంటే— ఆ సంగతి తెలుసుకుని లోకు లేమనుకుంటారో? అనుకుంటే అనుకున్నారు. ఆమె హృదయాంతరాళంలోంచి, ఈ ఆలోచన పైకి వచ్చి, ఆమె సంకోచాన్నంతటినీ యెగరగొట్టి చివర కతడు భోజనం చేసేచోటికి తీసుకువచ్చి చేర్చింది. ఈ సంగతి ఆమె ఏవిధంగా దాచగలదు? ఇవాళ ఆమె సిగ్గుతోకూడా, అతనికి దూరంగా కూచోలేకపోయింది. ఆహారపదార్థాల కొరతను ఆదరించైనా పూర్తిచేయాలని దగ్గరకూచుంది. నిర్విఘ్నంగా భోజనమయాక ఆమె విడిచిన నిట్టూర్పు రమేశు వినకపోయినా- అన్నీ యెరిగున్న ఆ భగవంతుడుమాత్రం తెలుసుకున్నాడు.

రమేశుకు పగలు నిద్రపోయే అలవాటులేదు. అతనికి యెదురుగా వున్న చిన్న కిటికీబయట బూడిదవర్ణంతో శోభిస్తున్న నవవర్ష మేఘాలు ఆకాశాన్ని అల్లుకుంటున్నయ్. రమేశుడు వాటిని చూస్తూ పడుకున్నాడు. తన బంధువులు వస్తారనే సంగతే గుర్తులేదాయనకు. హఠాత్తుగా రమ

కోమలస్వరం అతని చెవుల్లో పడింది. తలుపు బయటనుంచే అంటూ వుంది — "యివాళ మీరు యింటికి ఎలాగూ వెళ్ళలేరు. అటువంటప్పుడు యిక్కడే యెందుకు వుండగూడదు?"

రమేశు తొందరగాలేచి కూచుని- "కాని యీ యింటివారెవరో యింతవరకూ కనుపించలేదు. వారికి చెప్పనిదే ఎలా వుండడం?" అన్నాడు.

రమ అక్కడనుంచే జవాబుచెప్పింది- "యింటి యజమానే వుండమంటూవుంది. యీ యిల్లు నాదే."

రమేశుడు ఆశ్చర్యపడుతూ- "యిక్కడ యీ యిల్లెందుకు కొన్నారు?" అని అడిగారు.

"—ఈ ప్రదేశం నాకెంతో యిష్టం. నేను అప్పుడప్పుడూ యిక్కడకు వస్తుంటాను. ఇప్పుడంటే యిక్కడ ఎవరూలేరు. కాని ఒక్కొక్కప్పుడు కాళ్లుచాపి పడుకునేందుకే వీలుండదు."

"అటువంటప్పుడు ఆ సమయంలోనే ఎందుకు రాగూడదు?"

రమ నవ్వింది. మాట్లాడలేదు.

"మీకు తారకనాథునిమీద భక్తిఎక్కువనుకుంటాను. అంతేకదూ "

"అంతమాత్రం భక్తి ఎక్కడుంది? కాని బ్రతికివున్నంతకాలం ప్రయత్నించాలి."

రమేశుడు యింకేమీ ప్రశ్నించలేదు. రమ అక్కడే గుమ్మానికి ఆనుకుని కూచుని అడిగింది — 'రాత్రికి మీ రేం తింటారు?'

రమేశు నవ్వుతూ చెప్పాడు— "ఏదిదొరికితే అదే: భోజనానికి కూచునే క్షణం ముందువరకూ అసలు భోజనంసంగతే గుర్తుండదు. వంటవాడు ఏదిచేసిపెడితే అదే తింటుంటాను."

"ఎందు కంత వైరాగ్యం?"

ఆ మాటల్లో దాగివున్నది దెప్పిపొడుపో-లేక పరిహాసమో; ఏమీ రమేశుకు అర్థంకాలేదు.'ఆదేమీకాదు. సోమరితనము.'

"కాని యితరులకు చేయవలసిన పనిలో మీకు సోమరితనం లేదనుకుంటాను."

"అందుకు కారణంవుంది. ఇతరులపనుల్లో సోమరితనంగావుంటే భగవంతునియెదుట తప్పుచేసినవాళ్ళమవుతాము. స్వంత పనుల్లోకూడా

అంతేననుకో! అయినా అంత ఎక్కువగా జవాబుదారీ వహించవలసిన పని వుండదు."

రమ కొంచెంసేపు మెదలకుండావుంది— ఆ తరువాత మెల్లిగా అన్నది— "మీవద్ద డబ్బువుంది. అందువల్ల యితరుల విషయంలో కావాల్సినంత శ్రద్ధపుచ్చుకుంటారు. కాని డబ్బులేనివాళ్ళ సంగతో?"

"రమా! వాళ్ళసంగతి నాకు తెలవదు. ఎందుకంటే డబ్బుండడానికైనా ఇంతని పరిమాణంలేదు. ఇక మనసులో వాళ్ళకు సహాయపడాలనే నియమముకూడాలేదు. డబ్బువుండడమూ - లేకపోవడమూ ఆ లెఖ్కలన్నీ యిహ-కాల-పరకాలాల భారం వహించిన ఆ భగవంతునికే తెలియాలి."

రమ కొంచెంసేపు మెదలకుండావుంది- 'కాని పరలోకాన్ని గురించి ఆలోచించే వయసు మీకింకా రాలేదు.మీరు నా కంటే మూడేళ్ళ పెద్ద-' అన్నది.

"అంటే, ఆ పరకాలాన్ని గురించి యోచించే వయసు నీకు రాలేదనేగా! భగవంతుడు అలాగే చేయనీయ్! నువ్వు దీర్ఘజీవి కావాలని కోరుతున్నాను. కాని నావిషయంలో నా కేరోజూ ఆఖరిరోజుకాదని నేనింతవరకూ అనుకోకుండా వుండలేను."

రమేశుడన్న ఈ మాటల్లో ఎత్తిపొడుపు కొంతవరకు పని చేసింది. రమ కొంచెంసేపు స్థిరంగావుండి అడిగింది- 'మీరు సంధ్యాపూజ చేయడం నేను చూడలేదు. మీరు గుడికి వెళ్ళి అక్కడేమివున్నదీ, ఏమి లేనిదీ కూడా చూడలేదు. కాని భోజనంముందు కూచున్నపుడు ఆచమనం కూడా మరిచిపోయారా?"

రమేశుడు మనసులోనే నవ్వుకున్నాడు- "మరిచిపోలేదు. కాని మరిచిపోయినా వచ్చేనష్టంలేదు. అయినా యిప్పు డెందు కీ సంగతి అడుగుతున్నావు?"

"మీకు పరకాల చింత ఎక్కువగనుక అడుగుతున్నాను."

కాని రమేశుడు యీ మాటకు జవాబు యేమీ చెప్పలేదు. ఆ తరువాత యిద్దరూ కొంచంసేపు మెదలకుండా వున్నారు. ఆ తరువాత రమ మెల్లిగా అన్నది- "చూడండి! మీరు నన్ను దీర్ఘజీవిగా వుండమని ఆశీర్వదించడం శాపంలాంటిది. మన హిందువుల యిళ్ళలో విధవను దీర్ఘజీవిగా

వుండాలని ఎవరూ కోరరు." అని కొంచెంసేపు మెదలకుండా వూరుకుని- 'నేను చనిపోయేందుకు సిద్ధంగావున్నానని అనడంలేదు. కాని ఎక్కువ కాలం బ్రతకాలేమోననే సంగతి గుర్తుకొచ్చేసరికి భయంవేస్తూంది. కాని మీ విషయంలో అలాకాదు. నేను ఏ సంగతైనా గట్టిగా చెపితే అది బడాయిక్రిందకు వస్తుంది. కాని ప్రపంచంలో, పరులకోసం తలలు పగుల కొట్టుకోవడం శుద్ధతెలివితక్కువని గుర్తుకొచ్చినప్పుడు మాత్రం నా మాటలు గుర్తు తెచ్చుకోండి' అని అన్నది.

అందుకు జవాబుగా రమేశు ఒక్క నిట్టూర్పు విడిచాడు. కొంచెం సేపుండి మెల్లిగా రమ చెప్పినట్లుగానే చెప్పాడు- "నిన్ను గుర్తుతెచ్చుకునే అంటున్నాను.యీ సమయంలో నా కా సంగతి గుర్తుకు రాదసలు రమా! నేను నీకేమీకాను, పైగా నీదారికి కంటకంగావున్నాను. అయినప్పటికీ నీకు పొరుగింటివాడిననే భావంతో - యివాళ నీవద్ద ఏ అతిథ్యాన్ని పొందానో. యిట్టి ఆతిథ్యాన్ని ప్రపంచంలో ప్రవేశించాక, ఏ మనిషి తన బంధువుల దగ్గర అనుదినం ఆతిథ్యంపొందుతూ-యితరుల కష్టాలుచూసి పిచ్చివాళ్లగా మారిపోవడంలో విశేషమేమీ లేదనిపిస్తూంది. నే నిప్పుడు వొంటరిగా కూచుని ఆలోచిస్తున్న దేమంటే, ఒక్కపూటలో నువ్వు నా జీవితాన్ని మొదటినుంచి, చివరవరకూ మార్చేశావని. ఈ విధంగా నాకింతవరకూ ఎవరూ భోజనం పెట్టలేదు. యింత ప్రేమాదరణతో నాకెవరూ భోజనం తినిపించలేదు. రమా! భోజనంలో కూడా యింత హాయి వుంటుందని యివాళ మొట్టమొదటిసారిగా నీవద్ద తెలుసుకున్నాను"

ఈ మాట వినేసరికి రమ శరీరమంతా రోమాంచితమైంది. అయినా వెంటనే స్థిరపడి అన్నది- కాని యీ సంగతి మర్చిపోవడానికి మీకు ఎక్కువకాలం పట్టదు. ఒకవేళ ఎప్పుడైనా గుర్తుకువస్తే, అదేదో స్వల్ప విషయంగా తోస్తుంది."

రమేశు జవాబు చెప్పలేదు. రమ మళ్ళీ అన్నది "యింటికి వెళ్ళాక, నన్నవమానించకుండావుంటే అదే నాకు భాగ్యమనుకుంటాను,"

ఒక నిట్టూర్పు విడచి రమేశు అన్నాడు—"లేదు రమా! నిన్ను నిందించను. పైగా పొగడుతూ ప్రచారంచేయను. యీరోజు నా జీవితంలో నిందా పొగడ్తలకు, రెంటికీ అతీతమైంది."

# 11

ఎడతెరిపి లేకుండా రెండురోజుల్నుంచి వర్షం కురిసి, యివాళ మధ్యాహ్నం కాస్త తెరిపియిచ్చింది. ఆకాశంమీద మబ్బులు లేవు. పంచె మండపం హాల్లో గోపాలుసర్కారువద్ద కూచుని రమేశు లెక్కలు చూస్తున్నాడు. హఠాత్తుగా యిరవై మంది రైతులు యేడుస్తూవచ్చి — "చిన బాబుగారూ! యీమారు మమ్మల్ని రక్షించండి! ఒకవేళ మీరు రక్షించకుంటే మేము పెళ్లాం-బిడ్డలతో వీధివీధి ముష్టికి బయలుదేరాలి బాబూ!" అని చెప్పారు.

రమేశుడు విశ్చేష్టుడై "ఏమిటి సంగతి" అని అడిగాడు.

రైతులు గోలపెట్టారు — "వంద ఎకరాలు నీటిలో మునిగిపోయింది. నీళ్ల వదిలిపెట్టకుంటే పంటంతా నాశనమవుతుంది బాబూ! యీ వూరంతా మాడి చావల్సిందే."

రమేశుకు ఏమీ అర్థంకాలేదు. గోపాలుసర్కారు వాళ్ళను రెండు మూడు ప్రశ్నలు అడిగి రమేశుకు విపులంగా వివరించిచెప్పాడు. "వంద యకరాల పంటే యీవూరికి ఆధారం. ఇక్కడున్న రైతులందరికి అందులో తలాకాస్తా భూమివుంది. దానికి తూర్పున సర్కారువారి పెద్ద అడ్డకట్టవుంది. పశ్చిమ-ఉత్తరాన ఎత్తయిన గ్రామముంది. దక్షిణానవున్న అడ్డకట్టమాత్రం ఘోషాల్-ముఖర్జీల వుమ్మడిది. అటువేపునుంచే నీరు పోవడానికి ఆధారముంది. కాని ఆ అడ్డుకట్ట నానుకుని ఒక చెరువు వుంది. ప్రతి సంవత్సరం అందులోంచి రెండువందల రూపాయల చేపలు పట్టి అమ్ముతుంటారు. అందువల్ల అక్కడ వేణీబాబు కఠినమైన కాపలా పెట్టాడు. వీళ్ళంతా ఉదయంనుంచి వేణీబాబుదగ్గర బ్రతిమాలుతూ వున్నారు. ఇప్పుడిప్పుడే యేడుస్తూ అక్కడనుంచి యిక్కడకు వచ్చారు. రమేశు యింకేమీ వినాలని ఆపేక్షించకుండా అక్కడనుంచిలేచివెళ్ళాడు. వేణీబాబుగారింటికి వెళ్ళేసరికి చీకటిపడబోతూవుంది. వేణీబాబు దిండ్లకు ఆనుకుని హుక్కా త్రాగుతున్నాడు.ఆయనకు దగ్గరగానే హోల్దారు హారాను వున్నాడు. ఈ సంగతే బహుశా మాట్లాడుకుంటున్నారల్లేవుంది.

ఉపోద్ఘాతం ఏమీ లేకుండానే రమేశు అన్నాడు - "ఆ చెరువుకట్ట అలా వుంచినందువల్ల పనిజరగదు. ఇప్పుడు దాన్ని తెగగొట్టాలి."

వేణీ హుంకా్కను హోల్దారుచేతిలో పెట్టి తలెత్తి - "ఏ అడ్డకట్ట?" అని అడిగాడు.

రమేశుడు అసలే ఉత్తేజితుడై వచ్చాడు. ఆయన కోపంగానే చెప్పాడు. "ఎన్ని అడ్డకట్టలు వున్నయ్ పెద్దన్నయ్యా? ఆ చెరువు అడ్డకట్ట తెగగొట్టకుంటే. వంద యకరాల పంటంతా మునిగిపోతుంది. నీరు వది లేందుకు ఆజ్ఞయివ్వండి."

"ఆ నీళ్ళతోపాటు రెండుమూడు వందలరూపాయల చేపలుకూడా కొట్టు కునిపోయేసంగతి నీకుతెలుసు? ఈడబ్బు ఎవరిస్తారు? రైతులా--నువ్వా?"

రమేశు కోపాన్ని ఆపుకొంటూ—"రైతులు బీదవాళ్లు. వాళ్ళేమి యివ్వగలరు? ఇక నేనంటారా? నేనెందుకివ్వాలో అర్థంకావడంలేదు?" అన్నాడు.

"అటువంటప్పుడు యింత నష్టం నేనెందుకు భరించాలో నాకూ అర్థంకావడంలేదు?" ఆ తరువాత హోల్దార్ వేపుచూసి- "జాదాయ్! ఈ విధంగానే మా తమ్ముడు తన జమీందారీని కాపాడుకుంటాడు. రమేశ్! ఆ వెధవలు ఉదయంనుంచీ యిక్కడపడి యేడ్చి --యేడ్చి వెళ్ళారు, నాకంతా తెలుసు! అయితే నీదగ్గర ఎవరూ దర్వానులేడా? లేకుంటే చెప్పులు లేకపోయాయా? వెళ్లు యింటికి. వెళ్ళి అందుకు తగిన శ్రద్ధపుచ్చుకో! ఇక నీరు దానంతట అదే పోతుంది!" అని చెప్పాడు.

రమేశు సహించలేకపోయాడు. అయినా ఎంతో యిదిగా తనను తాను అణచుకుని వినయంగా — "పెద్దన్నయ్యా! మీరు బాగా ఆలోచించి చూడండి: మన మూడిళ్ళకు మూడువందలు నష్టం పూడ్చుకుందామంటే, ఈ బీదవాళ్ళకు సంవత్సరమంతా సరిపోయే ధాన్యం చెడిపోతుంది. అది అయిదారువేల రూపాయల నష్టం అవుతుంది" అని చెప్పాడు.

వేణీ చేతులు తిప్పుతూ— "అయితే అవనీయ్! వాళ్ళకు అయిదు వేలు నష్టంరానీ, యాభై వేలు నష్టంరానీయ్! వాళ్ళకోసం నేను రెండు వందలు నష్టపడతానా?" అని అన్నాడు.

ఆఖరిసారిగా రమేశు— "అయితే పిల్లల సంవత్సరమంతా ఏం తింటారు?" అని అడిగాడు.

రమేశుడు పరిహాసాస్పదంగా మాట్లాడాడు. వేణీబాయి చేతులు తిప్పుతూ —నవ్వుతూ—హూ-హూ-అని రెండుసార్లు పుమ్మేసి. చివరకు— "ఏంతింటారా? చూస్తూవుండు. వీళ్ళంతా వున్నది రాకట్టు పెట్టేందుకు మనదగ్గరకే వస్తారు. తమ్ముడూ? నీబుద్ధిని కొంచెం చల్లబర్చుకుని పని చేయ్! మనపెద్దలు ఏదో మనకింత ఎంగిలి మంగలం కూడబెట్టి వెళ్ళారు. మనంకూడా దీన్ని యింకా ఎక్కువచేసి, ఏదో యింత తింటూ —కొంత మన పిల్లలకు వదిలిపెట్టాలి. నువ్వేమో వాళ్ళేమి తింటారని అంటావు? అప్పుతెచ్చుకుని తింటారు. లేకుంటే వీళ్ళను హీనజాతి వాళ్ళని యెందుకంటారు?" అన్నాడు.

అసహ్యాం, సిగ్గు, క్షోభతో రమేశుని ముఖం ఎర్రబడింది. అయినా తన స్వరాన్ని తగ్గించుకుని అన్నాడు —"వీళ్ళకోసం మీరేమీ సహాయం చేయరని, నిశ్చయించుకున్నప్పుడు యిక్కడ తర్క వితర్కాలలో లాభంలేదు. నేను రమవద్దకు వెళుతున్నాను. ఆమె వొప్పుకుంటేమాత్రం మీ అనంగీకారం ఏమీ పనిచేయదు."

వేణీ ముఖం గంభీరమైంది— "సరే, వెళ్ళిచూడు. ఆమె అభిప్రాయం నాకు భిన్నంగా వుండదు. ఆమె సాధారణమైన ఆడదికాదు తమ్ముడూ! నీ తండ్రినే మువ్వుతిప్పలుపెట్టి మూడు చెంబుల నీళ్ల తాగించింది.... ఏమంటావు బాబాయ్!"

బాబాయ్ అభిప్రాయంతో రమేశుకు నిమిత్తం లేకపోయింది. వేణీ అన్న అవమాన జనకమైన మాటకు జవాబుకూడా చెప్పడం వ్యర్థమనుకున్నాడు. ఆయన జవాబు చెప్పకుండానే బయటికి వెళ్ళారు.

రమ తులసికి దీపారాధన చేసి, నమస్కరించి తలెత్తిచూసి నిశ్చేష్టురాలైంది. ఆమెకు ఎదుట రమేశు నిల్చుని వున్నాడు. తలమీద కొంగు మెడకు చుట్టుకునివుంది. ఇప్పుడే రమేశునికి నమస్కరించి లేచి నిల్చున్నట్లుంది. ఇక్కడకు రావద్దని రమ చిన్నమ్మ అన్నమాటలు, యిప్పుడు రమేశుకు జ్ఞాపకంలేవు. అందువల్లనే అతను మెదలకుండా

లోపలికి వెళ్ళి రమయెదట నిల్చున్నాడు. ఆ యిద్దరూ నెలరోజు లయాక కలుసుకున్నారు.

"మీరు అంతా వినేవుంటారు. నేను ఆ చెఱువులోని నీళ్ల వెళ్ళ గొట్టేందుకు మీ అనుమతికోసం వచ్చాను."

రమ కున్న ఆశ్చర్యం దూరమైంది. తలమీదికి ముసుగు లాక్కొని అన్నది- "అదెలా జరుగుతుంది? పెద్దన్నయ్యగారి అనుమతికూడాలేదు."

"లేదని తెలుసు! అయినా ఆయన వొక్కడి అనుమతి లేకపోయినా ఫర్వాలేదు."

కొంచెం ఆలోచించి, రమ అన్నది— "చెఱువులోని నీళ్ల బయటకు వెళ్ళదీయాల్సిందే. కాని వాటిలోని చేపల్ని యెలా ఆపగలరు?"

"అంతనీటిలో ఏమీ వుపాయం చేయలేం! ఈ సంవత్సరం మనకు జరిగే నష్టాన్ని మనమే భరించాలి. లేకుంటే వూరంతా తిండికి చచ్చి పోతుంది."

రమ మాట్లాడలేదు.

"అయితే మీరు అనుమతి యిచ్చినట్లేగా?"

రమ కోమలంగా అన్నది- "కాదు. నే నంత డబ్బు నష్టపడను."

ఆశ్చర్యంతో రమేశు హతబుద్ధి అయాడు. అలా జవాబు యిస్తుం దని ఎప్పుడూ అనుకోలేదు. తను వినయపూర్వకంగా అడిగితే, రమ కాదని చెప్పదని నమ్మాడు. రమ తల యెత్తకుండానే అతని మనసును గ్రహించింది- "అంతేకాదు ఈ సంపదంతా మా తమ్ముడిది. కేవలం అజమాయిషిమాత్రం నామీద వుంది."

"కాదు. అందులో నీకూ సగభాగం వుంది."

"పేరుకు మాత్రం! చిట్టచివరకు ఆస్థంతా యతీంద్రుడదేనని మానాన్నకు తెలుసు! అందువల్ల సగం నాపేర వ్రాశారు."

అయినప్పటికీ రమేశు అనునయ వినయాలతో చెప్పాడు— "రమా! యిది ఎంత నష్టం. ఒక పెద్దనష్టంకాదు. నేను నిన్ను ప్రార్థిస్తు న్నాను. రమా! ఈ కొద్దిబాధానికి యింతమంది నోటిదగ్గర తిండి లాక్కో వద్దు. నువ్వింత ఐష్టూరంగా వుంటావని నేను కలలోకూడా అనుకోలేదు."

రమ ఆ విధంగానే కోమలంగా చెప్పింది— "నేను నష్టపడను. అందుకు నేను నిష్ఠూరం పడవలసి వచ్చినా లెక్కచేయను. ఒకవేళ మీ కంత దయవుంటే—మీరే ఆ నష్టాన్ని ఎందుకు భర్తీ చేయలేరు?"

ఈ కోమలమైన స్వరంలో ఎత్తిపొడుపు వున్నట్లు గ్రహించి రమేశు మండిపడ్డాడు —'మనిషియొక్క ఉదాత్తత, ఒక్క డబ్బు విషయంలో తేలిపోతుంది. పైపై మోసాలన్నీ ఈ సంగతి వచ్చేసరికి తొలగిపోతాయ్! అప్పుడు మనిషి నిజస్వరూపం బయటపడుతుంది. కాని నువ్వు యిలాంటిదాని వనుకోలేదు. చాలారోజుల్నుంచీ, వీళ్ళందరి కంటే గొప్ప బుద్ధిగలదాన వనుకున్నాను. కాని అటువంటిదానివి కావు నిన్ను కఠినాత్మురాలి వనడంకూడా పొరపాటే!నువ్వు ఎంతో నీచురాలివి, చాలా అల్పురాలివి."

భరింపరాని విస్మయంతో రమ కళ్లు చింపుకుని-'న న్నేమన్నావ్-' అని అడిగింది.

"నువ్వు నీచురాలివి.హీనురాలివి. నే నెంత వ్యాకులంగా వున్నానో నువ్వెరుగుదువు. అందువల్లనే నష్టం పూర్తిచేయమని నన్ను అడిగావే, పెద్దన్నయ్యకూడా యీమాట అడగలేకపోయాడు. ఏ మాట పురుషుని నోటంట బయటికి రాలేదో — అదే స్త్రీవైన నీ నోటినుండి బయటికి వచ్చింది. అంతకంటే ఎక్కువ నష్టంకూడా పూర్తిచేయగలను. కాని, రమా! యివాళ నీ కొక సంగతి చెప్పివెళతాను. ప్రపంచంలో అనేక రకాలైన పాపాలున్నాయి. కాని. అన్ని పాపాలకన్న - మనిషిలోని దయాస్వభావంమీద అత్యాచారం చేయడం మహాపాపం! యివాళ నువ్వు అలాచేసి, నాదగ్గర డబ్బు వసూలుచేయాలని చూశావు-"

రమ హతబుద్ధురాలై కళ్లప్పగించి చూస్తూవుంది. ఆ నోటంట ఒక్కమాటకూడా పెగిలిరాలేదు. రమేశు అవిధంగానే శాంతంగా - దృఢ మనసుతో చెపుతున్నాడు- 'నాకు దుర్బలం ఎక్కడుందో-నీకు తెలుసు. కాని యికమీద అక్కడనుంచి ఒక చుక్కయినా ద్రవించదు. ఈ విషయం ముందుగానే చెపుతున్నాను. దానితోపాటు నేను చేయబోతూన్న పనికూడా చెపుతున్నాను. నే నిప్పుడే వెళ్ళి బలవంతంగా కట్ట తెగగొట్టిస్తాను. మీకు చేతనైతే అడ్డుకోవచ్చు!" అని వెళ్లబోతూన్న రమేశుని

వెనకకు పిల్చింది రమ. అతను దగ్గరకువచ్చి నిలుచున్నాడు-"నాయింట్లో నిలుచుని, నన్నవమానంచేశావు. అందుకు నే నేమీ జవాబు చెప్పను. కాని, మీ రావనిమాత్రం తలపెట్టవద్దు" అని చెప్పింది రమ.

"ఎందుకని-?"

"మీ రింతగా అవమానించినప్పటికీ. మీతో పోట్లాట నాకు యిష్టంలేదు."

ఆమాట చెపుతున్నప్పుడు ఆమెముఖం అస్వభావికంగా ఎంతలో తెల్లబడిపోయిందో-మాట్లాడుతున్నప్పుడు పెదవులు యెలా వణకిపోయి నవో-ఆ చీకటిలోకూడా రమేశు చూడగలిగాడు. కాని ఆ సమయాన ఆమె మనస్తత్వాన్ని పరిశీలించడానికి అవకాశంగాని, ప్రవృత్తిగాని లే దతనకి. అందువల్ల ఆయన వెంటనే జవాబుచెప్పాడు-"పోట్లాట కాట్లాట లంటే నాకూ యిష్టంలేదు. ఏమైనా - తర్కవితర్కాలవల్ల పనిలేదు-నేను వెళుతున్నాను-"

అప్పుడు రమ చిన్నమ్మ ఠాకూరుగదిలో పూజచేసుకుంటూవుంది. ఈ సంగతి ఆమెకు తెలియదు. క్రిందకు వచ్చి చూసేసరికి రమ దాసీని తీసుకుని బయటికి వెళ్ళబోతూండడం చూసి-"ఈ బురదలో యెక్కడికి వెళుతున్నావు రమా!" అని అడిగింది-

"ఒకసారి పెద్దన్నగారిదగ్గరకు వెళ్ళివస్తాను చిన్నమ్మా-"

"దారంట ఎక్కడా కొంచెంకూడా బురదలేదమ్మగారూ! చిన బాబుగారు రోడ్డు వేయించారు. ఎక్కడైనా కొంచెం కుంకం వొలికినా ఎత్తుకోవచ్చు. భగవంతు డాయనకు వెయ్యి సంవత్సరాలు ఆయుర్దాయం యివ్వాలి. పాములవల్ల బీదవాళ్లు రక్షింపబడ్డారు-" అని దాసి అన్నది.

• • • • •

రాత్రి పదకొండు గంటలవుతుంది. వేణీబాబుగారి చండీమండపం హాల్లో చాలామంది మెల్లిమెల్లిగా మాట్లాడుకుంటున్న ధ్వని వినపడు తూంది. ఆకాశంనుంచి చాలా మేఘాలు తప్పుకున్నయ్! త్రయోదశి చంద్రుడు వేణీబాబుగారి అంగనంలో ప్రకాశిస్తున్నాడు. అక్కడే ఒక స్తంభానికానుకుని భయంకరమైన ఆకృతిగల ముసల్మాను కళ్లుమూసుకుని కూచునివున్నాడు. అతని ముఖంమీద నెత్తురు గడ్డలావుంది. గుడ్డలమీద

కూడా రక్తపు మరకలున్నయ్! కాని అతను మెదలకుండానే చూచుని వున్నాడు. వేణీ ఎంతో మెల్లగా ప్రతిమాలుతున్నాడు-"అక్బర్! నమాట విను. పోలీస్‌స్టేషన్‌కు పోదాం, పద. వాణ్ణి యేడేళ్లు జెయిలుకు పంపక పోతే - నేను ఘోషాల్ వంశీయుణ్ణి కాను." అని వెనుకకుతిరిగి చూసి- "రమా! నువ్వన్నా చెప్పు. మెదలకుండా వూరుకున్నావే "అన్నాడు.

కాని రమ కొయ్యబారినట్లు కదలకుండా నిలుచునివుంది.

ఈమారు అక్బరాలి కళ్లుతెరిచి, లేచి సరిగ్గా కూచుని- "శభాష్ చిన దొరగారూ! నిజంగా ఆ తల్లిపాలు తాగినవాడివి. కక్ష్రసాధు చేయాలంటే నువ్వే చేయాలి" అన్నాడు.

వేణీ కలవరపాటుతోనూ, కోపంతోనూ అన్నాడు- "అక్బర్! విన్నా సంగతే చెప్పమంటున్నాను. ఎవరిలాఠీతో నీకు దెబ్బలు తగిలి నయ్? వాడి చేతిలోనా? వాడి పడమటి నౌకరుచేతిలోనా?"

అక్బరుముఖంలో నవ్వు కనుపించింది-"ఆ పొట్టివాడిచేతి లాఠీ తోనా? పెద్దబాబూ! వాడికి లాఠీపట్టడం ఏం చేతనవును? ఏం గౌహర్? వాడు నీ మొదటిదెబ్బకే పడిపోలేదూ?"

అక్బరు కొడుకులిద్దరూ ఆ దగ్గర్లోనే ముడుచుకుని కూచున్నారు. వాళ్ళకుకూడా దెబ్బలు తగిలాయ్: గౌహర్ మాట్లాడకుండా హుంకరించాడు. కాని నోటితో ఏమీ చెప్పలేదు. అక్బరు చెప్పడం మొదలు పెట్టాడు - "ఒకవేళ నా చేతిదెబ్బ తగిలినట్లయితే వాడు బ్రతికేవాడు కాడు. వాడు గౌహర్ లాఠీదెబ్బతో 'బాబోయ్' అని కూచున్నాడు పెద బాబూ."

రమ లేచి వాళ్ళదగ్గరకు వచ్చింది. అక్బరు పీర్‌పురంలో ఆమె పొలం చేస్తున్నరైతు. అదివరకు తన చేతికర్రతో చాలా ఆస్తి పీర్లకు చెందేట్లు చేశాడు. అందుచేతనే యివాళ సాయంకాలం క్రోధం. అభిమానంతో రెచ్చిపోయి, ఆమె అతన్ని పిల్చి, అడ్డకట్టకు కాపలావుంచింది. అదిగాక రమేశు, అతని పడమటిదేశపు నౌకరు సాహాయ్యంతో కట్ట యెలా తెగగొట్టించగలడో చూద్దామనుకుంది. కాని రమేశు కర్ర తిప్పడంలో యింత నేర్పరని యెన్నడూ వూహించలేకపోయింది.

అక్బరు రమవేపుచూసి అన్నాడు — "అమ్మగారూ! అప్పుడు చినబాబుగారు వాడిచేతిలోని కర్ర తీసుకుని కట్టమీద నిలబడ్డారు మేము తండ్రీ కొడుకులం ముగ్గురం కూడా వారిని అక్కడనుంచి కదిలించలేక పోయాం. ఆ చీకట్లో ఆయనకళ్లు పులికళ్ళలా మెరిసినయ్! ఆయన— 'అక్బర్! నువ్వు ముసలివాడివి. తొలగిపో! ఈ కట్ట తెగగొట్టకుంటే గ్రామమంతా ఆకలిలో చచ్చిపోతుంది. అందుకని దీన్ని ఎలాగైనా తెగ గొట్టితీరాలి. నీవూళ్ళో నీకూ పొలముంది. అది యిలా చెడిపోతూంటే మీకెలావుంటుంది?' అని అన్నాడు. అప్పుడాయనకు సలాంచేసి — "చిన బాబుగారూ! భగవంతునితోడు! మీరు ఒక్కసారి తప్పుకోండి! మీచాటున నిలుచుని, గడ్డపారలతో కట్ట తెగగొట్టుతున్నవాళ్ళ తలల్ని తెగవేస్తాను" అన్నాను.

వేణీ తన కోపాన్ని అపుకోలేకపోయాడు.మధ్యలోనే అడ్డువచ్చి— "విశ్వాసఘాతకుల్లారా! అక్కడవాడికి సలాములుచేసి వచ్చి, యిక్కడ బడాయిలు కొడుతున్నారా?" అని అన్నాడు.

తండ్రీకొడుకు లిద్దరు ఒక్కసారి చేతులెత్తారు, అక్బర్ కర్క శంగా అన్నాడు — "జాగ్రత్త పెదబాబుగారూ! విశ్వాసఘాతకులని అన వద్దు. మేము ముసల్మానులము. అంతా సహించగలం కాని యీమాట సహించలేము."

ఆ తరువాత అక్బరు తన తలమీది రక్తాన్ని తుడుచుకుని, రమ వేపు చూసి— "అమ్మగారూ! యింకా విశ్వాసఘాతకులమని అంటారే మమ్మా! పెద్దబాబుగారు యిక్కడ యింట్లో కూచుని విశ్వాసఘాతకులమని అంటున్నారు. ఒకవేళ అక్కడికివచ్చి కళ్ళతో చూసినట్లయితే చినబాబు గారు ఎటువంటివారో తెలిసేది?"

వేణీ ముఖాన్ని వికృతంగాపెట్టి-"అందుకే చినబాబుగా రెటువంటి వారో స్టేషనుకు వెళ్ళి చెప్పమంటున్నాను. ఏమీలేదు, అడ్డుకట్టకు కావలా కాస్తుంటే చినబాబుగారు వచ్చి కొట్టారని చెప్పండి" అన్నాడు.

అక్బరు నాలుక కొరుక్కుని — "రామ రామ. పెదబాబు గారూ! మీరు రాత్రిని పగలు - పగలును రాత్రి చేయమంటారేం?" అన్నాడు.

"సరే! అలాకాకపోతే మరొకలా చెపుదాం! యివాళ వెళ్ళి ముందు దెబ్బలు చూపించిరా! రేపు వాళ్ళంటు తీసుకుని వచ్చి వాళ్ళను తెలియటకు పంపిద్దాం! రమా! నువ్వుకూడా యితనికి కొంచెం నచ్చచెప్పు. యిటువంటి అదును యిక తిరిగిరాదు."

రమ ఏమీ జవాబు చెప్పలేదు. ఒక్కసారిమాత్రం అక్బరు ముఖం వేపు చూసింది. అక్బరు తలూపి — "కాదమ్మా! అలా నాచేతకాదు" అని చెప్పాడు.

వేణీ దబాయిస్తూ— 'ఎందువల్లకాదు' అని అడిగాడు.

ఈమారు అక్బరుకూడా గట్టిగా-"పెదబాబుగారూ! మీరనే దేమిటి? నాకేమీ సిగ్గు లేదనుకుంటున్నారా? ఈ చుట్టుప్రక్కల గ్రామాల్లో నన్ను సర్దార్ అనిపిలవడంలేదూ? అమ్మగారూ! మీరుచెప్పినట్లయితే ముద్దాయిగా బోనులో నిలబడతాను. కానీ వెళ్ళి ఏముఖంతో ఫిర్యాదు చేయమంటారు?" అని అడిగాడు.

రమ కోమలంగా ఒక్కసారి మాత్రం అడిగింది— 'అయితే అక్బర్! స్టేషన్‌కు వెళ్ళలేవా?'

అక్బర్! తలుపుతూ అన్నాడు— "లేదమ్మగారూ! ఏదనైనా చేయ గలను, కాని స్టేషనుకు వెళ్ళి గాయాలు మాత్రం చూపలేను. లే, గౌహర్. యింటికి వెళ్దాంపద—కేసుపెట్టడం మావల్లకాదు" అంటూ అందరూ లేవబోయారు.

వేణీ కోపంతోనూ, నిరాశతోనూ, వాళ్ళవేపుచూసి, కళ్ళలోంచి నిప్పులు గురిపిస్తూ—అనరాని మాటలని, తిట్టరాని తిట్లన్నీ తిట్టాడు మనసులోనే. రమ యీ విధంగా, విరుద్ధామ స్తబ్దతలోని అర్థము తెలి యక, కోపంతో కుమిలిపోతున్నది. వేణీ అనునయ వినయాలనూ, బెదరింపులను, కోపాన్ని లెక్కచేయక అక్బరాలి తన కొడుకులను తీసు కుని బయటికి వెళ్ళగానే, రమ హృదయాన్ని భేదించుకుని ఓ గంభీరమైన నిట్టూర్పు బయటికి వచ్చింది. అకారణంగా ఆమె కళ్ళు నీళ్ళతో నిండి పోయినయ్!

ఇవాళ యింత పెద్ద అవమానమూ—పరాజయమూ తటస్థించినా ఏమిటో తన గుండెలమీదనుంచి పెద్దబరువు దించినట్లయింది. ఇలా

ఎందుకయిందో ఆమె తెలుసుకోలేకపోయింది. ఆ రాత్రంతా ఆమెకు నిద్ర పట్టలేదు. ఆనాడు తారకేశ్వరంలో రమేశుకు భోజనం పెట్టిన దృశ్యం కళ్ళకు కన్పించింది. సుందరమైన అతిథి సుకుమారమైన శరీరంలోపల యింత దయా, యింత తేజమూ ఏ విధంగా, ప్రచ్ఛన్నంగా, అణిగి వున్నాయా అని ఆలోచించేసరికి కన్నీళ్ళతో ఆమెముఖం తడిసిపోయింది.

# 12

రమేశు చిన్నతనంలో ఒకప్పుడు రమను ప్రేమించాడు. అది చిన్ననాటి ప్రేమ అనడంలో సందేహంలేదు. అది ఎంత కఠినమైనదో మొట్టమొదటిసారిగా తారకేశ్వరంలో అనుభవించి వచ్చాడు. అదిగాక అదియింకా ఎంత గంభీరమైనదో—ఆనాటి సాయంకాలం రమతోవున్న పరిచయమంతా తుడిచివేసి వచ్చినప్పుడు కూడా తెలుసుకున్నాడు. ఆ తరువాత ఆనాటి రాత్రి జరిగిన దుర్ఘటన రమవిషయం అతనికి మరుభూమిలా శూన్యంగా కనుపిస్తూంది. కాని అందువల్ల తన పనిపాటలూ, చదుకోవడం, కూచోవడమూ, అలా చివరకు ఆలోచనలూ, అధ్యయనం, అన్నీ యింతరుచితప్పిపోతాయని అనుకోలేదు. యీ గృహవిచ్ఛేదమూ, సర్వత్రా వ్యాపించి అనాత్మీయమూ వల్ల యిక ఒక క్షణంకూడా యీ వూళ్లో వుండగూడదని నిశ్చయించుకున్నాడు. కానీ యీ మధ్యలో జరిగిన ఒక సంఘటనవల్ల మళ్ళీ నిలబడాల్సివచ్చింది.

చెరువుకు ఆవలనున్న పీర్‌పుర గ్రామముకూడా వాళ్ళ జమీందారీలోనిదే. అక్కడ ఎక్కువగా ముసల్మానులు వుండే వాళ్ళు. ఒకనాడు వాళ్లంతా కట్టకట్టుకుని రమేశు దగ్గరకు వచ్చారు. వాళ్లంతా ఒక్కసారిగా- "మేమూ మీ ప్రజలమే! అయినప్పటికీ మేము ముసల్మానులం కావడం వల్ల మా పిల్లల్ని మీ బడిలో చేర్చుకోవడంలేదు. మేము చాలాసార్లు ప్రయత్నించాము కాని, విఫలమనోరథుల మయాము, మాష్టర్లు మా పిల్లలను బడిలో చేర్చుకునేందుకు యిష్టపడలేదు." అని చెప్పారు.

రమేశ్ విస్మయం—కోపంతో—"ఇటువంటి అన్యాయమూ అత్యాచారమూ నే నెప్పుడూ వినలేదు. మీరు మీ పిల్లల్ని తీసుకుని రండి; నేను దగ్గరుండి అందర్ని చేరుస్తాను—" అని చెప్పాడు.

మేమూ మీ జమీందారీలోని ప్రజలం—సుంకం చెల్లించి భూమి దున్నుకుంటున్నాము. అందువల్ల హిందువుల్లా మేము జమీందారులకు భయపడము. అయినా యీ విషయంలో ఏదైనా పడినందువల్ల బాధం లేదు. ఎందుకంటే దీనివల్ల పోట్లాట పెంచడమేకానీ. వాస్తవికంగా బాధ మేమి వుండదు అందువల్ల మా వూళ్ళోనే ఓ చిన్నస్కూలు పెట్టుకోవాలని చూస్తున్నాము. అందుకు తమరేమైనా సాహాయంచేస్తే పని జరిగిపోతుంది'' అని అంతా ఒక్కసారి చెప్పారు,

పోట్లాటలన్నా, తగాదాలన్నా రమేశుకూడా ఒకవిధంగా విసిగి పోయాడు. అందువల్ల ఆ విషయాన్ని ఎత్తకుండా, దాన్ని వృద్ధిచేయకుండా, స్కూల్ పెట్టిస్తానని, వాళ్ళకు హామీ యిచ్చాడు. అప్పటినుంచీ ఆయన క్రొత్తస్కూలు వాళ్ల కోసం పెట్టించాలనే ప్రయత్నంలో వున్నాడు. పిల్ల సంపర్కంలోకి వచ్చాక రమేశు మానసికంగా స్వస్థుడవడమే కాకుండా —యిది సంవత్సరంనుంచీ క్షీణించిపోయిన బలాన్ని తిరిగి సంపాయించాడు. వీళ్ళు తన కుంవాపురంలోని హిందువుల్లా మాటిమాటికి తగవులాడుకోరు. ఒకవేళ పోట్లాడుకున్నా, దాన్ని తీర్పు చెప్పేందుకు కోర్టులకువెళ్ళరు. పైగా యిష్టంకాని, అయిష్టంకాని, ఏమైనా వూళ్లోనిపెద్దలు చెప్పినట్లు నడుచుకునే వాళ్ళు. అందులో విశేషించి. ఆపదల సమయంలో మనస్ఫూర్తిగా ఒకరి నొకరు ఆదరించుకునేవాళ్ళు. ఈ విషయం హిందువులలో తనెక్కడా చూడలేదు.

జాతిభేదాలంటే రమేశుకు యిష్టంలేదు. పైగా ఈ దగ్గరదగ్గర వుండే రెండువూళ్ళను ఒకదానిప్రక్కన ఒకదాన్ని వుంచి చూసేసరికి, ఆయనకు మరింత అయిష్టత కలిగింది. హిందువులలోవుండే, ధార్మికంగా సామాజికంగావున్న విషమత్వమే, యీ ఈర్ష్యకూ, ద్వేషానికీ కారణమని గ్రహించాడు. ముసల్మానులలో ధర్మవిషయంగా అంతా సమానులే; అందువల్లనే వాళ్ల లోవుండే సంఘీభావం హిందువుల్లోలేదు. ఉండబోదు కూడా. ఎప్పుడైతే జాతిభేదము దూరంచేసేందుకు వుపాయంలేదో— ఎవరకు దాన్నిగురించి ప్రసంగించడంకూడా అసంభవమైనప్పుడు, వాళ్ళ లోని పోట్లాటలన్నీ పోగొట్టి, ప్రేమించడం నేర్పడమనేది వృధా శ్రమ పడడమే అవుతుంది. ఇది కొన్ని సంవత్సరాలనుంచి తన గ్రామములోని

ప్రజలకోసం వృధాగా శ్రమపడినందుకు రమేశుకు పశ్చాత్తాపం కలిగింది. వీళ్ళెప్పుడూ యిలా కొట్టుకొంటూ, తిట్టుకుంటూ వుంటూ, రోజులు గడుపుతుంటారని, యికముందుకూడా యిలానే గడుపుతారని రమేశుకు బాగా అర్థమైపోయింది. వీళ్ళుమాత్రం యిలావుంటే ఏనాటికీ బాగుపడతారో, లేదో పరీక్షించి తెలుసుకోవాలని అనుకున్నాడు.

కొన్ని కారణాలవల్ల, కొన్నిరోజులనుంచీ, పెద్దమ్మను కలుసుకోలేదు, ఆనాడు పోట్లాట జరిగాక, ఒకవిధంగా వెళ్ళగూడదనే అటు వెళ్ల లేదు. యివాళ ఉదయమే లేచి వాళ్ళింటికి వెళ్ళాడు. పెద్దమ్మ తెలివి తేటలమీదా — లోకజ్ఞానంమీదా — అతనికున్న నమ్మకమెంతో అతనికే తెలియదు. పెద్దమ్మ అప్పటికే లేచి స్నానసంధ్యలు నిర్వర్తించుకుని, యింటిపనులన్నీ చేసి, అస్పష్టంగావున్న ఆ వెలుతురులో—తనగదిలో చాపమీద కూచుని, కళ్లద్దాలు పెట్టుకుని, ఏదో పుస్తకం చదువుతూ వుండడంచూసి రమేశుడు ఆశ్చర్యం పొందాడు. రమేశుని చూసి ఆమె కూడా ఆశ్చర్యపడింది. ఆమె పుస్తకంమూసి రమేశుని ఆదరపూర్వకంగా లోపలికి పిల్చి కూచోపెట్టి—అతని ముఖంవేపు చూసి-'యింత ఉదయాన్నే వచ్చావేం నాయనా?' అని అడిగింది.

"నేను చాలా రోజుల్నుంచి నిన్ను చూసేందుకు వీలుపడలేదు పెద్దమ్మా! నేను పీరుపురంలో ఒకస్కూలు పెట్టిస్తున్నాను."

"అవును! నేనూ విన్నాను. కాని ప్రస్తుతం మనస్కూలులో పాఠాలు చెప్పేందుకు రావడంలేదేం?"

"ఆ విషయం చెప్పడానికే వచ్చాను పెద్దమ్మా! వీళ్ళ మంచికోసం ప్రయత్నించడం వట్టిశ్రమ పెద్దమ్మా! ఒకరిమంచి ఒకరు చూడలేనివాళ్లూ- ఎక్కువగా అభిమాన అహంకారాలుగలవాళ్లకోసం కష్టపడి—ప్రాణం యిచ్చినాకూడా లాభముండదు. పైగా వీళ్లంతా యింకా ఎక్కువగా శత్రుత్వం చూపుతారు. ఇప్పుడు ఎవరికి మంచిచేస్తే -- అది మంచిదవుతుందో వాళ్లకోసమే ప్రయత్నిస్తాను."

"యిదేమంత కొత్తసంగతికాదు రమేశ్! ప్రపంచంలో మంచికోసం ప్రయత్నించే ప్రతివారికీ శత్రువులు ఎక్కువవుతుంటారు. అందువల్ల భయపడి వెనకకు వెళ్ళేవారిలో నువ్వు కలుస్తావా? అటువంటప్పుడు

పనెలా జరుగుతుంది, రమేశ్? భగవంతుడు యీ కష్టమైన ధారాన్ని నీకు వప్పగించాడు. నువ్వు తలమీద పెట్టుకుని మోయక తప్పదు. ఏం రమేశ్? అయితే నువ్వు వాళ్ల చేతి నీళ్లుకూడా త్రాగుతున్నావా?"

"చూడు పెద్దమ్మా! ఈ సంగతి నీ కప్పుడే తెలిసిందీ? అయినా యింతవరకూ నేను త్రాగలేదు. త్రాగినందువల్ల దోషంకూడా లేదను కుంటాను. నేను కులభేదాలుకూడా పాటించను."

పెద్దమ్మ ఆశ్చర్యపడుతూ—"కులభేదాలు వొప్పుకోవూ? అయితే కులభేదాలు లేవా? కులభేదం వుందని నువ్వు వొప్పుకోవన్న మాట?" అని అడిగింది.

పెద్దమ్మ ఆ సంగతి తేల్చుకోవాలనే నేను వచ్చింది. కుల భేదాలు వున్నాయని వొప్పుకుంటాను. కాని అదంత మంచిది కాదంటాను నేను."

"ఎందుకని"

రమేశుడు కొంచెం వుత్తేజితుడై — "ఈ సంగతి కూడా నీకు చెప్పాలా? పీటిమూలానే, యిన్ని మనస్పర్ధలూ, పోట్లాటలు కలుగుతున్నా యని నీకు తెలవదూ? సంఘంలో ఎవరిని తక్కువజాతివారని దూరంగా వుంచుతామో —వాళ్లు అగ్రజాతివాళ్ళను ద్వేషించడమూ—తమ తక్కువ తనాన్ని కోగొట్టుకునేందుకు విద్రోహం తలపెట్టడమూ, తమ నీచత్వా న్నుంచి బయటపడేందుకు ప్రయత్నించడం వాళ్ళ స్వభావమేకదమ్మా! హిందువులకు సంఘీభావం తెలియదు. వీళ్ళకు తెలిసింది దూరంగా వుండడమే! తననూ, తన జాతినీ, రక్షించుకోవాలనీ, వృద్ధిచేయాలనీ, వున్న ప్రపంచ నియమాన్ని వీళ్లు స్వీకరించరు. అందువల్లనే రోజు రోజుకూ క్షీణించిపోతున్నారు. జనాభా లెక్కలను మనం గమనించా మంటే, భయంవేస్తుంది పెద్దమ్మా! తన తోడి మానవుడ్ని తక్కువ వాడని అవమానించినదానికి ప్రతిఫలం మనకు ప్రతివిషయంలోనూ కని పిస్తూంది. నానాటికీ హిందువులసంఖ్య క్షీణించి ముసల్మానులసంఖ్య పెరుగుతున్నా—మనవాళ్ళకు జ్ఞానం రావడంలేదు" అన్నాడు.

విశ్వేశ్వరి నవ్వుతూ చెప్పింది— "రమేశ్! నీ మాటలు విన్నాక కూడా నా కా జ్ఞానం కలగలేదు. నువ్వన్న జనాభాలెక్కలువేసేవాళ్లు —

ఎంతమంది హీనజాతివాళ్లు. తమ కులాన్నీ, ధర్మాన్నీ, ఈ భయంవల్లనే వదులుకున్నారని చెప్పితే బావుండేది, హిందువులు నానాటికి క్షీణించి పోతున్నారన్నావు. అది బాగానేవుంది. కాని అందుకు కూడా వేరే కారణం వుంది. నిజంగా అదికూడా సంఘం పొరపాటే; కాని తక్కువ జాతివాళ్లు తమ జాతిని వదులుకోడానికి కారణం అదికాదు. తాను తక్కువ జాతివాడిననీ, యేహిందువూ తన జాతినీ, ధర్మాన్నీ పోగొట్టుకోడు."

రమేశు సందిగ్ధంగా— "కాని పెద్దమ్మా! పండిత పామరులు అలానే అంటున్నారు" అని చెప్పాడు.

"పండితుల వూహలకు విరుద్ధంగా తర్కించలేము. ఫలానా గ్రామంలో యింతమంది, యీ కారణంవల్లనే తమ ధర్మాన్ని వదులుకున్నారని చూపెంచినట్లయితే పండితుల మాట వొప్పుకుంటాను. కాని అలా యేవరూ చెప్పలేరని మాత్రం నాకు తెలుసు."

"కాని పెద్దమ్మా! తక్కువజాతివాళ్ళంతా — అగ్రజాతివాళ్ళను ద్వేషిస్తారని నేను చెప్పగలను."

ఈ వుత్తేజ పూర్వకమైన మాటమీద విశ్వేశ్వరి నవ్వి—"నిజం కాదు బాబూ! అది నిజంకాదు. ఇది పట్టణంకాదు. ఈ పల్లెల్లో తనది తక్కువ కులమనీ, తనది ఎక్కువ కులమనీ, ఎవరూ అనుకోరు. తమ్ముడు అన్నకంటే రెండుమూడు సంవత్సరాలు చిన్నవాణ్ణనీ అన్నమీద తమ్మునికి ఏవిధంగా మనసులో క్షోభగాని, ద్వేషంగాని వుండదో అలాగే యీ పల్లియుల స్థితివుంది. ఇక్కడ కాయస్థులకు మేము బ్రాహ్మణులం కాలేకపోయామనే చింతే వుండదు. పల్లెవాడు, తాను కాయస్థుణ్ని కావాలని కోరడు. ఏవిధంగా పెద్దన్నకు నమస్కరించడంలో తమ్మునికి లజ్జాభిమానాలు కలగవో—అవిధంగానే కాయస్థుడు—బ్రాహ్మణుల పాదధూళి తీసుకునేందుకు కష్టపడడు, నాయనా! యీ జాతిభేదాలు యీర్ష్య ద్వేషాలకు కారణాలు కావు. ఎంతచేదన్నా మన బెంగాలీ పల్లెల్లోనయినా కావు" అని చెప్పింది.

రమేశు ఆశ్చర్యంగా ఆమె ముఖంలోకి చూసి. "అటువంటప్పుడు ఇదెలా జరుగుతుంది పెద్దమ్మా! ఆ వూళ్ళో ఎన్నో ముసల్మానుల యిళ్లున్నయ్! వాళ్ళ కిన్ని పోట్లాటలు లేవు. ఎవరైనా అక్కడ ఆపదల్లో

పున్నప్పుడు యిక్కడిలా గొంతుక కోయాలని చూడడు. ఆనాడు ద్వారకాపండితుని శవాన్ని ప్రాయశ్చిత్తం కానేవని ఎవరూ ముట్టుకోని సంగతి నీకు తెలుసుగా" అని అడిగాడు.

"తెలుసు నాయనా! అంతా తెలుసు! అందుకు కారణం జాతి భేదంకాదు. అసలుకారణం ఏమంటే ముసల్మానుల్లో ధర్మముంది. మనలో అదిలేదు. దేన్ని వాస్తవంగా ధర్మమని అంటామో, అది పల్లెల్లో అంతరించిపోయింది. యిక మిగిలిందల్లా, ఆచార—నియమాలూ—కుసంస్కారాలూ—వాటివలన వచ్చేవి వృథాగా తెచ్చుకునే వివాదాలు."

రమేశుడు హతాశుడై నిట్టూర్పువిడిచి "పెద్దమ్మా! యిందుకు ప్రతీకారం ఏమీ లేదా?" అని అడిగాడు.

"ఎందుకు లేదు నాయనా? అందుకు జ్ఞానంతోనే ప్రతీకారం చేయాలి. నువ్వు అడుగుపెట్టిన మార్గమే దానికి సుమార్గం. అందువల్లనే నీవు జన్మభూమిని వదిలిపెట్టి వెళ్ళవద్దని మాటిమాటికీ చెపుతున్నాను."

అందుకు రమేశు ఏదో చెప్పబోతూంటే విశ్వేశ్వరి, అతన్ని మధ్యలో ఆపి— "ముసల్మానుల్లోనే ఎక్కువగా అజ్ఞానం వుంటుందని నువ్వనబోతున్నావు. వున్నది. కానీ వాళ్ళ సజీవమైన ధర్మమే వాళ్ళ నన్ని విధాలా రక్షిస్తూంది. రమేశ్! ఒక సంగతి చెపుతున్నాను, పీరుపురంలో నువ్వు వినే వుంటావు. అక్కడ జాఫర్ అనే ఓ ధనికుణ్ని అందరూ కలిసి జాతిలోంచి దూరంచేశారు. ఎందుకంటే అతను తన విధవ అయిన సవితి తల్లికి అన్నం పెట్టలేదట. కాని యిక్కడ మన గోవిందగంగూలీ తన వదినెను చచ్చేట్లుకొట్టి వెళ్ళగొట్టాడు. కాని సంఘంలోంచి దూరం చేయకపోవ మటుంచి—ఆయన యిప్పుడు సంఘంలో పెద్దమనిషిగా వ్యవహరిస్తున్నాడు. మనలో యిటువంటి అపరాధాలన్నీ, కేవలం వ్యక్తిగత పాపపుణ్యాలని అంటారు. యిటువంటివాటికి శిక్ష చేయాలంటే ఆ భగవంతుడే వేయాలి, లేకుంటే లేదు, అయినా మన పల్లెసమాజం వాళ్ళకు విరుద్ధంగా భ్రూక్షేపంకూడా చేయలేదు."

యీ కొత్త సంగతి విని, రమేశు ఆశ్చర్యపోయాడు. పైగా యిది నిజమని నమ్మడానికి సందేహం కలిగింది. విశ్వేశ్వరి ఆయన మనసులో

భావం కనిపెట్టి— "నాయనా! ఫలమే వుపాయమని పొరపడవద్దు. ఏ కారణంతో నీ మనసులోని సందేహం తొలగిపోలేదో— గొప్పజాతి—నీచజాతి అని పోట్లాడుకోవడం ఉన్నతికి లక్ష్యం కావచ్చు, కాని కారణం మాత్రం అదికాదు. అన్నిటి కంటే ముందు అది బాగవందే పనిజరగదని, దానికోసం ప్రయత్నించావంటే రెండు విధాలుగా చెడుగు కలుగుతుంది. నా మాట యథార్థమో —కాదో —చూడాలనుకుంటే, పట్టణానికి దగ్గర్లో వున్న రెండు మూడు గ్రామాల్లో తిరిగిరా! ఆతరువాత మన కుంవాపురాన్ని చూడు, నీ అంత నీకే తెలుస్తుంది—" అని చెప్పింది.

కలకత్తాకు దగ్గరలోవున్న ఒకటి రెండు గ్రామాలతో రమేశుకు పరిచయంవుంది. ఆ గ్రామాలను గుర్తుకుతెచ్చుకోగానే, అతని కళ్ళ ముందునుంచి ఏదో నల్లనితెర తొలగిపోయినట్లనిపించింది. ఆయన గంభీరాశ్చర్యాదులతో విశ్వేశ్వరిముఖంలోకి చూస్తున్నాడు. కాని ఆమె అతనివేపు చూడకుండానే తన ధోరణిలో తాను చెప్పుకుపోతూవుంది—"నాయనా! అందుకే మాటిమాటికీ జన్మభూమిని వదిలి వెళ్ళవద్దని చెప్తున్నాను. నీలాగ బయటివూళ్ళకి వెళ్ళి చదువుకుని యెవరు గొప్పవాళ్ల యారో—వాళ్ళంతా నీలా స్వగ్రామాలకు తిరిగి వచ్చినా—గ్రామాలతో సంబంధం పూర్తిగా వదులుకుని వెళ్ళకుండా వుండినా— ఈ పల్లెలు యింత దుస్థితిలో వుండేవికావు. వాళ్లు—నీలాంటివాణ్ణి తరిమివేసి గోవింద గంగూళిలాంటివాళ్లను నెత్తిన ఎక్కించుకునేవాళ్లు కూడా కాదు."

అప్పుడు రమేశుకు రమ సంగతి గుర్తుకొచ్చింది. అందువల్ల అతను కోపంగానే— "పెద్దమ్మా! అలా దూరంచేసినా—నాకు దుఃఖం లేదు—"అన్నాడు.

విశ్వేశ్వరి అతని అభిమానాన్ని గమనించింది. కాని కారణం గ్రహించలేకపోయింది— 'కాదు రమేశ్! అలా జరగడానికి వీలులేదు. ఎలాగూ రానేవచ్చావు. పనికూడా ప్రారంభించావు. ఒకవేళ దాన్ని మధ్యలో వదిలి వెళ్ళావంటే నీ జన్మభూమి నిన్ను క్షమించదు."

"జన్మభూమి నా వొక్కనిదేకాదు కదూ పెద్దమ్మా—?"

"నీ వొక్కడివీ కాకపోవడమేమిటి నాయనా, నీ వొక్కడివే. కన్నతల్లి నోరువిడిచి సంతానాన్ని ఏమీ అడగదు తెలుసుగా! అంటేపల్లె యింతమందివున్నా ఆతల్లియేడ్పు ఎవరూ వినలేకపోయారు. కాని నువ్వు మాత్రం యిక్కడికి రాగానే విన్నావు—"

రమేశుడు యింకేమీ తర్కించలేదు. కొంచెంసేపు శాంతంగా వుండి. ఆ తరువాత ఎంతో భక్తి పురస్సరంగా పెద్దమ్మకు నమస్కరించి మెల్లిగా బయటికి వచ్చాడు.

భక్తి-కరుణా-కర్తవ్యాలతో పరిపూర్ణమైన హృదయంతో రమేశు తన యింటికి వచ్చాడు. అప్పటికి సూర్యోదయ మవుతూంది. అతని గదిలోని తూర్పువేపు కిటికీ తెరిచేవుంది. దాని కెదురుగా నిలుచుని, స్తబ్ధంగా ఆకాశంవేపు చూస్తున్నాడు. హఠాత్తుగా ఎవరో పిల్లవాడి పిలుపు విని వెనక్కు తిరిగి చూసేసరికి రమ తమ్ముడు యతీంద్రుడు బయట నిలుచుని - "చిన్నన్నయ్యా! చిన్నన్నయ్యా—" అని పిలుస్తున్నాడు.

రమేశు దగ్గరకు వెళ్ళి అతని చేయిపట్టుకుని—"ఎవర్ని పిలుస్తున్నావు యతీన్—?" అని అడిగాడు.

"మిమ్మల్నే—"

'నన్నా! నన్ను చిన్నన్నయ్య అని పిలవమని ఎవరు చెప్పారునీకు?'

"అక్కయ్య—"

"అక్కా? నాతో ఏమని చెప్పిరమ్మని పంపింది?"

"ఏమీ చెప్పమనలా! నీతో చిన్నన్నయ్యగారింటికి తీసుకునివెళ్ళరా అని అన్నది. అదుగో అక్కడ నిలుచుంది—" అతను గుమ్మంవేపు చూపించాడు.

రమేశుడు విస్మయంతో స్తబ్ధుడై గుమ్మంవేపుచూశాడు. ఆమె స్తంభంచాటున నిలుచునివుంది. ఆయన దగ్గరకువచ్చాడు. వినయపూర్వకంగా — "యివాళ ఎంతో అదృష్టవంతుణ్ణి! నాకు కబురెందుకు చేయలేకపోయారు? మీ రెందు కింత దూరం వచ్చారు? రా! లోపలికిరా!" అన్నాడు.

మొదట రమ అటూ యిటూ తచ్చాడింది, ఆ తరువాత యతీంద్రుని చేయిపట్టుకుని రమేశుని వెనకాల వచ్చి ఆయన గది గుమ్మం దగ్గర

కూచుంది— "ఇవాళ మీ యింటికి ఒక వస్తువును యాచన చేయడానికి వచ్చాను. యిస్తారా. చెప్పండి?"

ఆ మాట అని రమ అతని ముఖంలోకి స్థిరంగా చూస్తూవుంది- ఆ చూపుతో అతనిలోని, నవనాడులన్నీ ఉన్మత్తంగా మ్రోగి, ఒక్కసారి తెగిపోయినట్లయింది. కొద్ది క్షణాలముందు, అతని మనసులో దీప్తి వంతంగావున్న సంకల్పాలూ-ఆశలూ, ఆకాంక్షలూ, అన్నీ ఒక్కసారే ఆరిపోయినట్లనిపించింది. అయినప్పటికీ— "ఏమీకావాలో అడుగు?" అని అన్నాడు.

అతని అస్వాభావికమైన శుష్కత్వం రమకు అర్థం కాకపోలేదు. ఆమె అతని ముఖంవేపు అలాగే చూస్తూ— "ముందు మీరు మాట యివ్వండి!" అని అడిగింది,

రమేశు కొంచెంసేపుండి, తలూపుతూ— "అలా యివ్వలేను. రమా! నిన్ను ఏమీ అడగకుండా మాటయిచ్చే సామర్థ్యాన్ని, నువ్వు నీ చేతులతోనే నాశనం చేశావు" అన్నాడు.

రమ ఆశ్చర్యంతో— "నేనా?" అన్నది.

"అవును! ఆశక్తి నీకు తప్ప యింకెవరికీ లేదు. రమా! యివాళ నీకొక నిజమైన సంగతి చెప్పుతున్నాను. నీకు యిష్టముంటే నమ్ము, లేకుంటేలేదు. కాని ఒకవేళ ఆ వస్తువు నిశ్శేషం కాకుండావుంటే నీతో యీ సంగతి ఎప్పుడూ చెప్పేవాడ్నేకాదు." అని కొంచెంసేపుండి"యివాళ యీ సంగతి చెప్పడంలో నీకుగాని, నాకుగాని ఏవిధమైన లాభనష్టాలు వుండవు. అందుకనే చెపుతున్నాను. ఆరోజువరకు నీకు యివ్వగూడనిది నావద్ద ఏమీలేదు. యెందుకో తెలుసా?" అని అడిగాడు.

రమ తలూపి అన్నది- "లేదు!" కాని ఆకంఠం సిగ్గుతోనూ అంతఃకరణం ఆశంకతోనూ నిండిపోయివుంది.

"కాని, విని సిగ్గుపడవద్దు. కోపమూవద్దు. ఏదో చాలాకాలం క్రిందటి కథ వింటున్నాననుకో-" అని రమేశు అన్నాడు.

ఆ సంగతి చెప్పకుండా మధ్యలోనే అడ్డుకుందా మనుకుంది రమ. కాని, వంచిన తల యెత్తలేకపోయింది.

రమేశుడు శాంతంగా-కోమలంగా- నిర్లిప్తంగా చెప్పడం మొదలు పెట్టాడు- "రమా! నేను నిన్ను ప్రేమిస్తున్నాను. అలా యెవరూ యెవరిని

ప్రేమించి వుంటావని యివాళ అనుకుంటున్నాను. చిన్నతనంలో మా అమ్మ గారి నోటంట మనకు పెళ్ళవుతుందని వినేవాణ్ణి. ఆ తరువాత నా ఆశ లన్నీ అడుగంటిన రోజు వచ్చాను. అదిప్పటికీ గుర్తు కొస్తూంది —"

ఈ మాటలన్నీ కరిగించిన సీసంలా ఆమె చెవిలోపడి దహించ సాగినయ్. అపరిచితమైన, అనుభూతిలోని అసహ్యమైన వేదన, ఆ గుండెలో ఒక మూలనుంచి యింకొక మూలకు కోసి, ముక్కలు ముక్కలు చేసినట్లయింది. కాని అడ్డుకునేందుకు ఏమీ వుపాయం కను పించలేదు. అందువల్ల ఆమె నిరుపాయమైన రాతి ప్రతిమలాగా మని, రమేశు విషాక్త మధుర విషయాలు ఒక్కొక్కటే వింటూవుంది —

"నీకీ కథంతా చెప్పడం అన్యాయమని నువ్వాలోచిస్తున్నావు. నా మన సులో మొదట నాకూ అదే సందేహంవుంది. అందుకనే ఆనాడు తాపకే శ్వరంలో — ఒకనాటి ఆచరసత్కారాలవల్ల నా జీవితాన్నంతా మార్చి వేసినప్పుడు గూడా ఏమీ చెప్పలేకపోయాను. అప్పుడు మెదలకుండా వూరుకోవడం నా విషయంలో అసహజంగా తోచింది."

రమ సహించలేకపోయింది. "అందుకనే యివాళ గుమ్మంలో వుండగానే నన్ను అవమానిస్తున్నారన్నమాట" అని అడిగింది.

"అవమానమా! కాదు. యిందులో మానాభిమానాలసంగతే లేదు. యిదెవరిసంగతో- ఆ రమవి నువ్వుకావు. ఆ రమేశుడు కూడా యిప్పుడు లేడు. ఏమైనా- విను! ఆనాడు నాకెందుకోగాని, నువ్వేమనుకున్నా-ఏమి చేసినా-నాకు అశుభం మాత్రం తలపెట్టవని నమ్మాను. అప్పుడు చిన్న తనంలో మనం ప్రేమించుకున్న విషయం యిప్పుడు కూడా మర్చిపోవని అనుకున్నానుకామాలు, అందుకని, నీకేమీ చెప్పకుండా, నీ నీడలో నిలుచుని నాజీవిత కార్యాలన్నీ చేసుకుందామనుకున్నాను. కాని ఆ తరు వాత ఆనాడు అక్కరు నోటంట విన్నాను. అతన్ని నువ్వే అక్కడకు.... 'అరే! బయట ఏమిటూ గోల —' అన్నాడు.

యింతలో గోపాలసర్కారు వ్యాకులపాటుతో - భయపడుతూ — "బాబూగారూ?" అన్నాడు.

ఆమాట విని రమేశు బయటికి వచ్చాడు—

"బాబుగారూ! పోలీసులు ఖజానాను అరెస్టుచేశారు."

గోపాలుసర్కారు భయంతో వణకిపోతున్నాడు. అతను — "మొన్నరాత్రి రాధానగరంలో దొంగతనంలో పీడుకూడా వున్నాడని కేసు బనాయించారు—" అని చెప్పాడు.

రమేశు గదివేపు చూసి- "రమా! యిక యిక్కడ నువ్వు ఒక్క క్షణంకూడా వుండవద్దు. దొడ్డిదారిని వెళ్లు. పోలీసులు యీ యిల్లు కూడా సోదా చేయకుండా వదలరు."

రమ ముఖం పేలవమైంది. ఆమె లేచి నిల్చుని "మీకేమీ భయంలేదుగా?" అని అడిగింది.

"చెప్పలేను. అసలు సంగతి, సందర్భాలేమిటో తెలియవు. అదెంత వరకు వచ్చిందోకూడా తెలియదు."

రమ పెదిమలు వణకినయ్! ఆనాడు, తనే, పోలీసు స్టేషనులో రిపోర్టు యిచ్చింది. ఆ తరువాత ఆమె చటుక్కున యేడుస్తూ- 'నేను వెళ్ళను' అంది.

కొంచెంసేపు రమేశు ఆశ్చర్యంగావుండి— "కాదు కాదు రమా! ఇక నువ్విక్కడ వుండగూడదు. తొందరగా ఇక్కడనుంచివెళ్లు" అని రమ తమ్ముని చేయిపట్టుకుని, ఒకవిధంగా బలవంతంగానే, యిద్దర్నీ దొడ్డిదారిన బయటకి పంపి తలుపు మూశాడు.

## 13

రెండుమాసాలు కావచ్చింది. కొంతమంది దొంగలతోపాటు భజువానుకూడా 'లాకప్'లో వుంచారు. ఆనాడు సోదాలో రమేశుని యింట్లో ఏమీ అనుమానించదగ్గ వస్తువులు దొరకలేదు, భైరవాచారి సాక్ష్యం చెప్పాడు. ఆరోజురాత్రి తన కూతురుకు వరుని చూచేందుకు వెడుతూ భజువానుకూడా తీసుకుని వెళ్ళానని చెప్పాడు. అయినప్పటికీ భజువాను జామీనుమీదకూడా వదల్లేదు. వేణీవచ్చి—"రమా!ఎంతోదూరం ఆలోచించి పనిచేయాలి. లేకుంటే శత్రువు మనకు లొంగడు. 'ఆరోజున తన యజమాని చెప్పినప్రకారం కర్రతీసుకుని చేపలు లాక్కుని వెళ్ళేం దుకు భజువ మాయింటికి వచ్చాడ'ని నువ్వు రిపోర్టు యివ్వకుంటే. ఆ వెధవను పట్టుకోవడం సాధ్యమయేదా? చూడమ్మాయీ? ఇంకా నాలు

గై దుమాటలు కల్పించి అందులో రమేశు పేరుకూడా జోడించినట్లయితే తనూషా చూచేవాణ్ణి: కాని, నువ్వప్పుడు నామాట వినలేదు" అన్నాడు.

రమ ముఖం మ్లానమైంది. అది కనిపెట్టి వేణీ-"వద్దు. వద్దు నువ్వు సాక్ష్యం చెప్పేందుకు వెళ్ళనవసరంలేదు. అయినప్పటికీ,వెళ్ళవలసి వస్తే మాత్రం తప్పేముంది? జమీందార్ నిలుపుకోవాలంటే యిటువంటి విషయాల్లో వెనకాడితే పని జరగదు" అన్నాడు.

రమ జవాబు ఏమీచెప్ప లేదు.

"కాని రమేశును మనం చేజిక్కించుకోవడమంత సులభం కాదు. ఈమారు అతనుకూడా పైఎత్తులు వేస్తాడు. అతను కొత్త స్కూలు పెట్టించాడుగా. దానివల్ల మనం చాలా కష్టాలు పడవలసివుంది, అసలే యీ ముసల్మానులు మన జమీందారీని లెక్కచేయడంలేదు.ఆపైన వాళ్ళు చదువుకున్నారంటే మన జమీందారి వున్నా, పూడినా, ఒకటే. ఈసంగతి నీతో ముందే చెప్పివుంచుతున్నాను."

జమీందారి విషయమంతా రమ వేణీ అభిప్రాయ ప్రకారంగా చేస్తూ వుంది. ఈ విషయంలో యిద్దరికి ఎప్పుడూ భేదాభిప్రాయాలు రాలేదు. కాని యివాళ మొట్టమొదటసారిగా రమ తర్కించింది "రమేశన్నయ్యకు కూడా నష్టం వస్తుందిగామరి?"

ఈ సందేహం వేణీకి తెలియకపోలేదు. ఆయన యిదివరకే ఆలోచించి స్థిరపర్చుకున్న అభిప్రాయం అప్పుడు చెప్పేశాడు. "రమా? నీకీ సంగతులన్నీ ఏంతెలుసు? మనమిద్దరం కష్టాలుపడితే అదే వాడికీచాలు. ఇందులో తనకుకూడా నష్టముందని వాడు ఆలోచించనేలేదు. చూస్తూనే వున్నావుగా? వచ్చినప్పటి నుంచీ డబ్బు ఎలాతగలేస్తున్నాడో; నాలుగు వేపులా హీనజాతివాళ్ళ నోటంట 'చినబాబు'గారి పేరే వినపడుతూంది. వా డొక్కడే మనిషయినట్టూ మనిద్దరం ఏమీ కానట్టూను. కాని యిది ఎక్కువకాలం సాగదు. వాణ్ణి పోలీసుల దృష్టిలో వుండేట్లు చేశాంగా? ఈ దెబ్బతో వాడి అంతు తేలిపోతుంది."

ఈ సంవాదముతో వేణీ తాను ఆశించిన ఉత్సాహం, ప్రోత్సాహం, రాకపోయేసరికి అతని మనసులో ఆశ్చర్యం చెందాడు. పైగా రమ

ముఖం ఒక్కసారిగా మారిపోవడం గమనించాడు. రమ అడిగింది..
"అయితే నేనే రిపోర్టు చేశానని రమేశుకు తెలిసిందా?"

ఆ సంగతి సరిగ్గా తెలవదు. కాని చివరకు ఎలాగైనా యీ సంగతి తెలుసుకుంటాడు. భజువా కేసులో అన్నీ బయటపడతాయ్!"

"అందుకు రమ ఏమీ జవాబుచెప్పలేదు. ఆమె మెదలకుండా మనసులోనే, ఏదో పెద్ద ఆఘాతాన్ని సంబాళించుకుంటూన్నట్లుంది. ఈ సంగతి ఎప్పుడో ఒకప్పుడు బయటపడి తీరుతుంది. రమేశుణ్ని కష్టాల్లో యిరికించేందుకు తనే అగ్రతాంబూలం పుచ్చుకున్నదని తెలియకుండా వుండదు. ఒక్కక్షణం ఆగి అడిగింది. "ఏం పెద్దన్నయ్యా! ఇప్పుడు ఆయనసంగతే ప్రతివాళ్ళనోటినుంచి వస్తుందికదూ?" అని.

"ఒక్క మనవూళ్ళోనేకాదు. పైగా చుట్టుప్రక్కల నాలుగైదు వూళ్ళలో కూడా స్కూళ్లు పెట్టించాలనీ, రోడ్లు వేయించాలనీ ప్రయత్నిస్తున్నాడట. ప్రస్తుతం యీ అలగాజాతివాళ్ళంతా-దొరల దేశాల్లో వూరికి ఒకటీ రెండు స్కూళ్ళు వున్నాయనీ, అందుకే వాళ్ళంతా గొప్ప స్థితిలో వున్నారని అంటున్నారు. రమేశుకూడా ఏవూళ్ళో కొత్తస్కూలుకు ఏర్పాట్లు చేస్తారో ఆవూరికి రెండువందల రూపాయలు యిస్తానని ప్రచారం చేస్తున్నాడు. చిన్నాయన యిచ్చిన డబ్బంతా యీ పనులకు ఖర్చుపెడతాడు, ఇప్పుడు ఆ ముసల్మానులు వాణ్ణి 'పైగంబర్'ను కొలిచినట్లు కొలుస్తున్నారు."

అతని ప్రక్కన తనపేరుకూడా వున్నట్లయితే ఏమయేది? ఈవూహ ఒక్కసారి ఆమె మనసులో విద్యుల్లతలా మెరిసింది. అదీ ఒక్కక్షణం సేపటివరకే! ఆ మరుక్షణంలో ఆమె అంతఃకరణ మంతా రెట్టింపు చీకటి కమ్ముకుంది.

వేణీ చెప్పడం మొదలుపెట్టాడు—"కానీ నేనుకూడా వాణ్ణి సహజంగా వదలను. మన జమీందారీ ప్రజలను ఈవిధంగా రెచ్చగొడుతూంటే, జమీందారునై వుండికూడా—వూరికే చూస్తూకూచుంటా ననేది కలలోనివార్త! ఈ భైరవాచారిగాడు భజువా వేపు సాక్ష్యం చెప్పివచ్చాడు. ఇప్పుడు వాడు తన కూతురు వివాహం ఎలా చేస్తాడో నేను చూస్తాను. యింకొక సన్నాహంకూడా చేయాలి. గోవిందగంగూలీ బాబాయ్ ఏమం

టాడో చూడాలి. దేశంలో దొంగతనాలూ, దంపిపోట్లూ ఎప్పుడూ జరుగు తూనే వుంటయ్! ఇప్పుడు నౌకరును జెయిలుకు పంపాము. ఈసారి యజ మానిని పంపడానికి మనకు పెద్దకష్టంకాదు. శత్రుత్వం పెట్టుకోవడంలో వాడేమీ తక్కువవాడు కాదని నువ్వు మొదటే చెప్పావు రమా! కాని, నీ మాటే నిజమవుతుందని నే నెప్పుడూ అనుకోలేదు."

రమ యేమీ మాట్లాడలేదు. తన ప్రతిజ్ఞా, తనిష్ఠ, భవిష్యద్వాణీ, యిలాగా అక్షరఅక్షరం నిజమైనవనితెలుసుకునిగూడా ఆ స్త్రీ ముఖం అహం కారంతో ఉజ్వలమవలేదు. పైగా నల్లబడిపోయింది. అటువంటి ఆమె మనసులోని భావం గ్రహించేందుకు వేణీకి శక్తి లేకపోవచ్చు. కాని ఎంతటి వాళ్ళకైనా యిట్టే తెలిసిపోయేంతగా నల్లబడిందా ముఖం. వేణీ కూడా ఆ ముఖాన్ని చూశాడు. ఇందుకు ఆయన మనసులోనే ఆశ్చర్యం చెందాడు. ఆయన మెదలకుండా వంటింటిలోకి వెళ్ళి చిన్నమ్మతో రెండుమూడు సంగతులు మాట్లాడి, యింటికి వెళ్ళిపోతున్నాడు. ఆయన్ని రమ పైగచేసి, పిలిచి—"పెద్దన్నయ్యా! అయితే చిన్నన్నయ్య జెయిలుకు వెడితే అది మనకు కళంకము కాదా?" అని అడిగింది.

వేణీ యింకా ఆశ్చర్యపడుతూ—"ఎందుకని?" అని అడిగాడు.

"ఆయన మనకు ఆత్మీయుడు! అటువంటివాణ్ణి మనమే రక్షించక పోతే లోకమంతా మనల్ని 'ఛీ—ఛీ' అని అనదా?"

"ఎవరికర్మ వాళ్లు అనుభవిస్తారు. అందులో మనకేముంది?"

రమ తిరిగి అదేవిధంగా అన్నది—"నిజానికి ఆయన దొంగ తనం చేసేవాడు కాడు. వాళ్ళ వెంటనైనా తిరిగేవాడు కాడు. పైగా యిత రుల మేలుకోసం తన సర్వస్వము ఖర్చుపెడుతున్నాడు. అంతేగాదు, మనంకూడా వూరిలో తలెత్తుకుని తిరగ్గలమా?"

వేణీ - 'హీహీ' అంటూ వెకిలిగా నవ్వి -"ఇవాళ నువ్వు యిలా అయిపోయావేం రమా?" అన్నాడు.

రమ ఒక్కసారి యితని ముఖం—రమేశుని ముఖంతో పోల్చి చూసింది. ఆ తరువాత ఆమె తిన్నగా తలెత్త లేకపోయింది — "వూళ్ళో వాళ్ళంతా భయంతో మనముందు ఏమీ నోరెత్తడంలేదు. చాటుమాటున అనుకుంటున్నారు. చాటుమాటున రాజుగారి తల్లినికూడా రాక్షసి అని

అంటారని నువ్వేచెప్పావు. కాని భగవంతు డొకడు వున్నాడు. ఒక విప్ర రాధుణ్ని మనం దండించినట్లయితే ఆయన వూరుకోడు."

వేణీ లేని క్షోభను కనుపరుస్తూ—"అ.... అది మన ఖర్మ. వాడు దేవతల్నీ-శాస్త్రాల్నీ నమ్మడుగా? అమ్మవారిగుడి పడిపోతూవుంది, దాన్ని బాగుచేయించమని మనిషి వెళితే, నిన్నెవరు పంపించారో వాళ్ళనే బాగుచేయించమనీ, నావద్ద అటువంటి పనులకు డబ్బులేదని తిప్పి పంపాడు, విన్నావావాడిమాట? ఇదివాడికి వ్యర్థమైనఖర్చు. ఇకఅసలైన ఖర్చు ముసల్మానులకు బడి తెరవడం. పైగా బ్రాహ్మణుడుకదా! సంధ్యావందనం కూడా చేయడట. ఆముసల్మానులచేతి నీళ్లకూడా త్రాగుతున్నా డనివిన్నాను. నాలుగు ఇంగ్లీషుపుస్తకాలుచదివాడో లేదో ధర్మమూ-జాతికూడా పోగొట్టు కున్నాడు. మరి దానిశిక్ష యెక్కడికి పోయిందంటావు? అదీ పోగవుతూ వుంది. ఒకనాడు అందరూ చూస్తారు" అన్నాడు.

రమ యింక ఎక్కువగా వాదం చేయలేదు. కాని రమేశుని అనా చారమూ, ఈశ్వరునిమీద, దేవతలమీదున్న అశ్రద్ధ సంగతి స్మరించి ఆమె మనసులో అతనిమీద కొంచెంగా విముఖత ఏర్పడింది. వేణీ ఏదో అంటూ అక్కడనుంచి వెళ్ళిపోయాడు. రమ కొంచెంసేపు అలాగేనిలు చుని, ఆ తరువాత తనగదిలోకి వెళ్ళి కూచుంది. అనాడుతి ఏకాదశి. తిండి తిప్పలబెడద యేమీలేదు. ఆ సంగతి గుర్తుకొచ్చేసరికి ఆమెకు కొంత శాంతి కలిగింది.

# 14

వర్షకాలం గడిచిపోయింది. రాబోతున్న దుర్గానవరాత్రుల ఆనం దం-మలేరియాభయం—బెంగాలీ గ్రామ్య జనులకు ఆకాశంలోనూ, వాయువులోనూ, చూపుల్లోను, తొంగి చూస్తున్నాయి! రమేశునకు కూడా జ్వరం తగులుతూవుంది. గతసంవత్సరం యీ రాక్షసిబారినుండి తప్పించు కున్నాడు. కాని ఈ సంవత్సరం తప్పించుకోలేకపోయాడు. మూడు రోజులనుంచీ జ్వరపడి, యివాళ ఉదయం లేచి, ఓ పెద్ద మోతాదు క్వినైన్ మ్రింగి కిటికీదగ్గరకు వచ్చి, ఎందపేవు చూస్తూ ఆలోచనల్లో పడ్డాడు. "ఈ గ్రామములోని అనవసరమైన మురికిగుంటయూ - వ్యర్థంగా

వున్న పొదలు-తుప్పలూ—మొదలైనవన్నీ లేకుండాచేయడానికి-ఆ గ్రామీణులకు నచ్చచెప్పగలనా-లేదా? ఈ మూడురోజుల జ్వరానుభవంలో-దీనికి ప్రతిక్రియ ఏదో ఒకటి చేయా" లని నిశ్చయించుకున్నాడు. తను జ్ఞానవంతుడై వుండి కూడా, మెదలకుండా వూరుకుంటే చాలామంది నెలలూ-సంవత్సరాలూ ఈ మలేరియా బాధను అనుభవిస్తుంటారు. అటువంటప్పుడు భగవంతుడు తనను క్షమించడు. కొన్నిరోజులక్రితం ఈ సంగతి గ్రామస్థులతో ప్రస్తావించిచూశాడు. గ్రామీణులకుకూడా దానివల్ల ఎంత హానీ—అపకారం వుంటుందో తెలియకపోలేదు. కాని యితరుల మురికిగుంటలనూ, పొదలనూ, తుప్పలను పూడ్చడానికి యెవరూ ముందుకు రాలేకపోయారు. దీన్ని అక్కడ తిన్నింటివాసాలు లెక్కించడమంటారు. గోతులూ, పల్లాలూ, తుప్పలూవున్న భూమిగలవాళ్లు - యిది మా తాత ముత్తాతలకాలంనుంచి వస్తున్నవే అని చెప్పారు. అందువల్ల ఈ గోతులవల్ల ఎవరికి యిబ్బందో, వాళ్ళే పూడ్చుకోవచ్చు. కాని మేము ఖర్చుపెట్టి పూడ్చము అనికూడా చెప్పారు. ఆ చుట్టుప్రక్కల గ్రామాల్లో ఒక గ్రామము మలేరియావల్ల నాశనమైపోయిందనీ, దానికి దగ్గర్లోవున్న గ్రామములో మలేరియా అనేమాటకూడా లేదనీ రమేశ్ విన్నాడు. అందువల్ల ఆరోగ్యం కొంచెం బాగయాక, అక్కడికి వెళ్ళి ఆ గ్రామాలను కళ్ళతో చూడాలని, అక్కడ స్థితిగతులన్నీ తెలుసుకునివచ్చి, అప్పుడు తన కర్తవ్యం నిర్ణయించుకోవాలని అనుకున్నాడు. ఏ గ్రామాలలో మలేరియా లేదో—అక్కడ నీళ్లు పోవడానికి చక్కని మార్గాలుంటాయని, నిశ్చయించుకున్నాడు. ఈ సంగతి ఎవరు గమనించకపోయినా - ప్రేమతో చూపించినప్పుడు తప్పక చూడగలరని అతని విశ్వాసము. ఎంతలేదన్నా తన మాటను పీరుపురం ముసల్మానులు తప్పక వింటారని తనకు తెలుసు; తను అభ్యసించిన యింజనీయర్ శిక్షణ వ్యర్థం కాలేదనీ, దానికి మంచి అవసరం కలిగిందనీ తెలుసుకుని మనసులోనే తృప్తిచెందాడు. యింతలో యెవరో ఏడుస్తున్న గొంతుతో పిలిచారు-"బాబుగారూ!"

రమేశ్ త్రుళ్ళిపడ్డాడు. ఆయన తల త్రిప్పి చూచేసరికి భైరవాచారి నేలమీద పడి దొర్లుతూ ఏడుస్తున్నాడు. అతని యేడెనిమిదేండ్ల కూతురుకూడా అతనివెంట వుంది. ఆమెకూడ తండ్రితోకలసి యేడుస్తూ,

బొబ్బలుపెట్టింది. చూస్తూచూస్తుండగానే యింటిల్లాది అక్కడ పోగై గుమిగూడారు. రమేశునికిదేమీ అర్ధంగాక, హతబుద్ధిలా అయాడు. ఇతని వాళ్ళ ఎవరైనా చచ్చిపోయారేమో, లేక ఏమి నష్టం కలిగించో-యేవిధంగా యితన్ని వూరడించాలో, రమేశునికి అర్ధంకాలేదు. గోపాల్‌సర్కారుకూడా తన పని వదిలిపెట్టి పరుగెత్తుకుని వచ్చాడు. ఆయన దగ్గరకు వచ్చి, భైరవుని చేయిపట్టుకున్నాడో లేదో-భైరవుడు ఆయన్ని గట్టిగా కౌగలించుకుని బావురుమని యేడ్చాడు. ఈ మనిషి కాస్తకే ఆడదానిలా యేడుస్తాడని, రమేశునకు గుర్తువచ్చింది. గోపాల్‌సర్కార్ ఎంతో వూరడించాక అతను కొంచెం శాంతించి - యీ మహాశోకానికి కారణం చెప్పగానే - రమేశు స్తబ్ధుడైపోయాడు. భైరవుని సాక్ష్యంవల్ల, భజావ విడిపింపబడ్డాడు. వాడిని పోలీసుల దృష్టినుంచి మళ్ళించడానికి వాడిదేశం పంపించాడు. ముద్దాయి ఎలాగో తప్పించుకున్నాడు. కాని సాక్షిమాత్రం చిక్కులో పడి పోయాడు. ఎప్పుడైతే భైరవునికి సంగతి సందర్భాలు చూచాయగా తెలిశాయో, ఆ వెంటనే అతను కోర్టుకు పరుగుతీసి, అసలు విషయం తెలుసుకున్నాడు. అయిదారు రోజుల క్రితం రాధానగరంలో వుండే వేణీ చినమామగారైన సనత్‌ముఖర్జీ, భైరవునిపేరుమీద అసలు ఫాయిదాలు కలిపి, పదకొండువందల యిరవైఆరు రూపాయల యేడణాలకు డిక్రీ పొందాడు. ఒక్కరోజులోపలే అతని యిల్లూ, వాకిలీ వేలంవేయబో తున్నారు. అసలిది డిక్రీకాదు. నియమానుసారంగా సమను జారీ అయింది. ఎవడో భైరవునిపేరు దస్కత్తుచేసి సమను పుచ్చుకున్నాడు. తనంతట తాను భైరవుణ్ణి, నేనేనని, డబ్బుకూడా యిస్తానని వొప్పు కున్నాడు. అసలు ఈ బాకీ అబద్ధం. ఆసామికూడా మిధ్య. ఈ దావా కూడా అబద్ధమైనదే. ఆపాదమస్తకం అబద్ధంతో ఒక బలవంతుడు-ఒక దుర్బలుని పిప్పిస్తూ హింసించి-వీధివీధీ భిక్షంయెత్తుకునేవిధంగాచేశాడు. ఇప్పుడు ఈ విషయంలో సర్కారుకోర్టులో ప్రతీకారంచేయడానికేమీ లేదు. డబ్బంతా కోర్టులో కట్టనిదే ఏమి చేసేందుకు వీలులేదు. ఇప్పుడు తల పగులకొట్టుకుని చచ్చినా ఎవరూ నిజంసంగతి గ్రహించరు. కాని నిత్యదరిద్రుడైన భైరవాచారి అంతడబ్బు యెక్కడినుంచి తేగలడు? దాన్ని కోర్టులో కట్టి ఈ మహా అన్యాయానికి విరుద్ధంగా న్యాయాన్ని

కలుగజేయమని చెప్పి ప్రాణాలు యెలా రక్షించుకోగలడు? అప్పుడు న్యాయశాస్త్రమూ, కోర్టులూ, జడ్జీలు, మేజస్ట్రేటులూ మొదలైనవాళ్ళంతా పైనవున్నప్పటికిహూడా ఒక దరిద్ర ప్రతిధ్వింద్వి మెదలకుండా నాశన మవాల్సిందే: ఈ పని చేసింది-వేణీ, గోవింద గంగూలియే నని అందరికి తెలుసు. ఈ అత్యాచారకారణంగా భైరవాచారికి ఎంత కష్టం కలిగినప్ప టికీ, గ్రామమంతా తమలో తాము ఈ అన్యాయాన్ని గురించి గుసగుస లాడుకున్నప్పటికీ, ఒక్క మనిషిహూడా నోరెత్తి ఈ అన్యాయాన్ని ప్రతి ఘటించినవాళ్లెవరూ లేరు. కారణం వాళ్లు యితర విషయం అంతగా పట్టించుకోరు. ఇష్టపడరుకూడా। అయినప్పటికీ, దరిద్రులైన ప్రజలమీద నిస్సంకోచభావంతో అత్యాచారం చేసే సాహసం వీళ్ళకు యెక్కడనుంచి ప్రాప్తిస్తుందో—ఏ విధంగా దేశవ్యాప్తంగా వున్న న్యాయశాస్త్రాన్ని, ధర్మ శాస్త్రాన్నికూడా వీళ్లు కసాయివాడి కత్తికి యెలా అప్పగిస్తారో ఆసంగతి యివాళ రమేశ్ ప్రత్యక్షంగా చూశాడు. ఒకవేపు అర్థబలం, కుటిలబుద్ధి వీళ్ళను రాజశాసనంనుంచి ఏవిధంగా రక్షిస్తుందో- ఆవిధంగానే రెండో వేపునుంచి మృతసమాజం కూడా వీళ్ళ దుష్కర్మలకు శిక్షయేమీ విధిం చదు. అందువల్ల వీళ్లు కొన్ని వేల అన్యాయాలు చేసికూడా - సత్యధర్మ విహీనమైన మృతగ్రామ్యసమాజంయొక్క నెత్తిన కూచుని, తమ యిష్టానుసారంగా నిరుపద్రవంగా విచ్చలవిడిగా విహారంచేస్తున్నారు. యివాళ పెద్దమ్మ అన్న మాటలు మాటిమాటికి గుర్తుకువస్తున్నయ్। ఆనా డామె మర్మాంతికంగా నవ్వి-"రమేశ్। ఈ వెధవ జాతిభేదాలూ-ఎక్కువ తక్కువ వివాదాలూ,పొట్లాటలన్నీ అవతలపెట్టు నాయనా। కేవలం నువ్వు దీపం వెలిగించు, అదే చాలు. గ్రామస్థులంతా చీకట్లోవుండి అంధులైపో యారు. నాయనా। వాళ్ళను ఒక్కసారి కళ్లు తెరిచేట్లుచెయ్। అప్పుడు గాని వాళ్ళు యేది తెలుపో—యేది నలుపో, యేది మంచిదో-యేది చెడ్డదో తెలుసుకోలేరు. అని ఆమె యింకా అన్నది - "నువ్విక్కడకి రానే వచ్చావు నాయనా। యిక యిక్కడనుంచి వెళ్ళవద్దు. మీలాటివాళ్ళంతా యిలా ముఖం చాటుచేశారు కాబట్టే, గ్రామలక్ష్మి కింత దుర్దశపట్టింది." అదికూడా నిజమే। తను వెళ్ళినట్లయితే యిందుకు ప్రతీకారం లేశమాత్రం జరగదు. ఉపాయం యేమీ వుండదు,

రమేశు ఒక దీర్ఘ నిట్టూర్పు విడిచి మనసులో అనుకున్నాడు. ఆయ్యో! ఇదేనా మనం గర్వించదగ్గ ధనం, బెంగాలుదేశంయొక్క శుద్ధ శాంత-న్యాయనిష్ట పల్లీసమాజం యిదేనా? దీనికి ఒకప్పుడు ప్రాణం వుండివున్నరోజు లుండవచ్చు. అప్పుడు దీనికి దుష్టులను శిక్షించి, తనను ఆశ్రయించిన స్త్రీ-పురుషులను నిర్విఘ్నంగా సంసారయాత్ర చేసేందుకు సహాయపడేది. కాని యీనాడది మృతప్రాయమైపోయింది. అయినప్పటికి అంధులైన ఈ పల్లీయులు యీ పెద్ద శవదేహాన్ని విడిచిపెట్టలేక మిధ్యా మమతతో దీన్ని ఔదలదాల్చి, దినదినమూ అలసిపోయి నిర్జీవు లవుతున్నారు. కాని కళ్ళు తెరిచి ఏవిధంగానూ చూడలేకపోతున్నారు. ఏదైతే ఆర్తులను రక్షించలేదో దాన్నే సమాజం అని నమ్ముతున్నారు. ఆ మహాపాపమే వాళ్ళని అధోగతికి లాక్కొని వెళుతూంది.

రమేశు యింకొంచెంసేపు అలాగే కూచునివున్నాక, చప్పున దెబ్బతిన్నవాడిలా లేచి, ఒక చెక్కు రాసి గోపాల్‌సర్కారుచేతి కిచ్చి—"మీరు అన్ని విషయాలూ సమగ్రంగా తెలుసుకుని ఆ తరువాత యీ డబ్బు జమకట్టించి - ఏవిధంగానైనాసరే, అప్పీలుచేసేందుకు తగిన ఏర్పాట్లన్నీ చేసిరాండి. ఇంత భయంకరమైన అత్యాచారాలు వాళ్లు ఎవరి మీదా చేసే సాహసం యికనైనా తొలగిపోవాలి" అన్నాడు.

గోపాల్‌సర్కారు చెక్కు తీసుకున్నాడు. కొంచెంసేపటివరకూ ఆయన భైరవాచారి యిద్దరూ విహ్వలపడి చూశారు. రమేశు తిరిగి తన అభిప్రాయం స్పష్టంగా చెప్పాడు. యిప్పుడు తనతో రమేశు పరిహాసం వేయడంలేదని తెలుసుకున్నాడు. అందువల్ల అతను తొందరగా ముందుకు వచ్చి రమేశుని పాదాలు గట్టిగా పట్టుకుని - యేడుస్తూ - అరుస్తూ ఆశీర్వదించి-నానా హంగామా చేశాడు. ఒకవేళ అప్పుడు రమేశుని స్థానంలో యింకొక దుర్బలుడు వున్నట్లయితే తనను తాను వదిలించుకోవడం చాలా కష్టమైపోయేది.

ఈ సంగతి గ్రామములో వ్యాపించడానికి అట్టేకాలం పట్టలేదు. ఇక వేణీ-గోవిందగంగూలి సహజంగా వదలిపెట్టబడరని అందరూ అనుకున్నారు. తన పాతశత్రుత్వాన్ని బలపర్చుకోవడానికే చినబాబుగారు యిలా ఖర్చుపెడుతున్నారని అంతా అనుకున్నారు. కాని దుర్బలుడైన

భైరవాచారి ఈ ఘోర అత్యాచారభారాన్ని మోయలేక యితని తలమీద పెట్టాడని, ఆ బరువను విస్సంకోచంగా మోయడానికి రమేశు వొప్పు కున్నాడని యెవరూ తలచలేదు.

ఈ విధంగా ఒక నెల గడిచింది. మలేరియాకు విరుద్ధంగా మనసులోనే రమేశుడు యుద్ధాన్ని ప్రకటించి— ఆ చుట్టుప్రక్కల గ్రామా లన్నీ చూసి ఎంతో వుత్సాహంతో తిరిగివచ్చాడు. కాని ఆ వుత్సాహంలో రేపే భైరవునికేసు విచారణఅనికూడా తెలుసుకోలేకపోయాడు. ఇవాళ సాయంకాలం సన్నాయిమేళం వినబడేసరికి ఆయన కది గుర్తుకువచ్చింది. భైరవాచారి దౌహిత్రికి అన్నప్రాశన అని నౌకరు చెప్పగా విన్నాడు. కాని ఆయనకేమీ తెలవదు. భైరవుడు కూడా తక్కువ అట్టహాసంచేయ లేదని విన్నాడు. అతను గ్రామమంతటిని పిలిచాడు. కానీ యింట్లోని నౌకరులు ఎవరూ తననుకూడా పిలిచినట్లు చెప్పలేదు. అదేగాదు. తల మీద అంత పెద్దకేసుపెట్టుకుని కూడా భైరవుడు యిటువేపు యిరవై రోజుల నుంచి రాలేదు. కారణం ఏమయివుంటుంది? యింతమందిలోనూ భైర వుడు తన నౌక్కడినే పిలవలేదనే సంగతి వూహకు తోచింది. తన అద్భుతమైన ఆలోచనకు తనే సిగ్గుపడి పైన టవల్ వేసుకొని తిన్నగా భైరవాచారి యింటికి బయలుదేరాడు. యింటి ముందుకు వెళ్ళాడు. బయట గ్రామసింహాలు ఎంగిలాకులకోసం కొట్లాడుకుంటున్నయ్! ఆ దగ్గరలో సన్నాయిమేళంవాళ్ళు నిప్పుచేసి చుట్టలు కాలుస్తూ— తాషాలను వెచ్చపెడుతున్నారు. లోపలికి వెళ్లేసరికి, ఎక్కడిదో పాతచినుగుల చాందిని కట్టి వుంది. ఏ నాటివో పాతబడి తుప్పట్టిన- ఘోషాల్-ముఖర్జీల యింట్లోంచి తెచ్చిన రెండుమూడు గ్యాసులైట్లు గుడ్డిగా వెలుగుతున్నయ్! కాని వాటి పొగతో ప్రాంగణమంతా దుర్గంధంగావుంది. భోజనాలయి నట్లుంది. అట్టే జనం లేరు. గ్రామములో వృద్ధులు వెళదాం అనుకుంటూ నే కూచుని వున్నారు. హరిహరునితో ధర్మదాసు యింకొంచెంసేపు వుండ మని బ్రతిమిలాడుతున్నారు గోవిందగంగూలి అక్కడికికొంచెందూరంలో ఓ రైతు కుర్రవానితో ఏకాంతంగా మాట్లాడుతున్నాడు. సరిగ్గా అదే సమయంలో రమేశుడు ఓ దుస్స్వప్నంలా హఠాత్తుగా అందరిమొదటా ఆంగనంలోకి వచ్చి నిల్చుచున్నాడు. ఆయన్ని చూడగానే అందరిముఖాలు

క్షణంసేపు నల్లబడినయ్. శత్రుపక్షంలో ముఖ్యులను అక్కడ చూడగానే రమేశు ముఖం ఉజ్వలమవలేదు. ఆయన్ని ఆహ్వానించేందు కెవరూ ముందుకు రాలేదు. చివరకు ఎవరూ ఒక్కమాట కూడా మాట్లాడలేదు. భైరవుడు అప్పుడు అక్కడ లేడు. కొంచెంసేపయాక — "చూడు గోవిందన్నయ్యా...." అంటూ ఏదో పనిమీద బయటకు వచ్చాడు. తన ఆంగనంలో ఏదో ఓ పెద్దభూతం నిలుచున్నట్లు గాబరాపడి, వెంటనే లోపలికి పారిపోయాడు. రమేశు ముఖం చిన్నపుచ్చుకుని బైటికి వచ్చే శాడు. అతని మనసు మనసులోలేదు. ఇంతలో వెనకనుంచి ఎవరో పిలిచారు— "నాయనా రమేశ్."

రమేశ్ వెనక్కి తిరిగి చూచేసరికి దీను దగ్గుతూ వస్తున్నాడు. అతను దగ్గరకు వచ్చి-"పద నాయనా! యింటికి వెళ్దాం పద" అన్నాడు.

రమేశు నవ్వేందుకు ప్రయత్నించాడు. కాని నోటినుంచి నవ్వే రాలేదు. నడుస్తూ—నడుస్తూ దీను చెప్పడం మొదలుపెట్టాడు— "నాయనా! నువ్వు యితనికి చేసిన ఉపకారం అతని తల్లిదండ్రులుకూడా అతని కంతగా చేసివుండరు. ఈ సంగతి అందరికీ తెలుసు. కాని ఏమి చేయగలడు? ఉపాయంలేదు. పిల్ల పిల్ల తరం మేము కాపురాలు చేయాలి. అందువల్ల నిన్ను పిలిస్తే— అర్థమైందా నాయనా? పాపం యిందులో భైరవాచారిదికూడా దోషంలేదు. ఈ కాలపు పట్నవాసపు పిల్లలు జాతీ— మతం అనీ ఒప్పుకోరుగా, అందువల్ల తెలిసిందా నాయనా! ఇప్పుడు అతని చిన్నకూతురికి పన్నెండేళ్ళు నిండినయ్! రెండురోజుల తరువాత దాన్నికూడా దాటించాలి? నాయనా? మనసంఘంసంగతి అందరికీ తెలిసిందేగా! తెలియలేదా బాబూ!"

రమేశు ఆదరంగా— "చిత్తం గ్రహించాను" అన్నాడు.

రమేశుని సింహద్వారందగ్గరకు వచ్చి దీను ప్రశాంతముగా— "ఎందుకు తెలుసుకోలేరు? మీరు గ్రహింపలేనివాళ్ళు కారు. ఈ బ్రాహ్మణుని మాత్రం తప్పుగా భావించడానికి వీలులేదు. మాలాంటి ముసలివాళ్ళకు పరలోకచింత...." అని అనబోతూంటే, రమేశుడు— "అవును.... అదీ నిజమే" అంటూ యింట్లోకి వెళ్ళిపోయాడు.

గ్రామస్థులంతా తనను వెలివేశారని గ్రహించాడు రమేశు. ఇంటికి చేరాక క్షోభతోనూ, కోపంతోనూ. ఆయనకళ్లు యెఱ్ఱపడినయ్. వేణీని, గోవిందగంగూలిని, భైరవాచారిని సాదర పూర్వకంగా ఆదరించి తీసుకుని రావడమే ఆయనకు కంటకంగావుంది. వూళ్లోవాళ్ళందరికీ యీ సంగతి అంతా తెలిసికూడా భైరవుణ్ణి మన్నించడమేకాదు, సంఘగౌరవం కోసరం, రమేశుణ్ణి అతను ఆహ్వానించకపోయేసరికి, అతణ్ణి అపర గౌరవాలతో చూడసాగారు.

"అయ్యో! భగవంతుడా" అంటూ రమేశు పెద్దకుర్చీలో కూలబడి నిట్టూర్పు విడిచాడు. ఈ కృతఘ్నజాతి మహాపాపానికి ప్రాయశ్చిత్తమేమిటి? భగవంతుడా! ఇంత నిష్ఠుర అవమానాన్ని నువ్వు క్షమించగలవా"

# 15

ఇలా జరుగుతుందని రమేశుని మనసులో అనుమానం లేకపోలేదు. అయినా ఆ మరునాడు సాయంకాలం గోపాల్ సర్కారు కోర్టునుంచి తిరిగివచ్చి, భైరవాచారి కోర్టుకు హాజరుకాలేదనీ, అందువల్ల కోర్టులో కేసు కొట్టివేశారనీ, తాము అక్కడ కట్టిన డబ్బంతా వేణీ వాళ్ళచేతుల్లోకి పోయిందనీ చెప్పేసరికి, క్షణంసేపు రమేశునికి నఖశిఖ పర్యంతం మండింది. ఆనాడు పీళ్ళ అత్యాచారాన్నీ, అన్యాయాన్నీ అణచాలని మోసపుదాకీ సొమ్మంతా రమేశు జమకట్టాడు. అయినా పాపిష్ఠుడైన భైరవుడు తన అపాయం తీరిందని, వేణీబాబుతో సఖ్యత చేసుకున్నాడు. భైరవుని ఈ కృతఘ్నత—నిన్నటి అవమానం రెండూ కలిసి మొన్నటి కంటే ఎక్కువ కోపాన్ని కలిగించింది. ఆయన వున్నపళంగా లేచి, బయటికి వెళ్ళేందుకు తయారయాడు. ఆత్మసంవరణమనేమాటే ఆయనకు గుర్తురాలేదు. యజమానిగారి కళ్ళ యెఱ్ఱదనాన్ని చూసి గోపాల సర్కారు భయపడి మెల్లగా అడిగాడు— "ఎక్కడికి వెళుతున్నారు?"

"యిప్పుడే వస్తాను" అంటూ రమేశు గబగబా వెళ్ళిపోయాడు. భైరవుని యింటిబయట ఎవరూలేరు. అప్పు డాయన లోపలికి వెళ్ళాడు. ఆ సమయంలో ఆచారిభార్య సాయంసంధ్య దీపారాధన చేత్తోపట్టుకుని

తులసికోటవద్దకు వస్తూంది. హఠాత్తుగా రమేశుని, ఎదురుగా చూసేసరికి ఆమె స్థంభించిపోయింది. ఆయన ఎప్పుడూ వచ్చేవాడు కాడు. ఇవాళ ఎందుకు వచ్చాడా? అని ఆలోచించేసరికి ఆమె కెందుకో భయంకలిగింది.

రమేశు ఆమెను అడిగాడు —"ఆచారిగా రెక్కడ?"

ఆమె అవ్యక్తంగా ఏమన్నదోకానీ, వినపడలేదు. అయినప్పటికీ యింట్లో లేఁని తెలిసింది. రమేశుని శరీరంమీద చొక్కాకూడా లేదు. అస్పష్టమైన ఆ సాయంత్రపు మసక వెలుతుర్లో ఆయనముఖంకూడా సరిగ్గా కనుపించడంలేదు- ఇంతలో భైరవుని పెద్దకూతురు లక్ష్మి పిల్ల వాణ్ణి చంకలో ఎత్తుకుని బయటికి వచ్చింది. ఎవరో ఒక అపరిచితుణ్ణి చూసి తల్లిని అడిగింది— "యీయన ఎవరమ్మా!"

కాని తన తల్లి ఏమీ చెప్పలేదు. రమేశుకూడా ఏమీ చెప్పలేదు. లక్ష్మి భయపడి కేకపెట్టింది— "నాన్నా! ఎవరో మనిషి వచ్చి పెరట్లో నిలుచున్నాడు. ఏమీ మాట్లాడ్డంలేదు."

"ఎవరు?" అంటూ తండ్రి బయటికివచ్చి, రమేశుని చూసి కొయ్యబారిపోయాడు. ఆ మసకవెలుతుర్లోకూడా ఆ బలమైన శరీరాన్ని గుర్తించేందుకు ఎక్కువకాలం పట్టలేదు. రమేశు కఠినంగా —'యిలారా' అని తనే వెళ్ళి తన పిడికిలితో అతని చేయి పుచ్చుకుని – "యిటువంటి పనెందుకు చేశావు?" అన్ని అడిగాడు

"నన్ను చంపాడ్రోయ్, లక్ష్మి! తొందరగా వేణీబాబుకు కబురు చెయ్" అని ఏడుస్తూ అన్నాడు.

అతనితోపాటు యింటిల్లాదులూ గొల్లున యేడ్చారు. క్షణకాలంలో సాయంకాలపు ఆ నీరవత్వాన్ని చీల్చుకుంటూవచ్చిన యింతమంది యేడ్పు ధ్వనులు ఆ వీధివాళ్ళందరినీ భయపెట్టాయి.

రమేశు దతన్ని గట్టిగా వూపుతూ— "ఊరుకో! ఎందు కిలా చేశావో చెప్పు?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు జవాబు చెప్పాలని ప్రయత్నిందలేను భైరవుడు. గొంతుపగిలేట్లు యేడుస్తున్నాడు. రమేశుని చేతిలోంచి తనచేతిని వదలించు కోవాలని ప్రయత్నిస్తున్నాడు. చూస్తు చూస్తుండగనే గ్రామములోని పురుషాదులు అంగనమంతా నిండిపోయారు. ఆ తమాషా చూచేం

దుకు లోపలికి రావడానికి చాలామంది ప్రయత్నిస్తున్నారు. కాని క్రోధాంధుడైన రమేశు ఆవేపు ధ్యానముంచనేలేదు. అంతమందిలో కూడా రమేశు పిచ్చివానిలా భైరవునిచెయ్యి గుంజుతూనేవున్నాడు. రమేశుని బలం అందరికీ తెలుసు! దానిమీద ఆయనకళ్ళవేపు చూసి, భైరవుణ్ని విడిపించేందుకెవరికీ ధైర్యంచాలకపోయింది, గోవిందుడు లోపలికి వచ్చాడు కాని గుంపులో కలిసిపోయాడు. వేణీ దూరంనుంచే చూసి చల్లగా జారుకుందామనుకుంటుండగానే, భైరవుడు యేడ్చి- "పెదబాబు గారూ" అన్నాడు.

కాని పెదబాబుగారు కూడా అతనివేపు కన్నెత్తి చూడకుండా క్షణంలో గుంపులో కలిసిపోయాడు. హఠాత్తుగా గుంపులోనుంచి త్రోవ ఏర్పడింది. ఇంతలో రమ గబగబా వచ్చి రమేశునిచేయిపట్టుకుని—"జరిగిందేదో జరిగిపోయింది, ఇక వదిలిపెట్టండి" అన్నది.

రమేశుడు ఆమెవేపు క్రోధావేశంతో చూస్తూ— 'ఎందుకని?' అని అడిగాడు.

రమ పండ్లను బిగపట్టి అస్పష్టంగా కోపంతో అన్నది— "యింత మంది ఎదట యిలా చేయడానికి మీకు సిగ్గులేకపోయింది. కాని, నేను సిగ్గుతో చచ్చిపోతున్నాను."

రమేశు ఆంగనంలోని గుంపువేపుచూచి తాత్కాలికంగా భైరవుని చేయి వదిలిపెట్టాడు. అప్పుడు రమ కోమలస్వరంతో అన్నది— "యిక యింటికి వెళ్ళండి."

రమేశు మారుమాటాడకుండా బయటికి వెళ్ళిపోయాడు. ఇదంతా ఏదో యింద్రజాలంలా, క్షణంలో జరిగిపోయింది, అతను వెళ్ళిపోయాక అక్కడ వున్నవారంతా రమేశుని విధేయత చూసేసరికి—వాళ్ళకు విచిత్రంగా తోచింది. అందుకని అందరికళ్ళూ రమమీద పడినయ్! ఈ భయంకరమైన విషయం యింత ఆడంబరంగా మొదలై, యింత సులభంగా తేలిపోవడం అక్కడివాళ్ళకు యిష్టంలేనట్లుంది.

అప్పుడు గోవిందగంగూలి ఎక్కడనుంచో బయటకి వచ్చాడు. గుంపంతా చెదిరిపోయింది. గోవిందుడు ముఖాన్ని గంభీరంగాపెట్టి—

"అత నిలా యింటిమీదకువచ్చి, యిలా చావకొట్టినంత పని చేసినందుకు ముందేమిచేయాలో ఆలోచించండి?" అన్నాడు.

భైరవుడు రెండుమోకాళ్ళసందున తలపెట్టి కూచుని రొప్పు తున్నవాడల్లా వుపాయంకోసం వేణీముఖంలోకి చూశాడు. అప్పటి కింకా రమ వెళ్ళలేదు. ఆమె వేణీ అభిప్రాయాన్ని చూచాయగా గమ నించి. "కాని పెద్దన్నయ్యా! ఇతని తప్పుకూడా లేకపోలేదు. అయినా యిప్పుడేం జరిగిందని యింత హంగామాచేస్తున్నారు?" అని అడిగింది.

వేణీ ఆశ్చర్యపడుతూ— ఏమా! నువ్వు అలా మాట్లాడుతావేం?" అన్నాడు.

భైరవుని పెద్దకూతురు యింకా స్థంభాన్ని అనుకుని యేడుస్తూంది. ఆమె దెబ్బతిన్న సర్పంలా ఒక్కసారి గర్జించింది—

"రమక్కయ్యా! నువ్వు ఆయన తరపున మాట్లాడుతున్నావు. కాని ఎవరైనా మీ యింట్లోదూరి యిలాగే మీనాన్నను కొడితే యేంచేసేదానివో చెప్పు" అని అడిగింది.

ముందు ఆ గర్జనవిని, రమ త్రుళ్ళిపడింది. తనతండ్రిని విడిపించి నందుకు కృతజ్ఞత చూపకపోయింది. పైగా ఆమె మాటల్లోని కఠినమైన శ్లేషానికి రమ మండిపోయింది. అయినప్పటికి ఆత్మను అణచుకుని.— "మీ నాన్నకూ—మా నాన్నకూ చాలా తేడావుంది లక్ష్మి! నువ్వు దాన్ని పోలికగా తీసుకురావద్దు. నేనెవరితరపునా ఏమీ మాట్లాడ్డంలేదు. అందరి మంచికోసమే చెపుతున్నాను" అన్నది.

లక్ష్మి పల్లెటూరిపిల్ల. పోట్లాటన్నా—కొట్లాలన్నా—ఒకరికి తీసిపోదు. ఆమె చటుక్కున ముందుకు వచ్చి— "నిజమే! అతని తరపున పోట్లా డ్డానికి సిగ్గులేదూ! గొప్పింటివారి అమ్మాయివని ఎవరూ ఏమీ అనడం లేదు. లేకుంటే ఎవరికి తెలవదు? నువ్వుకాబట్టి యింకా ముఖం చూపిస్తు న్నావు, యింకొకరైతే యీపాటికి వురిపోసుకుని చచ్చిపోయేవాళ్ళు —" అన్నది.

లక్ష్మిని వేణీ కొంచెం దదాయిస్తూ— "లక్ష్మి! నువ్వూరుకో యిప్పు డా మాటలవల్ల లాభమేమిటి " అన్నాడు.

"ఎందు కవుసరంలేదు? ఎవరివల్ల నాన్నగా రింతబాధపడి యేడుస్తు న్నారో- ఆయనవేపువచ్చి యిలా మాట్లాడుతుందా? ఒకవేళ యీరోజు నాన్నగారు చనిపోయినట్లయితే....?"

రమ ఒకక్షణం స్తబ్ధురాలైంది. అయినా వేణీ చూపుతున్న కృత్రిమకోపం చూసేసరికి ఆమెకున్న మంట ఒక్కసారి భుగభుగ మండింది. ఆమె లక్ష్మివేపు చూసి అన్నది-"లక్ష్మీ, అటువంటి మనిషి చేతిలో మీనాన్న చనిపోవడం ఎంతో అదృష్టం. యివాళ మీనాన్న చని పోయినట్లయితే, స్వర్గం వెళ్ళివుండేవాడు."

లక్ష్మికూడా కోపంగానే అన్నది - "అంచుకేగామాలు నువ్వాయన అంటే పడిచస్తున్నావు."

రమ ఆమెకు జవాబు యేమీ చెప్పలేదు. ఆవేపునుంచి చూపులు మళ్ళించి వేణీవేపు చూసి అడిగింది - "కాని పెద్దన్నయ్యా! యీ సంగ తేమిటో చెప్పు" అని అతని ముఖంలోకి తీక్షణంగా చూసింది. — ఆ దృష్టి అంధకారాన్ని చీల్చుకొని వేణీహృదయంలోపలికికూడా చొచ్చు కుని పోయినట్లుంది.

వేణీ ఖిన్నుడై అన్నాడు—"నాకేం తెలుసమ్మా? లోకులు ఎన్నో అంటుంటారు. మనం వాటన్నిటిని పట్టించుకుని కూచుంటే పని సాగదు-"

"లోకులు ఏమంటారు"

వేణీ ఎంతో అవజ్ఞాపూర్వకంగా —"అంటే అననియ్! లోకులు అన్నంతమాత్రాన మనశరీరం మీది చర్మం పోదులే-" అన్నాడు.

ఈ కపటసహానుభూతిని రమ గ్రహించింది. ఆమె కొంచం సేపుండి— "నీ శరీరం మీదున్న చర్మం పోనిమాట నిజమే! కాని అందరికి నీలాంటి మొద్దు చర్మం వుండదు. అయినా లోకులకు యిదంతా చెప్పిం దెవరు ? నువ్వేనా?" అని అడిగింది.

"నేనా—?"

రమ మనసులోనే చాలా మండిపోతూంది. కాని తనశక్తినంతటిని ఏకంచేసి కోపాన్ని ఆపుకుంది. యిప్పు డామె స్వరంలో కోపంలేదు— "నేను తప్ప యింకెవరూ చెప్పలేరు. ప్రపంచంలో నువ్వుచేయని

చుక్కైన్నంటూలేదు. దొంగతనాలూ, ఫోర్జరీ, మోసం, యిళ్ళకు నిప్పెట్టింపడం అన్నీ అయినయ్! అటువంటప్పుడు యిది మాత్రం కొరత వుంచడం దేనికి?" అని అన్నది.

వేణి హతబుద్ధునిలా ఏమీ మాట్లాడలేదు.

రమ అన్నది-- "ఆడవాళ్ళకు యిదెంత హానికలిగించే సంగతో అని తెలుసుకునే జ్ఞానం నీకులేదు. కానీ, ఈ అపవాదు వ్యాపింపచేయడం వల్ల నీకు లాభమేమిటి ?"

వేణి భయపడుతూ —"నాకేం లాభం ? ఒకవేళ నువు చీకటిరో రమేశుని యింట్లోంచి వస్తున్నప్పుడు లోకులు చూస్తే నేనేం చేయను?" అన్నాడు.

ఆమాటమీద రమ ధ్యాసవుంచలేదు-"నేనింతమందిఎదట ఇంకేమీ చెప్పను. కాని పెద్దన్నయ్యా ! నీమనసులోని భావం నాకు తెలియదని అనుకోవద్దు. కాని నేను చనిపోయేముందు నిన్నూరికే విడచిపెట్టి వెళ్ళను. యిదిమాత్రం నిశ్చయమని నమ్మ— "

యింతవరకూ భైరవాచారిభార్య ఆదగ్గరలోనే ఎక్కడో వుంది. యిప్పుడు ఆమె ముందుకువచ్చి, రమచెయ్యిపట్టుకొని ముసుగు లోపల్నుంచే కోపుల స్వరంతో —"నీకేం పిచ్చిపట్టిందా రమా? నిన్నెరుగనివాళ్ళెవరున్నా రిక్కడ? అని ఆమె కూతురివేపు చూసి— "నువ్వు ఆడదానివై వుండికూడా తోటి ఆడదాన్ని యింత అవమానించడం తగదు. దీన్ని ధర్మం సహించదు. యివాళ ఈమె నీకు చేసిన ఉపకారం- నువ్వు మనిషికి పుట్టినదానివైతే, తెలుసుకునేదానివి" అన్నది.

ఆమె తరువాత, రమను లాక్కుంటూ లోపలికి తీసుకుని వెళ్ళింది. ఆచారి భార్య, తన భర్త నుద్దేశించి శ్లేషంగా చెప్పడం-వున్నది వున్నట్లు యథార్థం చెప్పేసరికి, అక్కడవున్నవాళ్ళంతా- యెక్కడివాళ్ళక్కడ తప్పుకునిపోయారు,

ఈ సంఘటన జరగడానికి కార్యకారణాలు-ఎంత గొప్పవైనా- ఏమైనా-కాని తాను నిగ్రహం లేకుండా, కారణం లేకుండా, ప్రవర్తించినందుకు రమేశుని శిక్షిత హృదయం- భద్రతాంతఃకరణం—ఎడతెగకండా రెండురోజులవరకు బైటికి రాలేనంత యిదిగా బాధపడింది. అయినా

యింతమందిలో తన లజ్జాభిమానాలు కొంత తను భరించేందుకు రమ వచ్చించే అనే ఆలోచన, అతని లజ్జామేఘాలమీద ఒక్క మెరుపు మెరిసినట్లు క్షణ క్షణమూ, సౌందర్యమూ, మాధుర్యముతో నిండిన కాంతి రేఖలను ప్రసరింపచేసింది. అందువల్ల, అతని యింత విచారంతోపాటు ఒక తృప్తి కలిగింది. ఈ సుఖ—దుఃఖాల వేదనలో యింకా కొంతకాలం యింట్లోనే అజ్ఞాతవాసంచేయాలని అనుకున్నాడు. కాని తన మూలంగా వైట యింకొక వ్యక్తిమీద కొండంత అపవాదు పడిందన్న సంగతి కలలోకూడా అనుకోలేదు.

కాని అజ్ఞాతంగా వుండేవీలు ఆయనకు కలగలేదు. యివాళసాయం కాలం పీరుపురంలోని ముసల్మానుల పంచాయితీ మీటింగుకు రమ్మని వాళ్ళు పిలవడానికి వచ్చారు. అదీగాక అలా మీటింగు పెట్టుకోమని తనే స్వయంగా వాళ్ళకు కొన్ని రోజులక్రితం చెప్పాడు. యివాళ వాళ్ళంతా ఒకచోట గుమిగూడి చిన బాబుగారికోసంఎదురుచూస్తున్నారని విని అక్కడికని బయలుదేరాడు.

ప్రతి గ్రామములోనూ రైతుల్లో చాలామంది బీదవాళ్ళన్న సంగతి రమేశు ఎంతోదూరం వాకబుచేసి, తెలుసుకున్నాడు. చాలామందికి ఒక సెంటు భూమన్నా లేదని గ్రహించాడు. ఇతరుల భూమి కౌలుకు చేశో— యితరులవద్ద పనులుచేసుకొనో— పొట్టపోసుకుంటున్నారని కూడా విన్నాడు. ఒకవేళ రెండురోజులు పనిదొరకకపోయినా — ఏదైనా జబ్బు చేసినా యింటిల్లాదులు పస్తులుండేవారు. ఎంతోకాలం విచారించగా, వీళ్ళం దరూ ఒకప్పుడు భూమివున్నవాళ్లేనని, కాని అప్పులవల్ల అంతా పోగొట్టు కున్నారని తెలుసుకున్నాడు. ఈ అప్పు పద్ధతి కూడా సవ్యంగా వుండదు. శ్రీమంతులు భూమిని తాకట్టుపెట్టుకుని అప్పుయిస్తారు. కాని అప్పుడప్పుడూ వడ్డీ పుచ్చుకోరు, పంట పుచ్చుకునేవారు. ఈ లెక్క ప్రకారం అసలు ఫాయిదాలు కలిపితే అయిదు రెట్లయేది. అందువల్ల ఎప్పుడన్నా ఒకరైతు- సామాజిక క్రియ-కర్మకు గానీ- అనావృష్టివల్లకానీ, కొంత ఋణంచేయక తప్పదు. కాని ఆ తరువాత సంబాళించుకుని నిలబడడం చాలాకష్టం; ప్రతి సంవత్సరం అతను ఆ శ్రీమంతుని యింటిముందుకు వెళ్ళి చేయిచాపా ల్సిందే; ఈ విషయంలో హిందూ— ముసల్మానులంతా ఒకటే—

కారణం శ్రీమంతులంతా హిందువులే! రమేశు పట్టణంలో వుండి కొంత పుస్తకాలవల్ల తెలుసుకున్నాడు. యిప్పుడు గ్రామములో వుండి ప్రత్యక్షంగా చూశాడు. అప్పు డిక ఆశ్చర్యపోయాడు. ఆయన డబ్బు చాలా బ్యాంకిలో మూలుగుతూంది. ఆ డబ్బుతో యింకా కొంత పోగుచేసి— యీ అభాగ్యులను ఆ శ్రీమంతులచేతుల్లోంచి తప్పిద్దామని చూచాడు. కాని ఒకటి—రెండుచోట్ల యిచ్చి— పుచ్చుకోవడంవల్ల, నష్టపడ్డాడు. అప్పుడు ఈ అసహాయులు— దరిద్రులు, తను అనుకున్నంత దయా పాత్రులు కారని గ్రహించాడు. వీళ్ళంతా దరిద్రులు, నిరుపాయులూ, అల్పబద్ధులే. తప్పుడు వ్యవహారాల్లో తక్కువ వాళ్లుకాదు. అప్పు·పుచ్చుకుని ఎగవేసేవాళ్లు చాలామంది వున్నారు. వీళ్ళు సరళబుద్ధి—సాధువులు కారు. అబద్ధం చెప్పడానికి సిగ్గుపడరు. మోసగించడం బాగావచ్చు. తమ యిరుగు పొరుగు యిళ్ళలోని స్త్రీల సౌందర్యాన్ని గురించి—కన్యల శీలాన్ని గురించి చర్చించడంలో తక్కువ వుండదు. పురుషులకు వివాహం కావడం చాలాకష్టం. దానితోపాటు భిన్నావస్థలోవున్న విధవలభారం ప్రతి యింటిలోనూ వుంది. అందువల్ల వాళ్ళ నైతిక వ్యవహారం కూడా చాలా అసహ్యంగావుంది. వీళ్ల కు సమాజంవుంది. దానిలో శాసనాలకు తక్కువ లేదు. కాని, దొంగలతో పోలీసులకు ఏ సంబంధం వుంటుందో—సమాజంతో వీళ్ల కూ అదే సంబంధం. దుర్బలులూ— దరిద్రులూ అని వీళ్ళను కోపగించడంకూడా అసంభవమే! విద్రోహి, కుమార్గంలో నడిచే కొడుకు మీద తండ్రికి ఏ విధమైన మనోభావం వుంటుందో—రమేశు హృదయం కూడా సరిగ్గా అలానే వుంది. అందువల్ల ఆ సాయంకాలం పీరుపురం పంచాయితీ రమేశుని పిలిచింది.

ఆ సాయంకాలపు మసక చీకటిని దూరంచేస్తూ—దశమినాటి చంద్రుడు కిటికీ బయట మైదానంమీద నాలుగువేపులా వెలుగుతున్నాడు. ఆ వేపు చూస్తూకూడా రమేశు వెళదామనుకుంటూనే జాగుచేస్తున్నాడు. ఆ సమయంలో రమ వచ్చి తలుపుదగ్గర నిలుచుంది. అక్కడ వెలుతురు లేదు. అందువల్ల యింటిదాసి అనుకుని రమేశు—"ఎందుకూ—?" అని అడిగాడు.

"మీరు బయటికి వెళుతున్నారా?"

రమేశు త్రుళ్ళిపడ్డాడు— "ఎవరు రమా! యిప్పుడు ఎందుకు వచ్చావు—?"

ఏకారణంవల్ల ఆమె యీ చీకటిలో రావాల్సివచ్చిందో ఆకారణం చెప్పవలసిన అవసరం లేకపోయింది. కాని వచ్చిన పని విషయం మాత్రం చాలావుంది. అందువల్ల ఏవిధంగా మొదలుపెట్టాలా అనునది గమనించలేకపోయింది. అలాగే నిల్చునివుంది. రమేశుకూడా అలాగే వున్నాడు. కొంచెంసేపున్నాక— "మీ శరీరంలో యెలావుంది?" అని రమ అడిగింది.

"బాగాలేదు. యిప్పుడు తిరిగి రోజూ జ్వరం వస్తూనేవుంది—"

"అయితే కొన్నాళ్లు యెక్కడికైనా వెళ్ళివస్తే బాగుంటుందేమో!"

రమేశుడు నవ్వుతూ- "వెళితే బాగానే వుంటుంది. కాని యెలా వెళ్లను" అని అన్నాడు.

ఆ నవ్వు చూసేసరికి రమకు కోపంవచ్చింది—"నాకు చాలా పనులున్నాయని అంటారుకదూ? కాని మీ శరీరాన్నిమించిన పనేముంది?

రమేశుడు మునుపటిలానే నవ్వుతూ జవాబుచెప్పాడు—"నాశరీరం అంత విలువైనదికాదని నేను చెప్పటంలేదు. కాని శరీరంకన్నా విలువైన పనులున్నాయ్ రమా! అవి నీవు తెలుసుకోలేవు."

"తెలుసుకోవాలని నాకు లేదు. కాని మీరు యెక్కడికైనా వెళ్ళే తీరాలి. మీరు మీ గోపాల్‌సర్కారుకు చెప్పివెళ్ళండి. మీ పనులు నేను చూస్తుంటాను."

రమేశుడు చకితుడై -"నువ్వు నా పనులు చేసిపెడతావా....? కాని ..." ఆగాడు.

"కాని యేమిటి?"

"కాని నిన్ను యెలా నమ్మగలను?"

రమ నిస్సంకోచంగా అన్నది—"యితరులు నమ్మకపోవచ్చు. కానీ మీరు నమ్మగలరు."

ఆమె అలా దృఢంగా చెప్పడంతోనూ, తను ఆశించని సమాధానం రావడంతో రమేశు విస్మితుడయ్యాడు—"సరే ఆలోచిస్తాను—"

రమ తలూపుతూ అన్నది-"కాదు. ఆలోచించి—విచారించేసమయం లేదు, ఈ రోజునే వెళ్ళాలి. వెళ్ళకుంటే" అంటూ రమేశు విచలితు డవడం స్పష్టంగా చూసింది, హఠాత్తుగా యిలా వెళ్ళకుంటే ఏదో ఆపద రానున్నదని గ్రహించడం తేలిక; అతను వూహించిందికూడా అంతే. కానీ తనను తాను సంబాళించుకుని - "సరే. వెళతాననుకో, అందువల్ల నీకు లాభమేమిటి ...? నన్ను యిబ్బందిపెట్టడంలో నువ్వు తక్కువ దానివికావు. యివాళ రాబోవు ఆపదనుగురించి జాగ్రత్తపడమని చెప్పేం దుకు వచ్చావేం? యివి మరిచిపోవడానికి, యివి జరిగి యెన్నో రోజులు కాలేదుగా. ఇప్పుడు నేను వెళ్ళిపోయినందువల్ల నీకు కలిగే లాభమేమిటో స్పష్టంగా చెప్పు, అప్పుడు నేను వెళ్ళేందుకు యిష్టపడతాను" అన్నాడు.

రమ ఏమి జవాబు చెపుతుందోనని రమేశు ముఖంవేపు చూస్తు న్నాడు. కాని తాననుకొన్న జవాబు రాలేదు. ఎంత లభిమానం రమ హృదయాన్ని ఆవరించిందో అతను గ్రహించలేదు. తను క్రూరంగా, పరి హాసంగా విసిరిన మాటలలోని ఆఘాతంవల్ల ఆమె ముఖము ఎంత విపర్ణమైందో ఆ చీకట్లో చూడలేదు. కొంచెంసేపు మెదలకుండావుంది. "సరే! స్పష్టంగానే చెపుతాను. మీరు వెళితే నాకేమీ లాభంలేదు. కాని వెళ్ళకుంటే నష్టం ఎక్కువగానుంది. నేను సాక్ష్యం చెప్పాల్సివస్తుంది" అన్నది.

రమేశుడు నీరసంగా-"యిదా సంగతి? అయితే సాక్ష్యం యివ్వ కుంటే యేం?" అని అడిగాడు.

రమ ఒక క్షణంవుండి - "యివ్వకుంటేనా? రెండురోజులతరువాత రాబోవు దేవీపూజలకు మాయింటికి యెవ్వరూ రారు. యతీన్ ఉపనయ నానికి కూడా ఎవరూ భోజనాలకు రారు. నా నోములూ,వ్రతాలు" యిటు వంటి దుర్ఘటనలు తలుచుకునేసరికి రమకు కంపరం కలిగింది —

ఆ తరువాత వినకపోయినా రమేశుడు పోయిందేమీలేదు. కానీ అడగకుండా వుండలేకపోయాడు—"ఆ తరువాత?"

రమ వ్యాకులతతో అన్నది—"ఆ తరువాతనా? లేదు. లేదు. మీరు వెళ్ళండి! రమేశన్నయ్యా! నిన్ను ప్రార్థిస్తున్నాను. అన్నివిధాల నువ్వు నన్ను పాడుచేయవద్దు. ఈ వూరినుంచి వెళ్ళిపోండి."

యిద్దరూ కొంచెంసేపు మెదలకుండా వూరుకున్నారు. యింతకు ముందు. ఎక్కడైన. ఏ పరిస్థితుల్లోనైనా రమ కనిపిస్తే రమేశుని హృదయం ఉద్రిక్తమయేది. ఎన్నివిధాల ప్రయత్నించి సంబాళించుకుందా మన్నా చేతనయేదికాదు. యిలా హృదయం ఎదురుతిరిగేసరికి ఎంతో బాధ పడేవాడు. సిగ్గుపడేవాడు. తనమీద తనకే కోపంవచ్చేది. కాని ఏవిధంగా కూడా వశంలోకి వచ్చేదిరాదు. అందులో విశేషించి యివాళ యీ సమ యంలో తన యింట్లో ఆ రమ హఠాత్తుగా వొంటరిగా రావడం చూసే సరికి విన్నటి సంఘటన జ్ఞాపకం అతని హృదయంలో చాంచల్యం మరింత యెక్కువైంది. కాని రమ అన్న ఆఖరిమాట అతని కళ్ళు తెరి చింది - "సరే అలాగే వెళతాను. కాని యిప్పుడిక వీలులేదు. నేను యిక్కడినుండి పారిపోవడం నీ కెంతమంచిదైనా-ఈ రాత్రి నా దృష్టిలో అంత విలువగలది. నువు నీ దాసీని పిలువు. నే నిప్పుడు బయటికి వెళ్ళాల్సివుంది."

"అయితే యివాళే వెళ్ళలేరా?"

"లేదు, మీ దాసీది యెక్కడికి వెళ్ళింది?"

"నాతో ఎవరూ రాలేదు."

అదేమిటి? యిక్కడికి అంత సాహసించి యెలా వొంటరిగా రాగలిగావు? దాసీదాన్నికూడా వెంటతీసుకునిరాలేదా?"

"తీసుకునివస్తేమాత్రం ఏముంది? అదయినా నన్ను మీ చేతు ల్లోంచి రక్షించేదికాదుగా?"

"రక్షించలేకపోవచ్చు. కాని అపవాదునుంచి తప్పించుకునేదానివి. రాణీ! ఇప్పుడు తక్కువరాత్రి కాలేదు."

ఆ పేరు చాలాకాలంనాటిది. కాని ఏదో అందామని నోటిచివర వరకూ వచ్చింది. కాని అనలేకపోయింది. అయినా తనలోతాను సంబా ళించుకుని—"దానివల్లకూడా ఫలితంలేదు రమేశన్నయ్యా! చీకటిరాత్రి కాదుగా! నేను వెళ్ళగలను" అంటూ జవాబుకు యెదురుచూడకుండానే గబగబా బైటికి వెళ్ళిపోయింది.

# 16

రమ ప్రతి సంవత్సరం దుర్గపూజ బ్రహ్మాండంగా చేసేది. పూజకు ముందే అంటే సప్తమినాడు గ్రామములోని బీదలకూ రైతులకు సంతృప్తిగా భోజనంపెట్టేది. బ్రాహ్మణుల యింట్లోంచి, అమ్మవారి ప్రసాదం కోసం వచ్చేపోయే జనంతో రాత్రి జాముదాకా యింట్లో కాలుపెట్టడానికే సందువుండేదికాదు. కేవలం హిందువులేకాదు, పీరుపురంలోని ముసల్మానులుకూడాగుంపులుగుంపులుగా వచ్చేవాళ్లు ఈసంవత్సరంకూడా ఆమెఅస్వస్థతగావున్నప్పటికి-బ్రహ్మాండంగానే చేసింది. చండీమండపంలో ప్రతిమ-పూజకు కావలసిన సరంజామా-క్రిందున్న పెరట్లో వుత్సవానికి కావలసిన యేర్పాట్లు చేసివున్నయ్? సప్తమినాటి పూజ యథాసమయంలో పూర్తయింది. మెల్లమెల్లగా రెండోజాము - మూడోజాముకూడా గడుస్తుంది. ఆకాశంలో సప్తమినాటి చంద్రుడు వెలుగుతున్నాడు. కాని ముఖర్జీలవారింటి ఆంగనంలో ముఖ్యులైన పెద్దలు నలుగైదుగురు తప్ప ఎవరూ లేరు. లోపలవిరాటమైన అన్నంరాశి క్రమక్రమంగా గట్టిపడుతూ చల్లారిపోతూంది. కూరలన్నీ ఎండి వివర్ణమైపోతున్నయ్। కాని యింతవరకూ పూళ్ళోనివాళ్ళు ఒక్కరుకూడా ప్రసాదంకోసంగాని, భోజనంకోసంగాని రాలేదు, "అరే యీ శూద్రముండాకొడుకులు యింత భోజనసామగ్రిని వృథాగా నష్టపరిచారు. వీళ్ళప్పుడే యింత పొగరెక్కిపోయారా?" అంటూ వేణీబాబుచేతిలో హుక్కాపట్టుకుని అటుయిటూ పచారు చేస్తున్నాడు. "వెధవలకు పాఠంచెపుతాను. ఇంటికప్పులు ఎగరగొట్టిస్తాను-అదిచేస్తాను-యిదిచేస్తాను- వగైరా-వగైరా" అంటున్నాడు. గోవింద్, ధర్మదాస్—హోల్దారు. పెద్దకోపంతో యిదంతా ఎవరిప్రోద్బలంవల్ల జరుగుతూందో - ఆచూకీ తీద్దామని- తిరిగి-తిరిగివచ్చారు అదీగాక హిందూ ముసల్మానులు ఏకమవడం చాలా ఆశ్చర్యంగా వుంది. ఒకప్రక్క, ఓపల రమ చిన్నమ్మ తిట్లవర్షం కురిపిస్తూంది. ఆమె మరీ వికటంగా వుంది. ఇంత హంగామా జరుగుతున్నా- ఒక్కమనిషిమాత్రం మెదలకుండావుంది. ఆమె రమ- ఆమె అస్వస్థతగా వున్నది నిజమే। ఆమె ఎవర్ని విస్పష్టంగా కూడా ఒక్కమాటన్నా అనలేదు. ఎవరిమీదా దోషం ఆరోపించలేదు.

ఇంతవరకూ ఆమె ఒకర్ని ఆక్షేపించిగాని- పరుషంగా గాని మాట్లాడలేదు. ఆమె నిజంగా రమేనా? తనకు స్త్రీనావున్నమాట నిజమే! కాని అంగీకరించదు- నవ్వుతూ ఎగరగొట్టేస్తుంది. రోగం రూపాన్ని మార్చేస్తుంది. పోతేపోయింది. కాని ఆమెలో ఆ అభిమానం, ఆకోపంలేదు. ఆ హాతం లేదు. ఆమెకళ్ళు వ్యథతోనూ —కరుణతోనూ నిండినట్లున్నయి! కొంచెం నిదానంగా పరీక్షించిచూస్తే— రెండు సజలనయానాల్లో దుఃఖసముద్రం అణిగివున్నదని, అది పొంగిపొర్లిందంటే ప్రపంచాన్ని యావత్తూ ముంచేయగలదని తెలుస్తుంది. ఆమె దేవీమందిరంలోకి వచ్చి అమ్మవారి కెదురుగా నిల్చుంది. ఆమెను చూడగానే, ఆమె శుభాకాంక్షులు గట్టిగా రః అబగాజాతివాళ్ళ ఏదేశు వర్ణాలుగుతరాలవాళ్ళ పేర్లు పెట్టి తిట్టడం సాగించారు. అవన్నీ విని రమ కొంచెం మెల్లిగా నవ్వింది. ఆమె ఆ నవ్వు సరిగ్గా మనిషి చెట్టునుంచి త్రుంచినప్పుడు పువ్వు ఎలా నవ్వుతుందో అలావుంది. ఆ నవ్వులో రాగద్వేషం, ఆశా—నిరాశలు మంచిచెడ్డలు ఏమీలేవు. అది సార్థకమైనదో— నిరర్థకమైనదో ఎవరికి తెలుసు!

వేణీ కోపంతో మండిపడుతూ— "యిది నవ్వవలసిన విషయం కాదు. ఇది సర్వనాశనం కలుగచేసే విషయం. దీనికి కారకు లెవరో తెలిసిందంటే" అంటూ రెండుచేతుల వ్రేళ్ళూ ఒకచోట చేర్చి— 'ఈ విధంగా నలిపేస్తాను.' అన్నాడు.

రమ మనసులోనే కనిపించింది. వేణీ వాగుతున్నాడు— "వెధవ ముండాకొడుకులు! ఎవరి అండచూసుకుని యింత యిదిగా చెలరేగారో— వాడు— ఆ రమేశు యిప్పుడు జెయిల్లో గానుగ తిప్పుతున్నాడు. ఇప్పుడు వీళ్ళను పరిమార్చడం ఎంతపని నాకు."

రమ యేమీ మాట్లాడలేదు. ఆమె వచ్చినపని పూర్తిచేసుకుని వెళ్ళిపోయింది.

భైరవుణ్ని కత్తితో పొడిచి చంపాలనే ప్రయత్నం చేశాడని నేరం మోపి, నెలాపదిహేనురోజుల క్రిందట రమేశుని జెయిలుకు పంపారు. కేసు రుజువుపర్చడానికి వాది ఎక్కువ కష్టపడవలసిన పనిలేకపోయింది. కొత్తగా వచ్చిన మేజస్ట్రేటుకు అతను యిలాంటి నేరాలు చేయడం సంభవమేననీ, స్వభావికమేననీ ఎలా నమ్మాడో తెలియదు. అంతేకాదు.

ఇంకా బందిపోటు దొంగలతో-సంబంధంకూడా వుందని నమ్మారు. అదీ గాక పోలీసు డైరీలోని సంగతులు కూడా సహాయపడినయ్! అందులో, రమేశు యింతకుముందుకూడా యిటువంటి పనులు చేశాడని రాసివుంది. ఇంకా అనేక రకాలైన సందేహజనకములైన సంగతులు చాలా కనిపించి నయ్! ఇకమీదట పోలీసులు అతన్ని దృష్టిలో వుంచుకోవాలని కూడా చెప్పాడు. పెద్దసాక్ష్యంకూడా అక్కరలేకపోయింది. అయినా రమమాత్రం సాక్ష్యం చెప్పాల్సి వచ్చింది— "భైరవాచారిగారింట్లోకి వచ్చి రమేశ్ అతన్ని కొట్టబోయా డనేది నిజం! కాని కత్తితో పొడిచిందీ లేనిదీ నాకు తెలియదు. అసలు ఆయన చేతిలో కత్తి వున్నదీ లేనిదీ నాకు జ్ఞాపకం లేదు" అని చెప్పింది.

అయితే యిది నిజమేనా? జిల్లాకోర్టులో ఆమె దేవునియెదట ప్రమాణంచేసి చెప్పింది. కాని ప్రమాణం చేయించే నియమములేని కోర్టులో అమె ఏం జవాబుచెపుతుంది? రమేశుడు కత్తితో పొడవలేదనీ, ఆయన చేతిలో అస్త్రమేకాదు—చివరకు ఓ పూచికపుల్లకూడా లేదని రమకంటే ఎక్కువగా తెలిసిం దెవరికి? కాని అంత కోర్టులో నీకు ఏ విషయం గుర్తుంది? ఏదీలేదు? అని అడిగేవాళ్ళే లేకపోయారు. కాని ఈనాటి కోర్టులో నిజం చెప్పడానికి ఆమెకు దారి ఏమీలేదు. వేణీ మొదలైనవాళ్ళ చేతిలో గ్రామసమాజం నిజం కావా లనదు. ఒకవేళతను నిజం చెప్పినట్లయితే—అందుకు ప్రతిఫలంగా అబద్ధపు అపవాదనే కాళిమను ముఖానికి పూసుకుని సంఘంలోంచి వెలి కావలసి వచ్చేది. ఇలా చాలామందిని వెలివేశాడు కూడా! అయినా రమేశునికి యింత దీర్ఘకాలం శిక్షపడుతుందని రమకు తెలియదు. మహా ఎక్కువైతే వందో, రెండువందలో జుల్మానా వేస్తారని అనుకుంది. పైగా ఎన్నిసార్లు హెచ్చరించినా—రమేశు తనపని మానుకుని వెళ్ళిపోవడానికి అంగీకరించలేదు. అందువల్ల కోపంవచ్చి, ఒకసారి జరిమానా పడాల్సిందేనని, మనసులో అనుకుంది. అదీ ఒక శిక్షే ననుకుంది. రమేశుకు యిటువంటి శిక్ష పడుతుందనీ, అ రోగియైన రమేశుని ముఖం చూసైనా మేజస్ట్రేటుకు దయకలగదనీ, ఒక్కసారే ఆరునెలల కఠినశిక్ష విధిస్తాడనీ కలలోకూడా అనుకోలేదు. అప్పుడు స్వయంగా రమ అతనివేపు కన్నెత్తి చూడలేకపోయింది. ఆ

తరువాత—రమేశు కన్నార్పకుండా తనవేపే చూస్తున్నాడని ఎవరో చెప్పగా విన్నది. జెయిలుకు సాంకుం అయాక గోపాలసర్కారు ఏదో విధంగా అప్పీలు చేద్దామని అన్నప్పుడు రమేశు— "వద్దు. ఒకవేళ మేజస్ట్రేటు యావజ్జీవం శిక్షవేసినా నేను అప్పీలు చేయను. ఇంతకంటే నాకు జెయిలే మంచి దనిపిస్తూంది" అన్నాడు.

నిజంకాదూ? తన చిరానుగతుడైన భైరవాచారి తనమీద అబద్ధపు కేసుపెట్టి యిలా ఋణం తీర్చుకున్నాడు. రమ బోనులో నిలబడి తన చేతిలో కత్తి వున్నదీ లేనిదీ కూడా జ్ఞాపకం తెచ్చుకోలేకపోయింది. అటువం టప్పుడు అప్పీలుచేసి ఎవరికోసం విడుదల పొందాలి.

అతని మీదున్న దుర్జేయమైన అభిమానం—రమ ఛాతీమీద కొండంత బరువు పెట్టినట్లుంది. దాన్నిదించి ఎక్కడ పెడదామన్నా చోటు కనిపించ లేదామెకు. ఎంత గొప్ప బరువు—? తను అబద్ధంచెప్పి రాలే దనే సమర్థన తన అంతరాత్మ ఏవిధంగానూ వొప్పుకోవడంలేదు. ఆమె అబద్ధం చెప్పలేదను కుందాం. కాని నిజంకూడా చెప్పలేదు. నిజాన్ని దాపడం ఎంత పెద్ద అపరాధమో,—అవి ఆమెను యీ విధంగా అహర్ని శమూ తన అంతర్మాతను యెలా దహించేది ముందే తెలుసుకుంటే దావుండేది. భైరవుని అపరాధంవల్ల రమేశుడు ఎంత బలాన్ని నష్టపడ్డాడో మాటి మాటికి అదే గుర్తుకు వస్తూంది. అయినప్పటికీ తను చెప్పిన ఒక్కమాట ప్రకారం అతని తప్పుక్షమించి మెదలకుండా వెళ్ళిపోయాడు. తన ఒక్కమాటను యిలా ఔదలతాల్చి మెదలకుండా వెళ్ళిపోయిన వాళ్ళెవరైనా వున్నారా యింతవరకు? యిప్పుడు కొన్నినిజాలను గ్రహించ గలుగుతూంది. ఏ సమాజానికి భయపడి తనింత గర్హించదగిన పని చేసిందో.—ఆ సమాజం యెక్కడుంది? వేణీ మొదలైనవాళ్ళ స్వార్థం—క్రూరహింసా విధానంకన్న బయట దీని కెక్కడైనా స్థానముందా? గోవిందుని విధవ మరదలి సంగతి మెవరికి తెలియదు. వేణీతో ఆమెకున్న సంబంధం గ్రామమంతటికీ తెలియనిదికాదు. కాని అతను సమాజంలో నిష్కంటకంగా తలెత్తుకుని తిరుగు తున్నాడు, పైగా సమాజానికి పెద్ద వేణీబాబే, సమాజిక శృంఖలాలన్నీ తమ చేతుల్లో వుంచుకుని తిరగడమే వాళ్ళ స్వార్థానికి పరమావధి, యిదే హిందూత్వం—! అయినప్పటికీ

యీ అనర్థాలకన్నిటికీ మూలకారణమైన భైరవునిమీద ఆమెకు కోపం రాలేదు. అతని కూతురు పన్నెండేళ్ళది వుంది. యిక తొందరలో దానికి పెళ్ళిచేయకుంటే— అతన్ని వెలివేస్తారు. ఈ వూళ్ళోని ప్రతివక్కరికీ వున్న బెడదేయిది. అన్నివిధాల హంగు వుండి కూడా తనే సమాజానికి భయపడవలసి వచ్చింది. అటువంటప్పుడు బీదవాడైన భైరవాచారి ఎలా భయపడకుండా వుండగలడు? వేణీకి విరుద్ధంగా ప్రవర్తించడం ఎంత భయంకరమైన విషయమో ఆమెకు తెలియనిదికాదు.

ముసలివాడైన సనాతన హజ్రా ఆయింటి గుమ్మం మీదుగా వెళుతున్నాడు. అతన్ని చూడగానే గోవిందగంగూలి ముందు కేకవేసి, ఆ తరువాత బ్రతిమిలాడి—ఆ పైన ఒక విధంగా బలవంతంమీద అతన్ని వేణీ బాబు యెదట వుంచాడు. వేణీ మండిపడుతూ — "ఏమోయ్ సనాతన్—! మీకింత గర్వం ఎప్పటినుంచి వచ్చింది? మీ మెడమీద కొత్త తలకాయ మొలిచిందా?" అని అడిగాడు.

"పెద్దబాబుగారూ! రెండు తలలు ఎవరికుంటాయ్? మీబోటి వారికే రెండు తలలు లేనప్పుడు మాబోటి బీదవాళ్ళకు ఎలా వుంటాయ్ బాబూ?" అన్నాడు సనాతనుడు.

"ఏమిట్రా అన్నావ్?" అని ఓ గావుకేకవేసి వేణీ మాట్లాడలేక పోయాడు. కొంతకాలం క్రిందట ఈ సనాతనుని యావదాస్తి వేణీబాబుకు తాకట్టు అయింది. అప్పుడు ఈ సనాతనుడే నిత్యం రెండుపూటలా వచ్చి వేణీ కాళ్ళుపిసికి వెళ్ళేవాడు. అటువంటివాడి నోటినుంచి, యివాళ యిటువంటి మాటలా ?

"పెద్దబాబుగారూ! నే నేమన్నాను —? రెండు తలలు యెవరికీ వుండవు అన్నాను. యింకేమీ అనలేదు —" అన్నాడు సనాతనుడు.

"మీ గుండెల్లో ఎంత సాహసం లేకుంటే అమ్మవారి ప్రసాదానికి కూడా రాకుండా వుంటారు—? అటువంటప్పుడు మీరంతా ఎందుకు రాలేదో చెప్పు —" గోవింద్ కోపంగా అన్నాడు.

సనాతనుడు నవ్వి — "మాగుండెల్లో సాహసమా? మీరు చేయవలసిం దేదో చేసేశారు. సరే; యింక ఆసంగతి వదలేయండి! కాని అమ్మవారి ప్రసాదం కానీయండి! మరింకేమైనా కానీయండి! యిప్పు డిక

పల్లెవాళ్ళెవరూ మీ బ్రాహ్మణుల యింటికి తినడానికి రారు. ఇంత పాపం వసుంధర యెలా సహిస్తుందా అని మేమంతా అనుకుంటున్నాము" అని హఠా ఒక నిట్టూర్పు విడిచి, రమవేపు చూసి—"రమతల్లీ! మీరు కొంచెం జాగ్రత్తగా వుండండి! పీరుపుటం ముసల్మానులు వక్కసారే మండి పోతున్నారు. చినబాబుగారు తిరిగి వచ్చాక ఏంజరుగుతుందో తెలియదు. అదంతా ఈ దుర్గాతల్లికే తెలుసు! అయినా ఈ మధ్యవాళ్ళు రెండుమూడు సార్లు పెద్దబాబుగారింటివేపుకూడా తిరిగివెళ్ళారు. అప్పుడు పెదబాబుగారు ఎదురుపడకపోవడం చాలా మంచిదైంది" అని సనాతనుడు వేణీవేపు చూశాడు.

క్షణకాలం వేణీ కోపంగావున్న ముఖం తెల్లబడిపోయింది. సనాతనుడు మళ్ళీ — "పెదబాబుగారూ! నేను అమ్మవారియెదుట అబద్ధం చెప్పడంలేదు. మీరు కొంచెం జాగ్రత్తగా వుండండి! రాత్రిం బగళ్ళు అనకుండా బయట తిరగవద్దు. ఎవరు, ఎప్పుడు, ఎక్కడ, ఏంచేస్తారో చెప్పలేను" అన్నాడు.

వేణీ ఏదో అందామనుకున్నాడు. కాని అతని నోటంటమాట పెకల లేదు. బహుశా అతనిలాంటి పిరికిపందలు ప్రపంచంలో వుండబోరేమో!

ఇంతసేపయాక రమ కరుణార్ద్రంగా అంది—"ఏం సనాతన్ చిన బాబుగారి కారణంతోనే వాళ్ళంతా, యింతకోపంగా వున్నారనుకుంటాను"

ఒకసారి దుర్గప్రతిమవేపు చూసి. సనాతనుడు అన్నాడు- "అబద్ధం చెప్పి నరకాని కెందుకు వెళ్ళాలమ్మా! కాని ముసల్మానుల కోపమే ఎక్కువగా వుందిప్పుడు, వాళ్ళు చినబాబుగారిని దేవునిలా కొలుస్తున్నారు. అందుకు నిదర్శనం చూడండి! జఫరాలీ వద్దనుంచి, ఎవరూ ఒకదమ్మిడీ వసూలుచేయలేకపోయారు. ఆతను చినబాబుగారు జెయిలుకు వెళ్ళిన రోజున, స్కూలుకు వెయ్యిరూపాయలు దానం యిచ్చాడు. చినబాబుగారి పేరుమీదుగా మసీదులో నమాజు కూడా చేస్తున్నారని విన్నాను."

శుష్కించి, వాడివున్న రమ ముఖం ఒక్కసారి మెరిసింది. ఆమె మెదలకుండా —మిలమిలలాడుతున్న నిర్నిమేష నేత్రాలతో సనాతనుని ముఖంలోకి చూస్తూవుంది. వేణీ హఠాత్తుగా సనాతనుని చేయిపట్టుకుని—

"సనాతన్! నువ్వు యీ సంగతి కొంచెం స్టేషన్‌దాకా వచ్చి, యినస్పెక్టరు గారికి చెప్పు: నీవు కోరింది యిస్తాను. ఒకవేళ రెండెకరాల పొలం కావాలన్నా యిస్తాను. దేవత యెదట వొట్టువేసి చెప్పుతున్నాను సనాతన్! ఈ బ్రాహ్మణునిమాట వొప్పుకో" అని చెప్పాడు.

సనాతనుడు విస్మయంగా వేణీబాబు ముఖంలోకి చూస్తూ అన్నాడు- "పెదబాబుగారూ! నేను యింకెంతకాలం బ్రతుకుతాను. నేను పేరాశలో పడి— యీ పనిచేసి చనిపోతే-నాశవం యెత్తడం అటుంచి, ఎవ్వరూ కాలితో కూడా ముట్టుకోరు. ఇప్పుడు ఆకాలం లేదు పెదబాబుగారూ! ఆకాలం వెళ్ళిపోయింది. చిన్నబాబుగారు కాలాన్నితల్లక్రిందుచేసి వెళ్లారు."

"అయితే బ్రాహ్మణులమాట వినవన్నమాట? అంతేనా?" అని గోవిందు దడిగాడు.

తల అడ్డంగా తిప్పుతూ సనాతనుడు—"చెప్పలేను. గంగూలీగారూ నేను చెపితే మీకు కోపం వస్తుంది. గాని ఆనాడు పీరుపురంలో స్కూలులో చినబాబుగారు— మెడలో రెండుమూడు జంధ్యపుపోగులు వేసుకున్నంత మాత్రాన బ్రాహ్మణులు కాజాలరు" అని చెప్పారు. నేను ఈనాటివాన్ని కాను. నాకంతా తెలుసు. మీరు చేస్తున్నపనులు బ్రాహ్మణులు చేసేవేనా? అమ్మగారూ! నేను మిమ్మల్ని అడుగుతున్నాను! మీరేచెప్పండి" అన్నాడు.

రమ ఏమీ జవాబు చెప్పకుండా తలొంచుకుంది. సనాతనుడు యింకా వుత్సాహం తెచ్చుకుని మనసులోనిదంతా వెళ్ళగక్కాడు— "అందులో ముఖ్యంగా కుర్రవాళ్ళగుంపు.... ఏరోజున చినబాబుగారు జెయిలుకు వెళ్ళారో—ఆనాటినుంచీ, గ్రామములో కుర్రకారంతా—చీకటి పడ్డాక జాఫరాలీ యింటిలో సమావేశమవుతున్నారు. వాళ్ళంతా 'అసలైన జమీందారు చినబాబుగారేనని, మిగిలినవాళ్ళంతా దొంగలూ —దోపిడీ గాళ్ళ'ని బహిరంగంగా వూళ్ళన్నీ చాటిస్తున్నారు. 'అంతేకాదు. మేము పిస్తుయిస్తున్నాం. ఒకరికి భయపడము. ఒకవేళ వారు బ్రాహ్మణుల్లావుంటే సరే, లేకుంటే మేమెంతో, వాళ్ళూ అంతే' అంటున్నారు."

తడి ఆరిపోయిన గొంతుతో వేణీ అడిగాడు "మామీద వాళ్ళకంత కోపం ఎందుకు సనాతన్?"

కోపపడకండి పెదబాబుగారూ! ఈ అనర్థకాలన్నిటికీ మీరే మూలకారణమని వాళ్లు తెలుసుకున్నారు."

వేణీ మాట్లాడకుండా చూచున్నాడు. ఈ అలగాజాతివాడైన సనాతనునినోటంట యిటువంటి మాటలు వినికూడా కోపగించలేదు. అతని స్థితి కోపంతెచ్చుకునేవిధంగాలేదు. గుండెదడదడలాడుతూంది.

"అయితే వాళ్ళకు రంగస్థలం జాఫరాలీ యిల్లన్నమాట? అక్కడ వాళ్లేమిచేస్తుంటారో నువ్వు చెప్పగలవా?" అని గంగూలి అడిగాడు.

మొదట సనాతనుడు అతనిముఖంలోకి చూస్తూ కొంచెంసేపు వూరుకున్నాడు. ఆ తరువాత—"ఏం చేస్తుంటారో తెలవదు. కాని బాబుగారూ! మీ మంచిని కోరుకుంటే ఏవిధమైన అంతులాగేందుకు ప్రయత్నించవద్దు. అక్కడ హిందూ—ముసల్మాను లంతా సోదరులయారు. ఆ రెండుమతాలవారిది ఒకటేమనస్సు—ఒకేప్రాణం. చినబాబుగారు జెయిలుకు వెళ్ళాక తుపాకిమందులా పోగైవుం దక్కడ. దానిమధ్యలో అగ్గిపుల్లగీచి వేద్దామని ప్రయత్నించవద్దు బాబూ"అని చెప్పివెళ్ళిపోయాడు.

చాలా సేపటివరకు ఎవరూ ఏమీ మాట్లాడలేదు. రమ లేచి వెళ్ళబోతుండగా వేణీ అన్నాడు-"రమా! సంగతంతా విన్నావుకదూ?"

రమ నవ్విందికాని ఏమీ అనలేదు. ఈ నవ్వు ఆతనికి మంటపుట్టించింది—"యిదంతా ఆ భైరవాచారిగాడివల్ల జరిగింది. నువ్వు ఆనాడు వచ్చి వాడిని విడిపించకుంటే యిలా జరిగేదికాదు. రమా! నీకు నవ్వులాటగానే వుంటుంది. నువ్వు ఆడదానివి. నువ్వు యింట్లోంచి బయటకు రావాల్సిన అవసరం వుండదు. కాని మరి మా గతేమిటో చెప్పు! నిజంగా ఎవడన్నా తల పగులకొడితే యేం కావాలి? ఆడవాళ్ళతో కలిసి వ్యవహారంవేస్తే యిలాగే అవుతుంది—" అని వేణీ ముఖం మాడ్చుకుని కోపంతోనూ, భయంతోనూ విహ్వాలుడై కూచుండిపోయాడు.

రమ స్తంభించిపోయింది. వేణీసంగతి ఆమెకు బాగా తెలుసు! కాని యిటువంటి లజ్జాపూర్వకమైన నెపంవేస్తాడని ఎప్పుడూ అనుకోలేదు. కొంచెంసేపు అక్కడనుంచుని జవాబు చెప్పకుండానే లోపలికివెళ్లిపోయింది. ఆ తరువాత వేణీ పెద్దగా కేకలువేస్తూ-నాలుగైదు లైట్లతో-నలుగురు మనుష్యుల మధ్యగా-ఎంతో జాగ్రత్తగా యింటికి వెళ్ళాడు.

# 17

కళ్ళనీళ్ళు పెట్టుకుని, విశ్వేశ్వరి గదిలోకివచ్చి అడిగింది—
"యివాళ యెలావుంది రమా?"

రమ ఆమె ముఖంలోకి చూసి కొంచెం నవ్వి-"యివాళ బాగానే వుంది పెద్దమ్మా!"

విశ్వేశ్వరివచ్చి ఆమె తన పద్ద కూచుని. తల, ముఖం, నిమరడం మొదలుపెట్టింది. యిప్పటికి మూడు నెలలనుంచి రమకు సుస్తీగావుంటూంది. ఆమె శరీరంలో దగ్గూ, మలేరియా వ్యాపించిపోయింది. గ్రామములో వృద్ధవైద్యుడు వ్యర్థమైన చికిత్సలుచేస్తూ చచ్చిపోతున్నాడు. కాని ఆ ముసలివైద్యునికి అది తగ్గకపోవడానికి కారణ మేమిటో అంతుపట్ట లేదు. కాని విశ్వేశ్వరి మనస్సులో ఒక అనుమానం మెల్లమెల్లగా దృఢపడుతూవుంది. ఆమె రమను తన కూతురులా చూసేది. అందులో పంచన యేమాత్రంలేదు. అందువల్ల ఆ స్నేహమే రమ విషయంలో ఆమె సత్య దృష్టి అసమానంగా తీవ్రతరంచేసింది. ఇతరులు ఆమెను సరిగ్గా అర్థం చేసుకోలేక ఏవేవో చికిత్సలూ, మందులూ వేస్తుంటే ఆమెగుండెలు పగిలి పోతున్నయ్। రోజురోజుకూ రమకళ్ళు గుంటలుపడడం చూసింది. కాని దృష్టిమాత్రం తీక్షణంగావుంని ఎక్కడో దూరంగావున్న వస్తువును, తన దగ్గరకు తీసుకునివచ్చి చూడాలనేంత ఏకాగ్రంగా వున్నయ్ ఆ చూపులు?

విశ్వేశ్వరి మెల్లగా "రమా-"అని పిల్చింది.

"ఏమిటి పెద్దమ్మా!"

"నేను నీకు తల్లిలాంటిదాన్ని రమా!"

"తల్లిలాంటిదానివేమిటి? నువ్వు నా తల్లివే పెద్దమ్మా."

విశ్వేశ్వరి వంగి రమ నొసలు ముద్దుపెట్టుకుని అన్నది." అయితే నీ అసలు జబ్బేమిటో చెప్పమ్మా?"

"పెద్దమ్మా నిజంగా సుస్తీగానేవుంది"

తెల్లబడిపోయిన రమముఖం క్షణంలో ఎర్రబడిపోవడం విశ్వేశ్వరిచూసింది. అప్పుడు ఆమె ఎంతో ప్రేమపూర్వకంగా, నూనె సంపర్కంలేని జుట్టులోకి వ్రేళ్ళుపోనిచ్చి -"అపునమ్మా! అసంగతి నా కీ

కళ్లకు తెలుస్తూనేవుంది. అయినా వీటితో చూడలేని విషయం ఏమన్నా వుంటే-అది యిప్పుడు నావద్ద దాచవద్దు. దాచినందువల్ల సుస్తీతగ్గదు." అని అడిగింది.

కిటికీ బైట యెండ యింకా తీవ్రంగాలేదు. గాలికూడా చల్లగానే వీస్తూవుంది. అటుపేపు చూస్తూ రమ ఏమీ మాట్లాడలేదు. కొంచెంసేపు వున్నాక —"పెద్దమ్మా! యిప్పుడు పెద్దన్నయ్యకు ఎలావుంది?" అని అడిగింది.

"బాగానే వున్నాడు. తలమీద గాయం మానడానికి యింకా కొంత కాలం పడుతుంది. కాని నాలుగైదు రోజుల్లో ఆసుపత్రినుంచి యింటికి వస్తాడు." అని రమముఖంలోని బాధనుచూచి —"విచారించవద్దమ్మా! విచారించవలసిందేమీలేదు. దీనివల్ల వాడికి బుద్ధివస్తుంది —" అన్నది.

రమముఖంలో వేదనాభావం చూసి పెద్దమ్మ అన్నది—"విచారించకమ్మా! యిది వాడికి జరిగితీరవలసిందే, దీనివల్ల వాడు బాగుపడతాడు." అని రమముఖంలోని ఆశ్చర్యాన్ని గమనించి అన్నది. "తల్లి అయివుండికూడా-తన సంతానాని కింత దుర్గతి పట్టినా, యిలా మాట్లాడుతుందేమాఅని ఆలోచిస్తున్నావా? నేను నిజమే అంటున్నాను రమా! కానీ నేను దీనివల్ల ఎక్కువగా బాధపడ్డానో-ఆనందించానో చెప్పలేను. ఎందుకంటే ఎవరు అధర్మానికి భయపడరో — లోకంలో సిగ్గు అనేదానికి వెరవరో - వాళ్లకు ప్రాణాలంటే మహా భయమని నాకు తెలుసు! అలా కాకుంటే ప్రపంచం యిప్పటికే మండి భస్మమైపోయేది. అందుకని రమా! ఆ కల్లూకొడుకు వేణికి చేసిన వుపకారం, ప్రపంచంలో యే ఆత్మీయుడూ చేయనట్టిదని గ్రహించాను. అమ్మాయీ! బొగ్గును తోమినంత మాత్రంలో దాని రంగు మారదు. దాన్ని నిప్పులోవేసి కాల్చివేయాలి-"

"అయితే అప్పుడు యింట్లో ఎవరూ లేరా?"

"ఎందుకులేరు? అంతా వున్నారు. వాడు జెయిలుకు వెళ్ళాలని, నిశ్చయించుకునే-నూనె అమ్మే మిషమీద వచ్చాడు. వాడికి వేణీమీద ప్రత్యేకించి కోపమేమీలేదు. అందుకని వాడుకొట్టిన మొదటి దెబ్బకే వేణీ స్పృహతప్పి పడిపోయాడు. అప్పుడు వాడు మెదలకుండా నిలుచుని చూస్తున్నాడు.ఆ తరువాత వాడువేణీని యింకొక్క దెబ్బకూడా కొట్టలేదు,

అంతేకాదు. వాడు వెళ్ళిపోతూ 'యికమీదనైనా వేణీ జాగ్రత్తగా వుండకుంటే,నేను జెయిలునుంచి వచ్చినా-రాకపోయినా యిదే నా ఆఖరిదెబ్బ కాదని తెలుసుకోవాలి" అని చెప్పి వెళ్ళాడు.

"అంటే యింకా చాలామంది అన్నయ్యకోసం కాచుకుని వున్నారన్నమాట. కాని పెద్దమ్మా! యిదివరకు మన వూళ్ళో యీ అలగాజాతి వాళ్లకు యింత సాహసంలేదు. యిప్పుడు వీళ్లకింత సాహసం ఎక్కడి నుంచి-వచ్చింది?"

విశ్వేశ్వరి నవ్వుతూ "ఈ అలగాజాతివాళ్లకింత సాహసం యెలా, యెవరు కలగజేశారో-ఆ సంగతి నీకు తెలవదా? రమా! నిప్పు రగులుకుని పూరికే ఆరిపోదు. దాన్ని బలవంతంగా ఆర్పినా-ఆ చుట్టుప్రక్కల నున్న వస్తువుల్ని వేడిచేయక మానదు. రమేశు తిరిగివచ్చి, దీర్ఘజీవిగా ఎక్కడో అక్కడ సంతోషంగా వుంటే చాలు. వేణీవిషయం గుర్తుకు తెచ్చుకుని, నేను నిట్టూర్పుకూడా విడవను." అన్నది.

ఈ మాటేమో అన్నది, కాని, బలవంతంగా నిట్టూర్పు ఆపుకోవడం రమ గమనించకపోలేదు. అందుచేత ఆమెచేతిని లాక్కుని తనగుండెలమీద పెట్టుకునివుంది. కొంచెంసేపయాక విశ్వేశ్వరి తనను తాను సంబాళించుకుని 'రమా! ఏకైకసంతాన మంటే ఎటువంటిదో అది ఒక్క తల్లికే తెలుస్తుంది. ఎప్పుడు వేణీ దెబ్బతిని పడిపోయాడో - అప్పు డంతా చేరి బండిలో ఆసుపత్రికి తీసుకునివెళ్లుతున్నారు. ఆ సమయంలో నాస్థితి నేను చెప్పలేను. అయినప్పటికీ నేను ఒకర్ని దూషించలేదు. ఎవరిమీదా నేరం వేయలేదు. ఏకమాత్ర సంతానమని, తల్లిముఖం చూస్తూ ధర్మం తనవిధిని నిర్వర్తించకుండా వుంటుందా? అది మాత్రం నేను మర్చిపోలేకపోయాను" అన్నది.

రమ ఏదో ఆలోచించి అన్నది — "పెద్దమ్మా! నేను నీతో వాదించాలనికాదు. కాని రమేశన్నయ్య ఏపాపంవల్ల యింత దుఃఖం అనుభవిస్తున్నాడు? మే మంతా ఎంతో ప్రయత్నంచేసి ఆయనను జెయిలుకు పంపామని అందరికీ తెలుసుగా?''

"కాదమ్మా కాదు! అదికాదు. రమేశుడు ఏమీ ఎరుగనివాడు కాబట్టే వేణి యిప్పుడు హాస్పటల్లో వున్నాడు — ఇక నీ...." ఆ మాట

అనబోతూ ఆగిపోయింది. ఏసంగతి ఆమె నోటిచివరకంటా వచ్చి ఆగి పోయిందో. దాన్ని బలవంతంగా లోపల అణచుకొని —"ఏపనీకూడా —వూరికే శూన్యంలో కలసిపోదని ఎరుగుదువు. దానిశక్తి ఎక్కడో ఒకచోట పనిచేస్తూనే వుంటుంది. కాని అది ఏ రూపంలో—ఎలా చేస్తుందో గ్రహించలేము. అందువల్లనే యింతవరకూ—ఒక మనిషిచేసిన పాపానికి, యింకొక్కరు ప్రాయశ్చిత్తం ఎందుకు చేసుకోవాల్సివస్తుందో- దాని మీమాంస యింతవరకు తేల్చలేకపోయాము. కాని రమా! ప్రాయశ్చిత్తం చేసుకోవాల్సివస్తూనే వుంది. యిందులో సందేహంలేదు."

రమ తన వ్యవహారాన్ని గుర్తు తెచ్చుకుని ఒకనిట్టూర్పు విడిచింది. విశ్వేశ్వరి మొదలుపెట్టింది — "రమా! దీనివల్ల నాకళ్లుకూడా తెరుచుకున్నాయి! 'మేము మంచిచేస్తాం, అని అన్నంతమాత్రాన మంచి చేయలేము. మొదటినుంచి ఎన్నో చిన్నా—పెద్ద—అవాంతరాల మెట్లుదాటి పైకి వెళ్ళేంత ధైర్యం వుండాలి. ఒకనాడు రమేశుడు హఠాత్తుడై, నావద్దకు వచ్చి— 'పెద్దమ్మా పీళ్ళకు మంచిచేయడం నాకు చేతకాదు. అందువల్లనే నెక్కడనుంచి వచ్చానో అక్కడకే వెళ్ళిపోతాను' అని చెప్పాడు. అప్పుడు అతన్ని నేను ఆపి— 'కాదు నాయనా! నువ్వు ఒకపని మొదలు పెట్టావు. దాన్ని మధ్యలో వదిలి వెళ్ళవద్దు' అని చెప్పాను. వాడు నామాట ఎప్పుడూ కాదని యెరుగడు. అందువల్ల ఆనాడు వాడు జెయిలుకు వెళ్ళవలసిన సంగతి విని నేనే బలవంతంగా వాణ్ని జెయిలుకు పంపానేమో ననుకున్నాను. కాని, వేణీని హాస్పటల్‌కు తీసుకునివెళ్ళినరోజున— వాడు జెయిలుకు వెళ్ళడమే మంచి దనుకున్నాను. అయినప్పటికీ — యెక్కడినుంచో వచ్చి, యితరులకు వుపకారంచేయడంలో యిన్నికష్టాలున్నాయనీ, ఈపని యింతకష్టమైందనీ, మొదట్లో తెలుసుకోలేకపోయానమ్మా! మొదట్లో అందరిలో కలిసిపోవాల్సివుంటుందని నే నెప్పుడూ అనుకోలేదు. ముందు కష్టంవచ్చినా-సుఖంవచ్చినా-అందరితోపాటు కలిసి రాకపోతే ఏపనీ జరగదని నాకు తెలవదు. వాడు మొదటినుంచీ-శిక్షా-సంస్కారమూ- శారీరకబలంతో-ఉన్నతమైన హృదయంతో పై స్థాన మాక్రమించి కూచున్నా —వాడ్ని ఎవరూ అర్థంచేసుకోలేకపోయారు.

అమ్మాయీ! చివరకు నేను కూడా వాణ్ణి అర్థం చేసుకోలేకపోయాను. నేను వాణ్ని వెళ్ళనివ్వకపోయాను. పట్టుకుని యిక్కడ వుంచలేకపోయాను."

రమ ఏదో అందామనుకుంది; కాని చెప్పలేకపోయింది. విశ్వేశ్వరి అది గ్రహించి — 'కాదు రమా! నే నందుకు పశ్చాత్తాపపడడంలేదు. కాని అమ్మాయీ! నువ్వు విన్నాక కోపం తెంచవద్దు. మీ రంతా కలిసి వాణ్ణి చాలా క్రిందపడదింపి—నలుగురిలో కలిపారు. ఇది అధర్మమైతే కావచ్చు. కాని వాడు తిరిగి వచ్చాక యింతకోని సత్యాన్ని గ్రహించగల డని నేను గట్టిగా చెప్పగలను" అన్నది.

రమ ఆ సంగతి సరిగ్గా గ్రహించలేకపోయింది. ఆమెవల్ల అడిగింది- "కాని ఆయన క్రిందకు ఎందుకు దిగివస్తాడు పెద్దమ్మా? మా అన్యాయాలవల్లా, అధర్మాలవల్లా, ఆయన ఎన్ని అవస్థలు పడినా-చివరకు మా దుష్కర్మలకు మేమే నరకకూపంలోకి త్రోసివేయబడతాము. మా దుష్కర్మలు ఆయనకెందు కంటుకుంటాయ్?"

విశ్వేశ్వరి మ్లానంగా నవ్వి అంది- "అమ్మాయీ! ఎందుకంటు కోవు? లేకుంటే పాపం యింత భయంకరంగా ఎందుకుంటుంది? సాధారణంగా ఉపకారానికి ప్రత్యుపకారం అలావుంచి పైగా అపకారమే చేస్తూంటారు కొందరు. అటువంటివారి కృతఘ్నత దాతను క్రిందకు దింప కలుగుతుందా? వాడు తిరిగివచ్చాక, ఈ కుంవాపుర గ్రామం వాడ్ని అలానే చేస్తుందా? కాదు. వాడు ఏచేత్తో దానంచేస్తూ తిరిగేవాడో-ఆచేతిని ఖైఎవుడు నరికేశాడని నువ్వే స్పష్టంగా చూడగలవు" అని కొంచెం ఆగి- "కాని ఎవరికి తెలుసు? ఇది వాడి మంచికే జరిగిందేమో! వాడి బలిష్ఠమైన పూర్తిచేతి దానాన్ని పుచ్చుకునే శక్తి వూళ్ళోవాళ్ళకి లేనప్పుడు ఆ సగం విరిగిన చేతిదానమే వాళ్ళకు వుపయోగపడుతుందేమో!" అని ఆమె నిట్టూర్చింది.

రమ కొంచెంసేపటివరకూ మాట్లాడకుండా వూరుకుని, ఆమె చేతిని అటూ—యిటూ వూగిస్తూ ఎంతో నెమ్మదిగా- "సరే పెద్దమ్మా! అబద్ధపు సాక్ష్యంచెప్పి- ఒక నిరపరాధికి శిక్ష విధించేట్లు చేసినవాళ్ళ కేమీ శిక్షలేదా?" అని అడిగింది.

విశ్వేశ్వరి కిటికీలోంచి బయటకు చూస్తూ-ఆమె సంస్కారంచేసిన జుట్టులోకి వేళ్లుపోనిచ్చి నిమురుతూవుంది. హఠాత్తుగా రమ కనుకొలకుల్లోంచి నీరురావడంచూసి, ఎంతో ఆదరంగా వాటిని తుడిచి అన్నది- "కాని యిందులో నీ దోషం ఏమీలేదమ్మా! ఏ పిరికిపందలు స్త్రీజాతిమీద అపనింద వేస్తామనే భయం చూపించి- నీమీద యీ పాపభారం వేశారో. ఆ శిక్షంతా వాళ్లే అనుభవిస్తారు. ఇందులో నిన్నేమీ అంటదు."

ఈ వూరడింపు మాటలకు రమకళ్ళలోంచి నీళ్ళు యింకా ఎక్కువ కాసాగినయ్! కొంచెంసేపుండి ఆమె అన్నది- "కాని వీళ్లు ఆయనకు శత్రువులు. శత్రువును ఏవిధంగానైనా అణచడంలో తప్పులేదని వీళ్ళు అంటారు. కాని, చెప్పుకోవడానికి నా కటువంటి సంజాయిషీ ఏమీలేదు పెద్దమ్మా!"

"ఏమమ్మా! ఎందుకని లేదు?" అని అడిగి పెద్దమ్మ చూపులు క్రిందకుదించింది- ఒక్కసారి మెరుపు మెరిసినట్లయింది. తన కిన్ని రోజులనుంచి వున్న సందేహం-ఈనాడు తీరిపోయినట్లయింది. ఇవాళ రమను అర్థంచేసుకుని కొంచెంసేపు వేదనతో విస్మయంతో స్తంభించిపోయింది. ఇక రమ హృదయంలోని వ్యధ ఆమెకు తెలుసు! రమ కళ్లు మూసుకునివుంది. అందువల్ల విశ్వేశ్వరిముఖంలోనిభావం గుర్తించలేకపోయింది —

"పెద్దమ్మా!"

పెద్దమ్మ చకితయై-ఆమె తలపట్టుకుని అటూ-యిటూ వూపి- "ఏమిటో చెప్పు?" అని అడిగింది.

"పెద్దమ్మా! ఇవాళ నీయెదుట ఒకసంగతి వొప్పుకుంటాను. పీరుపురంలో-జాఫరాలీ యింట్లో సాయంకాలప్పుడు యువకులంతాచేరి, రమేశన్నయ్య చెప్పిన మంచివిషయాలమీద చర్చించుకుంటున్నారట. వాళ్ళంతా గూండాలని పోలీసులకు వప్పగించాలనే వదంతి యిక్కడ వ్యాపించింది. అందుకని వాళ్ళను జాగ్రత్తగా వుండమని మనిషిని పంపాను. మరి పోలీసులకు కావలసిం దిదేగా? ఒకసారి వాళ్ళచేతుల్లో పడితే, తిరిగి తప్పించుకోవటం మనతరంకాదు."

ఆ మాటలువిని, విశ్వేశ్వరి వణికిపోయింది- "అ....ఏమిటన్నావు? వేణీ తన గ్రామములోకి వృధాగా పోలీసుల ఉత్పాతాన్ని కావాలని కొని తెచ్చుకుంటున్నాడా?"

"వేణీ అన్నయ్యకు యిప్పటిశిక్ష దాని ప్రతిఫలమే ననుకుంటాను. ఇలాఅన్నందుకు నన్ను క్షమించు పెద్దమ్మా."

విశ్వేశ్వరి వంగి ఆమెనొసలు ముద్దుపెట్టుకుని— "నేను వాడి తల్లిని. అటువంటి నేనే క్షమించలేకుంటే యింకెవరు క్షమిస్తారమ్మా? భగవంతుడు నీకు మనశ్శాంతికూడా యివ్వాలని ప్రార్థిస్తున్నాను" అన్నది.

రమ తన కన్నీళ్ళు తుడుచుకుని— రమేశు తిరిగివచ్చి తన సుఖ క్షేత్రంలోని పంట అనుకూలంగా వుందని తెలుసుకున్నప్పుడే నాకు మన శ్శాంతి పెద్దమ్మా! ఆయన కోరినవిధంగా జరిగింది. తన గ్రామములో బీదరైతులంతా నిద్రనుంచి మేలుకున్నారు. వాళ్ళకాళ్ళమీద వాళ్లు నిలు చున్నారు. వీళ్ళంతా ఆయన్ని అర్థంచేసుకున్నారు. ప్రేమిస్తున్నారు. కాని పెద్దమ్మా! ఈ ప్రేమానందంలో వారు నాతప్పును మరిచిపోలేరా?" అని అడిగింది.

విశ్వేశ్వరి ఏమీ మాట్లాడలేదు. ఆమె కళ్ళలోంచి ఒక కన్నీటి చుక్క- రమకపోలంమీద పడింది. ఆ తరువాత కొంచెంసేపు యిద్దరూ మెదలకుండా వున్నారు.

రమ పిలిచింది—"పెద్దమ్మా."

"ఏమిటమ్మా?"

"ఒక్కవిషయంలోమాత్రం మేమిద్దరం ఒకరికొకరం దూరం కాలేకపోయాము. అంటే విన్ను మే మిద్దరం ప్రేమిస్తున్నామన్నమాట."

విశ్వేశ్వరి మళ్ళీ ఒకసారివంగి ఆమెలలాటం ముద్దుపెట్టుకుంది.

"ఆ బలంమీద ఆధారపడి నేనొకసంగతి నీకు చెప్తున్నాను పెద్దమ్మా! నేను లేనప్పుడు ఆయన నన్ను క్షమించకుంటే, నా తప్పున తను అనుకున్నంత చెడ్డదాన్నిమాత్రం కాదని చెప్పు పెద్దమ్మా. నేనెంతగా ఆయన్ని దుఃఖపెట్టానో - అంతకంటే ఎక్కువ దుఃఖాన్ని నేను పొం దాను. నీ నోటంట విన్నాక ఆయన నమ్మకుండా వుండలేరనుకుంటాను."

విశ్వేశ్వరి గట్టిగా రమను కౌగలించుకుని యేడ్చి అన్నది. "పదమ్మా మనిద్దరం— ఏదేని పుణ్యక్షేత్రానికి వెళ్ళి వుందాం. ఎక్కడ వేణీ- రమేశు లాంటి వాళ్ళు వుండరో అట్టి క్షేత్రానికి వెళదాం. అక్కడ కన్నెత్తి చూసే సరికి దేవాలయపు శిఖరం కనుపిస్తుండాలి. అటువంటి ప్రదేశానికి వెళదాం. నే నంతా గ్రహించాను రమా ! అమ్మాయీ! నువ్వీ లోకంలో నుంచి వెళ్ళేటప్పుడు— ఈ విషయం గుండెల్లో వుంచుకుని వెళ్ళడం మంచిదిగాదు. మనమంతా బ్రాహ్మణులం. యితర బ్రాహ్మణ స్త్రీలు యెక్కడికి వెళ్ళి వుండాలను కుంటారో మనంకూడా అక్కడికే వెళ్ళి వుందాం."

చాలాసేపు అలాగే వున్నాక-నిట్టూర్పును బలవంతంగా ఆపుకుని- "అలాగే అనుకున్నాను పెద్దమ్మా" అన్నది.

# 18

తను యింతకాలం నుంచి అనుభవించిన కష్టాలు—బాధలు-జైలు గోడల బయట భగవంతుడు యీ విధంగా సార్థకం చేస్తాడని రమేశుడు తన వున్మత్త వికారంలో కూడా అనుకోలేదు. ఆరుమాసాలు కఠిన జైలు శిక్ష అనుభవించి బయటికి రాగానే వూహకు అందని సంగతి ఒకటి గోచరించింది. స్వయంగానే వేణీఘోషాల్ నెత్తిన గుడ్డకప్పుకుని అందరి కంటే ముందు నిలబడి వున్నాడు. ఆ వెనక రెండు స్కూళ్ళలోని మాష్టర్లూ- విద్యార్థులు-పండితులూ, ఆ వెనుక చాలామంది హిందూ-ముసల్మానులు నిలుచుని వున్నారు. వేణీ రమేశుని గాఢంగా కౌగలించుకుని యేడుస్తున్నట్లుగా- "రక్తసంబంధం ఎటువంటిదో యిప్పుడు తెలుసుకున్నాను, తమ్ముడూ! యదుముఖర్జీ కూతురు ఆ వెధవ భైరవాచారిగాడిచేత యీపని చేయించి, సిగ్గెగ్గులులేకుండా బోను యెక్కి యిలా అబద్ధపు సాక్ష్యంచెప్పి నిన్నింత వేధిస్తుందని అప్పుడు నాకు తెలిసివుండికూడా తెలియనట్లున్నాను. భగవంతుడు నాకు తగిన శిక్ష విధించాడు. నువ్వు జెయిలులో బాగా వున్నావురా తమ్ముడూ; నేను బయట యీ ఆరుమాసాల నుంచి వుడికి వుడికి వుర్లగడ్డలా అయానమకో" అన్నాడు,

ఏమనాలో-ఏమనకూడదో రమేశునికి అర్థంకాక తల్లక్రిందులై . అలాగే చూస్తున్నాడు. హెడ్‌మాష్టర్లు సాష్టాంగదండ ప్రణామములు

చేశారు. ఆయన వెనక వున్నవాళ్లు-కొందరు ముందుకువచ్చి ఆశీర్వదించారు, కొందరు సలాంచేశారు. మరికొందరు నమస్కరించారు. వేణి యేడ్పు మాత్రం ఆగలేదు. ఆయన గద్గదకంఠంతో- "నామీద కోపం పెట్టుకో వద్దు తమ్ముడూ! యింటికిపద, యేడ్చి-యేడ్చి అమ్మకు కళ్ళుపోయినంత పనైంది" అన్నాడు.

గుర్రబ్బండి సిద్ధంగావుంది. రమేశుడు ఏమీ మాట్లాడకుండా దాని లోకి యెక్కి కూచున్నాడు. వేణి ముందు సీటుమీద కూచుని తలమీది గుడ్డను తీసివేశాడు. దెబ్బమానిపోయినా-అక్కడ మచ్చమాత్రం మాయ లేదు. స్పష్టంగా కనిపిస్తూంది, రమేశుడు చకితుడై - "పెద్దన్నయ్యా! అదేమిటి?" అని అడిగాడు.

వేణి ఒక దీర్ఘనిశ్వాసం విడిచి-కుడిచేతిలోని రేఖలు చూపిస్తూ- "ఎవరిమీద దోషం వేయను, యిదంతా నా కర్మఫలం: యిది నా పాప ఫలం! కాని యిప్పుడా సంగతి విని యేంచేస్తావు?" అని అడిగాడు.

వేణి తన ముఖంలో ఒక గంభీరవేదన వున్నప్పటికీ మెదలకుండా వున్నాడు. స్వయంగా తన నోటితో తాను చెప్పి దోషాన్ని స్వీకరించి విషయం తలచుకునే సరికి రమేశుని హృదయం మెత్తబడింది. ఏదో జరిగి వుండి వుంటుందని రమేశు గ్రహించాడు. కాని తెలుసు కునేందుకు ఎక్కువగా ప్రయత్నించలేదు. కాని వేణి ఈ సంగతిని యే భూమికతో చెప్పడానికి ప్రారంభించాడో—అలా చెప్పేందుకు వీలు కుదురనందున మనసులో చాలా యాతన పడ్డాడు. ఒకటి రెండు నిముషాలు గడిచాక, ఆయన ఒక్క నిట్టూర్పువిడిచి రమేశునిదృష్టి తనవేపు లాక్కొని చెప్ప డము మొదలుపెట్టాడు— "పుట్టింది మొదలు నాలో ఓ దోషంవుంది. మనసులో వకటి వుంచుకుని బయటికి వకటిచెప్పను. యితరులవలె నా మనసులోని మాటదాచను. అందువల్ల నేను ఎన్నో శిక్షలు పడవలసి వచ్చింది. అయినప్పటికీ నాకు జ్ఞానం రావడంలేదు."

రమేశుడు మెదలకుండా అంతా వింటూండడం చూసేసరికి వేణి తన స్వరాన్ని యింకా కోమలంగా—గంభీరంగాచేసి అన్నాడు- 'ఆనాడు నా దోషం ఏమీలేదు. నా మనసులోని బాధను అణచుకోలేక పోయాను. అంటూవని చేసెస్తూ—ఆమె దగ్గరకు వెళ్ళి- 'అమ్మా! మేము నీకు ఏ పాప

కారం చేశామని నువ్వు మమ్మల్ని యిలా సర్వనాశనం చేస్తున్నావు? రమేశు జైలుకు వెళ్ళాడని అమ్మవింటే ప్రాణాలే విడిచేస్తుంది. మే మిద్దరం ఏదో ఆస్థి పాస్తులకోసం పోట్లాడుకుంటాము. యింకా ఏమేమో చేసు కుంటాం? అయినప్పటికీ వాడునాకు తమ్ముడు. కాని నువ్వు ఒక్క-దెబ్బ తోనే నా తమ్ముణ్ణి, మా అమ్మనూ పొట్టన పెట్టుకుంటున్నావు. కాని నిర్దోషులకు భగవంతుడనేవాడు వున్నాడు. అని అన్నాను." అంటూ బండిలోంచి తలబయటపెట్టి-వేణి ఆకాశంవేపు చూసి భగవంతునితో మొర పెట్టుకున్నట్లు చూశాడు. యిందులో రమేశుడు కలవలేదు. అయినా శ్రద్ధగా వింటున్నాడు. వేణి కొంచెంఆగి అన్నాడు"రమేశ్। ఆ సమయాన రమ ఆకృతి చూసేసరికి నాకు కంపరం పుట్టినది. యిప్పుడు తలుచు కున్నా-నాకు శివమెత్తినట్లుంది. ఆమె పళ్లు పటపట కొరికి— "రమేశు తండ్రి మానాన్నను జైయిలుకు పంపాలని ప్రయత్నించలేదా? ఒకవేళ అంత వీలుంటే పంపకుండా వూరుకునేవాళ్లేనా?" అని అంది. అయినా ఆడజాతికి ఎంత పట్టు పనికిరాదు. నేను సహించలేకపోయాను. నేనూ కోపంగానే "సరే రమేశుడు విడుదలై రానీ చూద్దాం యీ సంగతి" అని చెప్పివచ్చాను."

ఇంతవరకూ వేణి చెపుతున్నమాటలు రమేశుడు సరిగ్గా అర్థం చేసుకోలేదు. తన తండ్రి యెప్పుడు రమ తండ్రిని జైయిలుకు పంపాలని చూశాడో ఆ సంగతి తనకు తెలియదు. కాని ఒకప్పుడు రమ చిన్నమ్మ కూడా యిదేమాట అనడం, రమేశుకు గుర్తుకువచ్చింది. అందువల్ల ఆ తరువాత సంగతికూడా వినాలని ఉత్కంఠు డయాడు. ఆ సంగతి కనిపెట్టి వేణి- "ఖూనీలు చేయించడం ఆమెకు అలవాటే. అందుకే ఆనాడు అక్బరును నీ మీదికి పంపిన సంగతి నీకు గుర్తులేదూ? కాని-నీ ముందు వాడి ఆటలు సాగలేదు. పైగా వాడికి పాఠం నేర్పావు. కాని నువ్వు నన్ను చూస్తున్నావుగా-నాటోటి దుర్బలుడు........" అంటూ వేణి విచారం చూపించి-కల్లూకొడుకు తననుకొట్టిన సంగతి, కొంత కల్పించి తన బాషలో వివరించి చెప్పాడు-

రమేశుడు వూపిరి బిగబట్టి— "ఆ తరువాత?" అని అడిగాడు.

వేణి మలినంగా నవ్వి- "ఆ తరువాత నాకేం గుర్తుంది తమ్ముడూ? ఎవరు నన్ను ఆసుపత్రికి తీసుకుని వెళ్ళారో-అక్కడేం జరిగిందో నాకేమీ తెలవదు. తెలివివచ్చేసరికి ఆసుపత్రిలో పడివున్నాను. తమ్ముడూ రమేశ్! యీ మారు మా అమ్మ పుణ్యంవల్లనే బ్రతికిపోయను, అటువంటి. అమ్మ యింకెవరికుంటుంది రమేశ్?" అని చెప్పాడు.

ఒక్కమాట కూడా రమేశు చెప్పలేకపోయాడు. కొయ్యచెక్కలా కూచుండి పోయాడు. అయినా అతని రెండుచేతుల వ్రేళ్ళా బిగించు కున్నయ్! ఆయనలో ప్రజ్వరిల్లుతూన్న కోపం- అసహ్యం యింతా అంతా కాదు. తనకోపం విలువ తనకే తెలియదు. వేణి ఎంత చెడ్డవాడో తనకు తెలుసు! అతను చేయలేని పనంటూ ఏదీ వుండదని కూడా తెలుసు! కాని ప్రపంచంలో యెవరైనా యింత అబద్ధాన్ని, యీవిధంగా నిస్సంకోచంగా ఏకధాటిగా చెప్పగలడా అని వూహించనుకూడా వూహించలేక పోయాడు. అందువల్ల రమ అపరాధాలన్నీ నిజమని భావించాడు.

అతను మళ్ళీ తిరిగి రావడంతోనే వూళ్ళో వాళ్ళందరికి ఉత్సవం లావుంది. రోజూ ఉదయం, సాయంత్రం, రెండు పూటలా, ఎంతోమంది వచ్చి రకరకాలైన ఆత్మీయతను వ్యక్త పరిచారు. తను జెయిలుకు వెళ్ళానే అనే దుఃఖంకూడా ఎగిరిపోయింది. తను లేనప్పుడు ఆచుట్టు ప్రక్కల గ్రామాల్లో ఒక సాంఘిక సంబంధం ఏర్పడిందనడంలో అతి శయోక్తి ఏమీలేదు. తానులేని యీకొద్దిమాసాల్లో, యింత పరివర్తనం యెలా కలిగిందా అని సందేహించాడు. యిదివరకు వేణి తన పనులకు అడ్డుపడేవాడని, యిప్పుడు ఆ ఆటంకంలేకపోయేసరికి తమపనులు ద్విగుణీ కృతంగా సాగుతూందని తెలిసిందతనికి. వేణీని యిప్పుడు సరిగ్గా అర్థం చేసుకోగలిగాననుకున్నాడు. అతను ఇలాంటి అనిష్టకారి అని తెలిసినా- గ్రామమంతా దానికి ఎంతవరకు బాధ్యులో ఆ విషయం యివాళనే అర్థం చేసుకోగలిగాడు. అతనితో విరోధంవిడిపోయినందుకు మనసులోనేసంతో షించాడు. అంతేకాదు, తనకు జరిగిన అన్యాయానికీ, అత్యాచారానికీ, వూరందరికీ కష్టంగానేవుందని గ్రామస్థులంతా చెప్పారు. వీళ్ళ సానుభూతి పొంది, వేణి తన ప్రక్కకు తిరగడంవల్ల కలిగిన ఆనందోత్సవాలతో రమేశుని హృదయం విప్పారింది. ఆరుమాసాల క్రింద తను పని ప్రారం

భించి, అవిసాగక పారిపోదామనుకున్నాడు. యిప్పుడవి ఫలోన్ముఖం కాగల సూచనలు కనుపించేసరికి. రమేశుడెంతో వుత్సాహంతో, యింటింటికీ వెళ్ళి సంగతి-సందర్భాలు కనుక్కుంటూ కొన్నాళ్లు గడిపేశాడు. కాని ఒక్కరి విషయంమాత్రం పట్టించుకోకుండా వూరుకున్నాడు. అదే రమ విషయం; రమ జబ్బుగా వుందని దారిలోనే విన్నాడు. కాని ఆమెకు జబ్బేమిటో? అది ఎంత ఎక్కువగా వుందో తెలుసుకుందామని ప్రయత్నించలేదు. అతను రమతో తనకున్న సంబంధమంతా తెగతెంపులు చేసుకున్నానని అనుకున్నాడు. తన కష్టాలన్నిటికి కారణం రమేనని గ్రామస్తుల నోటంట కూడా విన్నాడు. అందువల్ల యిప్పుడు వేణీ చెప్పినది అబద్ధంకాదని బాగా అర్థమైంది.

అయిదారురోజు లయాక వేణీ వచ్చి రమేశుని పట్టుకున్నాడు. పీరుపురంలో రమకూ, తమకూ జాయింటు ఆస్తి విషయంలో వారిద్దరికీ చాలాకాలంనుంచి తగాదా లున్నయ్; ఇప్పుడు యిటువంటి వుత్తమ అవుసరాన్ని విడవకుండా దాన్నిహస్తగతం చేసుకోవాలని అతనివుద్దేశం;

వేణీ పైకి ఎన్నిచెప్పినా—రమ అంటే మహాభయం; కాని యిప్పుడామె జబ్బుగావుంది. వ్యాజ్యాలూ అవీ ఆడలేదు, అదీగాక అక్కడ ముసల్మానులు కూడా రమేశుని మాట కాదనలేరు. అందుకని ముందు ముందు ఏమవుతుందోననీ, యిటువంటి సమయం జారవిడవకూడదని రమేశునితో వాదం వేసుకున్నాడు. రమేశుడు సంగతంతా విని—అందుకు వొప్పుకోకపోయేసరికి, ఎన్నో యుక్తులు ప్రయోగించి, చివరకు-"ఈపని నీవల్ల ఎందుకు కాదు? అవకాశం వచ్చినప్పుడు ఆమె నిన్ను విడిచి పెట్టలేదు? ఇప్పుడు నువ్వు ఆమె జబ్బులో వుందంటున్నావు? ఆమె నిన్ను జెయిలుకు పంపినప్పుడు నీకు జబ్బుగాలేదా?" అని అడిగాడు.

ఆ సంగతి నిజమే; దీన్ని రమేశు కాదనలేకపోయాడు. అయియినప్పటికీ అతని మనసెందుకో రమకు విరుద్ధంగా పోయేందుకు వొప్పుకోలేదు. వేణీ వెయ్యివిధాలచెప్పినా—వుత్తేజపరిచినా—రమ అసహాయస్థితి గుర్తుకొచ్చేసరికి—అతనిలోని విరోధభావమంతా—ఒక చిన్న నీటి చుక్కలా మారిపోయేది. ఇందుకు స్పష్టమైన కారణమేమిటో ఎంత వెతికినా అంతుపట్టలేదు. రమేశు మాట్లాడకుండా వూరుకున్నాడు. పని

జరిగినట్లయితే వేణీ ఎంతైనా ఓపిక చేయగలదు. అందువల్ల యిప్పుడు ఎక్కువగా సతాయించకుండా వెళ్ళిపోయాడు.

ఈమాట యింకొక విషయం రమేశుని దృష్టిని ఆకర్షించింది. అదేమిటంటే—విశ్వేశ్వరికి మొదటినుంచీ యీ సంసారంమీద ఎక్కువ మమకారం లేదని అతనికి తెలుసు! తను జెయిలులోంచి తిరిగి వచ్చాక ఆ మమకార మంతా అసహ్యం క్రిందకు మారినట్లు గ్రహించాడు. జెయిలు నుంచి విడుదలై వచ్చాక, వేణీతోపాటు తానుగూడా—ఆమెదగ్గరకు వెళ్ళాడు. ఆనాడు విశ్వేశ్వరి ఆనందం ప్రకటించి, గద్గదకంఠంతో అనేక ఆశీర్వాదాలు చేసింది. ఎందుచేతనోకాని అతనికి వాటివల్ల ఆనం దానికి మారుగా కష్టంకలిగింది. ఇవాళ మాటల సందర్భములో విశ్వే శ్వరి కాశీలో వుండటానికి ప్రయాణమవుతుందనీ, మళ్ళీ తిరిగిరావని కూడా తెలిసింది. ఈమాట విని ఆయన తృళ్ళిపడ్డాడు. ఈ సంగతి యింతవరకూ ఆయన వినలేదు. అయిదారురోజులనుంచి, ఏదో తొందర పనులవల్ల అటువేపు వెళ్ళలేదు. అదివరకు వెళ్ళినప్పుడు యీ సంగతి ప్రస్తావనకు రాలేదు. తన విషయంలోకానీ, పరాయివాళ్ళ విషయంలో కానీ, యితరులతో చెప్పే అలవాటు విశ్వేశ్వరికి లేదు. అయినా యివాళ విన్న కబురూ—ఆనాటి సంఘటనా పోల్చి చూచుకునేసరికి ఆమె ఈ వైరా గ్యానికి కారణమేమిటో అర్థమైంది. పెద్దమ్మ నిజంగానే యిక్కడ్నుంచి వెళ్ళిపోతూందని గ్రహించాడు పెద్దమ్మ యిక్కడ లేకుంటే ఎంత లోటు కలుగుతుందనే విషయం గుర్తుకొచ్చేసరికి అతని కళ్ళలో నీళ్ల తిరిగినయ్! ఇక ఒక్కక్షణంకూడా వ్యర్థపరచకుండా ఆమెదగ్గరకు వెళ్ళాడు. అప్పుడు తొమ్మిది - పదిగంట లవుతుంది. యింట్లోకి వెళ్ళ గానే దాసీది అమ్మగారు ముఖర్జీగా రింటికి వెళ్ళిందని చెప్పింది. రమేశు చకితుడై—"ఈ అసమయంలోనా?" అని అడిగాడు.

ఆ దాసీది చాలా కాలంనుంచీ అక్కడే పనిచేస్తుంది. అందుకని "అమ్మగారికి సమయాలు వున్నవా? అదీగాక యివాళ వారి తమ్ముడి వడుగుగా!" అన్నది"

"యతీంద్రుని వడుగా?" రమేశుడు యింకా చకితుడై — "ఈ సంగతి ఎవరికీ తెలియదే" అన్నాడు.

"వారు వూళ్ళోవాళ్ళని ఎవరినీ పిలవలేదు. ఒకవేళ పిలిచినా భోజ నాలకు ఎవరూ వెళ్ళరు. ఆమెగారిని అందరూ వెలివేశారు బాబూ!"

రమేశుని ఆశ్చర్యానికి అంతులేదు. కొంచెంసేపు మెదలకుండా వూరుకుని అందుకు కారణం అడిగాడు. అందుకు దాసీ సిగ్గుపడుతూ తల ఒకవేపు తిప్పుకుని— "ఏమితెలుసు చినబాబుగారూ? రమమీద చాలా అపవాదులు వున్నయ్! అయినా మావంటి పేదవాళ్ళకు అటువంటివి ఏమీ తెలియవుబాబూ" అంటూ వెళ్ళిపోయింది.

మెదలకుండా కొంచెం సేపుండి, రమేశు తన యింటికి వచ్చేశాడు. అది కోపంతో వేణీ చేసినపనేనని ఎవరినీ అడక్కుండానే గ్రహించాడు. అతని కోపం ఎందుకో—యే పగ తీర్చుకోవడానికో, ఆమెమీద యిటువంటి అసహ్యమైన అపవాదులు వేయబడ్డాయో వూహించాలన్నా, అతనికి సాధ్యంకాలేదు.

# 19

ఆనాడు మధ్యాహ్నం తలవనితలంపుగా ఒక సంఘటన జరిగింది. కోర్టుకు వెళ్ళకుండా ఒక తగాదా తీర్చుకోనమని. మంగలి కైలాసుడు-షేక్‌మోతీలాలు యిద్దరూ తమతమ కాగితాలూ, సాక్షులను వెంటబెట్టుకుని రమేశుని శరణువేడారు. రమేశుడు ఆశ్చర్యపడి— "నాతీర్పు మీరెందుకు వొప్పుకుంటారు?" అని అడిగాడు.

వాది ప్రతివాదు లిద్దరూ జవాబు చెప్పారు—"ఎందుకు వొప్పుకోము బాబూ. జడ్జిగారికన్న తమరు విద్యాబుద్ధుల్లో తక్కువ వారుకాదు. అ జడ్జి గారూ—పెద్ద ఆఫీసర్లుకూడా మీవంటి పెద్ద మనుష్యుల్లోనివారేగా! ఒక వేళ రేపు మీకు జడ్జిగారి నౌకరి దొరికిందంటే అప్పుడు మీరిచ్చే తీర్పుకు మేము బద్ధులమై వుండాలిగా, మేము వొప్పుకోము అని అప్పుడనగలమా?"

ఈమాట వినేసరికి రమేశుని హృదయం అభిమానంతోనూ ఆనందంతోనూ నిండిపోయింది.

కైలాసుడు అన్నాడు — "మేమిద్దరం మా ఫిర్యాదులు విడమర్చి చెప్పగలం; కాని కోర్టులో అలా చెప్పడానికి వీలుండదు. అదీగాక బాబు గారూ! అక్కడ ప్లీడర్లకు దోసిళ్ళకొద్దీ డబ్బు పోయనిదే పనేమీ జరగదు.

ఇక్కడ ఒక్కదమ్మిడీగూడ ఖర్చుండదు. వకీళ్ళకంతడబ్బు పోయనవు సరంలేదు. పైగా అంతదూరం నడవాల్సిన పనివుండదు. అందుకని బాబు గారూ! మీరేవిధంగా తీర్పుచెపుతారో—అది మంచిది కానీయండి, చెడ్డది కానీయండి, తౌదలదాల్చి యింటికి వెళ్ళిపోతాము. భగవంతుడు మాకిప్పుడు మంచిబుద్ధి చూపించాడు. అందుకనే కోర్టుకు వెళ్ళకుండా తమ దగ్గరకు వచ్చాము."

ఒక చిన్న పంటకాలువను గురించి వాళ్ళిద్దరూ తగాదా పడు తున్నారు. ఆ విషయాన్ని గురించిన దస్తావేజులూ—కాగితాలూ అన్నీ వాళ్ళు రమేశునికి యిచ్చారు. రేపుదయమే వస్తామని చెప్పి వెళ్ళారు. రమేశు స్థిరంగా కూచున్నాడు. ఈ సంఘటన అతని వూహకు అతీతమై నది. తన సుదూరభవిష్యత్తులో—యింత పెద్ద ఆశకు తన మనసులో స్థానమీయలేదు. ఇవాళ వీళ్లు తన తీర్పు వొప్పుకోనీ, వొప్పుకోకపోనీ, కోర్టుకు వెళ్లకుండా తగాదా పరిష్కరించుకుందామని వాళ్లు తనదగ్గరికి వచ్చారు. ఈ సంగతి అతని హృదయాన్ని ఆనందంతో ముంచివేసింది. ఇదేమంత పెద్ద విషయంకాదు. గ్రామములోని యిద్దరు మనుష్యులు సాధారణంగా పోట్లాడుకునే చిన్న తగాదాలాంటిదే! అయినప్పటికీ యీ తుచ్ఛమైన చిన్న విషయాన్ని పురస్కరించుకునే, అతని హృదయంలో ఎన్నెన్నో ఆలోచనలు గగన కుసుమాలవలె, వికసించసాగినయ్! ఈ అభాగిని జన్మభూమికి అతను ఎన్నెన్ని పనులు చేయగలడో వాటికి లెక్క గాని, దరిదాపుకాని, అతని కందలేదు. బయట వసంతజ్యోత్స్నతో ఆకాశమంతా నిండిపోయింది. దానివేపు చూస్తుంటే అకస్మాత్తుగా రమ గుర్తుకు వచ్చింది. అయినప్పటికి యింకొకరోజైతే ఈర్ష్యతో శరీరమంతా నిండిపోయింది. దానివేపు చూస్తుంటే అకస్మాత్తుగా రమ గుర్తుకు వచ్చింది. అయినప్పటికి యింకొకరోజైతే ఈర్ష్యతో శరీరమంతా మండి పోయేదే! ఇవాళ మంటపుట్టడ మటుంచి, ఓ చిన్న నిప్పుకణికంత ఉత్తాపం కూడా అనుభవించలేక పోయాడు. అతను మనసులోనవ్వుకుని, ఆమె నుద్దేశించి అన్నాడు— "రమా! నీ వల్ల భగవంతుడు నా జీవితాన్నింత బాగుచేస్తాడని, నీవిచ్చిన విషం-అదృష్టవశాత్తూ నాకు అమృతంలా మారు

తుందని, నీకు తెలిసి వున్నట్లయితే —నన్ను జెయిలుకు పంపడానికి సిద్ధ పడేదానివి కాదనుకుంటాను."

అంతలో ఎవరో వచ్చినట్లు చప్పుడైంది.

"ఎవరది?

"చినబాబుగారూ! నేను రాధను! రమ అక్కయ్యగారు తమర్ని ఒక్కసారి కవిపించి వెళ్ళమన్నారు!"

ఒకసారి కనుపించమని రమ దాసీని పంపింది. రమేశు ఆశ్చర్యం చెందాడు. ఇవాళ ఏ దురదృష్టదేవత తనతో పరిహాస మాడ్డంలేదుకదా? అనుకున్నాడు.

"చినబాబుగారూ! తమరు దయవుంచి ఒక్కసారి...."

"ఆమె యెక్కడుంది?"

"ఇంట్లో పడుకునివుంది" అని కొంచెం ఆగి—"యికరేపు సమయం దొరకదు. అందుకని యిప్పుడే...." అని ఆగిపోయింది.

"అయితే పద" అంటూ లేచాడు రమేశు.

రమేశుని పిలుచుకుని రమ్మని దాసీని పంపి, రమ ఒక విధంగా మంచంమీద స్థిరంగా పడుకునివుంది. దాసి చెప్పినమీదట రమేశు గది లోకివచ్చాడు. అతను ఒక నాలుగుకాళ్ళబల్లను లాక్కొని కూచున్నాడు. రమ తన బలాన్నంతా ఏకంచేసి, రమేశుని కాళ్ళవద్ద కూచుంది. గదిలో ఒక మూల దీపం మినుకు మినుకు మంటూంది. ఆ అస్పష్టవెలుతుర్లో రమ యొక్క అస్పష్టరూపం ఏదో కొంత చూశాడు. అందువల్ల ఆమె శరీర స్థితిని తెలుసుకోలేకపోయాడు. ఇప్పుడు దారంటవస్తూ తన మనసులో సంకల్పించుకున్నదంతా—యిప్పుడు రమయెదట కూచోగానే, అన్నీ తారుమారై పోయినయ్! కొంచెంసేపటివరకూ మెదలకుండా కూచున్నాక, కోమలంగా...."యిప్పుడెలావుందిరాణీ?" అని అడిగాడు.

రమ ఆయన కాళ్ళవద్దనుంచి కొంచెం జరిగి కూచుని "నన్ను మీరు రమా అనే పిలవండి" అని అన్నది.

రమేశుని వీపుమీద కొరడాతో కొట్టినట్లయింది. అయినా వెంటనే కొంచెం కఠినంగా వున్నాడు—"మంచిదే: నువ్వు జబ్బుగా అన్నావని విన్నాను. అందుకే యిప్పుడెలావుందని అడిగాను. లేకుంటే ఏపేరుతో నైనా—ప్రయోజనంలేదు. యిప్పుడు పేరు పెట్టి పిలవాలని కూడా లేదు నాకు. అంత అవసరంకూడా లేదు."

రమ అంతా గ్రహించింది. కొంచెంసేపు స్థిరంగావున్నాక ఆమె మెల్లమెల్లగా అన్నది—"యిప్పుడు నాకు బాగానేవుంది" మళ్ళీ—"నేను మీకు కబురు పంపినందుకు మీకు ఆశ్చర్యం కలిగిందనుకుంటాను. కాని...."

రమేశు మధ్యలోనే తీవ్రంగా—"లేదు, ఆశ్చర్యంకలగలేదు. యిప్పుడు నువ్వేపనులు చేసినా ఆశ్చర్యపడే రోజులు గతించాయి. అయినా నన్నెందుకు పిలిపించావు?" అని అడిగాడు.

ఈ మాట రమను ఎంతగాయపరిచిందో—రమేశు గ్రహించ లేక పోయాడు. కొంచంసేపు తలొంచుకుని కూచున్నాక రమ—"రమేశన్నయ్యా! యివాళ రెండు పనులకోసం మిమ్మల్ని కష్టపెట్టాను. నేను మీకెంత అపకారం చేశానో—అది నాకు తెలుసు! అయినప్పటికి మీరు వస్తారని నాకు నిశ్చయంగా తెలుసు! యిక నాయీ రెండు ఆఖరి కోర్కెలు తిరస్కరించరనికూడా తెలుసు!" అని అన్నది.

కన్నీళ్ళతో గొంతుక బొంగురుపోయింది. రమేశుడు స్పష్టంగా ఆ విషయాన్ని గ్రహించాడు. కనురెప్పపాటుకాలంలో అతనికి పూర్వపు స్నేహం పొంగిపొర్లింది. ఇన్ని అఘాత ప్రతిఘాతాలు జరిగినా, ఆస్నేహం యిప్పటికి లుప్తంకాలేదనీ, కేవలం నిర్జీవంగా, అచేతసంగా పడి వుందని తెలుసుకునేసరికి అతనికి ఆశ్చర్యం కలిగింది. ఒక్కక్షణం మెదలకుండావుండి—"నీకోరిక యేమిటి....?" అని అడిగాడు.

రమ చకితయై—తలెత్తి, మళ్ళీ క్రిందకు దించుకుంది—"పెద్దన్నయ్య ఏ ఆస్థిని నీసాహాయ్యంవల్ల దఖలు పరుచుకుందామనిఅనుకున్నాడో, అది నిజానికి నాది. అంటే అందులో పదిహేను అణాలవంతు నాది. ఒకవంతు మీది. దాన్ని నేను మీ చేతుల్లో పెట్టాలనుకుంటున్నాను."

రమేశు కొంచెం కోపంతో—"నువ్వేమీ భయపడవద్దు. దొంగతనం చేసేందుకు యిదివరకు నేనెవరి సాహాయ్యం కోరలేదు. యిప్పుడు కూడా కోరను. ఒకవేళ నువ్వు దానంచేయాలనుకుంటే—ఆదానం పుచ్చుకోవడానికి చాలామంది వున్నారు. నేనా దానం పుచ్చుకోను—"అని అన్నాడు.

మొదటయితే "ముఖర్జీలదానం పుచ్చుకోవడానికి ఘోషాల వంశీయులకు అవమానంకాదు." అనిచెప్పేదే; కానీ యిప్పుడామాట పెకిలి రాలేదు. ఆమె ప్రార్థించినట్లుగా—"రమేశన్నయ్యా! నీవు దొంగతనం చేయడానికి సహాయ్యం కోరవని నాకు తెలుసు! ఒకవేళ పుచ్చుకున్నా దాన్ని నీ స్వంతానికి తీసుకోవని తెలుసు! కాని అదికాదు. తప్పుచేసినందుకు శిక్షవుండాలి. నేను ఎన్నో అపరాధాలు చేశాను. అందుకు జుల్మానాగా దీన్నెందుకు తీసుకోకూడదు?" అని అడిగింది.

రమేశుడు కొంచెంసేపు మెదలకుండావుండి—"యిక నీ రెండో కోరిక యేమిటి?" అని అడిగాడు.

"మా యతీంద్రుని నీచేతుల్లో పెట్టాలనుకున్నాను. వాణ్ని నీలాంటి మనిషిగాచెయ్యి! పెద్దవాడయాక, వాడు నీలా నవ్వుతూ-నవ్వుతూ స్వార్థత్యాగం చేయగలుగుతాడు."

రమేశుని మనసులో మలినమంతా కరిగిపోయింది. రమ పైట కొంగుతో కన్నీళ్ళుతుడుచుకుని—"ఇది నాకళ్ళతో నేను చూడలేను. అయినప్పటికి యతీంద్రుని శరీరంలో పూర్వుల రక్తంవుందని నాకు నిశ్చయంగా తెలుసు! త్యాగంచేయడానికి కావలసిన శక్తి వాడి ఎముకల్లో వ్యాపించివుంది. వాడికి తగిన శిక్షణ గరిపినట్లయితే—వాడు ఎప్పుడో ఒకప్పుడు నీలా తలెత్తుకుని తిరగగలడు."

వెంటనే రమేశు ఆమెకు జవాబు చెప్పలేకపోయాడు. అతను కిటికీ బయట వెన్నెలతో నిండివున్న ఆకాశం వేపు చూస్తూన్నాడు. అతని మనసులో—యింతకు ముందు వీళ్ళతో పరిచయం లేనట్లుగా బాధపడ్డాడు. చాలా సేపటివరకూ మెదలకుండావున్నాక—"చూడు!నన్నీ విషయంలో!

లాగవద్దు. నేను ఎన్నో కష్టాలూ—దుఃఖాలు పొందాక వెలుతురు రేఖ చూడగలుగుతున్నాను. మళ్ళీ యీకాస్తా ఎక్కడ ఆరిపోతుందోనని నాకు భయంగావుంది." అని అన్నాడు.

"కాదు రమేశన్నయ్యా! యిప్పుడాభయంలేదు. ఆ ప్రకాశం యిప్పడిక ఆరదు. ఆనాడు పెద్దమ్మకూడా చెప్పింది. నీవు యెక్కడి నుంచో వచ్చి ఎక్కడో పైన కూచుని పనులు చేయడానికి తలపెట్టావు. అందువల్లనే యిన్ని బాధలూ—కష్టాలు పడవలసివచ్చింది. యిప్పుడు మేము మా దుష్కర్మలవల్ల నిన్ను క్రిందకు దించి యిప్పుడు సరైన ప్రదేశంలో నిలప గలిగాం! యిప్పుడు నువ్వు మా మధ్యలోకి వచ్చి నిల బడ్డావు. అందుకే నీకు భయంగావుంది. మొదట అయితే నీకీ అనుమానం కలిగేదేకాదు. ఆ సమయంలో నువ్వు మా గ్రామ్య సమాజానికి బయట వున్నావు. యిప్పుడు అందులోని ఒక వ్యక్తివయ్యావు. అందుకని యీ జ్యోతి యిక చల్లారదు. యిప్పుడిక యీ ప్రకాశం రోజు రోజుకూ మరింత ఉజ్వలమవుతుంది."

హఠాత్తుగా పెద్దమ్మ అనె మాట వినేసరికి రమేశు ఉద్దీప్తు డయాడు —"ఏం రమా? అయితే నేను వెలిగించిన ఈ దీపజ్వాల యిక చల్లారదని నీకు తెలుసా?" అని అడిగాడు.

"అవును! నాకు బాగా తెలుసు! యివి అంతా తెలిసివున్న పెద్దమ్మ అన్నమాటలు. ఈ పని మీవల్ల కావలసిందే! రమేశన్నయా! మా యతీం ద్రుని నీచేతుల్లోకి తీసుకుని, నా అపరాధా లన్నీ క్షమించి ఆశీర్వదించి పంపు. నేను నా స్వామిదగ్గరకు నిశ్చింతంగా వెళతాను."

రమేశుని హృదయంలో-మెరుపులతో మెరిసిన మేఘాల్లా-మాట మాటికి మెరవసాగింది. కాని తలొంచుకుని మెదలకుండా కూచున్నాడు.

"యింకొక సంగతికూడా మీరు వొప్పుకోవాలి. చెబితే వొప్పు కుంటారా?"

"ఏమిటా మాట?"

"నా విషయంలో ఎప్పుడూ నీవు వేణీ అన్నయ్యతో పోట్లాడ వద్దు."

రమేశునికి అర్థంకాలేదు—"అంటే."

"దీనర్థం నువ్వు ఎప్పుడో ఒకప్పుడు తెలుసుకుంటావు. ఒకనాడు నాకువాలా అసహ్యం కలిగింది. అప్పుడు పెద్దమ్మ వచ్చి 'అమ్మాయీః మిధ్యను కదలించి సచేతనం చేయడంవల్ల దాని ఆయువు వృద్ధవుతుంది. అసహ్యంవల్ల ఆ మిధ్య ఆయువు ఎక్కువచేయడం మహాపాపం!" అని చెప్పింది. ఆమె వుపదేశం గుర్తుంచుకుని నేను నా దుఃఖదౌర్భాగ్యమంతా గడిపాను. ఈ సంగతి నువ్వుకూడా మర్చిపోవద్దు రమేశనయ్యాః"

రమేశు మెదలకుండా ఆమె ముఖంలోకి చూస్తున్నాడు. కొంచెం సేపుండి రమ—"రమేశన్నయ్యా! నన్ను క్షమించలేకపోయానే అనే దుఃఖం మాత్రం మనసులో వుంచుకోవద్దు. యివాళ కష్టంగా వున్నదే రేపు సహజం—సరళ మవుతుందని నాకు తెలుసు! ఇందుకని యిప్పుడు నా మనసులో క్లేశమేమీలేదు. ఆనాడు నువ్వు నా అపరాధాలు సహజంగా క్షమించగలవు. నేను రేపు వెడుతున్నాను." అని అన్నది.

రమేశుడు చకితుడై అడిగాడు—"రేపా! ఎక్కడికి వెళతావు.?"

"పెద్దమ్మ యెక్కడికి తీసుకుని వెళితే అక్కడికి"

"ఆమె రాదని విన్నాను."

"నేనూరాను! నీ పాదాలముందు నేనుకూడా ఒకేసారి సెలవు పుచ్చుకుంటాను."

ఈమాట అని రమ భూమికి తల ఆనించింది. రమేశు కొంచెం సేపటివరకు మెదలకుండా కూచుని ఒక నిశ్వాసం విడిచి—లేచి నిల్చుని—"సరే వెళ్లు. నువ్వు ఎందుకని వెళుతున్నావో నేను తెలుసుకో వచ్చా?" అని అడిగాడు.

రమ మాట్లాడలేదు.

"నువ్వు అన్నివిషయాలు ఎందుకు రహస్యంగా వుంచి వెడు తున్నావో అది నీకేతెలుసు! కాని, నేనుకూడా త్రికరణశుద్ధిగా విన్న

క్షమించేశక్తి నాకు భగవంతుడు ప్రసాదించాలని కోరుతున్నాను. నిన్ను క్షమించలేకపోయినందుకు ఎంతబాధపడు తున్నానో అది నా అంతరాత్మకే తెలుసు!"

రమ కళ్ళంట నీళ్లు ప్రవహిస్తున్నాయి: కాని ఆ మసక వెలుతురులో రమేశుడు చూడలేదు.

రమ యింకొకసారి నమస్కరించింది. ఆ తరువాత రమేశు బయటికి వెళ్ళిపోయాడు. దారంట వెళుతూ-వెళుతూ—తన భవిష్యత్తులో చేయవలసిన పనిపాటలలోని ఉత్సాహమంతా యీ అస్పష్టంగావున్న వెన్నెల్లా వుందనుకున్నాడు.

ఆ మరునాడు ఉదయం రమేశు పెద్దమ్మగారింటిదగ్గరకు వచ్చేసరికి, విశ్వేశ్వరి పాలకీలో కూచుంటూవుంది. రమేశు కళ్ళనీళ్లు తెచ్చుకుని దగ్గరకువెళ్ళి - "పెద్దమ్మా! మే మంతా ఏమి అపరాధం చేశామని మమ్మల్ని యిలా వదిలి వెళుతున్నావు?" అని అడిగాడు.

విశ్వేశ్వరి తన కుడిచేతిని అతని తలమీద వుంచి — "నాయనా! అపరాధాలు చెప్పుకుంటూవుంటే —వాటికి అంతువుండదు. అందువల్ల వాటి అవసరంలేదు." అని, ఆ తరువాత—"రమేశ్! ఒకవేళ నేను యిక్కడ చనిపోయినట్లయితే—నాచితికి వేణీ తలకొరివి పెడతాడు. అటువంటప్పుడు నాకు ముక్తుంటూలేదు. నాయనా! నా యిహకాలమంతా మంటలలోనే గడిపాను. ఇప్పుడు నా పరకాలంకూడా బాధలు పడవలసివస్తుందేమోననే భయంతో యిక్కడనుంచి పారిపోతున్నాను" అని అన్నది.

రమేశుడు పిడుగుపడినట్లుగా స్తంభించిపోయాడు. యీ నాడు పెద్దమ్మను గుర్తించినట్లు — ముందెప్పుడూగుర్తించలేదు. కొంచెం సేపుండి-"పెద్దమ్మా! మరి రమ యెందుకు నీతోవస్తుంది" అని అడిగాడు.

విశ్వేశ్వరి ఓగొప్ప నిశ్వాసాన్ని అపుకుని-గొంతు సవరించు కుంటూ-'నాయనా! ప్రపంచంలో ఆమెకు స్థానంలేదు. అందుకని ఆమెను భగవంతుని చరణాలవద్దకు తీసుకుని వెళుతున్నాను. అక్కడికి వెళ్ళాక ఆమె బ్రతుకుతుందో లేదో చెప్పలేను. కాని అది బ్రతివున్నంతకాలం, దానికింత రూపం—గుణం, యింత గొప్ప హృదయం యిచ్చి, ఈ ప్రపం చంలోకి ఎందుకు పంపాడో—ఆ తరువాత ప్రపంచంలో దుఃఖాలనూ, అవమానాలనూ దానినెత్తిన రుద్ది ప్రపంచాని కింత దూరంచేసి ఎందుకు పారవేశాడో-ఆ సంగతి అన్వేషించమని భగవంతుని ప్రార్థిస్తాను. ఇం దులో భగవంతుని అర్థపూర్ణమై, మంగళప్రదమైన అభిప్రాయం వుందా లేక యిదంతా మన లోకసమాజం దానితో ఆడిన చెలగాటా? రమేశ్! ప్రపంచంలో దానంత దుఃఖితురాలు యెవరూ లేరు!!" అంటుంటే ఆమె గొంతు బొంగురు పోయింది, ఆమె యింత వ్యాకులపాటు పడుతుండగా యింత వరకూ ఎవరూ చూడలేదు. రమేశు నిశ్శబ్దంగా వున్నాడు, విశ్వే శ్వరి కొంచెంసే పున్నాక—"కాని రమేశ్! నువ్వు ఆమెను పొరపాటుగా అర్థం చేసుకోవద్దు. యిదే నా ఆదేశం. నేను వెళ్ళబోయేముందు యెవరి మీదా నెపంవేయను. నాకు యిష్టంకూడాలేదు. కాని దానికన్న నీ హితం కోరేవాళ్లు ఎవరూ లేరనిమాత్రం యెన్నడూ మర్చిపోవద్దు" అన్నది.

'కాని పెద్దమ్మా!' అని అనబోయాడు రమేశు.

ఆమె హఠాత్తుగా అడ్డువచ్చి-'రమేశ్! ఇందులో కానీ, గీని, అన దాని కేమీలేదు. నువ్వు విన్నదంతా అబద్ధం, నువ్వు తెలుసుకున్నదంతా తప్పు! ఇక ఈ అభియోగం యిక్కడితో అంతం కావాలి. కాని నువ్వు తలపెట్టిన పనులన్నీ-ఎల్లప్పుడూ, సమస్త అన్యాయాల్నీ హింసాద్వేషాల్నీ లక్ష్యపెట్టకుండా శక్తి వంతంగా ముందుకు సాగిపోనియ్! ఇందుకోసమే ఆమెనోరు మూసుకుని అన్నీ సహిస్తూవచ్చింది, రమేశ్! ప్రాణాల్ని వదలడానికి సిద్ధమైందికాని నోరుమాత్రం విప్పలేదు'' అన్నది.

సరిగా అదేసమయంలో గతరాత్రి ఉమ చెప్పిన రెండు సంగతులు రమేశుకు గుర్తుకువచ్చినయ్! కాని దుర్జేయమైన దుఃఖంలో ఆ మాటలు పెదవిదాటిరాలేదు. అతను తొందరగా తలొంచుకుని-శక్తి నంతా ఏకంచేసి—'పెద్దమ్మా! అలాగే జరుగుతుందని ఆమెతో చెప్పు' అంటూ చేయిచాపి ఏదోవిధంగా విశ్వేశ్వరి పాదధూళి తీసుకుని తలమీద పెట్టుకుని త్వరత్వరగా బయటికి వెళ్ళిపోయాడు.

స మా ప్తం .

